

# మధూదయము

కర్త:

సాహిత్యవిశారద, కవిరాజ

శ్రీ ఉప్పాడ రాజారావు. యం. ఏ.

ప్రకాశకులు:

హనుమంతు మోహనరావు

తలగాం, శ్రీకాకుళం జిల్లా.

# ప్రశంస

విస్మృతాంధ్రకళింగపృథ్వీస్థలమ్ము
పులకరించెను 'సాహిత్యతిలక' కణితి
విశ్వనాథమనీషి! మీ వితరణమునఁ,
చిరము పరమేశ్వరుఁడు శుభాశీస్సు లిడుత!

శ్రేయస్కర మనిశస్మర
ణీయము మీ దానగుణము నిర్జితఘనరా
ధేయా! దువ్వాడాన్వయ!
శ్రీయుత నందీశచౌదరీ! 'కవిభూషా!'

తిమ్మసేనికులాబ్ధిచింతామణీ! పురు
షార్థమర్మజ్ఞ! 'వాఙ్మయోద్యానపికమ!'
సౌపరాయా! మధూదయప్రచురణమున
మేలుబంతిగ మీ యీవి కీలు గొనియె.

శ్రీయుత సువారివంశప్రసిద్ధ! సుకవి
లోకమందారకుజమ! లక్ష్మీకటాక్ష
వీక్షణాశ్రయ! నరసింహా! విబుధవంద్య!
భవదుదారత స్మరియింపఁబడుఁ జిరమ్ము.

సరసమతుల సారస్వతాస్వాదరతుల
సుకృతుల వదాన్యమూర్తుల శుభ్రయశుల
నిమ్మధూదయప్రచురణ కెల్లవిధుల
సహకరించిన దాతల సంస్తుతింతు.



# దాతలు

| | రూ. అ. పై. |
|---|---|
| శ్రీ కణితి దొంగన్నచౌదరిగారు వారి పుత్రులు శ్రీ కణితి విశ్వనాధముగారు M. B. B. S—హరిదాసపురం | 1350—0—0 |
| ,, దువ్వాడ నందీశచౌదరిగారు మొఖాసాదారు-కంబిరిగాం | 516—0—0 |
| ,, తమ్మినీని పాపారావుగారు M. L. A—తొగరాం | 316—0—0 |
| ,, సువ్వారి నరసింహులునాయడుగారు—కాకినాడ | 316—0—0 |
| ,, చిగురుపల్లి సత్యనారాయణగారు—బొడ్డపల్లి | 116—0—0 |
| ,, కిల్లి అప్పారావునాయుడుగారు—పురుషోత్తమపురము | 116—0—0 |
| ,, బెండి చిన్నబాబుగారు—సీతాపురము | 116—0—0 |
| ,, గుంట రామన్నగారు—శ్యామసుందరపురము | 116—0—0 |
| ,, కంచరాన గోపాలరావుగారు—ఉండ్రికుడియ | 116—0—0 |
| శ్రీమతి శిష్ట బాసెమ్మగారు—రాజగోపాలపురము | 116—0—0 |
| శ్రీ కవిటి (ఉద్దానము) గ్రామస్థులు | 116—0—0 |
| ,, బెండి బండారిగారు—పుట్లచెరువు | 116—0—0 |
| ,, కిల్లి జగన్నాథముగారు—పురుషోత్తమపురము | 100—0—0 |
| ,, కిల్లి చిరంజీవరావుగారు—పురుషోత్తమపురము | 60—0—0 |
| ,, బొడ్డపల్లి కృష్ణమూర్తిగారు—బొడ్డపల్లి | 58—0—0 |
| ,, కంచరాన సత్యనారాయణగారు—ఉండ్రికుడియ | 58—0—0 |
| ,, హనుమంతు రామయ్యదొరగారు—బోరుబద్ర | 58—0—0 |
| ,, హనుమంతు సీతారాముదొరగారు—బోరుబద్ర | 58—0—0 |
| ,, సనపల సూర్యనారాయణగారు—గుత్తావెల్లి | 50—0—0 |
| ,, గురుగుబెల్లి రాజారావుగారు—గుత్తావెల్లి | 50—0—0 |
| ,, పేటపాడు గ్రామస్థులు | 50—0—0 |
| ,, హనుమంతు జగన్నాయకులుగారు—కణితివూరు | 35—0—0 |
| ,, కూన వేంకటేశ్వరరావుగారు—ఇచ్ఛాపురం | 30—0—0 |

| | | |
|---|---|---|
| శ్రీ | దుంపల కోదండముగారు—తురకలకోట | 25—0—0 |
| ,, | ఐ. జోగారావుగారు—కాకినాడ | 25—0—0 |
| ,, | దంటు భాస్కరరావుగారు—కాకినాడ | 25—0—0 |
| ,, | మొదలివలస సన్యాసినాయుడుగారు—మొదలివలస | 25 0—0 |
| ,, | మెట్ట అప్పయ్యగారు—పుట్లచెరువు | 25—0—0 |
| ,, | చింతాడ సీతారామయ్యగారు—పుట్లచెరువు | 25—0—0 |
| ,, | హనుమంతు శ్రీరాములుగారు—ఏటిగట్టు | 25—0—0 |
| ,, | బెండి గురివినాయుడుగారు—సీతాపురము | 20—0—0 |
| ,, | పొందల అప్పన్నగారు—రిట్టపాడు | 20—0—0 |
| ,, | కిష్ట అప్పన్న, కృష్ణమూర్తి సోదరులు—బెండి | 20—0—0 |
| ,, | నంబాళ్ల శ్రీరాములు సోదరులు—జియ్యన్నపేట | 20—0—0 |
| ,, | దుంపల దాలయ్యగారు—తాటితుఱ్ఱు | 20—0—0 |
| ,, | గురుగుబెల్లి ఆదినారాయణగారు—పుట్లచెరువు | 20—0—0 |
| ,, | తమ్మినేని విశ్వేశ్వరరావుగారు—ఏటిగట్టు | 10—0—0 |
| ,, | హనుమంతు మల్లేశముదొరగారు—బోరుబద్ర | 10—0—0 |
| ,, | హనుమంతు గరుడధ్వజుడుదొరగారు—బోరుబద్ర | 10—0—0 |
| ,, | మెట్ట లక్ష్మయ్యగారు—ఏటిగట్టు | 5—0—0 |
| ,, | పసగాడ సూర్యనారాయణగారు—శ్రీకాకుళము | 5—0—0 |

సాహిత్యాభిలాషులై మధూదయ కావ్యప్రచురణమున కర్థించుటయే తడవుగ గుప్తదానశౌండులై భూరివిరాళములను ప్రసాదించిన వదాన్యశేఖరులకు నా నమస్సులు. చిరస్మరణీయమగు నీదాతల జాబితా నిందు పొందుపరచితిమి. ఏతత్సుకృతులను భగవానుఁడు రక్షించుగాక యని ప్రార్థింతుము.

ప్రకాశకులు

# ముమ్నుడి

త్రికళింగమునఁ దెలుఁగు ప్రభవించి యాంధ్రముగఁ బర్యవసించి త్రిలిఙ్గముగ సంగృహీతమై తెనుఁగుఁదనమును దీరుతెన్నులను బడయుట విచిత్రమగు స్వాభావికపరిణామము. ఈ పరిణతి తెలుఁగుభాషాస్వభావానుశీలుర కెంతేనియు నావశ్యకము. తెలుఁగు సాహిత్యస్థాయి నందుకొను దశ లభ్యమగునప్పటి కుత్తరకళింగము (ఉత్కలము) ద్వితీయప్రాకృత ప్రాబల్యమునకు లోఁబడుటవలనఁ దెలుఁగును స్మరింపఁజేయునవి మధ్య దక్షిణకళింగములే యైనవి. త్రికళింగము తెలుఁగునామోత్పత్తికి హేతు వగునట్లే తెన్‌కళింగము తెనుఁగుశబ్దమునకు మూలమగుట కభ్యంతర ముండదు. తెనుఁగుశబ్దప్రాప్తినాఁటికిఁ ద్రికళింగ ముత్తరదక్షిణకళింగములుగ జనవ్యవహృతి నందియుండవచ్చును. దక్షిణకళింగమే తెన్‌కళింగముగ వాడుకగడించి తెనుంగును జనింపఁజేసియుండనగును. తెన్ అను తమిళధాతువునకు దక్షిణ మనికదా యర్థము.

కళింగదేశమును బ్రస్తావించునపుడు కాళింగులు, కళింగకోమట్లు నను రెండుతెగలప్రజలను స్మరింపక తప్పదు. కళింగకోమట్లనుపదము దేశమును స్ఫురింపఁజేయు వైశ్యజాతిని దెలుపుచున్నది; కాని కాళింగు లనెడి జాతివాచకముమాత్రము విలక్షణమైనది. ఆంధ్రదేశమున నాంధ్రు లను కులముగాని, తమిళదేశమున దమిళు లను కులముగాని, తదితరభాషారాష్ట్రములందు రాష్ట్రనామముగల కులముగాని గోచరింపదు. ఒక్కకళింగమునందే యిట్టివైచిత్ర్యము కానవచ్చుచున్నది. వైదికవాఙ్మయమునందును రామాయణభారతాదులయందును గళింగదేశీయులను గళింగు లనియుఁ దత్పాలకులను గాళింగు లనియు వ్యవహరించుట సువేద్యము. కాళింగులు పౌరుషప్రధాను లగుటయు వారివివాహాచారసంప్రదాయములును జాతీయక్రీడలును క్షత్రియోచితము లగుటయు గమనార్హము. కాళింగులయందలి అన్నెప, సేనప, అనుమంతు, ప్రధాన, ప్రగడ, శిష్ట,

సంప్రతి, రణాంక, బృందాల, దువ్వాడ, అట్టాడ, కణితి, సింగపురపు, యవారి, దీవుల, మొదలివలస, కరికాల, వీరఘటల, పైడి, వెండి, కిల్లి, ధావళ మున్నగు గృహనామములను బరిశీలించిన వారి ప్రాచీనరాజకీయ పదవులును, వీరజీవితమును, నౌకానైపుణ్యమును, వలసల నిర్మాణ దక్షతయు వెల్లడి యగుచున్నవి. కాళింగులందలి దొర, పాత్రుఁడు, చౌదరి, నాయఁడు మున్నగు బిరుదములు పరికించిన నధునాతనచరిత్రము నందలివారి ప్రాబల్యము వెల్లడి యగుచున్నది. ఆర్షసంబంధమగు వారి గోత్రాదులు, కర్మకలాపము పరికించినను ప్రాచీనకళింగపాలకులగు క్షత్రియ సంతతివారే నేఁటి కాళింగు లనుట యంగీకరింపక తప్పదు. మధ్యకళింగము (శ్రీకాకుళమండలము) న కాళింగుల ప్రాధాన్య మమితము.

ఆంధ్రసాహిత్యమును బరిశీలించిన పలువురుమహాసీయు లద్దాని ననువాదమయ మనియు, తెలుఁగుదనము శూన్యమనియు నీసడించుట కలదు. భాష పరిపుష్టము కాని నాళ్ళలో ననువాదము లన్నియు గీర్వాణము నాశ్రయింప నధునాతనులు వంగాంగ్లాదిభాషలప్రాపున ననుకరణములు ననువాదములు సాగించుచున్నారు. కావుననే మన నాటఁ ద్రిలింగమిల్టన్లు తెలుఁగుహ్యూగోలు నాంధ్రరవీంద్రులుఁ గోకొల్లలు. ఉత్కళ వన్నయ్యలకుఁ దమిళదిక్కన్నలకు: గర్ణాటశ్రీనాధులకు వంగపెద్దన్నలకు మనము నోచుకొనకుండుట విచార్యము. ఆంధ్రక్లియోపాత్రలు తెనుఁగు బొడీషియాలు త్రిలింగముఖర్జీలు మనకావ్యరంగమున స్వేచ్ఛావిహారము సల్పుచుండ రుద్రమ్మలు మల్లమ్మలు బిక్కు బిక్కు మనుచు నక్కుచుటకే పెట్టిపుట్టలేదు. ఎరుపుపొమ్ము బరువుచేటే గాక యువహృదయపాత్రముగదా! బంగాళాబాబుగారి బంగళాకన్న జోగన్నగారి లోగిలి యాత్మాభిమానప్రేరకము కాకుండునా?

కవులు జాతినిర్మాతలు. తెలుఁగునాట కావ్యనిర్మితి కనువగు చరిత్ర కాని వర్ణింపఁదగు ప్రదేశముగాని వివరింపఁదగు మేలిగొనములుగాని

లేమియే యనువాదసాహిత్యమున కింత చెలామణీయా ? లేక యాంధ్రులే యనుకరణప్రియులా? యను సందియము లందందుఁ బొడమ చుండుట శుభావహము. కవిలోక మీసందియములకు సమాధాన మిచ్చుట యటుండ నాత్మాభిమానశూన్యము ననుకరణప్రియము నగు జాతిగా నాంధ్రులను సరిదిద్ది రను నపవాదు తప్పదు. వాదమున కాంధ్రులు చరిత్రహీను లని యంగీకరించినను కవుల కల్పనాపాటవమును శంకింపవలసివచ్చునుగదా ! అన్యజాతుల సంస్కార మాత్మజాతీయ సంస్కారమున కుపాంగ మగుటయే యారోగ్యలక్షణము; కాని పరసంస్కారమే తనదిగా మూర్తీభవించుట తన్నుమాలినధర్మము కన్నుగానని యావియు నగును.

మాతృభారతీపూజాప్రసూనముగ నుద్దేశించిన మధూదయమునఁ దెనుఁగునే ప్రభవింపఁజేసిన తెన్కెళ్లింగము రేఖాచిత్రముగఁ బ్రదర్శింప యత్నించితిని. కృతిని దెలుఁగుఁదనము నింపుట లక్ష్యముగనే యిందుఁ గాళింగేతివృత్తమును మాండలికములును జాతీయములును సామెతలను నా యోపినంత సమకూర్పఁ బాటుపడితిని. వర్ణనలు ప్రాదేశికములు. పాత్రలు కల్పితములు. జీవద్భాషాభిమానము సంప్రదాయవిచ్ఛేదమునకుఁ బురికొల్పమి మధ్యేమార్గమునఁ బ్రబంధాణ మొనర్చిన నాశ్రుష పాఠకులు గమనింతురని యాశ. భావవిన్యాసమునందుఁ బదసంయోజనమునందుఁ బాత్రనిర్మితియందు సన్నివేశకల్పనమునందు రచనాసంవిధానమునందుఁ బ్రాంతక్రొత్తల మేలుకలయికయే ధ్యేయముగ నల్పిన యీచిన్నిజతన మాంధ్రసాహిత్యసౌధమునం దొకయిటుకగా నిలువఁగలిగిన నాకన్న సంతసించువా రుండరు.

సమకాలీనజీవితమును కావ్యవస్తువుగా స్వీకరించుటలో నేను పరిపక్వముగాని రాజకీయభావప్రభావమునకు లోను గాకుండుటకు వ్యక్తి దూషణమునకు దూరముగ నుండుటకును యథాశక్తిఁ బాటుపడితిని.

తత్సాఫల్యము పాఠకులు నిర్ణయింపవలసి యున్నది. ప్రదేశములు వాస్తవము లగుటవలన నానిర్మించిన పాత్రము లందెవ్వియేని యాదృచ్ఛికముగ సజీవవ్యక్తులుగా భాసించిన నది బుద్ధిపూర్వకముగ నల్పియుండలేదని మనవి.

వార్ధకము ననారోగ్యము విశ్రాంతి యొసఁగని సాహిత్యవ్యాసంగముగల పితృపాదులు విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్, ధర్మభూషణ, శివశ్రీ బండారు తమ్మయ్యగారు మన్మధూదయపువ్రాఁతప్రతిని గొంతభాగము పఠించినవారై వివిధసాహితీసంసత్తులయందుఁ దమప్రశంసలను వెల్లడించియుండిరి. విపులమగు గ్రంథమగుటచే మధూదయము ముద్రణమొందుట కష్టసాధ్యమైనది. ముద్రణకృషికి ననుఁ బదేపదే ప్రోత్సహించుచు నర్థించుటయేతడవుగ నాప్రార్థనమును మన్నించి యానుశీలనాత్మకమును సువిశాలమును నగు పీఠికను రచించి యొసంగి కృతిగౌరవము నినుమడింపఁజేసిన శ్రీ తమ్మయ్యగారికి సర్వథా కృతజ్ఞుఁడను. వినమితోత్తమాంగుఁడనై వారికి నాప్రణామసహస్రము నర్పించుచున్నాఁడను.

గ్రంథముద్రణమునకు సహకరించి తమ వదాన్యతయు సుకృతిసత్కృతియుఁ గళాపోషణాభిరతియు వెల్లడించిన మహాశయులకు వినయాంజలి. ఓరిమియుఁ జేరిమియు వెలయించి నా యసంస్కృత మధూదయపువ్రాఁతప్రతిని సమాకర్షకముగ ముద్రింపఁజేసిన శ్రీసతీ ముద్రాశాలయాధిపతులు శ్రీ తోకల బుచ్చిరాజుగారికి నా నమస్సులు.

అల్పజ్ఞుఁడను. ప్రబుద్ధమును పరిపక్వమును గాని నా యీ జతనమున నుత్సాహలేశమునే గ్రహించి గుణావగుణవేత్తలగు విద్వల్లోకము నన్ను సాహిత్యారాధనమునకుఁ బ్రోత్సహింపఁగల దని యాశించుచు సహృదయలోకమున కంజలించెదను.

కాకినాడ,
శార్వరి–జ్యేష్ఠము.

ఇట్లు,
గ్రంథకర్త.

శ్రీమదుమామహేశ్వరాభ్యాన్నమః

# పీఠిక

మధూదయ మను నీకృతి స్వతంత్రసత్కథాపాదిత మయిన యొక యపూర్వప్రబంధరాజము. కవి, కవిరాజ, సాహిత్యవిశారద బిరుదాంకితుఁడు శ్రీ ఉప్పాడ రాజారావు. ఉన్నతకళాపట్టభద్రుఁడు. ప్రాక్తనచరిత్ర వైభవాంచిత మగు మధ్యకళింగాంధ్రదేశీయుఁడు. "విశ్వశ్రేయః కావ్యమ్ తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ, సాహిత్యే హి రసో యథాతథమ్ కవిభిః స్వస్థానవేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః" ఇత్యాద్యాంధ్రశబ్ద చింతామణీసూక్తులను చింతామణీమంత్రమువలె భక్తివిశ్వాసములతో నారాధించు ఆంధ్రభాషాభిమాని, దేశభక్తుఁడు. ఏకాదశాశ్వాసములలో గ్రథితమయిన యీప్రబంధముచివరి గద్యములోఁ గవి దీనిని "పురాతనాధునాతన కావ్యవాహినీసంగమ సరోవరసదృశ మధూదయ మహాకావ్యము" అని పేర్కొనినాఁడు. అవతారికయందలి

"అనువాదమ్ములు కొల్లలై వెలయఁగా నాంధ్రత్వమున్ గోలుపో
వును నాముద్దులతేనెవాఁకనుడిపువ్వుంబోఁడి, సంస్కార మెం
దును గానంబడదే, తెనుంగుజనులందు న్మూర్తిఁ గొన్నట్టి దే
మొసరింపం దగు నన్న యోచనలె కావ్యోద్యోగమున్ బెంపఁగన్."

అను పద్యమునఁ బ్రస్తుతకాలమున నాంధ్రకవిసోదరు లనూదితకావ్యరచనమునకుఁ గడంగుటయందలి యనావశ్యకతను హెచ్చరించినాఁడు. కావున స్వతంత్రగ్రంథరచనమునందే యీయన కభిరుచి యెండని చెప్ప నవసరములేదు. అట్టి యభిరుచిదోహదముగా "ప్రాఁతక్రొత్తల మేలు కలయిక నలరు గ్రామజీవితేతివృత్తము" మాతృమండలసంబంధికము నితివృత్తముగా నీతఁ డీప్రబంధమున నిబంధించినాఁడు, స్థలసన్నివేశములు చాలవఱకుఁ గళింగదేశస్థములు. కాని పాత్రలుఁ గథయుఁ గల్పితములు. కవి మాతృదేశాభిమానమునకు, భాషాభిమానమునకు నున్నాగుణముగా,

"స్వస్థానసజాతిభాషాసంస్కృతులు నుడి
కారంపుసొంపు చేకూఱవలయుఁ
బాత్రచిత్రణ ప్రాణవంతమై బహువిధ
వృత్తుల నలరి దీపింపవలయు
నాలంబనోద్దీపనావిభావంబుల
కలయిక రససిద్ధిఁ గాంచవలయు
సంభాషణల్ వచస్సామర్థ్యయుతములై
వ్యంగ్యాత్మకం బయి వఱలవలయు
అస్థిభారమునాఁ జనునట్టికథను
సంధిబంధముల్ బిగువుగా సంఘటించి
స్థానికప్రకృతిని నిల్పఁజనును గావ్య
మంచు ... ... ...".

అని ప్రతిజ్ఞాపూర్వకముగ స్వాభిలాషాభిప్రాయమును బ్రకటించి యది "దుష్కర మగునుగాదె?" యని భయోత్కంఠను వెల్లడించినాఁడు. ఇది సామాన్యకవులకు దుష్కర మయినను ప్రతిభావ్యుత్పత్తులు గల యీ కవికి సుకరమే యని తలంతును. తనప్రతిజ్ఞ నీతఁడు చక్కఁగ నీగ్రంథరచనమున నిర్వహింపఁగల్గెననియే నా నిశ్చయము. ఆ విషయమును ముందు క్రమముగాఁ బరీక్షింతము. మాతృదేశాభిమానమునకు మెఱుంగుగా నీకృతిని గవి మాతృపితౄణముక్తిసాధకముగా స్వర్గస్థ లయిన మాతాపితరుల కంకితము గావించుట మఱియు ముదావహము. ఇందలి శ్వాసారంభాంతపద్యములు వరుసగాఁ గవి పితృమాతృసంబోధనస్తవములతో నలంకృతము లయినవి. కవి కృతిరచనమునఁ దనకు దోహదకారిణియై చేదోడువాదోడుగా నుండిన సహధర్మచారిణి నర్ధాంగినిఁగూడఁ గృతిశ్రోత్రిగా గ్రహించి ప్రత్యాశ్వాసారంభమునను బితృస్తవానంతర మామె సంబోధనస్తవముఁగూడఁ గావించుట యొకవిశేషము.

కృత్యారంభమందలి నాందీపద్య మిందుకుఁ గొంతవఱకుపస్కారకము. తద్విషయము ముందు వివరింతును. ఇట్టి మర్యాదను పూర్వకవులుగూడఁ గొందఱు పాటించియేయున్నారు. కాళిదాసకృత మని తలఁపఁబడు శ్రుతబోధచ్ఛందము, కర్ణాటలాక్షణికకవి నాగవర్మ ఛందోంబుధియుఁ దత్ప్రియాంగనాసంబోధనాంకితము లయియుండుట సర్వవిదితము. కావ్యేతివృత్తము కవి కేవలము స్వతంత్రముగాఁ గల్పించి చిత్రించినది కావున గ్రంథసమీక్షను పాఠకులు బాగుగా గ్రహించుటకు ముందుగాఁ గథాసంగ్రహమును వారికి నివేదించుట యుపయుక్త మని తలంచి యందుకుపక్రమించెదను.

"నేఁటి శ్రీకాకుళమండలమున వంశధారాతీరమునఁ బుష్పపుర మను గ్రామ మొండు వెలయును. ఆపురమున విజయేశ్వరనామధారియై శంకరుండును, మాధవనామధారియై మహావిష్ణువును అర్చారూపమున వెలయుచుండిరి. అందుఁ గర్షకజీవను లగు కాళింగులు పలువురు గలరు. నరసింహవర్మనాయకుఁ డప్పురనాయకుఁ డయి, సుభద్రానామాంకిత యయి రూపగుణశీలాభిజాత్యములు గల సహధర్మచారిణితో గృహస్థధర్మమును నిర్వహించుచుండెను. అతనికి రోహిణి యను సోదరీమణి గలదు. మాధవపదారవిందభజనానందుం డగు నరసింహవర్మకుఁ బ్రథమ సంతానముగా నొక పుత్త్రుఁడు మాధవానుగ్రహమున నుదయించెను. అతనికి మాధవవర్మ యని నామకరణ మొనర్చిరి. అయిదవయేఁట నక్కుమారునకు అక్షరస్వీకరణమహోత్సవము వైభవోపేతముగ నరసింహవర్మ గావించెను. అప్పటికిఁ దొలిపురిటికయి పుట్టింటికి వచ్చియున్న రోహిణి ఆ మహోత్సవమునందుఁ బాల్గొను నవకాశము గలిగెను. అనంతరం ఆమెకు మాలతి యను కుమారీరత్న ముదయించెను. ఆబాలిక డోలికారోహణమహోత్సవమునుగూడ నరసింహవర్మ విభవపూర్వకముగ నెఱవేర్చెను. ఆ యుత్సవసందర్భమున రోహిణి భర్త

రామవర్మయు సుభద్రానుజ యగు సీతయుఁ దమగ్రామములనుండి సమయమునకుఁ గాకున్నను నాసాయంకాలమునఁ గొంతయాలస్యముగ వచ్చియుండిరి.

రాత్రి భోజనానంతరము నరసింహవర్మ, రామవర్మపుత్రికాడోలారోహణమహోత్సవమున కంతవిలంబముగ విచ్చేసినందుకుఁ బరస్పరసంభాషణసందర్భమునం దించుక మేలమాడఁగా నాతఁడు తాను ప్రయాణమగుచుండఁగా నాత్మబంధువు లొకరు దాంపత్యవిషయమునఁ బొరపులు గలిగి వివాహవిచ్ఛేదనిర్ణయమున సమాలోచనమునకయి తనయొద్ద కరుదేర వారితగవు పరిష్కరించుటలో నాలస్య మయినదనియు వారికి విడియాకులు వ్రాయించి వచ్చితిననియు వినిపించెను. ఇట్టిది కాళింగవంశ్యులకుఁ గళంకకారణ మనియు నిట్టియాచారము వారిలో నెట్లు వెలసిన దనియు సుభద్ర సానుతాపముగఁ బ్రశ్నించెను. అశోకునికళింగదేశదండయాత్రలో జరిగిన ఘోరయుద్ధములోఁ గాళింగులు విశేషముగ హతమయి పోవుటచే దేశమున వితంతువులసంఖ్య హెచ్చుకాఁగా దేశమందలి పెద్దలు సమాజసంరక్షణోపాయముల సమాలోచించుట కొకపరిషత్తు నేర్పఱిచి రనియు, నప్పుడు సమాజాభివృద్ధి నభిలషించువారు కొందఱు వితంతూద్వాహసంస్కరణ మత్యంతావశ్యక మని హెచ్చరించి రనియుఁ, బూర్వాచారపరాయణులు కొంద ఱద్దానిని బ్రతిఘటించి రనియు నప్పుడు కింతలు లని, పూర్వగాము లని రెండుప్రధానశాఖావిభేదములు కాళింగులలో నెలకొనె ననియు నరసింహవర్మ పూర్వచరిత్రము నుగ్గడించెను. ఈ యిరుశాఖలలోను గ్రమముగాఁ గట్టు, బొట్టు మున్నగు నాచారవ్యవహారములలోఁగూడఁ గొన్నివిభేదములు వెలసెను. పూర్వగాములకన్నఁ బురోగాము లయి కింతలులే చాలవఱకు సామాజికగౌరవములలోనేమి, విద్యాధనసంపత్తులలోనేమి సాధారణముగా నభివృద్ధి నొందియుండిరి.

మాలతీడోలికారోహణోత్సవానంతర మొకటిరెండుదినములలో రామవర్మయు సీతయు నారిండ్లకు మఱలిరి. కుమారుఁడు మాధవవర్మకుఁ జేదోడువాదోడుగా నుండి యాతనితోఁ గలిసి విద్యాభ్యాస మొనర్చుటకయి సీతకొమరుని ఆనందునిఁగూడఁ దమయింటికిఁ బంపవలసినదని యాసమయమున సుభద్ర చెల్లెలిని హెచ్చరించెను. మాలతి జనించినప్పటి నుండి రోహిణికన్న నెక్కువ ప్రేమవాత్సల్యములతో సుభద్రయే యామెను బెంచి పోషించుచుండెను. మాధవవర్మయుఁ బసినాఁటినుండియు ననురాగముతో మాలతిని ముద్దుఁగొని మురియుచుండెను. మాలతిని దనకుమారునకే పెండ్లిగావింతు నని మఱెవ్వరికి మాట నీయవలదని సుభద్ర రోహిణీరామవర్మ లిరువురనుగూడ సానునయముగ నాదేశించెను.

ఇట్లు మాలతీమాధవు లిరువురకు బాల్యమునుండియుఁ బ్రేమానురాగబంధము లేర్పడి నానాఁటికి నభ్యుదయాభివృద్ధుల నొందుచుండెను. కొలఁదిదినములలోనే సుభద్ర భర్త యనుమతితో సేవకునిఁ బంపి చెల్లెలి కొమరుని నానందునిఁ బుష్పపురికి రప్పించెను. మాధవానందు లిరువురు నేకోదరులకన్న మిన్నగ సుభద్రాదరణమునఁ బెరుగుచుఁ బరస్పరప్రేమాన్వితు లయి విద్యార్జన మొనర్చుచుండిరి.

ఇంతలో శరదృతు వాసన్నమగుడు శరదుత్సవములు మహావైభవముతో నరసింహవర్మనాయకత్వమునఁ బుష్పపురమున నెఱవేఱెను. ఒకనాఁడు నరసింహవర్మ కుమారుల నాంగ్లవిద్యాభ్యాసమునకయి స్థలాంతరమునకుఁ బంపించుటకయి తన యభిలాషమును బ్రకటింప బిడ్డల కచ్చట భోజనాదివసతులు లేక యారోగ్యము చెడిపోవు ననెడితలంపుతో సుభద్ర యందుకుఁ బలువిధము లగు నాక్షేపముల వెలార్చి తనయసమ్మతిని బ్రకటించెను. ఇట్టిసంకుచితాశయములతో బాలురవిద్యాభివృద్ధి కడ్డంకులు గల్పించుట మంచిది కాదని రోహిణి మాఱువలికి వదినెసుభద్రకు విన్న

వించెను. తుదకు రోహిణియుద్బోధముపయి వారొకప్రణాళిక నాలోచించి యనారోగ్యమునకు గుఱిగాక నిరంతరాయముగఁ బ్రశాంతచిత్తములతో మాధవానందులు శ్రీకాకుళమున నాంగ్లవిద్యాసముపార్జనమొనరింపఁ దగినవసతు లేర్పఱిచి వారి నచ్చటఁ జదివింప నిశ్చయించికొనిరి.

మఱికొన్నిదినములకు సారెచీరలు గొని రోహిణి పుట్టింటనుండి కొమరితతో భర్తృనివాసమున కేఁగెను. అనంతరము కొంతకాలమునకు సుభద్రకు లక్ష్మి యను కొమరితయు, రోహిణి కొకకుమారుఁడు ద్వితీయ సంతానముగా నుదయించి పెరుగుచుండిరి. పుష్పపురమున మాధవానందుల ప్రాథమికవిద్యాసముపార్జనాదికములు ముగిసి వారి నిఁక శ్రీకాకుళమందలి యాంగ్లపాఠశాలకుఁ బంపెడికాల మాసన్నమగుఁడు నరసింహవర్మ భార్యసుభద్రతో నిఁక నామె మాధవానందులను వీడి, వారియెడఁబాటునకు బెంగగొనక కొమరితెలక్ష్మినే చూచికొనుచుఁ గాలక్షేపమొనరింపవలసియున్న దనియు నామెకుఁ దోడుగా నుండుటకయి మాలతి నామెతలిదండ్రులతోఁ జెప్పి తమయింటికిఁ దీసికొనివచ్చుటకై వెళ్ళవలసిన దనియు నాదేశించెను. ఆమెయు సంతసముతో రోహిణీరామవర్మల కడ కేఁగి వారికి నచ్చఁజెప్పి మాలతిని గొనితెచ్చెను. ఆమె యాదరమున లక్ష్మియు, మాలతియు గారాబమునఁ బెరుగుచుండిరి.

మాధవానందులు శ్రీకాకుళమందు నున్నతపాఠశాలాంతశాఖాశాలా విద్యాభ్యాసములం దుత్తీర్ణు లయి యాంగ్లవిద్యాపట్టభద్రు లయిరి. వేసవిసెలవులయనంతరము వా రిఁక విశాఖపట్టణమునం దాంధ్రవిశ్వవిద్యాలయమున నున్నతవిద్యాభ్యసన మొనర్ప నిశ్చయించికొనిరి. అంతః ప్రవృత్తి ననుసరించి వారిలో మాధవునకు సారస్వతాభిరుచియు, ఆనందునకు భౌతికశాస్త్రపరిశీలనారతియు నెలకొనెను. విశ్వవిద్యాలయమునఁ జేరుట కింకను దగినవ్యవధి యున్నందున నాసెలవులలో వసంతకాలమున

సాగరతీరస్థోద్యానమునకుఁ బయనించి యందు విహార మొనరింప వారి సంకల్పించిరి. లక్ష్మియు మాలతియుఁగూడ నీవిహారమున వారి ననుగమింప నిచ్ఛగించిరి.

జననీజనకులయనుమతితో వా రంతట ముందుగాఁ బుష్పపురి నుండి యానందునితలిదండ్రు లున్న యిచ్ఛాపురమున కేఁగి యటనుండి యుద్యానప్రయాణ మొనరించిరి. మార్గమునఁ గవిటి యనుగ్రామమునం దపరాహ్ణమున రాజవీధిని జనుచుండ వారికిఁ గూర్మినాయఁ డను గృహస్థుఁడు దారసిల్లెను. ఆతఁడు కాళింగులలోఁ బూర్వగామిశాఖకుఁ జెందిన వాఁడు. అతఁడు ముఖ్యవైఖరీరూపాదికముల విలోకించి వారు కాళింగ వంశ్యులలో నున్నతకుటుంబమునకుఁ జెందినవా రయియుందు రని భావించి వారివృత్తాంతము నడిగి తెలిసికొని తన్ను వా రెఱుంగకున్నను వారిపెద్దలకుఁ దనకు విశేషపరిచయ మున్న దనిచెప్పి వారితోడి బంధుమిత్రత్వముల నుగ్గడించి తనయింటి కరుదెంచి యాతిథ్యమును స్వీకరింప వలసిన దని మొగమోటపెట్టెను. తాము మార్గమున నెచ్చటను మసలుటకు వీలు లేదని యుద్యానమందలి ముఖ్యరమణీయస్థలముల విలోకించి తొందరగా నింటికి మఱలవలసియున్న దని మాధవుఁ డెంతచెప్పినను వినక బలవంత మొనర్చుటచే వారు కూర్మినాయనిగృహమున కేఁగి యాతని యాతిథ్యమును గ్రహించి యారేయి యందు విశ్రమింపవలసినవారైరి.

కూర్మినాయని కతనిపోషణమున వితంతుతనూజ వేంకమయు నామెకొమరిత రాధ యను వయసువచ్చిన మనుమరాలు నుండిరి. పరస్పరసంభాషణములలో నాస్వల్పకాలములోనే రాధకు లక్ష్మీమాలతులతో మిక్కిలి చనవు ప్రేమవాత్సల్యములు నెలకొనెను. క్రీఁగంటి చూడ్కులవలననే దైవికముగ రాధానందు లిరువురకు ననురాగము గాఢముగ నేర్పడెను. వారి సానురాగవిలోకనవైఖరినిబట్టి మాధవుఁడు, లక్ష్మీమాలతులుగూడ దానిని బసికట్టి గ్రహించిరి. అప్పటి కింకను

పెండ్లి కాకున్నను మాలతీమాధవులు భార్యాభర్తలుగ నుండుట కన్యోన్య మంకితులై యున్నారనియు, లక్ష్మియు నానందుఁడు నప్పటి కింకను నవివాహితు లనియు, నవివాహితయైన రాధకూడ నప్పటి కెవనికి నంకితము కాలే దనియు వారు సంభాషణములలో నెఱింగికొనిరి. మాలతియు రాధయు నక్కా-చెల్లెండ్రవరుసతోఁ బిలిచికొనుచు లక్ష్మిని మఱఁదలుగాఁ బిలుచుచుండిరి. రాధయు నానందుఁడుఁ బరస్పరప్రణయానురాగములకై యువ్విళ్లూరుచు మనముల నొండొరుల వరించికొని తమ వరణమునకు శాఖావిభేద మొకటి యడ్డంకి యగుట తలపోసి పరితపించిరి. మఱునాఁటియుదయముననే యుద్యానప్రయాణమున వారు వెడలి పోవుదు రని చింతించి యాస్వల్పావకాశములోఁ దనకు నానందునకు నేర్పడిన యనురాగము పరస్పరసాన్నిధ్యమువలన బలపడుటకయి తల్లికిఁ దాతకుఁ జెప్పి యేదోయొకవంకమీఁదఁ దానుగూడ వారి నాప్రయాణమునం దనుసరింప రాధ నిశ్చయించుకొనెను. ఈవిహారయానమునఁ దనను గూడఁ దమవెంటఁ గొనిపోవరా యని యామె లక్ష్మీమాలతులతో నతి దీనముగఁ బ్రార్థింప వా రామెయుద్దేశమును గ్రహించి మాధవానందులతో నామెకూడఁ దమవెంట రానున్న దని విన్నవించిరి, వా రందులకు సమ్మతింప రాధ తల్లియుఁ దాతయు ననుమతింప నాప్రయాణమున వారితోఁ జనుదెంచెను. బారువాపురోపాంతమున నొకదీఘ (సరోవరము) చెంత వారు ప్రకృతిరామణీయకముల విలోకించుచు విహరించుచుండఁగా నాసరోవరతీరమున కనతిదూరమున నాచుతీఁగలలోనున్న యొకకల్హారమును గోయనెంచి రాధ ప్రమాదవశమునఁ గాలు జాఱి నీటిలోఁ బడి పోయెను. ఒడ్డుననున్న లక్ష్మీమాలతు లిది కని కళవళింప నించుకదూరమున నున్న మాధవానందు లాకలకలమును విని తత్తఱమునఁ బరువెంచిరి. ఆనందుఁడు సాహసముతో దుస్తులను దీసివైచి లాగుమాత్రము గలవాఁడై తటాలున నీటిలో దుమికి రాధ కేశపాశమును గ్రహించి

సీటమునింగిన యామెను లేవనెత్తి యీడుకొనివచ్చి యొడ్డునఁ జేర్చెను.

కొంతవడికి వారియుపచారములవలన రాధ సేదఁదేఱి మృత్యుముఖమునుండి విడుదల నొందినట్లు తలంచుకొనెను. ప్రాణనాయకుఁడుగాఁ దాను వరించిన యానందుఁడే దైవికముగ ఘటిల్లిన యీయాపత్తునుండి తన్ను రక్షించిన ప్రాణదాతగఁగూడఁ బరిణమించుటకు మఱింత సంతసించి తత్పరిణయమునకై యామె మఱింత దృఢనిశ్చయయయ్యెను.

అనంతరము వారు సముద్రతీరప్రదేశములఁ దిలకించి యారాత్రికిఁ దిరిగి యిచ్ఛాపురమును జేరుతలంపుతో మఱలివచ్చునెడ దారిలో మాధవుఁ డచ్చటి శిథిలావశేష మగు దీపస్తంభమును (*Light house*) విలోకించి పూర్వకళింగభూవరుల పరాక్రమదిగ్విజయవైభవాదికముల స్మరించి వర్ణించి పిదపఁ జేఁపలవేఁటయే జీవనాధారముగాఁ గల యచ్చటి కైవర్తుల విలోకించి యుం దొకవృద్ధునితో వినోదసంభాషణ మొనరించి బారువాపురం జేరిరి. అటనుండి బస్సుమీఁద నేఁగి దారిలో రాధను గవిటిలో డించి తాము తిన్నగా రాత్రికి నిచ్ఛాపురమును జేరనభిప్రాయమును మాధవుఁ డుగ్గడింప రాధ వారంద ఱారాత్రికూడఁ గవిటిలోఁ దమయింట నాతిథ్యము గ్రహించి మఱునాఁ డిచ్ఛాపురము వెళ్ళఁదగుననియు, నిందుకయి తాను వచ్చునపుడే తల్లికిఁ దాతకుఁ జెప్పివచ్చితిననియు, వారు నిరీక్షించుచుందు రనియుఁ జెప్పి నిరోధించెను. అంత నారాత్రికిఁ దా మిచ్ఛాపురము వచ్చుటలేదని బస్సువానిద్వారా చీటి పంపి వారందఱుఁ గవిటిలో దిగి యారాత్రికూడఁ గూర్మినాయనియింట విందారగించి విశ్రమించిరి.

రాధకుఘటిల్లిన ప్రమాదమును నానందునివలనఁ గలిగిన రక్షణమును విని కూర్మినాయఁడు వేంకమ యాతనికిఁ గృతజ్ఞతాభివందనములాచరించి యాతని నతివేలముగఁ బ్రశంసించిరి. మరలఁ గలిగిన యీయవకాశమునంజేసి రాధానందుల ప్రణయానురాగములు మల్లడిఁగొని పెల్లుగ

విజృంభించెను. ఆరేయి వారి కేమాత్రము నిద్దుర పట్టలేదు. ఇంట సం
దఱు గాఢనిద్రాముద్రితు లయియున్న యవసరమున రాధ గృహావరణ
మందలి తులసికోట చెంత విరహవేదనఁ దూలుచుండెను. నిదుర పట్టక
తాపశాంతికయి వెన్నెలలో విహరింపఁ బెరటిలోని కేఁగినయానందుఁ
డును నామె నాస్థితిలో విలోకించి మఱింత సంతసించెను. అప్పుడు వారు
తా మన్యోన్యము బద్ధానురాగు లయియున్నమార్గమును వెల్లడిచేసికొని
యెట్టిచిక్కులు వచ్చినను దాము మఱెవ్వరిని బరిణయ మాడ మని
మన్మథసాక్షికముగ దృఢమనోనిశ్చయమును బ్రమాణపూర్వకముగఁ
బ్రకటించుకొనిరి.

తెల్లవాఱఁగనే ప్రయాణమునకు సిద్ధము గాఁగఁ గూర్మినాయని
నిరోధముచే వా రామధ్యాహ్నమువఱకుఁగూడ నాతనియింటనే విశ్ర
మించిరి. అనంతర మపరాహ్ణమునఁ బ్రయాణమున కాయత్తపడుటకు
ముందు ఆనందుఁడు కూర్మినాయనితో "మీదౌహిత్రిని నేతీరున భావి
దిద్ద నెంచితిరి" అని యామెవిద్యాభ్యాసవిషయమునఁ బ్రశ్నించెను.
ఇచ్ఛాపురమునం దామెను నాల్గవఫారమునఁ జేర్చి యాంగ్లము నేర్పింప
సంకల్పించితి నని దైవ మెంతవఱ కనుకూలించునో యని కూర్మినాయఁడు
సాశంకముగఁ బ్రత్యుత్తర మొసంగెను. అప్పుడు లక్ష్మి యందుకొని
తనను దనవదినెమాలతినిగూడ నిచ్ఛాపురమునఁ దమపిన్నికడ నుంచి
ఆంగ్లమును బ్రైవేటుగా మెట్రిక్యులేషనుపరీక్షకయి చదివింపఁ దనతలి
దండ్రు లొకనాఁడు ప్రసంగవశమున భాషించిరనియు, సెలవులయనంతర
మది జరుగఁగల దనియుఁ, గూర్మినాయనిసంకల్ప మందుకు సాయపడి
నచో రాధతోఁడి యీరెన్నాళ్ళచెలిమి క్రమముగా వర్ధిల్లి తాము సహా
ధ్యాయినులై యానందించుభాగ్యము ఘటిల్లు నని వాక్రుచ్చెను. అందు
కందఱు సంతసిల్లిరి. కటికచీఁకటి వెలువడనున్న దీపకళికవోలె లభింప
నున్న యాసదవకాశమునకు రాధానందులు డెందముల నలరి యీశ్వరున

కభివాదనము లొనరించి తమప్రణయము భగవదుద్దిష్టంబ యయియుండు నని యూఱట నొందిరి.

అనంతరము వారు కూర్మినాయని వీడ్కొని పుష్పపురికిం జని తమప్రయాణానుభవములెల్ల జనకులకు నివేదించిరి. నరసింహవర్మ కూర్మి నాయనిమిత్రబాంధవముల స్మరించి యాతండు గావించిన యాదరణ మున కానందించెను. సుభద్రయు వేంకమను రాధను నొకపరి దర్శింపం దనకుంగల కుతూహలమును బ్రకటించెను. కృతజ్ఞతాపూర్వకముగ వారు కూర్మినాయునికి వేంకమకు రాధకుం బేరుపేరున వేర్వేఱుసంచులలోం గొన్నికానుకల నుంచి టపాలో బంగీగాం బంపించిరి. అం దానందుని చిత్రపటముగూడ నుంచెను.

ఒకనాండు విస్రంభసంభాషణములో లక్ష్మి తా నాజన్మ మవివా హితగా నుండి దేశసేవాకార్యములందుం దనజీవితమును గడుపం దలంపుం గొన్న తననిశ్చయమును మాలతికి మాధవునకుం బ్రకటపఱిచెను. పద పడి సెలవులయనంతరము విశాఖపట్టణమున విశ్వవిద్యాలయమున మాధవవర్మ ఆంధ్రసారస్వతమును నభిమానవిద్యగా గ్రహించి యందుకై B. A. (Hons) పరీక్షకుం జదువుటకును, ఆనందుండు ఆంగ్లవైద్య శాస్త్ర మభ్యసించి M B, B S., పరీక్షకుం జదువుటకు నిశ్చయములు జరిగెను.

కవిటినుండి తిరిగివచ్చినదిమొదలు ఆనందుండు రాధావిరహమునం జేసి యనుతాప మెక్కుడుగాంగం గృశించుటచే నాతనిలోం గనవచ్చిన మార్పును గనుంగొని యందుకుం గారణ మేమి యని మాధవవర్మ యానందుని నొక్కి నొక్కి యడుగంగా మర్మము విడిచి యానందుం డాతనికి యథార్థస్థితిని నివేదించెను. మాధవుం డాతనికి ధైర్యము చెప్పి యకలుషితము లయిన ప్రణయానురాగములను రాధానందులకుం బ్రభ వింపంజేసిన పరమేశ్వరుండు వానిని జరితార్థములుగం జేయకపోవం

డనియు, తా నావిషయమునఁ జేయఁదగినకృషి నొనరింతు ననియు, రాధ లక్ష్మీమాలతులతో నిచ్ఛాపురమునఁ జదువువ్యవసాయ మిందుకు దోహదము కాఁగల దనియు, లక్ష్మీమాలతులుగూడ వలయురీతుల నిందుకు సాయపడెద రనియు సాంత్వనవచనములతో నూఱట కలి గించెను.

పిదప ఆనందుఁడు నిజనివాస మగు నిచ్ఛాపురంబునకుఁ జని తలి దండ్రులకుఁ జెప్పి లక్ష్మియు, మాలతియు వారితో వారిచెలి రాధయు నచ్చటఁ జదువుటకుఁ దగినవసతుల నేర్పఱచి యాసంగతి కూర్మినాయ నికి నాతనికూఁతునకుఁ దెలియఁబఱచుటకయి మరల నొకసారి కవిటి కరు దెంచెను. అతఁడు గృహమున కేఁగుసరికి కూర్మినాయఁడు, వేంకమయు నింట లేరు. ఒంటరిపాటుగ నాయింటఁ జేరి యాతఁడు గదిలోఁ దన పట మును వక్షముపై నిడికొని విరహోన్మాదావస్థనున్న రాధను గనుంగొ నెను. కొంతవడికి రాధ స్మృతిని దెచ్చుకొని యాతని రాకకు హర్షించి స్వాగతోపచారము లాచరించెను. పెద్ద లింటలేని యాయవకాశమున వారొండొరులు గాఢాలింగనములఁ దనిసిరి. ఆలసించిన గుట్టు బయలు పడు నని యాందోళన మొంది రాధ యానందునిరాకనుగూర్చి యొక బాలికచేఁ దల్లికిఁ దాతకుఁ గబురుచేసెను. ఆ వార్త విని వారు సత్వర మరుదెంచి యానందుని బహువిధముల నభినందించిరి. ఆతఁడు తాను గావించిన యేర్పాటులను నివేదించి రాధ విద్యావిషయమునఁ గూర్మినా యని నిశ్చితాభిప్రాయమునుగూర్చి హెచ్చరించెను. ఈ విద్యావ్యాజ మునఁ దల్లిని దాతను విడిచి కొన్నియేండ్లపాటు తాను వేఱొకచోట నుండుటయందలి సాధకబాధకములఁగూర్చి చర్చించి విద్యాభ్యాస మారంభించినచో లక్ష్మీమాలతులతోపాటు వా రెంతవఱకుఁ జదివిన నంతవఱకుఁ దన్నుఁగూడఁ జదివించుటకుఁ దాతగారిచే రాధ వాగ్దాన మును బడసెను.

పిమ్మట రాధయు లక్ష్మీమాలతులతో నిచ్ఛాపురమునను శ్రీకాకుళమునను జదువుచుండెను. మాధవుఁ డాంధ్రవిశ్వవిద్యాలయమున B. A. (Hons) పరీక్షలో నుత్తీర్ణుఁ డయి ఉస్మానియావిశ్వవిద్యాలయమున నాంగ్లమున M. A., పట్టమునకై చదువఁబోయెను. ఆనందుఁడు M. B , B. S., విశాఖపురిలోఁ జదువుచుండెను.

హైదరాబాదులో మాధవుఁ డొక యద్దెయింట వసించుచుఁ జదువుచుండెను. ఒకయేఁడు గడచెను. ఒకనాఁటి సాయంకాల మాతఁడు వాహ్యాళి కేఁగి 'హుస్సేన్‌సాగర్' సరోవరతీరమునందలి పార్కులో నధివసించి చల్లగాలిని సేవించుచుఁ గడచినవేసవిసెలవులలోఁ దా నింటికేంజని నిజప్రణయిని మాలతితోఁ గడపిన యనుభవములనుగూర్చి యామె గుణశీలానురాగములఁగూర్చి యాలోచనానిమగ్నుఁ డై యుండఁగాఁ గళాశాలలోఁ దనకు సహాధ్యాయినిగానున్న మధుకుమారి యను యువతి వచ్చి తనతో మాటాడుటకయి వేచియుండుటఁ గని చకితుఁడై లేచి నిలిచి యామెకుఁ బ్రత్యుత్థానము సల్పెను. వారిసంభాషణములో నామె మాధవుని "భారతసంస్కృతిఁ" గూర్చిన యాంగ్లవ్యాసము గాంచి చాల సంతసించితి ననియుఁ బలువు రభిజ్ఞులు దాని నభినందించుచున్నారనియుఁ, దా నంతవఱకు నాతఁడు వక్తృత్వమున దిట్ట యని గ్రహించియుంటి ననియు, నిప్పు డీవ్యాసమును బట్టి స్తోత్రపాత్రులు నుత్తమ రచయితలు నని గ్రహించి యమందానందము నందితి ననియు, నందుకై తా నేర్పఱచిన విందుకై తనగృహమున కేతెంచవలె ననియు నాహ్వానించెను. ఆమెసౌజన్యమున కాతఁ డలరియు నామె కెందు కింతశ్రమ యని వినయపూర్వకముగ వచించి యావిం దనవసర మని హెచ్చరించెను. దాని నవజ్ఞగాఁ గొని యామె నిష్ఠురోక్తు లాడఁ దననైజములో మిత్రులయెడ నవజ్ఞచూపుట కనవినరా దనియుఁ దనమాటలను సరిగా నర్థము చేసికొనక యట్టు లామె వచించుట కెంతయుఁ బరితపించుచుంటి ననియు

మాఱుపలికెను. అంత నామె మాధవుని మొగంబును గని సానుతా పాశ్రులు గ్రమ్మ నాతనికరంబును దనచేత నొత్తుచు "నవనీతకోమల హృదయుల రగు మిమ్ముఁ గలంచి నేను గలఁతఁబొందితిని. క్షమిం పుఁడు. దైవవంచితనై మాతృప్రేమకు వెలియైననిర్భాగ్యకు మార్దవాను రాగము లెట్లలవడు" నని జొటజొటఁ గన్నీరుఁ గార్చెను. అందు కాతఁడు వగచి "మధూ! హృదయమును జిక్కఁబట్టి నీవృత్తాంతమును విన నర్వాంబేని వినుచు" మని యామెమోమును తనచేతితోఁ దుడిచి యుపశమనవాక్యంబులు వలుక నామె కలఁతఁదేఱి మాధవా! అనాధ నయిన నా యీజీవితంబున నాత్మీయజీవ మొండు గలదను విశ్వాసము గలిగించితివి. హృదయతాపోపశమన మ్మొనరింప నీవ యర్హుండ వను భావమ్ము సంధిల్లె. నావిషాదగాధ నీ కెఱిఁగింతు. వినుము; అని దాని నెఱిఁగించెను. అదియిట్టిది:

మధుకుమారి పూర్వు లాంధ్రాహ్వలు. కరణము లను శాఖకుఁ జెందినవారు. దక్షిణదేశమునకుఁ దీర్థయాత్ర కేఁగుదెంచి యట స్థిరపడిరి. ఆమెజనకుఁడు గోవిందరావు. తఁడు నుదారశీలుఁడు. నగలవర్తకము చేసి బహుధనవంతుఁ డయి భాగ్యనగరమున సుందరసౌధమును నిర్మించి తఱుఁగనిసంపదలఁ గూర్చి నెఱదాతయై వఱలెను. ఆతని కీమెయొక్క తయే కొమరిత. జననిమొగమైన నామె గుర్తింపనేరని పసితనముననే యామెజనని చనిపోయెను. ఆమెపేరుకూడ మధుకుమారియే. తల్లిపేరినే కొమరితకుఁ బెట్టి భార్యావియోగవ్యథచే గోవిందరావు వ్యాపారమును గట్టిపెట్టి గారాబముతోఁ బుత్రికను బెంచుచు ధనము నెల్ల బ్యాంకులో వైచి బొంబాయిలో నివసించుచుండెను.

కొంతకాలమునకు హైదరబాదులో రజాకారుదుండగములు మెండుకొనెను. వెళ్ళవలదని కొమరిత బతిమాలుకొనుచున్నను గోవింద రావు హైదరబాదునందలి పరిస్థితులఁ బరికించి వచ్చెద ననిచెప్పి

యామెను దనమిత్రుఁడు సేట్ జానకిరామ్ పోషణమున విడిచి హైదరబాద్‌నకు వెడలెను. అచ్చటిపరిస్థితులు నానాఁటికి దుర్భరము లయ్యెను. హైందవులు రజాకారులహత్యలకు విరివిగా గుఱియగుచుండిరి. తోడి సోదరుల కష్టములను జూచి సహింపక వారిని విడిచి తాను బొంబాయికి మఱలుట కిచ్చగింపక గోవిందరావు కొందఱుమహమ్మదీయులనుగూడఁ గూడఁదీసికొని యచ్చటనే యాఁగిపోయెను. అందుచేఁ బలువురుహైందవులు రజాకారులవాతఁ బడక రక్షణ మొందిరి. కాని యాతఁ డొకనాఁడొక దుండగీనితుపాకిగుండు కెరయై యసువులను బాసెను. ఇందుచే మధుకుమారికిఁ దల్లితోపాటు దండ్రిగూడఁ గఱవగు దురవస్థ ఘటిల్లెను. భారతప్రభుత్వపుఁబోలీసుచర్యయనంతరము భాగ్యనగరమునఁ బ్రశాంతవాతావరణము ఘటిల్లినయనంతరము సేట్ జానకిరామ్ మధుకుమారితో బొంబాయినుండి యట కేఁగి యామెగృహపరిస్థితుల కెంతయుఁ బరితపించి, కొంతకాల మట నిలిచి పెంపుడుతండ్రివోలె నామెయింటివ్యాపారములను సరిదిద్ది యామె నొంటరిగ నక్కడ నుంచుట కిష్టపడక యామెను మరలఁ దనతో బొంబాయికిం గొనిపోయి తనయింటియందే యుంచి కన్నతండ్రివలెఁ బోషించెను. అతనిసంరక్షణమున నామె యచ్చటనే చదివి బి. ఎ. పట్టము నంది గతవత్సరము హైదరబాదులోని నిజగృహమున కేతెంచి విద్యాభిరుచిని విడువఁజాలక ఉస్మానియావిశ్వవిద్యాలయమున ఎమ్. ఎ. పట్టము నొందుటకయి చేరెను. కొంతకాలముక్రిందటనే సేట్ గారును దివంగతు లయిరి. కావునఁ దండ్రిగారివలన సంక్రమించిన యైశ్వర్య మెంతయున్నను దోడునీడ లేక యగతికయై, మాతృనిర్విశేషగాఁ బసితనమునుండియుఁ దన్నుఁ బెంచుచుండినదాదిమాత్ర మండయై యుండ నాయింటియందు వసించుచుండెను.

ఈవిషాదగాథ నాలకించుసరికి సహజకరుణాపేశల మగు మాధవుని హృదయము ద్రవించిపోయెను. వనటచే జొటజొటఁ గాఱు నాతని

కన్నీటితో మధుకుమారిశిరము దడిసిపోయెను. అంత నామె మొగ మెత్తి యాతనిసానుభూతి కలరి తనదుఃఖజీవితముచే నాతనిమదికి నెవ్వగఁ గూర్చినందుకు క్షమింపవలె నని ప్రార్థించెను. విత్తమునకయి తనకుఁ గొదవ లే దనియుఁ దా నేర్పఱిచినవిందునకయి పూఁటకూటింట ధన మొసంగి యిబ్బందిపడుదు ననుశంక వల దనియు మాఱుమాటాడక తన ప్రార్థనము మన్నింపవలయు ననియు మఱునాఁ డతనిఁ దోడ్కొనిపోవుట కాతనిబసకుఁ గారుతో వత్తుననియు సవినయముగ విన్నవించెను. మాధవుఁ డామె నోదార్చి తా నామె ననుంగుచెచ్చెలిగా హృదయపీఠమున నిలుపఁ గృతనిశ్చయుఁడ నైతి ననియు నెట్టిపట్టులనైనను సుఖదుఃఖములఁ బాలు గొను నాత్మబాంధవునిగ గ్రహింపనగు ననియుఁ జెప్పెను. కాని యెట్టి వారినైనను బయిమాటలఁబట్టి వారిహృదయములఁ బరికించుట కష్ట మనియు, లోకవంచనమే పలువుర నైజ మనియుఁ, గావున లోకజ్ఞానము బాగుగాఁగలవా రిట్టిపట్టుల బహుజాగరూకులై యుందురనియు, సహజ సరళకోమలహృదయ యగు నామె పూర్వపరిచయములేని తన్నంతగా గౌరవించుట సరిగాదనియు వచించెను. అందు కామె తగినంతచదువు చదివిన తన కాపాటిలోకజ్ఞానము లేకపోలే దనియుఁ గళాశాలలో నొక్క-వత్సరమునుండి సహపాఠిగానున్న యాతనిగుణశీలములఁ దాను లెస్సగా నూహింపకపోలే దనియుఁ జెప్పి యాతనియభిజనాదికవృత్తములఁగూడఁ బ్రసంగవశమున నడిగి తెలిసికొని, యిప్పటికే చాల ప్రొద్దుపోవుటచే నాతనిని దనకారుమీఁదఁ దీసికొనిపోయి యాతనిబసలోఁ జేర్చి మఱు నాఁటివిందుకయి కారుతో వచ్చి తోడ్కొనిపోవుదు నని చెప్పి వెడలి పోయెను. అన్నప్రకార మామె గృహాలంకరణ మొనర్చి యతిథిస్వాగత మునకు విందునకు వలయునేర్పాటులఁ గావించి యుదయము 10 గంట లగుసరికిఁ దనకారుపై మాధవునిబస కేతెంచెను. అప్పుడుగూడ నాతఁడు గ్రంథపఠననిమగ్నుఁ డయియుండి వెంటనే యామెరాకను గుర్తింపఁజాలఁ

షయ్యెను. ఆమెచే సుద్బోధితుఁ డయి యామెరాకను గుర్తింపనిలోపమును నాలస్యమును మన్నింపు మని చెప్పుచు నామెతో వెంటనే బయలుదేఱి కొన్నినిముసములలో నామెమందిరమును జేరెను. మును ముందు మధుకుమారి మాధవునకుఁ దనధాత్రిఁ బరిచయ మొనరించి తల్లికిమాఱుగాఁ దన్నామె పెంచి పెద్దదానిగఁ జేసినసంగతి నివేదించెను. ఆమెయు మాధవునిం గని "బాబూ! మగవాసనయే లేక యీభవనమెల్ల విన్నదన మూనియున్నది. తల్లిదండ్రులకు దూరమైన యీవెఱ్ఱితల్లి యొంటిమై నీయింటిలోఁ జిన్నవోవుచు వెతలఁగూరుచుండును. ఇన్నాళ్ళకీనాఁడే యామెమొగమున మొదటిసారి వికాసము గదిరియుంటఁ గనుఁగొంటిని. మీమైత్రి ప్రస్తుతింపఁదగినది. అనుదినము మీరైన నొకపరి యిందు విచ్చేసి యామె కానందము గలిగింపఁ బ్రార్థింతును" అని విన్నవించెను. ఉంపనేతెంచినయతిథిని మీ రనుదిన మరుదేరుఁ డని పలుకుట హాస్యాస్పద మగు నని మధుకుమారి దాదిని బరిహసించెను. సముచిత సంభాషణానంతరము దాది మాధవుఁడువిశ్రమించుటకు మధుకుమారిజనకుఁడు వసించెడి పైయంతస్తునందలి గది నేర్పఱిచెను. తల్లివసించెడి యా దాపటిగదిలోనికిఁ జని మధుకుమారి తనజనని దాల్చెడి దుస్తులను నలంకారములను దాల్చి ముత్తైదువవలె నేతెంచెను. ఆప్రాచీనాలంకరణాలంకృత యైన యామెను గాంచి మాధవుఁ డావేశమున కాశ్చర్యమొందెను. అందలి యౌచిత్యమునుగూర్చి కొంతచర్చ యైనతర్వాత మధుకుమారి దాదితెచ్చిన మధురపదార్థములనెల్ల వెండిపళ్ళెరమున స్వహస్తముతో వడ్డించి మాధవుని భుజింపఁజేసి సనాతనమర్యాదానుసారముగ నాతనిభుక్తశేషముఁ గొని యనంతరము తానుగూడ భోజన మొనరించెను.

అంతఁ గొంతవిశ్రాంతిఁ గొన్నతర్వాత మధుకుమారి తనదాది కాంక్షించినట్టు లిట్టియానందమును మాధవుఁడు తనకు నిత్యమును బ్రసా

దించు నెడలఁ దా నదృష్టవంతురాల నగుదునని, అద్దెయింటిలోని వసతిని వీడి తనభవనముననే యనుదినము తనయాతిథ్యమును గైకొనుచు నివసింపవలె నని విన్నవించెను. అట్టులామెకోర్కెపైఁ దానచట నివసించిన నది యామె భావిజీవితమునకుఁ గళంకాపాదకమగునేమో యని శంకించుచుసియు, సాధక బాధకములను లెస్సగా నాలోచింపవలె ననియు నాతఁడు మాఱువలికెను. అంతవఱకుఁ దనగోడు నేమాత్రము విచారింపక యేపాటిసానుభూతియుఁ దనయెడఁ జూపని లోకమువలనిభయము తనకులేదనియుఁ, దనయింట నతఁడు వసించుటంజేసి తన కాతనిమూలమున లోకమునుండి చెట్ట కలుగు నని తాను నమ్మఁజాల ననియుఁ, దనయంతరాత్మ తన్ను మోస పుచ్చ దనియు, సహృదయుఁ డగు నాతనివలన లభించు మృతినైనను దాను సమ్మతితో ననుభవింపఁగల ననియుఁ, బవిత్రమూర్తు లగు జననీ జనకులచిత్రపటములసన్నిధిఁ ద్రికరణశుద్ధిగఁ దాను బొరపడలే దనియు నామె దృఢనిశ్చయముతో నావేశపూరితయై కన్నీటిని గార్చుచు విన్న వింప దయార్ద్రహృదయుఁ డగు మాధవుఁడు "నీయచంచలస్నేహమున నన్ను విజితునిఁ జేసితి" వని వచించుచు నామెప్రార్థనమును ద్రోసివేయ నశక్తుఁ డయ్యెను. తుద కిట్లు మధువు నామెదాది యనురోధములకు లోఁగి మాధవుఁ డంతటినుండి మధుకుమారియింటనే వసించి నెచ్చెలి యెడఁ జూపఁదగిన యచంచలప్రేమస్నేహములతో వర్తించుచుండెను. వారియనురాగస్నేహముల కలరి గృహపరిచారకులెల్ల రాతని మధు కుమారితోసమంబుగ గృహాధినేతగనే సంభావించి యాతనికనుసన్నల మెలంగుచుండిరి.

వారిస్నేహానురాగములు దినదినాభివృద్ధి నందుచుండెను. మాధ వునివయోరూపములవలనఁగూడఁ గాక కేవల మాతనిగుణశీలముల మూలముననే యాకర్షితయై మధు వాతనిస్నేహ మపేక్షించియుండు నని మఱియు తలంపఁజాలము. విద్యార్థిగా నున్నయాతఁ డింకను నవివాహి

తుఁడే యైయుండు ననియు నాతనిప్రణయ మన్యాసక్త మయియుండె దనియు నమ్మి తనవిద్యావినయశీలధనసంపదలకలిమిఁ గ్రమముగఁ దనకు వశుఁ డయి ప్రాణేశ్వరిగఁ ద న్నాతఁడు చేపట్టఁగలఁ డనువిశ్వాసము గూడ గాఢముగ నామెమదిలోఁ గదిరియుండును. కాని ప్రణయవిషయములో మాధవునియథార్థస్థితి వారిసాహచర్యసంభాషణములలో నించుకయు నామెకు గోచరింపకుండెను. ప్రథమసమావేశసందర్భమున నామె విషాదవృత్తాంతమును విని జాలిఁ గొని మాధవుఁడువల్కిన "నిత్యమును ని న్ననుఁగునెచ్చెలిగా హృదయాసనమున నిల్పఁ గృతనిశ్చయుఁడ నైతి నేఁటినుండి" అను నాతనివాక్యములలో నాతనిమనోనిశ్చయము గర్భితమయియేయున్నది. మాలతీప్రణయస్మరణాలోచనానిమగ్నుఁ డయియున్న యెడనేగదా ! మధుమాధవుల పూర్వోక్తసమావేశము ఘటిల్లినది !

మాధవుఁడు మధుకుమారియింట నెచ్చెలిగా నతిథిగా నిలిచినది మొద లెనిమిదినెలలు గడచెను. మాధవుఁ డుస్మానియావిశ్వవిద్యాలయమునందలి తన రెండవసంవత్సరపుఁ జదువుపూర్తియై పరీక్ష లయిన తర్వాతఁగాని నిజనివాస మగుపుష్పపురి కేఁగ నని నిశ్చయించుకొని యుండెను. తనదినచర్యపుస్తక మేదోయొకనెపమున మాధవుఁడు చూచుట తటస్థించునేని యందలిసా హిత్త్యమే గూఢదౌత్యము నెఱపి యాతని యెడఁ బ్రణయమగ్నమైన తనయాకాంక్షను గుట్టుగా నతనికి వ్యక్తమొనర్పఁగల దని తలఁచి యాతని కాపొత్తము నె ట్లుచితరీతిని జేర్చుటా యని మధుకుమారి యొక సమయమున నాలోచించుచుండఁ బ్రక్కగదినుండి మాధవునిపిలు పామెకు వినవచ్చెను. "ఇదె వచ్చుచుంటి" నని యామె తనపొత్తమును గొని సమ్ముదముతోఁ జనుదెంచునంతలో నాతఁడు "నేను సంక్రాంతిసెలవుల కింటికిఁ బోక యిందే యుండుటకు నిశ్చయించుకొనఁ దలవనితలంపుగా మాయమ్మ న న్నీసెలవులకుఁ దప్పక యింటికి రావలయును నని వాత్సల్యముతో నాజ్ఞాపూర్వకముగ వ్రాసిన

లేఖ యిది చూడు" మని యామెచేతి కాలేఖ నందించెను. ఆమె దానిని సాంతముగఁ జదివి డీలువడి విన్నదనమును వెలార్చెను. తల్లిని గుర్తింపఁ జాలనిపిన్నతనముననే యామెను గోల్పోయి మాతృరక్షణమున కేమియు నోఁచని యామె కాస్మరణ కలుగుటయే విన్నబాటునకు హేతు వని యెంచి మాధవుఁ డామెతో "ఏటి కిట్లు వంత నొందెదవు. నీజననికి మాఱుగా మాయమ్మ నిన్ను వాత్సల్యముతో నాదరింపఁగలదు. ఆమె మూర్తిఁగొన్న ప్రేమవాహిని. ఆమెసన్నిధిని నీవు నీ చీకుఁజింతల మఱవఁగలవు. ని న్నొకసారి మాయింటికిఁ దీసికొనిపోయి మాయమ్మకుఁ జూపివత్తు నని యోచించుచుంటిని. నేఁడు కాకతాళీయముగ నట్టియవ కాశము తనంతనే ఘటిల్లినది. దయతో నాప్రార్థనము నంగీకరించి నాతోఁ బ్రయాణ మగుట కాయత్తపడుము. మరలఁ బదిరోజులలోఁ దిరిగివత్తము. అచ్చట నాయాత్మీయులందఱితోఁగూడ నీకుఁ బరిచయము కాఁగలదు." అని యుగ్గడించెను.

అందు కామె వగఁ జెంది "నేను వర్ణాంతరస్త్రీని. మీవారి కంద ఱకు నపరిచితను. నేటివిద్యాసంస్కారవశు లయిన మీ రుదారహృదయ ముతో నాతోడిసాహచర్యమునకు సహపంక్తిభోజనములకు సమ్మతింపఁ గల్గిరి. కాని పూర్వాచారపరు లగు మీజననీజనకుల కిది కిట్టు నని యెట్లు నమ్మఁగలను? మీప్రాంతమున నన్యకులములవారికి నపరిచితులకు బయ టనే భోజనములు పెట్టెద రని విందును. ఇట్టిది నేను సహింపఁజాలను. రంగేళి నెవ్వతెనో తనవెంటఁ దెచ్చినాఁ డని మీవా రేవగించుకొని మిమ్ము దూఱవచ్చును. కావున నే నిపుడు మీవెంట వచ్చుటవలన మీకును నాకునుగూడ బాధకరమే యగును. కావున మొగమోటపెట్టి న న్నిప్పుడు మీతోఁ గొనిపోవుట తగదు. ఇంతకు నీసంక్రాంతిసెలవు లలోనే జనవరి 10 తేదీని నా జన్మదినోత్సవము. ఆనాఁడు మీసమక్ష మున నద్దానిని వైభవముతో నెఱవేర్పఁ దలంచియుండఁగ నిట్టిసంఘటన

మేర్పడుట దైవతంత్రమే యగును. పూజ్యురాలగు మీ మాతృదేవి యాజ్ఞను మీ రనుసరింపక తప్పదు. అవశ్యము మీరు మీజన్మస్థలము నకుఁ బోవలసినదే. నా జన్మదినోత్సవసందర్భమున నాకు సన్నిహితముగా నుండుటకు మీ యడియాలము నేదయిన ననుగ్రహింపుఁడు. ఇంతకు మీ రెప్పుడు ప్రయాణింపనెంచిరి?" అని యామె బదులుపలికెను. మాధవుఁడు కొంతవడి పర్యాలోచించి యామెవాక్యములందలి యాచిత్యమును గుర్తించి యామెను దనవెంట నపుడు తీసికొనిపోవుతలంపును విరమించి యానాఁటిసాయంకాలమే తనప్రయాణ మని తెలిపెను.

మాధవునిరాక ముందుగాఁ దంతిపూర్వకముగఁ దెలుపుట మంచి దని మధుకుమారి తంతివార్తను సేవకునిచేఁ బంచి రైలుటిక్కెట్టును వివిధము లగుఫలాదులను నంగడియందుఁ గొనితెచ్చుటకు నియోగించి యాసందడిలోఁ బరధ్యానమున నున్నదివోలె మాధవుని టేబిలుపైఁ దన దినచర్యాగ్రంథమును విడిచి చనెను. తర్వాత మధు వాతనిసామానులను తోలుపెట్టియలో సర్ది "పాత్రము లేమయినఁ దీసికొనివెళ్ళెదరా" యని యడుగ "వల దీడైరీనిమాత్ర మందుంపుము" అన్న యచ్చటనున్న మధుదినచర్యాపుస్తకము నతఁ డంగీయ దాని నామె పెట్టియం దుంచెను; "అన్నియు సిద్ధమైనవి. ఇఁక మీచిత్రపటము ననుగ్రహించు టరయే తడవు" అని చెప్పఁగా నంత వా రిరువురు స్టూడియో కరిగి యిరువురుఁ గలిసికూర్చుండియున్నట్టు లొకచిత్రమును, వేర్వేఱుగా మఱిరెండు చిత్రములను దీయించికొని గృహాభిముఖు లయి తిరిగి వచ్చిరి. వలయు సంబారము లన్నియుఁ జేకూఱినయనంతరము మధు వానినన్నింటిని గారునం దుంపించి రైలువేళకుఁ దాను స్వయముగా మాధవుని గారుపైఁ దోడ్కొనిపోయి రైలెక్కించి వీడ్కోలొసంగి విషాదమూర్తియై తిరిగివచ్చెను. ఈయెడబాటు వారిరువురకుఁగూడ దుర్భరముగా నుండెను. పరిపరివిధముల వారు తమస్నేహానురాగములఁగూర్చి తలపోసికొనుచు వేదన నొందిరి.

మాధవునకు రైలులోఁ బ్రయాణము చేయుచున్నంతకాలము నిదుర పట్టలేదు. మధుకుమారితోఁ గూడి యామెభవనమునఁ దాను నెచ్చెలిగా వ్యవహరించుట లోకులదృష్టిలోఁ బెక్కులనుమానముల కెడమీయఁగల దనియు నామెతోడిసహవాస మామె కుపచారమునకుమారపచారమే యగుచున్న దనియు బహువిధముల వాపోవఁదొడఁగెను. బహిఃప్రాణముగఁ దన్నుఁ జూచు నామెయెడఁ దాను నిర్వర్తింపఁదగిన కర్తవ్యముఁగూర్చి యాతని కేమియుఁ దోఁపకుండెను. తనదినచర్యాపుస్తకము నాతఁడు పైకిఁ దీసి జరిగినప్రమాదమును గుర్తించి దానిని జదువుట యనుచిత మని మరలఁ బెట్టెయం దుంచివైచెను. సంక్రాంతిపండుగకుఁ బుట్టినిండ్లకేఁగు వనితాజనమ్ములఁ గొందఱ నాతఁడు బండిలోఁ గాంచి మాలతికూడ తనపుట్టింటి కేఁగియుండునేమో యని చింతిల్లుచుండెను. పుష్పపురిని జేరుటకు దిగవలసిన రైలుస్టేషను రాఁగానే మాధవుఁడు ప్లాటుఫారముపై దిగుసరికి నాతనికయి యింటినుండి రెండెడ్లబండిని దోలుకొనివచ్చిన సేవకుఁడు అప్పన్న యెదురై సామానులఁ దీసికొని బండిపై నెక్కించి గృహమునకుఁ దీసికొనిపోయెను. అప్పన్నతోడి ప్రసంగమున మాధవుఁడు మాలతి పుష్పపురముననే యున్న దనియు నూర్మిళాదేవి లక్ష్మణునందువోలె నామె తనయం దచంచలగాఢానురాగమైయున్న దనియు గ్రహించి సంతసించెను.

మాధవుని రైలెక్కించి యింటికి మరలివచ్చిన తర్వాత మధుకుమారి పరిపరివిధముల విరహవేదనకు గుఱియయ్యెను. కన్నతల్లికన్న మిన్నగా నామెను మొదటినుండియుఁ బెంచినదాది యామె స్థితి కెంతయుఁ జింతించి యాంతరంగికముగ నామె మాధవుని ధవునిగా గ్రహింపఁదలఁచియున్న గుట్టును గుర్తించి యామెకు వాస్తవప్రేమతత్త్వమును బరిపరివిధముల బోధించి నిజమయినప్రేమ నిస్స్వార్థపూర్వకమైన దనియు కామసుఖాపేక్షతోఁగూడిన ప్రేమ స్వార్థరహిత మనరాదనియు, నిన్నా

శ్లకు మాధవుని సాహచర్యమున నామె తనకన్నుల కానందకరముగ దినములు గడపుచుండుటకుఁ దా నెంతయు సంతసించుచుంటి ననియు నతఁ డామెను బల్మిగా గ్రహించినను గ్రహింపకపోయినను నన్యోన్యానురాగబద్ధులయిన వారి ప్రేమమున కంతరాయ ముండరాదనియు నీవిషయమున స్వర్గీయయగు నామె జననిపావనవృత్తమే యామె కాదర్శము నారాధనీయముఁ గా నగునని యుఁ జెప్పి దాని నిట్లు వినిచెను.

“అమ్మా! నీతండ్రి విద్యావివేకచతురుఁ డయ్యుఁ బహుచుఁదనమునఁ గామినీపానవ్యసనములు రెంటినిగూడ మరగియుండెను. నీజనని రూపలావణ్యములకుఁ జొక్కి యామెను బరిణయమయ్యెను గాని పెండ్లి యైనతర్వాతఁగూడ వ్యసనముల విడువక వేశ్యాలోలుఁడుగనే విహరించుచుండెను. వింతలో వింతశోభనమునాఁటి రేయిఁగూడ వేశ్యాగృహముననే యుండి వేఁగుఁబోఁకకుఁగాని గృహమునకు రాఁడయ్యెను. కుములుకుంపటి వలె నా రేయియంతయు వగలఁ బొగులుచు నీతండ్రిఁగూర్చి నీతల్లి గడపినదృశ్యము నేఁటికిని గనులకుఁగట్టినట్లు నామనమును ద్రవింపఁజేయును. తెల్లవాఱుజామున శోభనపుగదిలోనికి వచ్చిన నీతండ్రిని గాంచి యామె తనవగల బయటికిఁ గానరానీయక యానససీమ వికాసము చెంగలింప ననూనవిలాసముతో నెదు రేఁగి చేతులతో నాతనిఁ బెనవైచి సంబరమున లోనికిఁ దోడ్కొనిపోయెను. అదేమిమంత్రశక్తియో యెఱుఁగ రాదు. మఱునాఁ డామె పతి నొకయరనిముషమైన విడువక యనేకగతుల సేవించి తనిపెను. ఆమెకడకంటికాంతులం దెంతయధికారదర్పము లుండెనో చెప్పఁజాలము. నాఁటినుండి మరల నీతండ్రి యింటిగడప దాఁటియుండలేదు. నీజననియందే యనురక్తుఁ డయి యామెయాజ్ఞాబద్ధుఁ డైయుండెను. మిసమిసలాడుప్రాయముననే యామె మరణించి తన్ను వీడి స్వర్గమున కేఁగ నాతఁడు లోకమునెల్ల విసముగఁ జూచి సాధుశీలుఁ డయి రసమంతయుఁ దనహృదయరాజ్ఞి యే చేకొని గతించె ననియు నీరస మగు

జీవన మింకఁ దనకుఁ జాలు ననియు నాప్తులతో వచించెడివాఁడు. ప్రాణములు వీడినను నీజననిపావనవృత్తమే నీతండ్రిపయి నధికారము నెఱపెను. ఆమహాసాధ్వీరక్తమే నీవుగా జనించితివి. అట్టినీవు ప్రియవశీకృతికై యేల పేద వయ్యెదవు. అన్నిటికిని దైవ మున్నాఁడు. నీసొమ్ము వారసత్వమ్ముఁ జేసి భక్తిపూర్వకభర్తృసేవాదివ్రతమ్మై మనుము. నీపురాకృతపుణ్యమే నిరుపమానశీలుఁ డగుమాధవుని నిన్ను వరింపఁజేసినది. సర్వ మర్పించి సంకల్పనిర్వాహణము సల్పి నీపేరు సార్థక మొనర్చుకొనుము. జన్మజన్మలకైన జయము నిశ్చయము. అమృతహృదయునియర్ధాంగివై సుఖింపఁ బావని యగు నీజనని స్వర్గమునుండి నిన్ను దీవించును. దీక్షఁ బూని తల్లిసారము బిడ్డనాఁ దనరుము" అని యుద్బోధించెను. మధువుహృదయమున నూత్నోత్సాహమును మాతృభక్తియు దీపింపఁ దల్లికి జే జేలిడి యపరమాతృస్వరూపిణి యగు ధాత్రికరంబులఁ దనకరంబుల నొత్తుచు "అమ్మా! ఇదే నీయాజ్ఞ శిరసా వహించెద. విశ్వ మెదురునడిచినను మధుమాధవులయేకీకృతికి భంగము వాటిల్లనేరదు. నా జననీజనకుల యాశీర్వాదబలమ్మును సముచిత మ్మగు నీప్రోత్సాహమ్మును నండగా నుండ నాయంతఃకరణసాక్షిగ మాధవుఁడే నాదైవము. ఇహపరంబులం దామహాత్మునిచరణదాసినై మనఁ బ్రతిజ్ఞ సేయుచున్నదాన" నని దృఢనిశ్చయముతోఁ బలికెను. ధాత్రియుఁ "దల్లీ! నీసంకల్ప మమోఘము. విజయవై యజరామరకీర్తి నందెదవు" అని యాశీర్వదించి యూఱడించి యామెను భోజనశాలకుం గొనిపోయెను.

మాధవుండు నిజగృహంబును జేరినంతనే జననీజనకులకుఁ బాదాభివందన మొనర్చి తనకుశలమును వారి కెఱిఁగించి లక్ష్మీమాలతులను సముచితరీతిని దనిపి విశ్రమింపఁ జనెను. మఱునాఁడు తల్లి తనకడకుఁ దెచ్చిన యల్పాహారమును స్వీకరించుచుఁ దన్మాధుర్యమున కలరి యామెపాకనైపుణ్యమును దయావాత్సల్యములను బ్రశంసింప నామె వానిని దయార్ద్ర

చేసినది మాలతియేగాని తాను కాదని మాలతి యింటిలో నున్నప్పటి నుండియు గృహకృత్యములనెల్ల నామెయే జరిగించుచున్నదని యామె గుణశీలనైపుణ్యాదికముల మిగులఁ బ్రశంసించువవసరమున రజతపాత్రి మునఁ గాఫీని దనకై కొనివచ్చుమాలతి నించుకదూరమునఁ గాంచి కను సన్నచే జననిప్రశంసల నాఁపి ముఖవికాసము నొకింతయుఁ గననీయక మాలతివినునట్టులు ఆంగ్లము నభ్యసించుయువతుల యవలక్షణములఁ గూర్చి వంటపనులలో వారియసమర్థతఁగూర్చి యుపన్యసించుచు మాలతి సమీపించునంతలోఁ దటాలునఁ దత్ప్రసంగమును గట్టిపెట్టులీలఁ గపట ముగ నటింప నది కాంచి మాలతి యేదియో తాను దప్పొనర్చి యాతని కాగ్రహము కలిగించియుండు నని భావించి మాఱుమాటాడక బల్లపైఁ గాఫీగిన్నె నుంచి తటాలున లోనికిఁ బోయి కుములఁబొచ్చెను. మాధవుఁ డును గపటవాక్యోపన్యాసముమూలమునఁ దా నామెచిత్తమును నొవ్వఁ జేసినందుకు క్షమార్పణ గోరి యామె నూరార్చి వినోదముగ నామెతో మెలంగుచు నామెగుణగణాదికముల మెచ్చుకొనుచు నామె నర్ధాంగిగా వరించు తనపురాకృతపుణ్యము నెన్నికొనుచుండెను.

నాఁ డాతఁడు మాలతీగుణగణముల మనమున నూహించునవసర మున మెఱుఁగుఁదీవవడువున మనోహరాకృతితో మధుకుమారి యాతని భావవీధిని గోచరించెను. అంత విభ్రాంతచేతస్కుఁడై యామె తన యెదుట నున్నటులే భావించి యామెకు స్వాగత మొసంగుతలంపుతోఁ దటాలున లేచి శూన్యమును గాంచి నవ్వి యట నాసన మొకటి చూపుచు "మానినీ! ధన్యుఁడ నైతి నీ విటులు దర్శన మిచ్చుటఁజేసి మేము సామాన్యుల మాట మీదృశుల మన్నన నల్ప మెఱుంగ మైన నీ వవశ్యముగాఁ దలంపక దయామతిఁ గొమ్ము మదీయసత్కృతుల్" అని యెదుటనున్న మాలతినే మధుకుమారిగా భావించి పలుకందొడంగెను. ఇది కాంచి మాలతి రిచ్చవడి తన్నిట్లు గౌరవించుట యనుచిత మని

యేమేమియో చెప్పి యాతని నాసనమున సుస్థితుం గావించి యాతం డట్లు వ్యగ్రచిత్తుఁ డయినకారణమును విచారింప నాతఁడు తెలివిడి నొంది మధుకుమారివృత్తాంత మొకింత చెప్పి యామె తలంపునఁ బొఱి నాసమయమున నచ్చుటఁ దన యెదుటి కేతెంచిన తన్నే యామెగా భ్రమించి యట్లుపల్కితి నని చెప్ప మాలతి యామెవృత్తాంతము సాకల్యముగఁ దెల్పుఁ డని వేఁడికొన భోజనానంతరము సావకాశముగ నామెం గూర్చి ముచ్చటించుకొందమని యాతఁడు వచింప మాలతి వాసన్ముఖయై లోపలికిఁ జనెను.

అట్లేఁగునపు డామెను విలోకించుచు మాధవుఁ డాలోచనామగ్నుఁడై మధుమాలతుల గుణశీలాదికతారతమ్యముఁగూర్చి చర్చించి వారిసాంగత్య మత్యంతశుభదాయకం బగు నని యోచించుసమయమున "వదినెగారిచిత్తం బింత కుదురుకొనెనె, యామెఁగూర్చియే యోచింతు వనుకొనెదను" అనుచుఁ జెల్లెలు లక్ష్మి యాతనికడ కరుదెంచెను. అప్పుడు లక్ష్మి ప్రసంగములోఁ జిన్నన్న యానందుఁ డిట లేకపోవుట మన యీ సమావేశము శోభ తఱిగియున్నది. నీవు వచ్చితివని, చిన్నవదిన (రాధ) కూడ మాతో సెలవులలో నిచ్చటికి వచ్చి కొన్నాళ్ళుండి యింటికి వెళ్ళిన దనియు, జరూరుగా నొకసారి వచ్చి మనతో నొకవార ముండవలసిన దని లేకున్న మఱి యెన్నఁ డాతనికి జాబే వ్రాయ నని నిష్ఠురముగ నిన్ననే యుత్తరము వ్రాసినాను. కావున రెండుమూఁడురోజులలో నిచ్చటికి రాకమానఁ" డని చెప్పెను. అందుపయి నాతఁడు "చెల్లీ! నీచిత్త మనురాగసాగరమమ్మా! ఆనందునకు నేనే యుత్తరము వ్రాయ నెంచితిని. కాని తీఱిక లేక వ్రాయనైతిని. అనవసరముగఁ గంగారుసెట్టి మీవదినెచిత్తమును గలంచినప్పటినుండి నామనసు చెడిపోయినది. పది మాసములనుండి యానందుఁ "డిదిగో వచ్చుచున్నాను. అదిగో వచ్చుచున్నా" నని యుత్తరములు వ్రాయుటయేగాని యొక్కసారి నాయొ

ద్దకు హైదరబాదు రాలేదు. పడితిలోఁ జిక్కువడి కొట్టుకొనెడిమొలుక వలె వాఁడు విశాఖపట్టణములో నామెడికలుకాలేజియందే యిడుకు చున్నాఁడమ్మా! ఇప్పుడు నీయుత్తరముమీఁదనైనను వచ్చు ననెడి నమ్మకము నాకు లేదు. దీనికేమిగాని రాధనైనను నాతఁడు మఱవలేదు గదా! ఆకస్మికముగ నే నిచ్చటికిఁ బ్రయాణమైవచ్చుటలో వాత్తేరు స్టేషనునందయిన నన్నుఁ గలిసికొమ్మని వానికి వ్రాయనైతిని. రాధ మీతో నిచ్చటికి వచ్చిన దని వినుట కానందమైనది. మనవారామె నుచితరీతి నాదరించిరి కదా" అని మాధవుఁడు మాఱువల్కెను. రాధ వినయసౌశీల్యములకు మిక్కిలి సంతసించి యమ్మయు నాన్నయు నామె నల్లారుముద్దుగ నాదరించి యామెను దీసికొనిపోవుటకుఁ గూర్మినాయఁ డేతెంచినపుడు గౌరవాదరములతో నామెను సాగనంపి రని లక్ష్మి నివేదించెను. "తల్లీ! శుభవార్త నెఱింగించితివి. రాధ నిటకుఁ గొనివచ్చిన మీయూహ యభినందనీయము. యోగ్యఫలము చేకూఱెను" అని మాధవుఁడు వచించుసంతలో సుభద్ర యట కేతెంచి "నాయనా! ఆదివ్యఫల మేది. ముచ్చటతో నా కిచ్చుటకుఁ దెచ్చితివే" అని సంభ్రమముతోఁ బ్రశ్నించెను. అందు కాతఁడు నవ్వి రాధానందులపరిణయ సాధనమున కిది మంచియవకాశముగా లభించిన దని యెంచి చెల్లికిఁ దనకు జరగినసంభాషణములో రాధ వారితో నిటకు వచ్చి మీప్రేమామృతము చూఱఁగొనె నని విని యామె నుద్దేశించియే యోగ్యఫలము చేకూఱె నంటిని. ఆఫలము నీవర్థించితివి. కాన రాధను నీవు చిన్నకోడలిగా గ్రహింపుము. నాబాధ తీఱును. సర్వము చక్కనగును. సువర్ణము వజ్రముతోఁ గూర్పుము" అని సవినయముగఁ దల్లికి విన్నవించెను. అందలిభావమును నామె చక్కఁగా గ్రహింపనేరక, మాధవునిపై మండి పడుచు నాతఁడు రాధనుగూడ గృహిణిగ గ్రహింప వాంఛించుచున్నాఁ డని యెన్నియో నిష్ఠురోక్తులు పలికి యాతనిమనము నొవ్వఁజేసెను. వీరి

సంభాషణముఁ జూచి లక్ష్మీమాలతులు నవ్విరి. మాధవుఁడు యథార్థ వృత్తమును జననికి నివేదించి శాంతింపఁజేసెను. రాధానందుల గాఢప్రణ యానురాగవృత్తాంతమును మాధవుఁడు, లక్ష్మి, మాలతి సుభద్రకుఁ జక్కఁగ వివరించి శాఖాభేదమును ద్రోసిరా జని వారిరువురివివాహము సంఘటింపఁజేయు మని యామెను బ్రార్థించిరి. ఆమెయుఁ బ్రసన్న చిత్తయై మగనితో నెల్లసంగతులు చెప్పి యాతనిఁగూడ నందు కంగీక రింపఁజేసెను. జననీజనకు లిందు కంగీకరించి యది నెఱవేర్ప దృఢసం కల్పు లయినప్పు డది సాగకపోదని మాధవుఁడు నిశ్చయించి రాధానం దులవివాహవిషయమునఁ దా నొందుమనోవ్యథ విడనాడెను. ఈశుభ వార్తను దెలుపుచు నానందునకుఁ జెటియొకలేఖను లక్ష్మియు మాధ వుఁడు లిఖించునంతలో వీథిలోనుండి పోస్టుజవానుపిలుపు వినవచ్చెను.

వా రది విని వీథియరుగుమీఁదికిం జన హైదరాబాదునుండి వచ్చిన రిజిష్టరుపార్సెలు నొకదానిని పోస్టుజవాను మాధవున కందిం చెను. అది విప్పిచూడ నందులో మధుకుమారి వ్రాసినయుత్తరమును మాధవుఁడు ప్రయాణమై వచ్చునపు డామెయు నాతఁడు కలిసితీయించు కొనిన చిత్రపటములు నుండెను. మధుకుమారి సౌజన్యముతో వ్రాసిన లేఖను సావధానముగ సాంతముగఁ జదువుఁ డని మాధవుఁడు వారి కం దించెను. వారు దానిని జదివియు నామె సంపినచిత్రపటములఁ బరికిం చియు మిగుల నానందించిరి. అంత మాలతి తన కంతకుమున్ను విశద ముగ వినుపింతునన్న యమ్మధుకుమారివృత్తాంతమును దమకందఱకుఁ దెలియఁబఱుపుఁ డని ప్రార్థించెను. అంత నాతఁడు సమగ్రముగ నామె చరితమును నివేదించి సహపాఠియు విద్యావతియు సమధికైశ్వర్యసంప న్నయు వదాన్యశీలయు నగు నామె తనతోడిస్నేహమును సహవాస మును నపేక్షించి తన్నాదరించుచున్నవిధము నెఱిఁగించెను. "జనవరి 10 తేది యామె జన్మదినము. అమ్మవ్రాసినలేఖపయి పండుగ కిచ్చుటకు

వచ్చుటచే నే నాయుత్సవమున కచ్చట నుండుట జరుగదయ్యెను. ఆమె కప్పటి కందునట్లు తొందరగా శుభాకాంక్షలతో నుత్తరము వ్రాసి పోస్టు చేయవలెను." అనునంతలో సుభద్ర తానుగూడ నామె నాశీర్వదించుచు లేఖ వ్రాసియిచ్చెద నన మాధవుం డట్లేకాని మ్మని యది మఱింతవాంఛ నీయ మనియుం జెప్పెను. లేఖ వ్రాసి తెచ్చెద నని సుభద్ర లోనికిం జనెను. ఈంటకలము, కాగితము, ఒత్తును దెచ్చిచెల్లెలులక్ష్మి యందీయ మాధవుఁడు భావస్ఫోరకముగ లేఖ వ్రాసి ముగించి యది చదివి మార్పు లేమయిన వలయుచో సూచింపు మని మాలతి కొసంగెను. అంతలో సుభద్ర తాను వ్రాసినలేఖను దెచ్చి చూపించెను. ఆరెంటిని జదివి మాలతి యొనర్చిన సూచనలతో మాధవుఁడు మరలఁ దనలేఖను సవరించి వ్రాయ మాలతి తనతిలకకుంకుమమును దీసి రెండులేఖలందుఁ గల మధుకుమారినామమున నద్దెను. అది కాంచి సుభద్ర యాడుగఱచెను. మాధవుఁడు మాలతిని గని "సుమంగళివిక మ్మని మధువును దీవించుచుంటివా" యనెను. విచలితాత్మయై సుభద్ర దేవతార్చనామందిరములోని కేఁగెను. అంత మాధవుఁడు రెండులేఖలను గలిపి చిరునామా వ్రాసి పోష్టుకు పంపెను. అందఱు మధును బరిపరివిధములఁ దలపోయుచు నానందమునం దోలలాడిరి.

సంక్రాంతిసెలవులకు మాధవుఁడు పుష్పపురికి వచ్చినవార్తను విని యాతనిమేనత్త రోహిణి (మాలతిజనని)యు నటకు వచ్చెను. అతఁ డామెను సభక్తికముగఁ బూజించెను. అనుజన్ములక్షేమాదికములనుగూర్చి మాలతి జనని బ్రశ్నించెను. ఆమెయుఁ గుమారిని గన్గొని ప్రేమపూర్వకముగ నశ్రులను రాల్చెను.

భాగ్యనగరమున మధుకుమారి మాధవవిరహావిహ్వల యయి బహువిధములఁ బరితపించుచు నాతనివిషయమై భావవీచికల నీఁదాడు చుండెను.

మాధవుని సోదరుఁడు ఆనందుఁడు తనయన్న సంక్రాంతి కింటికి వచ్చుచున్న సంగతి యెఱుంగకయే విశాఖపట్టణమునుండి మద్రాసు విద్యా విషయికపరిశీలనార్థము సహపాఠులతో నరిగి యటనుండి మాధవుని జూచి పోవుటకై హైదరబాద్‌నకుఁ బ్రయాణమయ్యెను. మాధవుఁ డంతకు మున్ను దనకు వ్రాసినలేఖలంబట్టి యాతనిచిరునామా యెఱిఁగియుంటఁ దిన్నఁగా మధునివాసమందిరమును జేరి తనపేరితో నొకచీటి వ్రాసి యొకపరిచారకునిచే లోనికిఁ బంపెను. పూర్వోక్తవిధమున మధు మాధవునిఁగూర్చి యాలోచనామగ్నయైయున్నసమయములోఁ బరిచారకుఁ డాచీటి నామెయెదుట నుంచెను. ఆమె యందలినామమును జూచి యపరిచితుఁ డైనయాయానందుఁ డెవరైయుండు నని వితర్కించి "ఇదిగో వచ్చెద. వారిని లోనికిం గొని యతిథిమందిరమున నిల్పు" మని సేవకు నాజ్ఞాపించెను. అంత నామె యద్దముదరి కేఁగి వేషమును సవరించుకొని యానూతనాగతుని దర్శింప నతిథిమందిరమున కేఁగెను. అతఁడు లేచి యభివందన మాచరించుచు నేదియో యవ్యక్తముగ గొణిగికొన నది యామె గ్రీఁగంటఁ గాంచి యుద్వేగము బయటికిఁ దోఁపనీయకయే తీయని పల్కులతో నాతనికి స్వాగత మొసంగి యచటిగంట మీటఁగాఁ జేటిక యొకతె యరుదెంచి యామెయెదుట నిలిచెను. మధు తనపయి నెలయించినదృష్టివలననే యామెభావమును గ్రహించి యాచేటిక వెంటనే రెండు కప్పులతేనీరమును దెచ్చి బల్లపై నుంచెను. మధు సగౌరవముగా దాని నొసంగ నానందుఁడు వినయమునఁ గైకొని యానందించెను. తేనీరము గ్రహించినయనంతరము చేటి పాత్రలను గొనిపోయెను.

అనంతరము మధు "అయ్యా! తా మెవరు? వచ్చిన పనియేమి?-సంశయింపక చెప్పుఁడు." అన నాతఁడు "అమ్మా! నూతనుఁడను. మీరు చూపిన యాదరణమున కెంతయుఁ గృతజ్ఞుఁడను. మీకు శ్రమ గూర్చినందుకు క్షమింపుఁడు. నామము లొక్కటియగుటచే భ్రమిం

చితిని. నాసన్నిహితుఁడు జాబులో వ్రాసిన చిరునామానుబట్టి యాతనిఁ జూచుట కిచ్చటి కేతెంచితిని" అని జేబునుండి జాబు నొకదానిని దీసి "మీ కభ్యంతరము లేనిచో దీనిని జూడవచ్చు" నని గౌరవభావముతో నామె కందిచ్చెను. మధు దానిని బరికించి "ఇందు మీరు భ్రమ ప్రమాదము లేమియు నొందలేదు. ఈ మీ సన్నిహితబంధువు నా మిత్రులే. ఆఱురోజులయి తల్లిగారిని జూడ వారియూరి కేఁగిరి. వా రిందు లేనిలోపము మీ కేమియు లేదు. ఇది మీయిల్లే. కృపాయత్తచిత్తులై నా మైత్రిని గణింపఁగోరెద" నని చెప్పుచు సేవకునిం జీరి వీరిసామానులు మాధవుఁ డుండుమందిరమునఁ జేర్పు మని నియోగించి "నేఁ డెందుండి మీ రిట కేతెంచినారు. ముందుగా నొకజాబు వ్రాసియున్నచో మీ కే క్లేశమయు లేకుండ స్టేషనుకే వచ్చి మిమ్ముఁ గలిసికొని నామందిరమునకుఁ గారులోఁ దోడ్కొనివచ్చియుందునే" అని యుగ్గడించెను.

అంత నాతఁడు తనవృత్తాంతము నామెకు నివేదించి తాను మాధవునకుఁ బినతల్లికొమరుఁడ ననియు, విశాఖపట్టణములో M. B., B. S., పరీక్షకుఁ జదువుచుంటి ననియు, రెండేండ్లనుండి విడియుండుటతప్ప మాధవుఁడుఁ దాను జిన్నతనమునుండి కలిసియే చదివితి మనియు, నొక్కతల్లిబిడ్డలవలెఁ దన పెద్దతల్లిపోషణమునఁ బెరిగితి మనియు, నన్నగారిని జూచుట కెన్నియోసారులు వచ్చుటకుఁ బ్రయత్నించి రాలేక పోతి ననియు, నాతఁ డిచ్చట బయలుదేఱిననాఁడే విశాఖపట్టణమునుండి మదరాసు బయలుదేఱి జాబు వ్రాసితి ననియుఁ, దనచిరునామాకు విశాఖపట్టణము వచ్చుజాబులు తనయన్నగారి C/O కు పంపించుఁడని పోష్టువారికిఁ దెలిపియుంటి ననియు, వానిగతి యేమయ్యెనో తెలియ దని పలుక నామె యాతని మాధవునినివాసమందిరములోనికిం గొనిపోయి "ఇది మీయన్నగారి నివాసమందిరము. వారి కరుదెంచినజాబు లిందుండును" అని యొకయఱయందలిజాబులను దీసి బల్లపై నుంచెను. అందులో

నానందునకు మాధవుఁడు లక్ష్మియుఁ బుష్పపురినుండి వ్రాసినలేఖలుఁ గూడ నుండెను. వానిని జదివికొని యాతఁ డమందానందము గాంచి తనయన్న తనవివాహసంబంధమునఁ గావించినకృషికిఁ గృతజ్ఞతను వ్యక్త పఱచుచు నాతనిగుణశీలవృత్తముల మధువునెదుట మిగులఁ బ్రశంసించి యాయుత్తరములను జూడుఁ డని యిచ్చి యామె కానందము కలిగించి యామెచరితమును వినవేఁడెద నని యుగ్గడించెను.

అంతలో మధుకుమారిపేర నరుదెంచిన నాఁటిజాబులను జేటి తెచ్చి బల్లపై నుంచ నామె యానందుని యనుమతితోఁ దనగది కేఁగి జాబులందు మాధవుఁడనిచినజాబు విచ్చి సోత్కంఠముగఁ జదివి హర్షించి యాతఁడు నాతనిజనని సుభద్రయు వ్రాసినలేఖలలోఁగూడఁ దనపేరిపైఁ గుంకుమ మలఁదియుండుటయు సుభద్ర తన్ను భావిభాగ్యామరరత్నము నాథునిఁగాఁ బడయ నాకాంక్షించి దీవించియుండుటయుఁ బరికించి యామె తన్నుద్దేశించి సుమంగళీత్వవాంఛ నట్టిలీలఁ గావించియుండు ననియు నామె కుమారు మాధవునిఁ దనధవునిగాఁ బడయుటకభిలషించియే యి ట్లామె యొనర్చె ననియు నూహించి "అపరమాతృస్వరూపిణి వగు నీయాజ్ఞఁ దలఁ దాల్తు" నని వచించుచు నాకుంకుమమును ఫాలమున నద్దికొనెను. అట్టితఱిఁ జెంతకు వచ్చినదాదిని గని మధు సిగ్గు నొంద నామె తనవద్ద సిగ్గుపడనేల యని వారించి నూతనాగతుఁ డయినయా నందు నుద్దేశించి "ప్రత్యేకమైన యతిథిసత్కృతు లవశ్యమా" యని మధును బ్రశ్నించెను. ఆమెయు "వారు సామాన్యస్నేహితులు గారు. మఱఁదిగారు. మాధవునిసోదరులు. మేము వాహ్యాళి పోవలయును. తగిన యేర్పాట్లు గావింపు" మని హెచ్చరించెను.

మధుకుమారి యానందునిఁ దనకారుపై వాహ్యాళికిం గొనిపోయి కొన్నిప్రదేశములఁ జూపి పిమ్మట హుస్సేనుసాగరతీరమున మున్ను మాధ వునితోడిసమావేశము గలిగినతావున కేఁగి "ఇచ్చట విశ్రమింతము.

బాగుగా జ్ఞాపక మున్నది. క్రిందటి ఏప్రియల్ తొమ్మిదవ తేదిని ఇచ్చటనే మీయన్నగారిని దర్శించి నాచరిత మాతని కెఱింగించుటయు వారు జాలిఁగొని నన్ను ననునయించి నాయాహ్వానము నంగీకరించి నాగృహమున కతిథిగా వచ్చి విందారగించుటయు నప్పటినుండియు నాప్రార్థనముపయి నామందిరముననే సహవాసిగా నెచ్చెలిగా నిల్చి నాయెడ నెనలేనివాత్సల్యము ప్రకటించుటయు జరుపుచున్నారు. అందుకు వారి కెంతయుఁ గృతజ్ఞనైయున్నాను" అని యావత్సంగతులు సాంతముగ నివేదించెను. అంత నానందుఁడు "అమ్మా! నాయన్నగారిహృదయ మాతనితోఁ జిరకాలము గలిసిమెలసియున్న నాకన్న మిన్నగ నెఱిఁగినవారు లేరు. అతఁడు పరమసాధుశీలుఁడు. దయార్ద్రహృదయుఁడు. మీ రాతఁ డభిలషించినప్రకార మాతనితో వారియింటికి వెళ్ళిన బాగుండెడిది. మా పెద్దమ్మ తద్దయు నాదరమ్మున మిమ్ముఁ గన్నకొమరితయుంబోలె నాదరించియుండును. ఆమెమధురస్వభావ మనన్యదుర్లభము. ఆమెతో నింటనున్న కన్యకామణులిరువురుఁగూడ మి మ్మెంతయు గారవించియుందురు." అని చెప్పెను. అందుపయి మధువు "అయ్యా! కన్య లిరువు రంటిరి. ఒక్కతె మీకు లేఖవ్రాసిన మీసహోదరి లక్ష్మి కావలయును. రెండవ యామె యెవరు?" అని ప్రశ్నింపఁగా నానందుఁడు "ఆమె మాయన్న మేనత్తకూఁతురు మాలతి. ఆమెనుగూడ మాపెద్దమ్మయే గారాబముతో బాల్యమునుండియుఁ బెంచి యామెయే మాయన్నకు గృహిణి కావలెనని మొదటినుండి యాదేశించినది. మాలతీమాధవు లనుపమాన మగు నన్యోన్యప్రణయానురాగములతోఁ గట్టువడి యున్నారు. లక్ష్మి మాచెల్లెలు. మాలతి నావదినె" అని స్పష్టపఱచెను.

అది విన్నంతనే మధుకుమారి హతాశయై నిర్విణ్ణ యయ్యెను. ఈ పదినెలలనుండి యామెను వేధించుచుండిన సంశయగ్రంధి విడిపోయెను. దానితో నామెగుండె వ్రీలిపోయెను. తా నెన్నిహావభావములు

వెలార్చినను దనహృదయమును గ్రహింపనట్లు మాధవుఁ డీన్నాళ్ళనుం డియుఁ దనయెడ నెచ్చెలిప్రేమముతో వర్తిల్లుటయేగాని యచంచల హృదయముతోఁ బ్రణయలీలలను లేశమయినఁ బ్రకటింపకుండుటకుఁ గలకారణ మామెకు సువ్యక్త మయ్యెను. వాతసంఘాతమునఁ గూలు నరఁటితరువువోలె నామె నేలపయిఁ బడి యానందునియెదుట మూర్ఛ మునింగెను. ఆతఁడు రిచ్చవడి యామెలనాఁగ తనయన్నయెడఁ బ్రేమ వాఁగునం దోఁగియుండె నని గ్రహించి ప్రమాదము ఘటిల్లినదే యని విచారించి తటుకున నామెను లేవనెత్తి వేదికాంతరమునఁ జేర్చి శైత్యో పచారము లొనర్చి సేద దేర్చెను. అంతఁ గొంతవడి కామె మూర్ఛఁ దేఱి లేచి "అయ్యా! మీ రన్యథా తలంప వలదు. స్వవిషయమునఁ జిక్కి బంధుమర్యాదల కెడ మైతిని. క్షమింపుఁడు. నామనమించుక విశ్రాంతినొందు టావశ్యకము. గృహోన్ముఖుల మగుదమా" యని వచింప నాతఁ డామెగంభీరవదనమును జూచి విచలితుఁ డయి దీప్తిమం తము లగు నామె కన్నులఁ జూడనోడి పురోగామియై చని యామెతోఁ గారునందుఁ గూర్చుండెను. ఇరువురును మధుగృహంబును జేరునప్పటికి నతిథిమందిరంబున మధు వంతకుమున్ను నియోగించినప్రకారము విశాల మొనర్చి (Enlargement) తెచ్చిన మాధవుని చిత్రపటముతో చిత్ర కారుఁడు వేచియుండెను. ఆమె యతని నుచితరీతిని సత్కరించి పంపి యాచిత్రపటము నానందునకుఁ జూపి "మీదృష్టి నిది నిషిద్ధంబగు నేమో! కాని యనాఘ్రాతకుసుమమున కర్పించుకొను స్వాతంత్ర్యము జన్మసిద్ధము. దాని నెవ్వరు వారింపఁజాలరు. ఏకలవ్యుని శస్త్రగురుని చిత్రంబు వోలె నా కిదియే మార్గోపదేష్టయై తరింపఁజేయఁగలదు." అని శుష్కహాస మొండు పఱపి పరిచారకులచేత దాసని దన శయన మందిరమున నుచితస్థలమ్మున నలంకరింపఁజేసెను. నివురుగప్పిన నిప్పువోలె మదిలో మఱుగుచున్నవ్యథ నణంచి వినయవర్తనముతో నామె యానం దుని కర్హరీతుల నాతిథేయ మొసఁగెను.

ఆమూల మెఱింగినకొలఁది నామెచరిత మద్భుతముగా నున్న దని యాతఁడు తలంచి గుణమణియగు నామె భామాహృదయమునకు గీటుఱాయి యని భావించెను. బహువిధవినోదవిచిత్రభాషణముల నాతఁడామె నలరింపఁ బ్రయత్నించెను; గాని లేశము ఫలము కలుగలేదు. క్రమక్రమముగ నామె యున్మాదినిగ మాఱిపోవుచున్నట్టు లాతనికిఁ బొడకట్టెను. ఈ చెట్టకంతటికిని దానే కారణమైతిని గదా యని వెత నొంది యందుకుఁ దరణోపాయ మెఱుంగక మాధవుఁడే దీనిని జక్కపఱుపఁ గలఁ డని తంత్రీవార్తమూలమున రప్పించుటయే కర్తవ్య మని నిశ్చయించి యారాత్రి నెట్లో శయనమందిరమున వేగించి మఱునాఁటియుదయముననే పరిచారకునిచేత టెలిగ్రామును పోస్టాఫీసుకుఁ బంపెను. అతఁడు వచ్చువఱకుఁ దా నచ్చట నుండుట యోగ్యము కాదని భావించి టెలిగ్రాము చూచి యెంతత్వరగా బయలుదేఱినను మఱునాఁటిమెయిల్ లోఁగాని యాతఁడు రాఁజాలఁ డని యెంచి తాను వెంటనే బయలుదేఱి పోయి దారిలో సామర్లకోటస్టేషనులో నాతనిని గలిసికొని స్వయముగ నెల్లసంగతుల నాతనికి నివేదింతు నని నిశ్చయించుకొని మధుకుమారికిఁ బలు తెఱంగుల నూఱటవాక్యములఁ బలికి యనురక్తనేత్ర యైనయామెకుఁ బ్రణతి యొనర్చి సెలవుఁ గయికొని వెడలిపోయెను.

పుష్పపురిలో మాధవుఁడు మధుజన్మదినము జనవరి పది యగుట నామెయారోగ్యకల్యాణముల నాకాంక్షించి దైవప్రార్థనమొనర్చి మాలతీప్రేరితుఁడై మధుకుమారికి శుభాకాంక్షలు వెలార్చుపద్దియములు కొన్ని వ్రాసి మాలతికిఁ బరిశీలనార్థమొసంగ వాని నామె పఠించుచు సూచనలొనర్చుసమయమున నానందుఁ డంపినతంతివార్త యందెను. తాను బుష్పపురికి వచ్చుట తెలియక యానందుఁడు తన్నుఁ జూడ హైదరబాదున కేఁగియుండు ననియు, నమృతమైత్రిస్వరూపిణి యైనమధు వార్తఁ జిక్కుట సహింపనేరక తన కీతంతి నిచ్చియుండు ననియుఁ, దన్ను వెంటనే

రమ్మని వ్రాయుటచే నామెయాపద మిక్కుటమైయుండుననియు మాధవుఁడు వలుక నందఱుఁ బరిపరివిధముల విచారించి యాతఁడు వెంటనే వెడలుటయే కర్తవ్య మని నిశ్చయ మొనర్చిరి. ట్రెయినుమీఁదఁ బయనించుటకన్న భువనేశ్వరమునుండి విమాన ముదయముననే హైదరబాద్ నకుఁ బోవుదినము మఱునాఁడేకావున దానిమీఁదఁ బోవుట యుచిత మని లక్ష్మి సలహా యిచ్చెను. అందు కందఱు నంగీకరించిరి. మాలతీ మాధవులు తాము మఱికొన్ని నాళులు విలాసముతో నుండుటకు భంగ కరముగఁ గలిగిన యీఘటన కెంతయుఁ జింతిల్లిరి. మాలతి హృదయ యము చిక్కఁబట్టి దుర్భరకష్టాత్మమైయున్న మదీయసోదరికి మీకల్యాణ హస్తంబు సంప్రాప్తింపఁజేసి యాదుకొనుటయే పరమకర్తవ్య మని మహౌదార్యముతోఁ బలికి సత్వరముగఁ బ్రయాణింపుఁ డని మాధవుని హెచ్చరించి యాతనిసామానులను సర్దెను. మధుకుశలవార్తను వెంటనే తెలియఁబఱుపుఁ డని ప్రార్థించెను. అతికష్టముమీఁద నామెను వీడి మాధవుఁడు ప్రయాణమై విమానముమీఁద హైదరబాద్ చేరెను. ఇందువలన నానందుఁ డాశించినట్లు సామర్లకోటలోఁ గలిసికొనుట పడలేదు.

ఆనందుఁడు వెడలినంతనే యంతకుమున్ను చిక్కఁబట్టియుంచిన మధుకుమారిహృదయము కట్ట తెగినయేఱువలెఁ జెలరేగి యామెను దుస్సహార్తిలో ముంచివైచెను. అంత నామె దురంతవేదనం బొగిలి కష్టము లనుభవించుటకే యవతరించిన తన కీలోకమున సుఖము సున్న యని, విశుద్ధచరిత్ర యగుసోదరి మాలతిసుఖంబున కంతరాయముగఁ దాను మనఁజాల నని, యిరువదిరెండేండ్లు నిండకమున్నె నాఁటిజన్మదిన తిథినే మరణదినతిథినిగూడఁ దనకు విధి కూర్చియున్నాఁడని, యాత్మహత్య గావించుకొన నిశ్చయించుకొని తనస్థిరచరాస్తు లన్నియు మాధవునకుఁ జెందునట్లు మరణశాసనము లిఖించి యందు వ్రాలు చేసి వేఱుగా

మాధవునిపేర నొకలేఖ లిఖించి "అస్మదగ్రజాత యైనమాలతి చిరసౌఖ్య మొంద నేను శాంతిఁ గందు, నామె కిడుము నాప్రణామంబు లందించుఁ; డీయభాగ్యచిత్త మెఱఁగి మీరు" "త్వత్పదాంకితఁ దమసౌఖ్యభంగమొంచి, తప్పుకొనుచుంటిఁ జివరిప్రార్థనము నొకటి, త్రోసిపుచ్చక నన్ను సంతోష పఱుపఁ, బ్రాణనాయక ! యొడఁబడవలయు మీరు." "నాతనువుఁ జిత్తమును మీ మ్మనారతంబుఁ, గోరి తపియించి నశియించెఁ గొదవ యున్న, మరణశాసనమును దృఢీకరణ సల్పి, కనుభవింపుఁడు దివి సుఖ మంద నేను." అనువాక్యములతో ముగించి కనుల నశ్రుధారలు గురియ వ్రాయ లేక తుదను వ్రాలు చేయునంతలోఁ దనశిరముపయి జలజల రాలుకన్నీటిచే నామెయొడలు దెలిసి మొగ మెత్తి చూచునంతలో మాధవుఁ డామెమ్రోలఁ గవనయ్యెను. అతనిఁ గాంచి యామె కలఁ గాంచినలీలఁ దలంచి "వంచకత్వము వహించుట మేలె" యటంచుఁ గేలు కీలించి విఖుంచితాంగముతోఁ జలింపఁదొడంగెను. ఆమెవిభ్రమస్థితిని విలోకించి విషణ్ణుఁడై యాతఁ డంతఁ దాను యథార్థముగ మాధవుఁడనే యనియుఁ దమ్ముఁ డానందుఁడు పంపిన టెలిగ్రాముపయి విమానముమీఁద బయలుదేఱి వచ్చితి నని యింతలో నామెయిట్లు చిత్తవిభ్రమ మొందఁ గారణ మేమని యడుగుచు నామెను దనచేతితో లేవనెత్తెను. అమెయు మొగము చెంగలింప నాతనిఁ గనుంగొని నిరంకుశముగ రాగము ముమ్మరమయి శంకలనెల్లఁ గాలితో రాచివైవ మోహ మాఁపఁజాలక ప్రియ మార బిగ్గఁ గవుంగిలించెను.

"గుట్టలు మిట్టలున్ నదులుఁ గొండలుఁ గాఱడవుల్ పురంబులున్
బట్టలు చెట్టులుం గడచి బాలకునై ప్రియ ! ఔక్క లక్కటా !
యిట్టులు కట్టుకొంచుఁ గృప నేటికి వచ్చితివయ్య ! చావుకై
పుట్టినకట్టెపై మరల మోహముఁ గూర్చితి వేమి సల్పఁగన్-"

అని వచింప నామెస్థితిని జూచి మిగుల వెఱఁ గంది మాధవుఁ డామె యున్మాదమును జెందియుండు నని తలంచి వ్యగ్రచిత్తుఁ డయి యామెను సోఫాపయిఁ జేర్చి తనయుత్సంగమున నామెమస్తకంబును స్నేహంబునఁ జేర్చి కన్నుఁగవ నొత్తి, మోమును గారామునఁ దుడిచి ముంగురులు దిద్ది శోకచిత్తుఁ డయి యెలుఁగు రాల్పక నామె యిట్టిదుస్థితికి లోనగుటకుఁ గారణమేమియో తెలుపవేయని, స్త్రీకులాభరణ మైన యామెను బ్రాణ మిడినైనఁ గాపాడ నెంచిన తన బాసల నెఱింగియు నిజ హృదయము విశద మొనర్పక యిట్లు లోలోనఁ గుమిలి తెవులునొందుట తనయెడ నిర్దయతో వర్తించుట కాదే యని, "ఆనందుఁ డెప్పు డిచ్చటికి వచ్చెను. నాకుఁ దంతి నంపి నిన్నిస్థితిలో విడిచి యెందేఁగెను. నీ కీయున్మాద మెట్లువాటిల్లెను. మదిని జిక్కఁబట్టి యన్ని సంగతులఁ దెలిపి నా కూఱటఁ గలిగింపవే" యని బొటబొటఁ గన్నీరు గార్చుచు సానుతాపముగఁ బ్రశ్నించెను.

ఆతనియుపచారములచే నించుక కలఁతఁదేఱిన యామె తన్ను రక్షింప నేఁగుదెంచిన సదయాత్ముని కాతిథ్య మొసంగక కలఁతఁ గలిగించి తా నెంతకలుషాత్మ నయితి నని విచారించి తటుకున లేచి నిల్చి చీరకొంగుతో మాధవునికన్నుల నొత్తి మొగంబుఁ దుడిచి "నాథా! మీచరణకమలము లంటుటవలననే నాసంకట మడంగినది. మీ కార్తిఁ గలిగించిన యీకుటిలపైఁ గోప మూనకుఁడు. మీయశ్రులు నాశిరమున రాలినపుడే నాయున్మాద మడఁగినది. మీసోదరుఁడు మద్రాసు పోయి తిరిగివచ్చుటలో మిమ్ము దర్శింప మొన్న నేతెంచి యీనాఁటిప్రాతఃకాలమే వెడలిపోయెను. నాతోఁ జెప్పకయే యాతఁడు మీకు తంతి నిచ్చెనుగాఁబోలు. ఇంతకుఁ గడచి గట్టెక్కిన ప్రమాదవిషయముతో నిప్పుడు పనియేమి? తొలుత స్నానపానము లొనర్చి తరువాత నావిషయములనెల్ల బ్రసంగించుకొనవచ్చును. దుసులు మార్చి స్నానము

గావింపుఁడు". అని చెప్పుచు మాధవునిచరణసన్నిధి నాసీనయై కాలిజోడున్ద్రొడు విప్పఁదొడంగెను. "ఇదియేమి నీయున్మాదచర్యలలో నిదియొకటియా" యని యాతఁడు వారించినను వినక యామె "నన్ను వారింపకుఁడు. నిర్బాధకము లగు నిట్టిచర్యల వారించెడిచో. నున్మాదము వృద్ధికాఁగలదు గాని తగ్గనేరదు" అనుచు నాపనిని ముగించెను. అంత మాధవుఁ డామెకన్నులలోనికిఁ జూచుచు "ఉద్వేగినీ! నే నరుదెంచు నప్పటి కేదియో లిఖించుచుంటివే. అది యేమి" అనిన నామె "లేఖ. తమకే." అని చెప్ప మాధవుఁడు నవ్వుచు "నీపిచ్చివ్రాఁతలఁ జూడ నిత్తువా" యనెను. "ఇప్పుడు కాదు. నే ననుమతించువఱకుఁ జూడ రాదు. మీయొద్దనే యుంచుకొనుఁడు. అనుమతిఁ గొనుటమాత్రము మఱవవలదు" అనుచు నాలేఖను మరణశాసనమునుగూడ నామె తన చేతితో నాతనిజేబునం దుంచెను. "అట్లేకానిమ్ము. దుస్తులు దీసి వచ్చెద" నని మాధవుఁడు గదిలోని కేఁగ నాతని ననుగమించి మధు వాతఁడు దీసివైచిన కోటుజేబు లన్నియుఁ దడివి యందున్నపైకమును దాళపుఁ జెవులగుత్తియు నొకచిన్నపొట్లమును గని విస్మయంబున నపొట్లముఁ దీసి "ఇదియేమి. నాకై సంజీవని దెచ్చితిరా!" అని పల్క మాధవుఁడు చకితుఁడై దానిని గ్రహించి విప్పఁగా నందుఁ గుంకుమము గనవచ్చెను. అది మాలతిచర్యగాఁ దలపోసి మాధవుఁడు "ఔను. మధూ! నిక్కముగ నిది సంజీవనియే. నిత్యసుమంగళీత్వముఁ జిరంజీవత్వము నర్థించి నీకయి తెచ్చిన పరమసంజీవనియే" అనుచుఁ జూప నామె పరవశయై "మీ రెంత యుదారులు. మీపవిత్రహస్తములతోడనే యీపునర్జన్మదినమున నాకు సుమంగళీత్వమును బ్రసాదింపుఁడు" అని పలుక నామెయింగిత మెఱిఁగి "అమరమూర్తియై నామధు నిత్యసుమంగళీత్వమున నలరారుఁగాక!" అని యాశీర్వదించి తిలకము నామెయలికమున నుంప నామె యానంద బాష్పములతో నాతనికిఁ బాదాభివందన మొనర్చెను.

మధుకుమారి యొనర్చినయర్ఘ్యసపర్యలవలనఁ గావించిన మంజులాలాపములమూలమున నామెచిత్తము సంకటరహిత మైనదని నిశ్చయించి మాధవుఁడును గలకదేటి శాంతచిత్తుఁ డయ్యెను. అనంతరము వారు మధుమధురాలాపముల వివిధప్రసంగములఁ బ్రవర్తింప నామెయందలిపరిణామమును గని సంతసించి మాధవుఁ డాస్థితిలో నామెకుఁ గలిగిన యున్మాదహేతువును విచారింపఁ బూనినఁ బుండుపైఁ గారముచల్లినట్లగునని బాగుగఁ దేఱినపిమ్మట నామెయే వానిని దెల్పుననియు నాగొడవ మరల నెత్తకుండుటయే యామెసత్వరచిత్తశాంతి కను వగుననియు నిశ్చయించి మాధవుఁ డామెతో మునుపటివలెఁ జనవుతో మెలఁగుచుఁ గాలక్షేప మొనర్చుచుండెను. యథేచ్ఛాలాపములఁ గడపుతరుణమున మధుకుమారి మాధవునిహస్తమును జేతఁ బట్టి యందలిరేఖలను లెస్సగాఁ బరీక్షించి యాతనికి ద్వికళత్రయోగ మున్నట్లు గ్రహించి నిష్కల్మషహృదయుఁ డగు నీసహృదయున కిట్టియోగ మేలకలిగె నని విచారమగ్నయై తా నదృష్టశాలినైనచో నెన్నఁటికైన నాతనిఁ బతిగా సేవించుభాగ్యము కలుగవచ్చు ననియుఁ జావ నుంకించిన తనకు మరణముఁ దప్పించినవిధిసంకల్పము తన కట్టిసుఖమును గూర్చుటకే యైయుండునేమో యనియుఁ జచ్చిసాధించున దేమియు లేమిచేఁ గాలమును వేచిచూచుటయే వివేకలక్షణ మనియు నిదియు నొకమేలునకే యొదవియుండు ననియుఁ బరిపరి విధముల లోలోనఁ దలపోయఁదొడఁగెను.

ఆమెను జూచి మాధవుఁడు "సాముద్రికశాస్త్రమును నీవు బాగుగా నభ్యసించినట్లున్నదే. నాహస్తరేఖలలో నేమున్నది. భావిఫలములు నెఱిఁగింపుము" అని పల్కెను. "స్వామీ! ఎగతాళి కాదు. మగవారు నమ్మకపోవచ్చును గాని నా కాశాస్త్రమునందు నమ్మక మున్నది. సాక్ష్యముగ నగణితము లగుప్రమాణములను గ్రంథములను జూపఁగలను"

విచారించి ఫలములను దెలియఁజేయుము. సత్యమేయగునేని నిశ్చయ ముగ నీకుఁ బారితోషిక మొసంగఁగలను" అని ప్రత్యుత్తర మిచ్చెను. "మీకు లలితకళాభిలాషయుఁ గళాకుశలత్వమును మెండు. ఆయుర్దా యము డెబ్బదేఁడులు. ప్రణయజీవనులు. కొల్లలుగ స్త్రీధనముఁ గూర్చు కొందురు. కోమలులను నిద్దఱ భార్యలుగాఁ గైకొనెదరు. ఒక్కకొమ రుఁడు, ఇరువురుకూఁతులు మీసంతానము. ఇవి ముఖ్యముగా మీ హస్తరేఖలవలన గోచరించు ఫలములు. ఇవి సత్యము లనుటకు గ్రంథ ములందుఁ బ్రమాణములను జూపెదను. విలోకించుఁడు" అని చెప్పుచు గ్రంథములను దెచ్చి యాతనియెదుట నుంచెను. వాని నాతఁడు సవిమర్శముగఁ బరీక్షించి "నీవు పల్కినవెల్ల శాస్త్రాధారములఁబట్టి సత్య ములుగనే తోఁచుచున్నవి" అని యుత్సాహవిషాదములు రెండునుగూడఁ బెనంగొన నుద్విగ్నమనస్కుఁడై "ఏది! నీకరమునుగూడఁ జూపుము" అనునంతలో మధు వాతనిమనోవికారమును గుర్తించి యతని నాశ్వా సించుతలంపుతో నిట్లనియె. "స్వామీ! మీ రిమ్మలంచినవిషయ మేదియో యెఱుంగఁజాలకున్నాను. చెడ్డను మీ కేమియు నేను చెప్పలేదే. ద్వికళత్రయోగహేతువే మీకుఁ జింతాజనక మయియుండవచ్చును. అది పురాకృతమే యైనచో నెవ్వరు తప్పింపఁగలరు? అందుకు వంత నొందుట వలన ఫల మేమి" అని పలుక నాతఁడు మ్లానవదనుఁ డయి యుస్సు రని యూర్చుటం గాంచి మధుకుమారి "స్వామీ! ఇదియేమి. మానస స్వాస్థ్య మెడలి చిన్నఁబోతిరే" అని డగ్గుత్తికతోఁ బలుక మాధవుఁడు "మధూ! నీ వెంతయు నదృష్టశాలినివి. ప్రేమాబ్ధిలోఁ జిక్కి తన్మూలక మయినవంతలకు లోనగు గతి నీకు లేదయ్యె. ఇట్లు నీ వెన్నాళ్ళయినను గాలముఁ బోఁద్రోయనగును. నిక్క మాలోచింపఁ బ్రేమజీవి నిర్భా గ్యుఁడే యగును. నితాంతవ్యథయే ప్రేమకు ఫల మగును" అని చిన్న నాఁటినుండి తనకు మాలతికిఁ గలిగినప్రణయప్రేమలఁగూర్చి యెఱిఁగించి

"మాలతి మాన్యచరిత. మానహాంగన యనరాదు. జన్మ గన్న దేవ సంభవి యనఁ జెల్లును. నీచరిత్ర నావలన విని యామె యశ్రులు రాల్చి నిజసోదరిగా నిన్ను సంభావించెను. నేను మాయమ్మ నీపేర వ్రాసినజాబు ళలో నీకు సుమంగళీత్వము నర్థించుచు నీపేరిపయిఁ దనతిలకము నలందిన దియు, మొన్న నాజేబునుండి నీవు తీసినపొట్లములో నాకుఁ దెలియకుండఁ గనే కుంకుమ మిడినదియు నామెయే. సర్వమంగళాదేవిని బూజించి సకలశుభములు గలుగఁ బ్రసాదముగా నది నీ కామె పంపినది. ఆసుగు ణాఢ్యనే యిహలోకజీవితమునకయి నే నింతకుముందు పత్నిగా నెంచి తిని. మా జననియానతికూడ నదియేకావున నామెను విడిచి మఱొక తెను భార్యగా నేను గైకొననేర. నీవు సాముద్రికశాస్త్రపరిజ్ఞానమున నిపుడు చెప్పినమాటలవలన విధిచెయిదము మఱొకరీతి నున్నట్లు తెలి యుటచే మనము బ్రీలినది. ఇంతకు నిది మనచేతులఁ గలకార్యమా! విధివ్రాసినవ్రాలు తప్పింప నేరితరము. కావున నీకయినను బ్రేమ యుద యింపకుండుటే క్షేమము. అది సంచితఫలమువలన జనించినచో నెగుడు దిగుడులు లేక నిత్యము నీ కగణితశుభదాయక మగుఁగాక యని యాకాంక్షింతును." అనఁగా నామె శోకరుద్ధగళయై "స్వామీ! నాప్రేమసర్వస్వము నీకే యర్పించియుండు టెఱుంగవే. ప్రేమసిద్ధిఁ గన దయామూర్తివై నన్నాశీర్వదింపుము. ఎన్నాళ్ళయినను వేచియుందును. మాఱుమనువు వీదుఃఖాత్మకు లేకుండఁ బోఁద్రోయుము" అని వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఆమెయార్తిఁ గాంచి మోర్వఁజాల కాతఁ డశ్రువులు రాల్చెను. అది చూచి సహింపఁజాలక యామెయు నించుకదూర మేఁగి "నాజననమే దోషదూషితము. దానిని సైఁపఁగనేరను. మీజేబులో నునిచిన నాలేఖను విప్పి చదువుకొనుఁడు" అని తత్తఱముతో నడుగులు తడఁబడ బిరాన తనగదిలోనికిం బోయి పలువిధములఁ బనవుచు వచ్చట నేడ్వఁదొడంగెను. వ్యథభారము కొంత శమింప నామె వెక్కుచుఁ దనన్నా

రార్ప గదిలోని కేతెంచిన మాధవునిపాదద్వంద్వమును బాహువులతోఁ బట్టి "ప్రభూ! కరుణార్ద్రచిత్తముతో నన్ను క్షమింపుఁడు. మీ రిట్లు విన్నఁబోయియుండుట నేను చూడలేను. ఏక్రియచే నేను మీకు భావిని సౌఖ్యమును గూర్పఁగలనో సెలవిండు. మీసౌఖ్యమునకు భంగము కలుగకుండుటయే నాకును వాంఛనీయము" అను నామెను మాధవుఁ డాకులచిత్తముతో రెండుచేతులతో లేవనెత్తి కనులు తుడిచి యాసన మునఁ జేర్చి గద్గదికతో నిట్లు లోఁదార్పఁగడఁగెను.

"చెలీ! యిన్నాళ్ళు నీచిత్త మిదమిత్థముగ నే నెఱుంగకుండుట వలన నిట్టిచెట్ట లేర్పడినవి. నానేరమును మన్నింప వేఁడెద. నాసౌఖ్యమునకుఁ బ్రణయమునకు నంతరాయము గూర్పకుండుటయే నీకు యోగ్యమగును. నీవు నాకు నీయాత్మసమర్పణ మొనర్పకపూర్వ మొక్కదోష మొనరించితివి. నీప్రేమను ముందుగాఁ దెలిపి యందుకుఁ గలసాధకబాధకములను నాయాదరానాదరములు తెలిసికొనక యిపు డిట్టిసాహసము లొనర్చుట యుచితము కాదు. ఏదికాంక్షించి నీవు మరణింపనెంచితివో యాసుఖము జీవితమునం దబ్బక నేను వనట మునుంగుట కృపాసింధు వగుపరమేశ్వరుఁడు సకాలమునకు న న్నిటకుఁ దెచ్చి తప్పించెను. అట్లు గాక నీసాహసకృత్యమే నెఱవేఱినచో నీమేనితో నామేనుగూడ నప్పుడే వహ్నిలో దగ్ధ మయిపోక నిల్చియుండునా?" యని సోద్వేగమున నాక్రోశించుచు వచించెను. అప్పుడు మధు చేతితో నాతనినోటిని మూసి "స్వామీ! ఇట్టియశ్లీలములు నే వినఁజాలను. నాయపచారమును సైరింపుఁడు. నేను కొఱవితోఁ దల గోకికొను కూళ నైతిని" అని పల్కెను. అంత నాతఁడు "మధూ! నీప్రేమ యకలుషితమైనది. నీవు నాయెడ ననురాగాన్వితవే యైనచో సంతసమున నాతో నొకబాస యొనర్ప వేఁడెద. మఱిమాన్యము లేమియు నిమ్మని నేఁ గోరను. ఎన్నఁడు నిఁక నాత్మహత్యకు నిచ్చగింప నని నామీఁద నొట్టుపెట్టుకొని బాస చేయు

మనియే నేఁ గోరునది." అన నామె "ఆర్యా! ఏల మీ కిట్టియను మానము. ఆత్మేశునపై నాన నిడి యెన్నఁడైన నేస్త్రీయైన బాస చేసియుం డెనా? అట్లు బాసచేయు మని కోరంబడెనా? ఇట్టి లన్యాయంబుగ నన్నుఁగూర్చి భాషింపఁ దగునా? నన్ను మిథ్యాభాషిగాఁ దలంపకుఁడు. ఆత్మహత్యకుఁ బాల్పడ్డచో నేను ధర్మగతిని దప్పినదాన నగుదును. అట్టి పనికిఁ బూన నని ధారుణియు సూర్యచంద్రులు స్వర్గస్థు లయిన నాజననీ జనకులు సాక్షులుగాఁ బ్రమాణము చేయుచున్నాను. మీయనుమాన మింకనైనఁ దీఱెనా? మీసోదరుఁ డానందుఁడు ప్రసంగవశమున దివ్య ప్రేమమయస్వరూపిణియు మదీయారాధ్యయు నగు భవత్ప్రాణనాయకి మాలతి విమలప్రేమనుగూర్చి ప్రసంగించుటంజేసి మతి చెడి నేను గావిం చిన యాదుష్కృత్యమునుబట్టి ప్రపంచమునే వీడఁదలంచిన యవిశ్వాసి నిగా నన్ను భావింపకుందురుగాక యని ప్రార్థింతును" అనెను.

అంత మాధవుఁ డామెచుబుకమును బుణికి గండపాళికల నిమిరి యామెకన్నులలోనికిఁ జూచి "చెలీ! ని న్నవిశ్వాసినిగాఁ దలపోసినచో నాకుఁ బుట్టుగతు లుండునే. అట్టి వెఱ్ఱిగా నన్నుఁ దలంపకుము. పరమే శ్వరుఁ డమూల్యమగు నీజీవితమును వ్యర్థముగా నొసంగెనని నీవు భావిం చుట నీయుద్వేగదోషము. లోకహితమును గోరియే ని న్నాతఁడు సృజిం చెను. విద్యావతివి, ఐశ్వర్యసంపన్నవు, విజ్ఞానధురీణవు, వదాన్యశీలవు నగు నీవు పరమేశ్వరసంకల్పమునకు భిన్నముగా నాత్మహననమునకుఁ బాల్పడెదవేని నీవు సాధించుప్రయోజనములు శూన్యమగుట యటుండఁ బెక్కుదోషములకు గుఱి కాఁగలవు. అవి (1) జగత్పితయాజ్ఞాతిక్రమ ణము. (2) నిర్దోషయు, నీచిరసౌభాగ్యకాంక్షిణియు, నింతదనుక నీముక్త మెుగ మెఱుంగకున్నను ని న్నకలుషప్రేమముమెయి నిజసోదరిగా భావిం పఁగలిగిన యమాయికహృదయ యగు మాలతీప్రణయజీవితమున విషము చిల్కుట. (3) నీదుఃఖవిముక్తికై దృఢసంకల్పుఁడ నయి నీసౌఖ్యసౌభా

గ్యములకయి కలలు గాంచు నాత్మబంధుని స న్నారనిదుఃఖాగ్నికీలలలోఁ గూలనేయుట. (4) కోరికలు తీఱక, హృదయవేదన లారక, జీవితము ముగియక, పునర్జన్మమునకుఁ గాలపరిపక్వము గాకయున్నదశలో నాత్మహనన మొనర్చుకొనుటవలన మానవాకారము నశించి ప్రేతరూపిణివై సూక్ష్మశరీరమున నాక్రోశించుచు దురంతము లగు నారకయాతనలకు లోనగుట. ఒక్కయవిచారదోషమునం జేసి యిట్టి లెన్ని పాతకములను యాతనలను నీ వనుభవింపవలసియుండునో లెస్సగా నాలోచింపుము. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అని శ్రీకృష్ణభగవానుఁడు కర్తవ్యనిర్వాహణవిముఖుఁ డయినపార్థునకు బోధించిన పరమసూక్తి నెఱుంగవా? నిష్కామబుద్ధితో నీకార్యముల నెఱవేర్చుచు జీవితమును సాగించుచో వాస్తవికానందసౌఖ్యముల నందఁగలవు. నేను నిన్నుఁ బ్రేమింపలే దని బాధ నొందెదవా? నీ కాసంశయము వలదు. నీవు నన్నుఁ బ్రేమించితివి. ప్రభునిగాఁ బరమహితైషిగా సేవించి మానసికముగా నారాధించితివి. సర్వస్వ మర్పించితివి. అట్లయ్యు నెందుచేత నీ కీయసంతృప్తి గలుగుచున్నదో యోచింపుము. దానికి మూలము కామము. క్షణికమగు లైంగికసుఖముల నాతోఁ బడయనెంచుటయే. ఇట్టి యల్పప్రయోజనార్థివై నీయమూల్యజీవితమును బలివెట్టనూహించుట యవివేకము గాదా! ఒకవేళ నాయెడ నీ వాశించిన యట్టిప్రేమ సిద్ధించిన దేయనుకొనుము. ప్రపంచమున మనము భార్యాభర్తలుగనే స్థిరపడితి మనుకొనుము. కామవాసనలను రగుల్కొల్పు నా యీదేహము దైవికముగ రోగగ్రస్తమై తాఁకరానిదై యభోగ్య మగునెడల నప్పు డేమిచేయుదువు? మరణింతువా? నీకామతృప్తి నెట్లు పడయఁగలవు?" అని యాతఁడు సోద్వేగమున నుపన్యసించి జలజలఁ గన్నీళ్ళు గార్పు మధువు "స్వామీ! మన్నించుఁడు. మీనోట నిట్టివాక్యముల రానీయకుఁడు. మీహృదయ మింత పాషాణమా!" అని వలవల నేడువసాగెను. మాధవుఁ డామెమొగ

మును దనయెదపయిఁ జేర్చి యాశ్వాసించుచు "మధూ! నన్నుఁ బరిశీలించుచుంటివా? నాహృదయసంఘర్షణమును నీవే వినుము" అని పలుకుచు నావేగముతో సోఫాపయి స్మృతివిహీనుఁడయి పడిపోయెను. అంత నామె విచలితయై "కట్టా! వివేకదూరనై యెట్టిచేట్టఁ గూర్చితిని. ఏమి దిక్కు" అని భయవిహ్వలయై యార్తయై నిటునటుఁ దిరుగాడుచుఁ బలుమాఱు ఘంటిక మీఁట నొక్కి "జలము! జలము" అని బిగ్గఱగా నార్చెను.

ఆపిలుపు విని దాసి సత్వరముగఁ గొనితెచ్చిననీరములఁ గొని దాసిని బొమ్మని యామె యంత మాధవునిశిరమును నొడియం దిడుకొని జలము చిలికి మోసులుగొన్న ప్రేమముతో మోమును బయ్యెద నొత్తుచుఁ జీరచెఱంగుతో విసరుచు సేదదీఱినయనంతర మాతని సాంద్ర ప్రేమతో నీక్షించుచు "స్వామీ! పాతకి నీదాసిని క్షమింపుఁడు. మీకు దురంత మగువంతను గూర్చినదోషిని. కామాయత్తచిత్తముతోఁ బైశాచికవృత్తినై మిమ్మిట్టిస్థితికి లోనుజేసి యాభీలార్తినిమగ్ననైతిని. మీవాక్యామృతముచే నాచిత్తకాలుష్య మడఁగి విజ్ఞానోదయమైనది. నేనింక నాకామమోహములఁ బోద్రోలి నిష్కామబుద్ధితోనే మీయది వ్యాఘ్రములఁ గొలిచి మనియెద. సోదరిమాలతియే మీకు గృహలక్ష్మియై చతుర్వర్గసాధన యగుఁగాక! సంతోషస్వాంతనై యందువలననే యాత్మ సుఖముం గాంచి తృప్తి నొందెదను. కాని ప్రోషితభర్తృకగనైన నన్ను మననీయుఁడు. ఈమాత్రపుఁగరుణనైన నన్ననుగ్రహింపుఁడు. అనాథనై పరులదృష్టి నన్ను విన్నఁబోనీయకుఁడు. మీ కర్పితమైన నాప్రేమ నింకొకనికి వశ మొనర్పఁజాలను" అని వేఁడికొనెను. మాధవుఁడంత నామె యొడిలోఁ మొగముబొనిపి దుఃఖోద్రేకమునఁ గలఁగి యట్టిపరిస్థితిలోఁ దనకర్తవ్యమునుగూర్చి ధర్మమార్గమునుగూర్చి యుద్బోధింపఁ బరమేశ్వరునిఁ బ్రార్థించి ధర్మరక్షణము ప్రథమకర్తవ్యముగ నిశ్చయించి

కొని యేనాఁడో యామెసోదరిమాలతికి సమర్పితమైన తనప్రణయము నందు భాగము నాశించుట యుచ్ఛిష్టాన్నముఁ గోరులీల యగు నని మధుకుమారి నుద్బోధించి తన్నుఁ గ్రూరాత్మునిగఁ దలంపక ధర్మచ్యుతిచేఁ దన్ను నరకాగ్నిఁ బడకుండఁ గాపాడు మని వేఁడికొనెను. ఆమెయు నాతనిధర్మదీక్షకు నచంచలప్రణయమునకు సంతసించి యేపవిత్రహృదయశక్తులవలన నతఁడాకర్షణపాత్రుఁడై తన కారాధ్యుఁ డయ్యెనో యాదివ్యశక్తులనే తానును మనన మొనర్చి జీవితమును బునీత మొనర్చి తనప్రేమ కమరత్వము నార్జింపఁ గృతనిశ్చయయై ముఖంబున దివ్యతేజఃపుంజమ్ము విరఁజిమ్ముచు "స్వామీ! మీయమృతప్రబోధమున కెంతయుఁ గృతజ్ఞను. జీవితలక్ష్యమును దత్సాధనమును బోధించిన మీ కభివాదములు. భ్రమప్రమాదములకు లోనుగాక, కర్తవ్యనిర్వహణమునకు వలయు నుత్సాహశక్తులను నాకుఁ బ్రసాదింప నాజననీజనకులయెదుటఁ బరమేశ్వరునిఁ బ్రార్థించెదను" అని జననీజనకులచిత్రపటము లుంచినమందిరము లోనికిం జనెను. ఆమెచిత్తవికృతులఁ దలంచి యామెకు సరియైనస్వాస్థ్యము గలిగింప మాలతీసాన్నిధ్యసాంగత్యములే పరమసాధనములు కానోపు నని మాధవుఁడు మధుకుమారికిం దెలుపకయే తొందరగా రమ్మని మాలతికిఁ దంతి వ్రాసి సేవకునిచే నంపెను.

కొంతవడికి మధువు హసన్ముఖయై మాతృమందిరమునుండి మఱలి వచ్చి "నేఁ జేసిన పిచ్చిచెయ్వులను జిత్తమునం దిడి మీర లీపయిన్ గాసినిఁ బొందఁబోకుఁ డిటు కారియఁ బెట్టినమిత్రురాలిపేరాసను విస్మరింపుఁ డిదె యంజలి మోడ్చెద" నని విన్నవించి తన్నుఁ దొంటియట్లఁ గృపతోఁ జూడుఁ డని వేఁడికొనెను. మాధవుఁ డామెచిత్తవైశాల్యమున కలరి పరిణతాత్మయైన యీతరుణిపాదధూళి నంటుటకై నేఁ దా నర్హుఁడఁ గానని తలపోసి లజ్జించి యామెను దివ్యమూర్తిగఁ దనహృదయాసనమునఁ బ్రతిష్ఠించికొలువ నాజ్ఞ యొసంగవలయు నని ప్రార్థించెను.

ఆమెయుఁ బిన్నను బెద్దఁ జేసి యిటు పేరిమిఁ జూపుట సౌభాగ్యము కాదనియు, నిష్టసఖార్చన నాతనినుండి గైకొనఁ దానికనెన్నఁడు నిచ్ఛగింప ననియు, మానవత్వమునం దున్న యనేకదోషములచే నుక్కిరిబిక్కిరై పురోగతి నొందఁగోరుచెలిగానే తన్ను గ్రహించిన సంతసింపఁగల ననియు మనవి చేసెను. "తుపాను వెలిసినది. గతమును విస్మరించి యిఁక మన మిరువురము సమీపించుచున్న రెండవవత్సరపుఁబరీక్షలకై విజిగీషతోఁ గృషి యొనర్చి వానికి సిద్ధమగుట యవశ్యకర్తవ్య" మనియు హెచ్చరించెను. ఇట్టు లెన్నివిధములఁ దర్జనభర్జనలు గావించి నిశ్చయము లొనర్చికొన్నను మాధవుఁడు మధుహృదయుఁడై శుద్ధ్యమునకు ముగ్ధుఁడై కాంత మయశ్శలాక నాకర్షించురీతిఁ దన్నామె లోఁగొన నామె దృక్కక్ష్యఁ బరిభ్రమించుచు సంతాపమగ్నుఁ డయి యాత్మసంయమమునకు గతిం గానక తపించుట నరసి మధుకుమారి వ్యథ నొంది యాతని నిరంతరము విడువక వలయునుపచారము లొనర్చుచు నిశ్చలకాసారమున ఱాయి రువ్వి ప్రశాంతి నశింపఁజేసితినే యని విచారించుచుండెను.

నాలవనాఁటిమధ్యాహ్నము మాధవుఁడు మధుకుమారిని జేరి "నేను బీగముపేట పోవలయును. వేళ యగుచున్నది. నీవును రాఁదలంచినఁ దొందరగా నలంకరించుకొనఁగోరెద" నని వచించెను. ఆమె యాతనియారాటము నర్థము చేసికొనక తన్ను విడిచి యాతఁడు నాఁడు విమానముపయి నింటి కేఁగుటకే తొందరపడుచున్నాఁడని తలంచి యుందుఁగూర్చి లోలోన వితర్కించుచు బయలుదేఱుటకుఁ దామసించెను. మాధవుఁడు గడియారమును జూచి యిప్పటికే యాలస్య మైనదని నాలుకఁ గఱచికొనుచుఁ జఱచఱ మధువును వీడి వెడలిపోయెను. ఇన్నాళ్ళనుండియు నెప్పుడు నిట్టియనాదరముఁ జూపనియాతఁ డిట్టు లొంటరిగ వెడలిపోవుట కామె యెంతయుఁ బనవుచు వంచకుఁ డని కృతఘ్నుఁ డని పరిపరివిధముల దూఱుచు మగువలు మగవారిని నమ్ముటకన్న నవి

వేక ముండ దని పలురీతుల మనోవికారము నొందుచుండెను. ఆమె హతాశయై "వగపె యోరెము; కన్నీరె దగ నడంచువారి; బ్రతుకు ఎడారి నాదారి; తోడిబాటసారి నిరాశగాఁ బడసి పయిన మగుదు నే నింక భ్రష్టలక్ష్యమును జేర." "ఎంగిలాకునై సుడిగాలి నెగసి తిరిగి యెందుఁ గడముట్టు జీవిత మెఱుఁగరాదు, తంత్రు లూడి ప్రీలినవీణఁ దలఁచి యొక్క యశ్రుకణము రాల్చెదిత్రాణి నరయ నింక" అని గోడు గుడుచుచుండ నామెపార్శ్వమున దేవతాస్త్రీవలెఁ బ్రత్యక్ష మయి తన కన్నీటి నొత్తుచు సానుభూతిఁ బ్రకటించుభద్రమహిళను గని యాశ్చర్య చకితయై యామెయడుగుల కెఱఁగి "అమ్మా! అమృతహృదయముతో మంజులాకారముఖరుచులం బఱపు నీ వార్తావనాపేక్షతో నరుదెంచిన యమరకాంత వని తలంతును. భగ్నహృదయనై యవమానభారసార్థ వాహినై మరుభూమిఁ బయనమైన నన్ను నీసన్నిధిం జేర్ప నాశీర్వదింప వచ్చితివా? సమయనిగళమ్ములను గూర్చి సరసహృదయుఁ డొకఁడు నాస్వాతంత్ర్యము హరించి యుసురు వెట్టి మనుజరూపదనుజుఁడో యన నిశ్చింతగ యథేచ్ఛం జనియె. జననీ! న న్ననుకంపతోఁ గనుము. మగువ వగుట నామానసవ్యథ నీకు గ్రాహ్య మగును. ప్రణయకలితహృదయ నగుట నేర మయ్యెను. అబలాజనమ్ము ప్రేమించుట యెందును జుల్క నగుటయే నిజము." ఇట్టు లెన్నెన్నియో పల్కి "ఇంతకు నభాగ్య నగు న న్నకారణవాత్సల్యముతో నాదరింప నరుదెంచిన తా మెవరు. ఎన్ని యోకావలు లున్న యీమందిరమున కెట్లు రాఁగలిగితిరి?" అని ప్రశ్నించెను.

అంత నక్కాంతయు "చెలీ! ఏమహనీయుఁడు ని న్నొంటరిగ వీడి బీగముపేట పోయెనో! యెవనికొఱకు నీవు వేదుఱుఁ గొంటివో! యాతఁడే నీకడకు న న్నంపినవాఁడు. నీబాగును గోరియే యాతఁడు నిన్నొడఁబాసెను గాని యన్యము గాదు" అనిన మధుకుమారి సంభ్రమా

శ్చర్యాన్వితయై "ఏమేమీ! ఆదయాసముద్రుఁడే మి మ్మిట కంపెనా? ఆయన యేమయ్యెను? మీ రెవరు?" అని యడుగ నామె "వారును నేనును గలిసి యిక్కడి కేతెంచితిమి. ప్రక్కగదిలో వా రున్నారు. ని న్నీచింతలపాలు చేయుటకు హేతుభూత నయిన నాఁతిని నేనే. వారి పవిత్రప్రేమామృతమజ్జనమున నఘౌఘం బెల్లఁ బాయఁద్రోచిన మాలతిని నేనే. ఇటకుఁ దొందరగా రమ్మని తంతి నంపఁగా నిన్నుఁ జూచునాకాంక్ష నిక్కడకు వచ్చితిని" అని చెప్ప విస్మితయై మధు వామెను బిగ్గఁ గవుంగి లించి "అక్కా! నిన్నుఁ దెలియనేరనినానేరమును సైరింపుము. నా కొక యింత తెల్పియుండిన నేనే విమానాశ్రయమునకు వచ్చియుండనా?" అని మ్రొక్కెను.

ఏకగర్భసంజనితులందుఁ గనరాని దివ్యమధురానురాగము తీఁగ సాగి మొదలఁ బొదల వా రొండొరులకవుఁగిళుల నొడలు మఱచియుండిరి. ఆస్థితిలో మాధవుఁ డట కేతెంచి వారిం గాంచి నిష్కాలుష్యచిత్తము లెంతటివైశాల్యము గల్గియుండునో యూహింపఁగలిగెను. కొంతతడవు నకు వా రెదుటనున్న ప్రియునిఁ గాంచి గారవమార లేచి నిలిచిరి. మధు వాతనిఁ జూచి తరితీపు లొలయ "ఎంతహృదయేశ్వరివైన నించుకంత వైన నీమెరాక నా కెఱింగింపక మీ రీదొంగవేసము వేయనేల? మా యక్కకు నేను స్వయముగ స్వాగతం బిడుభాగ్యము నాకుఁ గలిగింప వలదా? ఎడయింతయులేని యక్కసెల్లెండ్ర మగుటచే నిది చెల్లెనుగాని లేనిచో నాయనాదరణమ్ము నీమె యెట్లుగా భావించియుండునో! అందుచే నా కెట్టినగుబాటు వాటిల్లునో యూహింప శక్యమే" యని మంజులాలాపములతో ననియెను. అనంతరము మధువు మాలతి కర్హ రీతిని మజ్జనభోజనాదు లేర్పఱిచి తనిపెను.

మాలతీమధుకుమారికలు దృఢతరస్నేహానురాగబద్ధ లయి యొక్కనిముసమేని యొండొరుల విడువక యొక్కశయ్యనే పరుండి

యక్కసెల్లెండ్రకన్న నెయ్యంబార వర్తిల్లుచుండిరి. మాలతి మాధవునెడ మధువునకుం గల నిర్మలప్రణయానురాగముల గ్రహించి వానికి సాఫల్యమును గూర్ప నకుటిలచిత్తముతో శక్తివంచన లేక ప్రయత్నించెను. తనతోపాటు మధువునుగూడ గృహిణిగ గ్రహించి యిరువురయనురాగములఁ జూఱఁగొనవలసిన దని యామె బహుభంగుల మాధవునిఁ బ్రార్థింప నెంచి మధువును సమ్మతింప వేఁడెను. కాని యంతకుమున్న నియమించుకొనిన ధర్మదీక్షనుండి యామె చలింప నిచ్ఛగింపదయ్యెను. తుదకు “నేను సనాథనే; విడుతు నీకయి నాపతి; నీదుసౌఖ్యమున్ బోపడఁగింప నెన్నఁడును; బూతచరిత్రము పట్టుఁగొమ్మగా మానవతీమణుల్ చనెడిమార్గము నే నిఁక సిర్ధరించి నామానసనాథుగౌరవరమన్ దిశ లంటఁగ వ్యాప్తిఁజేసెదన్” అని దృఢనిశ్చయమును బ్రకటించి “సీతొలిబిడ్డ నా కిడుము. నే వహియింతును మాతృగౌరవం; బీతలపోత స్త్రీసహజ; మెంచకు మెందుఁగఁ, ద్యాగశీలవై ప్రీతిని గూర్పు మీక్రియను; బిడ్డ మటొక్కఁ డొడిన్ జెలంగునాఁడే తలపోయు మాత్మను గడిందిగఁ గోరిన కోర్కెఁ దీర్పఁగన్” అని ప్రార్థించెను. మాలతి వంతతో “చెల్లీ! నీవు మాన్యచరితవు. పాపిష్ఠమైన నీయక్క మాలతి నీకయి ప్రాణమైన నొసంగఁ గలదు. సందియము వలదు. త్రికరణశుద్ధిగ మనయభేద మెల్లకాలము నిక్క మని నమ్ముము” అని పల్కెను. మధుకుమారియు “అక్కా! పెక్కుజన్మలకున్ నిను నాయగ్రజ గాఁగ మ్రొక్కు లిడెదన్, నిక్కంబుగా నీదృశుల్ గనరారెందు; విషాదమున్ విడుము; శోకవ్యాకులత్వంబుతో నను నీ వెన్నఁడు నొవ్వఁజేయఁదగ; దానన్ బెట్టుచున్నా నిదే” అని మాఱువల్కెను. పదపడి వారిర్వురేకీకృతచిత్తలై మాధవు నుల్లసిల్లఁజేయుటయె తమలక్ష్యంబుగా నిర్ధరించుకొని తత్ప్రయత్నంబులకుఁ గడంగిరి.

మాలతి పుష్పపురి కేఁగెను. కాలేజిపరీక్షలు ముగిసెను. మధు వుత్తమశ్రేణిలో M. A. పట్టము నంది మాధవునిచే "నీకుజితుఁడ" నను మెప్పుఁ బడసెను. మాధవుఁడు పుష్పపురి కేఁగెను. తనతో రమ్మని మాధవుఁడు కోరినను "సమయంబు యుక్తమగునపు డేతెంతును. ఇప్పుడు వలదు. క్షమింపుఁడు. కోపము చూపకుఁడు" అని మధువు సమాధాన మొసంగి తా నప్పుడు హైదరబాద్‌నందుఁ దలపెట్టిన ధార్మికసంస్థల నిర్మాణనిర్వాహణమునందు నిమగ్న యయ్యెను. మాధవునిపేర ననాథనిల యము, మాతృదేవతపేరఁ బ్రసూతిమందిరము, జనకునిపేర విద్యాల యము నిట్లు ధార్మికసంస్థలు మూఁటి నామె విశేషవ్యయముతో నిర్మిం పఁజేసి వానికిఁ బ్రారంభోత్సవ మొనరింపఁజేయ నిశ్చయించెను.

నరసింహవర్మ మాధవాదులు పుష్పపురిఁ జేరినయనంతరము కుమారీకుమారవిద్యార్జనము పూర్తి యగుట విచారించి మాధవానం దుల వివాహము లా వైశాఖమాసమునందు జరిపించుటకుఁ గృతనిశ్చ యుఁడై మిత్రుఁడుకూర్మినాయనితో సంప్రతించి రాధానందులవివా హమున కాతని సమ్మతింపఁజేసి వివాహములకు ముహూర్తనిశ్చయ మొనరించి యందుకు వలయుసన్నాహము లొనర్చుచుండెను. ఈమహో త్సవములకుఁ దాను స్వయముగాఁ బోయి మధుకుమారి నాహ్వానించు టయా లేక లేఖ వ్రాయుటయా యని మాధవుఁ డాలోచించుచుండ మాలతి టపాలో వచ్చినతంతి నొకటిఁ గొనివచ్చి విప్పి చూపి "చెల్లెలు మధువు తా నిటకు వచ్చుచున్నట్లు వ్రాసినది. ఎంతభాగ్యము" అని విన్నవించెను. "ఇదియేమి. మనవివాహముసంగతి యామె కేమైన నీవు వ్రాసితివా ?" యని మాధవుఁ డడిగెను. "నే నేమియు వ్రాయలేదు. మీరే తెలుపఁగా నామె వచ్చుచున్న దని నే నెంచుచుంటిని" అని మాలతి పలికి "ఎట్లైననేమి. ఇది తలవనితలంపుగా ఘటిల్లిన శుభవార్త నే నామెను సత్కరించుట కింటఁగావలసినపనుల నిర్వర్తింతును. ఆమె

మెయిలులో వచ్చును. ఇరువురము స్టేషనుకుఁ బోయి స్వాగత మొసంగు దము. ఆమెను గొనితెచ్చుటకుఁ గుదుపులేని మంచి రెండెడ్లబండి నాయత్త మొనర్పుఁ" డని హెచ్చరించెను. నిముషములో నీవార్త గృహమునం దందఱకుఁ దెలిసిపోయెను. సముత్సాహముతో నందఱు నామెను సమ్మానించుటకువలయుజతనము లొనరించుచుండిరి.

మధుకుమారి యింట నడుగుపెట్టఁగనే సవినయముగ భక్తిభావ ముతో సుభద్రానరసింహవర్మలకు వందనము లొనరించి లక్ష్మిని జెలి మాడ్కిని, మాలతిని సహోదరిగను సన్మానించి యెదయం దెట్టివిషా దము లేక వినమ్రతతో మాధవున కానందమును గూర్చెను. తనకై యింటియందు జరగుజతనములఁ గాంచి యామె యట్టిమన్నన లాత్మీయ తను మాయఁజేయునవియే కాఁగలవనియు నాత్మీయ యగు తన కట్టి యతిధిసత్కారము లనర్హము లనియు వానిని వారింపఁజేసి వారియుల్ల ములఁ దబ్బిబ్బు లొనర్చెను. ఇట్టివ్యవహారవిధిజ్ఞత యామె కెట్లలవడె నని పిన్నపెద్ద లెల్ల నివ్వెఱపోయిరి. తా నింతకుముందు విన్నదానికన్న నెన్నియోమడుంగులు మిన్నగాఁ గనవచ్చు నామెవినయసౌజన్యసౌశీల్యా దికముల కచ్చెరు వొంది యామెచరితమునుబట్టి తలంప శాపవశమున భువిపయి జననమొంది నిశ్చలతపస్వినీవృత్తి నెఱపుచున్న యమరసంభవి యైయుండు నని సుభద్ర సంభావించెను. తాను వలచినప్రాణపతి యన్య స్త్రీని బ్రసంగములోఁ బ్రశంసించినమాత్రముననే యసూయ జనించుట స్త్రీనైజము కాఁగా నీయసఘురాలు తనకుమారునికల్యాణమును స్వయ ముగా జరిగించి యానందించుటకు ఆహ్వానము లేకయే వచ్చుట మహా శ్చర్యముగా నున్న దనియు నిశ్చయముగా నామె దేవతాస్త్రీయో మహామాయావినియో కావలయు నని సుభద్ర పతియెదుటనే తనభావ మును వ్యక్త మొనర్చెను. నరసింహవర్మ యంత "నీయబలాత్వము నీపల్కుతీరునందె స్పష్ట మగుచున్నది. నీ పుత్త్రునందలిప్రేమచే నాయిద్ధ చరిత్రను నీచపాత్రగాఁ జిత్రించుట న్యాయమా !" అని హెచ్చరించెను.

ఇంతలోఁ గూఁతురు లక్ష్మి విన్నదనముతో వారికడ కరుదెంచి
రెండులేఖలను వారి కందీయఁ దా రవి విచ్చిచూచి డీలుపడిరి. లక్ష్మియు
దైన్యముతో "ఈత్యాగస్వరూపిణి హైదరబాద్‌లో ననాధశరణాల
యము, విద్యానిలయము, ప్రసూతిమందిరము నను మూఁడు ధార్మిక
సంస్థలు నిర్మించెనఁట. వానికిఁ బ్రారంభోత్సవ మొనర్ప రాష్ట్రపతిని
బ్రార్థింపఁగా వారు సమ్మతించిరఁట. ఆమహోత్సవమ్మునకుఁ బేరుపేరున
మన కెల్లరికి నాహ్వానపత్రములఁ బోస్టులోఁ బంపి, పదపడి యోజించి
యిట్టికార్యమునకుఁ దాను స్వయముగాఁ బోయి యాహ్వానించుటయే
మంచి దని తలంచి తంతిఁ బంపి యరుదెంచినదఁట. మన మన్నయ్య
వివాహమున కామె యాహ్వానింపకయే వచ్చిన దని యుబలాటపడుచుం
టిమి. ఆమె కీవివాహవార్త గాని, అందుకు నిర్ణీతమైన తేది కాని తెలి
యనే తెలియవు. ఇప్పు డీమహోత్సవములు రెండింటికి నిర్ణీత మైన తేది
యొకటియే యగుటఁ దెలిసి మిక్కిలి చింతించుచున్నది. వివాహముల
సంగతి ముందు తనకుఁ దెలిసియేయున్న ధార్మికసంస్థాప్రారంభోత్సవ
దినమును మఱొకనాఁ డేర్పఱచియుండును. ఇప్పు డది మార్చ వీలులేదు.
ఏమిచేయుటా యని దిగు లొందుచున్నది. అక్కడియేర్పాట్లకై తొంద
రగా రేపె బయలుదేఱి యామె వెళ్ళకతీఱదఁట. ఆత్మీయులు లేని యా
శుభారంభ మెట్లా యని యామెయు, జరిగినయపచారమునకు నన్నయు,
వదినెయు వ్యథాకులితు లగుచున్నారు" అని నివేదించెను.

నివ్వెఱపడి నరసింహావర్మయు సుభద్రయు మధువునొద్ద కేఁగిరి.
ఆమెయు సముచితగౌరవమున వారి నాసీనులను గావించి నెవ్వగతో
నూర్పుగాడ్పులఁ బ్రసరించి, కన్నీ రురల తెప్పల నప్పళించి "ఎట్టిపాపి
ష్ఠినో! పాప మిట్లు నన్నుఁ గట్టికుడుపుచునుండె; సత్కార్యములనుగూడ
వెలి వేయఁబడితిని; కోటిమంది, వచ్చినను నేమిసంతోషపడుదు నింక-
యుక్త మెయ్యది యని యూహించుటకునైన, నేకాకి నొనరింతు నేమి

యింక. ఈసుచరిత్ర లక్ష్మి నెటులేని దయామతిఁ బంపుఁ డింతయుల్లాసము గందు" నని ప్రార్థించెను. అంతటు వ్యథాకల్లోలురై యేమియు మాటాడు టకు నేరరైరి. నరసింహావర్మ కొమరితను జూచి "చిన్నారి! నీ విచ్ఛగించినఁ బోవమ్మ! వివాహావేశ కిచ్చటికి రావచ్చును" అని పలికెను. అది యుక్త మని యందఱుఁ దలంచిరి. లక్ష్మియు మధుకుమా రితో నేఁగ నిచ్ఛగించెను. మధుకుమారి యంత నందఱితోడను సముచిత సంభాషణము లొనర్చి వారిని వీడ్కొని లక్ష్మిని దోడ్కొని భాగ్యనగ రము చేరెను.

మాధవానందులవివాహదినము సమీపించుచుండెను. పుష్ప పురిలో సమాజమునందు గుసగుసలు బయలుదేఱెను. కొందఱు సంకు చితహృదయులు "తగుదు నని తా నొకపెద్దగా నరసింహావర్మ సాహ సించి యెన్నఁడులేని శాఖాంతరవివాహము సాగించునఁట. అందునను. దనకొమరుఁడు కాఁడుగదా యని యిట్టిసంబంధము మఱిదలికొడుకు నకుఁ గుదిర్చినాఁడు. పెండ్లికి వీరియింటి కెవరువెళ్ళెదరో చూచెదము గాక" అని ప్రగల్భములు వలుకఁదొడంగిరి. ఇవి సుభద్రానరసింహులకు వినఁబడెను. సుభద్ర తత్తఱ మొంద నరసింహావర్మ "ఇదియంతయుఁ గాకిగోల యని యెఱుంగుము. నేను 'ఉష్' అనినంతమాత్రమున నడంగఁ గలదు. ఈసంచలనము గలిగించి యీకార్యము నడ్డఁదలంచిన మహాను భావు లెవరో నాకుఁ దెలియును. తాటాకుచప్పుళ్ళకుఁ గుందేళ్లు బెద రునా? చూడుము. వారినోళ్లు మూఁతవడును" అని ధైర్యవాక్యములఁ బలికెను.

మఱునాఁ డాతఁడు గ్రామచావడిలో నొకసామాజికసభ నేర్ప ఱిచి సంఘసంస్కరణావశ్యకతఁ గూర్చి హృదయంగమముగ నొకగంభీ రోపన్యాసము నొసంగెను. దానికి మందుచల్లినట్లు సహృదయులెల్ల సమ్మోదావేశు లయిరి. పలువురుపెద్దలు హర్షముతో "నిరతముఁ

బుష్పపురమెల్ల నీమాటపై నిలువఁగలదు. ఏసంశయము లేక మేమంద ఱము నీవుజరిగించు పరిణయప్రయత్నములఁ దోడ్పడుదుము" అని పలికిరి.

అందఱు మహావైభవముగ వివాహసన్నాహముల నెఱపిరి. తండోపతండములుగ బంధువులు పౌరులు నామహోత్సవముల కేతెంచిరి. రెండువేలేండ్లుగా విడియుండి నేఁడొకచోటఁ గలియగా నరుదెంచిన శాఖాంతరకాళింగవర్గముఁ గాంచి మాధవుఁడు మహానందముతోఁ దమ్ముని వైపుఁ దట్టి "ఆనందా! నీజననము చరితార్థ మైనది. నేఁడు మహా పర్వదినము. మనజాతియుజ్జీవనము నేఁటితోనే ప్రారంభమైనది. ఈ విస్మృతకాళింగైక్యమును గాంచ జాతిబొమ్మకయినను మే నుప్పొంగ కుండునా! ఇందుకు నాందీపూజన మొనర్చుభాగ్య మిన్నాళ్ళకై నను మీపుణ్యదంపతులకే దక్కినది. మీరు సల్పు సంఘకల్యాణసుకృతి భావిసంస్కారపరులకుఁ బట్టుగొమ్మ యగును" అని మెచ్చాడు నవసర మున లక్ష్మి ప్రత్యక్ష మయి "సారెచీరలు గొనఁగ మీతోఁబుట్టు విడె యంజలి ఘటించు" నని వచించెను. సకాలమున కేతెంచినయామెరాక కలరి మాధవానందులు మధుకుమారికుశలమును విచారించిరి.

పిదప లక్ష్మి రాధామాలతుల డాసి పరస్పరకుశలప్రశ్నము లొన ర్చినయనంతరము మధు వివాహబహూకృతులుగా నొసంగిన భూషణాది కముల నయ్యిరువురకు నొసంగి తనియఁజేసెను. "శోభనదినమ్మునమాత్ర మీసమగ్రవసనాభరణమ్ములఁ దాల్ప మధు కాత్మశాంతి యొనఁగూడు" నని లక్ష్మి మాలతికి వేఱొకబంగి నొసంగెను. మాలతి మధుం దలఁచి జొటజొటఁ గన్నీరు గార్చుచు నావస్త్రాదికములను బరిగ్రహించెను. లక్ష్మి మధుకుమారివృత్తాంతమును రాధామాలతులకు సమగ్రముగ నివే దించి యామెకార్యనిర్వహణదక్షతను నేకాగ్రతను గొనియాడి కర్మయో గినియైన యాకాంతచెంతఁ గొన్నినాళ్లుండి శిక్షణఁ గొననెంతు నని తన యాకాంక్షను వెల్లడించెను.

సలక్షణముగ మాలతీమాధవులయు, రాధానందులయు పరిణయములు నెఱవేఱెను. బంధువు లెల్లరుఁ గొలఁదిదినములలో వారివారి తావులకు మఱలిరి. శోభనదినమున మధుకుమారియభిలాషమెయి మాలతి యామె పంపిన వస్త్రాభరణములను దాల్చి "ఇవి మీకు మెచ్చుఁ గూర్చును గదా!" యని పతిని బ్రశ్నించెను. "ఇవి మధుజననీవివాహ వస్త్రాదికములు. వీనియందు మధువున కమితభక్తిశ్రద్ధలు. నాకుఁ గావించిన తొలివిందునాఁడు వీనినే మధు ధరించెను. అవిజ్ఞాత మగు నవిభాజ్య సంబంధ మేదియో మధుభగ్నజీవితమును మనతోఁ బెనవైచుసూత్ర మగుచున్నది. అది యీశ్వరప్రేరితము. అవిలంఘ్యము" అని యాతఁడు సమాధాన మొసంగెను. శోభనము శోభావంతముగ ముగిసినది. కొన్నాళ్ళకు మాలతి గర్భవతియై నెలలు నిండి యొకకుమారునిఁ బ్రసవించెను.

హేమంతర్తుశోభ యవతరించి యంతరించుచున్నది. పుష్యమాసము గడచినది. మాఘమాసము ప్రవేశించి మూన్నాళ్లైనది. అప్పు డొకనాఁడు ప్రాతఃకాలమున మధుకుమారి తనస్నానపుగదిలో బొమ్మ బంటిచన్నీళ్ళలోఁ జాలసేపు తాన మాడి తనగిబ్బిగుబ్బలహారువుఁ గాంచి "పురుషస్పర్శ నెఱుంగ కీక్రియను" (ఆ 11 ప 9) అని వితర్కించి "మీకుఁ బాలు చేపఁగల నేర్పున్నచో నాప్రాణవిభుమూర్తిని గొన్నచిన్నిపాపను నా సోదరిమాలతి ప్రసవించి నాకొసంగినచో నెయ్యంబార నే నాతనిఁ బెంచి పోషింపఁగలను. దాన నాకు మాతృత్వయోగ్యతయుఁ బ్రియుని యాదరణమునుగూడ లభింపఁగలవు" అని యెన్నియో భావలతికలు పెనఁగొన స్నానమును దీర్చి మాతృత్వపుయోచనలు మనమున సలమఁగాఁ దనగదిలోనికిఁ బోయి దాదిని బిల్చి "స్నానముచేయుటలోనే కొంత యాలస్య మైనది. రెండునిముసములలోఁ బూజను ముగింతును. గంట మ్రోఁగించునంతలో నుపహారమును సిద్ధ మొనర్పుము. నేను త్వరగా బయటి కేఁగవలెను" అని యాదేశించెను. అంత నాదాది "చిట్టి

తల్లీ ! చన్నీళ్ళను మునకలిడుట నీ వెన్నఁ డెఱుంగుదువు? శాశ్వతదుఃఖచ్ఛన్నమతివై యెన్నా ళ్లీకఠినతప మొనర్తువమ్మా ! నే నెట్లోర్వఁగలను" అని వనటతోఁ బలికెను. కంపితస్వరముతోఁ గనుల రక్తిమ తోఁప మధుకుమారి "అమ్మా ! యేమందువు. రమణి కొకఁడే పతి. నేను వ్యభిచార మొనర్పఁజాలను. మానినికి నీతినియమము లుండవలదా" అని గద్దించిపలుక మాఱుమాటాడక నిశ్శబ్దముగ దాది లోనికిం జనెను.

మధువు దీర్ఘనిశ్వాసము పుచ్చి మాధవునిచిత్రపట మలంకరించిన గదిలోనికిం జని దానియెదుట మోఁకరిలి సాశ్రునేత్రయై మ్రొక్కులిడెను. అనంతర మామె తనధార్మికసంస్థల దర్శింప నరిగి ప్రసూతిమందిరమునఁ జాలకాలము మసలెను. ఆనాఁడే ప్రసవవేదనల నార్తిని గూరి గూరి శిశూదయ మైనంతనే వేదననెల్ల మఱచి చిఱునగవుతోఁ బురుషలక్షణోపేతుఁ డగు నాశిశువును నుల్లసముతోఁ గనుఁగొనెడిప్రసూతకడ కామె చనెను. ఆ బాలెంతయుఁ జేతు లెత్తి యామె నాశీర్వదించెను. ఈదృశ్య మవలోకించినంతనే యామెహృదయమున మాతృచిహ్నములు మల్లడిఁగొనెను. అనంతర మామె యనాథమందిరప్రాంగణమును జేరి యచ్చట మాధవునిస్ఫటికవిగ్రహమున కిరువంకలఁ బెరిగియున్న వకుళవృక్షద్వయమును విలోకించెను. వలపలిమ్రాఁకు నీడ లిడి వల్లభునకు సేవలిడ డాపలిమ్రాఁకు మధ్యాహ్న మయినంతనే యర్చన లొనర్పనేర్చెను నని యావృక్షములఁ గనినంతనే యామెమనమున మనోహరభావములు మొలకెత్తి సోదరిమాలతితోఁ దా నిట్టిసేవలు వల్లభున కొనర్చుభాగ్యము దన కెన్నఁడైనఁ గల్గునా యని యువ్విళ్ళూరెను. పిమ్మట నామె యనాథశరణాలయములోని కేఁగి యచ్చటియధికారిణిమ్రోల నందున్న యనాథబాలబాలికల నవలోకించి వారి కెల్లఁ దానే మాతృరూపిణి నని తలపోసి యట్టిసంతానము చేకూఱఁగ వేఱె బిడ్డలకయి మదిం గలంగుట వ్యర్థ మని సంభావించెను. పదపడి యామె విద్యాలయమునకుఁ జని యందలి పేద ముగుదసుఁగుల యభ్యుదయమును బరికించి యానంద మొందెను.

మధుకుమారి గృహమునకు మఱలి భోజనానంతరము విశ్రమించు తఱిఁ జేటి తెచ్చియిచ్చినటపాలులో శుభలేఖ యొకటి యుండెను. దాని పయి మాధవునిదస్తూరిని గాంచి యామె నయనద్వంద్వమున నద్ది ప్రియ మార నెదను గదియించి సోత్కంఠముగ నాలేఖను సాంతముగఁ జదివి యయిదురోజులయి మాలతి సుఖప్రసవ యయి సుకుమారునిఁ గుమారుని గాంచినవార్త నెఱింగి యఖండానందము నొందెను. పిల్లవాఁ డచ్చముగ మధువుపోలికియే యని యామెపేరే యాతని కుంపనెంచితి మని బార సాలకుఁ దన్ను రమ్మని మాలతీమాధవు లిరువురు లేఖలో వ్రాసియుం డుట కామె హర్షవిషాదములు మల్లడిగొన "శిశువు నాశీర్వదింపఁగ రమ్మని నన్ను నీదాసి నాజ్ఞసేయుట గాక యర్థింపవలయునా. చిన్ని బాబును జూడకుండ నెడఁగునై యిక్కడనుండనేర్తునే! అతనికి నాపేరు నిడెద మన్నతలంపు ముమ్మాటికిని దగదు-తగదు. పగవానికైన వలదు. నాతల్లిపేరినే నాకుఁ బెట్టిరి. పుట్టినదిమొదలు కష్టములే గాని సుఖలేశ మయిన నెట్టిదో యెఱుఁగను. నాతపఃఫలమయి మీకడుపునఁ బుట్టిన యీచిఱుతఁడు చిరకాలము సుఖవంతుఁడై మనవలయును. కష్టముల కాలవాల మైన నానామ మాతని కుంచుట పనికిరాదు" అని తలపోసెను. అంత నామె తన్నుఁ గన్నతలిదండ్రులఋణము నీఁగుట కీపిల్లఁడు సాధన మగు ననియెంచి వారిచిత్రపటములయెదుట నిలిచి "మీదౌహిత్రుఁడు మీపిండవిధులఁ దీర్చి మిమ్ముఁ దరింపఁజేయు" నని మురువు సూపెను. తనముఖవికాసమును గని యానందించుధాత్రిని గాంచి శుభలేఖ నామెకుఁ జూపి "చిన్నప్పటినుండి న న్నెత్తి పెంచితివి. ఇఁక మనుమనిఁగూడ నట్లే పోషింపవలసి యున్నది" అని చిఱునగవుతోఁ బలుక నామె "నల్లనివెల్ల నీళ్ళు, తెల్లనివెల్లఁ బాలు నని తలంచు నాచిట్టితల్లి కిట్టివిషమశోధనలు ఘటించితి వేమి దైవమా" యని దుఃఖించెను. మధు నామెను గాంచి "ఏల విచారించెదవు. చింత దక్కుము. నేను విజయ నైతిని. ప్రేమఫలం

బయిసబిడ్డఁడు నాయొడినుండి పెరుగ నానాథుఁడు నాకు వశుఁడయి పోరును. ఆయనకు సపర్య లొనర్చి చరితార్థ నగుదును'' అని పల్కెను. ''ఈపుత్రోత్సవచిహ్నముగ రేపు బడిపిల్లల కందఱకు మితాయిలు కొని పంచిపెట్టెదను. నాబిడ్డకి కుపకరించువస్తువుల నేర్పఱచి వానిని నాప్రియునిచిరునామాకుఁ బంపునట్లు విపణికిం బోయి వర్తకులతో నేర్పాట్లు చేయుదును. నేఁడుగా వాని నీతొలిబిడ్డకు నాచేతులతోఁ బెట్టను. రేపు సేవకు లందఱకు నై దేసిరూపాయ లుచితముగ నొసంగెదను'' అని చెప్పి విపణి కేఁగి వలయునేర్పా ట్లొనర్చి తాను వచ్చుచున్నవార్త పుష్పపురికిఁ దంతిమూలమునఁ దెలియఁజేసెను.

మధుకుమారి మఱునాఁడు సమశీతోష్ణపు (Airconditioned) రైలుపెట్టిలోఁ బ్రయాణ మయి వాల్తేరుస్టేషనుకు రైలు చేరునప్పటికిఁ బాసీయమును నుపహారముచు దెచ్చుటకయి సెర్వరును బిలుచుటకు ద్వారముదగ్గఱ నిలిచియుండ భార్యాసహితుఁ డై యున్న యానందుఁ డామెను గుర్తించి వందన మొనర్చెను. ఆమెయుఁ బ్రతివందన మొనరించి బండి దిగి చెంతనున్న కాంతామణిపై పు దృష్టి పఱుప నానందుఁడు "ఈమెయే రాధ. మీ రింతకుము న్నీమెను వీక్షించియుండలేదు" అని పరిచయ మొనర్చెను. మధు వామెను దనయొడందఁ జేర్చి గారవించెను. ముప్పురకు నల్పాహారములఁ దెమ్మని యామె యాజ్ఞచేసెను. రాధసౌందర్యమున కామె యచ్చెరువు నొంది ''ఇట్టిత్రిలోకసుందరిని భార్యగాఁ గొనిన మీ రెన్నఁడు నీమెమనోజ్ఞరూపమునుగూర్చి నాతోఁ బ్రశంసింపరై తిరి గదా! నిజకాంతలరూపమును మనంబుల మెచ్చుకుందుట మగవారి నైజముకాఁబోలు" నని యామె యానందుని నుల్లస మాడెను. అందు కాతఁడు "ఏదేని యమరలోకప్రసిద్ధసౌందర్యమూర్తి యెదుట మానవాంగనను వర్ణింపనెంచును? అన్యగుణముల మెచ్చుట యార్యుల నైజము గావున మీయభినందన మీయామెయందఁ గలిగినది'' అని వచిం

చెను. ఇంతకు మీపయన మెక్కడి కని మధు ప్రశ్నింప మాయన్న కోమ రుని జూచుట కేఁగుచుంటి మని యానందుఁ డుత్తర మొసంగెను. అంత నామె రాధానందులఁ బ్రహర్షముమెయి విలోకించి "తమ రేమి తక్కువయా! ఇఁకమూఁడునెల లోపికపట్టిన మరల నాకు సూడిదలతోఁ బ్రయాణమై వచ్చుభాగ్యము లభింపఁగలదు. నాయనుజ రాధ తనూజుని( బడయును. మీరును జనకు లయ్యెదరు. నాకు బహుమానము లభించును. ఆశుభవార్త నాకుఁ దెలుపుదురో భయముతోఁ దెలుప మానెదరో! మీయన్నదమ్ములు వివాహమున కేమిబరువ్వైతునో యను శంకచేతనేగదా తెలుపుట మానుకొంటిరి" అని చనవుమెఱయ నుల్లస మాడెను. వారుముప్పురు సుఖముగాఁ బుష్పపురిఁ జేరిరి.

అందఱు వారిరాక కెంతయు సంతసించిరి. మధు మాలతితోపాటు పురుటిగదియందే తనకుఁగూడ శయ్య నేర్పఱచుకొనెను. బుడుతని ముద్దుఁగొని యిరుపురుతల్లులుఁగూడ నాతనియంగకముల మోదముతో స్పృశించుచు సపర్యలఁ గావించుచుండిరి. నాలవనాఁటికేయి మధు మాలతిని గాంచి "అక్కా! మీ రేల కుమారునకు నాయ భాగ్యనామ ముంపఁదలంచిరి? నాపేరు గాక మఱొకపే రుంపఁ గోరెద. అట్లుసల్పుట యొప్పునుగదే!" అనెను. అంత మాలతి "చెల్లీ! వ్యథామనస్కవై నీ విట్లు పల్కఁజెల్లునే. శాశ్వతైశ్వర్య సామ్రాజ్ఞివైన నీకన్న నీలోకమున భాగ్యశాలు లెవరున్నారు. నీవలె నీసుతుఁడు పేరొంది కీర్తివిభవుఁ డయినచో మనజన్మ పావన మగును. నీజనని నామముఁ గొనియే నీవు సాధ్వివై కీర్తి నొందితివి. ఈబిడ్డఁడుగూడ నీపేరే గొని కీర్తివైభవములతో వర్ధిల్లఁగలఁడు. నాథునియిచ్ఛగూడ నిదియే. నీ విందు కేఁక నడ్డు సెప్పకుము" అని వచించెను. ప్రాణేశ్వరు ప్రసంగమునంజేసి మధు తనయభ్యర్థనములను విరమించి "అక్కా! ఒక్కసందేహమున నామనం బెంతయు నెరియుచున్నది. ఇదియేమి? బిడ్డఁ

డచ్చముగ నీచంజాలినిపోల్కినే యవతరింప హేతు వేమి? నాథునిగుణ స్తోమమున కిది కళంకము గాదుగదా! నాపైనే మనము నిలిపి యాతఁడు నిన్నుఁ గలియఁడుగదా! అతనిధర్మదీక్ష కిది భంగము గలిగింపదా!" అనుడు మాలతి "చెల్లీ! ఎంతవెఱ్ఱిదానవు. నిప్పును జెద లంటనేర్చునా! నాథుని కెట్టిధర్మచ్యుతియుఁ గలుగనేరదు. ప్రేమస్వరూపిణి వగునీమూర్తి యెవరిమనమ్మున హత్తియుండదు? నాథునిమాట కేమి? నిరంతరము నీమూర్తి నామనఃఫలకమునఁ జిత్రిత మయియేయున్నది గదా! అట్టి తఱి బిడ్డఁ డచ్చముగ నీమచ్చుగనే పుట్టుటలో నచ్చెరు వేమున్నది? కొఱమాలినశంకలను విడనాడుము" అని మందలించెను. అందుకానంద మొంది మధు "అక్కా! సువిశాలమైన నీపసియెడఁద పాపతల్లి వాట మిసిమిఁ గాంచుచున్నది. నే నేకాకినై యెట్లు ప్రొద్దుపుచ్చఁగలను? నవ నీతప్రతిమాన మైన నీమానసమున నానందముతో బిడ్డ నయి హాయిగాఁ గాలక్షేప మొనర్చితిని. ఇఁక రేఁపు నిన్ను వీడి వెళ్ళినతర్వాత నాకేమియుఁ బాలుపోకుండును. దినము లెట్లువేగింతునో తెలియరాదు. నిన్ను విడ నాడివెళ్ళుట నా కార్తిఁ గూర్చును. తగుదు నని యుదాత్తము లయిన సంస్థల నిర్వహించుభారముపైఁ బెట్టుకొని యెన్నాళ్ళిచ్చట నిల్వఁగలను? రేఁ పింటికి వెళ్ళెదను. సెల వొసంగుదువుగాక!" అని పలుక మాలతి "చెల్లీ! ధర్మమూర్తివైన నీకు ధర్మచ్యుతి యెన్నఁడుఁ గలుగనేరదు. రేఁ పింటికి వెడలుట తగదు. పిల్లవానిఁ దొట్టిలోఁ బరుండఁబెట్టునాఁటి వఱకు నీ విందుండుట తప్పదు. నాథునియభిలాషముకూడ నదియే. నీ విందు కడ్డు సెప్పవలదు" అని హెచ్చరించెను.

బిడ్డఁడు తనచిత్తము ననురాగప్లావిత మొనర్చి మాతృవాంఛల రేకెత్తఁజేయ మధు వేమియుం దోఁపక యుమ్మలికము నందుట మాలతి గ్రహించి "కాంతవైనైజసంతానకాంక్ష ననఁచి, యేటి కెదు రీఁదఁ బాల్పడి తీవు; దాని యురవడి కొంకింత లోఁబడి యుంటి విపుడు; ప్రకృతిఁ

జోకార్ప వశమె యెవ్వరికినైన. (అ.ప. 114) "పతివిలోకన మీా వెట్లు" (ప. 118) పాపనిప్రాఁపుగా (ప. 116)...అనాఁ డావేశముతో నాప్రార్థనముఁ ద్రోసిపుచ్చితివి. ఇప్పు డిట్లు కృశించి వంగవరుగై నేత్రాంతర ప్రాణవై సేవాధర్మము నిర్వహింపఁగలవే! కావున నిప్పుడైనఁ బునర్విచారణ మొనర్చి యొక్కసారి "ఊ?" యనుము. నేను ప్రియ మొందెదను. ప్రియునిపాదసన్నిధిని నాజీవితం బెవసిద్ధమైనను నిన్ను సపత్నిగఁ జేయఁ జేదోయిని మోడ్చి వేఁడెదను. ఎదయందుఁ దీఱనియావేదనతోఁ దూలుచున్న నా కీయుపకార మొనర్పుము. చెల్లీ! అనింద్యచరిత్రవయ్యు నీవు నిగూఢవేదనఁ గ్రుంగుట నే నోర్వఁజాలను. ప్రియబంధువులము మేము నీతాప మార్పకుండుట తగదు. నేఁ జెప్పినది గాక నీవెత తక్కమార్గము మఱిలేదు. ఇప్పుడైనఁ దిరస్కృతి చేయక నాప్రార్థన మంగీకరింపుము" అని పరిదేవన మొనర్చుచు మాలతి మధువునొడిలో మోమును జేర్చి శోకబాష్పములు గురియ, మధుకుమారిమనము డీల్పడఁ బలువిధముల వెఱలుయోచనల నణంచి "అక్కా! మనోబలము గోల్పోయితిని. నిశ్చయబుద్ధి చేకూఱినంత నాచరమనిశ్చయము నివేదింతును. దయతో నొకపక్షము వ్యవధి నొసంగుము" అని సవినయముగ విన్నవించెను. మాలతియు సంతుష్టయై "చెల్లీ! అట్లే యొనర్పుము. నీయక్కనార్తిని ముంపక దీర్ఘవిశ్రాంతిని గూర్పఁగల వని యాశింతును. నీవు పుట్టినగడువునాఁటికే బిడ్డనిఁ దొట్టియలోఁ బరుండఁబెట్టి జోలలు పాడుసుముహూర్తమును జేకూఱును" అని వారిరువురుఁ గుదుటఁబడినమనముల ననురాగతరంగితాత్మ లయి యేకశయ్యఁ బెనచుక నిద్రఁజెందిరి.

మఱునాఁడు మధు వింకను బదియేనుదినమ్ము లాఁగుటకు సమ్మతించినవృత్తాంత మెఱిఁగి మాధవానందు లానందించిరి. పాపనికయి యానాఁడు ప్రయాణమునకుముందు మధువు వర్తకులవద్ద విలిచిన వివిధ వస్తువులు పుష్పపురిఁ జేరఁగనే వాని నింటివారు పార్శ్వమందిరగవాక్ష

ప్రాంతమునఁ జేర్చిరి. వానివిన్నాణముపైఁ జిన్నపెద్దలెల్ల వివిధోల్లాస వచనము లాడుచుండుటఁ గని మధు వటనుండి తొలంగి దూరమునకుఁ బోవుచుండ సుభద్ర యాదరముతో "తల్లీ! పోయెదవేమి. మాయానం దమున నీవును బాల్గొనవలయును" అని యామె నటఁ గూర్చుండఁ జేసెను. బిడ్డని కైదవయేఁడు వచ్చువఱకు నర్వారీతుల సరిపోవు వివిధ భూషణములు, పరిధానములు, నాటవస్తువులు, రౌప్యపాత్రికలు మున్న గున వెన్నెన్నియో విశాలదృష్టితో నేర్పఱించి తెప్పించిన యామెమనః పరిణామవిజ్ఞత, భావనాపటిమ, నైపుణ్యము, మాతృసమర్థాయోగ్యతలు విశేషానుభవము గలగేస్తురాండ్రకుఁగూడ నలవడనేర వని నరసింహావర్మ ప్రశంసింప మధువు "దయామయులు, పెద్దలు, కుమారిని బ్రశంసించుట తగదు" అని మిక్కిలి సిగ్గిల్లెను. లక్ష్మి ప్రక్కన నిలువంబడి "బుడుత నొక్కని సాఁకఁగనే జనని కనుభవము మెం డగునందురు. అనదల నెంద ఱనో కన్నతల్లిలీల నోము నీమెయనుభవ మెవ రెన్నఁగలరు?" అని ముచ్చటించెను. మధు చిఱునగవుతో నామెను గనుంగొని "నీమాటలను బట్టిచూడ లోకకల్యాణవాంఛ నీహృదయమునఁ గదిరియున్నట్లున్నది. చీకుంజింతయును లేక మీతల్లియొడిలో నిజముగాఁ గాలముబుచ్చునిచ్ఛ నీకు లేకున్నచో నాకుఁ దోడుగా రమ్ము. నేనుగన్న జననీనిర్వ్యాజ సౌఖ్యము నీకుఁ జేపడి యుబలాటము తీఱఁగలదు. ఏకుమే కౌ ననెడి నుడిని గ్రహింపు" అన లక్ష్మి "వదినా! నీమాట వృథా కానేల. నే నవ శ్యము నీకుఁ దోడుగా వచ్చెదను. నే నూరక కాలము గడపు టొర్వను. నాతికిఁ బురోగమన మవశ్యము. వినశ్వర మగుసుఖములు వ్యర్థములు" అని మాఱుపల్కెను. సుభద్ర మధుకుమారిఁ గాంచి "అమ్మా! చిన్న నాఁటినుండియు మాతృవాత్సల్యమునకు వెలియైన నీ వింక నాయొడిలో సుఖనిద్రఁ జెందుము. నీ కేవిచారము లేకుండ లక్ష్మి నీధర్మసంస్థలనిర్వాహ ణమును జక్కఁబెట్టఁగలదు" అన రాధ చిఱునగవుతో "అత్తగారు చెప్పిన యీవినిమయ మెంతయు బాగున్నది" అని చెప్ప నందఱు నవ్విరి.

కుమారుని డోలారోహణోత్సవదిన మేతెంచినది. ఆనాఁటి ప్రాతః కాలమున మధు కనులు దెఱచి పాలును గొనివచ్చు సుభద్రాదేవిని గని యానందపరవశయై ప్రియుని స్మరించి, దేవుఁ బ్రార్థించి యోజనాధీన యైయున్నంత మాలతి వలకేలు నామె దక్షిణభుజముపైఁ జేర్ప మధు తెలివిఁగొని "అక్కా! బద్ధకము బలిసినది. నిర్బాధ్యతం జేసి కాల మింత తెలియరాకున్నది" అని తీయందన మొలుకఁ బలికెను. మాలతి యామె మోమును ముద్దుఁగొని కురులు సవరించుచు నార్ద్రహృదయయై "చెల్లీ! నీ విడుగడువును జెల్లు నేఁడు (ప. 151) తనివి దీఱఁగ గృహలక్ష్మి యనువున నిను (ప. 152) నేఁ డొకపర్వమై వెలయు (ప. 153)" అనిన మధువు సజలాక్షియై "అక్కా! యిట్టు లానవెట్టుట తగునే? ఒత్తిడి సేయుట యర్హమే?" అనుచుఁ గాల్యకృత్యములఁ దీర్పఁ జనెను. మాలతి డీలుపడి చూడఁజొచ్చెను. ఆనందుఁడు, రామవర్మ, రోహిణి, కూర్మి నాయఁడు, సీత, వేంకమ మున్నగు నాత్మబంధువులు తమ యుడుగరలతో విచ్చేసిరి. రాధయు లక్ష్మియు డోలిక నలంకరించి పుష్పమాలికలు వ్రేలాడఁగట్టి పాలవెల్లి నలంకరించిరి. దౌహిత్రుని సింగారమును రోహిణి తానై యొనరించి యాతని దేహప్రభను గాంచి దృష్టి తీసి చెక్కిటఁ జుక్క వెట్టి యాశీర్వదించెను. ఇంచుక పాదధూళిని నాబుడుతని ఫాలమున నలంది యామె గృహదేవతాళిని దలఁచి యాయురారోగ్యభాగ్యముల నభిలషించెను.

"మాలతి యాలతాంగి మధుమంజులమూర్తి నలంకరింపఁగా (ఆ. ప. 161) వానిఁ గాంచి (ప. 162) నిన్నీ వేషముతోడ (ప 163) ఆనలినాయతాక్షి మధు వంత (ప. 174) ఆదట భూషణమ్ములను (165 ప) ఆలావణ్యవిలాసరాశి యగు (ప 166) అంచుఁ జెక్కిట (ప. 167) అనిన సాక్ష్య మొసంగు నీయాత్మజుండె (ప 168)" బాలుని డోలికయం దిడి యైదువరాండ్రెల్లరు జోలలఁ బాడిరి. సుభద్ర మధుకుమారుఁ డని

సాదరముగ నామ మిడెను. "మధుబాలకా" యని లోలాక్షులెల్ల లాలి లాలి యనుపల్లవితో లాలిఁ బాడిరి. పదపడి మాలతి నవ్వుమొగముతో బాలునినుదుటఁ గుంకుమం బిడి యితఁ డీనాఁటినుండి నాయనుంగుసోదరి కాత్మజుండై యాయుర్భాగ్యముల నందఁగలఁ డని మధుకుమారి కందించెను. "ఆయుర్భాగ్యము............(ప. 172) మధుకుమారి...... (ప. 173) వేడుకఁ జూడవచ్చిన లలనామణులకెల్లఁ దిలకంబు లుంచి తాంబూలసుగంధపుష్పంబుల నొసంగి యందఱకు నడుకులుఁ బేలాలు పంచిపెట్టి యాప్తులనెల్ల వేడ్కతోఁ దనిపిరి. బాలుఁడు డోలికలో నిద్రఁ బోవుచుండ మాలతి తనతల్లిరోహిణిఁ బిలిచి "అమ్మా! నీవు పిల్లవానిని జూచుచుండుము. రాధయు మధుకుమారియు నీకఁ ద్వరలో వారినెలవులకుఁ బోదురు గావున వారి కించుకసంతోషము గలిగింపఁ బ్రాంతోద్యానమునకు వాహ్యాళికిం గొనిపోయెదను" అని చెప్పి లక్ష్మిని వెంటఁ గొని వారితో బయలుదేఱెను.

నర్మసముల్లసితప్రసంగములతో నన్నల్వురుఁ బ్రాంతోద్యానమును జేరి యం దొకబిల్వతరుప్రకాండమున నేత్రపర్వముగఁ దేనెటీఁగలు పొదివియున్న తేనెపెర విలోకించి ముద మొందుచుండిరి. మాలతి "ఇమ్మధూదయ మన్యులకయి మహాకవీశ్వరునికావ్యమధువువలె నింపుఁ గొలుపుం గదా! నిరతఘర్మకణస్రావనిర్మితంబు! స్వాదుహితభోగ్యరససమాస్వాదచణము విస్మయాస్పదకల్పనావివృత మైన భూరిమధుకోశమగుఁ గావ్యమునకు సాటి" అని సోత్కంఠముగఁ బ్రశంసించెను. అంత వారు "ప్రకృతిదత్త మైనరత్నకంబళ" మంచు నొకశాద్వలాంతరమున నధివసించి విశ్రాంతిఁ గొనుచుండిరి. ప్రొద్దు వాలెను. సూర్యుఁ డపరాద్రిఁ గ్రుంకుసమయ మాసన్నమయ్యెను. అప్పు డొక్కయాలపోఁతు టంకెలు వైచుచు దుర్వారోద్ధతిఁ దోఁకను మీఁది కెత్తికొనుచు వచ్చి బిల్వతరుకాండమును గోరాడఁగా నాయుదుటునకు మధుకోశమునందలి

తేనెటీఁగలు చెలరేగి తేనెపట్టు ఛిన్నభిన్న మగుటకుఁ గినిసినవియుంబోలె నాయాఁబోఁతును జుట్టుముట్టి దానిని గసిదీఱ గాటముగఁ గుట్టెను. దాని నోర్వఁజాలక యయ్యాలపోఁతు మేను విదిర్చి గంతు లిడుచు మేఘనినాదము వోలె నార్చుచు నామానినీమణు లున్న శాద్వలము వైపునకు వచ్చెను. దానిని జూచి వారు భీతితోఁ జెల్లాచెదరై పరువు లిడిరి. ఆవృషభమ్ము చు గొమ్ములందుఁ దీవలు పూవులు వ్రేల గుల్మపార్శ్వమునఁ బోవుచు సన్నిధి నున్నమాలతిని జేవకొలఁది విదిల్చి క్రిందఁ బడియున్న యామెను రక్తావిల మానట్లు సరభసాకృతితో డెక్కలఁ ద్రొక్కి పరువెత్తెను. ఈదృశ్యమును గాంచి పరువెత్తుచున్న యబలలు హాహాకారములతో నాక్రందన మొనర్ప నేదో పుట్టిమునుంగఁ బోలు నని యాందోళనముతోఁ గుటుంబమందలి జనులెల్ల రరుదెంచిరి.

కిసలయాన్వితమై కుఠారపాతమున నేలఁగూలిన యేగిస వోలె గుల్మసీమ నొరగి నెత్తురు లొలుకుదేహముతో స్మృతి లేక పడియున్న మాలతిని మతులు సెడఁ గనుంగొని వారు వ్యథ మల్లడిగొన నామెనెత్తి గొల్లుగొల్లున నేడ్చుచుఁ జేతులమీఁదఁ గొని గృహమునఁ జేర్చిరి. ఆనం దుఁడు సముచితవైద్యమును నైపుణ్యముతో సల్పి ప్రశాంతిఁ గూర్ప నొక్కింతవడి కామె కన్నులు దెఱచి నిస్త్రాణగా నొకింతబలము సేకూర్చి కొని ప్రాణేశ్వరు నంతికమును జేరి యాతనియంకమునందు శిరము నిడి కుమారునిఁ దెమ్మని చేసన్న చేయ సుభద్ర రోదించుచు బిడ్డనిఁ దెచ్చెను. మాలతి యాతని ముద్దిడి దెసలఁ బరికించి క్షీణస్వరమ్ముతోఁ 'జెల్లీ!' యని మధువును బిల్వ నామె కన్నీ రొడికలు గాఁగ హాహాకారములతో నరుదేరఁ గనుసన్నతో నామెను గూర్చుండఁజేసి పుత్త్రు నామెచేతిలోఁ బెట్టెను. అంతఁ గొంతవడి ప్రమాఁగనై ఎ. క్రన్ననఁ దెప్పిరిల్లి మాధవుని వామహస్తమున మధుకుమారిదక్షిణహస్తమును జేర్చి "ఈమె నాచె ల్లెలు" అని పలికెను. మధురహాస మొందు ఆమెమోమునఁ దొల్కరించి

యదృశ్య మయ్యెను. మాలతిమాళి మాధవునియుత్సంగమునుండి దొరలి యాతనిపాదముపైఁ బడెను. ఆమెకనులు మూఁతపడెను."

ఇట్టు లింతటితో నించుమించుగ దుఃఖాంతముగనే కవి యీప్రబంధమును ముగించినాఁడు. గ్రంథమున కాతఁ డుంచిననామము మధూదయము. మధుకుమారోదయము నెఱవేఱి మధుబాలకుని మధుకుమారి కాతనిజనని మాలతి స్వయముగా నప్పగించుట పదునొకండవయాశ్వాసముతోఁ బూర్తి యగుటచే నంతటితోనే కావ్యమును ముగించుట కవి యుద్దేశమైనట్లు తోఁపఁగలదు. కాళిదాసుని కుమారసంభవనామకకృత్యభిధానమునకు దీనికి సామ్య మున్నది. నేఁడు లోకములో ముద్రితమై వ్యాప్తమై యున్న కాళిదాసుని 'కుమారసంభవమహాకావ్యము' పదునేడు సర్గలతోఁ గుమారసంభవానంతరము జరిగిన దేవాసురసంగ్రామ, తారకాసురసంహారణాదికములతో విస్తృత మయి కానవచ్చుచున్నను గవియుద్దేశించిన కుమారసంభవ మష్టమసర్గలో వర్ణిత మయిన పార్వతీపరమేశ్వరసంగమరూపవర్ణనములతో నాపాదిత మయినది కావునఁ గాళిదాసరచితగ్రంథమష్టమసర్గాంతముమాత్రమే యను వాదము ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకలోకమునఁ జాలకాలమునుండి నెలకొనియేయున్నది. కావున మనకవికూడ నుద్దిష్టగ్రంథనామమును సార్థక మొనర్చుటకయి యరీతిగనే కావ్యావసానమును గావించియున్నాఁ డని మనము గ్రహింపఁదగును. తరువాత మధుమాధవులజీవితయాత్ర లెట్లుసాగినవో వివరించుట కవి కభిప్రేతము గాదు. పాఠకులే దాని నూహించికొనఁదగును.

## కావ్యారంభము

"ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్" అను ప్రాచీనాలంకారికమతానుసారము జగజ్జనకు లగు పార్వతీపరమేశ్వరుల జగత్సృష్టిప్రవణాత్మకశక్త్యభివాదనపూర్వక మగు నమోవాకముతో "శ్రీగౌరీరమణీమనోజ్ఞముఖరాజీవస్మితానందరే ఖాగాంభీర్యదయాప్రియప్రణయ

సాక్షాత్కారహృద్యాభవనం, యోగైకాత్మమనఃప్రవృత్తిఁ గనునాద్యున్ శంకరుం గొల్తు వి, ద్యాగణ్యప్రచయాభిరామఘనకావ్యశ్రేష్ఠకల్పార్థినై" అనుపద్యముతోఁ గృత్యారంభ మొనర్చుట యెంతయు సంస్తుత్యముగ నున్నది. మఱియు నిందు "మనాక్ కావ్యార్థసూచనమ్" అను నాలంకారికమతానుగుణముగఁ గావ్యార్థసూచనముగూడఁ గావింపఁబడినది. పరమేశ్వరునియం దవినాభావముగ విశిష్ట మయియున్న విమర్శశక్తిప్రేరణముననే యాతఁడు జగత్సృష్టి నొనర్పఁగలుగుచున్నాఁ డని భారతీయ వేదాంతమతసిద్ధాంతము. "మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయి నంతు మహేశ్వరం తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్" "పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" ఇత్యాది శ్వేతాశ్వతరోపనిషత్సూక్తు లీవిషయము నిరూపించును. అందుచేతనే "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం నచే దేవం దేవః నఖలు కుశల స్స్పందితు మపి" అని శ్రీశంకరాచార్యులువారు సౌందర్యలహరీనామకదేవీస్తుతి ప్రథమశ్లోకమునను, కాళిదాసమహాకవి "వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" అని రఘువంశమహాకావ్యారంభమునను స్తుతించియున్నారు. ఈ పౌరాతనాచారము ననుసరించియే యీకవి గౌరీనామకశక్తిరూపకపరదేవతాప్రణయసాక్షాత్కారసంయోగైకాత్మమనఃప్రవృత్తుఁ డగు శంకరునకుఁ దనకావ్యసంకల్పసిద్ధికై యంజలి ఘటించినాఁడు. దీనినిబట్టి యీకావ్యకథానిర్వహణమునందు శక్తిస్వరూపిణు లగు స్త్రీమూర్తులకే ప్రాధాన్యము గల దనువిషయము సూచిత మగుచున్నది. సుభద్ర, మాలతి, మధుకుమారి, రాధ, లక్ష్మి యను నిందలిపాత్రము లాదర్శమూర్తు లని కావ్యపఠనమునఁ జదువరులకు సువ్యక్త మగును. శంకరునిజగత్సృష్టికి గౌరీనామకశక్తి కారక మైనట్టు లీకావ్యసృష్టికిఁ బ్రేరణోత్సాహదోహదకారణ మయినది తనయర్ధాంగి యన్నపూర్ణాశక్తి యని చెప్పి యామెను

గావ్యశ్రోతఁగఁ జెకొని, యాశ్వాసారంభావసానములందుఁ గృతిపతు లగు మాతాపితరుల సంబోధించుపద్యములవెనువెంట నామెనుగూడ సంబోధించి స్తుతించుచువచ్చినాఁడు. ఇట్లు బహురూపకవిశాలార్థభావస్ఫోరక ముగఁ గృత్యారంభపద్యము గూర్పఁబడుట మిక్కిలి ప్రశంసనీయము.

## కథావస్త్వైక్యము

ఆంధ్రప్రబంధములలోఁ బలుకృతులందు వస్త్వైక్యము మృగ్యము. అయాకథల యంగాంగిసంఘటనము విస్తరాకుంబోలె విస్పష్టముగా గోచరించుచుండుట సువిదితము. ఈకృతియందలికథ వేర్వేఱుకాలముల భిన్న భిన్నప్రదేశముల జరగిన గాథలతో సంఘటితము గాక కమ్మెచ్చునసాగినట్టు లవిచ్ఛిన్నముగ నేకక్రమమున నాంధ్రదేశభాగములందలి సన్నివేశములతోఁ జక్కని వస్త్వైక్యముతో వాస్తవముగ జరిగియుండినట్టులే పాఠకులు నమ్మఁదగినంతవిన్నాణముతో నిర్వహింపఁబడినది.

కథానాయకుఁడు మాధవవర్మ మాతృసీమ తెన్కలింగాంధ్రదేశమయినను నాతఁడు శ్రీకాకుళ విశాఖపట్టణములలోఁ బట్టభద్రతనొందిన యనంతర ముస్మానియావిశ్వవిద్యాలయమునం దున్నతకళాపట్ట మొందుటకుఁ గేవలవిద్యార్థియై సీమాలంఘన మొనర్చి హైదరబాద్‌నకు వెడలుట యనివార్య మయ్యెను. కావున భాగ్యనగరమునందలి యాతని తాత్కాలికావాసము, అచ్చటి కళాశాలాసహపాఠిని మధుకుమారితో నాతనికిఁ గలిగిన సమాగమసన్నివేశము భిన్నప్రదేశసంఘటిత మగుటచే నది కథావస్త్వైక్యమునకు బాధక మని గణింపఁదగదు. భాగ్యనగరము గూడ నాంధ్రదేశాంతర్గతమే; కావున సాముదాయికదృష్టితోఁ గథాసన్నివేశము లన్నియు నాంధ్రప్రదేశసంఘటితములే యనుసంభావనతో సమాధాన మొందుట సమంజసము. "అస్థిభారమునాఁ జనునట్టు కథను సంధిబంధము బిగువుగా సంఘటించి (water tight)" అని యొనర్చినప్రతిజ్ఞను గవి సమగ్రముగ నిర్వహింపఁగలిగెను.

## ప్రాఁతక్రొత్తల మేలికలయిక.

ఇట్టికలయిక నలరు గ్రామజీవితేతివృత్తంం బొందు తలంపునఁ బాట నద్దానిని గావ్యంబుగా నిబంధింపఁదలంచితి నని కవి యీగ్రంథావతారికలో వ్రాక్రుచ్చినాఁడు. ఈకలయిక నొకవిశేషముగాఁ బేర్కొనెడి యాశంసనము శ్రీ గురజాడ అప్పారాయకవీంద్రులనాఁటినుండి యుత్తరాంధ్రదేశమునుండియే బయలుదేఱినది. కాని దీని యాథార్థ్యము నిదమిత్థముగ నిరూపించినవారు కనరారు. దేశమున ననుశ్రుతములుగ వచ్చుచున్న కావ్యరచనాసంప్రదాయములను ఛందోవ్యాకరణనియమములను యథేచ్ఛముగ నుల్లఘించి బహుముఖములుగ బహురూపముల భ్రష్టమైన శబ్దజాలముతోడి గద్యపద్యములఁ గూర్చుట సంప్రదాయానుగుణ మగు ప్రాఁతక్రొత్తలమేలికలయిక యని విజ్ఞులు పాటింపఁజాలరు. కవి, హృదయకుహరమునుండి నిర్గత మగుభావాంబుధిలోఁ బురాతనాధునాతనస్వదేశవిదేశకవికృతము లగు కావ్యములందలి మధురమధురభావములఁ గొత్తక్రొత్తరూపములతో మేళన మొనర్చి యూహాలహరికలు వ్యాపింపఁజేసి యింపు నింపవచ్చును; కాని వానిని బ్రచార మొనర్చుటకు సాధనముగాఁ గొనుభాషను దేశసంప్రదాయవిరుద్ధము లగువిధముల భ్రష్టమొనర్చుట సహృదయసమ్మతము గాదు. శ్రీ అప్పారాయకవీంద్రుని కన్యాశుల్కనాటకము గాని లఘుగేయకృతులు గాని యీలక్ష్యమున కెంతవఱకు కాదర్శకములు కాఁగలవో విచారింప నగును. గేయములమాట యెట్లున్నను కన్యాశుల్కమునందలి భాష యనేకరూపముల వికృతి నొంది యాంధ్రాంగ్లాదికపదములకూడికచే "పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్" అను మాటకు సూటియైన దృష్టాంతముగ నున్నది. ఆనాటకమందలి పాత్రములుగూడ భారతజాతికి విహితము లయిన సనాతనసదాచారానువర్తనము గలవి కావు. అందుఁగూర్చి విస్తరించుట యనవసరము.

శ్రీరాజారావుగారి ప్రస్తుతకావ్యమందలి స్త్రీపురుషపాత్రములు పాశ్చాత్యవిద్యాసంపన్నము లయ్యు నవీననాగరకతావాసనఁ గొంత యాకళించుకొన్న వయ్యు భారతీయుల కనూచానముగ నాదర్శకము లుగా నున్నయుత్తమశీలములకు విరుద్ధములుగా వర్తించినవి కావు. కథా నాయకుఁడు మాధవవర్మజనకులు సుభద్రానరసింహులు భారతీయాదర్శ ములకు నికషోపలము లనఁదగు నాదర్శదంపతులు. కథానాయకుఁడు మాధవవర్మ యాతనిపినతల్లినందనుఁ డానందవర్మ (ఉపనాయకుఁడు) హూణవిద్యాధికు లయ్యు వంశమర్యాదలను ధర్మశీలములను జీవితమున నవక్రముగ నిర్వహించిన గుణవిశిష్టులు. వారినాయికలు మాలతి, రాధ కూడ సతీధర్మములఁ జక్కఁగఁ బాటింపఁగలిగిన విద్యావతులు. వారి యాంగ్లవిద్యాపట్టభద్రత వారి వారి గృహిణీశీలనిర్నిద్రత క్షేమాత్రము భంగకరము కాలేదు. మాధవునిసోదరి లక్ష్మికూడఁ బట్టభద్ర యయ్యు వివాహ మొల్లక దేశహితమునకే జీవిత మర్పింప నెంచినసేవాధురీణ. ఇఁక నీకావ్యమునఁ బ్రధానస్థానము వహించి ప్రధానోపనాయికగాఁ బరిగ ణింపఁదగిన మధుకుమారిమాట చెప్పనక్కఱలేదు. చిన్నతనముననే తల్లి దండ్రులను గోల్పోయి పెక్కుకష్టములకు గుఱియై దాదియొడిలోఁ బెరిగి పెద్ద దైనయామె విద్యార్థినీదశలో నుస్మానియావిశ్వవిద్యాలయమునలో మాధవుఁడు **M. A.** పరీక్షకుఁ జదువునపు డాతనిసహాధ్యాయినియై యాతనివిద్యావినయగుణశీలముల కలరి యాతనికిఁ దనప్రేమానురాగసర్వ స్వముల నర్పించి నెచ్చెలియై ప్రణయినిమాత్రముగాక భగ్నజీవితయైనను నాదర్శప్రాయ మగుత్యాగస్వరూపిణి. ప్రేమవాహిని. వదాన్యశిరోమణి యని వన్నెకెక్కిన యన్నుమిన్న. దేశమర్యాదానుగతములు, నిజవం శానుగతములు నగు ధర్మశీలములనుండి యించుకయుఁ జలింపని ధర్మ దీక్షాబద్ధచరితులుగా నాయికానాయకులను దీర్చి దిద్ది కవిగారు కథానిర్వ హణ మొనర్చినారు. వ్రేలుపెట్టి చూపఁదగినయవగుణ మొక్కటియు వీరిపాత్రములయెడఁ బాఠకులకుఁ గానరాదు.

ఇఁక భాషావిషయమున నన్నయాదికవులకాలమునుండియు జీర్ణమయియున్న సంప్రదాయబద్ధకవితాపథమునుండి యించుకయుఁ జలింపకుండునట్లే వీరుతమకావ్యరథమును నడిపించినారు. శబ్దసంస్కార మెచ్చట జాఱనితీరుననే తొల్లింటి భాషాసంప్రదాయముల దూషిత మొనర్పనిచందముననే వీరు కావ్యరచనము గావించిరి. ఎటువచ్చి వీరు బాహాటముగాఁ జూపించిన సంస్కారము నేఁడు సమాజమునఁ బ్రజాబాహుళ్యవ్యవహారమునఁ బాదుకొనియున్న పారిభాషికపదములను రూపములను రసస్ఫురణకనువుగ విరివిగఁ దమగద్యపద్యములందుఁ గయికొనుటయొక్కటియే. జనులనిత్యవ్యవహారమున రూఢము లయియున్న యిట్టిరూపములతోఁ గూడినభాషనే వీరు సజీవాంధ్రభాష యని సంభావించి కావ్యరచనార్హముగ గణించినారు. ఈవిధానముగూడ నన్నయాదులనాఁటినుండియు వచ్చుచున్నదే గాని కేవలము నూతనమయినది కాదు. వ్యాకరణదుష్టము లయిన ప్రాణగొడ్డము, కఱికంఠుఁడు, కపిలజడలు మున్నగు శిష్టవ్యావహారికములను నన్నయ క్వాచిత్కముగ గ్రహింపఁగా, జాను తెనుఁగుపై వలపును వెలార్చిన సోమనాధాదిశివకవులు తమకృతులలోఁ దమనాఁటి వ్యావహారికములను గర్ణాటపారిభాషికపదములను బాహాటముగాఁ గయికొనినారు. కృష్ణదేవరాయలకాలమునాఁటి పెద్దనాదులు రాజకీయవ్యవహారమునను, శిష్టజనవ్యవహారమునను దమకాలమునఁ జేరియున్న యుర్దూపదములను గయికొనినారు. ఈసంప్రదాయము ననుసరించి, నేఁడు ప్రజావ్యవహారమున నిరాఘాటముగఁ జేరియున్న యాంగ్లభాషాపదములను దదితరపారిభాషికపదములను దూరీకరించి వానికి సరియగు సంస్కృతీకరణములఁ గాని సమానార్థకము లగు నితరపదములను గాని గయికొనెడిభాష సజీవాంధ్రభాష కాదనుట నిక్కమనియే వక్కాణింపఁదగును. అట్టిసజీవాంధ్రభాషను వరించుట యీకవి కభిమతమే; కాని ఛందోవ్యాకరణనియమముల యథేచ్ఛముగ నుల్లంఘించి భాషను భ్రష్ట మొనర్చుట

యీతని కేమాత్రము సమ్మతము గాదు. పయివిధముగ నిరూపిత మయిన ప్రాంతకొత్తలమేలికలయికయే యీతనికావ్యమునందుఁ గథాపాత్రజీవితపదసంయోజనములందుఁ బ్రతిపాదిత మయినది.

## పాత్రపోషణోన్మీలనములు.

ఈకావ్యమున స్త్రీపాత్రలకుఁ గల ప్రాధాన్యముగుఱించి యింతకుముందే ప్రస్తావించియుంటిమి. స్త్రీపాత్రలవిషయమున నేమి పురుషపాత్రలవిషయమున నేమి తద్గుణశీలపోషణము సర్వత్ర చక్కఁగా నిర్వహింపఁబడిన దని పాఠకులు గ్రహింపఁగల రని మా విశ్వాసము. కథానాయకుఁడు మాధవవర్మజనకులు సుభద్రానరసింహు లాదర్శదంపతులుగాఁ జిత్రింపఁబడినసంగతి ముందేవివరించియుంటిమి. ఇందుఁ బ్రధాన నాయక నాయికలుగా గణింపఁబడినవారు మాధవవర్మ, మాలతి; ఉపనాయక నాయికలు ఆనందవర్మ, రాధ. మాధవానందుల విద్యార్థిజీవనమాదర్శప్రాయముగ నిర్వహింపఁబడినది. నేఁటిపాఠశాలావిద్యార్థులు నూటికిఁ దొంబదిమంది విద్యార్జనవిషయమున శ్రద్ధాసక్తులు లేక నైతిక శిక్షణమునకు వెలియై దురాచారములకు నల్లరిచిల్లరవర్తనములకులోనయి నీతిదూరు లయియున్నారనుట లోకానుభవసిద్ధము. ఉపాధ్యాయులయెడ వారికి వలయుగౌరవము లేదు. వారిపట్ల నుపాధ్యాయులకు వాత్సల్యము లేదు. ఉన్నతపాఠశాలలందుఁ గళాశాలలందుఁగూడ నేఁడు గురుశిష్యసంబంధములు విపరీతస్థితిలో నుండుట సర్వవిదితము. ప్రభుత్వాధికారులుగూడ నీవిషయమునఁ బరితాప మొందుచున్నవారు. ధూర్త విద్యార్థులచర్యలు కొన్ని తృతీయాశ్వాసమందలి 99, 100 పద్యములలో నుదాహృతము లయినవి. వానిని గాంచి మాధవానందులు విస్మితు లయి యట్టిచోద్యములఁ డా మెన్నఁడుఁ బల్లెపట్టులలోఁ గని విని యెఱుఁగ మని పాఠశాలలో విద్య నేర్పుట కదళీకంటకన్యాయసదృశముగ నున్న దని తలపోసి వినీతభావముతోఁ

దమవిద్యార్థిజీవనము నిర్వహించినట్లు కవి నిరూపించినారు. బాల్యము నుండియు నిరువురును “వేదోడువాదోడుగా నుండి చదివినవా రయ్యు “లోకోభిన్నరుచిః” అనున్యాయము ననుసరించి కళాశాలావిద్యలో వారిలో మాధవవర్మకు ఆంధ్రాంగ్లసారస్వతావగాహనమునందును, ఆనం దవర్మకుఁ బ్రకృతిపరిశీలనాత్మకశాస్త్రజ్ఞానార్జనమునందును నభినివేశ మేర్పడియెను. అందుచేతనే శ్రీకాకుళముకళాశాలలోని విద్య పూర్తి యైనపిదప మాధవుఁడు విశాఖపట్టణమున నాంధ్రవిశ్వవిద్యాలయమున నాంధ్రసారస్వతపట్టభద్రతను, హైదరబాదులో ఉస్మానియావిశ్వవిద్యాల యమున నాంగ్లసారస్వతపట్టభద్రతను బడయుటకయి విద్యను సాగింప, నానందుఁడు విశాఖపట్టణమున వైద్యశాస్త్ర (M. B., B. S.,) పరీక్షకై చదువుటకుఁ గారణ మయ్యెను. గుణశీలములలో నిరువురు నొకరికొకరు తీసిపోవువారు కారు. కాని హృదయగాంభీర్యములో నానందునికన్న మాధవుఁడు, ధైర్యసాహసములలో మాధవునికన్న నానందుఁడు మిన్న లని యెన్నఁదగును. ఉద్యానప్రాంతపర్యటనములో బారువాపురసమీప సరోవరమున రాధ కాలు జాఱి మునిఁగిపోవుసందర్భమున నానందుఁడు సాహసించి వడివడిగ వసనములఁ దీసివైచి యొక్కలాగుమాత్ర ముంచు కొని నీటిలో దుమికి యామెను నొడ్డునఁ జేర్చుట యిందుకు నిదర్శ నము. నాయికలయెడ నచంచలప్రణయము నెఱపుటలో నిరువురు సమానులే యని చెప్పవచ్చును. కూర్మినాయనియింట నాతిథ్యమును గొను ప్రథమసన్నివేశమున రాధావదనారవిందకటాక్షావలోకనమాత్ర మున నానందున కామెయెడ నేర్పడినప్రణయానురాగములు కేవల మాగంతుకాకస్మికసంఘటనము లని వేఱ చెప్పనక్కఱలేదు. అట్లయ్యు నప్పటిసాంఘికాచారపరిస్థితులలోఁ బ్రత్యక్షముగఁ గానవచ్చు శాఖావిభే దము వారియనురాగము చరితార్థ మగుటకుఁ బ్రబలాటంక మని లెస్సగా నెఱిఁగియుండియు ముందువెనుక లాలోచింపక యానాఁటిరేయి రహస్య

మాగమసమయమున నెన్నియాటంకములు, కష్టములు వాటిల్లినను వానిని లక్ష్యము సేయక రాధనే పెండ్లియాడి యామెనే ప్రాణేశ్వరిగా స్వీకరింతు నని యానందామె యెదుటఁ గావించినప్రమాణ మాతని యచంచల ప్రణయముతోపాటాతని యప్రతిహతధైర్యసాహసముల కాదర్శము కాఁగలదు. మాలతీమాధవులప్రణయవిషయమున నిట్టియవరోధములు గాని బాధకములుగాని యేవియు లేవు. మాలతి తొట్టిలో శిశువుగా నున్నపుడే మాధవునితల్లి సుభద్ర యామె తనకోడలు కావలె నని యాన యిడినది. మాలతితలిదండ్రులు నందుకు సమ్మతించిరి. చిన్ననాఁటి నుండియు మాలతీమాధవులప్రణయవల్లి యల్లిబిల్లిగ నల్లుకొని కొనలు సాగుచున్నది. అట్టియెడ నుద్యానపర్యటనములోఁ గూర్మినాయనియింట నాఁగి విందారగించునాఁటిరేయి నచ్చట శయనించినపుడుగూడ మాలతీ మాధవులు నిజానురాగప్రణయధ్యానమగ్నులగుట యొకవిశేషము. అది వారిగాఢప్రణయమున కాదర్శకము. ప్రయాణ మేఁగుతఱి రాజవీధిలోఁ దారసిల్లిన మాధవానందులను, లక్ష్మీమాలతులను గాంచి కూర్మినాయఁ డంతకుమున్ను వారిముక్కుమొగము లెఱుఁగనివాఁ డయ్యు మొగ మోటపెట్టి బలాత్కారముగ వారిని దనయింటికిఁ దీసికొనిపోయి యత్యాదరముతో వారి కొసంగిన యాతిథ్యగౌరవ మాతనిహృదయ వైశాల్యమును బంధుమర్యాదను వెల్లడించి యాతనిగుణశీలములకు మెఱుఁగు వెట్టుచున్నది. కథానిర్వాహణమునకు ఉపనాయకనాయికలను సంఘటించుటకే యీసన్నివేశములను గవి కల్పించె నని చదువరులు తమంతఁదామే గ్రహింపఁగలరు.

మాలతితల్లి రోహిణి తనభర్తతోఁబుట్టువే యగుటచే నామెతో సుభద్రకుఁ జనవు ననురాగము మొదటినుండియు మిక్కుటముగ నిండి యుండెను. వానిని బురస్కరించుకొని మాలతీజననానంతర మాయాఁడుఁ బడుచులిద్దఱుఁ గావించిన సరససల్లాపములను బ్రథమాశ్వాసమున నిసర్గ

మనోహరముగఁ గవి వర్ణించినాఁడు. పుష్పపురమున మాధవానందుల చదువు ముగిసినయనంతరము వారి నాంగ్లవిద్యాభ్యాసమునకై శ్రీకాకుళమునకుఁ బంప నెంచి నృసింహవర్మ నిజాభిలాషమును బ్రకటించినపుడు సుభద్ర పుత్త్రులందలి ప్రేమకలిమి నాంగ్లవిద్యాభ్యాసమునకయినను వారి ప్రవాసమున కంగీకరింపక భర్త్తవాక్యముల కడ్డుపవిలినపుడు సుభద్రా రోహిణులకుఁ గలిగినవాగ్వాదములనుగూడఁ గవి మనోహరముగ వర్ణించుట ముదావహము. ఈసందర్భమున సుభద్ర మెత్తగ నొకచపేటమును రోహిణికపోలమున బహూకరింపఁగా దాని కించుకయుఁ గినియక యామె దాని నెనరుతో గ్రహించుట చూడ మనకు వారిచనవు పరస్పర ప్రేమము లెట్టివో తెలియఁగలదు.

తుదకు సుభద్ర కుమారులను శ్రీకాకుళముకళాశాలకు నాంగ్ల విద్యాభ్యాసమునకయి పంపెడియుద్దేశము నామోదించినపు డచ్చట వారివిద్యార్జనము నిరాఘాటముగఁ బ్రశాంతముగ జరుగుటకయి రోహిణి ప్రకటించినప్రణాళికాక్రమ మామె చాకచక్యమునకు బుద్ధివైశద్యమునకు నాదర్శకముగ నున్నది. మాధవుఁ డాంధ్రవిశ్వవిద్యాలయమున జదువుట కేఁగనిశ్చయించినపుఁ డాతఁడు దూరమగుటఁ గొంతకాలము తనకుఁ గలుగనున్నవియోగమునకయి వగచుచు మాలతి తనపూర్వానుభవములఁ దలపోసికొనుచు ధ్యాననిమగ్న యైయున్నప్పుడు తటాలున వెనుక నుండి వచ్చి లక్ష్మి యామెకనులు మూయ మాధవుఁడే వచ్చినాఁ డని భ్రమించి మాలతి చెందినకలవరము, లక్ష్మి గావించినపరిహాసపూర్వక సల్లాపము పంచమాశ్వాసమున మనోహరముగఁ జిత్రింపఁబడినవి. ఆసందర్భముననే లక్ష్మి తా నవివాహితగానే యుండి యాజన్మము దేశసేవకు, సమాజకైంకర్యమునకుఁ దనజీవిత మంకిత మొనర్పనెంచినయాశయమును బ్రకటింప మాలతీమాధవు లామెతోఁ గావించినసల్లాపములుగూడ హృదయాహ్లాదకములుగాఁ జిత్రింపఁబడినవి. లక్ష్మి, మాలతి, రాధ ముప్పురు

విచ్ఛాపురమున మెట్రిక్యులేషనుపరీక్షకయి కలిసిచదువుటకయి తాను గావించినయేర్పాటులను రాధకు నామెతల్లికిఁ దాతకుఁ దెలియఁజేయుట కయి లక్ష్మీమాలతులపనుపున, ఆనందుఁడు మరల రాధనివాసస్థల మగు కవిటి కేతెంచినపుడు రాధతల్లియుఁ దాతయు నింట లేనిసమయమున రాధానందులిరువురకు నొంటిపాటుసమావేశము గల్గించినఘట్టము వారి ప్రణయానురాగములదిట్టతనము మఱింత గట్టిపడుటకు దోహద మయి నది. రాధతల్లి వేంకమపాత్రమునందుఁగూడ సుభద్రయందుఁబోలె నాదర్శ జననీత్వము పోషింపఁబడినది. మధుమాలతులు గుణశీలములలో నొకరి కన్న నొకరు మిన్నలుగా గోచరించునట్లు కవి వారి నసాధారణనై పుణ్య ముతోఁ దీర్చి దిద్దియున్నాఁడని పాఠకులకు సువ్యక్తము కాఁగలదు. మాధవుఁ డాతనియనురాగసర్వస్వము తనకు ధారవోసియున్నందున, మధుకుమారిప్రణయమును గ్రహించి మాధవుఁ డామెకు వశుఁడు గాకుం డుటయే యామెమనోవైకల్యమునకుఁ బ్రధానకారణ మని గుర్తించి మాలతి మధుకుమారిసౌఖ్యము నాశించి యామెకూడ మాధవునిగృహి ణిగాఁ దనసపత్నిగా నుండవలె నని మనసార వాంఛించి ప్రకటించినయౌ దార్య మనన్యసామాన్యము. మాధవునితంతివార్తపయి నామె హైదర బాద్ చేరి మధుకుమారిపరిస్థితి నవగాహన చేసికొని యామె యారోగ్య మొందుటకుఁ బై దానికన్న మార్గము లేదని గ్రహించి చెల్లెలింబోలె నామెను గారవించి తనతోపా టామెనుగూడ గృహిణిగా స్వీకరింప భర్త నెట్లయినను సమ్మతింపఁజేయుదు నని చెప్పి యందు కంగీకరింపవలసిన దిగాఁ బరిపరివిధముల మధుకుమారి నామె ప్రార్థించినది. కాని యామె రాకకుమున్నె మధువు మాధవునికోర్కెపయి నిఁకముం దెన్నఁడు నాత్మ హత్యాకృత్యములకుఁ గడంగ నని ప్రమాణ మొనరించినసందర్భములో మాధవునిశీలము భంగము నొందకుండుటకు, మాలతిపయి నాతనికిఁ గల ప్రణయమున కంతరాయము గలుగకుండుటకునై యాతనియెడ నిజ

ప్రణయవాంఛను నంతటితో విరమించి నిస్స్వార్థచిత్తముతో సర్వస్వా మాతని కర్పించి యర్చించుననుంగునెచ్చెలిగామాత్ర ముండుటకే యామె తనజననీజనకులచిత్రపటములయెదుటఁ గృతనిశ్చయయై ప్రమాణము చేసియుండుటచే, మాలతిసలహాల నామె నిరాకరించెను. ఈవిషయమున మధుమాలతు లిరువురుఁ బ్రదర్శించిన హృదయౌదార్యము లనన్యదుర్ల భము లని పాఠకులు తలంపకుండరు. మాలతీమాధవులవివాహము మధు కుమారి యకల్మషచిత్తముతో నామోదించి యమూల్యము లగుకానుక లను బంపినయౌదార్యము మాధవునిజననీజనకులనుగూడ ముగ్ధులను గావించినది.

"అబలాలోకమునందుఁ బ్రాణపతి యన్యస్త్రీని మెచ్చాడు వోఁ
బ్రబలం బౌను నసూయ; నైజ మిది; యిప్పద్మాక్షి తా నెట్టు లీ
కబు రందన్ జనుదెంచెఁ గాంతునకుఁ దాఁ గల్యాణమున్ జేయఁ ? గా
దబలాలక్షణ మిద్ది; దేవతయొ ! తా నత్యంతమాయావినో ?"

అను సుభద్రావాక్యములను జిత్తగించునది.

మధుకుమారియాహ్వాన మంగీకరించి యామెగృహమున విందార గించి యామెయాదరానురోధమున నప్పటినుండియు నామెసహవాసిగా నామెభవనముననే వసతి నేర్పఱచికొన్నను దనవృత్తాంత మామెకుఁ దెలియఁజేయుటలో జననిసుభద్రయానతిపైఁ దాను మేనగోడలుమాల తిని గృహిణిగా గ్రహింప నంతకుమున్నె చిరకాలముక్రిందటనే నిబద్ధుఁ డయియున్నసంగతి వ్యక్తము సేయకుండుట, యవసర మయినంతవఱకే తనకుటుంబచరిత్ర మామె కెఱిఁగించుట మాధవునిహృదయగాంభీర్యము నకుఁ బ్రబలనిదర్శనము. ఈవిషయము మొదటనే యాతనిసంభాషణము లలో నవగత మయినచో మధుకుమారి యాతని నెట్లుగా నెంతవఱ కాత్మీయునిగా గ్రహించియుండునో కథానిర్వాహణ మెట్లుజరిగియుండునో చెప్పఁజాలము. మాధవుఁడు సంక్రాంతిసెలవులకుఁ దల్లి కోరుటచేఁ బుష్ప

పురి కేఁగి హైదరబాదున లేనపు డాతనిఁ జూచుటకయి మదరాసునుండి యానందుఁ డట కేతెంచినపు డాతనితోడిసంభాషణముననే పై విష యము మధువు గ్రహించుట, డీలువడుట జరగినది. విశాలదృష్టితోఁ గవి కావ్యమున నానందుని నుపనాయకునిగా సృష్టించుటలోఁ బ్రధాన ప్రయోజన మిదియే యని చదువరులు గ్రహింపఁదగును. మఱియు నానం దుఁడు మాధవునికన్న భిన్నముగా వైద్యశాస్త్రాభిరుచితో M.B.,B.S., పరీక్షకుఁ జదువుటలోఁగూడ నొకగంభీరప్రయోజన మున్నది: వివాహానం తరము మాలతి మధుకుమారునిఁ బ్రసవించిన కొలఁదిదినములలోనే వాటి ల్లిన విషాదసంఘటనములోఁ బ్రాంతోద్యానమున కామె మధుకుమారి మున్నగువారితో వాహ్యాళి కేఁగినపుడు, అలపోఁతునాగడమున కామె గుఱియై నిర్జీవయై చైతన్యవిహీనయై పడిపోయినప్పు డానందుఁడు తన వైద్యశాస్త్రనైపుణ్యమునకు సాఫల్యము గలిగించి తగిన (Injections) మందు లిచ్చి కొలఁదికాలమైనను నామెకు స్మృతిని గలిగించుటచేతనే యామె తనబాలుని మధుకుమారిహస్తములం దిడి యప్పగించుటకు, మధుహస్తమునుగూడ నామె మాధవునికరమునఁ జేర్చి "నాచెల్లెలు" అని హీనస్వరమున భర్త కామెనుగూడ నప్పగించుటకు నుపకరించినది. అట్లుగాకున్న గ్రంధావసానమున జరుగవలసిన ప్రధానప్రయోజనమున కన్యధాత్వము గలిగియేయుండును.

ఏదియోయొకప్రయోజనము నాకాంక్షింపక కవి యీకావ్యమున నెట్టిపాత్రమును బ్రవేశపెట్టినట్లు లేదు. నీచపాత్రములుగూడఁ గొంతొక ప్రయోజనము నుద్దేశించియే కల్పింపఁబడినవి. మాధవాదు లుద్యానపర్య టనమునుండి తిరిగివచ్చునపుడు సముద్రతీరమునఁ దారసిల్లిన కైవర్తుఁ డెట్టిపాత్రములలో నొకఁడు. చేఁపలను వేఁటాడి విక్రయించుట హింసాత్మ కము కాదా యని మాధవుఁడు ప్రశ్నించినపుడు ప్రత్యుత్తరరూపకముగ నాపల్లెవాఁ డొసంగినయుపన్యాసము భారతమందలి ధర్మవ్యాధోపాఖ్యాన

మును స్మరణకుఁ దెచ్చి చక్కనినీతిబోధకముగా నలరారుచున్నది. తరతరములనుండి తమవారి కదియే కులవృత్తి యనియు నందలిహింసాహింసల విచారములు తమవారి కెవరికి లేవనియు విన్నవించి, నాగరకుల మని, దేశసేవకుల మని, అహింసామార్గప్రబోధకుల మని చెప్పికొనుచు దేశక్షేమమునకు వేరుపుర్వు లయి వంచకు లయి పలువురుపౌరులు కావించెడి బహురూపకదుర్మార్గచర్యల నాతఁ డేకరువుపెట్టి హేలగా లీలగా వానిని వ్యక్త మొనర్చినవిధాన మతని విశాలలోకజ్ఞానమును బ్రదర్శించుచుండు టే గాక, నేఁడు సమాజమున సంఘమున విరివిగా జరుగుచున్న ఘోరాన్యాయములు, అక్రమములుగూర్చి దేశమున మారుమూలలందలి యమాయకజానపదులలోఁగూడ నెట్టిభావములు వ్యాప్త మయియున్నవో లోకమునకుఁ దెలియుటకు మిక్కిలి యుపకరించుచున్నది. ఆతని వాక్యములకు ముగ్ధుఁ డయి మాధవుఁడు "అల్పమే యయ్యు దృఢనిశ్చయాత్మక మగు, జ్ఞానయుక్తుఁడు; మేధోవిశాలుఁ డవుఁగ, రాదు హృదయముమాత్రము రాటుఁదేర, కుండుటయె కడువింతను గూర్చుచుండె" ననియు"నిశితకంటకాంతరమున నిలిచియున్న, లలితసౌందర్యరాశి గులాబి పూవుఁ, బోలు నీతండు; హింసాప్రపూర్ణమైన, వృత్తిఁ జేపట్టియు బహు పవిత్రుఁ డరయ" నని హర్షచిత్తుఁడై ప్రశంసించెను. నాయకునిధర్మరతి జిజ్ఞాస వెల్లడించుట కీకైవర్తపాత్రము సహాయక మయ్యెను. వంచకు లయి, స్వార్థపరు లయి, దేశసేవకుల మనుపేర దేశకంటకు లగుచున్నవారి చర్యల కేవగించి మాధవునిసోదరి యగులక్ష్మి యవివాహితగ నుండియే యాజన్మము నిస్స్వార్థ మగుదేశసేవను గావింపఁ గృతనిశ్చయ యగుటకుఁ బ్రప్రథమముగ నీకైవర్తునిసంభాషణమే దోహదకారి యయ్యెను.

మాధవుఁడు సంక్రాంతిసెలవులకు హైదరబాదునుండి పుష్పపురికి వచ్చునపు డాతనికయి రైలుస్టేషనుకు బండిని దోలుకొనివచ్చిన సేవకుఁడు అప్పన్నపాత్రముకూడ వ్యర్థ మనరాదు. మాలతి పండుగకుఁ

బుట్టినింటికి వెడలినదో యని డోలాందోళితచిత్తుఁ డయినమాధవునితో నాతఁడు బందీఁ దోలునప్పుడు గావించినసల్లాపములలో మాధవుఁడు సంక్రాంతి కింటికివచ్చెడివార్త్తఁ దెలిసి యాతనిరాకకై నిరీక్షించుచు మాలతి పుట్టింటి కేఁగుట మాని పుష్పపురమునందే నిలిచియున్న దను సంగతి వ్యక్త మగుటయేగాక మాధవునం దామెకుఁగల దృఢాచంచల ప్రణయమును దెలియుచున్నది.

మఱియు నిప్పట్టున అప్పన్నకు మాధవునకు జరగినసంభాషణము, పల్లెపట్టులలో ధనికులయిండ్లలోఁ బరిచారకులుగా నుండువారు తమచేతు లతోఁ బెంచిన యజమానులబాలకులు పెద్ద లయి విద్యావంతు లయి నప్పు డెంతయు మురిపమును జెంది వారివేషభాషలలోఁ గలిగెడిమార్పులఁ జూచి యమాయకహృదయములతో నైట్టిప్రశ్నములు భావములు వెలువరింతురో వ్యక్త మొనరించి జానపదజీవనమునందలి మాధుర్య మున కాదర్శకముగ నున్నది. హైదరబాదులో రైలెక్కినతర్వాతఁ జింతాధీనుఁడై మాధవుఁడు ఆలోచనామగ్నుఁ డగుట పరికించి యాతని యెదుట బల్లపయిఁ గూర్చుండి ప్రయాణము చేయుచున్న యొకయపరి చితస్త్రీవ్యక్తి, కళాశాలవిద్యావతి, యాతనితోఁ బరిహాసపూర్వకముగఁ గావించిన యప్రస్తుతప్రసంగము నేఁటికళాశాలావిద్యార్థినులు పలువు రల వఱచుకొనుచున్న విపరీతచేష్టలను సూచించుచున్నది. ఇట్లు లెన్నివిధ ములఁజూచినను నికావ్యమున నిష్ప్రయోజకపాత్ర మెచ్చటఁ గనరాక సర్వపాత్రపోషణము తదున్మీలనము నతినిపుణముగ సర్వాంగీణసౌందర్య ముతో నిర్వహింపఁబడిన వని నా విశ్వాసము. పాఠకు లీవిషయమున భావనైవిధ్యమును బ్రదర్శింప నవకాశము లేదనియే నా నిశ్చయము.

## రసనిరూపణము

ఈకావ్యమునందలి ప్రధానరసములు శృంగార వీర కరుణము లని గ్రహింపఁదగును. నాయ కోపనాయక నాయిక లయిన మాధ

వానంద మాలతీ రాధల ప్రణయానురాగనిరూపణపోషణలలో శృంగారము సముచితముగఁ బ్రతిపాదిత మయినది.

పుట్టిననాఁటినుండియుఁ గష్టముల కాలవాల మైన మధుకుమారి విూన్నేనసాగరతీరమున మాధవవర్మతోడి ప్రధమసమావేశసమయమున నివేదించిన యామె చరిత్రకథనమునందేమి, అటుతర్వాత భగ్నమనోరథగఁ బరిణమించుటచే నామెకు వాటిల్లిన యున్మాదాదికములవివరణము నందేమి, కావ్యావసానమునఁ గథానాయికమాలతికి ఘటిల్లిన దుర్మరణాదికనివేదనమునందేమి కరుణరసము వెల్లివిరియును. ప్రధమాశ్వాసమున సుభద్రారోహిణుల సల్లాపములందు, సరోవరతీరమున రాధామాలతీలక్ష్ములు సల్పిన ప్రసంగములందుఁ, జతుర్థాశ్వాసమున లక్ష్మీమాలతుల సరసాలాపవిలాసచేష్టలందు, మాధవుఁ డప్పన్నతో సల్పిన సంభాషణమునందు, మాధవుఁ డుపహారము స్వీకరించుసమయమునందలి వక్రోక్తులయందు మృదుతర మైన హాస్యరస మొలుకును. మాధవ కైవర్తుల సంభాషణము నందు, మధుకుమారి ధాత్రికి మాధవునిఁ బరిచయము సల్పునవసరమునఁ గూడఁ గొంతవఱ కిది గోచరించును. ఆనందుఁడు మధువు నామెగృహమునఁ బ్రధమసందర్శన మొనరించుసన్నివేశము హాస్యమునకుఁ బరాకాష్ఠ యనఁజనును.

ధైర్యసాహసములతో నానందుఁడు నీటిలో మునికి యందు మునిఁగిపోయెడిరాధ నొడ్డునకుఁ జేర్చునపుడు, మాలతీమధుకుమారికల ప్రధమసమావేశమునందు, మాలతీమాధవులపెండ్లికై సన్నాహములు జరుగుదినములలో నావార్త నెఱుంగకయే మధుకుమారి హైదరాబాదులోఁ దాను నిర్మించిన ధర్మసంస్థలప్రారంభోత్సవమునకయి స్వయముగా వచ్చి యాహ్వానించు నెపమునఁ దలఁపనితలంపుగ నాకస్మికముగ మాధవుని యావాసమున కరుదెంచినపుడు సుభద్రాదు లామెను వీక్షించి యబ్బురపడునవసరమునను అద్భుతరసము వ్యక్త మగును.

సుభద్రాగృహప్రాంతోద్యానమున బిల్వతరుకాండమును గోరాడి యాలపోతు, అందలిమధుకోశమును భ్రంశ మొనరింప నందలితేనె టీఁగలు చెలరేగి దానిని నలువైపులఁ గ్రమ్మి గాటముగఁ గాటు లొనర్చి నపు డది విజృంభించి ఱంకెలు వైచుచుఁ గావించినభయంకరదృశ్యము లను, అప్పట్టున మాలతికి ఘటిల్లినదుర్మరణదృశ్యమునను, బీభత్సభయా నకములు ప్రస్ఫుటము లగుచుండును. తదితరరసములుగూడ నందందు స్వల్పాతిస్వల్పముగఁ జల్పితము లయినట్లు కనవచ్చును. ఏమయినను "శృంగ (ప్రాధాన్యము) మియర్తీతి శృంగారః" అనుటచే శృంగారరస మును, "ఏకోరసః కరుణ ఏవ" అను భవభూతివాక్యానుసారము కరుణ రసమును రెంటిమాత్రమే ప్రాధాన్యము నొంది యీకావ్యమున రస స్థాయి నొందినట్లు తలంపవచ్చును.

"కాలసూత్రధారుఁడు నాట్యకళను జరమగమ్యమును జేర్ప భూరి శృంగారవీరరసము లుదయింప దిద్దెఁ బాత్రల ననంగ, వెలసె నవయౌవన ప్రభావిలసనములు" అని మాధవానందుల నవయౌవనవిలసనములను వర్ణించుపట్టున నిక్కవి యుగ్గడించి యిక్కావ్యమున నాటకీయతావీర శృంగారరసప్రాధాన్యముల ధ్వనింపఁజేసియున్నాఁడు. నాటకీయతఁగూర్చి ప్రత్యేకశీర్షిక లనిందు వివరింతును. ప్రస్తుతము కవి కభిప్రేతములగు క్రింద వానిలో శృంగారమునుగూర్చి ముచ్చటించి యుంటిమి; కావున వీరరస విచారమునకుఁ గడంగుదము.

వీరరసవిషయమున నిక్కావ్యమం దంతట మాధవునివర్తన మున ధర్మవీరమును, మధుకుమారివర్తనమున ధర్మదానవీరములు రెం డును సువ్యక్తము లగుచుండును. మాధవవర్మ మధువునకుఁ దనయెడఁ బ్రణయముతోఁ గూడినకోరికకూడ నున్న దని వ్యక్త మగునప్పుడుఁ గూడ నామె నెనలేనినెచ్చెలిగానే కాని వధువుగాఁ గొన నిచ్ఛగింపకుండు టకుఁ గారణ మంతకుమున్ను పిన్ననాఁటినుండి తనప్రణయసర్వస్వము

మాలతికి దత్త మయియుండుటచే దాని కితరత్ర స్థాన మేమాత్రము నుండఁజన దనుధర్మనియమమునకు బద్ధుఁ డయియుండుటయే యని చదువరులకు గోచరింపఁగలదు. అట్టియాతని మహితధర్మశీలతకు మాలతీ నియుక్తప్రణయమునకు నొకింతయు భంగము కలుగనీయకుండుటకూడఁ దనవిధి యని మధుకుమారి గ్రహించి యాతనియెడఁ బ్రణయాసక్తిని త్రికరణశుద్ధిగఁ ద్యజించి యంతటినుండి ప్రేమాస్పదుఁ డగు హితమిత్రముగనే యాతని నారాధింపఁ గృతనిశ్చయయై దివంగతు లయిన జననీజనకులచిత్రపటములయెదుటఁ దద్విషయకమైన ప్రమాణ మొనరించుటకూడ నామెధర్మవీరమునకుఁ బ్రబలనిదర్శనము. ఇప్పట్టున మాలతీమధుసంభాషణపూర్వకముగఁ గవి దశమాశ్వాసమున రచించిన పద్యములు 9 నుండి ౮౫ వఱకుఁ దిలకింపనగును. చేతి కెముక లేకుండ బీదసాదలక్షేమమునకై యామె తనవిత్తము నౌదార్యముతో వెచ్చించుట, హైదరబాదునందు నెలకొల్పిన ధర్మసంస్థాత్రయము నామె దానవీరమునకుఁ బ్రబలదృష్టాంతములు. ఒకదృష్టిలో మాలతికూడ ధర్మవీరమున కాలంబనమే యని గణింపనగును. మధుకుమారియమృతహృదయమును నిర్మలచరిత్రమును నామె విని గ్రహించినంతనే యామెను దనయనుంగుసోదరికన్న మిన్నగ గణించి యామెయానందమునకు సుఖమునకుఁ దా నంతరాయముగ నుండుట ధర్మము కాదని తలంచి తనతోపాటామెకూడ మాధవున కర్ధాంగిగ సహధర్మచారిణిగ నుండవలె నని యకల్మషచిత్తముతో నభిలషించి యందుకై మాధవుని మధుకుమారిని సమ్మతింపఁ జేయుటకై కావించినయత్నము లామెధర్మశీలౌదార్యముల కాదర్శకములు; కాని పూర్వోక్తకారణములచే నామెయభిలాషము చరితార్థము కాదయ్యెను. వివాహానంతరము మాలతి యంతర్వత్నిగా నున్నప్పుడామెకు భర్తకు జరిగినరహస్సల్లాపసందర్భములలో "అనిన సంతోషవార్నిధి నామె మునిఁగి, ప్రాణనాయకా! దాక్షిణ్యపరులు తాము, దక్షి

ణులు కామి వింత; సోదరియు మీాదు, ధర్మరతి నెంతకొనియాడెఁ దలఁప వశమె" (ఆ. 10 ప. 184) అని భర్త యక్షీణదాక్షిణ్యావ్యాదయుఁ డయ్యుఁ దనప్రార్థనమును మన్నించి మధుసోదరినిగూడ ధర్మపత్నిగ గ్రహించి దక్షిణనాయకధర్మము నిర్వహింపకుండుటకు విన్నదనమును వ్యక్తము చేసెను.

మాధవునితండ్రి నరసింహవర్మ పుష్పపురమందలి శివకేశవాలయముల కేఁగి భక్తిమెయి నాదైవతమ్ముల నారాధించువాఁడని వర్ణించు పట్టునను మాలతిజనకుఁడు రామవర్మ తనపురమునఁ గుమారితో దేవాలయమున కేఁగి భగవత్ప్రసాదమును బ్రతిదినము గయికొనెడివాఁడని వర్ణించుటలోను, మాధవానందులు, శ్రీకాకుళమున విద్యాభ్యాస మొనర్చుదినములలో వా రాచరించెడి దైనందినచర్యల నుగ్గడించు "బ్రాహ్మ ముహూర్తము ప్రాపింప మేల్కని కల్యముల్ దీర్చి శిశుకునియాన, వ్యాయామ మొనరించి వాయుసాధనఁ జేసి చన్నీట స్నానము సల్పి యొడలి......" ఇత్యాదిపద్యములందును, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థాశ్వాసములందును, బంచమాశ్వాసమున లక్ష్మి మాలతితో "నేఁటిసమాజముఁ గాంచి చింత వొడమ నాజీవితము సేవ కిడితి ధార" అని యుపక్రమించి కావించిన సంభాషణాదికములందును, సుభద్ర గృహ దేవతార్చనముపట్లను, మాధవునిఁ జూపుచు మధుకుమారి మాలతితో "వ్యాయామం బొనరించి కండరము లుబ్బన్ శ్రాంతి పెంపారఁ బ్రా, ణా యామంబును సల్పునాథు నదె యానందంబునన్ గాంచు మా, ఛాయన్ శంకరుఁ బోలె సంఘటితనిశ్వాసున్ నిబద్ధాసనున్, మాయుంజేయును మానసవ్యథలు రమ్మా! యక్క! యీాచక్కికన్" (ఆ. 10 ప. 38) అను సన్నివేశములందును శాంతరసము పోషింపఁబడినది.

ఉద్యానపర్యటనమునందు మాధవవర్మ పూర్వకాళింగరాజన్యుల పరాక్రమాదులను విదేశవిజిగీషాయాత్రలను స్మరించి వర్ణించుటలో వీర

రౌద్రములు వ్యక్తము సేయఁబడినవి. కళింగమహాయుద్ధానంతరకళింగ దేశస్థితిని వరసింహావర్మ వర్ణించుపట్టున బీభత్సకరుణములు తొణికిస లాడుచున్నవి.

ఇట్లు గ్రంథమున శృంగారవీరకరుణములు స్థాయిరసములుగాఁ దక్కినవి యంగములుగా. నవరసములుగూడ నిందు సముచితముగఁ బోషింపఁబడినవి. శృంగారవీరములు కరుణరసపర్యవసాయులై కరుణ మేకైకరసముగ నీకృతియందు భాసించుచున్నది. నాయకోపనాయకు లందు ధీరోదాత్తధీరలలితలక్షణము లుపలక్షితము లయినవి.

## రచన, శైలీపాకాదికములు, ధ్వనివిశేషములు.

పూర్వాంధ్రకవులలో నుత్తమకావ్యరచనాలక్షణములను గొంత వఱకయినఁ దమకృతులలో నుగ్గడించినవారు తిక్కనసోమయాజి, శ్రీనాథుఁడు, పింగళిసూరన.

అలఁతియలఁతితునియలఁగాహాల సంధించినవిధమున లలితము లగుశబ్దములతో భావార్థసంపద మెఱయఁ గావ్యము రచింపఁదగు నని నిర్వచనోత్తరరామాయణావతారికలో

"కం. లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతియలఁతితునియలఁ గా
హాల సంధించినవిధంబు నమరఁగవలయున్."

(అలఁతి యలంతితునియలుగ, హాల సంధించిన... అను ముద్రిత ప్రతులపాఠము సరికాదు.)

అను పద్యమునఁ దిక్కన నిర్వచించినాఁడు. కాహాల యనునది యొకవాద్యవిశేషము. బాకావంటిది. చిన్నచిన్నపీకెలతోఁ గూర్పఁబడి యేకాకృతితో నేర్పడి యది మనోహరసుస్వరముల వెలార్చును. తిక్కన రచనము చాలవఱకు కీవితమునసే యలరారుట సర్వవిదితము.

భీమేశ్వరపురాణావతారికలో శ్రీనాథుఁడు-

"మ. హరచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్."

అని యుగ్గడించినాడు. ఆతఁడు పేర్కొనిన వక్రతకుంతకుని వక్రోక్తిజీవిత మనుగ్రంథమున వివరింపఁబడినట్టి దని కొందఱువిజ్ఞుల మతము. కొన్ని యక్షరములయు శబ్దములయుఁ బునఃపునరావృత్తిచే నేర్పడు మనోజ్ఞతయే వివిధరూపములుగా వక్రోక్తి యనుపేరితో వ్యవహరింపఁబడు నని కుంతకునిమతము. అట్టివక్రోక్తి శ్రీనాథునికవితలో బహుళముగఁ బ్రకాశించును. ఇఁక నాతఁడు పయిపద్యము రెండవపాదమునఁ బేర్కొనిన కాఠిన్యము సరససంస్కృతశబ్దములతో గ్రథిత మయినగాఢసమాస బంధము. అట్టిది శ్రీనాథునికృతులలోఁ బలుతావులఁ బ్రత్యక్ష మగుచుండును. మూఁడవపాదమున నుదాహృత మయిన సరసత్వము కావ్యమునకు జీవనప్రాయ మైన రసస్ఫురణమే. కవులసామర్థ్యానుగుణముగ బహువిధముల నీసరసత్వము వారికృతులం దభివ్యక్త మగుచుండును. దీని నాపాదించుటలో శ్రీనాథుఁడు సిద్ధహస్తుఁడు. రసహీనమైన కావ్యము నిర్జీవశరీరమువంటి దని చెప్పనక్కఱలేదు.

"చెప్పఁ దగుఁ గవిత రసముల్
చిప్పిలఁగా మేలు మేల్బళీ యన లేదా!
యొప్పుడు చెప్పక యుండుట
యొప్పు సుమీ సుకవి యెంతయుచితజ్ఞుఁ డౌనో!"
అని మాదయగారిమల్లన వచించినాఁడు.

"పాసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన ధోరయుశబ్దములఁ గూర్చి

యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగా వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాసంబు లింపుగాఁ బాదుకొల్పి
యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చుసత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు కలరె."

అనుపద్యమునఁ గళాపూర్ణోదయమునను–

"శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి నర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁజనక
ప్రకృతార్థభావంబు పాదుకొ నడుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ
నొకటఁ బూర్వోత్తరవిరోధ మొదవకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుకనేర్చుట బహుతపఃఫలము గాదె."

అనుపద్యమునఁ బ్రభావతీప్రద్యుమ్నమునను బింగళిసూరనామాత్యుఁడు సరసకవితారచనావిధానముల నిర్వచించినాఁడు. ఈతఁడె కళాపూర్ణోదయమున మఱియు,

"చలువ గలవెన్నెలల చెలువునకు సౌరభము
　　　　గలిగినను సౌరభము చలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత
　　　　నెలకొనిన సౌరభముఁ జలువ పసయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁ బెంపెసఁగు
　　　　మలయపవనంపుఁగోదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కల దనఁగ వచ్చుఁ గద
　　　　వెలయఁ గలయూసుకవిపలుకులకు నెంచఁగ౯."

అని కవితాస్వరూపమహాత్మ్యముల నుగ్గడించియున్నాఁడు.

పూర్వోక్తకవినియమములకెల్ల నాదర్శకముగ నుండువిధముననే శ్రీ రాజారావుగారు ప్రకృతకావ్యమును నిర్మించియున్నారు. గాఢ సమాసబంధము శ్రీనాథునికృతులయందుంబలె నంతజటిలముగ నుండ కున్నను మృదుమధురపదములతో నది యందం దీకృతిలోఁ గాన వచ్చును. మచ్చున క్రిందికొన్నిపద్యములఁ దిలకించునది.

"కాంచిరి పుష్పపల్లవనికాయసమన్వితవృక్షగుల్మనే
త్రాంచల ... ... ... ..." (ఆ 3 ప 150)

"సమదేందీవరసుందరాలక......" (ఆ 4 ప 14)

"పరిధానాంచలసంచలాంసతలముల్..." (ఆ 4 ప 65)

"నీలాభీలవిశాలవారిరుచియుక్......" (ఆ 4 ప 68)

మొత్తముమీఁదఁ గావ్యమంతటను నాతికఠినమును నాతిమృదువునునగు ధారాశైలిలోనే రచనము సాగినది. అందుకుదృష్టాంతముగఁ గొన్ని కొన్నిపద్యముల నేఁటి యీపీఠికలో నుల్లేఖించుట యనవసరము. అట్టిది తినఁబోవుపదార్థముల ముందఱ నుంచి రుచుల నెంచుటవలె నిరర్థకము.

సహజగంభీరత, సుప్రసన్నత, శ్రావ్యమగు నక్షరరమ్యత యీ కావ్యశైలియందంతటను బాఠకులకు వ్యక్తమగుచుండును. అందుచే

నిది ద్రాక్షాకదళీపాకశోభిత మనియు, వామనమతానుసారముగ వైదర్భీ పాంచాలీరీతిసమంచిత మనియుఁ జెప్పఁదగును. నన్నెచోడ పాల్కురికి సోమనాథాదిశైవకవులమార్గము ననుగమించి యీతఁడు జానుతెనుఁగు పయిఁగూడ మక్కువను మిక్కుటముగ వెలార్చి పెక్కుతావుల జిలిబిలి జానుతెనుఁగునుడులతోనే రచన సాగించును. ప్రకృతిపరిశీలనదక్షత యందు సోమనాథాదిశైవకవులే యీతనికి మార్గదర్శకు లని యెన్నఁ దగును.

కథావస్తువు కేవలము వాచ్యముగ నున్నకృతులుకన్న ధ్వనిప్రధానము లయినకావ్యము లుత్తమము లని ధ్వనికారుల మతము. ధ్వని యనఁగా వ్యంగ్యముగఁ బాత్రలసంభాషణాదికములలోనేమి, చరిత్రనిరూపణమునసేమి, రాఁబోవుకథను గాని జరుగఁబోవువిషయములఁ గాని సూచించుట. వ్యంగ్యవైభవము గలకావ్యమే యుత్తమస్థానము నలంకరింపఁగలదని యాలంకారికుల నిర్ణయము"మనాక్ కావ్యార్థసూచనమ్" అను సూక్తి (అనఁగాఁ గావ్యారంభపద్యముననే వ్యంగ్యముగఁ గావ్యమందలికథ సూచితము కావలె ననుట) పై మర్యాద ననుసరించియే యేర్పడినది. కావ్యారంభ మనుశీర్షికక్రింద నీకృతిలోని నాందీపద్యము నందలి వ్యంగ్యార్థముల ముందే ముచ్చటించియుంటిని. ఇతరత్రగూడ నీకావ్యమునఁ బలుతావులఁ గవి యిట్టివ్యంగ్యమర్యాదను బాటించి యున్నాఁడు. ఈక్రిందిపట్టులఁ దిలకించునది.

1. ఉద్యాన పర్యటనములోఁ గల్హారపుష్పసంపాదనావసరమున రాధ కాలు జాఱి సరోవరమునఁ బడి ప్రమాదమునకుఁ బాలయి యానందునిచే రక్షిత యైనయనంతరము మాధవప్రేరితుఁడై యానందుఁడు మాలతీరాధాలక్ష్ముల ఛాయాచిత్రములను వారికిఁ దెలియకుండనె వివిధమగుతీరులఁ బరిగ్రహించి "క్రొత్తబిచ్చగాఁడు ప్రొద్దు నెఱుంగఁ" డనుపోల్కి మీఁ ప్రసంగముల కవధి కానరాకున్నది. మరల విరుల సేకరిం

తురో! సరోవరస్నానము లొనరింతురో! లెండు" అని హెచ్చరింప, మాలతి "ఎత్తిపొడుపు లేల? పుష్పసంపాదనమును మజ్జనమును నిప్ప్ర యోజనములు కాలేవు గదా! చిరకాలస్మరణీయమై జన్మాంతఫలప్ర దమే యయ్యె" ననుచు నాసుందరీముఖుల విహారోన్ముఖలఁగా నొనర్చె" (ఆ. 4 వ. 61) ఇందు మాలతివాక్యములలో నికముందు రాధానందు లంతరాయములు తీఱి వివాహితు లయి యాజన్మ మనుభవింపంబోవు నానందమయజీవితము ధ్వనిత మగుచున్నది.

2. మాధవవర్మ యొనర్చిన మహేంద్రతనయానదీవర్ణనావసర మునఁ బ్రసక్తమయిన "ఎంతదూరము పయనించె నీమహేంద్రతనయ ప్రియుఁగూడ........." (ఆ. 4 ప 112) "ఆవాక్యమ్ములు విని పలు భావమ్ములు గ్రమ్మ........." (ఆ. 4 ప 113) అనుపద్యములలో వ్యంగ్యమైన భవము తులకించుచున్నది. మనోజ్ఞ మగు నీధ్వనివిశేషము పాఠకులు తిలకించునది.

3. మధుకుమారిజన్మదినమహోత్సవమునకు స్వయముగా వెళ్ళ నేరనిసందర్భమున మాధవవర్మ పుష్పపురినుండి శుభాకాంక్షలతో లేఖ లిఖించి పంపునవసరమున-

> మరల వ్రాయునంత మాలతి తిలకంపు
> కుంకుమంబు వ్రేలికొనను దీసి
> మధురభావ మలమ మధునామమున నద్దె
> నొడుఁ గలచె చాని నరసి యత్త."

"మాధవుఁడు ప్రియఁ గాంచి మమంగళి యగు మనుచు దీవించు చుంటివా" అనియె; నంత "విచలితాత్మయై యచ్చోటు వీడి పోయి, యర్చనామందిరముఁ జొచ్చె నాసుభద్ర" (ఆ. 8 ప. 275, 276) అను పద్యములలో నుదాహృత మయిన మాలతియనాలోచితకృత్య మామెకు

వివాహానంతర మనతికాలముననే ప్రాప్తించునమాంగళ్యము వ్యంగ్యముగ సూచించుచున్నది.

సేవాదీక్షితయై దృఢచిత్తమునఁ గన్యావ్రతమును నిర్వహించు మధుకుమారి విచలితయై వకుళవృక్షద్వయమధ్యమున నున్న మాధవ విగ్రహమును గాంచి—

"వలపలివ్రాఁకె నీడ లిడి వల్లభు సేవల నల్పఁగల్గె; దా
పలిపీటపంబు వేవెలుఁగు వ్రాలఁగ నర్చ లొనర్పనేర్తుఁ......".

(ఆ. 11 ప. 25) అని తలంచుచున్నుకభావము ధ్వనిగర్భితమై మధుకుమారిసెందనున్న గృహిణీత్వమును సూచించుచున్నది. ఇది నిసర్గ సుందర మని పాఠకులు గమనింపఁగలరు.

5. కుమారునిబారసాల జరిగిననాఁడు మాలతి మధుకుమారిని గాంచి "చెల్లి ! నీ విడుగడువును జెల్లు నేఁడు, బాధ్యతలు సర్వమున్ సమర్పణ మొనర్చి, నేను పరిపూర్ణవిశ్రాంతి నేఁటె పడయఁ, గలను." ఇత్యాదిగఁ జెప్పినపద్యములలో (ఆ. 11 ప. 151, 152, 153, 165) నామెనోట ననాలోచితముగ వెలువడినవాక్యములుగూడ నానాఁడే యామె కాసన్నముకానున్న దుర్మరణము సూచించుచున్నవి.

6. మధుకుమారి మాధవునకుఁ దనభవనమున విందుఁ గావించిన ప్రధమదివసమున దివంగతయైన యామెజననివసనములను జవాహరిని దొడిగి పదార్థముల వడ్డించుటలోను వానినే యామె లక్ష్మిద్వారా మాలతివివాహదినమునాఁటికి వెలలేనిక్రొంగొత్తచీరలుమున్నగువానితో పాటు పంపుచు, వానిని మాలతి శోభనపుదినమునాఁటికేయి ధరింపవలె నని యాదేశించుటలోను, ఆదుస్తులతోడనే మాలతి కుమారుని బారసాల నాఁడు మధుకుమారిని స్వహస్తములతోడ నలంకరించి, "న న్నీనాఁ డీ వొకపెండ్లికూఁతువలె ని ట్లీవేషమున్ గూర్పఁగా నే నోర్వన్ క్షమియింపు" మని యామె వారించుచున్నను "ని న్నీవేషముతోడఁ జూడ

మనసై నే నిట్లు గావించితిన్, మన్నింపం దగు నీసపత్నికయి యీమాత్రంబు సైరింపలే, కున్నన్ సంకట మొందు దెంతయును నాయుత్సాహమున్ దీర్పవే, యన్నన్ మా ర్వలుకంగ నోడి మధు తా నాదుస్తులన్ దాల్పంగన్.” (ఆ. 12 ప, 162, 163) అని పల్కిన వాక్యములందును భావికథావిధానములు వ్యంగ్యముగ నిమిడియున్న వని చెప్పనక్కఱలేదు.

7. మాధవునియాకస్మికాగమనమున మధుకుమారి యాత్మహత్యాకృత్యమునుండి విముక్త యయినపిమ్మట వారిరువురకు జరగిన సంభాషణసందర్భమున నామె యాతనికరతలమునందలి రేఖలఁ బరీక్షించి యాతనికి ద్వికళత్రయోగ మున్న దని గ్రహించి యుగ్గడించినపుడు “అతిభాగ్యవశమున నమరునేమో నాకు నీమహాపురుషు సేవించుఘనత, లేనివో మరణింపఁ బూన విఘ్నంబుగాఁ జనుదెంచె నేటి కీసదమలాత్ముఁ, డేదియైనను జచ్చి సాధింతు నేమి?, వేచిచూచుట యగును వివేకమెందు, నిదియు నొకమేలుకే” అని లోలోనఁ దలంచికొనెను. మాలతీమాధవులప్రణయానురాగమునఁ దాను పాలుగొని యంతరాయము కలిగింపరాదని మధుకుమారి కృతనిశ్చయయై మాలతిని ప్రాణసమానయగు భగినిగా భావించి యకల్మషప్రేమతో నామెను గారవించుచు స్వప్నముననైనను నామెతోడియెడఁబాటును మాధవునకుఁ దాను గాంక్షింపకున్నను సాముద్రికశాస్త్రమునందలివిశ్వాసముకలిమి భావికాలమునఁ గాఁగలకార్యము కొంతవఱ కామె కవగత మయియుండెననియే ద్యోతక మగును. ఇందును భావికథాగమనము లీలగా ధ్వనించుచున్నది.

8. గ్రంథమునకుఁ గవి యుంచిన మధూదయనామమునఁగూడ నెంతయో వ్యంగ్యార్థము గర్భిత మయియున్నది. మధుకుమారి యను నామ మామెజనకుఁడు గోవిందరాయలు తనధర్మపత్నీస్మారకముగ నుంచినది. కావున నామెతల్లినుండియు నీమధుశబ్దమున కాకర మేర్పడినది.

మధుకుమారి మాధవవర్మగృహిణీపదమును బడయకున్నను నేతత్పదమం దుండి మాధవునివలన మధుకుమారునిఁ గనినమాలతి యామె కరమరలేనియక్కఁగా నున్నప్రతినిధియే. నిరంతరము మాలతీమానసమున మధుకుమారిరూపము హత్తియుండుటచేఁ బుట్టినబిడ్డఁడుగూడ నచ్చముగ నన్నితెన్నుల నామెనే పోలియుండెను. అందుచే నాతనికి మధుకుమారి వలదన్నను మాలతీమాధవు లామెపేరే పెట్టిరి. రెండవకాన్పుఁ బడసినతర్వాతనే తొలిచూలిబిడ్డను దన కిమ్మని మధుకుమారి మాలతిని ముందే కోరియున్నది.

మఱికొన్నిచోటులలోఁగూడ నీమధూదయనామమును గవి గ్రంథమందు సముచితస్థలములలో నుల్లేఖించియున్నాఁడు. కూర్మినాయఁడు తనమనుమరాలురాధనుగూర్చి చెప్పునప్పుడు "ఈనిసుంగె మాజీవితోద్యానవాటి నలరఁజేయు మధూదయమై చెలంగు" (ఆ. 8 ప. 182) అని వచించినాఁడు గ్రంథాంతమందు మాలతీదుర్మరణమునకుముం దందుకుఁ బ్రధానాంగముగ వర్ణితమయిన మధుకోశభ్రంశకల్పనముగూడ గణింపఁదగినది. మధుకరములచేఁ గూర్పఁబడిన మధుకోశమున నుండెడి మధు వామధుకోశభ్రంశ మయినపుడే బహిర్గత మగుట లోకానుభవసిద్ధము. అట్లే మధుకుమారిజననమునకుఁ గారణమైన మధుకుమారియు, మధుకుమారునిజననమునకుఁ గారణమైన మాలతియు వినాశ మొందుట కల్పనాపాటవమునకు విజయధ్వజ మననగును. మధుకుమారుఁ డుద్దిష్టతరుణమునకుముందే స్వర్గమున కేఁగుజననిచే మధుకుమారికరమందు మాధవునిసమక్షమునందే దత్త మగుట ఘటిల్లినది. గ్రంథముచివర నున్న గద్యలో "పురాతనాధునాతనకావ్యవాహినీసంగమసరోవరసదృశమధూదయమహాకావ్య" మని చెప్పుటచే విశిష్టలక్షణములచే నీకృతి నేఁటివాఙ్మయోద్యానమునకు మధూదయము కాఁగలయంశమునుగూడఁ గవి వ్యంగ్యముగ సూచించినట్లు గోచరింపఁగలదు. ఇట్లు పలుతెఱంగు లగువ్యం

గ్యభావములతో నీగ్రంథమునకు మధూదయనామకరణ మొనర్చఁబడి నట్లు తెలియఁగనగును.

## నాటకీయరచనాశిల్పము — సంభాషణావచస్సామర్థ్యాదికములు.

శ్రవ్యకావ్యములలో దృశ్యకావ్యవిధానములఁ గవి ప్రతిపాదించి నిర్వహించుట నాటకీయత యందురు. నాటకములలోఁ బ్రేక్షకులహృదయములకుఁ గథాపాత్రములసంభాషణమూలమున నితివృత్తము ప్రత్యక్షముగ గోచరించి యాకర్షణీయ మగుటవలన నట్టిదానినే శ్రవ్యకావ్యములఁగూడఁ బాఠకలోకమునందుఁ గలిగించుటకయి సమర్థు లయినకవు లుద్యమింతురు. ఇట్టిశిల్పమునఁ బూర్వాంధ్రకవులలోఁ దిక్కనసోమయాజి మిక్కిలి దిట్ట యనియు నాతనిభారతానువాదమున ముఖ్యముగా విరాటోద్యోగపర్వము లిందుకుఁ జక్కని యాదర్శము లనియు విజ్ఞులయభిప్రాయము.

ప్రస్తుతప్రబంధమున మనకవియును నీకళావిశేషము నతిసామర్థ్యముతో నింపుమించుగఁ గావ్యమందంతట నతిమాత్రముగ నిర్వహించి యున్నాఁడు. గ్రంథరచనావిధానమున నీతఁడు ప్రతిజ్ఞాపూర్వకముగ రచించిన "స్వస్థానజాతిభాషాసంస్కృతులు........." (ఆ. 1 ప. 13) అను సీసపద్యము నాలవపాదములో "సంభాషణల్ వచస్సామర్థ్యయుతములై వ్యంగ్యాత్మకంబులై వఱలవలయు" అని వ్రాసియున్నాఁడు. అందుచేఁ బెక్కుతావుల రసవంతములుగఁ బాత్రములపరస్పరసంభాషణములతోడనే కథేతివృత్తమును బాఠకులకుఁ గనులఁగట్టినట్లు నిపుణముగాఁ బ్రదర్శించినాఁడు. కథాశ్రోతగాఁ గూర్చికొనిన నిజసతితోఁ గావ్యోదయహేతువిషయమున జరపిన ప్రసంగములోఁ బ్రప్రథమమునసే యీకళావిశేషము ప్రారంభ మగుట పరిశీలింపఁదగినది (ఆ. 1 ప. 6-21) అవకాశముకలిగినపుడెల్ల సరసములగు పాత్రసంభాషణములతోఁ గథను నీతఁడు నడిపిన పట్టులకు దృష్టాంతములుగాఁ గొన్ని యీక్రింద నుదాహరించుచున్నాను.

1. అడుఁబడుచులు సుభద్రారోహిణులు మాలతీమాధవులకై శివము అనే వారిపెండ్లిబేరములఁగూర్చి సల్పిన సరోక్తులు (అ. 1 ప. 171-176).
2. మాలతివిషయమున మాధవుఁడు మేనత్తరోహిణితోఁ బల్కిన తొక్కుపల్కులు (అ. 2 ప. 18-23).
3. మాలతి డోలికలో బాలికగానున్నకాలముననే యామెరూపలావణ్యములఁగూర్చి నృసింహావర్మ మఱియుసందర్భములో నాతనికి సుభద్రారోహిణులకు జరగిన సరసప్రసంగములు (అ.2 ప.39-46).
4. మాలతి మాధవునిగృహిణిగా మునుముందే యంకిత మొనర్ప మని యాకాంక్షించునెడ సుభద్రకు మాలతితండ్రిరామవర్మకు జరగినసంభాషణములు (అ. 2 ప. 59-66).
5. మాలతిడోలికోత్సవమునకు వేళకు రానందుకు నృసింహావర్మ బావమఱఁదిరామవర్మతో మేలమాడుసందర్భము (అ. 2 ప. 68-74).
6. మాధవానందులను నాంగ్లవిద్యాభ్యాసనమునకై శ్రీకాకుళము పంపునవసరమున నందలిసాధకబాధకములవిషయమై నృసింహావర్మ, సుభద్ర, రోహిణి ముప్వురకుఁ జర్చాపూర్వకముగ జరగినప్రసంగము (అ. 2 ప. 12-49).
7. మాధవానందులను శ్రీకాకుళమునఁ జదివించుటకు వారు కృతనిశ్చయు లయినయనంతరము వారి వచ్చుటకుఁ బంపుటకుముందు నృసింహావర్మకు సుభద్రకు జరగినసంభాషణము (అ. 3 ప. 65-71).
8. మాధవానందుల యుద్యానప్రయాణములోఁ గవిటిలోఁ దారసిల్లిన కూర్మినాయఁడు వారిని దవయాతిథ్యమునకై యాహ్వానించునవసరమున మాధవునకుఁ గూర్మినాయనికి జరగినసల్లాపములు (అ. 3 ప. 162-174).
9. కూర్మినాయనియింటఁ బ్రథమసమావేశమున రాధానందుల కను

రాగ మంకురించినసంగతి పసిగట్టినపట్టున రాధాలక్ష్ములకు జరగిన సల్లాపములు (ఆ 3 ప 214-219).

10. ఉద్యానసంచారానుగతికై రాధాప్రభృతులప్రసంగములు (ఆ 4 ప 4-7).

11. రాధ సరోవరమున మునిఁగిపోవ నానందుఁ డామెను రక్షించిన పిమ్మట రాధానందులకు జరగినసంభాషణము (ఆ 4 ప 35-40).

12. సరోవరతీరమున మాధవానందులకుఁ గుమారీత్రయమునకు జరగిన వినోదప్రసంగములు (ఆ 4 ప 42-61).

13. మాధవకైవర్తుల సంభాషణము (ఆ 4 ప 118-130).

14. బారువాబస్టాండువద్ద మాధవాదులను తిరుగుదలలోఁ గవిటిలో నాఁగవలసినదిగ రాధ యర్థించునప్పటిప్రసంగము (ఆ 4 ప 135).

15. కూర్మినాయనియింట నాఁగినపుడు మరల నాతనికి వేంకమకు మాధవాదులకు జరగినసంభాషణము (ఆ 4 ప 146-177).

16. నాఁటిరేయి విరజాజిపాదపాంత నిండువెన్నెలలో రాధానందులకు జరగినప్రసంగము (ఆ 4 ప 199-243).

17. కవిటినుండి మఱలునపు డానందుఁడు, లక్ష్మి, కూర్మినాయనితో నొనర్చినప్రసంగము (ఆ 4 ప 247-50).

18. రాధకుఁ దల్లివేంకమకు జరగినప్రసంగము (ఆ 4 ప 257-262).

19. రాధావిరహామునంజేసి యుద్యానప్రయాణమునుండి తిరిగివచ్చిన పిమ్మట నానందునిపరిస్థితిలోఁ గలిగినమార్పును బరికించి కారణ ములఁ నరయునవసరమున మాధవానందులసంభాషణము (ఆ 5 ప 44-69).

20. మాధవావిష్టమానసయై చింతించుమాలతిని వెనుకపాటునఁ గనులు మూసినలక్ష్మికి నామెకుఁ బ్రవర్తిల్లినప్రసంగము (ఆ 5 ప 118-192)

21. అనంతరము మాధ వానంద మాలతీ లక్ష్ములకు జరగినప్రసంగము

(ఆ 5 ప 192-215).

22. పిమ్మటఁ గవిటి కేఁగినపుడు రాధానందుల కేకాంతమునఁ బ్రవర్తిల్లిన ప్రణయప్రసంగము (ఆ 5 ప 234-265, ఆ 5 ప 5-43).

23. అంతఁ గూర్మినాయఁ డింటి కేతెంచినతర్వాత నాతనితో రాధానందు లొనర్చినప్రసంగము (ఆ 6 ప 43-121).

24. అనంతరము మాధవుని భావివిద్యాభ్యాసమునుగూర్చి విచారించు నపుడు నరసింహావర్మ బిడ్డలతోఁ గావించినసంభాషణము (ఆ 6 ప 124-165).

25. మధుకుమారితోఁ బ్రథమసమావేశ మయినపుడు మధుమాధవులకు జరగినభాషణము (ఆ 6 ప 202-272).

26. విందుకై మధుకుమారిగృహామునకు మాధవునిఁ గొనిపోయినపుఁడామెతోను దాదితోను మాధవునకు జరగినప్రసంగము (ఆ 7 ప 19-31) మధుమాధవుల ద్వంద్వార్థగర్భితప్రసంగములు (ఆ 7 ప 35-74).

27. తల్లియుత్తరముపయి మాధవుఁడు సంక్రాంతిసెలవుల కింటి కేతెంచు సందర్భమున మధుమాధవులప్రసంగములు (ఆ 7 ప 105-142).

28. మాధవునియెడఁబాటున విరాళింగూరిన మధుకుమారికి నామెదాదికి జరగినప్రసంగము (ఆ 7 ప 152-179).

29. రైలు దిగినవెంటనే మాధవుఁడు పుష్పపురి కేఁగునపుడు బండి తోలుకొని వచ్చినసేవకుఁడు అప్పన్నకు మాధవునకు వర్తిల్లిన వినోదప్రసంగము (ఆ 7 ప 257-278).

30. మాలతిని బరిహాసించువ్యాజమున మాధవుఁడు తల్లిసుభద్రతోఁ బల్కినవక్రోక్తులు (ఆ 8 ప 52-64).

31. అపట్టున మాలతి విచారగ్రస్తయైనపుడు సుభద్రకు నామెకు జరగినసంభాషణము (ఆ 8 ప 70-75) అనంతరము మాలతీమాధవు

లకు జరగినప్రసంగము (ఆ 8 ప 79-96).

32. రాధానందులప్రణయము చరితార్థతను గాంచుటకై మాధవుఁడు వెరవుల నరయునవసరమున సుభద్రకు నచ్చుటివారికి జరగినసంభాషణములు (ఆ 8 ప 156-235).

33. మధుమాలతుల ప్రథమప్రసంగము (ఆ 8 ప 289-297, ఆ 9 ప 4-43).

34. వాల్తేరులో మధువునకు రాధానందులకు ఘటిల్లినప్రసంగము (ఆ 11 ప 72-87).

35. బారసాల కేతెంచిన మధుకుమారితో మాలతీప్రసంగము (ఆ 11 ప 98-125). నృసింహావర్మ, మధుకుమారి, లక్ష్మి, సుభద్ర, రాధల సంభాషణము (131-142). మధుమాలతుల సంభాషణము (151-154; 162-168).

మాధవానందులయౌవనము మిసమిసలాడుసమయమున వేసవి సెలవులలో వారు వినోదముగ నుద్యానప్రయాణమున కుపక్రమించునవసరమునఁ గవి భావగర్భితముగ వారియౌవనమును బ్రశంసించుచు రచించిన "యౌవనోదయసమయమం దాకుమారు, లందు విందుగ జీవితోద్యాన శోభఁ, బులకరింప మధూదయముగఁ జెలంగు, పసిమివయసును వెలఁ గట్ట వశమె యెందు" (ఆ 8 ప 110). "రమ్యజీవితనాటకరంగమందుఁ, గాలసూత్రధారుఁడు నాట్యకళను జరప, గమ్యమును జేర్ప భూరిశృంగారవీర, రసము లుదయింప దిద్దెఁ బాత్రల ననంగ, వెలసె నవయౌవనప్రభావిలసనములు (ఆ 8 ప 111)" అనుపద్యముల నవలోకింప నీకవి కీకావ్యరచనాశిల్పములో నాటకీయత బాహాటముగఁ బ్రదర్శించు కుతూహలము మెండుగాఁ గల దని తోఁపకమానదు. పై యుదాహరణములనుబట్టి ద్దాని నాతఁ డెంతసమర్థముగ నిర్వహించెనో చదువరు లూహింపకపోరు.

కథాపాత్రముల ప్రత్యేకపరస్పరసంభాషణములవలెనే యుల్లేఖించె నాయికానాయకు లయిన మాలతీమధుకరమాలికలయు, మాధవునియు స్వగతవచనవిన్యాసము నాటకమునందు విష్కంభములవలెనే ఈప్రబంధమునం బ్రచరించి యుపకరించినవి. కథాగతి నవిచ్ఛిన్న మొనర్చుటకుం గడచినవృత్తాంతము పాఠకులకు గ్రాహ్యామగుటకు నీతం డీప్రక్రియ నుపయోగించెను. రచనాశిల్పమునం దిదియ్యది యొకవిశిష్టలక్షణము.

నాటకార్థప్రకృతు లనంబడు బీజ, బిందు, పతాక, ప్రకరి, కార్యము లయిదునుగూడ యథాస్థానముల నిందు బాగుగాం బ్రతిపాదింపంబడినవి.

i మధూదయమునకు హేతువయిన మాలతీమాధవుల పరిణయ ప్రణయములకు బీజము "అన్నా ! యిది మా కోడలు; మున్నే చూచి నిడి లేను" (ఆ. 2 ప. 51) అని సుభద్ర రామవర్మతోం గావించినప్రసంగములో స్థాపిత మయినది.

ii 'చిన్ననాంటిచదువులలో' విజయదశమి పండువు దినములలో నయ్యవారితో గిలకలుపట్టుకొని యింటి కేతెంచినయనంతరము తల్లిసూచనపయి మాధవుండు వింటం బూవులు దొడిగి వానితో డోలికయం దున్న మాలతిని గొట్టుటయే బిందురూపముగం బర్యవసిత మయినది. అనంతర మది విస్తరిల్లి పరిణతి నందుటకే యుద్యానయాత్రలో వారివిహారములు, పరస్పరప్రణయావలోకనములు, వేసంగిసంక్రాంతిసెలవులలో మాధవుండు పుష్పపురి కరుదెంచినపుడు వారికిం బ్రాప్తము లయిన సాహచర్యసాంగత్యములు పరికల్పితము లయినవి (ఆ. 3 ప. 130-133, 235-240; ఆ. 6 ప. 186-199; ఆ. 8 ప. 19-45; 78-105).

iii ఇంక నుపనాయకుండుగా ఘటింపంబడిన యానందునివృత్తము పతాకకుం బరిపూర్ణ మయిన లక్ష్యము. కథాంతర్భాగముగ నాతనిచరి

తము కడముట్టఁ బ్రధాననాయకుఁ డగు మాధవునివృత్తమునకుఁ బరి పోషకముగనే సాగినది. మాలతీమాధవులు గాఢప్రణయానురాగబద్ధు లయినవృత్తాంతము మధుకుమారికి వ్యక్త మగుట యాతని సంభాషణ మునసే గదా! తుదకు గావ్యావసానమున మాలతికి ఘటిల్లిన దుర్మరణ సమయమున నావశ్యకచికిత్స నొనరించి యామెకుఁ జైతన్యము గలి గించి, యామె మధుకుమారికి మధుబాలకుని సర్పణమునేయుటకుఁగూడ నాతఁ డుపకరించెను.

iv గ్రంథము చతుర్థాశ్వాసమునఁ బ్రవేశపెట్టిన కైవర్తుఁడు, సప్తమాశ్వాసావసానమునఁ గూర్పఁబడిన యప్పన్నపాత్రము తాత్కా లికప్రయోజనములు గలవియై నాయకోదాత్తతను బ్రణయోద్దీప్తిని గూర్చి ప్రకరినామకకార్యప్రకృతి కవి చక్కనిలక్ష్యములుగా భాసించు చున్నవి.

v కావ్యముయొక్క కార్యము (ఫలసిద్ధి) అను నంతిమప్రకృతి గ్రంథము చివరియాశ్వాసమున మధూదయరూపమునను, మాలతి బిడ్డని మధుకుమారికాయత్త మొనర్చినవృత్తముతోను ఘటితార్థ మయినది.

ఇట్లు కవి యుద్దేశించిన దృశకావ్యలక్షణలక్ష్యప్రాయరచనావైశి ష్ట్యము కావ్యమంతట వెల్లివిరిసియున్న దని చెప్పఁదగును.

## సన్నివేశకల్పనముల సహజరామణీయకము

ఈకావ్యమునందలి కథాగతియంతయు వాస్తవముగనే జరగి యుండు నని పాఠకులచిత్తములకు హత్తుకొలుంగుననే కొనసాగిన దని స్థూలముగమునుముందే చెప్పియున్నాను. ఆయాసన్నివేశకల్పనములందుఁ బాఠకలోకమునకు సహజసంఘటనమే గోచరింపఁగలదు. కాని కాల్పనిక దృష్టి కలుగనేరదు. ఇట్టిఘట్టములకుఁ గొన్నిదృష్టాంతములు. (1) మాధ వావిష్టధ్యానయై మాలతి యున్నప్పుడు వెనుకపాటున మఱఁదలు లక్ష్మి తటాలున వచ్చి యామెకనులుమూసి నర్మోక్తులాడుట (2) కవిటిలో

రాధానందుల ప్రాంగణసమాగమము. (3) రాధ ప్రణయోద్వేగస్థితి. (4) మధుమాధవుల ప్రథమసమాగమము. (5) మధుకుమారిభవనమున మధుమాధవులకుఁ గలిగిన సంభాషణములోని వక్రోక్తులు (6) సంక్రాంతి సెలవులలో మాలతీమాధవులకుఁ గలిగిన సమాగమములు (7) మాలతి కుంకుమతిలకప్రదానఘట్టము (8) మధుకుమారితో నానందుని ప్రథమ సమావేశము (9) మధుకుమారి ఆత్మహత్యోద్యోగసమయమున మాధ వుని యాకస్మికసాక్షాత్కారము (10) మాలతీమధుకుమారికల ప్రథమ సమావేశము (11) మధుకుమారి తొట్టిస్నానము చేయునప్పటి నిజావ యవప్రయోజనవిచారము (12) వకుళవృక్షద్వంద్వసన్నివేశము (13) మధురాధానందుల కలయిక (14) పుష్పపురోద్యానమున ఘటిల్లిన మధుకోశవృషభసన్నివేశము (15) కుమారప్రదానము- మథుసంకల్పసిద్ధి.

## కథాగతియందలి నిశ్శైథిల్యము

గ్రంథమునందలి వస్త్వైక్యవిషయము నింతకుముందే చర్చించియుం టిని. ప్రతిజ్ఞావివరణములో నీకృతికర్త ప్రథమాశ్వాసమునందలి యెత్తు గీతిలో "అస్థిభారమునా జనునట్టికథను, సంధిబంధముల్ బిగువుగా సంఘ టించి" అను నొకవిశేషమును జేర్చినాఁడు. పదునొంకడాశ్వాసములలో ఘటితమైన యీగ్రంథమందలికథ పరిమితిలో నలఁతియయినది గాక వల సినంతవిస్తృతి (Bulk) గలదియే యని చెప్పనక్కఱలేదు. అట్లయ్యు వివిధఘట్టములసంఘట్టనములో సంధిబంధశైథిల్య మొకింతయుఁ దోఁపని తెఱంగునఁ గవి నిర్వహించిన కథాగతివిధానము వినుతిపాత్రము. బిగువు సెడక, సంధిబంధములు సడలక యతిదృఢముగఁ (Water tight) గథే తివృత్తము కొనసాగిన దని పాఠకులు గమనింతు రని తలంతును.

## వర్ణనవిశేషములు

ప్రబంధరచనమున కుద్దిష్టము లయిన యష్టాదశవర్ణనములెల్ల నీ కావ్యమున నాయాసన్నివేశముల వెలసియున్నవనియే చెప్పనగును. కాని

గతానుగతిక మగు ప్రాబంధికమార్గములకు విలక్షణముగ నొకప్రత్యేక విశిష్టతతో నవి కూర్పఁబడినవి. ఆవిశిష్టత యెట్టిదో పూర్వప్రబంధములం దలి పురవర్ణన, ప్రకృతివర్ణనలతో నిందలివర్ణనములఁ బోల్చిచూచినఁ జదువరులకు వ్యక్తము కాఁగలదు. ప్రథమాశ్వాసమునందలి 65–105 పద్యములందలి పుష్పపురవర్ణనము, తృతీయాశ్వాసమునందలి 67 పద్య మునను న్న శ్రీకాకుళపురవర్ణనము సావధానముగఁ జూడనగును. వీనికిని అసహజము లగు నుత్ప్రేక్షాతిశయోక్తులతోఁ గూడిన పూర్వప్రాబంధిక వర్ణనములకు హాస్తిమశకాంతరవిభేద మున్నది. ఆయావస్తువర్ణనములలో నవగుణరాహిత్యనిరూపణమున సద్గుణసాహిత్యమును బ్రతిపాదించుట యొకవిశేషము. మచ్చున క్రిందిపద్యములను విలోకించుఁడు.

"స్వోదరపోషణార్థమయి జోలెను దాల్చినవాఁడు గాని..." (ప 47)
"ద్యూతకేళీగృహాలు..............." (ప 48)
"ఘోషాయించును..............." (ప 69)
"కొరడాదెబ్బల మేను వాచి........." (ప 72)
"చిట్టు ముందటఁ బెట్టి............" (ప 73)

ఆచటితరుణులు పెరుగుఁద్రచ్చునపుడు వెడలెడి రవములఁగూ ర్చియు రాట్నములఁ ద్రిప్పునపుడు పొడము శ్రుతులనుగుఱించియు 70, 71 పద్యములలో నొనర్పఁబడిన వర్ణనలు నిసర్గమనోహరములు.

అందందుఁ గావింపఁబడిన ఋతువర్ణన ప్రకృతివర్ణనములలోఁ గూడఁ బూర్వప్రబంధమార్గాతిక్రమణము ద్యోతక మగుచున్నది. ఈతఁ డిక్కావ్యమున నాయాతావుల నొనర్చు నిట్టివర్ణనములు ప్రాదేశికవర్ణ నాత్మకము లయి ప్రత్యేకవిశిష్టతతో నాతనిప్రకృతిపరిశీలనాదక్షతను సూచించుచున్నవి. ప్రథమాశ్వాసమున 182–209 పద్యములలో సంఘటి తమయిన వర్షర్తువర్ణన మతిలోకరమణీయముగ నున్నది. ఇందు 195–197 పద్యములలో వివిధమత్స్యవిశేషములయు 198 పద్యమున నీటిపుర్వు

లయు, 199 పద్యమున జలూకాదికములయు, 200-202 పద్యములందు పాములు, వానపాములయు, 203-209 పద్యములలో వానకారున వెలయు వివిధసస్యములయు విషయములు బహుపరిశీలనాత్మకముగా వివరింపఁబడి కన్నులఁగట్టినట్లు వర్ణింపఁబడినవి.

ఇట్లే ద్వితీయాశ్వాసమునఁ దృతీయాశ్వాసారంభమునఁ గతిపయ పద్యములందును శరదృతువిశేషము లతివిచక్షణతతో విశదముగ వివరింపఁబడినవి. ఆయుతువున వర్తిల్లు పిన్నపెద్దలయాటలు, చేష్టలు, క్రీడలు-వివిధములగు పుష్పఫలసస్యజాతులు, కూరపాదులు, జలపక్షులు, తదితర పక్షులు, ఎద్దులు, ఎనుములు, గొఱియలు, పొట్టేళ్ళు మున్నగువాని విలాసక్రీడలు, సరీసృపమీనజాతులవిశేషములు వేర్వేఱుపద్యములలో వివరింపఁబడినవి. దుర్గాష్టమి, మహర్నవమి, విజయదశమి, గౌరీపూర్ణిమ సందర్భములలోఁ బుష్పపురమున జరగిన యుత్సవవిశేషము లతిమనోహరముగ 169-177 పద్యములలోను దృతీయాశ్వాసారంభమునను వర్ణితములు.

ఇట్లే వేర్వేఱుతావుల వసంతర్తు, గ్రీష్మర్తువర్ణనలు హృదయంగమముగ నెనర్పఁబడినవి. తృతీయాశ్వాసమున సంఘటితమయిన మాధవానందులయుద్యానపర్యటన మొకరసవత్తరఘట్టము. ఈమనోహరప్రదేశమునందలి ప్రకృతిశోభావిలోకనములు కథానాయకులు మాలతీమాధవులహృదయములం దంతకుమున్న శైశవావస్థలోనున్న ప్రణయరాగాంకురములు పల్లవించి యుత్ఫుల్లము లగుటకు దోహదము లయినవి. 142 పద్యమందలి బాహుదానదీపరిసరసూర్యోదయవర్ణనము నిసర్గసుందరము. 142-144 పద్యములందలి బాహుదానదిలో మున్కలిడు స్త్రీలవర్ణనము, 145-147 పద్దియములలోని ప్రకృతివర్ణనములు తములపుఁదీఁగలు, కర్పూరకదళీతరువులశోభలు, ఉడుతపిల్లలు, గిజిగాఁడులచేష్టాక్రీడలు, 154-157 పద్యములలో నుత్కళసుందరాంగుల కేళీవిలాసములు, పొలము పనులు మున్నగువర్ణనలెల్ల నింపుసొంపులఁ దులకింపుచున్నవి.

చతుర్థాశ్వాసమున సముద్రతీరమున వసించుజాలరుల నిరాడంబరా మాయకజీవితవిధానములను మాధవానందులు పరికించుచుపట్టున జెప్పఁబడిన-

"పుట్టగోచి కళ్ళాయియు..............." (ప 84)

"మగని కళిముఖు చూచు గోముగ నొకొక్క..." (ప 85)

"ఉదధి జీవన్మరణముల నూఁగులాడి........." (ప.90)

పద్యము లతిమనోజ్ఞముగ నున్నవి. సాగరవర్ణనము, కాసారవర్ణనము, మహేంద్రతనయాసాగరసంగమవర్ణనములు సహజసుందరము లయి పాఠకలోకమును ముగ్ధుల నొనరింపఁగలవు.

ప్రాంతీయతను దోఁపఁజేయు వీరి ప్రకృతివర్ణనములవలెనే వీరి మానవవస్త్రవైఖరులచిత్ర మతిలోకమనోజ్ఞము. రామవర్మవస్త్రవైఖరి, తీవి, నరసింహావర్మ ఫాలమునకుఁ బోవుదృశ్యము, ప్రాచీనతఁ దోఁపఁజేయు సీతయలంకరణము, మధుకుమారి ప్రాచీనాధునాతనవేషధారణము, హైదరబాదునుండి తిరిగివచ్చు మాధవుని విద్యార్థివేషము, పాకశాలనుండి కాఫీగొనితెచ్చు మాలతివర్ణనము, శోభనాలంకృత యగు మాలతివర్ణనము మనోజ్ఞవర్ణచిత్రము లనుటయే సమంజసము. కవిలేఖని యపూర్వసామర్థ్యముతో సీతావుల శిల్పపరాకాష్ఠను బడసె నని చెప్పుట సహజోక్తి.

ఇంతకు నిట్టివర్ణనావిషయములఁ గవి పాటించినస్థలౌచిత్యము ప్రశంసనీయము. మాలతీజననమునకుఁ బూర్వము వర్షర్తువర్ణనము, మాలతీమాధవులయు రాధానందులయు ప్రణయాంకురప్రభవమున కాలంబనముగ వసంతర్తువర్ణనము, మాలతియు, రాధయు, నానందునియు విరహావేదనాప్రాదుర్భావమున కుపాంగముగ గ్రీష్మర్తువర్ణనమును, మాధవానందులక్రీడలకు విద్యావ్యాసంగములకుఁ బూర్వరంగముగ శరత్తును, మధుకుమారీవియోగమునకు మున్నుగా హేమంతమును, కర్మయోగి

నిర్మై కృశించుమధుకుమారి, కుమారోదయము వినుటకుఁ బూర్వము శిశిరమును వర్ణించి కథాగమనమునుబట్టి వానివిస్తృతిని గవి పాటించి యున్నాఁడు. కథావేగ మంతగాలేనిపట్టులలో విస్తృతితోను, కథావేగ మురవడించుపట్టుల సంక్షిప్తముగను వర్ణనలు సాగించుట రచనాశిల్పము నకుఁ బ్రధానలక్షణము గదా! ఈగ్రంథమున గణనీయమైన కథావేగము షష్ఠాశ్వాసమధ్యమున మధుకుమారీపాత్రప్రవేశముతోఁ బ్రారంభ మయి నది. కథావేగము హృదయాకర్షకముగ నున్నప్పుడు, పాఠకములోని పుడకలవలెఁ బ్రకృతివర్ణనాదికములు పాఠకులకు రుచింపకుండుట నైజము. ఆదిగుర్తించియే యాతఁడు మెలకువతో షష్ఠాశ్వాసమునుండి యాకృతిలోఁ బ్రకృతివర్ణనములందు వైరళ్యమును బాటించినాఁడు. ఇది యాతని యుచితజ్ఞతకు నిదర్శనము.

## వర్ణనౌచిత్యము

ఎన్నిసల్లక్షణములున్నను గావ్యమున నౌచిత్యమును బాటింప నిచో నది రసభంగకారణ మని పెద్దల యభిప్రాయము. ఇందుఁగూర్చి క్షేమేంద్రుఁడు 'ఔచిత్యవిచారచర్చ' యను ప్రత్యేకగ్రంథమునే గీర్వాణభాషయందు రచించియున్నాఁడు. కవికులగురుఁ డగుకాళిదాస మహాకవి కుమారసంభవకావ్యమున జగత్పిత లగుపార్వతీపరమేశ్వరుల సంగమవర్ణనములో శృంగారరసాతిరేకముగఁ గొంతవఱ కౌచిత్యాతిక్రమణ మొనర్చినాఁ డనువిమర్శకు గుఱి యయినాఁడు. కావునఁ నన్నింటి కన్నఁ గావ్యరచనమున నౌచిత్యనిర్వహణ మత్యావశ్యక మని చెప్ప నక్కఱలేదు.

శ్రీ రాజారావుగారు గ్రంథమందంతట వర్ణనౌచిత్యమును బాటించి రని నావిశ్వాసము; కాని యాక్రింది రెండుపట్టులందును నాదృష్టికిఁ గొంత యనౌచిత్యశంక పొడముచున్నది. "లోకోభిన్నరుచిః" అని యున్నది కావునఁ బాఠకులే దీని దగురీతిని నిర్ణయింపఁదగును.

i ఉపనాయకుఁ డానందుఁడు రెండవసారి కవిటిగ్రామమున కేఁగి నపుడు కూర్మినాయఁడు నాతనికూఁతురు వేంకమ యింట లేనియొంటరి సమయమున నాతఁడు రాధను సందర్శించుట సంభవించెను. ప్రథమ సమావేశముననే యన్యోన్యము ప్రణయ మలమికొని యెట్టికష్టనిష్ఠుర ములకోర్చియైనను వారు తమదాంపత్యమును జరితార్థము గావించికొనఁ గృతనిశ్చయు లయి పెద్ద లెవ్వరికిఁ దెలియకుండఁ దమకుఁదామే రహస్య ముగఁ బ్రమాణములు గావించుకొనిన ప్రణయిను లయినను నేకతముగ సంప్రాప్తమయిన యాసమాగమము నవకాశముగాఁ గొని కావించిన యాలింగనచుంబనాదికములను గవి పంచమాశ్వాసమున 227-265 పద్య ములందును, షష్ఠాశ్వాసమున 12-34 పద్యములందును వర్ణించి యున్నాఁడు. అప్పటికి రాధ యవివాహిత; తల్లిచాటుకన్య. రాధానం దుల ప్రణయానురాగము, వారి ప్రమాణములు కూర్మినాయనియు వేంక మయుదృష్టిలో లేవు. ఆర్యమర్యాదల ననుసరించి ప్రథమసమాగమము నాఁటి చర్యలకుఁ దో డీద్వితీయసమాగమవ్యవహారమున రాధకన్యా త్వము దూషిత మయిన దనకతప్పదు. "గణించుచే పరులు ద ప్పెన్నెంచి నన్ గాముకల్" (ఆ. 5 ప. 225) అని కవి యొకయర్థాంతరన్యాస విన్యాసమొనర్చినను నాలింగనాదు లయినతర్వాత రాధ యానందునితో

"చని యనురక్తి పెల్లుబుక ఝుర్ఝురితాంగము సొంపు నింప నే
మొనరుపవద్దు నాథ! యిఁక నూరక చూచుటమాత్రమే తగున్
గనుఁ డిఁకఁ దల్లిచాటు మనుకన్యకగా నను; దొంగచూపులన్
బనుపకుఁ డోర్వఁజాల మనవారలచెంతను గుట్టు రట్టగున్" (ఆ6 ప26)

అనువాక్యములవలన వారికృత్యములందలి యనౌచిత్యము రాధకుఁగూడ నవగత మయినట్లు కానవగును. దీర్ఘవియోగానంతరము హఠాత్సంభవ మగు నలభ్యసమావేశమున యువతీయువకు లుద్విగ్ను లగుట సహజమే;

కాని సమాజధర్మము ననంతరమునకన్న మొదటనే స్మరించియుండుట యుచితమేమో !

ii సంక్రాంతిసెలవులకు జననిసుభద్ర వ్రాసినలేఖపయి మాధవవర్మ హైదరబాదునుండి పుష్పపురి కేతెంచి నాఁటిరేయి శయనించెను. మఱునాఁడు ప్రాతఃకాలమున మాధవుఁడు నిద్రాముద్రితుఁడై యుండ మాలతి యేకతమున నాతనికిఁ బాదాభివందన మొనర్చి చనుచుండెను. ఆమెస్పర్శచేఁ గనులువిచ్చి మాధవుఁ డామెచర్యను గ్రహించి యామెను బిలిచి గాఢాలింగన మొనర్చుకొని చుంబించును. (అ. 8 ప. 18_42). ఇచ్చటఁగూడ ననౌచిత్యము గోచరించుచున్నది. చిన్ననాఁటినుండియు మాలతీమాధవులప్రణయము రూఢ మయి వ్రేళ్లువారి యున్నను, తల్లి దండ్రులచేఁగూడ వారిదాంపత్యము నిర్దిష్ట మయినను, అగ్నిసాక్షికముగ నార్యధర్మానుగుణముగ వారివివాహ మప్పటి కింకను నెఱవేఱలేదు. ఇట్టి పరిస్థితిలో మాధవవర్మతొందుడుకుచర్యలవలన మాలతికన్యాత్వముగూడ దూషిత మొనర్పఁబడిన దని చెప్పకతప్పదు. ఇది జరగిననాఁడే మాలతి మాధవునికడకుఁ జని "హాసన్ముఖయై ప్రియాభిమతమ్ము లగుశాకంబు లారసి చన నుంకించుచు నాతఁడు మాలతోష్ఠసంపుటిం జూపుడు నాయమ ముక్కుపై వ్రేలు నాన్చి బుద్ధి! బుద్ధి! యని హెచ్చరించుచు నొయ్యారి మొలయఁ జనియె." (అ. 8 ప. 121) అని మాలతియే యాతనికి బుద్ధిచెప్పినట్లు వ్రాయఁబడినది. పెద్దతలకాయ తల్లి సుభద్ర యింట మసలుచుండ మేనగోడ లయినను నవివాహిత యైయున్న మాలతిపట్ల మాధవుఁ డొనర్చిన యిట్టిచర్య లనౌచిత్యదూషితములు గనే గణింపఁదగు నని నాయభిప్రాయము. మఱొండుసందర్భమున

"కామోద్రేకము కన్నుఁ గప్పునెడ యుక్తాయుక్తముల్ యావనుల్
తా మూహించుట కష్టసాధ్య మగు; స్వార్థప్రేరితుల్ కన్యకా

క్షేమంబుగా బలిఁ గొందు; రట్టియెడ సౌశీల్యంబుఁ బోనాడఁ బో
రాముల్ పుట్టును; గాన శీల ముడివోరా దెందుఁ గన్యామణుల్"
(ఆ. 8 ప. 198)

అని కవిగారే మాలతీసంభాషణమువమూలమునసే హెచ్చరించియున్నారు; కావునఁ బయినన్ని వేశచర్యలు ప్రమాదపతితము లని నమ్మ వీలులేదు. పాఠకు లిందలి యౌచిత్యానౌచిత్యములను యథాశక్తి నిర్ణయించుకొనఁగల రనియే నావిశ్వాసము.

## అలంకారములు - లోకోక్తులు - జాతీయములు.

కావ్యలక్ష్మికి శోభఁ గలిగించుటకే యలంకారము లేర్పడినవి. కావ్యాంగనిర్మాణమునకు వలయు శబ్దఘటనవిషయమున "తదదోషౌ", "పరిష్కృతౌ" అని సంస్కృతి, అలంకృతి రెండుఁగూడ శాస్త్రకారులు నుడివియున్నారు. ఇందుచే శాస్త్రమర్యాదల నతిక్రమించని యీకవిరాజు సముచితాలంకారసంపదఁగూడఁ దనకావ్యకుమారికిఁ గూర్చియున్నాఁడు. దానికిఁదోడు కవితకు జాతీయత వెలయ దేశీయములు, జాతీయములు నగు సామెతలను లోకోక్తులను నిపుణతతో నాయాతావులఁ జేర్చి తనరచనను మెఱయించినాఁడు. గ్రంథమామూలాగ్ర మిట్టివి నిండియున్నవి. వాని నెక్కువగా నుదాహరించుట గ్రంథవిస్తర మగును. అడుగడుగునకుఁ దారసిల్లులోకోక్తులను జాతీయములను జదువరులే యిందు గుర్తించి యానందించుట సముచితము.

శబ్దాలంకారములలో వృత్త్యనుప్రాసము, అంత్యప్రాసము, శబ్దశ్లేష, యమకము నర్థాలంకారములలో రూపకము, ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, శ్లేష, అర్థాంతరన్యాసము నిందుఁ బ్రధానస్థాన మలంకరించును. అందునను అర్థాంతరన్యాసవిన్యాసమే కొంత హెచ్చుగాఁ గానవచ్చును. మచ్చునకుఁ గొన్నిదృష్టాంతముల నుదాహరింతును.

## శబ్దాలంకారములు

"సిరుల కిరవు రిత్తచేలకుఁ గఱవు......" (ఆ 1 స 27)

"మాపతియు నుమాపతియును......" (ఆ 1 ప 105)

"నుడువదు పరులయందునఁ గల్గు......" (ఆ 1 ప 118)

"ఇటులా నల్వురు దృశ్యసంపదల......" (ఆ 3 ప 168)

## అర్థాలంకారములు

"భృంగసంగత జ్యాఘోష......" (ఆ 1 ప 88)

"నవరత్నస్థగితంబు........." (ఆ 1 ప 186)

"సమదేందిందిర సుందరాలక......" (ఆ 4 ప 14)

"ఆత్మనిక్షిప్తభూరిశోభానుభోగ్య..." (ఆ 7 ప 38)

"విందులకు విందు వగుదువో సుందరాంగి..." (ఆ 7 ప 72)

## లోకోక్తులు

బుద్ధిముదిరి పెడదారిఁబట్టినపోల్కి— ఉప్పుపప్పుతోఁగూడుక్రియ— ఒంటికాఁపుర మాశించునంటకోడలు— ఏలుకొనువానిలోనుండు నెల్ల నేర్పు— దొడ్డిలేఁగనుగొన శుల్క—మేల— వంటయిలుసొచ్చు కుక్క—లవడుత్రు— కొలుకరాని కొయ్య— కీలెఱిఁగి వాతఁ గీలించుజాణ— మూఁడుపువ్వు లాఱు కాయలు— పంది నందిగఁజేయు నేర్పరులు— కన్నగానిఁ దేలుకుట్టినపోల్కి— గుంటకాకి యేమెఱుఁగును వింటిదెబ్బ— కన్నకడుపుతీపును వెలఁగట్ట వశమె— పుండుపైఁ గారముసల్లుపోల్కి— కంచరపిల్లిచేసడికిఁ గాంచునెభీతి— ఏకు మేకౌను, తాతకు దగ్గులు నేర్పనెంచుట— అల్లముం దిను కాకి—

## పారిభాషిక, వ్యావహారిక పదప్రయోగములు

నేఁటిజనవ్యవహారమున రూఢముగ నాఁటుకొని సులువుగ నర్థస్ఫురణము గలిగించు ఆంగ్లభాషాపదములను, ఉర్దూపదములను గావ్యరచనమున బాహాటముగాఁ గయికొనుటయే సజీవాంధ్రభాషాసంప్ర

దాయ మని నేఁటియభిజ్ఞుల యభిప్రాయ మనియు నిట్టి దీకవికిఁగూడ నభిమత మనియు ముందే చెప్పియుంటిని. అందు కనుగుణముగ స్కూలు, కాలేజి, రేడియో, డాల్డా, బస్సు, కారు, ఫ్రాకు, ఫ్లాస్కు, కెమేరా, కప్పు, టిక్కెట్టు, ఫోను, రోడ్డు. బాల్కనీ, జట్కా, రైలు, స్టేషను, రిక్షా, కోటు మున్నగునాంగ్లపదములను, తాలూకా, జిల్లా, సలహా, షోకు, సోఫా, కుర్చీ, సాంబార్, చెట్నీ, గస్తీ, వస్తాదు, లంగా, రంగేళి, కంగారు, కక్కోజి మున్నగునుర్దూపదములను శంకాతంకములు లేక కవి యీగ్రంథరచనమునఁ బద్యగద్యములు రెండింటిలోఁగూడ యథేచ్ఛముగఁ గయికొనినాఁడు. అట్లే కేవలము వ్యాకరణసమ్మతములుగాని అక్కాసెల్లెంద్రు, పిండీబియ్యము, ఉల్టాసీదా, బుగ్గిబూడిద మున్నగుద్వంద్వరూపములను, ఒక్కగానికట్టవంటి ప్రయోగములను వాడియున్నాఁడు. ఈవిధానము బహుపండితజనసమ్మతమే యని తలంతును.

## మాండలికములు - ఆచారములు

కవి యుత్కళప్రాంతమండలి యుత్తరాంధ్రదేశీయుఁ డౌటచేఁ దక్కినయాంధ్రమండలములలో నంతగా వాడుకలోలేని మాండలికపదములు కొన్ని యనివార్యముగ దొరలినవి. అవి కొన్ని యర్థములతో నుదాహరింతును. ఆబోరు=ఆదరణము; బొట్టె=పిల్ల; కంబారి=నౌకరు; గిడుగు=కామలేనిగొడుగు; ప్రత్తిబోగలు=విచ్చినప్రత్తిపింజలు; చెమ్లా=పాగాచుట్టుకొనుగుడ్డ; కంఠపువులు=పువ్వులదండవంటి కంఠాభరణము; చిలకట్టు=పురుషవస్త్రధారణ; సజ్జపకాళి = ఉదయమువండినచల్ది; మండాట=స్త్రీలాడుకొను క్రీడావిశేషము; బరస=ప్రాపు (భరోసాయొక్క వికృతి) నవాతు = ఒకరకముచక్కెర; బెరసలు = మేలుజాతిగోవులు; సన్నెగొడ్డ=పాత్రము; ముట్టెలు=మోపులు; బారామాసి=పండ్రెండు మాసములు కాయు మామిడి; తిట్టి=చేపలు పట్టి వేయుబుట్ట; కక్కి=పినతల్లి; ఘుడుకులు=కాళ్ళయొక్కయుఁ జేతులయొక్కయు సంధిబంధ

ములు; గేరా=జనపాలు; భుక్త=భూస్వామి; పొందరి = తోటపైరు లను పండించు నొకతెగ; గుడియావాఁడు = బెల్లపుమిఠాయి మున్నగు తీపితినుబండారములను తయారుచేయువాఁడు; బురుటు=గీఱు; సున్ను=చూర్ణము; బుక్కు=తిను; ఈళ్లు = కట్నాలు; జత్తులు=యానాలు; చెఱకుపుచ్చెలు=చెఱకుముక్కలు; బుజ్జాయి=చంటిపాపఁడు; గుంట=ఆడపిల్ల, గోయి; గుంటఁడు=బాలుఁడు.

దృష్టిదోషముతీయుటకుఁ దరవాణితో దిగదుడుచుట, అలంకరించినశిశువులకుఁ బాదధూళి నొసట నద్దుట, రైతులు దుర్గాష్టమినాఁడూడుగకొమ్మలతో సల్పువిధానము, శిశువుచు దీసికొనిపోయినతరువాత నామంచముపై మూన్నాళ్ళు పాత్రమును బొత్తులలో నుంచుటమున్నగు పెక్కు మాండలికాచారము లీకావ్యమునఁ బ్రతిపాదితము లైయున్నవి. చదువరులు వానిని గమనింపఁగలరు. "పెరుగుతోటకూర గరువంపుసుద్దులు" అనునదియు మాండలిక మగు లోకోక్తియే యని తలంతును. మీనమేషములు లెక్కింపమి, పష్టాష్టకము, స్త్రీరత్నం దుష్కులాదపి, నభూతో నభవిష్యతి, వంటి శాస్త్రీయలోకోక్తులును నిందుఁ గవి యథేచ్ఛముగ వాడి తనయనర్గళకవితాధారను వెలయించియున్నాఁడు.

## ఛందోవిశేషములు - వ్యాకరణవిశేషములు

రసబంధురముగఁ గావ్యమును నిర్మించుటలో ఛందోవ్యాకరణ నియమములు సమర్థులగుకవివరుల కేమాత్రము నడ్డంకులు కానేరవు. వారిరచనములో గణ యతిప్రాసములు తడవుకొనక్కఱలేకయే ధారాళముగ హేరాళముగ నుచితస్థలముల నతికికొనును. ఈకవిరాజుగారిగ్రంథ రచన మట్టిధారాళగతినే సాగినట్లు ముందే సూచించితిని. యతిప్రాసముల కొఱకెందును వీరు తడవికొనినట్లు కానరాదు.

ప్రాసము సుకరప్రాసము, దుష్కరప్రాసము నని యిరుతెఱంగుల వ్యవహరింపఁబడును. సంయుక్తాక్షరములతోఁ గూడినది దుష్కరప్రా

సము. ఇట్టిమహ్కా-ర్రప్రాసములతోఁ గూడినపద్యము లనేకము లిందు సవ లీలగా నలవోకగా రచిత మైనవిధము కనుంగొన వీరిరచనాసాలభ్యసా మర్థ్యములు తెల్లము కాఁగలవు. మచ్చునకు విస్తరభీతిచే స్వల్పమాత్ర ముగ నుటంకించిన యీక్రిందిపద్యములఁ దిలకింపుఁడు.

"గ్రీష్మాదిత్య........" (ఆ 1 ప 179)
"విద్యావ్యాజమ్మున......" (ఆ 5 ప 107)
"అజ్ఞానంబు నిరక్షరాస్యతయు...'' (ఆ 5 ప 169)
"నవోత్సాహము......'' (ఆ 7 ప 7)
"మాధ్వీమంజుల......" (ఆ 8 ప 122)
"స్వశ్రేయంబు......" (ఆ 10 ప 15)
''ఘర్మగ్లాని......" (ఆ 10 ప 26)

యతులలో నఖండయతి సెల్లునా చెల్లదా యనువిషయమున లాక్షణికలోకమున నభిప్రాయభేదములు వెలసియున్నవి. అఖండ మన ఖండము సేయరానిది. ఇట్టిది సంస్కృతశబ్దములలో సవర్ణదీర్ఘసంధి, గుణ సంధి మున్నగువానివలన ఘటిల్లును. రామ+ఆలయము; వృషభ+ ఈశ్వర; మహా+ఇంద్ర; ఇట్టిపట్ల పూర్వాపరస్వరముల సంధిచే నఖండ రూప మేర్పడును. కావున నిట్టితావుల స్వరవ్యంజనములు రెంటికిఁగూడ యతి నంగీకరించుట యఖండయతి యనఁజెల్లును. కాని కొందఱు తెలుఁగుపదములలో ద్రుతములు పొల్లులుతోఁ గూడినయచ్చులకు నిట్టి యతిని బాటించుచున్నారు. అట్టివి రెం డీకృతియందుఁ గనవచ్చును.

"వృగ్వేచెక లేపార విహారపుబడలిక తీఱంగఁ" (ఆ 3 ప 158)
"వినయ మలర, నన్న! ప్రొద్దు వాటారె నీన్నాఁటి కిచట
(ఆ 3 ప 173)

ఈ యతులసాధుత్వము విచార్యము.

''బెట్టు సూపక యల్లుంద్రు రెట్టు లత్త'' (ఆ 2 ప 71)

అల్లుంద్రము+రు- బహువచనద్విరుక్తిసాధుత్వము విచార్యము. ఇంతకన్న అల్లుంపు రెట్టు లనుట యుక్తము.

మొత్తముమీఁద నీకావ్యమును సమగ్రముగ సావధానముగఁ బరిశీలించినచోఁ గవి ప్రతిజ్ఞాపూర్వకముగా గ్రంధావతారికలోఁ బదు మూఁడవపద్యములో వివరించినలక్షణములనెల్లఁ జక్కఁగఁ నిర్వహించినాఁ డనియు, నా వెనువెంటనే

"శ్రుతమతి, విమర్శనాత్మక
నుతధీనైశిత్యమును వినూతనభావ
ప్రతతి వెలార్చెడుశక్తియు
నతిదుర్లభముల్ దలంప నవి నీ కమరెన్" (ఆ 1 ప 14)

అని కథాశ్రోత యగుసతీమణిపరముగ సాకూతముగఁ జెప్పిన గుణవిశేషము లాతనియందే బాగుగా నమరియున్న వనియు "జీవితోద్యానవాటి నలరఁజేయు మధూదయము" మధూదయ మక్షరతః సత్యమే యనియు నా నిశ్చయము. "శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ" నీని వివిధగుణ విశిష్టత నలవరచుకొనిన యిమ్మహాకావ్య ముత్తమసాహిత్యస్థాయిని గలిగి కవిగారి సాహిత్యవిశారదబిరుద మన్వర్థ మొనర్చుచున్నది. ఆంధ్ర కవిపండితలోకము దీనికి స్వాగత మొసఁగి, యాదర్శముగ గ్రహించి, కవిని బ్రోత్సహించుఁగాక యనియుఁ బరమేశ్వరుఁ డాయురారోగ్య భాగ్యముల నొసంగి యితోధికోత్తమకృతిరచనాప్రవణత్వము వీరికిఁ బ్రసాదించుఁగావుత మనియు నభిలషించు—

కాకినాడ,
18—5—1960.

భాషాసేవకుఁడు,
బండారు తమ్మయ్య.

# శుద్ధపత్రిక

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 35 | 154 | 9 | విముల | విమల |
| 45 | 208 | 4 | పరువ | పఱువ |
| 48 | 8 | 4 | శగచ్ఛంద్ర | శరచ్ఛంద్ర |
| 58 | 53 | 3 | గూర్చ్వనఁగ | మన్ననగ |
| 75 | 109 | 5 | ముత్తైవు | ముత్తైపు |
| 89 | 176 | 1 | బార | భార |
| | | | మహాత్వ | మహాత్త్వ |
| 91 | 3 | 4 | కొదువ | కొదవ |
| 102 | 56 | 2 | భాష్పార్ద్ర | బాష్పార్ద్ర |
| 104 | 64 | 2+3 | వయోతుల్యా | వయస్తుల్యా |
| 107 | 81 | 12 | దిమిరావకుండన్ | దిమిరావకుంఠన్ |
| 129 | 182 | 6 | మొన్మ్రన్న | మోన్మ్రన్న |
| 131 | 194 | 2 | జ్మ్రలా | జ్మ్రాలా |
| 136 | 219 | 6 | సమాయుకులం | సమాయికులం |
| 141 | 246 | 3 | నష్టయుల | నష్టముల |
| 149 | 17 | 3 | డోలికలూ్నగు | డోలికల్దూగు |
| 167 | 100 | 8 | తరతమ్మ్రులం | తరతరమ్మ్రులం |
| 182 | 179 | 4 | వెలయు | వెలయు |
| 187 | 208 | 3 | పరమేశ్వరు | పరమేశ్వరుం |
| 193 | 246 | 6 | గవియె | గనియె |
| 202 | 27 | 3 | చికురాంగి | రుచిరాంగి |
| 208 | 37 | 1 | సాయహ్న | సాయాహ్న |
| 211 | 78 | 2 | నిస్వసన | నిశ్వసన |
| 212 | 88 | 1 | సా. సాయహ్న | శా. సాయాహ్న |
| 215 | 108 | 4 | త్యాకులపాటుఁగూర్చ | త్యాకులమొందఁజేయు |
| 221 | 140 | 1 | మృగతృష్టా | మృగతృష్ణా |
| 226 | 167 | 9 | సంతాము | సంతానము |
| 241 | 242 | 2 | నేమరకఁదోరము | నేమరకతోరము |
| 248 | 15 | 1 | గాబె | గాడె |
| 254 | 51 | 3 | సిగ్గిలకన్మ్రెలంగ | సిగ్గిలకేమెలంగ |
| | 53 | 2 | జకచల | ఝకఝక |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 256 | 65 | 1 | గూర్చ్వన | గూర్చుంత |
| 261 | 91 | 4 | వేర్పడన్ యాతఁడున్ | బారఁగానాతఁడున్ |
| 276 | 178 | 1 | ఊంగలిఁచ | ఊంగలించ |
| | 181 | 2 | గాదుఫ | గాదఫ |
| 278 | 190 | 4 | గాలంపు నేఁటికిన్ | గాలిపెటునేఁడున్ |
| 281 | 207 | 14 | చేతుచు | చేయుచు |
| 285 | 226 | 3 | కృద్ధుల్ | క్రుద్ధుల్ |
| 289 | 244 | 2 | దలన్నూఁచు | నసుంగాంచు |
| | | 8 | నిషేధాద్యావ | నిషేధాదిప్ర |
| 290 | 245 | 1 | దకురక్తి | దనురక్తి |
| 290 | 248 | 2+3 | బహుసంతసమునఁ దలనొగ్గుదుసుల్లసమున్ | గడుసంతోసముమెయిఁ గానిరోదనుల్లాసము |
| 294 | 274 | 1 | చిత్రోజ్వల | చిత్రోజ్జ్వల |
| 301 | 34 | 1 | నిలంపుడెత్తు | నిలుంపుటెత్తు |
| 303 | 43 | 1 | విభవోజ్వల | విభవోజ్జ్వల |
| 304 | 47 | 2 | భానిమ్నమ్నవోసాధ | భావిమ్నమ్నవస్నాధ |
| | | 3 | నవీనోజ్వల | నవీనోజ్జ్వల |
| 307 | 59 | 1 | మధిరే | మదిరే |
| 312 | 83 | 19 | భారాపసద | భారాపనుద |
| 315 | 90 | 12 | సెన్నికొనరు | యెన్నికొనరు |
| 323 | 125 | 1 | మెసలం | మసలం |
| 329 | 156 | 8 | ఖ్లోలనో | ఖ్లోలకో |
| 337 | 208 | 2 | పశ్యాపేక్షలం | పశ్యాకాంక్షలం |
| | | 4 | నిస్వార్థంబు | నిస్స్వార్థంబు |
| 340 | 218 | 1 | సీయూషాంశు | పీయూషాంశు |
| 346 | 250 | 2 | వాక్చ్చురులం | వాక్ఛురుల |
| | 254 | 1 | సాయవహ్న | సాయాహ్న |
| 347 | 257 | 2 | రెండ | రెండు |
| 350 | 271 | 4 | నాసంబు | నాననంబు |
| 356 | 22 | 3 | కుసుబోండ్లు | విరిబోండ్లు |
| 358 | 86 | 3 | భవచ్చరణముల్ | భవచ్చరణముల్ |
| 368 | 91 | 8 | రాత్రమ్ములఁ | రాత్రములఁ |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 370 | 105 | 11 | సమూకృష్ణ | సమూకృష్ట |
| | | 11 | నిస్వార్త | నిస్స్వార్థ |
| 374 | 121 | 3 | మాలతీరోష్ట | మాలతోర్వశ్వ |
| 374 | 125 | 2 | మధురాంబుః | మధురాంభః |
| 381 | 164 | 2 | రాత్రింబగ | రేయుంబగ |
| 388 | 200 | 1 | భావోర్వన్నతి | భావ్యున్నతి |
| 399 | 255 | 1 | నిస్వార్థా | నిస్స్వార్థా |
| 420 | 79 | 1 | దత్యంతవంత | దత్యంతచింత |
| 431 | 140 | 1 | చికురాంగి | యకలంక |
| 435 | 152 | 5 | అదృష్ట | అతిభాగ్య |
| 444 | 192 | 4 | వాధి కారస్తు | వాధి కారస్తే |
| | | | కధాచన | కదాచన |
| 449 | 220 | 1 | దప్పకొట్టియ | దప్పకుండుట |
| | | | నిరా | సదా |
| 452 | 227 | 1 | మధనంబు | మదనంబు |
| 462 | 283 | 1 | యావము | యావనము |
| 465 | 298 | 1 | పరణ | పరిణ |
| 467 | 8 | 4 | నిర్భర | నిస్పృహ |
| 485 | 93 | 1 | నఅలు | నరలు |
| 490 | 120 | 3 | కళింగేకత్వమున్ | కళింగైకత్వమున్ |
| 491 | 125 | 4 | సంతసాద్వేల | హర్షనిర్వేల |
| 492 | 128 | 1 | నిస్వార్థ | నిస్స్వార్థ |
| 493 | 132 | 1 | ” | ” |
| 503 | 173 | 1 | ” | ” |
| 506 | 192 | 3 | కృధా | క్రుధా |
| 514 | 41 | 4 | కృతిన్న్ | కృతిన్ |
| 520 | 75 | 3 | యందుగూర్చొవ | గూర్చుండగా |
| 521 | 83 | 4 | వైళంబ | దమరింక |
| 523 | 95 | 1 | టాంగి | బోండి |
| | 97 | 1 | ధుమ | మధు |
| 535 | 167 | 2 | టాంగి | బోండి |
| 540 | 194 | 1 | తత్వా | తత్త్వా |

శ్రీమన్మాతాపితృభ్యాం నమః

# మధూదయము

## ప్రథమాశ్వాసము



గౌరీరమణీమనోజ్ఞముఖరా
జీవస్థితానందరే
ఖాగాంభీర్యదయాప్రియప్రణయసా
క్షాత్కారహృద్భావసం
యోగైకాత్మ మనఃప్రవృత్తిఁ గనుసా
ద్యుక్ శంకరుఁ గొల్తు వి
ద్యాగణ్యప్రచయాభిరామఘనకా
వ్యశ్రేష్ఠకల్పార్థినై.

సీ. కమ్రామ్రపల్లవఖాదనానందస
మారబ్ధకోకిలాహ్లాదరవము
మాధ్వీమరందసంప్రాప్తానుమోదభృం
గీసముత్సాహసంగీతరవము
దేవాయతనకుడ్యదేశనివాసపా
రావతకూజితరమ్యరవము
పఠనమందిరపురోభాగసంస్థాపిత
'రేడియో'సంగీతకృతిరవంబు

గీ. చెవులకుఁ గదంబమై వింతచెలువుఁ గూర్ప
మల్లి విరజాజి రేఖాణి మొల్ల పొదలఁ

జెలువుఁ గూర్చెడిగ్రీహాముఖసీమ నొకట
నేను మధుమాసదివసావసానమందు. 2

గీ. వాలు'కురిచీ'పయిని మేను వ్రాల్చి, కాళ్లు
'స్టూలు'పై నిడి వినువీథి జున్నుముక్కఁ
బోలు వెన్నెల పూపమేఘాల సిలి
తెరలు వెలువడు చెలువము నరయుచుండ. 3

గీ. గల గల రవళించు గాజుల చిఱుమ్రోఁత
వేణిఁ గుల్కు క్రొత్త విరులతావి
కదలుచున్న చంద్రకాంతోపలాకృతి
భువిని డించె నన్ను దివి నెడల్చి. 4

ఆ. వె. ఇంటిపనులు దీర్చి యేకాంతమున నున్న
నన్నుఁ జేర వచ్చు వన్నెలాడి
నన్నపూర్ణఁ గాంచి, యాసీనఁ గావించి
వలపుఁ గులుకు నుడుల నలరఁజేయ. 5

గీ. "అంతరాయము గలిగె నూహాపరంప
రలకు నా రాకవలన; స్వార్థమున మిమ్ముఁ
గలఁచితిని; నన్ను మన్నింపవలయు" ననెడి
చెలియకేలును బట్టి చెక్కిలిని బుఁకిడి. 6

గీ. "స్వార్థ మెట్లగు సుఖదుఃఖభాగులందు ?
రమణి ! వినయసూక్తులచు దీవ్రముగఁ దాఁకె
భావనారూపములు మూర్తిఁ బడసి నిలువఁ
గలఁతఁ బొందెడునట్టి వెంగలియుఁ గలఁడె ?" 7

గీ. చంచలదృగంచలరుచిప్రసారగరిమ
నినుమడింప స్మితజ్యోత్స్న నిండువదన

పలికె భంగ్యంతరమునఁ "గావ్యమున నన్ను
నిలుప నెంచకు కెల్లనోఁచులను బడఁగ. 8

గీ. సరి సరి ! ప్రసంగవశమున దొరలె నొక్క
సందియము దీర్పుఁ డీమధ్యఁ జాలకాల
మయ్యెఁ గావ్యనిర్మాణమునందు శ్రద్ధ
విడిచి; విద్యార్థిగా మాఱఁ దొడఁగి తేమి ?" 9

గీ. అనుడు "భావప్రవంతి చంద్రానన ! నిను
నలమికొని పేరుకొనియె; నే మందుఁ గాంత !
ప్రణయనీవీక్షణాగ్నిని గ్రాఁగి, పొంగు
వారి, వెల్లువ యగు; నిది కారణ" మన. 10

ఆ. వె. "బాగు బాగు; పడుచుప్రాయఁపుటాగడాల్
విడువఁబోవ; రాన నిడుదుఁ గావ్య
రచన దీక్షఁ గొనుఁడు; ప్రాజ్ఞులు సప్తసం
తానములను గృతి ఘనంబ యంద్రు." 11

గీ. కపటకోపముఁ జూపు నాకమలనేత్ర
ననునయింపుచుఁ "బూర్ణా ! కృతాపరాధుఁ
డను; శిరోధార్య మగును సూచన; యొకండు
వరము మాత్రము దయసేయవలయు వినుము. 12

సీ. స్వస్థాన జాతి భాషాసంస్కృతులు నుడి
కారంపుసొంపు చేకూరవలయుఁ
బాత్రచిత్రణ ప్రాణవంత మై బహువిధ
వృత్తుల నలరి దీపింపవలయు
నాలంబనోద్దీపనాదిభావంబుల
కలయిక రససిద్ధిఁ గాంచవలయు

సంభాషణల్ వచస్సామగ్ర్యయుతము లై
వ్యంగ్యాత్మకంబు లై వఱలవలయు

గీ. అస్థిభారము-నాఁ జనునట్టితదను
సంధిబంధముల్ బిగువుగా సంఘటించి
స్థానికప్రకృతిని నిల్పఁ జనును గావ్య
మందుఁ; గావున దుష్కర మగును గాదె! 13

క. శ్రుతమతి విమర్శనాత్మక
సుతధీనై శిత్యమును వినూతనభావ
ప్రతతి వెలార్చెడు శక్తియు
నతిదుర్లభముల్ దలంప నవి నీ కమరెన్. 14

క. కావున ధన్యుఁడ నైతి, వి
భావరి రేరాజులీల భామా! బహుదుః
ఖావహాసంసృతియందున
నీ విమలాస్యప్రభలను నించుట వెలిఁగెన్. 15

ఆ. వె. కార్యగౌరవమ్ము గణియించి సాయము
నిడుదు నంచు మాట నిచ్చితేనిఁ
దొడరువాఁడ నిట్టి దొడ్డకర్జము దీర్ప
నుభయతారకముగ నువిద!" యనిన. 16

సీ. భ్రమరకీటన్యాయ మమర స్త్రీలోకము
నందు గణ్యస్థాన మమరఁజేసి
మంచిచెడ్డలు మాన్యమార్గంబు నెఱిఁగించి
ధర్మానురక్తి నెంతయును గూర్చి
కావ్యపద్ధతులు దుర్గమశాస్త్రరీతులు
బోధించి శ్రుతవిద్యఁ బొందఁజేసి

పలికె భంగ్యంతరమునఁ "గావ్యమున నన్ను
నిలుప నెంచకు" మెల్లనోఘులను బడఁగ. 8

గీ. సరి సరి ! ప్రసంగవశమున దొరలె నొక్క-
సందియము దీర్పఁ డీమధ్యఁ జాలకాల
మయ్యెఁ గావ్యనిర్మాణమునందు శ్రద్ధ
విడిచి; విద్యార్థిగా మాఱఁ దొడఁగి తేమి ?" 9

గీ. అనుడు "భావస్రవంతి చంద్రానన ! నిను
నలమికొని పేరుకొనియె; నే మందుఁ గాంత !
ప్రణయనిర్వీక్షణాగ్నిని గ్రాఁగి, పొంగు
వారి, వెల్లువ యగు; నిది కారణ" మన. 0

ఆ. వె. "బాగు బాగు; పడుచుప్రాయంపుటాగడాల్
విడువఁబోవ; రాన నిడుదుఁ గావ్య
రచన దీక్షఁ గొనుఁడు; ప్రాజ్ఞులు సప్తసం
తానములను గృతి ఘనంబ యంద్రు." 11

గీ. కపటకోపముఁ జూపు నాకమలనేత్ర
ననునయింపుచుఁ "బూర్ణా ! కృతాపరాధుఁ
డను; శిరోధార్య మగును సూచన; యొకంటు
వరము మాత్రము దయసేయవలయు వినుము. 12

సీ. స్వస్థాన జాతి భాషాసంస్కృతులు నుడి
కారంపుసొంపు చేకూరవలయుఁ
బాత్రచిత్రణ ప్రాణవంత మై బహువిధ
వృత్తుల నలరి దీపింపవలయు
నాలంబనోద్దీపనాదిభావంబుల
కలయిక రససిద్ధిఁ గాంచవలయు

క. సహభాగిని వగు నీవును
వహియింపఁగవలయు సర్థభాగము శోభా
వహాకృతిగౌరవ" మనుచుఁ
"ఇహాపరసాధకము విడువ నేలా ?" యనుచున్. 21

వ. సమ్మతించిన, నమ్మందయాన నానందతరంగడోలం దేలఁ జేయుచుఁ బ్రాంతక్రొత్తల మేలుకలయిక నలరు గ్రామజీవితేతివృత్త మ్మొండు దలఁపునఁ బార, నద్దానిఁ గావ్యంబుగా నిబంధింపఁ దలంచి, యామె కెఱింగించుఁడు, "మేలు మేలు ! త్యాగపూరిత మగు స్థానికేతివృత్తం బెంతయుఁ గావ్యనిబంధనార్హం" బని యామె తనయంగీకృతిం దెలుప, నంతఁ గృతిపతిత్వశంక యంకురించుఁ డన్నీతిమతి "మాతాపితదేశికులు ప్రత్యక్షదైవతము లని శ్రుతు లుద్ఘోషించుచున్నవి; కావునఁ దదితరదైవతమానవులఁ గూర్చి చింత యావంతయు లేక భవన్మాతాపితరుల కంకితం బిడుఁ డద్దానఁ బితృమాతౄణవిముక్తియు నలవడు" నని సూచించినఁ గరం బలరి సమాహితచిత్తుండ నయి. 22

సీ. మజ్జాస్థికాస్నాయుమాంసమేదోరక్త
ధాతువు లొసఁగి, విద్యావివేక
వినయసౌజన్యధీవిభవసంస్కార స
త్సంప్రదాయముల శిక్షణ నొసంగి,
శమదమాదికగుణసంచయంబును గూర్చి
యష్టాంగయోగప్రవిష్టుఁ జేసి,
కుడువఁ గట్టను నర్థి కీయఁగఁ జాలినయంత
సంపత్తి వెను కిడి స్వర్గలోక
గీ. ధాము లై యున్న నాదుమాతాపిత లగు
చిన్నమాంబావరాహనృసింహుల ఋణ

మెన్నిజన్మలఁ దీర్పఁగాఁ జన్నె ? చిన్ని
పోత్త మిద్దాని నంకిత మిత్తు భక్తి 23

గీ. రాజయోగు లనంగ ధరాతలమున
ధవళయశమును నించు మాతాపితరుల
వంశకధనంబు సల్పుదు వలయురీతి
చారితార్థ్యము నొంద నా జన్మ మిలను. 24

క. శ్రీకాకుళమండలమునఁ
బ్రాకటముగఁ జెలిమి కలిమి బలిమియు వెలయన్
లోకస్తుత మగు గ్రామ, మ
శోకవనావృతము మివుల శోభిలుచుండున్. 25

క. తల గ్రామము తలగా మై
పిలువంబడు సాటియూళ్లఁ బెంపు దలిర్పన్,
పలుగాకుల గాలము దాఁ
గల శూలము నాఁ జెలఁగు గ్రామములందున్. 26

ఆ. వె. సిరుల కిరవు రిత్తచేలకుఁ గలువు ధీ
వరుల నెలవు విద్దె లోరయుకొలువు
పరుల గుండెబరువు చెలువు లావరువు బూ
కరుల కలవి కాని గడ్డుతావు. 27

సీ. పదుము విత్తులనే చల్లి గరిసెడు
పంటను గొలవేయువాండ్రు, నారు
పొలమునఁ జల్లి లాజలను దేలఁగవైచి
కొంగల నూడ్పులకుం గొనియెడి
వాండ్రు, మూరెడు వెన్నుభారమ్ము లేకున్న
వరిపైరు కా దనువాండ్రు, నుత్త

రాకార్తె నూడ్చియు రాసులు ధాన్యము
రాల్చెదువారు నై క్రాలు నచటి

గీ. హాలసమాశ్రయక్షత్రియు లైనజనుల
భాగ్య మెన్నఁగ వశమె ? చేవయును జీవ
నమును భూమాత కూర్ప నానంద మందు
హాలికుని జీవనము సాటి యగునె ? యందు.

సీ. కాశ్యపసద్గోత్రకమనీయమూర్తులు
హనుమంతు గృహనామ మలరువారు
నప్పలనాయఁడు నారామలింగనా
యం డను సోదరు లలరి, ధరను
రామలక్ష్మణులు నా రాజిల్లి దశదిశా
సంవ్యాప్తసద్యశోశ్రయులు నైరి
యం దగ్రజుఁడు ఘనుఁ డప్పలనాయఁడు
పెక్కలిరాజేంద్రు మక్కువచెలి

గీ. కాఁడును 'దివాను' నై రాజకార్యభార
ధూర్వహుం డయి చెన్నారె దొడ్డదొరల
కాప్తమిత్రుఁడు విబుధలోకైకదక్షుఁ
డరికులాంతకుఁ డర్థిలోకాశ్రయుండు. 29

క. బహుమతిగా నా మాన్యుఁడు
బహుమాన్యగ్రామములను బడసియు నృపుతో
సహపంక్తి నారగించెడి
మహితాదర మొందె సుగుణమణి యై మిపులన్. 30

సీ. ఆశ్రితసులభుఁ, డత్యాదరశీలుఁడు,
విజితేంద్రియుఁడు, సువివేకి, ధర్మ

మూర్తి, శౌర్యౌదార్యభూరిగుణవిశాలుఁ,
డూర్జితతేజస్వి, యుక్తమధుర
హితమితభాషి, మహీసురభక్తుఁడు,
వ్యవసాయపశుపాలనాభిరతుఁడు,
ఆజానుబాహుఁ, డత్యంతసమున్నత
దృఢదీర్ఘదేహుఁడు, దీప్తసుంద

గీ. రాంగుఁడై క్రాలు నా రామలింగనాయ
కావతంసము సకలదిగంతసద్య
శోవిశాలుఁడు తులసమ్మ శోభఁ గూర్చు
ధర్మపత్నిగా మెలఁగె వినిర్మలమతి. 31

క. లలితాంగి, మధురభాషిణి,
కలుములచెలిఁ బోలు సుగుణగణ్యాచరిత, శ్యా
మలవర్ణ, శీలవతి, యిం
తులతలమానిక మనఁ దగు తులసమ్మ ధరన్. 32

గీ. ఆప్తబంధుసమాదృతి 'నమ్మి' యనియు
దీనజనులు గౌరవమును దెలుప 'నప్ప'
యని జనుల్ పిల్వ 'నమ్మప్ప' యనుచు నొండు
ముద్దుపేరును గొనియె నమ్ముద్దుగుమ్మ. 33

క. ఆ పుణ్యాత్ములకుఁ గీ
ర్త్యాపాదకు లగుచుఁ బుత్రులై యెనమండ్రుఁ,
రూపగుణశీలలు కుమా
రీపంచకముఁ జనించి వృద్ధిఁ జెలంగెన్. 34

సీ. దృఢసమున్నతదీర్ఘదేహులు, శత్రుభీ
కరులు, మహీధరకల్పధైర్యు,

లాశ్రితవత్సలు, లర్థికోకిలగణ
తరుణామ్రతరులు, సుందరులు, వినయ
ధౌరేయులు, విశుద్ధధర్మానువర్తులు,
మితభాషణులు, బహుశ్రుతులు, సాధు
శీలురు, విషయమషీకళంకవిదూరు,
లాశాంతసంవ్యాప్తయశులు నగుచు
గీ. వెలయు మాంధాతముఖ్యవివేకిసముద
యమ్ముఁ గాంచి మించిన తులసమ్మకడుపు
చలువ యెట్టిదో వర్ణింప నలవి యగునె?
వేలుపులఁ గన్నతల్లి యవ్వోలఁది నిజము. 35

క. సుత లైదుగురగ్ఘనసం
చితపుణ్యా, విశుద్ధసాధుజీవన, రజనీ
హితసదృశవదన, చిన్నమ
యతిలోకోత్తరచరిత్ర నలరారె భువిన్. 36

వ. ఇంకఁ బితృవంశసంస్మరణం బొనర్చెద. శ్రీమధుకేశ్వరకటాక్షవీక్షణా
నుక్షణప్రవర్ధమానం బై యాపురాతనదివ్యక్షేత్రంబున కాగ్నేయ
దిగ్భాగంబున నై దుక్రోశములదవ్వున నుప్పాడపేట నా నొప్పారు
పల్లీమతల్లి యొండు వెలయు; నందుఁ గర్షకజీవనాశ్రయం బైన కాళింగ
క్షత్రియకుటుంబ మొండు గలదు. అందు— 37

క. శ్రీవత్సగోత్రుఁడు గుల
పావనుఁ డుప్పాడవంశపాథోధివిధుం
డావహ్నిసూర్యముగను య
శోవిభవము రామనాఖ్యశుభగుఁడు నిల్పెన్. 38

క. ఆ రామనకృతపుణ్యా
శ్రీరాజితమూర్తి లనఁగఁ గృతకూపతటా

కారామసుప్రతిష్ఠలఁ
జే రొండినపుత్రవరులు వెలసిరి నల్వుర్. 39

క. పోలయ, లింగయ, యప్పయ
లోలిం గృష్ణయయు ననఁగ నొప్పిరి తగ నా
మూర్తిఁ; జతుర్వర్గము లనఁ
జాలి యశము భువిని నింపఁజాలిరి వారల్. 40

సీ. న్యాయవర్తనకుఁ గాణాచి, విద్యల పట్టుఁ
గొమ్మ, యాచకులకుఁ గూర్చునెలవు,
కలుముల పంట, సుక్షేత్రంబునకు తావు,
గుణముల మున్నీరు, కూర్మి సీమ,
బందుల పెన్నిధి, పాపవృత్తికుఠార,
మానందనందన, మరిలవిత్ర,
మతిథుల విందు, నభ్యాగతజనబృంద
మునకు వేల్పుసురభి, యనఁగఁ దనరు

గీ. ఆ కుమారచతుష్టయ మఖిలదిశలఁ
గీర్తి నవసౌరభంబులఁ గీలుకొలిపి
క్రొలము వెలయించి యన్నిదిక్కులను వియ్య
మంది, పొందిరి సన్మాన మవిరతముగ. 41

గీ. అందు లింగయ దీనజనానురాగ
సాగరం బపరాజాతశత్రుఁ డార్య
నుతుఁ డహంకారదూరుఁడు మతిజితసుర
గురుఁడు నాఁబడి యిరువురుకొడుకులఁ గనె
నప్పలనృసింహుఁడును సూరనార్యుఁ డనఁగ. 42

గీ. అగ్రజుం డప్పలనృసింహుఁ డఖిలధర్మ
వేది, శాంతుఁడు, సువివేకి, విశ్రుతబహు

కావ్యసంచయద్రష్ట, సత్కార్యరతుఁడు
చంద్రికాసదృశవిశాలశస్తయశుఁడు. 43

క. సూరన మేరుమహీధర
ధీరుఁడు, సమదారిదమనదృఢశౌర్యుఁడు, గం
భీరజితసాగరుఁడు, సువి
చారుఁడు, నిర్మలయశోవిశాలుఁడు దలఁపన్. 44

గీ. అప్పలనృసింహనందను లై వరాహ
నారసింహుఁడు రామన నతమనీషి
లక్ష్మినారాయణుఁడును వెలంగిరి ముప్పు
రమలమూర్తులు త్రేతాగ్ను లట్ల దీప్తి
నీలమాంబసద్గర్భపునీతు లగుచు. 45

క. ఘనుఁడు వరాహనృసింహుం,
డనుపమసత్కీర్తిమూర్తి యగు ముసలయనా
యని దత్తపుత్రుఁ డై కడుఁ
దనియించెను నుభయవంశతారకుఁ డగుచున్. 46

క॥ బాగెమ ముసలయ దంపతు
లాగమచోదితముగ సుతు నర్మిలిఁ గొని వి
ద్యాగుణశిక్షకు లై రి, సు
ధీగరిమ నతండు విద్య దేశికుచెంతన్. 47

గీ. కలిచి బహుకావ్యనాటకక్రమము లెఱిఁగ
శాస్త్రచర్చలఁ బొల్గొని జాణ యయ్యెఁ
బిదప నధ్యాత్మవిద్య సంప్రీతి నేర్చి
జన్మతారకమంత్రరాజమును బడసె. 48

క. అష్టాంగయోగముల వి
స్పష్టవిరాగమున నతఁడు సాధించి యనా
కృష్టైహికుఁడై భక్త్యా
విష్టుం డగుటను దలంచి వేదురి పితరుల్. 49

క. యుక్తవయస్కుం డై యను
రక్తి విషయవాంఛలను దొరంగుట తగదే
యుక్తుల నీతని లోకా
సక్తునిగాఁ జేయు టనుచు సల్పిరి చింతన్. 50

గీ. గురుజనానుమతంబునఁ గొమ్మ నోర్తు
భార్యగాఁ గొన సమ్మతిఁ బడసి, రూప
కులగుణాభిజాత్యములను గొమరు మీఱు
చిన్నమాంబను నర్ధాంగిఁ జేసి రంత. 51

క. గంగాయమునాసంగమ
భంగిం జెలువారె భువనపావన మగుచుం
మంగళముగ నిరువంశము
లుం గూడుట నుప్పు పప్పుతోఁ గూడుక్రియన్. 52

గీ. సర్వమంగళాశంకరసంగమమ్ము
వోలె నా పుణ్యదంపతుల్ బుధమి రాజ
యోగమార్గానుసారు లై యుక్తరీతి
సల్పి రెన్నఁ జతుర్వర్గసాధనముల. 53

గీ. పరమపూజ్యులు పితరు లై పరగువార
మార్వురము; ముప్వు రాత్మజ, లలర నగ్ర
జుండు లింగయ; జగ్గనాయుండు నేను
బుత్రులము జన్మగౌరవమాత్రముల మిల. 54

క. అధ్యాత్మతత్త్వసారము
హృద్యముగాఁ గావ్యఫణితిఁ గృతిఁ జేసి నరుల్
విద్యార్థిదశం గవితా
విద్యను గఱపిన జనకుని వినతి యొనర్తున్. 55

గీ. అమృతరసఝరి! నవనీతవిమలహృదయ!
ప్రేమసింధువు! సుగుణాలపేటి! కరుణఁ
జిందు నీ నేత్రయుగళినే చిత్తసీమ
నిలిపి కావ్యనిర్మితికిఁ బూనితిని జనని! 56

వ. ఇట్లు మదీయజననీజనకుల కాత్మశాంతిప్రదంబును, నస్మన్మాతృపితృత్రాణ విముక్తిదమును, నుదాత్తమ్మును నగు ప్రబంధనిబంధనోద్యోగమ్మునఁ బ్రవర్తింపఁ దలంపుఁ గొని, పూర్వసమయప్రకారమ్ముగ నాహృద యేశ్వరిని శ్రోతగ నుండ నొడంబఱచి- 57

మ. రససిద్ధుండు కవీశ్వరుండు; కృతి సర్వాంగీణసౌందర్య మా
రసి తృప్తిం గనువాఁడె సహృదయుఁ డౌ; రంధ్రంబులే కాంచు నీ
రసుఁ డౌ చిత్తవిహీనుఁ డౌర! నిజదుర్వారాభిమానంబునన్
గసి మై కావ్యము దూఱు మూర్ఖుఁ డని లోకజ్ఞుల్ వచింప న్మదిన్.

చ. వినతి యొనర్చి సత్కవుల, విశ్రుతు లౌ సుజనాళి నెన్ని, మో
దమ్మను విసయంబునన్ శిరము దుష్టవిమర్శనమున్ బొనర్పఁగాఁ
జనకుఁ డటంచుఁ బాలకులఁ, జాలఁగ వేఁడెదఁ దప్పు నొప్పుగాఁ
గనుటయు, దోషదృష్టి చెడుగా గ్రహియించుట మంచి, మానఁగన్.

ఉ. కాలమె నిర్ణయించుఁ గృతిగౌరవమున్, దలపోయ దాని; భా
షాలసచిత్తమున్, మధురవాఙ్మయసేవయు, మాతృదేశశో
భాలలితాకృతిన్ వెలయ భావుకలోకము ముందు నుంప నె
వేళను గోరుటల్ గలుగ, వేడ్కఁ దొడంగితిఁ గావ్యసృష్టికిన్. 60

మ. అనువాదమ్ములె కొల్లలై వెలయఁగా నాంధ్రత్వమున్ గోలుపో
వును నా ముద్దుల తేనెవాకనుడి ప్రవ్వాంబోడి, సంస్కార మెం
దును గానంబడదే! తెనుంగుజనులందు న్మూర్తిఁ గొన్నట్టి; దే
మొనరింపం దగు నన్న యోచనలె కావ్యోద్యోగమున్ బెంపఁగన్. 61

వ. నా యొనర్పం బూనిన మధూపయమహాకావ్యనిర్మాణమున కుపక్ర
మించువాఁడ నై

క. శ్రీరాధారామకుమా
రీ! రాజితగుణ! విభావరీరాజతిర
స్కారముఖి! సత్యసుధా
పూరవచోరచన! యన్నపూర్ణా! వినుమా. 63

సీ. పూర్వసాగరము సంపూర్ణంబుగా నేరి
నావికాసైన్యవిన్యాససీమ
ప్రాచ్యసామ్రాజ్యనిర్మాణసమాకాంక్ష
నెవ్వారి భుజబల మెదిరి నణఁచె
నీలాచలోపాంతనిఖిలకళింగదే
శస్థలం బెవ్వారి జన్మభూమి
భారతీయప్రతిభాసౌరభము దేశ
దేశాల నేరు ప్రతిష్ఠ సల్పి

గీ. రల సుమిత్రాయవద్వీపములును బ్రహ్మ
దేశ మెవ్వారి ధ్వజముచే దీప్తిఁ బడసె
నట్టి కాళింగసమ్రాట్టు లంధ్రిరేణు
వులు ప్రసారించినట్టి యుజ్జ్వలధరిత్రి. 64

చ. కల దొకమేలిప్రోలు, నుతి గాంచును బుష్పపురాఖ్య, ధారుణీ
తిలక మనన్, కళింగకులదీపిత మై, వరసార్థకాభిధా

విలసిత మై, పురాతనపవిత్రహాలాశ్రయజీవనంబు నై,
కలుములపంట యై, యరులగాలము నై, చెలువారు నెంతయున్. 65

ఉ. స్వోదరపోషణార్థమయి జోలెను దాల్చినవాఁడు గాని, య
జ్ఞోదరుకీర్తనల్ వినఁగ నొల్లని వ్యర్థుఁడు గాని, స్వీయభా
షాదుల వీడి నైచ్యమున కాస్పద మైనయతఁడు గాని లే
దేదెసఁ గాంచినన్, బొడమ దెందును లేమిభయంబు వారికిన్. 66

గీ. చీట్లపేకదస్త్రాలు, పాచికలు, గాల
ములు వినోదసాధనము లై వెలయు టెఱుఁగ
రచటిపురుషులు వ్యర్థవాక్యాన్వితు లయి
కాలమును బుచ్చు టొకనాఁడుగాని లేదు. 67

గీ. ద్యూతకేళీగృహాలు మధుప్రదాన
శాల లన్నవిక్రయులు గతులను బెంచు
స్వార్థపరులు సోమరులు యాచకులు మందు
కైన నాపురిఁ గనరాము కడు శుభంబు. 68

శా. 'ఘోషా' యంచును నిల్లు వీడకయె యాకుం బోకయున్ గూర్పలే
కే 'షోకుల్' పచరించుచున్ ధనము నెంతేనిన్ వృథాపుచ్చు దు
ర్వేషాలంకృత లైనకామినులు లే రీక్షింప నం, దాత్మస
ద్భాషావేషవిభూషణాశయలు గాంతారత్నముల్ గాకొకో! 69

గీ. పెరుగుఁ ద్రచ్చెడుసమయాన వెడలునట్టి
ప్రమదమధురావ మమలవిపంచికాస్వ
రంబుగా నెంచికొని యప్పురమున సతు లు
షస్సమయసన్నుతు లెపుడు సల్పుచుంద్రు. 70

గీ. రాట్నమును ద్రిప్పఁ బొడముస్వరంబు శ్రుతిగ
మేళగించి సంగీతము నాలపింతు

రచటికాంతలు తమ విరామావసరము
లందుఁ గాలవ్యయం బేల యని తలంచి. 71

మ. కొరడాదెబ్బల మేను వాచి, జవముఙ్ గోల్పోయి, రక్తాక్తవి
స్తృతదేహంబులు బక్కవారి బహుబాధల్ గాంచునశ్వంబు ల
ప్పురి 'జట్కా'లకు లేకపోవు టదె పో పుణ్యంబు, తత్సారథుల్
గరుణాశూన్యులు గామియుఙ్ సుజనలోకస్తుత్య మా నెన్నఁగన్. 72

సీ. చిట్టు ముందరఁ బెట్టి చిన్నారిదూడను
గట్టి దానికి నోట గడ్డిఁ బెట్టి
కాళ్ల బంధము వైచి నీళ్లతోఁ బొదుగును
దడిపి చేపఁగఁ జేతఁ బిడుతఁ బట్టి
పాలతుంపర లల గాలిసోఁకున వెలి
కేఁగు నేమో యని వేగముగను
బొదుగు కందుటఁ గన కదయతఁ బలుమాఱుఁ
బితికి పితికి పాలపిడుత నింపి

గీ. జలము లోకకొన్ని యాపాలఁ గలిపి పిదపఁ
బురమునం దమ్మి పెద్దకాఁపురము సేయు
సురభిరక్తవిక్రేత లప్పురిని లేమి
పూర్వజన్మార్జితం బగు పుణ్యఫలము. 73

గీ. మానవత్వంబు నెల్లను మంటఁ గలిపి
స్వాభిమానము నంతయు సమయఁ జేసి
యర్థకాంక్షను 'రిక్షా'ల నహరహంబు
నీడ్చు నరవాహకులఁ గాన మెందుఁ బురిని. 74

ఉ. చల్లనిపిల్లతెమ్మెరలు, చక్కనిపైరుపొలాలు, మేలిపూ
రిళ్లు, విశాలరథ్యలును, నెంతయు నుల్లము పల్లవించు ను

త్ఫుల్లసుమవ్రజంబు, కథు మోదము గూర్చెడు నాలమందలుౕ
బీళ్లఁ గొలంకు లాపురిని బెంపు వహించును సొంపు నింపుచున్. 75

గీ. గోరువెచ్చనిపా ల్గడుపారఁ గ్రోలి
యింపుగాఁ దోఁకలను మీఁది కెత్తి వీథు
లందుఁ బరువెత్తు లేగలచంద మరయ
నచటి సౌభాగ్యగరిమ ప్రహర్ష మిడదె. 76

సీ. చిదిమిన నెత్తురుఁ జిందు నెమ్మేనులు
సత్వగుణోద్దీపశస్తరుచులు
శృంగారముగ వ్రేలు గంగడోళ్లును సౌమ్య
భావప్రబోధసద్వదనములును
వదనసౌందర్య మిబ్బడిగా నొనర్చు ను
త్తుంగశత్రువిభంగశృంగములును
ఏఁపుఁ దలిర్చెడు మూపురంబులు నేలఁ
దాఁకు నాయతము లౌ తోఁక లలర

గీ. వలుఁదపొదుగులు గమనంపువడి నడంప
నల్లనల్లన బీళ్ళలో నంచపిండు
వోలె విహరించు నాపురియాలమంద
జానపదలక్ష్మివడువునఁ గానవచ్చు. 77

సీ. కర్కశం బైన మాగాణి భేదింప మా
సత్వమే యగుఁ గదా ! సాధనంబు
విశ్వవిశ్వంభరావృద్ధికి మాజీవి
తంబె కా హేతుభూతంబు తలఁప
హాలికప్రవరుఁ డయ్యగ్రతాంబూలము
మాజాతి కొసఁగి సన్మాన మిడఁడె

త్యాగమే జీవితాదర్శ మంచు జగాన
మేమె ప్రబోధించి మించినార

గీ. మనెడి స్వాభిమానము మోములందు వెలయ
మెడను మువ్వలపట్టియల్ మెఱయుచుండ
ఠీవి నవ్వీట వృషభముల్ చేవ మిగిలి
సంచరించుచు నుండు స్వచ్ఛందముగను. 78

సీ. వజ్రధారాహతిఁ బక్షమ్ము లెడలఁగ
ధరణి వ్రాలిన పర్వతంబు లనఁగ
శృంగసంగతమహోత్తుంగాంజనాచల
రంగదంగోద్భవవ్రజ మనంగ
విశ్వసౌందర్యసంవీక్షణోత్సుకత నీ
వసుధఁ జేరిన వారివాహము లనఁ
గాననాంతరవాసకష్టంబు సైఁపక
పురము సేరిన భద్రకరు లనంగ

గీ. బహుళదేహంబులును గృష్ణవర్ణములును
భూరిజవమును సత్త్వసంపూర్తిఁ గలిగి
యలరుచుండు 'జిరంగి' నామాభిరామ
మహిషసంఘము లవ్వీట మలయు నెందు. 79

గీ. వాతపాతసముద్ధూతవర్తనంబు
కలుగకున్నచో సరిపోల్ప వలనుపడును
విమలప్రావృట్పయోధరవితతితోడ
వెలయు నవ్వీటి పాఁడిగేదెలగములను. 80

గీ. ఆ పురోపాంతబహుసుందరాశ్రమవనుల
యందుఁ జొచ్చి సమీరుఁ డం దెందు జవము

సూపఁ గొఱగాక యనఁటుల సుడియఁజేయు
మెత్త నగుచోటనే కదా! కత్తివాయి. 81

గీ. విస్మృతం బగు తమకీర్తివిభవగరిమ
దశదిశల వ్యాప్తి నొందింపఁ దలఁచి జనులు
పాతి యుంచిన కేతనవ్రాత మనఁగ
నారికేళవృక్షములు పెంపారు నందు. 82

గీ. పేర్చి విరహాలబింకంబు నార్పుటకును
మారుఁ డాపురప్రాంతశృంగారసార
సాకరాంతరపద్మసంచయము నెపుడు
సాయకంబులు గాఁ గొని చనుచు నుండు. 83

మ. తరుణీగాఢకుచోపగూహనకళాతంత్రజ్ఞుఁ డై మించుసుం
దరులోఁ గూడి పెనంగుప్రౌఢపయిఁ దా దర్పంబు సాగించుచో
స్మరుఁ డాత్మీయధనుర్విభంగుఁ డయి బ్రహ్మ న్గోరఁగా నాతఁ డ
ప్పురియిక్షుప్రకరంబుతోడ ధనువున్ బొల్పార నిర్మించె మున్. 84

గీ. పంచసాయకు వరశరసంచయమ్ము
లక్ష్యయంబుగఁ గల్గ ననంగుఁ డవ్వి
ధాతఁ బ్రార్థించి యప్పురిఁ దనకు దివ్య
నవ్యతూణీరమును నూతనముగఁ జేసె. 85

గీ. మాధుకరవృత్తి నప్పురి మధుకరాళి
గానసుధఁ జిమ్ముచును గృహాంగణములందు
వెలయుచుండును గీతగోవిందము శ్రుతి
పేయముగఁ బాడుకొనిపోవు భిక్షువువలె. 86

శా. సూనాస్త్రమ్ములు చిల్కతేజియు ధనుస్సున్ నారి తూణీరముల్
నానాసుందరదృశ్యముల్ గలిగి విన్నాణంబుగాఁ గ్రాలు నిం

దే నే నిల్వఁగ యోగ్య మంచు మఱుఁ దుద్వృత్తిన్ సదా వాణివి
ద్యానై పుణ్యము నభ్యసించు నచటన్ దర్పించి పూఁబోండ్లపై. 87

గీ. భృంగసంగతజ్యాఘోషభీతిఁ గలఁగు
తరుణులను గాంచి వృద్ధకాంతలు పురమునఁ
బెంపుఁ డింపుఁ దలిర్పంగ సంపెఁగతరు
లిండ్ల ముం దని పలవరించు నిచ్చలుండ్రు. 88

గీ. సృష్టినిర్మాణచాతురి స్పష్టపఱుప
నెంచి సకలసౌందర్యము లంచితముగఁ
జేర్చి నాపురి ధాత నాఁ జెలఁగి యలరె
శస్త్రచిత్రప్రదర్శనశాలఁ బోలి. 89

సీ. కన్నమావులమీఁద నున్న కోయిలపిండు
లలర స్వాగతగీతికలు పఠింప
జొన్నవెన్నులఁ దినుచున్న రాచిల్కలు
స్వస్తివాక్యములఁ బ్రశస్తిఁ దెలుప
భూరుహాగ్రంబులఁ జేరి గోర్వంకలు
జయజయధ్వనులను సల్పుచుండ
నాహ్లాదగరిమ భృంగార్భకుం డశ్రాంత
సంగీతమున స్వరజతులు పాడ
గీ. నూర్ణనాభులు తంతుసద్గోత్కరంపుఁ
బళ్ళెరమ్ములఁ బట్టి నివాళు లిడఁగఁ
బ్రకృతిసుందరి యాపురప్రాంతమందు
సల్పు వాహ్యాళి మునిమాపుసమయములను. 90

గీ. అపరదిశ పురికటకము నంటి వడిగఁ
బాఱుచుండును వరవంశధార నాఁగఁ

బరగు పుణ్యస్రవంతి సంభ్రమముతోడ
విభునిఁ జేరఁగ నరిగెడు వెలఁది వోలె. 91

శా. పారావారగభీరగర్భకుహరద్వారంబునన్ జొచ్చి యా
దారిన్ భూరిభుజంగలోకవిభు సందర్శింప నుత్సాహి యై
దూరం బైన పథశ్రమన్ నురగలన్ దోరంబుగాఁ గ్రక్కుకొం
చాఘూర్ణిన్ జనుసర్వరాజ మనఁగా నయ్యేఱు పెంపారెడిన్. 92

ఉ. భూరికళింగరాణ్మణుల పొంపిరివోవుపరాక్రమక్రమం
బారయ గేయకావ్యముగ నన్నది నిత్యముఁ బాడులీలఁగా
హోరు చెలంగు; వారివిజయోన్నతకీర్తిసమూహమో యనన్
మీఱును ఫేనసంతతులు మింటిని దాఁకుచు నెల్లవేళలన్. 93

శా. ధీరోదాత్తునివర్తనంబుక్రియ నుద్దీపించు గంభీరదు
ర్వారస్తుత్యజవంబుఁ గల్గి జనసంరక్షాక్షమం బై సుకే
దారాధారము నై కళింగవసుధాదారిద్ర్యసంహారవి
స్ఫారప్రాంచితజీవనం బయి యజస్రం బేఱు చెన్నారెడిన్. 94

సీ. శార్దూల భల్లూక జంబుక వారాహ
ముఖ్యజంతువ్రాతములు దనరఁగఁ
గాక ఘూక క్రౌంచ కేకి శారీ గృధ్ర
శుక పికప్రముఖపక్షులు చెలంగ
నర్జున వట కుట జాశ్వత్థ నారంగ
పాలాశముఖతరుప్రతతి వెలయఁ
గురువింద మాలతీ వరతమాలానేక
తతపుష్పితలతావితాన మమర
గీ. గాఢతిమిరోపవేష్టితకందరములు
నభ్రచుంబితఘనశిఖరాళిఁ గలిగి

ప్రకృతిసౌందర్యలక్ష్మి కాస్పద మనఁ దగు
గిరి యొకం డుండు నాపురోత్తరమునందు. 95

మ. అరిరాట్కాంతవిలుంఠనార్థము కళింగాధీశ్వరుల్ ఘోరసం
గరరంగంబులఁ దాల్చినట్టి యరిలోకత్రాసధైర్యంబు నాఁ
బరగున్ బర్వతరాజు; మానృపులజ్యాధ్వానంబు నా నొప్పుఁ గం
దరసంవ్యాపితఝిల్లికారవము నిత్యం బుగ్రమై యెంతయున్. 96

గీ. విజయగిరి నాఁ జెలంగు నవ్విపులధారు
ణీధరంబునఁ గాత్యాయనీసమేత
ముగను వసియించు రుచిరసన్మూర్తితోడ
సురగవారుఁడు లోకశంకరుఁడు హరుఁడు. 97

గీ. అతఁడు విజయేశ్వరుం డన నలరు నగజ
తనరు విజయేశ్వరి యనంగఁ దత్పురాణ
దంపతులఁ గొల్చి విభవసంతతుల నతుల
గతులఁ బడయుదు రచటి సన్మతులు వ్రతులు. 98

చ. అడిగినతోడనే యొసఁగు నర్థులకామితముల్ దలంప క
య్యుడుపతిమౌళిభూషణుఁడు, నోడుదు రాపురివారు గోర, ని
ట్లిడుటకు హేతు వాయగజయే యగుఁ జెల్వునియావి యెంతయో
పొడఁగని మేల మాడు పరిపూర్ణవదాన్యత లేకయుండినన్. 99

ఉ. ఆవిజయాద్రిభిత్తికక్రియన్ బురి కాదెసనుండి పౌరభా
గ్యావళి పశ్యతోహరుల కందఁగనీయక కాచుచుండు లో
కావనశీలుఁ డైన జగదాఢ్యుఁడె యాపురిఁ బక్షపాతి యై
యీవిధి సృష్టిఁ జేసె నని యీసు వహించెద రన్యమానవుల్. 100

మ. అగజాసంగతుఁ డైన శంకరుని లౌల్యం బాత్మ వేధింప నొం
డుగతిం గానక గంగ యీసునఁ బరుండున్ బిచ్చగాఁ డైన యి

య్యాగుణుఁడా పీడుట కర్జ మంచు వడి నయ్యద్రిం బ్రవేశించి తా
నొగి వేగంబునఁ బోవుమాడ్కి సెలయే టొప్పెన్ జయాద్రిస్థలిన్.

ఆ. వె. విజయవాహిని యన విఖ్యాతిఁ గన్న య
య్యాపగ వడి దక్షిణాభిముఖము
గాఁగఁ బురికిఁ బూర్వభాగంబునను బాఱి
వంశధారఁ జేరి వనధిఁ గలియు. 102

ఉ. ఆవిజయప్రవంతితటమందునఁ బ్రాఙ్ముఖుఁడై వసించు బృం
దావనభూవిహారుఁడు, సుధారసవర్షితదృక్ప్రసారుఁ, డా
ర్యావిభుసంస్తుతుండు, నిఖిలావనకార్యకళాప్రపూర్ణుఁ, డి
చ్ఛావిషయాదిదోషపరిశాంతుఁడు,మాప్రియకాంతుఁ డేర్పడన్. 103

గీ. మాధవాభిఖ్యఁ జను నా రమాపతి పద
యుగళి నభిషేచన మొనర్చు నుదకపూర
మొకప్రవంతిగాఁ బ్రవహించుచుండె ననఁగ
విజయవాహిని యా గుడివెనుకఁ బాఱు. 104

క. మాపతియు నుమాపతియును
బ్రాపుగ విలసిల్లు టెంతభాగ్యం బగునో
చూపఱులకు విం దై మా
కాఁపుర మలకాపుర మనఁగాఁ బుర మలరున్. 105

క. నరసింహవర్మ నాఁ జను
పురుషాగ్రణి యొకఁడు విభవపూర్ణం బగు న
ప్పురనాయకుఁ డై ప్రాలును
హరిచరణసరోజసేవనాసక్తుం డై. 106

గీ. తారకలలోనఁ బూర్ణసుధానిధివలె
గ్రహములందున దినరాజుకరణి నఖిల

రత్నసంచయమందు వజ్రంబుభాతి
వెలయు నాతండు కర్షకవితతియందు. 107

చ. వరనరసింహవర్మఘనభాస్వదనూనయశోమయూఖముల్
ధరణి నభంబుఁ గప్పి సతతంబును రాజిల క్షీణవృద్ధులన్
బొరిఁబొరిఁ గాంచు నాత్మరుచి పోలదు తత్ప్రభ కంచు లజ్జఁ జం
దురుఁ డురువారివాహములఁ దూఱును నాపురిఁ జేరెనంతనే. 108

చ. కడువడి నేఁగుచుండు ఘనగంధవహుండు పురంబుఁ జేరి యం
దడు గిడి నారసింహుధవళాయతసాంద్రయశస్సుగంధ మే
ర్పడ వహియించి యగ్గలపుభారమున న్జవ మింకఁ బాదముల్
దడఁబడఁ బోవుచుండు నిరతంబును మందసమీరనాముఁ డై. 109

ఉ. ఆనరసింహవర్మ సుకృతాకృతి యై వికలాంగులన్ గృపన్
బూని నిరంతరంబుఁ దగఁ బోషణ సల్పుచు నుండ లుబ్ధు లా
మానవు లంత యాచకసమాజపుపీడ యడంగఁ దృప్తు లై
మానుగ రొక్క మెల్ల నిడి మందసముల్ పొనరింత్రు కయ్యలన్. 110

మ. నరసింహాకృతి మున్ను దానవవిభున్ నాశంబు నొందించుచో
నురురౌద్రానలకీలలం బఱుప నోహో ! శౌరి యట్లుండు రౌ
ద్రరసుం డంచు జనుల్ దలంపఁ గలి నేకత్వాప్తిఁ బోకార్పఁగా
నరసింహుం డనఁ బుట్టి శాంతమునఁ జెన్నారెన్ దయామూర్తి యై.

గీ. భార్య లిరువదియేడ్వు రై వఱలకున్నఁ
దోవల ననురాగమున నేలఁ దొడరకున్న
ఘనకళంకాంకితుం డయి క్రాలకున్న
వనజవైరి యానరసింహవర్మఁ బోలు. 112

క. అత్తాకోడంద్రకు ధరఁ
బొత్తు కుదుర దనెడిమాట పొల్లయ్యె నహో !

విత్తంబును విద్యయుఁ ద
ళ్కొత్తెడు నరసింహవర్మ కొమ రొప్ప వెసన్. 113

గీ. ఒంటికాఁపుర మాసించునంట కోడ
లది యథార్థంబె ? సిరికి నిత్యాశ్రయుఁ డగు
నానృసింహుని వాణియు నాశ్రయించె,
నేలుకొనువానిలో నుండు నెల్లనేర్పు. 114

ఉ. ఆమహనీయశీలునకు నర్ధశరీరముగాఁ జెలంగు, శో
భామతి సాధువర్తన కృపాపర లక్షణలక్షితాంగి సు
శ్యామలవర్ణ దీనజనసంచయరక్షణశీల పౌరభా
మామణి వందనీయ గుణమాన్య సుభద్ర, శుభాభిధాన యై. 115

సీ. చన వీయఁ బ్రియునురస్థలి నెక్కె శ్రీదేవి
భూదేవి చెల్వునిభుజము నెక్కెఁ
గామింపఁ బతిమస్తకం బెక్కె నొగి గంగ
వరుఁ బంచుకొనియె నిష్కరుణ గిరిజ
విభవమదాంధ యై విభు దిద్ద దలశచి
వాణి నాథునిముఖావాస యయ్యె
నతివల బాధింప నంపు భర్తను రతి
మింటి కెక్కెను ధవువెంటఁ జాయ

గీ. అని ప్రియుం డెంత యనురాగమునఁ గనినను
భక్తిభావాదులఁ గొఱంత పడఁగనీక
మగనిఁ దన్పు సుభద్ర ప్రేమంబుతోడ
వినుతవిద్యావివేకసద్విభవ యగుచు. 116

సీ. పతియాజ్ఞ మీఱి ప్రవర్తించు టెఱుఁగదు
కల్లైన ననృతంబు వలుక నోడు

దాసదాసీజనతండంబు దయఁ దన్ను
నవదలఁ బ్రేమతో నాదరించుఁ
బనివేళ నిలు వీడి పరగృహంబుల కేఁగ
దతిథుల దేవతాతతిగ నెంచు
గృహకృత్యములను వీక్షించును స్వయముగాఁ
బ్రాలుమాలిక లేక పనులు సేయు

గీ. వినయభాషణభాషి యై విబుధ సాధు
సంచయంబును బూజించు సంతతంబు
నార్యజనమాననీయ యా నా సుభద్ర
సదృశకాంతలు గలరె యొచ్చటను నైన. 117

సీ. నుడువదు పరులయందునఁ గల్గుదోషముల్
నడువ దన్యాయంబునను ద్వరపడి
కుడువదు నాథునకుం బూర్వ మెన్నఁడుఁ
గడువదు సతులమార్గంబు సతము
విడువదు విభుని సేవించుట నిత్యము
ముడువదు పరధనములను నెపుడు
అడువదు దయ వీడి యల్పసత్త్వము నైనఁ
దడువ దర్థుల కిచ్చి తన్నునపుడు

గీ. మిడిసిపడుటయు మెప్పును బడయు తలఁపు
దుడుకుఁదనము నపాత్రుల కిడుట లజ్జ
విడుచుటయును నెఱుంగ దప్పడఁతిమిన్న
బళిర! యాలేమ మురవైరిభామఁ బోలు. 118

గీ. పరమభక్తి సుభద్ర సౌభాగ్యభాగ్య
గరిమ నర్థించి సర్వమంగళను ననుది

నంబుఁ బూజించును సతీజనంబుల కిల
నిత్యసౌభాగ్యమే వాంఛనీయ మగుట. 119

సీ. తిరిపెగాఁ డగుపతి దొరకె శర్వాణికిఁ
బూజావిహీనునిఁ బొందె వాణి
జాతభర్తృక సురచక్రవర్తిని యయ్యె
నాలకాపరిసతి యయ్యెఁ బద్మ
క్షయరుజాపీడితుజాయ రోహిణి యయ్యెఁ
దపనుని చాయ భర్తగను బడసె
నకట! యనంగు నర్ధాంగి యయ్యెను రతి
పలువురిపత్నియై వెలసె భూమి
గీ. వేల్పుచానలయందు భావింప మచ్చు
లేనివా రొక్కరైనను లేరు గాని
మనసుభద్రను వ్రేలఁ జూపంగ వశమె
యనుచు నగ్గింతురు సుభద్ర నచటిజనులు. 120

గీ. హీరమును బ్రకాశమును, దుషారము నతి
శైత్యమును, లతాంతంబును సౌరభమును
దలఁప నవనీతమును మృదుత్వంబుపోల్కి
నా సుభద్రాన్నసింహు లియ్యవనిఁ దనరి. 121

ఉ. సల్పి రనల్పసత్క్రియలు, సాఁకిరి దీనదరిద్రసంఘముల్
గల్పమహీజముంబలె నగణ్యహితాభిమతప్రదాత లై;
నిల్పిరి పెక్కుగేహము, లనింద్యగుణాకరు లైనబాలురన్
బొల్పుగ నాదరించి తగఁ బ్రోది యొనర్చిరి విద్య నేర్వఁగన్. 122

క. ఆ ధర్మరతుల భూరియ
శోధవళిమ మూర్తిఁ గాంచి సుతుఁ డయ్యె నసం

గా ధవళాంగుఁడు ఘనసా
ధ్వోధిన్ విధులీల జనన మొందెఁ జెలువుగన్. 123

గీ. భద్రలక్షణుఁ డగుచు సుభద్రవిప్రు
మోఘపుణ్యచయం బన నొప్పు నతఁడు
మాధవప్రసాదమున జన్మంబు వడయు
కతన మాధవవర్మ నాఁ గ్రాలె భువిని. 124

సీ. బాలభాస్కరకరజాలసమాలింగి
తాంగి యా రుచిరోదయాద్రి వోలె
పార్వణచంద్రప్రభాభాసమాభాస
ముత్తుంగశస్తదుగ్ధోదధిక్రియ
వికచకైరవహాసవిభ్రాజితానంత
రమణీయపద్మాకరంబులీల
ఘనవసంతాగమజనితహర్షోన్మాద
లావణ్యయుతవనలక్ష్మికేవ

గీ. నా కుమారుని చరణవిన్యాసమంద
హాసభాసురవదనవిలాసవిమల
ముగ్ధమోహాసౌందర్యమూర్తులు గని
హర్షపులకితగాత్ర యా నా సుభద్ర. 125

క. ఆ కొమరుఁడు నానాఁటికిఁ
బ్రాకటముగ వృద్ధిఁ బొంది భాసిల్లఁగన
య్యాకృతిఁ గని సితపక్షసు
ధాకరుఁ డితఁ డగు నటంచుఁ దలఁచిరి ముగుదల్. 126

గీ. అంగములయందుఁ గ్రొంగ్రొత్తలై నరుచులు
నాఁటినాఁటికిఁ బెంపార సాటిబుడుత

లందుఁ దలమానికం బయి యలరుచుండె
నా కుమారుఁడు గృహదీప మగుచు మిగుల. 127

గీ. కడచెఁ బొత్తిళ్లలో నుండుకాల మంత
'నత్త, తాతా' యటంచు నేదైన నూఁత
గాఁ గొనుచు నిల్వఁదొడఁగి శృంగారముగను
దప్పటడుగులు వేయుచుఁ దనరె నతఁడు. 128

ఉ. లీల నతండు సారస మళివ్రజవేష్టిత మైనయట్లు, నీ
లాలకజాలసంయుతముఖాంబుజ మొప్పఁగ, మందహాసరే
ఖాలసదాననుం డయి, వికస్వరనేత్రమరీచి పర్వ, మా
ర్జాలము గేలఁ బట్టఁగఁ; గరంబు సుభద్ర భయాతురంబునన్. 129

మ. సుతు వక్షోరుహమధ్యభాగమున సంశోభిల్లఁగా హత్తి వి
స్తృతవాత్సల్యము చెంగలింపఁ గుచముల్ చేపంగఁ దోడ్తోన నం
కతలంబందున నుంచి క్షీర మిడి యాఘ్రాణించుఁ దన్మౌళి, మా
పతి నిత్యంబును బ్రోచుఁగాక! యని యప్పద్మాక్షి దీవించెడున్. 130

సీ. స్ఫురదరవిందంబుఁ బురుడించు మోమునఁ
గుటిలాలకంబులు నటన సల్ప
వితతాంసభాగసంగతిఁ గుంతలగుళుచ్ఛ
ములు వింత విన్నాణముగఁ జెలంగ
నాజానులంబహస్తాబ్జకాండంబు లం
చితముగ చెలువంపుసిరులు గులుకఁ
గమనీయవక్షస్థలమనోజ్ఞరోచులు
హారప్రభలఁ గూడి యతిశయింపఁ

గీ. గంకణంబులు గరముల గజ్జె లంఘ్రు
లందు వెలయఁగఁ జిఱుబొజ్జ విందుఁ గూర్ప

లీల శైశవక్రీడలం దేలు బాలుఁ
గని సుభద్రానృసింహులు లగ్గలఁప్రేమ. 131

మ. కరతాళధ్వనులం బొసర్ప నతఁ డాకర్ణించి భాస్వత్కరాం
బురుహాంబుల్ వడి సాచి తప్పటడుగుల్ పొల్పొందఁగా వైచుచున్
బరుగెత్తున్ వడిఁ దల్లిచెంతకు సుతుం డాలింగ్యపైఁ హత్తి ము
ద్దు రచించున్ దగ నాసుభద్రవిభుఁ డెంతో వేడ్కఁ దీపింపగన్ 132

సీ. ప్రాలేయగిరిసుత బాలుఁ బాలించెడి
లీల వాత్సల్యంబు జాలువారఁ
బౌలోమి తనసుతు వాలాయముగ నేలు
తెఱఁగుఁ జక్కఁదనమ్ము దీటుకొనఁగ
క్షీరవారాశికుమారి మారునిఁ బ్రేమ
మీఱఁ బెంచినగతి సౌరు మీఱఁ
గశ్యపునర్ధాంగి గారామున నుపేంద్రు
సాఁకుభంగిని బ్రహర్షంబు సెలఁగ

గీ. నాత్మజునిపోషణశ్రమ మంతయు స్వాయ
ముగను వహియించి మాతృత్వమునకుఁ దగిన
ప్రేమసౌరభసముచితధామ మగుచు
వెలసెను సుభద్ర మానినీవితతియందు. 133

మ. సుతు నంకస్థలి నుంచి యాచకజనస్తోమంబు గాంక్షించుకా
మితము ల్దీర్పఁగ విత్త మెంతయును సంప్రీతిఁ న్నృసింహుండు సం
తత మా బాలునిచే నొసంగఁబనుచుఁ ధర్మప్రవృత్తంబు నం
చితలీలఁ బసినాఁటనే గఱపు సచ్చింతాభరస్వాంతుఁ డై 134

మ. నవనీతోపమవాక్యరత్నముల నానాసద్గుణవ్రాతు లై
భువి రాజిల్లిన వారిభూరిచరితల్ బోధించు నెల్లప్పు డు

త్సవ మేపార సుభద్రసూనునకు, మాతల్ శిక్షణం గూర్పఁగాఁ
దవుల నృంతతి మానికంబు లయి విద్యాపూర్ణ లౌ టబ్రమే. 135

గీ. బాలుఁ దోఁడ్కొని చేటికాపరివృత యయి
హాళిఁ జరియించును సుభద్ర యనుదినంబుఁ
గమ్మతెమ్మెరల్ జిమ్ముచు సమ్ముదమ్ముఁ
గూర్చు మందిరోద్యానకుంజములను. 136

వ. అంత మాధవుం డానందంబునఁ జిందులు ద్రొక్కుచు బహువిధ
కేళీవిలాసంబుల జననిఁ దనియించుచుండు. 137

సీ. కలరవంబున మేను పులకింపఁ జేయు కో
యిలపిండు రొప్పంగ నెలమిఁ బాఱు
సుమమరందాస్వాదనమున మత్తిలి గాన
కళ నభ్యసించుభృంగములఁ దోలు
బారులు దీరి దృక్పర్వంబుఁ జేకూర్చు
పారావతంబులఁ బట్టఁ బోవు
హారువు చేకుర మోదగరిమఁ జరించెడి
కేకిసంఘములఁ జీకాకు పఱచుఁ

గీ. బుష్పసంచయమును ద్రెంచి ప్రోవు వెట్టుఁ
బల్లవంబులఁ గొనగోళ్ల నల్లఁ జిదుము
లీల లతికామనోజ్ఞడోలికల నూఁగు
నాకుమారుఁడు ప్రమదావనాంతరమున. 138

సీ. కికురించి పరువెత్తి కింశుకభూరుహాం
తరముల దాఁగు నబ్బురము పొరయ
చవికలఁ గ్రాలు పుష్పంబు లందుకొనంగ
నెంచి యందందుఁ గుప్పించి గంతు

దర్పం బెలర్పఁ బద్మాకరంబును డాసి
సారసంబులను ద్రెంచం గడంగు
దోబూచు లాడఁగఁ దొడరెద నంచును
గొమ రొప్పఁగా నికుంజములఁ దూఱు

గీ. బాల్యచాపల్యగరిమ సౌభద్రుఁ, డతని
చెయ్వు లన్నియుఁ బొడఁగాంచి స్మితము గదుర
సంభ్రమాశ్చర్యభరిత యై సఖులఁ జీరి
పట్టుకొనఁ బంచు సుతుని సుభద్ర ప్రీతి. 139

శా. ఆలేమల్ దను డాయఁ జిక్కక కరం బందందుఁ బర్వెత్తుచున్
హేళిన్ గాసిలఁ జేసి స్మేరరుచిరాస్యంబందు ఘర్మాంబువుల్
గ్రాలన్ ముంగురు లెంతయున్ జెదర దీర్ఘశ్వాసుఁ డై మాతృదే
వీలావణ్యకరంబు మాధవుఁడు బల్విన్నాణి యై పట్టఁగన్. 140

గీ. మాధవస్పర్శఁ బులకించి మందహాస
భాసురానన యయ్యె సుభద్ర మివుల
మాధవస్పర్శ ఫుల్లసుమప్రహాస
భాసురానన యగు వనభామ వోలె. 141

క. మైజారుకొంగుతోడను
మై జాఱుశ్రమాంబు వొత్తి మాధవు నంతన్
మైజారుచెంగు విసరుచు
మైఁ జేరిచి యదుముకొనియె మానిని ప్రేమన్. 142

ఉ. కొండొక సేదఁ దేఱి సుమకోమలబాహుయుగంబు సాఁచి య
య్యండజయానకంఠము సమాదరవృత్తినిఁ జుట్టి పట్టె బా
లుఁడు; మహాంబుధిన్ జలిమెలుంగు స్పృశింపఁగఁ బొంగుభంగిఁ దా
నుండె సుభద్ర యాత్మజుని నొత్తి యెడంద మహోత్సవంబునన్. 145

మ. ఇటు లామాధవుఁ డింపు మీఱ జననీహృత్సారసానందసం
ఘటనానల్పసమర్థుఁ డై కమలినీకాంతుండు నా నొప్పు, వి
స్ఫుటదేహప్రభ లుల్లసిల్లఁగ; స్మితజ్యోత్స్నాసమృద్ధిన్ నిశా
విటుఁ బోలున్; రవిచంద్రనేత్రుకృపఁ దా విన్నాణి యై కాంచుటన్.

ఆ. వె. ఆజ్యధారవలన సంతంత కతిశయ
కాంతు లీను నగ్ని కై వడిఁ దగ
నేండ్లు గడచుకొలఁది నెంతయు సౌభద్రుఁ
డంగసౌష్ఠవమున నలరఁ దొడఁగె. 147

గీ. పంచమాబ్దంబు దగఁ బ్రవేశించినంత
భూరివిద్వాంసు నొక్కనిఁ జేరఁ జీరి
పొసఁగ నక్షరస్వీకారమును నొనర్పఁ
జేసె నా కుమారునకు నృసింహవర్మ. 148

క. ఆ సుముహూర్తంబున నా
నాసురుచిరవస్త్రభూషణవ్రాతము ను
ల్లాసమున నిచ్చి తన్నను
ధీసహితుం డైన సుతునిదేశికవర్యున్. 149

చ. పదపడి నారసింహుఁ డతిభక్తి దలిర్పఁగ మ్రొక్కి తత్సభా
సదు లగు పండితోత్తముల సత్కృతి సల్పెను భూరిదక్షిణల్
విదితయశోవిరాజితకవిప్రవరుల్ గొని రెన్న గానకో
విదులును బెక్కురూకలను వేడ్క గ్రహించిరి పేరుపేరునన్. 150

చ. అనదలఁ బెక్కురన్ వరరసాన్వితభోజనవస్తుసంచయం
బునఁ బరితృప్తులన్ సలిపెఁ, బుణ్యవధూటుల నాదరించి చం
దనఘనసారసమ్మిళితనవ్యవిలేపనయుక్తిఁ దన్పె నం
దనుహితకాంక్షమై కడు ముదంబున నత్తి వారుణాగయున్. 151

మ. స్మితసంశోభితపుణ్యభామినుల యాశీర్వాదశబ్దంబు నా
గతనానాజనబంధుమిత్రవిలసత్కౌతూహలారావ మం
చితవిద్వాంసకవీంద్రబృందబహుళాశీర్వాదముల్ వాద్యసం
గతిఁ గ్రాలన్ నరసింహవర్మ జనసత్కారార్థి యై పొందుగన్. 152

క. ఘృత దుగ్ధ శర్కరా మధు
కృతభక్ష్యంబులను నారికేళ కదళికా
స్తుతఫలముల సబ్బాంధవ
తతి కిడి భుజియింపఁ జేసి తన్వి పదపడిన్. 153

సీ. పంక్తులు దీర్చి రంభాపత్రములు వైచి
వెండిచెంబుల నీరు నిండ నించి
ఘుమఘుమ నెత్తావిఁ గ్రుమ్మరించెడుకూర,
లుల్లసం బిడెడుపచ్చళ్లు, నోరు
నూరింపఁ జేసెడియూరుఁగాయలు, నేయిఁ
బోపు వైచిన మంచిసూపములును
కరడు గట్టిన గేదెపెరుగు, నప్పుడ కాచి
గిన్నెల నించు గోఘృతము, నుష్ణ
గీ. విమలశాల్యన్నమును, బాయసమును, చారు,
నప్పడంబులు వడియము లమరఁ జేసి
విందుగా విందుఁ గావించి డెందమందు
బళిర! యనుకొనఁ జేసె సబ్బాంధవులను. 154

వ. భోజనానంతరంబున సబ్బాంధవసందోహము మాధవు ననురాగంబున
దీవించి వివిధము లగు కానిక లొసంగి రందు— 155

సీ. మాతామహి యొసంగె మణికంకణంబులు
మేనమామ యిడెఁ గడానిపాత్ర

దువ్వాలువలఁ బ్రీతితో నిచ్చెఁ బినతల్లి
పాదకందుకమును బావ యొసఁగె
మేనత్త రోహిణి మేల్మిభూష లొసంగె
సురుచిరలేఖిని గురుఁ డిడియెను
జల్తారుకుల్లాయి జనకుం డొసంగెను
బాదరక్షలను సుభద్ర యిచ్చెఁ

గీ. కరణము త్రిచక్రశకట మాదరమున నిడెఁ
జేతిగడియార మిచ్చిరి సేవకాళి,
కవులు సత్పద్యరత్నముల్ కానుక లిడిరి
ఆ కుమారుని కక్షరాభ్యాసవేళ. 156

గీ. ఆ మహోత్సవంబు ముగిసినంత నొకటి
రెండు నాళ్లుండి యరిగిరి ప్రీతితోడ
సకలబంధులు రోహిణీసతియుఁ గాక;
పిదప నరసింహవర్మ వివేక మలర. 157

క. ఆశీర్వాదస్తబకము
నా శస్తకవీంద్రకృతఘనసువృత్తములన్
ఆశిశ్వద్యశునకుఁ బ్రతి
భాశోభితముగను గావ్యఫణితిం గూర్చెన్. 158

క. ఆ పొత్తము ముద్రించి సు
ధాపాండురసారకీర్తిధాముం డై శో
భాపరిపూర్ణుం డై సుతుఁ
డేపారంగను నృసింహుఁ డెదఁ గాంక్షించెన్. 159

గీ. ఆ మహోత్సవవ్యాజము నదియుఁగాక
ప్రథమగర్భిణి యగుట సుభద్ర పురిఁటి

కొఱకుఁ దోడ్కొని వచ్చె నాదరము మెఱయ
ధవునియొక్కై కభగిని నేడవనెలఁ దగ. 160

ఉ. ఆరమణీయగాత్రవిమలాస్యవిలాసము పూర్ణచంద్రునిన్
గేరుఁ దనుప్రభాగరిమ గేలి యొనర్చుఁ దటిల్లతావళిన్
మీఱును జంచరీకములమేనిరుచిన్ గబరీభరంబు, శృం
గారరసావలంబనగఁ గ్రాలును రోహిణినామధేయ యై. 161

చ. స్ఫురదరవిందపత్రయుగమున్ గొమ రొప్పఁగఁ గూర్చి యామె సుం
దరనయనద్వయంబును విధాత యొనర్పఁగ నోపు నాసుధా
కరుఁ డమృతంబు నందిడఁగఁ గారణ మూహ్యము గాదు, వైరి ని
ద్ధర నభివృద్ధిఁ బొందఁగను దా రొనరింతురె రాజపుంగవుల్. 162

చ. అది పవడంబు గాదు రుచి యాక్రియ నుండును, గాదు పల్లవం
బిది ముదు రెక్కనేర, దది యెట్లగుఁ గెంపు? తలంపఁ గర్కశం
బెది? యగు బింబ; మిట్లగుట కేవి శుకంబులు? మూగవా యటం
చెదఁ దలపోతు రాతరుణియింపగుమోవిని గాంచినంతనే. 163

గీ. ఆ సతీమణి పద్మరాగాధరమును
ధవుఁడు చుంబించఁ దొడఁగు నత్తరుణమందు
నాత్మరూపము నునుఁజెక్కుటద్దములను
బ్రతిఫలించుటఁ గాంచి విభ్రాంతిఁ గనును. 164

గీ. గోముగా వృద్ధిఁ బొంది సుశ్యామల మగు
చిత్తకార్తెయందలి వరిచేనులీల
గర్భభారపరిశ్రాంతగమన యగుచు
మించె రోహిణి నవనవోన్మేషశోభ. 165

ఉ. ఆ హరిమధ్యమధ్యము నితాంతసమృద్ధిని మేర మీఱు ను
త్సాహము చెంగలింపఁగను స్వాకృతిఁ బాసె వళుల్ మహోద్ధతిన్

వాహిని పొంగి పాఱఁ దదుపాంతము తో పరిమళ్ల నుండు నా
యా హాలరేఖ లన్నియు రయంబున రూపఱులీల నెంతయున్. 166

చ. రవి యుదయించువేళ నపరంజిమెఱుంగులు చెంగలింపఁగా
నవకమనీయదృశ్య మిడు నవ్యలతావళి వోలెఁ జక్కురు
త్సవముగఁ గ్రాలె నామె మెయితళ్కు, ప్రభాకరుఁ గాంచి వెల్ల నై
న విధువిధాన మోము, నయనద్వయి పద్మములట్లు భాసిలెన్. 167

సీ. ఆహార వనవిహారాపేక్ష నశియించె
సందెనిద్దురలు విస్తార మయ్యెఁ
గంకణంబులుఁ గాళ్లకడియముల్ బరు వాయె
నొడ్యాణమునఁ గోర్కె యుడిగిపోయె
నడలు మందము లయ్యె నడికట్టు వదు లాయెఁ
బాటిమన్నుఁ దినంగ భ్రాంతి మిగిలె
నిడుదయూర్పులు మీఱె బడలిక పెంపారె
లా వయ్యె నొడలు చలాకి వెడలె

గీ. నంగములయందు నించుక పొంగు చూపె
వేవిళులు హెచ్చెఁ గై సేయ వేడ్క తొలఁగెఁ
బ్రాలుమాలిక వెలసె పరాకు బలిసెఁ
గోమలాంగికి గర్భంబు గొనఁగ వృద్ధి. 168

గీ. అభిరుచి నెఱింగి వివిధరుచ్యంబు లైన
వంటకంబులఁ దనియించి వలసిన పరి
చర్యలను సల్పుచుండును స్వయముగను సు
భద్ర తనయాఁడుబొట్టెకు బహువిధముల. 169

ఉ. ఆరుచిరాంగి మాధవుని నంకతలంబున నుంచి కృష్ణలీ
లారమణీయగాథలు విలాసముతోఁ దొలిరేయివేళలఁ

చేరిమిఁ జెప్పుచుండుఁ; గడువేడుకతోడ సుభద్ర వారలన్
జేరి యొనర్చు మేలము విశిష్టరసాన్వితవాక్సమేత యై. 170

మ. "వదినా! నీయనురాగ మే నెఱుఁగనా త్వత్పుత్రికన్ మాధవుం
డు దగన్ జేకొనఁ జేయ నెంచి యగు; వాఁడున్ లోలుఁ డాటం గొనం
గఁదొడంగున్ విను శ్రద్ధ నెంతయును వాక్యం బొక్కటే తెల్పెదన్;
ఎదిరో యల్లునికట్న మేర్పఱుపఁగా నీనాఁడె యర్హం బగున్."

చ. అనుచు సుభద్ర పల్కిన స్మితానన యొప్పఁగ రోహిణీవధూ
టి "ననుఁ గదల్చినా, వలతటిల్లతఁ బోలదొ! నాకుమారి, యెం
త 'నజ' రోసంగి చేకొనునొ తప్పక మాధవుఁ బృచ్ఛ సేయుమీ!
తనయులు సెల్లరా వదిన! దర్పము లింకను గట్టిపెట్టవే! 172

చ. కనుము కుమారునందమును గన్నుల బాగుగ విచ్చి; నీకు నం
దనుఁ డని నిబ్బరంబా! విను; నాకుఁ గుమారియె కల్గెనేని వీ
న్నిని వరియించునా యది? గణింపదు పూతికలీల నైనఁ బా
త్రునికరమున్ గ్రహించు" ననఁ దోఁపువేడ్క సుభద్ర యిట్లనెన్.

ఉ. "సందియ మొందఁబోకు మొకచక్కనిబాలిక యుద్భవించు; నా
నందనుఁ డామె నిల్లు విడనాడఁగనీయక బంది సేయు, నీ
వెందఱు రూపవంతులకు నిత్తువా! నీసుతఁ జూడకుండునా
బొందిని బ్రాణ మున్నఁ; దలపోయవె మేనఱికంపుబింకమున్. 174

మ. ఎటు లీబాలునియందు లోపమును నీ వెంచంగ నో రాడె; సం
ఘటితానంతమనోజ్ఞదృశ్యుఁ డితఁ డక్కంతున్ జయంతున్ బరి
స్ఫుటసౌందర్యమునన్ జయించు; భువనస్తోమంబు రక్షింపఁగా
నిటు లామాధవుఁ డుద్భవించె; సిరి తా నేతెంచు నీపుత్రి యై."

గీ. అనిన రోహిణి మందస్మితాననాంబు
జంబు తళ్కొత్తఁ బల్కె నీచందమునను

"వందిమాగధు లైనను వదిన ! నీకుఁ
దుల్యు లగుదురె ? తగ్గ వెందునఁ బలుకుల." 176

ఉ. అంత నితాంతమోదజనితాంచితబాష్పసమార్ద్రనేత్ర యై,
కంతునిఁ బ్రేమ మీఱఁ దనకౌఁగిట జేర్చెడు పద్మలీలఁ దా
నెంతయుఁ జెన్ను మీఱె, సుతు నేర్పడ నక్కునఁ జేర్చెఁ జేర్చెఁ జ
న్వంతుల రోమరాజి గుణభద్రసుభద్రకు నబ్బురంబుగన్. 177

మ. ఇటు లాయింతులు నర్మగర్భవచనానేకప్రసంగాళి లం
పటు లై వర్తిలుచుండఁ దొమ్మిదినెలల్ పద్మాక్షికిన్ నిండె; నం
తట జీమూతసమేత యై నభము విన్నాణంబుగాఁ గ్రాలుచుం
డుట గ్రీష్మాంత మెఱుంగఁ జేసె విరిబోఁడుల్ గాంచ నుత్సాహు లై.

శా. గ్రీష్మాదిత్యకరప్రతప్తసకలోర్వీమండలప్రాణి సం
భీష్మాయాసనివర్తనాచణలసద్వృష్టిన్ దగ న్గుప్పి య
ర్చిష్మత్త్రపతఁ బాపుఁ డిం కని సునాశీరుండు శాసింపఁగా
భీష్మించెన్ జలదంబులో యనఁగ నాభీలంబు లై వర్తిలెన్. 179

చ. కరము కరంబుఁ జేకొని సుఖప్రచయంబు సమర్చుధారుణీ
శ్వరుని తెఱంగున న్విపులవార్ధిశీకరముల్ గరంబులన్
బరి పరి స్వీకరించి దినపాలుఁ డొసంగెడు సౌఖ్యసంపదో
త్కర మన వారిధార లిలఁ దన్పఁదొడంగె నిరంతరంబుగన్. 180

మ. ఉరురౌద్రాన్వితలోచనప్రభలు విద్యుత్కాంతు లై యొప్ప, భీ
కరహుంకారము గర్జ గాఁగఁ, గరసంఘాతంబు భీమాశను
ల్గ రహిన్ మించఁగ, ఘర్మవారి జల మై క్రాలంగ జీమూతముల్
గిరిశృంగంబులఁ దాఁకెనో యనఁగ దృగ్భీష్మంబు లయ్యెన్ గడున్.

మ. ధరణిన్ బీటలు వార్చి, బండలను బ్రద్దల్ సేసి, లేఁదీవలన్
గరువం బార్చి, నిశాచయంబుఁ గడు స్రుక్కం జేసి, కాసారసుం

దరతన్ బాపి, యరణ్యసంఘములతో దావాగ్నిఁ బ్రేరేచి, యం
బరమున్ ధూళినిగప్పు గ్రీష్మపరితాపం బార్చె సుశ్రావణిన్. 182

గీ. దంతకాంతులు మించు లై తనర బృంహి
తములు గర్జన లై మీఱు దానధార
లంబుధార లై క్రాల విహాయసమున
నరుగుదిక్కరు లనఁగ మేఘాళి యలరె. 183

గీ. వారిదంబులఁ గరఁగించి వశము చేసి
వాహినులనెల్లఁ దనపట్టపాలు సేసి
చాల దని ఘోష యిడుచుండె సాగరంబు
కలిమి గలవానికే యాశ కడల నంటు. 184

గీ. ఘను కృపారసవృష్టి జీవనము పెంపుఁ
గాంచ నుప్పొంగి సత్త్వసంఘమును నేఁచఁ
గడఁగె వాహినుల్ మున్ముందు నడఁగు స్వాతి
శయ మటంచు డెందమున లేశం బెఱుఁగక. 185

మ. నవరత్నస్థగితంబు నున్నతము విన్నాణంబు నై దేవశి
ల్పివినూత్నప్రతిభావినిర్మితము నై పెంపారుచాపంబు వా
ర్ధివిభుం డెంతయుఁ బ్రీతి వాసవున కర్పింపంగఁ బై కెత్తులీ
ల విరాజిల్లెను నింద్రచాపము మహోల్లాసంబుగా శ్రావణిన్. 186

చ. తొలిదెసగాడ్పు లెంతయును దోరముగాఁ బ్రసరించె; భాను చం
ద్రులు పరివేషయుక్తముగఁ దోఁచుచు నుండిరి; ధారుణీధరం
బులు ఘనసంయుతంబు లయి పొల్పెసలారెను; మిఱ్ఱులన్ బకం
బులు సెలువారె, వర్షములు పొంపిరివోయెను నంతకంతకున్. 187

ఉ. ధూళి యడంగెఁ గోకిలవధూకలకంఠరుతంబు గ్రుంగె, మ
త్తాళి కలంగె, భేకములయార్భటు లంతఁ జెలంగె వాహినీ

జాలము పొంగె, నాట్యకళ సాధనసల్పె మయూర, మింపుళొం
పాలతికల్ రచించె, వరిపైరులు మించెఁ; బ్రవృష్టిసంగతిన్. 188

గీ. ఘనఘనాఘనమాహిషీగణము చేఁప
ధారణీధరసంఘవత్సముల విడచి
విశ్వదుగ్ధపాత్రికయందుఁ బిదుకఁ దొడఁగె
జలపయోధారలను నిరుసంధ్యలందు
నరసి ప్రావృట్సమయచూడవాంగనయును. 189

చ. సుడివడగాడ్పు లొంచి, కడు శోషిలునట్టి వనస్పతిశ్రమం
బుడిపి, సుధాభనీరముల నొప్పుఁగఁ జల్కెడు వారివాహుఁ దుం
దుడుకుఁదనంబునన్ దొలఁగఁ ద్రోయుచుఁ, బూర్వవిరోధభావ మే
ర్పడఁ బచరింపఁజొచ్చెను ప్రభంజనుఁ డీసు వహించి యత్తఱిన్. 190

గీ. సింహగిరి వీడి, మన్యముఁ జేరి, పాల
కొండలన్ జొచ్చి, కిమిడిదిక్కునకుఁ బాఱి
ఘనమహేంద్రాద్రిచరులయందున విహార
లాలసన్ జిక్కి మొయిళ్ళు లుల్లసము నించె. 191

ఆ. వె. వెదురుసాదుపొదల మెదలి, ముల్లెపుడొంక
లందుఁ జిక్కి నొంది, యవల నల్ల
మద్దిమ్రాఁకు లొరసి మల్లడిఁ గొని, గుగ్గి
లంపుఁదరులఁ దరిసి సొంపు మీఱు. 192

గీ. ఇప్పపూఁదావివెల్లువ దొప్పదోఁగి
ఏగిసలఁ జిందు ద్రవరాగ మెటిఁగి, యిరిడి
చేవ భావించి, సంద్రుపాసిని గ్రహించి
కంబ యాలంబనముగ మేఘములు గ్రాలె. 193

ఆ. వె. కాపు గుబ్బగొడుగు, కంబారి మోదుగ
యాకుగిడుగు, నాయరాలు తాటి
గిడుగు, పాలికత్తె యడఁకువతో జమ్ము
గూడ జడిని వేసికొనిరి మీఁద. 194

గీ. గోర్జపరిగెలు; బొంతలు, కొయిఁగలుఁ, కణి
సెలును బర్ణావ లెరరొయ్య లలరె మివుల
లవణమధురోదకములు మొల్లముగఁ గూడు
పరల వానకాలమున దృక్పర్వముగను. 195

గీ. ఇంగిలాయి, మారుపు, జెల్ల, యిల్లిస, వెదు
రాకుపరిగె, వాలుగ, బొమ్మిడాయి, సవడ,
మిట్ట, వల్లంకి, బొచ్చెయు మివుల నేపుఁ
గాంచె జలపూర్ణ మా తటాకముల నంత. 196

ఉ. ఏపుగ రొయ్యపిండు వెలయించెఁ దటాకము ద్రుల్లియాడుచున్,
గ్రేపులు గట్టి పిత్తపరిగెల్ చరియించెను గుల్యవారిలో,
మేపఁగఁజొచ్చెఁ బిల్లలగమిన్ సవడల్ దగ నాచుపట్టులన్
జూపఱ దన్పెఁ గూర్మములు శుభ్రజలోపరిసీమఁ దేలుచున్. 197

గీ. ఉరిడిపుర్వులు, తీములు నుక్కబలిసి
పెంటగుంటల నొడ్డుల నంటి మెసలె
నత్తలింద్రగోపమ్ములు మొత్తములుగ
బీడులం దోఁచె వర్షర్తువేళ మివుల. 198

సీ. బురదనీట జలూకములు రక్తకాంతులు
వెలయఁగా నంతంత మలయఁజొచ్చెఁ
గడుపెదుబిడ్డలఁ గడుపార మోయుచు
బొరియచెంతను నెండ్రి ప్రొద్దుపుచ్చె

సవిరామముగఁ జవురాకుల గొంగళి
పుర్వు మెక్కుచును బెంపును వహించెఁ
బుట్టపట్టునఁ బొట్టి పొలుపొందఁ జిన్నారి
పిల్లల నీన నోపికను దిరిగె

గీ. దోమ లీఁగలు శతగుణస్తోమతఁ గనె
లక్కపట్టులు వాసములను జెలంగె
సృష్టిని రజోగుణ మ్మభివృద్ధి నొందె
ననఁగ వానకాలమున మోహానము గాఁగ. 199

క. మలచిలువ యొడలు విదిరిచె
మలసె నిశల నుల్లిపాము, మదనాగము దాఁ
దొలఁగించెఁ గుబుసవసనము
దళుకులు సెన్నారెఁ గోడెత్రాఁచున నంతన్. 200

గీ. కట్లపాములు పొదిగట్లఁ గానవయ్యె
నీరుగొడ్డులు దారాడె దారులందు
జెట్టిపోతులు సడి విని చెదరి పాఱె
సారవర్షర్తుశస్తవాసరములందు. 201

క. మొండిల్లగమియు, రోఁకటి
బండలతుట్టెలును, బిందిపాములు, చీమల్
మెండుకొనెఁ జింతగుట్టుల
పిండులు వర్షర్తువేళఁ బెం పెనసి కడున్. 202

క. కొండంగి కారుకొనియెను
దండిగ సత్త్రికము వెన్నుఁ దార్చెను రుచిపై
పండె గరికసన్నము కను
పండువుగా, మెట్టవరిని పస రెడలెఁ దగన్. 203

క. కిచ్చిలి చికిలింతవలెఁ
ముచ్చటగాఁ గాన నయ్యె, మొదళుల నలు పై
పెచ్చుపెరిగె నవకోటియు
నిచ్చలు గుణుపురపుసన్న మేపారెఁ గడున్. 204

క. జీరకసన్నమ్మును గ
ర్పూరపుభోగములు మివులఁ బొల్పెసఁగెను గే
దారముల నీటితామర
తీరునఁ గొనబారి వృద్ధి దీపింపంగన్. 205

క. ఆముదపుగోలలు వెలసెను
గోమలతృణసస్యరాశి కొమరొప్పెను, సు
శ్యామల మై జను మలరెఁ
గోము గనెఁ బురడచోడి కొని వెన్నమరన్. 206

గీ. ఉత్తరాకార్తెయందు నుమ్మెత్తుఁ బెరిగి
ప్రత్తిబోగలు విరజిమ్మె ప్రమద మిడియె
వసుమతీశోభ వర్షర్తు వైభవంబు
గాఁ దలంచి యానందవీక్షణలఁ బఱపి. 207

క. ఒడిఁ గట్టి బోగ లేరెడి
పడఁతుకలను గందురీఁగపట్టులు కదులన్
గడు నొంపఁ దొడఁగె నీఁగలు
చిడిముడి పడి ప్రత్తి చేలఁ జెదరి పరువఁగన్. 208

గీ. తూఁటి, చెంచలి, బచ్చలి, తోఁట, పొన్న
గంటి, ముల్లంగి, తంటిము కడలుకొనియె
బలుసు, గురుగును, జొక్కకూరలును వాన
కాలమున నేలచెలియభూషాళి యనఁగ. 209

ఉ. సారున నారు మీఱెఁ, బెలుచం గనఁ దుంగ చెలంగెఁ, జెంగలిన్
జేరె నపూర్వశోభనము, చెన్నుగనెన్ గటికన్ వినూత్నశృం
గారము, కొత్తికల్ చెలువుగాఁ దులకించెను నీటిపట్టులన్
శ్రీ రచియించె రెల్లు తటసీమల, నూదరగడ్డి వర్ధిలెన్. 210

శా. దీనానూనసుపర్వధేను ! వరసాధ్వీలోకచూడామణీ !
ప్రాణప్రీణనసద్వ్రతప్రణుత ! నిర్వ్యాజప్రియారంభ ! వా
చానైర్మల్య ! క్షమాక్షమా ! దళితదోషా ! పోషితార్యా ! యశ
శ్శ్రీనిస్తంద్రమహాంధ్రమండల ! పురంధ్రీ ! చిన్నమాంబాసతీ ! 211

శ్రీమ న్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

## ద్వి తీ యా శ్వా స ము



చిన్నమదేవీసహి
తా ! చిన్మయరూప ! జన్మతారక ! విద్యా
వాచస్పతి ! యమృతయశః
ప్రాచుర్యా ! విబుధవర ! వరాహన్నృసింహా ! 1

వ. అవధరింపుఁడు. 2

క. హనుమంతువంశసాగర
జనితరమారమణి ! సాధుజనవినుత ! సనా
తనమార్గవర్తనా ! నూ
తనభావపరంపరావృతస్తుతహృదయా ! 3

గీ. వినుము సంప్రీతి నవ్వాలివిషయ మింక
నెలలు నిండిన రోహిణి వెలయ నొక్క
శుభదినంబునఁ గనియెను సుతను; క్షీర
వార్ధి సిరిఁ గన్నగతి గర్భపావనముగ. 4

క. ఆరుచిరగాత్ర వరశృం
గారాంగచయంబు గలిగి గ్రాలుచు సురనా
రీరత్నప్రతిబింబము
నా రాజిల్లెను సతీజనంబులు మెచ్చన్. 5

ఉ. ఆ తరుణామ్రపల్లవనిభాంచితగాత్రకు జాతకర్మ ల
త్యాతతరీతిఁ దీర్చి యిడి రాదట మాలతి నామరాజ ము
జ్ఞాతముఖుల్, ప్రహర్షవికచప్రచురానన యా సుభద్ర ఖ
ద్యోతముఁ బోలు మాలతిని దోర్యుగమందునఁ బట్టి యెత్తుచున్. 6

గీ. సప్తవింశతిదినమున జలజవదనఁ
దరుణు లెల్లరుఁ గూడి యుత్సవము మెఱయఁ
దూఁగుటుయ్యాల నిడి పాడఁ దొడఁగి రంతఁ
బాట జోకొట్టి కిన్నర మీటులీల. 7

మ. ఫలపుష్పాక్షతలాజకుంకుమవిలేపంబుల్ దగన్ బంచి య
య్యలివేణీనివహంబుఁ దన్పె వరడోలారోహణవ్యాజమం
దు లతాంతాంగి సుభద్ర; దీవెనల నెన్నోభంగులన్ గూర్చి ర
జ్జలజాతాక్షులు డోలికాంతరశరచ్చంద్రాననస్ఫూర్తికిన్. 8

ఉ. అంత నితాంతహర్షజనితాశ్రువిలోచన యై సుభద్ర గ్రీ
వాంతరతారహారమును నాదట మాలతికంధరంబునం
దింతులు మే లనంగ నిడి యేర్పడఁ గుంకుమ బొట్టు పెట్టి యి
క్కాంతయె మాకుఁ గోడ లని కౌతుక మొప్పఁగ నాన వెట్టినన్. 9

క. ముసిముసినగవుల రోహిణి
కుసుమశరునిశరము వోలెఁ గొమ రొప్ప సుధా
హాసితాంగి నిందుముఖిఁ గర
కిసలయములఁ బట్టి ముదము గీల్కొనఁ బలకన. 10

క. "అమ్మా! మీ యత్తకు ము
ద్దిమ్మా! లే లెమ్ము వేగ నేలుకొనఁగ నే
హామ్మ; నెలకూన వగు నీ
సొమ్మయ్యెను దాతగారిసొత్తులు తల్లీ!" 11

చ. అన విని పౌరభామిను లయారె! విధాతృనిచెయ్వు లెంతవిం
త నిడుఁ గదా! సువర్ణము ఘనం బగు రత్నముఁ గూర్చుచంద మ
య్యెను; మన మాధవుం డనెడి హీరమణిన్ రమణీయమాలతీ
వినుతసువర్ణభూషఁ బొదివించఁగ నెంచెను సబ్బురంబుగన్. 12

చ. అని వినుతించి హాసరుచిరాననలై చని రెల్లవార, లం
త నపరధారుణీధరపథంబున వృద్ధదివాకరుండు మె
ల్లనఁ బయనించఁజొచ్చెను; గులాయములం గనువేష్కఁ బక్షు లె
ల్లను జన లేచె, వీఁచె సవిలాసముగా శిశిరానిలంబులున్. 13

గీ. పలక డాచేతఁ బట్టి చెప్పులు ధ్వనింప
లాగు దిగజాఱ ముంగురుల్ లాస్య మాడ
మెడను బులిగోరుపతకము మెఱుఁగు లీన
బడిని విడువంగ వచ్చె సౌభద్రుఁ డంత. 14

గీ. వాని కెదురుగఁ జని "వచ్చె వచ్చె మాధ
వుం" డటంచును సందిటఁ బొదివి యంత
నెత్తుకొనిపోయె రోహిణి యింపు మీఱ
నాకుమారుని మందహాసానన యయి. 15

గీ. పిదప నుపకరణంబులు విహిత మైన
నెలవులం దుంచి నులివేడినీట జలక
మార్చి తడి యొత్తి శుభ్రము లైన దుస్తు
లాతనికిఁ దొడిఁగించె సొంపార నామె. 16

గీ. మాధవుం డంత మాలతీమందిరాంత
రమునఁ జొచ్చి వీక్షించెఁ బర్యంకమందు
బాలికామణి లేమి, విభ్రాంతి గదుర
నిట్టు లనియెను రోహిణియెదుట నిల్చి. 17

క. "ఏ మిది యత్తా! మాలతి
యే మయ్యెను? జోగి జోలె నిడుకొనెనో! లే
దేమీ? నే డెవ్వరి కిఁక
నా ముద్దు నొసంగుదును; గనంబడ దయ్యో!" 18

గీ. అనిన రోహిణి స్మితశోభితానన యయి
"మాధవా! మాలతిని నేఁడు మా గృహమున
కనిచినారము; నీ వేమియును నొసంగ;
వామె కెందు కీ ముద్దిచ్చు?" టనిన నతఁడు. 19

గీ. వెక్కి వెక్కి యేడ్చుచుఁ బరువెత్తి తల్లి
హస్తముఁ గొని "మాలతి నత్త వారి
యింటి కనిచెను నే బడి కేఁగినంత"
ననుచు డగ్గుత్తికఁ బల్కె నా సుభద్ర. 20

చ. తనయుని నెత్తి ముద్దుఁ గొని తన్నయనంబులఁ గాఱు బాష్పవా
రిని దగ నొత్తి "యామెను హరించుక యెవ్వరు పోఁగలారు? భా
ర్యను గనుఁగొమ్ము ర మ్మిడె స్ఫురత్కమలాలయ వోలె నుయ్యెలం
దున నిదురించుచున్న" దని తోడ్కొనిపోయినఁ జూచి నవ్వుచున్. 21

మ. "ఇదిగో మాలతి; యత్త కల్ల లనె; నే నీబాలకుఁ రే పొసం
గుదు నా బొమ్మలపొత్తు; మెవ్వ రిడి రీక్రొంగ్రొత్త దా హార? మి
చ్చెద వేటొక్కటి యయ్యకుం డెలిపి; యీ చిన్నారిబొట్టుంచి రే
మిది? బాగున్నది" యన్న మాధవుని దా నేపారుహర్షంబునన్. 22

శా. "రమ్మా మాధవ" యంచు రోహిణి సుభద్రాసూనునిన్ డాసి హ
ర్ష మ్మేపారఁగ ముద్దు వెట్టి పలు కజ్జాయంబులుఁ బండ్లు ప
ళ్లెమ్మం దుంచి యొసంగ, నుల్లసిలి, తల్లిం జూచి "యోయమ్మ! నీ
విమ్మా మాలతి కిందుఁ గొన్ని" యనెఁ దా నింపార భక్షింపుచున్.

మ. ఘనదామోదరుశ్రావ్యదివ్యచరితాకర్ణానుసంధానసహృ
ద్వనజుం డై నరసింహవర్మ తనరన్ బ్రాహ్మణోత్తంసు నొ
క్కని రావించి పురాణకావ్యపఠనన్ గావింప శాసించినం
దున నిత్యం బపరాహ్ణకాలమునఁ బ్రొద్దున్ బుచ్చు నక్లాంతుఁడున్. 24

గీ. సాంధ్యరాగము గ్రమ్మఁగ స్వస్తిఁ జెప్పి
కావ్యపఠనంబు ముగియించి కదలు నతఁడు;
పిదప శ్రోతల వీడ్కొల్పి వీడను మొగ
సాల నరసింహవర్మ యుత్సవము మెఱయ. 25

గీ. అంత విజయప్రవంతికి నరిగి యచట
స్నానసంధ్యాదులను దీర్చి సదమలహృద
యాంబుజుం డయి మాధవునంఘ్రియుగళి
మోకరిలుచుండు నిరత మపూర్వభక్తి. 26

గీ. మాధవప్రసాదమును దన్మాళసీయు
చరణపూజితపుష్పసంచయముఁ గనుల
నద్దుకొని వానిఁ జేకొని యరుగు గేహ
మునకు సుతుని కిడంగ నెప్పుడు నతండు. 27

ఉ. నాఁడు నృసింహవర్మ తననందను డాసి ప్రసాద మిచ్చి మా
టాడక లోని కేఁగ వినయంబున ధోవతి నిచ్చి యంతటన్
వీడినవస్త్రమున్ విడిచి వేసెను దండెముమీఁద, నేల జ
రాడెడుకుచ్చెళుల్ నడలయందముఁ బెంప సుభద్ర ప్రేముడిన్. 28

గీ. కాంత యిడిన గావంచాను గైకొని నర
సింహుఁ డిట్లనె “నే నేమి చెయ్యాల నొన
రించుచున్నది మీకోడ లంచితముగ,
తొడవు లే ముంచితివి ప్రియా! నుడువు మింక.” 29

చ. అనఁగ సుభద్ర నాథువచనాంతరసాంద్రమనోజ్ఞహాసరో
చినిఁ గని పుల్కరించి ముఖసీమ వికాసము చెంగలింప "మీ
కును గడుఁ గూర్చుకోడలె; యకుంఠిత మా తమప్రేమపుష్పమా
లను నది యొక్కసూనమె; తలంపరొ ముద్దులమేనగోడలిన్. 30

మ. అబలన్ ద్వాచ్చరణాగ్రరేణువును, దాస్యంబందు నుత్తీర్ణనై
న, బహుప్రీతిని దారహార మిడిరే నా, కేను నద్దానినే
యబలారత్నముకంఠమం దిడితి; మీ యాప్యాయపుంగోడ లే
మి బృహచ్చిహ్నము మీకడం గొనునో; ప్రేమింపంగ లోభింతురే."

మ. అన నాతండు ప్రహర్షభాసురమనోజ్ఞాస్యంబు చెన్నార నం
దను బాహుద్వయిఁ జుట్టి, వక్షమున నుత్సాహంబు దీపింప హ
త్తి, "ననుం బిల్వకపోయినం గనుదు నాదీప్తాంగి నే నిప్పు" డం
చును డోలాంతరమాలతీతరళసంశోభాంగమున్ గాంచుచున్. 32

సీ. "కాఁ దగు నిది పాలకడలిసద్గర్భము
క్తాఫలం బైన పద్మావధూటి
కాఁ దగు నిది శరత్కాలసౌందర్యవి
స్తారతారాపథచంద్రరేఖ
కాఁ దగు నిది జవగణ్యవసంతసం
వాసితనవమల్లికాసుమంబు
కాఁ దగు నిది చంద్రకాంతోపలమనోజ్ఞ
విరచితచైతన్యవిగ్రహంబు

గీ. కాఁ దగును నిది సంఫుల్లకైరవంబు
కాఁ దగును నిది రాయంచకమ్రమూర్తి
కాఁ దగును నిది నిల్చుతొల్కరిమెఱుంగు
కాఁ దగును నిది శారదాకంజనయన. 33

సీ. దోషాకరుండను పైదోఁ బ్రాట పైపక
ధరణి జన్మించిన సిరియె యగునొ !
పతివియోగక్లేశభారంబు నోపక
దివిని వీడిన రతీదేవి యగునొ !
పడుపువృత్తిని రోసి పుడమిపై స్వచ్ఛవ
ర్తన నుండ వచ్చిన రంభ యగునొ !
జన్మగౌరవసమార్జన సల్ప మానవా
కృతిఁ బూనిన మెఱుంగు రేక యగునొ !
గీ. శీతవాతాతపంబులఁ జిక్కి పంక
సంకులగభీరసీతాకరాంకసీమఁ
బొంక మెడలి వసింపరా దింక నంచు
భామినీరూపముఁ గొన్న పద్మ మగునొ ! 34

సీ. కళలఁ గోల్పోవని చలివెలుంగు ముఖంబు
కమలని యిందీవరములు కనులు
చలన మించుక లేని శంపాలతిక మేను
పసరు వీడని పల్లవంబు మోవి
మధుపానరతి లేని మధుపసంతతి వేణి
కడలిఁ బొడమని శంఖము గళంబు
ఛిద్రంబు గాని సుస్నిగ్ధగాబ్దములు చెక్కు
లనిమొనఁ జొఱని సింగిణులు బొమలు
గీ. మూలపంకవినిర్ముక్తబాలరుచిర
వరమృణాళముల్ కరములు; వాడనట్టి
మొగలిపొట్ట లూరువులు; చిఱుగని విరులు
చరణములు; భూరిసౌందర్యశాల బాల." 35

మ. అని యగ్గించుచు మాలతీమృదులదుగ్ధాభప్రభాశోభితం
బును స్నిగ్ధంబును మోహనంబు నయి పొల్పొం గాంచుగండస్థలం
బనురాగాన్వితుఁ డై స్పృశించె, నపు డయ్యబ్జాస్య యబ్జాతలో
చనయుగ్మంబును విచ్చి మేను విఱిచెన్ జంచత్స్మితజ్యోత్స్న యై.

గీ. ఘనతమోరాశి నెడపి శృంగారముగను
బొడుపుమల నలరారెడి ప్రొద్దు వోలె
మేలుకొని మాలతీబాల డోలికాంత
రమున రాజిలఁ గని నృసింహాము ముదమున. 37

సీ. "శరదంబుదాంతరసౌదామినిం గేరు
నీసుమాంగిమనోజ్ఞహాసరేఖ
యిందీవరంబుల నీసడించును బాప
సోగకన్నులమేలిసోయగంబు
మురిపెంబుఁ గూర్చు నీగఱితవాతెఱ తేరఁ
దీసినంతనె చిలుకోసినోరు
చిత్త ముఱ్ఱూఁచుఁ దళ్కొత్తు లొత్తులు వారు
లలితాంగిపాలబుగ్గలపసందు

గీ. లీల నంగడివీథి నద్దాల మేలు
బీరువాయందు సొంపు పెంపార నిడిన
గాజుబొమ్మ తెఱంగునఁ దేజరిల్లు
బాలచెలువము వర్ణింపఁ జాల బళిరె!" 38

గీ. అనుచు రోహిణీ మందస్మితాననమున
దృష్టి సారించి "చెల్లీ! యదృష్టవతివి;
పెక్కు రేలను గులము పెంపెక్కు నొక్క
సురుచిరాననఁ గనిన నిక్కరణి ధరణి." 39

గీ. నావు డన్నాఁతి యనియె "సన్నా! భవత్కృ
పారసం బపారంబుగఁ బాఱుచునికి
నుడువుచుంటి విమ్మాడ్కి- నెయ్యెడను నైన
బాల పెఱవారిసొత్తు కావలయుఁ గాదె. 40

సీ. ఎన్నాళ్లు పెంచిన నితరుల కర్పించి
యిలువేరు నిలుపఁగా వలనుపడునె?
పరులపంచలఁ జేరి వసియించుటే గాని
స్వాచ్ఛందముగ మనఁ జాలఁగలరె?
ముదిమి గ్రమ్మఁగ భక్తిపూర్ణంబుగా నింత
యన్నవస్త్రంబు లియ్యఁగలారె?
జీవితాంతమున దోసిలితిలోదక మైన
నొసఁగి పిండ మొకింత యుంచఁగలరె?

గీ. బాలికలు; వారు సద్గుణవతులె యైనఁ
గొంత మే లొనఁగూడు లేకున్నఁ గన్న
వారి పా ల్లెఱుఁగంగ నెవ్వారితరము
తనయ లెన్నఁగఁ గాళ్ల బందాలు గారె? 41

సీ. అనుకూలవరునికై యహరహంబును జింత
చేసి యుద్వాహంబు సేయవలయు
నభిమాన మెల్ల శూన్యంబు గావించి య
ల్లునిఁ దన్పఁగాఁ జింతఁ గనఁగవలయు
శ్వశురగేహమున నెవ్వార లేమన్నను
నెద నుంచుకొనక సహింపవలయు
నమ్మలక్కలు నోళ్ల నాడింప వినిపించు
కొనక లోలోపలఁ గ్రుళ్లవలయు

గీ. పెట్టుపోతల నత్త తా నెట్టుల నొన
రించుచుండిన విని భరియించవలయు
నెట్టికలిదండ్రు లైన వారట్టి యగును
గాదె! వారికి శృంగభంగంబు గలుగు. 42

ఆ. వె. సుతులఁ గన్నవారు చూవె భాగ్యసమేతు
లన్యు లగుదు రెట్లు ధన్యమతులు;
తనయుఁ గన్న విడువఁ దగు నభిమాన మం
చనెడి బుధులనుడువు లగునె మృషలు." 43

గీ. అనిన "వదినా! యిదేమి యి ట్లనఁగఁ బాడి
యగునె? యంత్రాలయములీల నలర నింక
నెన్నిసంతానములు ప్రసవింపఁగలవో!
కాల ముడిగినలీలఁ బల్కంగ నగునె!" 44

క. అని మేల మాడెడు సుభ
ద్రను గన్గొని "యొక్కబడిఁ గదా! చదివితి; వి
ట్లన నేల? కాలగర్భం
బున నే మున్నదియొ యెఱుఁగఁబోలునె వదినా! 45

క. మీయారికి మాయా రెం
తో యెంచఁగింపంగ నేల? తుల్యము గాదే
మాయారికి మీయారును
న్యాయమె విఱుచుకొని పడఁగ నాపై వదినా!" 46

క. అను రోహిణిసరోక్తులు
విని నరసింహాఖ్య సుభద్రవికచాననమం
దున దృష్టిఁ బఱుపఁగా న
వ్వనితామణి లజ్జఁ బొంది వ్రాల్చె ముఖంబున్. 47

సీ. చలువ చేసిన ముద్దు లొలుకు పొందూరు జ
ల్తారుధోవతి పణాయల్ దనరఁ గట్టి
ఒడలిపొంకమును గప్పడఁ జేయు వెల్లమ
జ్లీక మురిపెంపులాల్చి ధరించి
జిలుగుసేలముపట్టువలువ సంచులు శోభ
వఱల తీవిగ వల్లెవాటు వైచి
వరబరంపురపుకెంబట్టుచెమ్లా బాగు
గాఁ దీర్చి వంకపాగాను జుట్టి

గీ. దంతపుంబిడి నలరు బెత్తమును బట్టి
యప్పటప్పట మీసముల్ ద్రిప్పుకొనుచు
లీల నీలఁ బాడుచు శంక లేక యంత
భద్రజనుఁ డొక్కరుండు లోపలికి వచ్చె. 48

గీ. అతఁడు రామవర్మాభిఖ్య నలరుచుండు
రోహిణీపతి; డోలికారోహణోత్స
వమునఁ జిన్నారిముద్దులబాలఁ గనఁగ
నరుగుదెంచెను సమ్మోదగరిమ వెలయ. 49

చ. ప్రకటతనుప్రభావిభవభాసితుఁ డై చనుదెంచు ప్రాణనా
యకుఁ గని రోహిణీరమణి యచ్చెరు వందెను; నంత వింత నా
చకితవిలోలలోచనకుచస్థలిఁ బుల్కలు దోఁప లజ్జ నిం
చుక చని కుడ్యపార్శ్వమున శోభిల నిల్చె విలాసరాశి యై. 50

గీ. నూతనాగతు నంతఁ గనుంగొని నర
సింహ "మోహో!" యటంచు సంస్మితముఖాంబు
జుం డయి కరంబు స్పృశియించి శుభమె యంచు
గుశలసంప్రశ్న మొనరించె గొబ్బునఁ దగ. 51

శా. "అన్నా సేమమె ? పిన్నికిన్ సుఖమె ? యాహో యిన్నినా ళ్లైన మే
మున్నా మంచును నేఁటికిం దలఁచి తేమో ! త్రోవ తప్పంగ నిం
దున్నా రాత్మకులస్థు లంచు నెడలో నూహించి యేతెంచినా;
వెన్నా ళ్లయ్యెను నిన్నుఁ జూచి, ముద మయ్యెన్ నేఁటి" కం చేర్పడన్.

చ. కలశముతో జలం బిడియెఁ గ్రన్నన నాతనికిన్ సుభద్ర; చే
తులు చరణంబులున్ గడుగఁ, దుడ్చుకొనన్ వసనం బొసంగి, శో
భిల ధవుచెంతఁ గూర్చొనఁగఁ బీఠము వైచి, వినీతిఁ బ్రేమ చి
ప్పిల వివిధోపచారముల విందొనఁగూర్చెఁ బ్రహర్ష యై కడున్. 53

చ. పిదప నతండు మాధవునిఁ బ్రీతి మెయిం దనయంకసీమ నిం
పొదవఁగఁ జేర్చి ప్రేమరస మొప్పఁగఁ జిమ్ముచు మందహాససం
పద తొలుకాడుబాలుముఖపంకజము న్దగ ముద్దు వెట్ట ష
ట్పదములు గ్రమ్మెనో యనఁగ భాసిలె మీసలు నందు విందుగన్.

చ. కమలినిఁ బోలుమాలతినిఁ గైకొని యంతట నాసుభద్ర వి
ద్రుమరుచిరాధరంబున విధుప్రభలన్ హాసియించి మించుహా
సము సెలువార "నీవిమలచంద్రసఖం బగుమోముఁ జూపి మో
దము ఘటియింపు మమ్మ! యదె త్వజ్జనకుం డరుదెంచెఁ జూడఁగన్."

మ. అని బాలామణిఁ గొంచుఁ బోవ నతఁ డయ్యబ్జాస్య నీక్షింప మో
మున లేనవ్వు జనించెఁ, బుల్క లలమెన్, బొంగారె దేహంబు, లో
చనయుగ్మంబున హర్షబాష్పములు విస్తారంబుగాఁ గ్రమ్మె, బా
లను నాపాదశిరమ్ము ముంచెను విలోలం బైన దృగ్వీచులన్. 56

చ. తనతనుజాత నాథుఁడు ముదంబునఁ గాంచెడుచొప్పు నొప్పఁగాఁ
గనుఁగొనువేడ్క దీటుకొనఁగాఁ గడు లాలస యై సుమాంగి దృ
ష్టినిఁ బ్రసరింపఁజేసె ధవుచెన్నలరారెడుమోముఁదమ్మి నం
తన మరుఁ డేచి కుప్పె నిశితం బగు మార్గణపంక్తు లావెపైన్. 57

ఉ. లోలత మాలతీతరళలోచనయుగ్మము గాంచ నాత్మఁ బ్రే
మాలస రోహిణీవికసితాంచితనేత్రమరీచి తోఁపఁగా
నాలలితాంగిఁ గాంచె నపు డాతఁడు సందియము న్దొలంగ; నా
లీలఁ బ్రియుండు గన్గొనుట లేమకు నుల్లము పెల్లు రఘ ల్లనెన్. 58

ఉ. అయ్యెడ వారి చొప్పుఁ గని హాసనమన్విత యై సుభద్ర "లే
వియ్యతిలోకసుందరికి నెన్నఁగ నన్యులలక్షణంబు, లీ
వెయ్యదియున్ బరీక్ష నొనరింపకు, జాణ సుమీ చలంబునన్
గయ్యము లాడు మావదినగారు, తలంపవటన్న రోహిణిన్. 59

గీ. అను సుభద్రవరోక్తుల కలరె రామ
వర్మ, లజ్జించి యవనతవదన యగుచు
మందహాసద్యుతుల్ గృహమందుఁ బఱపె
మారుసాహిణి రోహిణీమధురవాణి. 60

క. "అన్నా! యిది మా కోడలు
మున్నే యాన నిడి తేను, మున్మం దెవ రీ
సన్నుతగాత్రను నడిగిన
నెన్నఁడు మాట నిడ వలవ దేర్పడ వినుమా!" 61

గీ. అన సుభద్రను గని మోద మలర నతఁడు
"చెల్లి! యీబాల కేమి మించెను, రమేశు
కరుణఁ బెంపారి బాల్యంబు గడువఁ గాదె
పెండ్లి; మాట్లాడ నింకఁ బెక్కేండ్లు గలవు." 62

వ. అనిన సుభద్ర రామవర్మ నీక్షించి. 63

క. "అగుఁగాక యెన్నఁడైనను
దగ దన్యుల కొసంగ, నిపుడె తప్పక యొకమా
టగునో? కాదో? యని తె
ల్పఁగవలయును శంక లేక పరమప్రీతిన్." 64

చ. అనిన నతండు రోహిణీముఖాంతరమందున దృష్టి నిల్పి యా
ననమున మందహాసము ఘనంబుగఁ గ్రాల సుభద్ర కంత ని
ట్లనియెను "జెల్లి! మీవడిన యాత్మగతం బగు వాంఛ యెట్టిదో
కనుఁగొను మేను కా దనను గావునఁ బ్రశ్న మొనర్పు మామెనే." 65

ఉ. "ఆమెను నేను గోరఁ, దనయల్లుఁడె కోరఁగలండు; లేక బా
లామణి యా సుభద్రను బలంబునఁ గవ్వడి కొన్నరీతి లే
దా? మునుమున్న చేకొనువిధానము నెంచఁగ నేల? మాధవుం
డే మనమాలతిన్ గొనును డెక్కఁన; నెవ్వరి నేల కోరఁగన్." 66

గీ. అని సుభద్ర ప్రఫుల్లాననాబ్జ యగుచు
రోహిణిం గని రాహిణీరుచిరవదన
బింబమును ముద్దుఁ గొనెను సంప్రీతి నామె
పల్కులను విని నగి రెల్లవారు నంత. 67

గీ. "వడిగ రాలేకపోతె బావా! యిదేమి
చాల చీఁకటి పడియె మీబాల నిపుడె
యుయ్యెలను వైతు రని యెంచి యుంటి వేమొ!"
యనుచు నరసింహావర్మ హాస్యంబు వలుక. 68

క. "మగనాలితగవుఁ దీర్పఁగఁ
దగు నని మనవారు నేఁ డుదయమున రాఁగ
అగు జాల మని తలఁచి ముం
దుగ సామానులను బంపి తోడరితిఁ దీర్పఁగ." 69

గీ. ఎంతకును నిరుకక్షు లొక్కింతకైన
తగ్గకుండుటచే వివాదంబు తెగక
జాల మయ్యెను తుదిపరిష్కారమ, మదియె
మాలతిని జూడ జాల విమ్మాడ్కి సలిపె. 70

గీ. ఇంతకును దప్పు పట్టఁగా నేమి కలదు ?
బెట్టు సూపక యల్లుండ్రు రెట్టు లత్త
వారియిండ్లకుఁ జనసౌను బావ !" యనఁగ
స్మితముఖాంబుజుఁ డై నరసింహ మంత. 71

క. "బులు పింకఁ దీఱు నోయీ !
తలఁపవుగా నాఁడుఁగూఁతుతండ్రి నటంచుఁ
కలఁ డల్లుఁడు మాధవుఁ, డా
వలఁ బెట్టుము నీదుబెట్టు; వల దిప్పట్టున్." 72

గీ. అనినఁ దొడమీఁదిమాధవు ననునయమునఁ
జుంచు దువ్వి, సుభద్ర నీక్షించి రామ
వర్మ యనెఁ "బట్టఁ బగ్గముల్ పడయఁజాల
మింక మగపెండ్లివారల బింకములకు. 73

క. పాఱెడిపిట్టల కిడెడు *బె
సా రనెడువిధంబు వల్కుఁ జనునే తొలియే
శేరీతిఁ బోవ వెనుకటి
దారీతిని జనుట వింత యగునే యెంచున్." 74

గీ. అనిన దరహాసభాసురాననము వెలయ
నిట్టు లనియె సుభద్ర "యెబ్బెట్టు గాదె
యాఁడుబొట్టిపట్టిని బెండ్లియాడ బెట్టు
సూప, దొడ్డిలేఁగను గొన శుల్క మేల ?" 75

గీ. అనిన పక్కన నగిరి వారంద ఱొక్క
మొగిని, రోహిణీహృదయమం దొగి జనించె
మాతృభావముతో నినుమడిగఁ బొడము
బాధ్యతలు గూర్చి యోచనల్ బహువిధముల. 76

* మాంసపచనవిధానము.

క. తొలియామము గడచుట యాఁ
కలి తెల్ప సుభద్ర వారిఁ గడు ముదమారన్
పలువిధభక్ష్యాదుల నే
ర్పలరఁగ విందొసఁగి తన్నె నందఱిని వడిన్. 77

వ. భోజనము లొనర్చి గృహప్రాంగణమునందు వేదికోపవిష్టు లై తాంబూలచర్వణ మొనర్చుచు నిష్టగోష్ఠి నాభావమునందు లున్న తఱి సుభద్రారోహిణు లేతెంచి సముచితస్థలమున నాసీన లైరి. పుచ్చపువ్వుం బోలె వెన్నెల శ్రీమాలస మగు లోకమును బుజ్జగించుచుండెః నంత సుభద్రాహృదయంబునఁ బొడమిన పూర్వసంభాషణాగత మైన శంకాంకురమును వెల్లడింపఁ దలంపుఁ గొని "యన్నా! మున్ను మాలతీసందర్శనమునకు మగనాలితగ వొంచు జాప్యహేతు వయ్యె నంటె వావృత్తాంతము నెఱిఁగింపు" మన నాతండు "చెల్లీ! యందేమివిశేషం బున్నది? వారు మన కించుక దూరపుబంధువు లగుదురు. ఆలుమగ లన్యోన్యత లేక వివాహవిచ్ఛేదంబునకు యత్నించువారై నన్ను మాధ్యస్థునిగా నెన్నికొనిరి. నే నద్దానిఁ బరిష్కరించి విడియాకు వ్రాయించి యొసంగితి" ననుడు, సుభద్ర సాశంకముగ "నిది కులకళంకము గాదె! ఆర్షధర్మబద్ధము లైన షోడశకర్మ లను సూత్రగోత్రప్రవరలును గలిగి త్రైవర్ణ్యులకన్న హీనులుగ గణింపఁబడుచుఁ జతుర్థవంశజులుగాఁ జూడఁబడుట కీయనాచారంబె మూల మని తలంచెద" నని సాభిప్రాయమ్ముగ ధవునిపైఁ జూపు్కలు నిగిడించుఁడు నృసింహవర్మ యర్ధాంగీహృద్గతాభిప్రాయంబు నెఱింగి యి ట్లనియె.

శా. "కాంతా! నీవచనంబు సత్య మని వక్కాణింపఁగారాదు, నా
స్వాంతం బీపరిణామమున్ గని సదా సంతప్త మౌ; నెప్పుడున్
శ్రాంతిం బొందుదు నెట్టు లీదొసఁగు సంస్కారంబు గావించుటం
చెంతేనిన్, జనులందు విద్య కొఱవడై యేచున్ బురోవృద్ధులన్." 79

వ. అనుచు, రామవర్మ బావా! నా యొక్క సందియమ్ము. ఏదియుందు వేని తెలుపఁగల నన, నృసింహుఁ డామోదసూచకముగఁ దల నూచుచు నాతఁ డిట్లనె. కాళింగులు కింతలివా రనియు బూరగామువా రనియు నిరుతెఱఁగుల విభజింపఁబడి యుండుట విదితము గదా! అందుఁ గింతలివారికిఁ బునర్వివాహంబు లుండుటయు బూరగామువారి కవి లేకుండుటయు నెట్లు సంఘటిల్లె? పునర్వివాహరహితు లైనను బూరగామువారినిగూడ శూద్రులుగనే పరిగణించుచుండుటకు హేతు వెద్ది? ఎఱుఁగుదేని తెల్పు; మన నరసింహుఁ డాతని కిట్లనియె. 80

గీ. సాగరము దూర్పుకనుమలచాలుఁ బూత
గౌతమియును వైతరణియుఁ గ్రమముగాను
నింద్ర వరుణ కృతాంత ధనేశదిశల
హద్దులు కళింగమున కందు; రార్యులు మును. 81

వ. నీలాచల మహేంద్రాచల సింహాచలము లనఁబడు ప్రసిద్ధపుణ్యశైలత్రయంబును, మహానదీ ఋషికుల్యా బాహుదా వంశధారా నాగావళీ గోస్తనీ వరాహా శారదా తాండవ పంపా హేలా గౌతమ్యాభిఖ్యల నలరారు పవిత్రస్రవంతీద్వాదశమును, చిల్కా బీల కొమరవోలు కొండకర్లయావలను సరోవరచతుష్టయమును, పురుషోత్తమ కోణార్క భువనేశ్వర తప్తపాణి తరాతరణి గోకర్ణేశ్వర మల్లేశ్వర మధుకేశ్వర కోటీశ్వర కూర్మేశ్వర రామతీర్థ నృసింహేశ్వర భీమేశ్వరాది ముఖ్య దివ్యక్షేత్రత్రయోదశకమ్మును, దంత సిద్ధాంతము శాలిహుండము సంకరాము మున్నగు సుప్రసిద్ధబౌద్ధసంఘారామంబులును, నేమాము మున్నగు జైనస్థానమ్ములు గళింగదేశంబునందు వెలయు. ఈరాజ్య ముత్తర మధ్య దక్షిణ కళింగము లనుసంజ్ఞల నలరి త్రికళింగము

నాఁబడె. ఉత్తరకళింగ ముత్కళం బనియు, బాహుదా గోస్తనీ మధ్యస్థప్రదేశము మధ్యకళింగ మనియుఁ, గడమదేశంబు దక్షిణకళింగ మనియు వ్యవహరింపఁబడు. ఈ త్రికళింగమే యాంధ్రదేశమునకుఁ ద్రిలింగ, తెలుంగు పర్యాయనామంబు లొసంగె నని సుప్రసిద్ధాంధ్ర భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయ పడుచున్నారు.

ఐతరేయబ్రాహ్మణమునందు కళింగమునుగూర్చి ప్రస్తావింపఁ బడుటఁజేసి యిక్కళింగము వైదికయుగంబున విశ్రుత మై యున్నది. దుర్యోధనసార్వభౌముఁడు కాళింగి నుద్వాహం బాడె ననియుఁ, గాళింగుఁడు చంద్రవంశక్షత్రియుఁ డనియుఁ బురాణప్రసిద్ధము. సుప్ర సిద్ధచంద్రవంశసంభూతక్షత్రియులే నేఁడు కాళింగు లనఁబడుచున్నారు.

కళింగము వేదబ్రాహ్మణసూత్రపురాణయుగములందు సర్వసత్తాక ప్రతిపత్తిఁ గలిగి యరిలోకభీకరం బై వెలసెను. బౌద్ధయుగమున నీరాజ్యము ప్రాజ్యసామ్రాజ్యనిర్మాణదక్ష మై బ్రహ్మదేశమునందును, సువర్ణ సుమత్రా బలి యవ సింహళద్వీపాదులయందును దన పతాకను సుప్రతిష్ఠిత మొనర్చి ప్రాచ్యసాగరమును దన నౌకాసైన్యవిన్యాస సీమగా నొనర్చికొని కకుబంతపరివ్యాప్తయశోవిరాజిత మైనది. మత విద్వేషంబులవలన నా యుగసారస్వతచైత్యారామశిలాశాసనాదులు వినాశము గావింపఁబడుటంజేసి నాఁటి సమగ్రచారిత్రకాంశములు దురవబోధము లైనవి. ఈయుగంబున ఖారవేలనృపాలుని చరిత్రంబు మాత్ర మించుక శిలాశాసనాదులఁ దెలియనగుచున్నది. పదపడి గాంగ వంశనృపతులందుఁ గామార్ణవ దానార్ణవ వజ్రహస్తాదిమహీపతులును, బశ్చిమగాంగప్రజాపతులందుఁ గపిలేశ్వర · పురుషోత్తమ ప్రతాప రుద్రాది ధరాకాంతులును బ్రసిద్ధులు. పూర్వగాంగనృపతులకాలమున మగధరాజ్యపర్యంతంబును, బశ్చిమగాంగరాజేంద్రులకాలమునఁ

వ్యాప్తం బై యలరె. మధ్యదక్షిణకళింగములు చాళుక్య కాకతీయ తుళువ రెడ్డి వంశీయరాజన్యులచే నా యా కాలంబులం దాక్రమితం బై తెలుఁగుభాష కాపువాల మైనవి. ఉత్కళము ద్వితీయప్రాకృత జన్యముల నొక్కటగు యోఢ్రభాషాసమావృతం బై నది. ప్రాచీన కాలంబున నిక్కళింగమునఁ బ్రాకృతభేద మొక్కఁడు మాతృభాష యై యుండెడిది. ఇంకఁ గాళింగికులప్రళయవృత్తాంతంబును, వారి కీ పునర్వివాహాచారము సంప్రాప్తించిన విధంబును నెఱిఁగింతును వినుఁడు.

ఆర్యావర్తంబును యవనదాస్యశృంఖలావిముక్తగ నొనర్చి చతురంతసామ్రాజ్యనిర్మాణదక్షుండును, వృషలుండును నగు చంద్రగుప్త చక్రవర్తిపౌత్రుండును, బిందుసారరాజేంద్రపుత్రుండును నై యశోక బిరుదాంకితుం డై విశ్రుతుఁ డైన దేవానాంప్రియమహీపాలుం డేకచ్ఛత్రాధిపత్యమున కాటంకముగా నిలిచిన కళింగమును గబళింప నెంచి మగధసేనావాహినీపరంపరల నీనేల నాలుగుచెఱఁగుల విడియించె. రాజ్యతృష్ణాస్వాతంత్ర్యకాంక్షలకు సంఘర్షణంబు వొడమె. ఆయుద్ధ మనితరసాధ్య మై ప్రత్యర్థిహృదయవిదారకం బై చరిత్రప్రసిద్ధం బయ్యె. కాళింగు లంగుళపర్యంతమాతృభూమి శత్రుపాదాక్రాంతము గానీయక యాబాలవృద్ధముగ ననిమొన నెదు రొడ్డి పగతుఱఁ దెగటార్చి విధివైపరీత్యమున రాజ్యము గోలుపోయిరి. సంగరరంగము రుధిరస్రవంతుల వెల్లువ యై యనంతసేనాసమూహాకంకాళమాంససమావృత మై హృదయభేదకం బయ్యె. మౌర్యనృపాలుఁడు తన యఖండసేనాప్రభంజనమునకు వాతూలంబులవడువున నగు నని యెంచిన కాళింగసేనాసముదయంబు కులగిరివడువున నభేద్యం బయి చావు తప్పి కన్ను లొట్టవోయె ననురీతి విజితవిజేతల నొక్కే త్రాఁటికిం దెచ్చి విడుచుటయు నకారణజనమారణంబును నుభయ

పక్షంబులఁ బొడమిన నష్టంబును గష్టంబును గళింగకాంతాపరాక్రమ సాహసత్యాగములఁ బరికించి హృదయపరితాపమున కవధిం గానక యుద్ధముఖ్యహింసాకర్మ వర్జనం బొనర్ప సంకల్పించి దీక్షాబద్ధుఁ డై యహింసాధర్మప్రతిపాదకం బగు బౌద్ధమత మవలంబింప స్థిరనిశ్చితుం డయ్యె. నాఁటినుండియు యుద్ధశోకంబుఁ గడుగ నాతఁడు ధర్మాశోకుం డయ్యె. కాళింగులు విజేతలో విజితులో కాలమే నిర్ణయింపఁగలదు. ధర్మవిజేత లైన కాళింగు లాత్మత్యాగంబునఁ బ్రపంచమునం దాఱని ధర్మజ్యోతిని నెలకొల్పి సార్థకజన్ము లైరి. యుద్ధానంతరము కళింగ మునం దాయుధోపజీవు లగు క్షత్రజనంబునందును యుద్ధావసరమున సైనికులుగా నియుక్తు లైన పంటకాఁపులందును వేలాదియువజనంబు కదనరంగమున కెర యగుటంజేసియుఁ బ్రాణాధికం బగు స్వాతం త్ర్యము నశించుటంజేసియు సమాజసుస్థితిం బెనుచు వివిధము లగు వృత్తు లడంగుటంజేసియు సమాజ మస్తవ్యస్తం బయి యల్లకల్లోలము చెలరేఁగె. 82

సీ. భర్తలఁ గోల్పోయి పలవించువారును
పితలకై వెతఁ గుందు బిడ్డ, లాత్మ
సుతులు గతింపఁగ శోకించువారును
సుతలబ్రతుకు లెంచి మతులు సెడఁగ
హాహారవము సల్పునట్టివారును, విక
లాంగు లై పూ లమ్మునట్టియూరఁ
గట్టె లమ్మెడురీతిగా సంఘభారు లై
వనఁటఁ బొందెడు వీరవరులు గలిగి

గీ. ఆఁకటంబడి జను లెల్ల రటమటింప
నంటురోగముల్ సెలరేఁగ నాటవికులు

పల్లెలం బడి యవ్వానిఁ గొల్లవెట్ట
నడ్డుకొనువారు లేక దైన్యంబుఁ గూఱి. 63

సీ. ఒక్కటఁ గూర్చుండి చెక్కిటఁ జెయిఁ జేర్చి
శూన్యంబు నెడపక చూచు నొకతె
కంబంబు నాలంబనంబుగా నిలిచి తాఁ
జెలువునిచెయ్వులఁ దలఁచు నొకతె
సంజెప్రొద్దునఁ బతిశయనమందిరమందు
గ్రుడ్లప్పగించి కన్గొను నొకర్తు
భావవీచీపరంపరల నాత్మేశుని
తోడ భాషింపఁగఁ దొడరు నొర్తు

గీ. కల్పితనిజేశు ననురక్తి గాఢముగను
నెదను బొదువఁగఁ జేతుల నెత్తు నొకతె
భర్తృమరణశోకాకులభ్రాంతచిత్త
భామినీజను లా కులప్రశ్రయమందు. 84

సీ. చన్నిచ్చి శిశువు నాశ్వాసించి యెద హత్తి
చిత్తంబు ఝల్లనఁ జింత మునుఁగు
కజ్జలం బిడి తిలకంబును దీర్చుచో
భర్తృచేష్టాస్మృతి వంత నొందు
నుయ్యెల నిడి బాలు నూఁచుచోఁ జెలువుఁడు
దన్నూఁచు గతచేష్టితమును నెంచు
జోలఁ బాడుచు మును నీల వైచుచు భర్త
వంతఁ బాడుట నెంచి వనటఁ గ్రుంకు

గీ. పిడుకరాజుల్గు గుంపటి నిడుచు ‘యూఁక
కంపు విరిబోఁడి’ యనెడి వాక్యమును దలఁచి

ధవునిఁ జలపోసి వంతదొంతరలఁ జిక్కఁ
బూపబాలెంత వసఁటయే బువ్వ గాఁగ. 85

సీ. ఈడేరి పెండ్లాడ నీడు వచ్చిన తొలి
చూలుకూఁతుం గాంచి జాలిఁ దూలి
ప్రచురగాథాకావ్యపరసప్రవణుఁ డైన
వంశాంకురముఁ జూచి వంత నొంది
అక్షరంబుల దిద్దు చనిశము చెఱఁగును
వీడని సుతుఁ గాంచి గోడు నొంది
గారాలదీవి శృంగారాలబావి యా
నెలకూనఁ దిలకించి యలఁత నొంది

గీ. కడుపు చుమ్మలు చుట్ట శోకమున మునిఁగి
గుబులుగుబులునఁ గన్నీళ్లు గ్రుక్కుకొనుచు
దినము తీఱక, గతి లేక, యనుదినమ్ము
మగనిఁ దలఁచుచు నిల్లాలు పగలఁ బొగులు. 86

సీ. మారాకు హత్తించి కారాకులం ద్రుంచి
గ్రొచ్చి గా బెడలించి ముచ్చటగను
మళ్లు దీరిచి తీవమల్లిపందిరి డాసి
విభునిచేష్టలు మనోవీథిఁ దోఁపఁ
బందిరిరాఁటను బట్టుక నిలిచి క
న్నీరు కాలువలుగాఁ గాఱుచుండఁ
బ్రొద్దుగ్రుంకు టెఱుంగ దెద్దియో గొణఁగును
నిట్టూర్పు శిరమును నిట్ట కాన్చి

గీ. కాఁపుజవరాలు వయసు పొంగారి కోర్కె
లిగురు లెత్తఁగఁ బ్రియునిచెల్మికి వెలి యయి

డీలు వడి మ్లానవదన యై కాలిబంధ
మైన సంగరమును దూఱు నాత్మయందు. 87

సీ. అంబారవమ్మున నఱచు గోమాతల
దూడల్లఁ గలుపఁగాఁ దోడు లేక
కట్టుఁగొయ్యను గన్నె చుట్టుక బెంబేలు
వారు గొఱ్ఱెల విప్పువారు లేక
బారెఁడుప్రొద్దెగఁబ్రాఁకియు దున్నల
దెసఁ జూచి కడిగెడుదిక్కు లేక
దొడ్డిలో సద్దులు ద్రొక్కిళ్లు వడినను
గడ్డివామిఁ గట్టుగతియు లేక
గీ. గునపమును, పాఱ, బొరిగయు, గొడ్డలియును,
బండి, సరుగుడు, నాగలి, పట్టె, నొల్ల,
కొంటిగట్ట మున్నగువాని వంటః పడుచు
వారు లేక కాఁపులయిండ్లు పాడువాఱె. 88

గీ. కొలిమిఁ గాల్చిన యినుపముక్కలను నాఁగఁ
గొట్ట డాగలిపై నుంచి యట్టె వెదకు
సమ్మెటం గొని మోదఁగఁజాలునట్టి
యువకులనుగూర్చి కమ్మరి యూర నెల్ల. 89

గీ. కూటములు సంగిడీలును గుండురాళ్లు
నినుపగుళ్లుఁ బటాకత్తులను స్పృశించు
బలయుతులు లేక వాడవాడలను సాము
కూటములు బీడువాఱె నెచ్చోటఁ గనిన. 90

సీ. బురదఁ గూరిన బండిబరువు నమాంతము
పెకలించి యెత్తిన బిరుదుమగఁడు

జంటదున్నల విప్పి యొంటిగా నొకఁబట్టి
బండిబారము నీడ్చు దండిబంటు
ఎలుఁగుబంటి నెదిర్చి నిలఁబెట్టి కుస్తీలు
పట్టి చిత్తు నొనర్చునట్టిజెట్టి
కాండ్రించుబెబ్బులిఁ దీండ్రించి పోరి క
టారితోఁ బోరిఁగొన్న వీరవరుఁడు

గీ. కఱ్ఱసామున నరులఁ గకావికలుగఁ
జేసి నూర్వుర నొంచిన చేవకాఁడు
కలికమున కైనఁ గనరాఁడు, కాలమహిమఁ
గలను పోలఁదిండి యువకులఁ గసిమసంగ. 91

సీ. కదనరంగమున విక్రమము సింగములీలఁ
జూపించి కుంటి సూ శూరవరుఁడు,
ఏటున కేఁబంద్ర నెరియించి గ్రుడ్డి యై
యల్లాడు యోధకులాగ్రగామి,
లాఘవచిత్రత్వ లక్ష్యశుద్ధి దృఢత్వ
ముల మిన్న యై కరంబులను గోలు
పోయిన విలుకాఁడు, పోర శతాధిక
బలము ద్రుంచియు వలపలికరంబు

గీ. లేక వెతఁ గుందు నాశ్వికుం, డేకధాటిఁ
గండతుండెముల్ గాఁగ నుక్కడఁచి యరుల
బాహువుల్ దెగ మిగిలినబంటు, నగుచు
దైన్య మొందెను హతశేషసైన్య మెల్ల. 92

గీ. కొల్లవోయిరి, పశువులఁ గోలువడిరి
గాదెలును బాతరలును ముష్కరులు గొనిరి

పడఁతు లరులచేతులఁ బడి భంగపడిరి
యనెడు వార్తలె దేశమం దల్లుకొనియె. 93

గీ. వంటయిలు సొచ్చు కుక్కలనఁదువు లక్షరఁ
దస్కరులు ముష్కరులును బ్రత్యంతభూము
లందు వసియించువారు నయ్యాడస దేశ
మల్లకల్లోలముగ సల్పి రెల్లయెడల. 94

గీ. తిండిగింజలు కఱవయ్యెఁ, దెవ్వళు లినుమ
డించె, వినిమయమున వెలల్ మించిపోయె,
కూడు గుడ్డలు లేక యల్లాడు జనుల
సంఖ్య నానాఁట బలిసె దేశమున నాఁడు. 85

సీ. మురుగులు గాజులు ముక్కరయు బులాకి
నత్తును జూకాలు నెత్తుగొలుసు
తమ్మంట్లు బొగడలు కమ్మలజత చెంప
సరులును బావిలీల్ చంద్రవంక
చేమంతిపూవును సీమంతమును దండ
కడియముల్ నందెలు కంఠఫైవులు
నల్లపూసలు తాళి నాను పట్టెడ తీఁగ
కాసులపేరును కంటె పూస

గీ. పేరు మున్నగు నగలందుఁ బేర్మి విడిచి
పసుపు పారాణి కుంకుమ కుసుమములును
విడిచి పడుచులు విధవలై వేదురుఁ గనఁ
గులము నశియించుచిన్నె లుమ్మలికఁ గూర్చె. 96

ఉ. నాగులు నడ్డుగమ్ము తెలనాఁగలు దాల్పఁగ నయ్యె దైవమా!
యేగతి నీకళింగకుల మింక భువిఁ మనఁజాలు? సంకరం

జొ గమనింప నీకొలమునందుఁ, బురాతన మైన తొెత్రతే
జోగరిమఁ సదా మనుపఁ జూడక తప్పదు సత్క్రమంబుగన్. 97

వ. అని విచారించి వృద్ధు లగు కులముపెద్ద లొకసదస్సు నేర్పఱచి సమా
జాభివృద్ధికి వలయు నేర్పాటులఁగూర్చి చర్చించునవసరమున. 98

గీ. మలలవెలుపలివారు బీదలను నాక్ర
మింపఁ, గొండలోయలఁ గొని రేపు మిగిలి
వనములం దిరుగాడెడువారు, మాతృ
భూమి రక్షించుకొనుశక్తి లేమి నెఱిఁగి. 99

వ. అనువార్త పరిషత్సభ్యుల నధికముగ బాధించుఁడు. 100

గీ. మాన్యము లొసంగి దేశ్రదిమ్మరులఁ బెక్కు-
వేలమందిని సుఖజీవనాల నొసఁగి
పల్లెపల్లెను నిల్పి యవ్వానిని గను
కలిగి రక్షింప నుంచిరి మెలకువగను. 101

గీ. దండమును నసిపుత్రికఁ దాల్చి గ్రామ
సీమ రేలందు వీరు 'గస్తి' తిరుగుటఁ
జేసి దండాసివాం డ్రనఁ జెలఁగి, రంత్య
జాతివారలు; గ్రామరక్షకులు వీరు. 102

వ. ఆ పరిషత్సమావేశమునందు వేలాది బాలవిధవలసమస్య కొఱుకరాని
కొయ్యవడువున సభ్యుల వేధింపఁజొచ్చె. అం దొక సంస్కారపరా
యణుఁ డగు జ్ఞానవృద్ధుఁడు కులోద్ధరణమునకు స్త్రీల పవిత్రతను
రక్షించుట మిగుల యావశ్యక మనియు, నసంఖ్యాకవిధవ లున్నచో
వ్యభిచారము మేరమీఱి భ్రూణాత్మశిశుహత్యలు సెలరేగు ననియుఁ
దద్దోషసంపర్కమునఁ దాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱుచు ననువడువున
సధవలుగూడఁ జెడు నవకాశంబు గల దనియుఁ బేర్కొని, యా

సమస్యాపరిష్కారసాధనము పునర్వివాహంబ యని సోపపత్తికముగఁ బలుకుఁడుఁ, బలువురు మేలు మే లనిరి; కొంఱ ఛీఛీ యనిరి. అంత నాసదస్సున ద్వివిధాభిప్రాయ మేర్పడి యిరుకక్ష లేర్పడియె. తాలికట్టఁ బడిన స్త్రీ శునకోచ్ఛిష్టపరమాన్నంబు వోలె దోషదూషిత యనియు నట్టిదానినిఁ బునర్గ్రహించుట సనాతనధర్మవిరుద్ధం బనియుఁ గొందఱు వాదింపఁ దొడంగిరి.

రజోదర్శనాత్పూర్వకృతదోషము స్త్రీకి రజస్స్రావమాత్రమున నివారణ మగు ననియు, నీవిషయము పురాణచోదిత మనియు, సామాజిక ప్రయోజనార్థము నిర్ణయింపఁబడిన తాలి చిహ్నమాత్రమే యనియు, వివాహోద్దేశము సంఘశ్రేయమే యనియు, సద్దాని నర్థించువా రీ విపత్సమయమునఁ బునర్వివాహమున కంగీకరించుట కర్తవ్య మనియు సంస్కారపక్షు లుపన్యసింపఁ దదనురక్తులు గొందఱు 'కిమ్ తాలి ?' యని యెగతాళి యొనర్చిరి. మఱికొందఱు సంస్కారవిముఖులను పూర్వగాము లని యాసడించిరి. తుద కీసమస్యయం దేకీభావము కుదురక రెండువర్గము లేర్పడిఁ ధ్రువపడియె. నాఁటినుండియు సనాతనులు 'పూర్వగాము' లనియు, సంస్కారప్రియులు 'కిమ్‌తాలి'వారనియు జనవ్యవహారము సిద్ధించె. ఈ పూర్వగామిశబ్దమే నేఁడు బూరగా మనియుఁ, గిమ్‌తాలి యనుపదమే కింతలి యనియు వ్యవహరింపఁబడుచున్నవి. పూర్వగామిసంఘకేంద్రము బూరగాముగను, కిమ్‌తాలిసమాజకేంద్రము కింతలిగను నేఁడు గ్రామనామములు వెలయుచున్నవి. ఇయ్యిరువర్గములు వివాహాదులందును, భోజన ప్రతిభోజనంబులందును బొత్తు లేక విభాగింపఁబడిరి.

ఆ పరిషత్తు వివాహవిషయమునం దేకీభావము సంపాదింపలేకున్నను మఱికొన్ని విషయములం దేకాభిప్రాయము సాధించినది. అవి యెవ్వి యన, సమాజరక్షణార్థమై రక్షకదళములుగ నిత్యసంచారు లగు నంత్య

జులను స్థిరజీవనులఁగ సల్పి వారిసేవల నుపయోగించుకొనుటయు, వెలిమలలవారెని, స్థావరులను గాల మనుకూలించునంత కెదుర్కొనక వారి ప్రస్తుతాక్రమణాలను ధ్రువపఱచి, సామమున వారినిఁ బునరాక్రమణశీలురఁ గానీయక నివారించుటయు; స్వజాతివైధవ్యసూచకముగ స్త్రీలు కంచుకముల నుజ్జగించి వెల్లలను దాల్చుచు, గాజులను వీడి చందలను ధరించుచుఁ, గేశరాశి జడలకుమాఱుగా ముడుపులఁ బెట్టుకొనవలె ననియు, నాత్మరక్షణమునకు ఛురికల నడికట్టునఁ దాల్పవలె ననియుఁ, బురుషులు వీరగంధమాల్యాదులను వీరకంకణములను నుజ్జగించి, యాయుధోపజీవనమును విడిచి, కృషిపశుపాలనాదులను జీవికలగా గ్రహింపవలయు ననుటయు ముఖ్యములు. పరిషద్నోద్దిత వేషాలంకారముల ననువర్తించుటయుం దేశీకృత మయ్యు సమాజము ద్వివిధావిభాగము నందుట యవాంఛనీయము.

ఇంకఁ గాళింగులు శూద్రతుల్యులుగాఁ బరిగణింపఁబడుటకు హేతువును వివరించెద. 103

గీ. వర్ణవిద్వేషకలుషనివారకమ్ము
పూతపంచశీలాత్మప్రబోధకమ్ము
త్రిశరణాశ్రయబౌద్ధ మీ దేశ మాశ్ర
యించి వైదికపథ మీసడించె మున్ను. 105

గీ. ఆర్యసంప్రదాయము వీడి యబ్ధి నుత్త
రించుట కళింగుల బహిష్కరింప నొక్క
కారణము; సాహసమునకుఁగా ఫలమ్ము
భిన్నదృక్కోణమున సమర్పింపఁబడియె. 106

గీ. వలసరాజ్యప్రతిష్ఠాపకులు కళింగు
లార్యదృష్టిని నదియు దుష్కార్య మయ్యె;

మత్సరాత్ము లొనర్చు సన్మాన మిదియ;
ద్రావిడులు నరభక్షకులై ప్రాయఁబడరె. 107

గీ. బ్రాహ్మణద్వేషమునకుఁ బాల్పడినయట్టి
శూరజాతికి విధిచెడ్డ మాఱుమనువుఁ
దారసిల్లెను; లోటు సత్కారమునకు?
నగ్నికిన్ గాలి తోడ్పడినట్టు లయ్యె. 108

గీ. కాళ్ల నందెలు కడియాలు ఘల్లు రనఁగ
బొందులును మట్టెలును వ్రేళ్లఁ బొలుపు మీఱ
చేతులందు గాజులును బోచీమురుగులు
వెలయ, బావిలీల్ బొగడలు వ్రేలఁ జెవుల,
ముత్తెపుబులాకి కమ్మలు ముక్కు నమరఁ,
గొప్పగొలుసులు మొదుపుపైఁ గులుకుచుండఁ,
గట్టకాసులపేరును బట్టెడయును
నాను మెడయందుఁ గ్రాల, వినాగ్రాణముగను
మల్లెపందిరియంచు రాజల్లునట్టి
పాటినూలుజరీచీర వాటముగను
గట్టుకొంగు సున్నపుఁగాయఁ జుట్టి, పైన
మలర డాకటె నిడి, గోచి మలఁచి కట్టి,
వెనుకఁ గుచ్చిళ్ళు వోసి, బొడ్డునకు నెడమ
దెసను గొంగును వ్రేలాడఁ దీసి, రెండు
చెంగులును ముందు మీఁగాళ్ళఁ జేరువారఁ
గూర్చి, నడికట్టు వైచి, వక్షోజయుగళిఁ
గప్పు కుడిపైఁట వైచి, చొక్కముగఁ బిఱుఁదు
లందు మైజారుచెరఁగు వ్రేలాడఁ దీసి,
పసుపునిగనిగల్ మొడలెల్ల మిసిమి నింపఁ,

గనులఁ గాటుక, ఫాలభాగమున ముద్దు
లొలుకు తిలకము సోయగ మలవరింప,
తురముఖిరులు నెత్తావులు గురియుచుండ
నంచయానము స్మితముఖి మలరఁ, దన్ను
దాసి యనుగమింపంగ సుందరి యొకర్తు
వచ్చె; సిరి యిల్లుఁ జొచ్చెడువడువు దోఁప. 119

వ. సీత నాఁబడు నమ్ముద్దుగుమ్మ సుభద్రానుజ. డోలారోహణవ్యాజ
మున రోహిణీసుత నీక్షించు నాకాంక్షఁ బయనించి, ధూమశకటం
బాలస్యం బగుడు సకాలమునకు గమ్యస్థలంబుఁ జేరఁజాల దయ్యె.
చెలువుగులుకు నయ్యేలనాగఁ గాంచి సుభద్రారోహిణులు సంభ్రభ
మానందహృదయు లై యెదు రేఁగి యెద హత్తికొనిరి. రామనర
సింహులు కుశలసంప్రశ్న మొనర్చిరి. అయ్యువిద లభ్యంతరగేహమున
కరుగుఁడు నృసింహవర్మ యెలన వోల్వాయ "బావా! మామఁటఁదలి
వస్త్రాలంకారవైఖరిం గాంచితివి గదా! యది కులపరిషన్నిర్ణీతవస్త్ర
ధారణవిధానమునకుఁ బ్రతిబింబము నాఁ జను. ఇందు గాజులు ధరిం
చుట మున్నగు దిద్దుబాటులు గోచరించుచున్నను నియ్యది ప్రాచీన
విధానము నమితముగ ననుకరించుచున్నది. ఇప్పటికిని నవనాగరికతా
వాసనల కించుకదూరముగా నున్న కృషీకకుటుంబము లీనేల నీవస్త్ర
ధారణమునే యాశ్రయించుటఁ జూడఁ బ్రాచీనవాసన లెంతబలీయ
ములో తెలియనగు;" ననునవసరంబున గ్రామమునఁ బహరా నిచ్చు
దండాసివాని హెచ్చరికల నాకర్ణించి వారు రేయి చాలఁ గడచె
నని గుర్తించి శయనింపఁ జనిరి. 110

ఉ. ఆప్తజనాగమంబున ముదావహమై పెను పొందె గేహ; మ
బ్జాప్తనిరాశ నుల్లసిలునట్టి శరత్సమయప్రభాతసం

దీప్తసరోవరంబుక్రియ; నిత్యవినూతనవాక్యవర్తన
ప్రాప్తమహోత్సవంబున సుభద్ర సదా తనియించె వారలన్. 111

క. తనసుతునియీడువాఁ డై
కనువిం దొనరించు సీతగాదిలిసుతుఁ డో
డ్కొనిరామికిఁ జింతింపుచు
ననుజను బలుమఱు సుభద్ర యడుగు నతని కై. 112

క. "ఆనందుని నానందను
తో నునుపవె చెల్లి! యెల్లిఁ దోడ్కొని రాఁగ
నే ననిపెద నొక్కని నీ
వో ననవే మాఱుమాట నాడక" యనుచున్. 113

క. "ఇరువురు సహోదరులవలె
విరిజంటవిధాన మైత్రి వెలయఁగ నా రూ
దరము విభాగించుకొనియె
దరు, మీ బావయును గోరు దానినె యెపుడున్. 114

క. మఱిఁదికి నా మాటలుగా
నెఱిఁగించి కుమారుఁ బంపు మీవు మనల; కీ
శరదుత్సవములు పెద్దగ
జరుపఁ దలఁపు గలదు గానఁ జను నుండ నిటన్. 115

గీ. అన నొడంబడి సీత తా నరిగె, రామ
వర్మ మఱి రెండునాళ్లుండి వారిఁ దనిపెఁ,
గార్యభారము ముందుకుఁ గిన్నప్రేమ
వెనుక కీడ్వఁగ నాతఁడు వెడలఁ దొడఁగ. 116

ఆ. వె. బాలయందుఁ బ్రేమ పడఁతిపై ననురక్తి
బావ చూపు కృప సుభద్ర మైత్రి

చిన్నియల్లుఁగుఱ్ఱ స్నేహమ్ముఁ బెనవైచి
కొని ప్రయాణము గదు గోడుఁ గూర్చె. 117

మ. తరళాపాంగవిలోకనమ్ముల గృహద్వారప్రదేశస్థలిం
దరుణీరత్నము రోహిణీరమణి చిత్రస్థాకృతిం నిల్చుచో
ప్పరయం జెందము జల్లనెం, ఘెయిని విప్పె తోఁచె రోమాళి, ని
ట్టురిచెం దొట్రువడెం బదమ్ములు మహాటోపంబుగా నత్తఱిన్. 118

క. బావయు సుభద్రయును నను
నావీడ్కోలు నుడులు గమనత్వర నిడ రా
జీవనయన దృక్పాశస
మావృతి ముందరికి సాగ వయ్యెఁ బదంబుల్. 119

చ. పయిపయిఁ గ్రమ్ముభావములు పాఁతర లై తలమున్క లౌటచే
దయితుఁడు కన్నుచాటగుటఁ దా గమనింపదు శూన్యదృష్టి న
న్నయు వదినల్ గృహాభిగమనంబునఁ ద న్బరికించు టెంచ దే
దిరెయొ యవిచింత్యమానసగతిం బడి రోహిణి తత్తరంబునన్. 120

మ. కరపంకేరుహ మంటి మాధవుఁడు రాకాచంద్రబింబాస్య నం
తరగేహంబున కీడ్వ, రోహిణి మహాత్సంభూతదృశ్యమ్ము సుం
దర మై వంతలపొంతకారి యయి యానందాతిఖేదప్రవి
స్తరహృద్భావపరీత మై చనియె మంత్రాబద్ధసర్పంబునాన్. 121

గీ. నడలు తడఁబడె, బాష్పకణంబు లురలెఁ
గంటికోనలఁ, బులకలు గ్రమ్మె నొడలఁ,
జిత్త ముద్వేత్తుగాఁ గూరెఁ జింత, ప్రియవి
యోగభారాలసాఁగి యా నాగతితకు. 122

క. మానినిపోకడల సుభ
ద్రానరసింహములు గని పరస్పరముఖవీ

తోనై పుణిఁ జదువంగాఁ
బూనిరి హృద్భావభావముల నొండొరులున్. 123

క. ముందర తలారి నడువఁ బి
ఱుందను వెట్టియును జనఁగ రూపొందిన యా
నంద మనఁగా నృసింహుఁడు
నందను దోఁడ్కొనుచుఁ బొలమునకుఁ జనుచుండున్. 124

సీ. జనపాలు కుదురుగాఁ జుట్టి, జుట్టును జాఱు
సిగ వైచి, సుమ మోఁదు సొగసుగ నిడి
తిరుచూర్ణరేఖను దిద్ది ఫాలమ్మున
జందెము చెలువుగా జాలువార
గోరంచుబొంతలకోడూరుపంచెను
చిలకట్టు కట్టి, పై వెలమనూలు
కండువా వైచి డాకరమునందునఁ గుచ్చు
కొంగు కీవిగఁ బట్టుకొని, వలపలి

గీ. కేల నగిషీలు వెలసెడి మేలివెండి
పొన్నుచేతికఱ్ఱను బట్టి పొలుపు మీఱు
గున్నయేనుఁగువలెఁ జనుచున్న మగని
సొబగును సుభద్ర క్రీగంటఁ జూచి తనియు. 125

క. శరదాగమమునఁ బ్రకృతిని
బరికించి సుతుండు మోదభరితుం డౌ, సుం
దరదృశ్యసమీక్షణమున
గురువిజ్ఞానమును గుదురుకొను ననుచు నెదన్. 126

వ. నృసింహావర్మ తలంచి మాధవున కానందసంధాయకంబు లగు కేదారమ్ములను వంశధారాతీరసైకతస్థలులను నారామంబులను జూపి తనియఁజేయుచుండు.

మ. శరదాసన్నమనోజ్ఞవాసరములన్ శాంతించె ధారాధరా
ఘురయాద్ధత్యము, వృష్టిపుష్టి యడఁగెన్, గ్రామస్థలీపంకమే
దురమార్గమ్ములు గట్టివారె, ఘనవాతూలాభజీమూతబం
ధురభూభృచ్ఛిఖరంబు లొప్పె రుచిఁ జంద్రుం డెంతయున్ శోభిలెన్.

శా. గర్వస్ఫూర్తి యడంగ వాహినుల స్రుక్కం జేసి, జీమూతరా
ద్దుర్వారోద్ధతి మాన్చి, ధాత్రిరమణీదోస్సైకపంకాంకముల్
ఆర్వం జేసి, యపూర్వగౌరవము చంద్రాలోకకీర్తుల్ గనన్
బర్వం జేసె శరద్ధరాధిపుఁడు హృత్పర్వంబుఁ గావింపుచున్. 129

గీ. సరసి శతపత్రనేత్రవిస్ఫురణఁ గనియెఁ
గాశ వికసించి హాసప్రకాశ యయ్యెఁ
బారిజాతము పుష్పబాష్పములఁ గురిసె,
శారదాగమసందర్శసమయమందు. 130

సీ. చేమంతి సుమకాంతిఁ జెన్నారె, రేరాణి
కుసుమించె, గోరెంట మిసిమి నించెఁ
బారిజాతము పూఁచె, బంతి మొగ్గఁ దొడంగె
రత్నపూరుష పుష్పరాజి నలరెఁ
గనకాంబరము వింతకాంతి వెలార్చె, రా
ధామనోహరము నెత్తావు లీనె,
రుద్రాక్షకుసుమప్రరోచుల విలసిల్లె
నోడాంబరము వన్నె లొలికె విరులఁ

గీ. జంపకము నిలువెల్లఁ బుష్పముల శాల్చెఁ
గుముదములు వింతశోభను గూర్చుకొనియె
హారువు గూర్చెను నూత్నకల్హారసమితి
శారదోదయసమయవాసరములందు. 131

ఆ. వె. పండఁబాఱె రామఫలము, వెలఁగఁగ్రాఁ
దావి, జామిఁ జిల్కతండ మలరెఁ
జెలువు మీఱఁ బగిలె సీతాఫలమ్ములు
శరదుదారదృష్టి పఱుప నంత. 132

సీ. వరిపైరు కేదారవల్లిఁ గారుకొనె, మెట్ట
జొన్నఁ జెన్నారెను జిన్నికేకు
ఇక్షుకాండము రస మేపారఁ బెరిగెను
వాసించె మిట్టఁ బునాస-చోడి
తమలపాకులతీవ తాల్చె నూతనశోభఁ,
గందిచిగిర్చి కన్పొందుఁ గూర్చె
వేరుసెనగ యూఁకు విదలించెఁ, జిలగడ
చేవఁ గాంచె, నులవ చిగురుఁ దొడఁగెఁ

గీ. బిల్లిపీసర గట్లపైఁ బెంపుఁ గాంచె
నుల్లి పుష్పించె ముల్లంగి యుక్కుఁ బలిసె
సోపు క్రొన్నన లీనుచు నేపుఁ గొనియె
కనులవిం దగు నా శరత్కాలమందు. 133

ఉ. బంగరుడాలు పూలఁ గనుపట్టెను గాకర, మేలినీలముల్
వంగ నలంకరించె, గరువంబున గుమ్మడి విస్తరించెఁ, బెం
పుం గడు నందెఁ జిక్క, డొగిఁ బోడిమి నానబ బారసాచెఁ, గా
లాంగన శారదాంబరసమావృత యై చెలువారునత్తఱిన్. 134

ఆ. వె. మత్కుణేంద్రగోప మక్షిక మశకముల్
ప్రోపు చెడియె, విన్నఁ బోయె నెమ్మి
చాతకమ్ము క్రుంగె శరదాగమంబున
హంస చక్ర బకము లలరె వేడ్క. 135

క. చిలుకలసందడి హెచ్చెను
గొలఁకులఁ జెలరేఁగ నీటికోళ్లును బాతుల్
పలుతెఱఁగుల గిరిపిట్టలు
మలసె శరత్కాలచంక్రమణమున మివులన్. 136

ఆ. వె. గడ్డివామి నాని కాళ్లను మలఁచి, యాఁ
బోతు మోరఁ జొనిపి పొట్టక్రింద
కనులు మూసి బద్ధకంబుగా లేయెండఁ
గాచుకొనఁ దొడంగెఁ గాలమహిమ. 137

గీ. క్రొత్తరోమపుటంగీని గోము మీఱ
గొరియ కొనకొమ్ములను దువ్వుకొనుచు దులిపి
సాభిలాషముగాఁ జూడసాఁగె తనదు
సోయగము శరదాగమశోభ యనఁగ. 138

ఆ. వె. మడుగుఁ జొచ్చి యొడలు కడిగి యాపిమ్మటఁ
బూయు గంధమాల్యముల విధానఁ
బంక మొడల, నఱుతఁ బద్మకాండమ్ముల,
నలరె నొడ్డుఁ జేరునట్టి దున్న. 139

క. అపరాహ్ణమునన్ బచ్చిక
నుపభోగించియును దృప్తి నొందకఁ బెనవై
చి పురోభాగమున సరీ
సృపయుగము రమించి మించెఁ జెలువుగఁ దమిచేన్. 140

క. మగఱాలచాలుమాడ్కిన్
ఎగఁబడె బేడిసలు నీట నెలమిఁ గులీరం
బొగి డెక్కలఁ జిక్కిన మీ
నుఁ గొని చనియెఁ గాకమును గనుంగొని భీతిన్. 141

క. గిట్టలతోఁ గడ్డిని దస
చుట్టును దాపుగను దువ్వి సొంపుగ శయ్యన్
ఇట్టె యమరించి వెచ్చఁగఁ
బొట్టను నానించె ముట్టెఁ బొట్టెలు నిశన్. 142

ఆ. వె. శిశువు తల్లియెదను, చెలువుఁడు గాంతను,
బచ్చడమును ముదుక, బ్రహ్మచారి
దిండు, నవ్వ యగ్గి తెరలెడుఁగుంపటి
నాశ్రయింపఁ దొడఁగి రపరరాత్రి. 143

మ. పొడగానమ్ములు నాటకమ్ములును నిఃఫున్ గూర్చువాద్యంబులున్
గడిఁదేరంగను సాములున్ భజనలున్ గ్రామ్యంపుక్రీడల్ బలం
బిడు కుస్తీలను నేర్వఁగా యువకు లత్యేకాగ్ర మాదీక్ష సం
దడిగాఁ గూడఁదొడంగి రెంజయు శరత్సంజాతమోదంబునన్. 144

క. వెక్కస మయ్యెను నంబలి
చక్కనిమాంసమును దోఁప చామలకూఁడున్
మక్కువఁ గూర్చె శరత్తున
మిక్కుటముగఁ గోర్కె పెరిగె మీల జనులకున్. 145

సీ. కంబాలయాటకుఁ గడఁగుబాలికలును
జెమ్మచెక్కను నాడు చిఱుతకలును
గుజ్జనగూళ్లాడుకొనుముద్దుగుమ్మలు
దాఁగుడుమూఁతల దోగుచెలులు
కోలాట మాడెడి కొమ్మలు పాళ్ళి రా
సక్రీడ సల్పెడి జలజముఖులు
మండాట నాడెడు మగువలు వైకుంఠ
పాళీని నాడెడి పడఁతుకలును

గీ. దసరఁ బల్లెలు నానందధామము లనఁ
జెలువు మీఱెను గౌముదీసిక్తభువన
మోహనదినాంతములను సమ్మోహజీవ
సంచయ మ్మగు నా శరత్సమయమందు. 146

ఆ. వె. బంతి బొంగరములు బచ్చీలు గోళీలు
గిల్లి దండియుఁ గాని క్రీడ లాడఁ
గళ్లములను గుజ్జుకాయలు సేరిరి
శారదాగమమున సంతసమున. 147

గీ. ధవళసికతాతలమ్ములఁ బ్రవిమలనవ
చంద్రిక మలాము సేయఁ గర్షకకుమారు
లుప్పుపట్టియుఁ జెడుగుడు నుత్సవమున
నాడఁగా శరద్రాత్రులఁ గూడి రంత. 148

గీ. లేవఁ జాలని ముదుకకుఁ జేవ యబ్బెఁ
బలుకు లెఱుఁగని ముగుదకుఁ గులుకు లలరె
బేల లౌ బాలలకు నాగడాలు బలిసె
శారదాగమభూరివాసరములందు. 149

చ. జనకునిఁ గూడి మాధవుఁడు శారదసంపద సొంపు మీఱు నూ
తనకమనీయదృశ్యములఁ దద్దయు వేడుకఁ గాంచి, కౌతుకం
బున బహుసంశయంబులను బొంద, నృసింహుఁడు వాని నెల్ల నా
తని కెఱిఁగించు నేమరక తార్కికపద్ధతి జ్ఞానవృద్ధికై. 150

గీ. మాధవుండు వాహ్యాళి సమగ్రచిత్ర
మనుదినమ్మును జన్నివాక్యముల జనని
తనియ నెఱిఁగించుచుండు; సాధన యొనర్ప
నామెయును బ్రోత్సహించు నిత్యమును దాని. 151

క. అనుజసుతుని నానందునిఁ
గొని తేర సుభద్ర సేవకుని ధవు నాసన్
బనిచె, 'ద్వయో ర్విద్యా' యను
జనవాక్య మెఱింగి సుతునిఁ జదివింపంగన్. 152

క. సీతాసూనుఁడు సుగుణ
వ్రాతుఁడు సనుదెంచెఁ దండ్రిపనుపున విద్యో
పేతుఁడ వై చనుదె మ్మను
మాతృశుభాకాంక్ష లంది మనమలరంగన్. 153

ఆ. వె. కనులజంట వోలె గణనీయ మై యొక్క
భంగి నలరుసుతుల భావ వర్త
నముల భేద మేమి గమనింపనీయక
యాదరము సుభద్ర యలరఁ జేసె. 154

గీ. పలుకు భావము లీల, ఱెప్పయును గన్ను
వోలె, విరితావు లట్టులఁ, బాలు నీరు
మాడ్కి నానంద మాధవుల్ మసలఁ జూడ
వార లేకోదరు లటంచు భ్రాంతి కలుగు. 155

సీ. ఒకఁడు తానం బాడ నొకఁ డొత్తు నత్తడి
నొకఁడు దువ్వఁగ నిడు నొకఁడు పన్ని
నొకఁడు వొక్కా దొడ్గ నొకఁడు నిక్క రొసంగు
నొక్కఁడు తిన నిచ్చు నొకఁడు ముద్దఁ
బలక నొక్కఁడు గొన బలప మొక్కఁడు గొను
నొక్కఁడు వ్రాయ వేఱొకఁడు చెప్పు
నొడిసె నొక్కఁడు బట్ట నుండ నొక్కఁడు గొను
బాడ నొక్కఁడు లయ వైచు నొకఁడు

ఆ. వె. నొకని యెడుగుముల్లు నొకఁడు పంటిని దీయు
నొకని మేనిచెమట నొకఁడు తుడుచు
సద్వితీయమైత్రి నానంద మాధవుల్
కలిసి మెలసి మెలఁగి గఃన్యు లై రి. 156

ఆ. వె. కవలబిడ్డలట్లు కన్నులపండు వై
పలుకుఁ దలఁపు నడత నలరి రొక్క-
లీల నాకుమారు లాలఁ గాచెడు బల
రామ కృష్ణు లన నిరంతరమ్ము. 157

క. శారదనవరాత్రోత్సవ
మారంభం బగుట గ్రామమం దెల్లను బెం
పారెను నానందసుధా
పూరము దలముక్క- లై యపూర్వము గాఁగన్. 158

గీ. ఆశ్వయుజశుక్లపాడ్యమియందు శార
దాప్రతిష్ఠను సల్పె నత్యంతవైభ
వమ్మున నృసింహవర్మ స్త్రీబాలవృద్ధ
సహితుఁ డై సమంత్రకముగ విహితరీతి. 159

ఆ. వె. ముచ్చికాగితముల మురిపెంపుజిలుఁగులు
పాదరసపుగిండ్ల ప్రభలు, దీప
మాలికలును మేల్మిడాలుపూసలు గల
గుమ్మటమున వాణిఁ గుదురుకొలిపి. 160

గీ. షోడశోపచారములు ప్రస్తుతులు సల్పి
"విజయ! దిగ్విజయీభవ! విజయ!" యనుచు
బ్రహ్మచారు లింటింటఁ బుష్పవ్రజమ్ము
విండ్ల సంధించి విడిచిరి వేడ్క-గొలుప. 161

తే. వె. నెమిలికన్నుచాయ నమరు షరాయియు
వంగపండురంగు పట్టు షర్టుఁ
జిల్కవన్నెజిలుగుఁ జేసిన టోపీ యు
దాల్చి మాధవుఁడు ముదంబు మీఱ. 162

మ. అనురూపాంబరభూషణమ్ములను నయ్యానందమూర్తుం దాల్చి వెం
టను రానిర్వురు నయ్యవారి కిడు కట్నం బందుకో నెంచి య
య్యను డాయన్ సుమబాణ మెక్కుచుచుఁ బద్యం బొంతుఁ నైకస్వరం
బున సంగాతులఁ గూడి పాడుచు జనామోదంబుగా సత్రజిన్. 163

ఆ. వె. అయ్యవారి కట్న మైదురూప్యమ్ములు
పప్పు బెల్లములును బండ్లు నాకుఁ
జెక్కలను సుభద్ర మక్కువఁ బళ్లెర
మ్మందు నునిచి యొసఁగ నరిగి రంత. 164

గీ. మాధ వానందు లింటికి మఱలి రాఁగ
డోలికాంతరమాలతిన్ ద్రేలఁ జూపు
జననియింగిత మెఱిఁగి పుష్పమ్ము వింటఁ
దొడిగి మాలతి నేసె నే ర్పడర నతఁడు. 165

గీ. త్రుళ్లిపడుబాల నెదఁ జేర్చి రోహిణి దర
హాసవదన యై 'కట్న మియ్యదియె నీకుఁ
జేకొను' మటంచు బాలికఁ జేత నిడఁగ
మాలతి న్ముద్దుఁ గొనియె నమ్మాధవుండు. 166

చ. హరికథలున్, బురాణములు, హాస్యకరం బగు వేషముల్, నిరం
తరభజనల్, వినోదములు, నాటకముల్, వరజంత్రవాద్యబం
ధుర మగు గానముల్ ముదముతో దిన మొక్కటిగా నమర్చె నం
దఱు బళిరా! యనన్ నరసనాయకుఁ డేడుదినాలు విందుగన్. 167

క. అష్టమి కర్షకజనుల వి
శిష్టదినం బగుటను నరసింహుండు జనా
భీష్టము నెఱింగి శౌర్యా
విష్టక్రీడలను నాఁడు వెలయించెఁ గడున్. 168

సీ. దుర్గాష్టమీవ్రతోద్యోగకర్షక సతుల్
కుక్కుటధ్వనిని మేల్కొని, గృహాంగ
ణముల సమ్మార్జించి, విమలోదకము గల
యంపినిఁ జల్లి, గేహముల గోమ
యమ్మున నలికి, సోయగము వెలయ నెట్టి
మట్టితోడను పాదిగట్టు లూడ్చి,
రంగవల్లికలను సింగారముగఁ దీర్చి
యామ్రపల్లవతోరణాళిఁ గట్టి
గీ. అమళ్ఁబసుపున వంశధారాంబువులను
గ్రుంకు లిడి కురు లార్చి క్రొమ్ముక్కలను రవికిఁ
గూర్చి జలపూర్ణఘటములఁ గూర్చి నెత్తి
నిడుకొనుచుఁ దమయిండ్ల కేర్పడఁగ నరిగి. 169

గీ. పగట నుపవాస మొనరించి వంటఁ జేసి
పప్పు నట్టులు గారె లప్పాలు పాల
కాయ లొడపప్పుఁ బండ్లు శక్త్యాయతనము
నేర్చి యొఱసండె క్రొమ్మొక్క రశేషజనులు. 170

గీ. దివ్వెలును కుంకుమంబును బువ్వు లగరు
వత్తులును గుగ్గిలమ్ము సాంబ్రాణిపొగలు
మిగుల దుర్గకు నైవేద్య మొగి నొసంగి
సతు లొనర్చిరి కృషికకాంతాజనమ్ము. 171

గీ. రైతు లూడుగకొమ్మ లేర్పడఁగ వలయ
ముగను దుర్గముంగిటఁ జేర్చి మ్రొక్కుబడులు
దీర్ప మేఁకను దెగటార్చి త్రిప్పి దాని
నెత్తు రన్నింటఁ బష మీఁది కెత్తె నొకఁడు. 172

గీ. అంత నాకొమ్మలన్ గొని యంప నొక్క
మొగిని గేకలు వైచుచుఁ బోయి పొలము
లందు నొక్కొక్కటిగ నాటి రతిరయమున
భావివృద్ధికై రక్తముఁ బంచుకొనుచు. 173

క. డప్పులు రమ్డోళ్లును జెవి
దొప్పలు పగులంగ మ్రోయఁ దొడఁగెఁ; గాఢిన్
అప్పురియువకులు పూజన్
మెప్పింపఁగఁ గోళ్లఁ గోసి మేదిని యదురన్. 174

క. భేతాళపూజ యువక
వ్రాతము పొనరించి శితకృపాణంబులు డా
ళ్లాతతముదమునఁ గొని వి
ఖ్యాతముగాఁ బోరు సల్పఁ గడఁగిరి యంతన్. 175

ఉ. బాహాబలప్రదర్శనలు బారవహాత్వమహాత్వదృశ్యముల్
సాహసకృత్యముల్ విశిఖజాలవిచిత్రపరిశ్రమమ్ము లు
త్సాహము నించువేషములు జైత్రము పొంపిరివోవ శూరస
మ్మొహాన మయ్యె నష్టమి; ప్రమోదము నొందిరి ప్రేక్షకావళుల్.

ఆ. వె. నవమిఁ దోలుబొమ్మ లవిరతోత్సవముగా
నాడఁబడియె; దశమి నలర గొల్ల
భాగవతము సత్యభామాకలాపము
పగటివేషములును బ్రమద మిడియె. 177

శా. నిత్యానిత్యవివేచనాచణసమున్మేషప్రమాశోభితా !
స్తుత్యామోఘసుధాపరిప్లుతవచస్సీమా ! సమగ్రాంధ్రసా
హిత్యప్రస్తరభావభావితమహోహృద్భాషితా ! పావనీ !
సత్యాలాప ! కృపామయీ ! జనని ! విజ్ఞానాకృతీ ! చిన్నమా ! 178



శ్రీమన్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

## తృ తీ యా శ్వా స ము



మత్కాళింగకులా
రామాంచితపారిజాత ! ప్రాక్తననృపసు
త్రామసమశౌర్య ! లోక
క్షేమంకర ! శస్తచరిత ! చిన్నమనాథా ! 1

వ. అవధరింపుఁడు. 2

క. నిర్మలచరిత్ర ! విద్యా
మర్మశ్రుత ! సద్వివేకమహితా ! యస్మ
ద్ధర్మార్థకామసాధని !
కూర్మిని విను మన్నపూర్ణ కొదువచరితమున్. 3

క. దశరాత్ర మరిగె; గ్రామము
వశగత మయ్యెను యథానువర్తన కింకన్
శిశుసంచయానుకరణము
విశదముగాఁ గాన నయ్యె వివిధాకృతులన్. 4

సీ. తబుకుల డంకాలఁ దాల్చి కొట్టెడివారు
కొబ్బెరాకుల బూరగొమ్ము లూఁదు
వారు, సత్యానాట్యభంగిమన్ జిందులు
వైచెడివారు, దుప్పటి ముసుంగుఁ

బెట్టి బీబీ నుషుల్ వెలయించువారు, రం
గుల నద్దుకొని పెద్దపులివిధాన
లంఘించువారు, నుల్లాసమ్ముగా ముని
కోలలఁ గొని సాముఁ గూర్మి సల్పు

గీ. వారు, హరిదాసుగంతులు వైచువారు
నగుచు శిశుసమాజాత మా ననుకరణము
గ్రామమున వెల్లివిరిసెఁ; బూర్వస్మృతులను
మనన మొనరించు భూరిసాధనము గాఁగ. 5

ఆ. వె. కేతిగాని హాస్యఖేలన, మాధవి
వేడ్కనుడులు, భామవేషగాని
కులకరింపుపాట, గొల్లసుద్దులయోల
లుల్లసిల్లెఁ బల్లె నెల్ల నిండ. 6

వ. అంతఁ గతిపయదినమ్ములకు గౌరీపూర్ణిమ యరుదెంచుఁ డప్పర్వదినమ్మునఁ బుణ్యాంగనామణు లుపవసించి, చంద్రోదయావసరమ్మున సన్నికల్లును బూజించి, పుష్పలా జాక్షతా కుంకుమ మలయజ ఘనసా రాగురు ధూపాదులు నివాళించి విందుఁ గూర్చు చందమామ నారాధించిరి. పదంపడి కేదారసంస్థితం బగు వరికుదుటి నొక్కదానిఁ బెకలించి వివాహోచితకన్యకారత్నం బొక్కతె నద్దానిఁ గట్టెపలకపై నిడి శిరంబునఁ దాల్చి మోయ మేళతాళంబుల నూరేఁగించుచుఁ గొనివచ్చి యొక శుచిప్రదేశంబున సంస్థాపించి ధూపదీపోపహారంబు లొసంగి యర్చించిరి. అనంతరము నందివాహనారూఢుఁ డగు పరమేశ్వరవిగ్రహ మొక్కండు మలఁచి యలంకరించి తాకాతేకులపుష్పపత్రలతావళులతోఁ గనువిం దొనర్చు విమానారూఢు నొనర్చి ధూపదీప మాలికారచనము నాకర్షణీయంబుగ సల్పి యూరేఁగింపఁ దొడంగిరి.

మ. దివిటీవెల్గునఁ బార్వతీసహితుఁ డై దేదీప్యమానంబుగా
వివిధాలంకృతుఁ డై మహోత్సవమునన్ వేంచేసె శంభుండు భై
రవముఖ్యప్రమథావృతుం డగుచుఁ దూర్యధ్వానముల్ గాహళీ
రవముల్ శంఖమృదంగనిస్వనములున్ రాజిల్లఁ గన్పించఁగన్. 8

చ. ప్రతిగృహగేహళిన్ శివుఁడు భక్తజనావనుఁ డౌచు నిల్వ సం
స్తుతులును ఖడ్గముల్ జదువుచుండిరి జంగము, లంత దీపసం
తతు లుపహారకం బొసఁగి తన్పిరి జానపదాంగనామణుల్
శ్రుతుల కగోచరుం డయిన సోమకళాధరు మచ్చికన్ దగన్. 9

ఉ. ముంగిట పెన్నిధానము ముముక్షుల కై శ్రితపారిజాత మై
మంగళమూర్తి లింగఁడు సమస్తజనార్చన లంది యైదునా
ళ్లుం గమనీయశోభఁ బురిలో నలరించెను; గర్షకాంగనల్
కొంగులబంగ రై గిరిజ గోమును ప్రేమను నించె నెంతయున్. 10

వ. అనంతర మొక్కనాఁడు నరసింహవర్మ రోహిణీసుభద్రలఁ గూడి వినోదప్రసంగమ్ములఁ బ్రొద్దుపుచ్చువాఁ డై ప్రసంగాంతరమ్మునఁ గుమారవిద్యాశిక్షణవిషయంబు ప్రవర్తిల్లుఁడు సమ్మానవతులయభిమతంబు లెఱుంగఁ దలంచి యిట్లు లనియె. 11

క. "మనవంశమ్మున విద్యా
ధనహీనుల నెఱుఁగ మైదుతరములయం దై
నను నాంగ్లభాష నించుక
యును గడిఁ దేఱమికి నెంతయో చింత యగున్. 12

క. మిడిమిడిజ్ఞానము నా కే
ర్పడియె స్వయంకృషిని నాంగ్లభాషను, నెటులోఁ
గడుపుకొనుచుంటి నితరుల
నడుగక వ్యవహారవిషయమం దిప్పటికిన్. 13

గీ. ఆత్మసంస్కృతిఁ దెలియంగ నాంధ్రభాష
జ్ఞానవల్లరి వికసింప సంస్కృతమ్ము
విశ్వవిజ్ఞానసంపద వెలయఁ జేయు
నాంగ్లమును నేర్వ నగు నని యంద్రు బుధులు. 14

క. కల దింత తినఁగఁ బెట్టఁగఁ
గులమున గౌరవము నందికొంటిమి విద్యా
దులఁ; గావున బాగోగులు
దెలిసి కుమారకుల దిద్దఁ దెలుపుం" డనినన్. 15

వ. సుభద్ర మగనియింగిత మెఱింగి యి ట్లనియె. 16

క. "పలువురు లే రొక్కఁడె క
న్నులచందురుఁ డాంగ్లభాష నూతన మగుటన్
బలుకష్టము లందక నే
ర్పలవడునే? చిన్నికుఱ్ఱఁ డతిభార మగున్. 17

ఆ. వె. పూఁటకూళ్లఁ గుడిచి పొరుగూళ్ల వసియించి
వెతలఁ గనక యాంగ్లవిద్య రాదు;
ఒక్కగాని కుఱ్ఱ నూళ్లకుఁ బుచ్చి యే
లీల బువ్వఁ గుడువఁ జాలుదాన. 18

క. కరణముకొడుకును జూడరొ!
హరిహరి! వస్తాదువంటి యతఁ డెముకలపం
జర మై వచ్చెను; జదు వీ
తెఱఁ గైన భరింప వశమె తెలియరె శ్రమలన్. 19

గీ. ఆంగ్లవిద్యావిమోహితు లగుటఁ దలఁప
కున్న వారలు చెడుగు లం దెన్ని కలవో!
దుర్వ్యయమ్మును, వ్యసనబంధురలి, డాంబి
కత్వమును, దెవ్వళుల్ దానఁ గలుగుఁ గాదె! 20

గీ. బాధ్యత నెఱుంగఁజాలని ప్రాయమందు
సర్థపాలనవలన దుర్వ్యయము, నుచిత
శిక్షణము లేమి వ్యసనము, చిన్నయీడు
ననుకృతిని డాంబికత్వము, నన్నపాస
దోషమున రుజ లబ్బు విశేషముగను. 21

గీ. సంస్కృతాంధ్రాంగ్లభాషలే చాలునె? గణ
నీయ ! హిందీయు మనకు జాతీయభాష
దాని నేర్చుట జాతీయతకు సుసంజ్ఞ;
బొంతకుం దగు గంత యొప్పును నయజ్ఞ!" 22

వ. అంత రోహిణి యడ్డుదగిలి "వదినా ! చిన్నమాట విను" మని యిట్లు
వలికె. 23

గీ. "అలసభావముఁ జెక్కుల సలరు పాండి
మము నిదర్శనములు గావె మాధవుంకు
అగ్రజుం డని పల్క; న్యాయంబె ప్రేమఁ
జూఱ లిచ్చుట భావినిఁ జూడఁబోక." 24

గీ. అన, నృసింహుండు దరహాసితాననుఁ డయి
చెలువఁ దిలకింప సిగ్గుతీవలను మోము
దాఁచుకొనుచు సుభద్ర మెత్తగ చపేట
మొందు రోహిణి కంత బహూకరించె. 25

వ. పదపడి రోహిణి "వదినా ! నీ యుపన్యాసమున కడ్డు వచ్చినందుకు
మన్నింప వేఁడెద. ప్రాప్తకాలమ్మున సశ్రద్ధ చేసిన కృషికర్మంబునుం
బోలె బాల్యమ్మున సక్రమమ్ముగా నెరపని విద్యావ్యాసంగమమును
విశేష ఫలప్రదమ్ము గానోపదు. ప్రతియత్నంబునందును మేలుకీళ్లు
పెనవైచికొని యుండుఁ; గాని యొక్కమేలు గాని యొక్కకీడు

గాని యుండు టరిది. ఆంగ్లవిద్యావిధానమునందలి చెడుగులఁ గూర్చి నీపల్కి—న యన్నింటికిఁ బూర్వపక్షంబులు గలవు. పుత్రానురాగవాహినిం దోఁగు నీ కన్నియు ననర్థములే తోఁచుట వింత కాదు. లోకమాన్య విశ్వకవి మహాత్మాది మహాపురుషు లీవిద్య నభ్యసించినవారలు కారె. కర్తవ్యబుద్ధినిఁ గాక యనర్థశంకలఁ బెంచుకొనుట పాడియే" యనుడు సుభద్ర యి ట్లనియె. 26

గీ. "సుతుఁడు విద్యాప్రపూర్ణుఁ డై శోభఁ గనుటఁ
గోరఁజాలని జనయిత్రి ధారుణిఁ గన
రాదు; నావాంఛ యన్యము కాదు; దోసఁగు
పొసఁగఁ జాలని విత మెన్నఁ బోలు నిందు. 27

గీ. తెవుళ్ళు లందఁగనీక, నీతిని దొఱంగఁ
బొల్పడక, వ్యసనావళిఁ బడక, లేని
గొప్పలం బోక విద్దెలఁ గూర్చునట్టి
తెరువుఁ బరికింపఁ గోరుదుఁ దెలియుఁ డిద్ది. 28

గీ. తెవులు సోఁకిన బ్రతుకున స్థిమిత మెడలు,
నీతి వీడిన జననిందనీయుఁ డగును,
వ్యసనములఁ జిక్క— వంశపావనత తొలఁగు
లేనిగొప్పలకుం జన లేమి కలుగు. 29

వ. కావున. 30

గీ. బొట్టు కాటుక చెదరనిపోల్కిఁ గుఱ్ఱ
లన్నివిద్దెలఁ బరిపూర్ణు లై న మెఱుఁగు;
కానియెడల యథాశక్తిగా దొసఁగులఁ
దొలఁగఁ జేయుట కర్జ మెవ్వలను నై న. 31

సీ. మలమూత్రదుర్గంధ మొలయుకాలువలు, దో
మలు నీఁగలును గంపు మలయుదొడ్లు,

హో రెత్తి దుమ్ము సహోరాత్రములుఁ జిమ్ము
మోటారు, ఇఱుకైన బాటలు, జన
కోలాహలము, సందుగొందుల గృహములు,
రోగులగము లెదురుగ నిలఁబడ
నలరు భోజన ఫలహార శాలలుఁ, జైత్ర
గుట్టలు, వలిఁగొట్టు గుంటలు గల

గీ. పట్టణమ్ములఁ బల్లెపాపలను నిచట
తల్లి యొడి నాడుకొనుబిడ్డ దయఁ దొఱఁగి
కటికయసివాతఁ ద్రోయుట గాదె? మేడి
పండుచెలువమై యొప్పారుఁ బట్టణములు. 32

క. సాంబార్, చెట్నీ, డాల్డా
లం బిడ్డల నోళ్లు నొడళులను రుచి యుడఁగా
రం బలురోగమ్ములు బా
ల్యంబునఁ గను టెంతవంత యగుఁ దలఁపఁ దగున్. 33

వ. అనుడు నృసింహుఁ డర్ధాంగి లోకవిజ్ఞతకు, దూరదృష్టికి, ధర్మాస
క్తికిఁ, బుత్రానురక్తికిఁ గరమ్ము సంతసిల్లి ముసిముసినగవుల మిసిమి
డాలు వెలయఁ గనుగొలఁకుల నానందబాష్పము లొలయఁ దియ్యని
వాక్యంబుల నచ్చెలియ కిట్టు లనియె. 34

మ. గణితా! నీపరిశీలనాత్మకవచోగాంభీర్యమున్ గాంచి నేఁ
బరితుష్టాత్ముఁడ నైతి; మాన్యజనసంభావ్యమ్ము లవ్వాక్యముల్;
గురుసత్కార్యపరంపరాప్రవణ మత్యుదగ్రంబు త్రైవర్గబం
ధుర మౌ మానవజీవితంబు క్రమబోధోపాయసంశిక్షలన్. 35

క. 'కరణేషు మంత్రి' యన ధీ
పరిశోభితకార్యగతు లుపన్యాసం బ

బ్బురముగ వెలయించితి విం
క రచింపం దగుఁ బ్రణాళికను విజ్ఞమతీ!" 36

వ. అనిన నవజ్ఞాసంజననసూచకంబుగ నంగకమ్ములు వికాస మెసల విలాసంబడఁగఁ బరివేదనామేదురదృఙ్మాలికాజాలమ్ములు దయితుమెయిఁ బర్వంజేసి సుభద్ర విద్రుమాధరంబు కంపింప. 37

మ. "తగవే పిన్నను బెద్దఁ జేసి తమ రీఁదాసిన్ బ్రశంసింప, గో
డిగ నుచ్చైశ్శ్రవ మన్నఁ, బచ్చివగలాఁడిన్ సాధుశీలా యనన్,
వగపా సంతసమా జనించుఁ? గనకే వాచాల మీతోడుఁబు
ట్టుగునోటన్ జనియించుఁ గొమ్మ, లిపు డిట్టుల్ పల్కఁగా నర్హమే.

వ. అనిన రోహిణి సముత్సాహదోహల యై. 39

ఆ. వె. ఉన్నమాట నాడ నులు కేల? వదిన! మా
యన్నఁ దప్పు వట్ట కమ్మ; బేల
వేమి కావు; గోడఁ జేమాకువలె మాట
దిద్దఁ గలవు; చాలు; ముద్దరాల! 40

క. నల్లేరుపైని బండియె
యొల్లప్పుడు నీకు మాట; లేమందును మా
వల్లఁ గడుఁ దూలితివి; పసి
పిల్లవు మిగింగఁగలేవు పెట్టక నోటన్. 41

ఆ. వె. చన వొసంగి మెప్పుఁ గను నమాయకుఁడు మా
యన్న పలుకఁ గినుక నంద నేల?
కీ లెఱింగి వాతఁ గీలించు జాణత
నమ్మ చాలు; నుత్తరమ్ము నిమ్ము." 42

వ. అనిన రోహిణీవాక్యజనితపరిహాసోల్లసితానన యగు సుభద్ర రోహిణి నుద్దేశించి యి ట్లనియె. 43

ఆ. వె. "కులము విద్దెలకును గుదురు కావున, నాలు
కలకు వాడి మిగులఁ గలుగు టరుదె!
కందురీఁగపట్టుఁ గదలించి కాటుల
కెదురు నిల్పు వెడఁగు నిట్టు లైతి. 44

ఆ. వె. ఆఁడుబిడ్డ బిగువు; నాపైని మీయన్న
గారి బరస, కన్నవారి బింక,
మల్లునకుఁ గుమారి నర్పించు బలిమియుఁ
గలుగు నిన్నుఁ జెనకఁ గలుగు టరిది. 45

గీ. కూఁతునకుఁ గూర్చు నల్లునిఁ గోరు; దిట్టు
లొడ్డునుండి బెడ్డల వేయ నొప్ప దింక
నుచితపథకము రచియింపు మొనర నీవె
కందకున్ లేని నుస బచ్చఁ గొంద నేల?" 46

వ. అంత రోహిణి, "వదినా! నీవింక మాటాడ వనుకొందు. పథకమ్మును రచించినచో నీనందనుం డతిలోకసౌందర్యతేజోవిజ్ఞానవిరాజితుం డయి యజరామరకీర్తిసంపన్నుండు కాఁగలండు. నీ వన్నట్లు మాపుట్టింట విద్యావికాసమ్ముల కేమికొదవ? నీ పలుకుబాణాతనమ్మున కిమ్మహనీయవంశప్రవేశమ్ము గాదె కారణమ్ము." అనిన సుభద్ర విఱఁగఁబడి నవ్వుచు నవ్వారారోహావీపుఁ జఱచి "బళీ! పెరుగుతోఁటకూర గరువంపునెఱసుద్దుల నీ కుద్ది యెద్దియుం దోఁపదు. మేలు మేలు. నీ వాచాలత్వమ్మును, నుత్తరకుమారప్రజ్ఞలను గట్టిపెట్టి శ్రవణపేయంబుగా నయ్యనర్ఘప్రణాళికారత్నము వెలయింపుము." అన రోహిణి కౌతూహలవిలోలలోచనమ్ముల నన్న నుపలక్షించి ప్రోత్సాహదీపకమ్ము లగు నాతనిచూడ్కులం దనిసి యిట్లనియె. 47

సీ. "సుప్రశాంతస్థలి శుచిమంత మగు నొక
బాడుగకొంపను జూడవలయుఁ
బాలక్రియాదక్షభామిని నాత్మీయ
ననురక్తిఁ గార్యజ్ఞ నరయవలయు
శిష్యవత్సలుఁడుఁ బ్రసిద్ధుఁడు విజ్ఞుఁడు
నగు గురు నెన్నికొనంగవలయు
నుభయసంధ్యలను గాలోచితమ్ముగను వ్యా
యామమ్ము సల్పు నభ్యాస మిడఁగ

గీ. వలయు, వర్తన సరిదిద్దఁ గలుగువాని
రక్తసంబంధి నుండ నేర్పఱుపవలయు
దోమతెరలు మొదలగువస్తువులు గూర్ప
వలయుఁ, బరిపరి గమనింపవలయు సుతుల. 48

ఆ. వె. పాఠశాల విడువఁ బౌరముల్ మనన మొ
నర్పఁ జేయు, నూతనమ్ము లైన
విషయబోధ సల్పు, విజ్ఞుల నొనరించుఁ
గాన యోగ్యగురుసఁ గాంచవలయు." 49

వ. అంత సుభద్రానృసింహులు లానందకందళితాత్ములై "మేలు మే" లనిరి. రోహిణి వారిపలుకుల కలరి వాక్క్రియాశిక్షణాధ్యాపనప్రవీణుల నెన్నికొన్న నన్నియుఁ జక్కపడంగలవు; కావున మీ రావిషయమ్మున సావధానులరై యొకనిశ్చయం బొనర్పుం" డన వారలు వల్లె యనిరి.

క. కతిపయదినములు గడవన్
సుతఁ దోడ్కొని పోవ నొక్కశుభదినమున నం
చితముగను రామవర్మ ము
దితలను బిలుపునకుఁ బంచె ధృతమతి యగుచున్. 51

వ. అంత రోహిణీరమణి స్వగృహప్రయాణానందమ్మును మాతృగేహ వియోగపరితాపమ్మును ముందువెనుకల కీప్వఁ బ్రయాణోచితవేష భూషాంబరప్రశోభిత యై బాలికారత్నము మాలతి ననుంగుఁజెలు లలంకరింపఁ బరిస్ఫుటరాకాచంద్రబింబోపలక్షిత యగు కుమారీము ఖాలోకజనితాశేషానందపీయూషపరివేష యై స్మితజ్యోత్స్న వెలయు రాయంచనడలసొంపు నీసడించు మందగమన మ్మొలయు లతాంతాన్విత వల్లరిం బోలె నవనతాంగి యై గృహదేవతల నర్చించి పదపడి. 52

ఉ. తామరసాక్షి రోహిణి సుతద్వితయమ్ముగ మ్రొక్కి నన్నకున్
భామ సుభద్రకున్ జెలిమిపంటకు; నశ్రులు జాలువారఁ గాం
తామణిఁ గౌఁగిలించిరి, ముదంబున బాలిక ముద్దు వెట్టి గా
రాము వెలార్చి రిద్దఱుఁ, బురంధ్రులు దీవెన లిచ్చి రెంతయున్. 53

సీ. మఱుఁగుబిడ్డను జూచి మురియును నొక్కతె
గజ్జెల ననురక్తిఁ గాంచు నొకతె
అపరంజిపతకము నరయును నొక్కతె
తారహారము గాంచి తనియు నొకతె
చేతివత్తులఁ బరిశీలించు నొక్కతె
పట్టు'ఫ్రాకు'ను జేతఁ బట్టు నొకతె
ఫాలసౌందర్యముఁ బరికించు నొక్కతె
చిబుకంపుగోము నీక్షించు నొకతె

గీ. కనులచెలువము మక్కువఁ గాంచు నొకతె
యచటఁ గూడిన స్త్రీలోకమందు; బళిర!
యందఱకు విందుఁ గూర్చె భూషాంబరాంగి
కముల మాలతి జనకుగేహమున కరుగ.

గీ. బాలికామణి నొకవృద్ధపౌరసాధ్వి
యెదను గదియించి దీవించి యొలమి నంతఁ

బంచపాత్రను దరవాణి నించి వేడ్క
దృష్టిదోషముఁ బోకార్ప దిగఁదుడిచెను. 55

గీ. మాధవానందులను బ్రేమ మలయ రోహి
ణీసతీమణి భాష్పార్ద్రనేత్ర యగుచు
నిరుకరమ్ముల నెద హత్తి హరువుఁ గూర్చెఁ
గవలఁ గౌఁగిలించిన సీతకరణి మివుల. 56

ఉ. కూరిమిఁ గాసులున్ బసుపుఁగొమ్ములు రోహిణిచీరకొంగునన్
గూరిచికట్టి ఫాలమునఁ గుంకుమబొట్టును బెట్టి శేష మొ
ప్పారఁగ నాభిఁ గంఠమునఁ బాపట నద్ది సుభద్ర యంతఁ గ
స్తూరినిఁ దీర్చెఁ జెక్కుఁ గడుశోభగ బుగ్గను దృష్టిఁ దీయఁగన్. 56

క. నీరఁట నిడి పూజించిన
చీరలు అవికలును బండ్లుఁ జిఱుతిండ్లు వడిన్
నేరుపుగాఁ గావళ్లన్
గూరిచి సారెను సుభద్ర కొనుఁ డన నంతన్. 58

సీ. గెలలరూపమునఁ జక్కెరకదళుల్ నారి
కేళమ్ములను బండ్ల ప్రేలఁ గట్టి
బెల్లపుఁగుండల నెల్లఁ బోణకలందు
నిండించి, చలిమిడియుండలను న
వాతుపొంగులను గంపల కెత్తి, తబుకుల
యందు మిఠాయీలఁ బొందుపఱచి,
వస్త్రాదు లెల్లఁ గావడిపెట్టెలం దుంచి,
శిశుజనక్రీడావిశిష్టవస్తు

గీ. జాలము సవారి నిడి, బెరసలు సవత్స
ములును నగు మూఁడు మేలియావులు, నుయేల

మంచమును, బాలవెల్లినిఁ గొంచుఁ దరలి
రంత సేవకు లెంతయు సంతసమున. 59

గీ. బాలికాసహితముగ సవారియందు
నధివసించి రోహిణి ముదమార నంద
అకుఁ బ్రణామ మొనర్చె; "నిరంతరాభి
వృద్ధిఁ గను" మని వారు దీవించి రంత. 60

క. వాహాకు లోంకారసము
త్సాహాధ్వనులను నొనర్చుచండము విం దై
యూహాపరంపరాసం
దోహము బాలకులఁ బొదవె నూతన మగుచున్. 61

క. కనుచూపుమేరవఱకున్
గనుఁగొనుచు సుభద్ర యంతఁ గన్నులఁ జలం
బున నొత్తుచు బిడ్డలతో
వెనుదిరిగెను డీలు వడుచు విభుఁ డోదార్పన్. 62

స. పరికించు మంచముపై సన్నగొడ్డను
బిడ్డగా భ్రమసి సంప్రీతి నొకటఁ
జెవి యొగ్గఁ బొరుగింటి చిన్నారి యేడ్పును
బాలికయేడ్పుగా భ్రమసి యొకటఁ
గలఁతనిద్దురఁ 'బాపఁ దలఁప వే' మని మఱఁ
దలికి హెచ్చరికలు బలుకు నొకట
విభుఁడు భుజించెడి వేళ వీవనఁ బట్టి
బాలికచెలువమున్ బలుకు నొకటఁ

గీ. కన్ను మూసినఁ దెఱచినఁ గానవచ్చు
బాలలీలగ్నచిత్త యై మసలు నా సు

భద్ర; ప్రేమ నందనవనపారిజాత
సుమము లగుటయె సతులకు శోభనమ్ము. 63

శా. బాల్యక్రీడల నుల్లసిల్లుచు, వచఃప్రాగల్భ్యవిజ్ఞానసా
శీల్యాదుల్ గడుఁ గూర్చుకొంచు, గురుసంసేవానురక్తిన్ వయో
తుల్యాతిక్రమవిద్యలం గఱచి, సంతోషమ్ముఁ జేకూర్చు; నా
కల్యాణాత్ముల నారసింహుఁ డరయున్ గాతూహలాయత్తుఁ డై. 64

చ. కతిపయవర్షముల్ గడువఁగా నిటు, లొక్కట భార్యఁ జీరి యే
కతమున నారసింహుఁ డనెఁ "గంజదళాక్షి ! కుమారిలక్ష్మిసం
గతి నిఁకఁ బ్రొద్దుపుచ్చఁదగు; గాదిలిపుత్రుల విద్య నేర్ప నం
చితముగఁ బంప నౌను బరసీమల కూనుము నిబ్బరం బెదన్. 65

క. కడచెఁ బదివసంతము లి
య్యెడ విద్దెల నేర్వ సుతుల కిఁకఁ బోనఁగదు; కా
లిడవలెఁ బొరుగూళ్లన్, లే
మిడి జనులకు విద్య లేమి మేదినిఁ గాదే ! 66

సీ. నాగావళీస్రవంతీగానమాధురిఁ
జొక్కుచు నేపురి పరిశుద్ధ మగుచు
హాటకగర్భదినేశాభినుతుఁడు శి
వుం డెటఁ గోటీశ్వరుం డనఁబడు
సూర్యనారాయణాస్తోకదృగంచల
కరుణాలవాల మేపురవరమ్ము
మందలాంబాదయామహితసౌభాగ్యసం
వర్ధనం బేమహాపట్టణమ్ము

గీ. అది శ్రీకాకుళసంజ్ఞ విఖ్యాత మగుచుఁ
బ్రాచ్యవైభవద్యోతకరంగ మగును;

శ్రీకరకళింగరాజ్యప్రసిద్ధనగరి
వివిధసంస్కృతీవిలసనవేది యగుచు. 67

మ. కల దం దున్నతపాఠశాలయుఁ దగన్ గాలేజియున్, వచ్చు వి
ద్యల నప్పట్టణమందె యుంచఁదగుఁ; జూడం గోరుచోఁ బోవఁగా
నులు వే; నచ్చటఁ బెక్కుమంది మనకుం జుట్టాలె బాగోగులం
దెలియంగాఁ బెరటిల్లుఁ బోలు సుదతీ! నీసమ్మతిం గోరెదన్. 68

ఉ. చెల్లియుఁ జేతిబిడ్డయెడఁ జెల్మిని బుచ్చును; గానఁ గోరుచోఁ
బిల్లను నుంప నీకడను వేఱుగ నెంచను; మాలతీముఖో
త్ఫుల్లసుమంబుఁ గాంచి సుతుపోకటఁ గల్గిన వంత యింతి! నీ
యుల్లమునన్ శమించు; గృహ మొప్పును వేడ్కఁ గుమారికాద్వయిన్.

క. గాదిలికోడలి గుణసం
పాదన విద్దెయును బుద్ధి వర్తనమును నీ
వే దిద్దుకొనుట మేలౌఁ
గాదే! యిది యుభయతారకం బగు" ననినన్. 70

వ. సుభద్ర "మీయాదేశమున కన్యథా భావన కలదే! మీనచ్చిన విత మ్మన సల్పునది. కుమారుఁ డున్నతవిద్యార్థి యగుటయుఁ గోడ లిందు వసించుటయుఁ జక్కనియేర్పాటు; కాని రోహిణి పుత్రానురాగంబునన్ దోఁగుచున్నను గూఁతు నెడఁబాయ నిచ్చగింప దని తలంతు;" నన నృసింహుఁడు "కాంతా! నీనుడులు యథార్థములె; కాని రోహిణి నిన్నుఁ గన్నతల్లికన్న మిన్నగ మన్నించు. నీయభిమతమున కామె యెన్నండు వ్యతిరేకింపదు. రామవర్మయుఁ గూఁతుఁ దాతగారియింటికడ నిడ సంకోచింపఁడు. ఇంతకు నీవొకపరి వారియింటి కరిగినచో నన్నియుఁ జక్కపడఁగలవు; కావునఁ బుత్రులఁ దోడ్కొని నీ వం దరుగుట కర్జం" బనిన నామె తనయంగీకృతి నొసంగె. 71

గీ. కొన్ని దినములు సనఁగ సక్రోమలి పయ
నించె మాధ వానంద లక్ష్మీసమేత
ముగ వృషభశకటమ్మునఁ బొలుపు మీఱ
దాసి యనుగమింపఁగ మఱఁదలిని జూడ. 72

గీ. చోదకుఁ డదల్ప గంటలు శోభఁ గూర్చు
కింకిణుల్ వింతరవళులు గీలుకొల్ప
మోర లెత్తి కోడెలు పర్వ మోదగరిమ
నుల్లసిల్లి వహ్వా! యని రెల్లవారు. 73

శా. ధూళుల్ గ్రమ్మ నభంబుఁ, గింటి కెదురై తొల్కాడు వృక్షావళుల్
లీలన్ వెన్కకుఁ బర్వ, గాలివడిఁ గేళీలోలనీలాలకల్
గ్రాలన్, జేలచెఱంగు మీఁది కెగురన్ గంజాక్షి చెన్నార, న
బ్బాలు ర్వేడుక నొంది రెంతయుఁ గురుల్ పైఁ గ్రమ్మఁగా మోములన్.

క. గిట్టల సవ్వడి, కొమ్ముల
పట్టియ మువ్వలరవంబు, బాగుగ నడుమన్
జుట్టిన గజ్జెలరుతి, మెడఁ
గట్టిన ఘంటికలధ్వనియుఁ గడు ముద మిడఁగన్. 75

క. గిత్తలు నిట్టూర్పునుఁ బ
ర్వెత్తుటఁ గన్గొని సుభద్ర వేగమ సన్నన్
ఉత్తరు వొసంగె నాఁపఁగ
నత్తఱిఁ జోదకుఁడు ద్రోలె నతిమందగతిన్. 76

వ. ఇట్లు మందగమనమ్మున నెద్దులశ్రమ నపనయింపుచు, నందందు నద
లింపుచు సేవకుఁ డెరసందెప్రొద్దున గమ్యస్థానముఁ జేర నరుదెంచుఁడు
వృషభమ్ముల యథేచ్ఛఁ బోనిచ్చె. అట్టితఱి దినాంతమనోజ్ఞదృశ్య
పరిశీలనాకౌతూహలాయత్తచిత్తులై మాధవానందులు దెసలఁ బరి
కించు నంత, 77

చ. కలకలరావముల్ శ్రుతిసుఖంబుగఁ గూర్చెను, పక్షివాలిసం
కులపరిజాతవాతమున క్షోభిలి పద్మిని కన్ను మోడ్చెఁ, గెం
పులఁ గురిసెన్ దివాకరుఁడు, పోడిమి వీడిన ప్రవ్వాఁబోఁడికై;
యళు లపహాస్యముల్ సలిపె నట్టైన నాథుని దైన్యవృత్తికిన్. 78

మ. పవ లెల్లన్ శ్రమఁ దూలి జాలిగదురన్, బాధాసహిష్ణుల్ జగత్
స్తవనీయుల్ పరిశుద్ధజీవనులు స్వార్థత్యాగులున్ దేశబాం
ధవు లౌ కర్షకలోకమున్ దనుప నింతైనన్ గటా! లోకబాం
ధవనామం బది సిగ్గుచేటని వ్యథన్ దా నొప్పె భాస్వంతుఁడున్. 79

శా. చంచూవ్రాతమునందుఁ గూర్చినయెరల్ శాబంబులన్ జేర్ప నే
తెంచెన్ బక్షులు, వృక్షవాటికల నుద్దీపించెఁ గోలాహలో
దంచత్స్వాగతగీతికల్; మిణుఁగురుల్ దద్దేహాళీసీమ దీ
పించెన్ దీపికలై, ధరిత్రి సలమెన్ బెంపార రక్తద్యుతుల్. 80

సీ. ఆత్మవత్సముల నాప్యాయంబుగాఁ గన
గొబ్బునఁ బయనించు గోగణమ్ము
నెమరు వేయుచు మీఁద నమరు కాపరుల పా
టలఁ జొక్కి యరుగు దున్నలగణమ్ము
గొల్లని పిల్లనగ్రోవిగీతికను వీ
నులఁ గ్రోలుచుఁ జను మేఁకలగణమ్ము
కొలఁకుల వీడి గూఁడులఁ జేర నీలాటి
త్రోవను బోవు బాతులగణమ్ము

గీ. పచ్చగడ్డిముట్టెలు నెత్తిపైఁ జెలంగ
నింటిముఖ మైన కాఁపువాల్గంటిగణము
నగుచు సర్వముఁ దోఁచె గేహాభిముఖము
గాఁగఁ, దిమిరావకుంఠనన్ దాఁగెఁ బ్రకృతి. 81

గీ. శ్రమభరాలస లోకవిశ్రాంతిఁ గూర్ప
ఘనతమోరూపదుష్టరోగమును దీర్పఁ
పాకశాసనుఁ డమృతకుంభము నొసంగె
ననఁగఁ బ్రాచిని హిమకరుఁ డలరె నంత. 82

గీ. వీఁచె మలయానిలుఁడు తావి వెలయ, నంతఁ
దోఁచె నానందవిలసన తోగమొగాన
రేచెఁ దమి విరిశరముల వైచి మరుఁడు
ప్రాకటమ్ముగ రేరాజు రాక నలరి. 83

ఉ. తోరణగండ్లనుండి కడు శోభిలు నాపురిదీపమాలికల్
గూరిమి రాజచంద్రునకుఁ గూర్చిన మేల్కపురంపుటారతుల్
గా రహి నించె; దేవళపుఘంటిక మ్రోయఁ గుమారయుక్తయై
చేరె సుభద్ర గ్రామమును జెచ్చెఱ నాశకటాధిరూఢయై. 84

వ. శకటమ్ము రామవర్మగృహప్రాంగణమున నాఁపి వా రెల్లరు దిగునంత కవ్వార్త నెఱింగి రోహిణీముఖ్యకాంతాజన మ్మెదు రేఁగి, సమ్మానమ్ము నెఱపి, కుశలసంప్రశ్న మ్మొనర్చి లోనికిఁ దోడ్కొని చనిరి. ఆగతు లెల్లరుఁ గరపాదముఖప్రక్షాళనంబు నొనర్ప, నంత రోహిణి ప్రయాణ శ్రమాపనోదకరుచ్యశీతలపానీయమ్ము లొసంగి తనియించె. పరిచారిక యోర్తు సుఖోపవిష్టులై యున్న బంధులఁ దాళవృంతముఁ గొని వీవ లక్ష్మీమాధవానందుల విందుఁ గూర్చు వివిధానునయభాషణమ్ముల రోహిణి యుల్లసిల్లఁ జేసె. పిదప సుభద్ర రోహిణీనందను నెత్తి ముద్దుఁ గొని వానియాకారలక్షణమ్ములకుఁ గరమ్ము సంతసిల్లె. అంత. 85

శా. లంగాచెంగులు కాలిమట్టియలపై లాస్యం బొనర్పంగ, సా
రంగీలోలవిశాలనేత్రములు సంరంభంబు సూచింప, మో
ముం గీల్కొన్న మనోజ్ఞకుంతలము లొప్పుం గుల్క, దేహప్రభల్
బంగారంబును గేర, మాలతి యటన్ బ్రత్యక్ష మై యంతటన్. 86

శా. అత్తన్ గన్గొని నవ్వుకొంచు నప్రదయ్యాబ్జాక్షి యానంద ము
న్మత్తై పర్వ సుభద్రకాళ్లఁ బెనిచెన్ పెం దొవ్వ బాహాద్వయిన్;
చిత్తం బెంతయు నుల్లసిల్లఁ దగ నాశీర్వాదమున్ సల్పి మై
హత్తె న్ముద్దు నొసంగి బాలికను నాప్యాయంబుగా నామెయున్. 87

గీ. "బావ లరుదెంచినారు వహ్వా" యటంచుఁ
చిందులన్ ద్రొక్కుచును లక్ష్మి చేతిఁ జేతిఁ
గీలుకొల్పి తోడ్కొనిపోయె మాలతి తన
రంగుబొమ్మలఁ జూపఁ గురంగి వోలె. 88

క. సాయంప్రార్థన సలుపన్
బోయి జనకుతోడ గుడికిఁ, బూజ ముగియ సం
దే యత్త రాక విని త్వరఁ
దోయజముఖి పరుగుఁ దీసెఁ దోడనె వేడ్కన్. 89

ఆ. వె. రామవర్మ కూఁతుప్రేమను దలపోసి
కనులు చెమ్మగిల్లఁగాఁ బ్రసాద
మధికభక్తినిఁ గొని యంతట గేహముఁ
జేరి కాంత కొసఁగి గారవమున. 90

వ. సుభద్ర నుచితరీతి సమ్మానించి, బాలకుల నాదరమ్ము మెఱయ నుపలా
లించి, లక్ష్మి నెత్తి ముద్దుఁగొని, తత్తదుచితకుశలప్రశ్నముల వేర్వే
ఱఁ దనియించె. 91

క. పార మెఱుంగని కూరిమిఁ
గూరి సుభద్రాదు లచటఁ గొన్నాళ్లుండన్
గారవ మెలర్ప రోహిణి
వారిని దనియించె వివిధభంగుల సతమున్. 92

వ. అంత నొక్కనాఁడు సుభద్ర తనయభిమతంబును రోహిణీరామవర్మల
కెఱింగించి వారిసమ్మతిఁ బడసి మాలతిం దోడ్కొని సకుటుంబముగ
స్వగృహమ్మున కరిగె. 93

క. వేసవిసెలవులు ముగిసెఁ; వి
కాసము బడులకుఁ బొసంగెఁ గ్రామాంతర సం
వాసు లగు బాలబాలిక
లాసమయమునందుఁ జదువ సరుగుటవలనన్. 94

వ. అంత నొక్కశుభదినమ్మున నరసింహవర్మ నందనులం దోడ్కొని శ్రీకా
కుళపురిం జేరి, నిర్ణీతవిధమ్మున వలయుసదుపాయమ్ములఁ జేకూర్చి,
బిడ్డల నున్నతపాఠశాలం జేర్చి యథోచిత మైన కట్టడుల నేర్పఱచి,
రెండుమూఁడునా ళ్లందుండి, గృహోన్ముఖుం డయ్యె. సుభద్ర
దయితుముఖంబున బిడ్డలవృత్తాంతం బరసి కొంత యూఱటం గనియె.

క. నవనాగరికత కిర వై
యవిరతిసమ్మర్ద మలరు నప్పురియందున్
వివిధవినోదంబుల మా
ధవుఁ డానందసహితముగఁ దనియుచు నుండెన్. 96

సీ. ఏయెడఁ జూడ దేవాయతనమ్ములు
శిల్పము వెలయు మసీదు లలర
బారులు దీర్చి దృక్పర్వంబుఁ జేకూర్చు
విపణులు కనులకు వేడ్కఁ గూర్ప
నందందు నేత్రద్వయానందకరము లౌ
సౌధసంచయములచాలు వెలయ
నవలతాంతోపేతనానావిధమహీజ
వల్లిక లుద్యానవనులఁ జెలఁగ

గీ. భూరికాంతి విద్యుద్దీపతోరణములు
కనుల మిఱుమిట్లు గొలుపఁగ, గానసుధను
జిందు రేడియో లట నట విందుఁ గూర్పఁ
దనరు పురిఁ గాంచి వారు సంతసము గనిరి. 97

క. జోరీఁగ క్రొత్తకండన్
జేరినపోలికను వారి చేష్ట లలరెఁ గ్రొ
త్తారోజులఁ, గొన్నాళ్లకు
వారున్ గడు నైరి గాలివాలున మివ్వలన్. 98

సీ. ఏమఱుపాటున నెఱ్ఱసిరాఁ జిమ్మి
విద్యార్థినులను నేడ్పించువారు
నల్లబల్లల హేళనము సల్ప వికృతపు
టాకారములు వ్రాయునట్టివారు
పాఠము బోధించుపట్టునఁ దెలియఁగ
నీయక గూఁతలు కూయువారు
పంతుళ్లహావభావంబుల కనుకృతి
వెలయించి 'క్లాసు' నవ్వించువారు

గీ. ప్రణయలేఖలు వ్రాయఁ బొల్పెడివారు
నైన నవనాగరకపువిద్యార్థిగణముఁ
గాంచి యానందమాధవుల్ గనిరి విస్మ
యంబు; నెన్నఁడు నిట్టివోద్యము లెఱుఁగక. 99

సీ. ఆకాశరామన్నయర్జీల వ్రాసి మా
ష్టర్లను బెదరించు సాహసికులు
పంతులమ్మలప్రేమవార్తలు గోడల
నించి వీథులకు నెక్కించువారు

రక్షకభటుల యుపేక్ష లేకయె పరీ
క్ష లసాధ్య మగునట్లు సల్పువారు
పంతులుగారి నిర్భయముగా నెదిరించి
చేతులు గలుపు ప్రసిద్ధులు నగు
గీ. ధూర్తవిద్యార్థు లందందుఁ దోఁచు చెటేఁగి
యనఁటియాఁకును ముల్లు నా సలరె విద్య
నేర్చు టని తలపోసి వినీతభావ
మొలయ నానందమాధవుల్ మెలఁగి రటను. 100

మ. గురుభక్తిన్ బరిశుద్ధజీవనము నిష్క్రోధమ్ము సత్కార్యవి
స్తరధీవైభవ మాత్మగౌరవము సత్ప్రేరత్వమున్ వీడి యి
క్కరణిన్ విద్యల నున్నతిం గనుచు దుష్కర్మార్థులై తోడిబా
లురు వర్తించుట మాధవుం డరసి కూలున్ జింత నత్యంతమున్.

సీ. బ్రాహ్మముహూర్తము ప్రాపింప మేల్కని
కల్యముల్ దీర్చి, శీతకనియాన
వ్యాయామ మొనరించి, వాయుసాధనఁ జేసి,
చన్నీట స్నానము సల్పి యొడలి
తడి యొత్తి, శుభ్రవస్త్రమ్ములఁ దాలిచి,
చద్దికూటిం దిని చదువఁ దొడర,
గురుఁ డరుదెంచి క్రొంగ్రొత్తపాఠమ్ములు
బోధించి యరుగంగఁ, బూర్వదినము
గీ. నింటి కిచ్చిన పని చేసి, గంట మ్రోఁగు
నంత బడి కేఁగి సంగఁడీండ్రలర మధుర
భాషణమ్ములు వల్కి చెవ్వారికిఁ దా మ
నిష్టు లటు తోఁపనీక వర్తింపఁ దొడఁగి
రాకుమారులు విద్యార్థులై వినీతి. 102

క. గురుభక్తియు, నవధానము
నురుతరయత్నమ్ముదీక్ష యుచితజ్ఞత, క్షీ
గరిమ విలసిల్ల వారు
త్తరతరగతులను గృతార్థతను బొంది కొగిన్. 103

వ. ఉన్నతవిద్యాభిరతులై యాకుమారద్వయము కళాశాలం జేరి నాల్గేం
డ్లు చదివి ముగించి, పదపడి విశ్వకళాపరిషత్తుం జేరఁ గోరిక లీరిక
లెత్తఁ బుష్పపురిం జేరిరి. 104

ఉ. యౌవనచిహ్న లేర్పడియె నంతఁ, గుమారుల దేహవల్లులన్
జేవయు, వింతకాంతి, నునుజెల్వము శోభిలె; వక్త్రరేఖలన్
తీవి వహించెఁ గేశములు; టెక్కును, దీప్తియు, దర్ప మక్షులన్
శ్రీ వెలయించె; మీసములు చెన్నుగనెన్ నవనైల్యసంపదన్. 105

క. మగతనపుంజిన్నెలు దోఁ
పఁగ వారభిరుచుల వేషభాషాదుల వే
ఱుగ నగపడఁ దొడఁగిరి; యరి
ది గదా! వయసున నలవడు తెరువు లెఱుఁగుటల్. 106

శా. ఆబాల్యమ్మును నొక్కఁగిన్నెఁ దిని శయ్యామజ్జనక్రీడ వి
ద్యాబాధాసుఖసంఘమం దొకటియై వ్యక్తిత్వమున్ గానరా
కాబాలు ర్విలసిల్ల, యౌవనదశాప్రారంభరేఖావళీ
ప్రాబల్యమ్మున మూర్తిమంతులుగ సల్పం బూనె ప్రస్ఫేర్పడన్. 107

క. సారస్వతాభిరుచి పెం
పారెను మాధవునియందు భౌతికశాస్త్రా
పారపరిశీలనారతి
మీఱెను నానందునందు మిన్నులుగ నంతన్. 108

సీ. ఆవేశసహృదయతాధ్యాత్మికానంద
సత్యసౌందర్యదర్శనము లొకట
ఆధిభౌతికపదార్థాత్మికతత్త్వాను
శీలనాతార్కికచింత లొకట
నిత్యనూతనకళానిర్నిద్రశోభాప్ర
పూర్ణకావ్యానందపూర మొకట
పరిణామశీలసర్వప్రాణిమోహాన
ప్రకృతిసత్యాన్వేషపరత యొకట
గీ. అంకురప్రాయముగఁ గాన నయ్యె నరయ
మాధవానందులందు; సమస్తజీవ
భావభావితవర్తన లేవిభుండు
సంతరించునో ! యెఱుఁగ నశక్య మెందు. 109

సీ. ముగ్ధభావనలకు మురిపెమ్ము లలవడె,
సాభిలాషములు దృగ్జాల మయ్యెఁ,
బలుకులు నర్మగర్భము లయ్యె, నడకల
గాంభీర్యశోభలు గానఁబడియెఁ
బనులను నాత్మవిశ్వాసంబు తొలుకాడె
మమకార మలమె దేహమున మిన్నుల
సౌందర్యపోషణాసక్తి పెంపొందె న
హంకారదర్పము లలముకొనియె
గీ. యౌవనోదయసమయమం దా కుమారు
లందు విందుగ; జీవితోద్యానశోభఁ
బులకరింప మధూదయముగఁ జెలంగు
పసిమివయసును వెలఁ గట్ట వశమె యెందు. 110

గీ. రమ్యజీవితనాటకరంగమందుఁ
గాలసూత్రధారుఁడు నాట్యకళను జరపు
గమ్యమును జేర్ప భూరిశృంగారపీఠ
రసము లుదయింప దిద్దెఁ బాత్రల సరంగ
వెలసె నవయౌవనప్రభావిలసనములు. 111

వ. మాధవానందులు నూత్నయౌవనోపలక్షితు లై సమోత్సాహదీపితు లై విశ్వవిద్యాలయమ్మునఁ జేర నింక వ్యవధి యుండుట నొక్క-నాఁడు సాగరతీరస్థోద్యానము (ఉద్యానము) నందుఁ గడుప సంకల్పించి తత్తదుచితంబుగ నానందుని జననీజనకుల నివాసభూమి యగు నిచ్ఛాపురమ్మున కరుగ సంకల్పించిన, లక్ష్మీమాలతులును దత్ప్రయాణమ్మునఁ బాల్గొన నుత్సాహమ్ముఁ జూపుఁడు వల్లె యని జననీజనకుల యనుమతిం గొని ధూమశకటాధిరూఢు లై చనిరి. అంత వసంతకాల మ్మేతెంచుఁడు. 112

గీ. తపనురుచి మీాఱెఁ, బ్రాణిసంతతులు నాత
పమున మంగళమందుఁ బ్రేల్చఁబడు గింజ
లట్ల కమలెను; పెందూళ్లి యలరె మింటఁ
జైత్రమాసప్రభంజనాక్రాంతగతిని. 113

క. దినములు నానాఁటికి వృ
ద్ధిని గాంచఁ దొడంగె; ముదురు దేరెను నెండల్;
గన నయ్యో మహేంద్రాచల
మున దనదహనరుచి భయదముగ రేలఁ గడున్. 114

గీ. పగలు వెట్టిగాలులు; రేల మిగుల యుక్క-,
తమియు, బడలిక, తాపము, చెమట, దప్పి,
విసువు, పసిమియు, మిసమిసల్ వెలసెఁ గనఁగఁ
జైత్రమాసప్రశస్తవాసరములందు. 115

గీ. బాలసహకారశాఖికాడోలికలను
గండుకోయిల పల్లవఖాదనమునఁ
గసటు దేరిన గొం తెత్తి విసువు గనక
రాగసాధన మొనరింప సాగె నంత. 116

గీ. వేము తనువెల్లఁ దొడవుగా విరియఁబూసె
జాజి నవపుష్పభూషణోత్తేజి యయ్యె
మల్లి సుకుమారసుమరాశి నుల్లసిల్లె
మధురమధుమాసదివససమాగమమున. 117

క. కుసుమాసవపరిషేవా
రసనిష్యందినిగ మా[illegible] భ్రమరాంగన నా
రసకింజల్కాంతరజః
విసరప్రసవాంగి యగుచు వెలసెను శోభన్. 118

ఉ. చూతము పూపపిందెలను శోభిలి పాపలఁ గన్నతల్లి నాఁ
బ్రీతినిఁ గూర్చె; నిల్వున ధరించిన కాయలసోయగమ్ము ప్ర
ఖ్యాతముగాఁ జెలంగఁ బొటఁగట్టుచు మేల్పసనల్ రహించె; భూ
పాతతి నుల్లసిల్లు నెలజవ్వనిచెల్వము దాల్చె వృక్షముల్. 119

గీ. కర్షకోత్సవదాయి యుగాదినాఁడు
ప్రథమహాలరేఖలు వసుంధరను వికాస
మొందెను; నఖక్షతిం బొలుపొందు యువతి
పొలుపునన్ సర్వజీవసమ్మోహనముగ.

గీ. అక్షరతృతీయనాఁడు సూర్యాతపమున
కోడి సింహాద్రియప్పన్న ఱొమ్ము మంచి
గంధము సలందికొనెఁ కళింగప్రదేశ
పూజితుఁడు గృహదైవము పొలుపు మీఱ. 121

గీ. వెలసె రామలీలోత్సవములు, విలాస
మలరఁ దిరుగాడెఁ గ్రొత్తగా నచ్చుఁ బొడువఁ
బడిన యాఁబోతుగమి; కడుఁ బ్రబల మయ్యెఁ
బెండ్లిబాజాలు మధుమాసవేళలందు. 122

సీ. మొడ నాకి యనురాగ మడరించెఁ గొమ్ముల
గిలిగింత యిడి దున్న గేదె నదిమి
కొనకొమ్ములం గీరె గోముగా జతఁ గూడఁ
గోడెచెల్వఁపెట్టాలఁ గూఁతుమిన్నఁ
దమి రేపఁ గలకూజితము సల్పి చెల్వని
యొరలఁ జంచువునఁ బావురము దువ్వె
ముక్కు ముక్కున రాచి మక్కువ కేకొత్తఁ
బిచ్చుక ముద్దాడెఁ బెంటి నంటి

గీ. పయ్యెదను జార్చి డాచనుఁబంతి నింతి
యవశ యై చూపె ప్రియుని వేఁటాడెఁ గోర్కె-
లిగురుఁ దొడిగి పుష్పించి ఫలింపఁజేయు
సారమధుమాసజీవనావసరములందు. 123

వ. ఆనందమాధవు లక్కన్యారత్నములం గూడి మధూదయావసరసం
దర్శనీయదృశ్యంబుల సమీక్షించుచుఁ దనియునంత నానందుఁడు సహ
చరుల నీక్షించి యి ట్లనియె. 124

క. "బాహుదకు మహేంద్రసుతా
వాహినికిని నడుమఁ బూర్వవననిధిప్రాంత
స్థోహోపారమ్యసము
త్సాహోద్దీపకవిశాలధాత్రీస్థలమున్. 125

క. ఉద్యానము నాఁ బిలుతురు;
చోద్యములకు నెలవు; సృష్టిశోభాకరమున్

హృద్యము రసలుబ్ధుల కగు
సద్యఃఫల మందు నేత్రసాఫల్య మగున్. 126

ఆ. వె. తాళ పూగ నారికే ళామలక కద
ళీమహీజసమితి రామణీయ
కమ్ము లైన చూత కంకేళి నారంగ
పనసవనులు సొగసుఁ బెనుచు నందు. 127

గీ. జీడిమామిడితోఁపులు చేవమిగులు
చౌకతోఁటలు కనువిందు సల్పు రామ
ఫలమును సపోట జామిచెట్టులు విచిత్ర
వర్ణపుష్పితలతలు పెంపారు నందు. 128

గీ. చిదిమి బొ ట్టిడుకొనఁ దగు చెలువ మలరు
నచటిపూఁబోండ్ల వర్ణింప నలవి యగునె
జలధిశీకరమాలికాకలిత మైన
ప్రకృతిజననియనుంగుబాలికలు వారు." 129

క. అనునవసరమున మాధవు
కనులు వెదకె మాలతీముఖంబున నెదరయో
యనుభూతిఁ గోరి; దానిం
గనుఁగొని గిలిగింతఁ గొలుపుకై వడి కాఁగన్. 130

క. తెలియకయె మాలతియు నా
వలనుకుఁ బ్రసరించెఁ జూడ్కి; వడి హృదయపులోఁ
తుల నంటె పరస్పరదృ
ష్టులు పర్వెన్; నూత్నభావసుమములు విరియన్. 131

గీ. అక్షులను ముఖసీమ వక్షోగ్రమందు
దేహవల్లికఁ బ్రసరించు దృష్టి సరయు

గుండె జల్లనఁ గోర్కులు కొసలు సాఁగ
నొడలు పులకించె బాల కయ్యెడను దెలుప. 132

గీ. ధమను లుప్పొంగ సిగ్గుదొంతరలు గ్రమ్మ
నోరకంటను బరికించి వారిజాక్షి
పైఁట సవరించుకొనియె; నా బాల్య మెఱుఁగఁ
బడని స్త్రీత్వపుఁజిన్నె లేర్పడియె నంత. 133

క. "బారువయును నిచ్ఛాపుర
మారమణీయంపుసీమ కగుఁ బరికింపన్
ద్వారములు దక్షిణమునఁ గు
బేరదిశఁ గళింగదేశవిఖ్యాతం బై." 134

క. అని తనధోరణి విడువక
వినిచెడు నానందుఁ గాంచి విస్మితుఁ డై వ
ర్తన బయలుపడమి కెంతయుఁ
గనె మోదము మాధవుండుఁ గడు సిగ్గిలుచున్. 135

క. మాలతి యనురాగశ్రీ
లోలాపాంగముల నతని లోఁతు లరసి క
ల్లోలరహితచిత్తమునన్
గాలోచితముగను స్మితము గదుర నిటు లనెన్. 136

క. "తినఁబోవుచు రుచు లీక్రియఁ
జనునే వర్ణింపఁగ మొగచాటౌ; మ మ్మొ
కనువిం దగు దృశ్యములను
దనియింతువొ ! బావ ! చూడఁ దగు నిఁకమీఁదన్." 137

వ. అనిన నానందుఁడు కరం బుల్లసిల్లి. 138

సీ. "బాహుదాసైకతప్రాంతసంచారమ్ము
కవిటిచెల్వాలసోయగమ్ము, పూగ
నారికే ళామ్ర వృక్షారామ సంపద
కేతకీ కురవకవ్రాతశ్శోభ
బారువాపరిసరసారసాకరదృశ్య
మంబోధివిలసన, మబ్ధివీచి
కావిహారము, తీరకైవర్తమత్స్యసం
పాదనానిపుణత, పల్లిజనుల
గీ. సహజకాపట్యరహితప్రశస్తమధుర
జీవితవిధానములును, హృత్సీమఁ బాదు
కొల్పు నానందలతికలు. గొల్లలుగను
బ్రకృతిసౌందర్యవీక్షాపిపాస తీఱ. 139

ఉ. కావున నేఁటికిఁ బడలికల్ దొలఁగంగను విశ్రమించి రే
పావివిధప్రదేశములయందముఁ గందము విందుఁ గూర్పఁగన్;"
నా విని, మజ్జనాదుల నొనర్చి, భుజించి, వినోదమేదురం
బౌ వచనాళి నుల్లసిలి యందఱు నిద్దురఁ గూరి రేర్పడన్. 140

క. మఱునాఁడు వేఁగుఁబోకఁ
ద్వర మేల్కొని, కాలకృత్యతతిఁ దీర్చి, యం
దఱుఁ జల్దిఁ గుడిచి, వెడలిరి
తరణియరుణరాగరంజితం బగునంతన్. 141

సీ. పిల్లతెమ్మెరలు కొబ్బెరపూవుబాళలఁ
గూరుతావుల మోసికొనుచు మలయ
మేను విదిర్చి తుమ్మెదకూన కనుఱెప్ప
లల్లార్చి తొలిరాగ మాలపింపఁ

బులుఁగుఁగన్నియ గూఁటఁ బల నెత్తి వలపులు
గులుక తియ్యనిగీతికలు రచింప
మల్లిచేడియ యుల్లిమల్లె సాఁని ము
వ్వాలువ మేలిముసుంగు సవరింపఁ

గీ. కలువపూఁబోఁడి పెనుఁజింతఁ గరఁగి వాఁడఁ
బద్మ మోరకంటను గరువము నెఱార్పఁ
బొడుపుమల నెక్కి రాఁగ మేర్పడ విలోక
నముల సారించె రవి మోహనముగ నంత. 142

సీ. పసుపుడాలును బాలభానురుచుల్ గూడి
మిస మిస లాడు నెమ్మేను లలర
తాంబూలరాగముఁ దరుణారుణప్రభల్
బెనచి కెమ్మోవి కావిరులఁ బెనుప
గోకెంటరంగును గువలయాప్తద్యుతి
కలిసి పల్లవహస్త కాంతి తనరఁ
బారాణిజిగియు లేఁబ్రాయంపురవిదీప్తి
గుమిఁగూడి చరణరాగము చెలంగ

గీ. మేలిముసుఁగులు నడినెత్తి జాలువార
లోలమలయానిలావిలచేల లగుచు
బిండెల న్గాని యుత్కళసుందరాంగు
లలర బాహుదానదిఁ గ్రుంకు లాడఁ జనిరి. 143

శా. ఆలోలాక్షులమేనిచెల్వము విలాసాత్యంతలావణ్యముల్
లీలాపాంగవిముగ్ధభావశబలాలేఖ్యాభిజాత్యంబులున్
బాలారత్నము మాలతిం దనిపెఁ; గాపై మాధవాలోకనా
జాలం బామెముఖంబునన్ నిలిచె నిశ్శంకన్ దృషాపూర్ణ మై. 144

గీ. చిన్నితోఁకలు పైకెత్తి వన్నె లలరఁ
దీరతరణికాసంతతిఁ జేరి యుపుత
లందముగ నాడుకొనఁగ బాలాతపమునఁ
జార లలరెను మేల్మిబంగారమట్టులు. 145

ఆ. వె. వెదురుగడను బెంచి వినువీథి దెస ఫణి
రాజవల్లి నిక్కి రాఁగ మలరఁ
బత్రహస్తముల నివాళు లిచ్చెను హిమ
బిందుమౌక్తికముల వేడ్క రవికి. 146

గీ. నవనవానంద మలరఁ గ్రొన్ననలచేతు
లోఁజఁ గర్పూరకదళీమహీజ మూఁచి
యుదయగిరిశృంగశృంగారసదనమందుఁ
గాంతిఁ బ్రసరించు రవికి స్వాగతము నెఱపె. 147

గీ. ప్రచురఘననారికేళాగ్రపత్రరాశి
నంటి ప్రేలాడుగూళ్ల నత్యంతముదము
వెలయ గిజగాడు లూఁగె నుయ్యేలలఁ గలక
లారవజయధ్వనుల్ పొలుపార నంత. 148

సీ. యౌవనపూర్వ బాల్యాపరప్రభవన
వ్యోత్సాహదేహవిద్యుతులు చెలఁగఁ
బ్రాభాతదృశ్యదర్శనలోలసువిశాల
లోచనేందీవరరోచు లలర
మలయానిలస్పర్శ నలకబంభరకేళి
నాలవాలముఖాంబుజాలు వెలయఁ
బ్రకృతిసౌందర్యానుభవజనితానంద
తాదాత్మ్యవాక్యసంతతులు దనర

గీ. వాయసమ్మార్జకుండు శుభ్రముగఁ దుడిచి
రంగవల్లికల్ విరచింప రమ్యముగను
గర్షకగృహాంగణమ్ములకై వడిఁ జెలు
వారు బాహుదాసైకతావనిఁ జక్కి
ణాభిముఖముగా నల్వురు నరిగి రంత. 149

ఉ. కాంచిరి పుష్పపల్లవనికాయసమన్వితవృక్షగుల్మనే
త్రాంచలపర్వనవ్యలతికాంతనిరంతరకుంతకాంతరా
వాంచితగానపూరకకుబంతము; స్వాంత మనంతసమ్ముదా
భ్యంచిత మై వెలంగుఁ బరిభావితనందన మా వసుంధరన్. 150

సీ. శ్రవణపేశలగానరసవసుధాద్రవము జు
బ్బనమూఱఁగాఁ గ్రోలి తనువు మఱచి
చక్షుర్ద్వయీసముత్సాహదృశ్యము మిఱు
మిట్లు గొల్పఁగఁ గాంచి మేను మఱచి
నాసాపుటానందనవ్యసౌరభము ను
క్కిరిబిక్కిరిగఁ బీల్చి పరవశు లయి
చర్మసౌఖ్యదవాయుచాలన చామర
తంప రై మివులఁ జిత్తములఁ జొక్కి

గీ. జిహ్వాసాఫల్యభాషణాశేషభావ
చయము తలమున్క లైనఁ జేష్టలఁ దొఱంగి
సుందరకళింగదేశప్రశోభిత మగు
నిరుపమోద్యానమును గమనించి రంత. 151

సీ. తమలపుటాకుమొత్తముఁ జక్క తనచేతి
యందముతో వానిఁ గ్రిందు వఱచు
నునుకదళీపత్రమును గోసి నిజతను
ప్రభల దానిని నగుబాటు సేయు

పండినదాడిమఫలబీజముల నాత్మ
దంతరోచుల నోంచి చింతఁ గూర్చు
ఏడాకులరఁటుల నీక్షించి యూత్మఘు
నోరుద్యుతిని లజ్జ నొందఁ జేయఁ

గీ. జోఁకపూఁబొత్తు లెనఁగూడ రాక స్వీయ
బావాలను వానిగర్వము భంగపఱచు
సుందరాంగుల నుద్యానమందుఁ గాంచి
సంభ్రమాశ్చర్యములఁ గడుఁ జకితు లైరి. 152

ఉ. ఆలలనాశిఖామణుల యందము, ముగ్ధవిలోలలోచన
శ్రీలుఁ, బసిండిఁ గేరురుచి, చిత్తము నుత్తల మందఁజేయు శం
పాలతికాభహాసములు, పార్వణచంద్రమహోపమానశో
భాలలితాననమ్ము లెదఁ బాయుమి వారలు సంభ్రమంబునన్. 153

చ. చెలములచెంత బొడ్డెలను జెన్నలరారెడు నారుఁ బెంప బి
డ్డెలఁ గొని చెల్మనీరములు పెంపము విందుగఁ జిల్కరించు చె
ల్వల శ్రమవారి దాసివ యపారము తొల్కరిఁ బండి సర్వజీ
వుల కిడు నోగిరం బగుటఁ బున్నెముగాఁ దలపోసి మెచ్చుచున్. 154

చ. నిలువెఁడులోఁతుపుంతపయి నిల్చినవ్రమానున నేతపుంగడన్
జెలువుగఁ బట్టి నిల్చి నునుజెక్కుల మిక్కిలి ఘర్మబిందువుల్
దొలుక జలమ్ము దోడి వడి దోనెను బోసి యనంటితోఁటబో
దెలఁ బ్రవహింపఁజేయు చెలిదేహవిలాసముఁ గాంచి యుబ్బుచున్.

చ. అలకలు ఫాలభాగమున కంపముగాఁ దొలుకాడ గూడచే
రులు చెఱిమొక్క ప్రక్కఁ గొని రోఁజుచు సీరిము తమ్మలంపుఁదీ
వలఁ బనియింపఁ దోషు నెలపాయఁపుకర్షకముగ్ధభామినీ
లలితకచద్వయాచలసలాస్యము వారలు గాంచి వేడుకన్. 156

ఉ. చిమ్మన గూడులన్ జలముఁ జిమ్ముచు నేర్పడఁ జోడియాకులన్
గొమ్మలు పెంచుచెల్వొ మొనగూర్చెను మోదము; చిన్నికూనమొ
త్తమ్ముల దిద్ది తీర్చు టపుడా! యనురాగకృపాతరంగపూ
రమ్ముల మాతృమూర్తులు నిరంతర మోపికఁ బూని వేడుకన్. 157

మ. ఇటు లానల్వురు దృశ్యసంపదలఁ బ్రేక్షించుచున్ జేరి రం
తటఁ బుష్పాసవపానబంభరగణానందోరుసంగీతసం
పుటి, నేత్రోత్సవశాద్వలస్థలచలత్పుణ్యాంగనాధేనుసం
ఘటి, నుద్యానవనీవిభూషఁ గవిటిన్, గానానుమోదార్భటిన్. 158

క. ఆ పల్లియ పరిసరశో
భాపరిపూర్ణప్రకృతిని బరికించి ప్రహ
ర్షాపాదకదృగ్వీచిక
లేపార విహారపుబడలిక తీఱఁగన్. 159

గీ. విశ్రమార్థప్రదేశమ్ము వెదకి నెంచి
ముఖ్యవీథిని జనఁగ నబ్బురము గొలుపు
వారి యాకార గుణ శీల వస్త్ర వైఖ
రులను గమనించి యున్నతకులజులుగను
దలఁచి వృద్ధుఁ డొక్కరుఁడు వారలను నిలిపి. 160

క. కుల గోత్ర నామధేయా
దులను విచారించి ముదము తొలుకఁగ నవ్వా
రలఁ దనయింటికిఁ గొని చని
పలువిధముల నుపచరించి పలికె నిటువలెన్. 161

గీ. “కూర్మినాయఁడు నాపేరు; పేర్మి నించు
చిన్నికూనలు మీరలు నన్నెఱుంగి;
రేనుఁ బ్రాంతగ్రాములను బాగుగా నెఱుఁగుదు;
మనకులమ్మున దివ్వెకంబాలు వారు. 162

గీ. కాకచే నైన నొక చిన్నకబురు సేయ
రాదె? మీ కర్షమైన యేర్పాటు లన్ని
కండ్ల నద్దుక సేయనే? కాలమహిమఁ
బ్రాఁతచుట్టాలమే వెలిఁ బడితి మిఁటులు." 163

శా. ఆ సమ్మానపురస్సరంబు లగు ప్రేమాలాపముల్ నాతిఘే
యాసత్కారపరంపరం దనిసి "యూహింపంగ లే దిందు రాఁ
గా, స్పష్ట్యద్భుతదృశ్యవీక్షణసమాకాంక్షం బ్రయాణించి యీ
మీసౌజన్యముఁ జూచులాడితిమి కూర్మిం గూరి భాగ్యంబునన్." 164

క. అను మాధవు వినయోక్తులఁ
దనిసి యతఁడు "సింగపుంగొదమ లాఘవమున్
గను టబ్బురంబె? మలయజ
మున శైత్యము నైజముగనె పొడము" నటంచున్. 165

గీ. "చిన్నమాట; మాయింటను నన్నముఁ దిన
మీ కసమ్మతి లేకున్న మేలు, ముసలి
ప్రాణ మెంతయో పరితోషపడును; నైన
జే జగన్నాధ మింగ్లీషు చేసెఁ గాదె! 166

గీ. ఎన్నఁ డబ్బును మీబోంట్ల నన్నపాన
ములను దనియించుభాగ్యము; ముద్దుఁ గూర్చు
మీమొగమ్ములు గనిన నా కేమి పాలు
పోవకున్నది; కా దనఁబోకుఁ" డనిన. 167

వ. మాధవుం డానందలక్ష్మీమాలతులఁ జెఱుక వ్వారలయ సభిప్రాయ గర్భిత దృఙ్మాలాజాలమ్ములఁ గప్పి, ప్రతివీక్షణాభిప్రాయమ్ములఁ గండ్లం జదివి, యమ్మానసీయునకు సమ్మానంబు వెలయ గుట్టుగ నిట్టు లనియె. 168

శా. "అయ్యా! పూజ్యులు తాము; మమ్ముఁ గడు సవ్యాజానురాగంబుమై
నెయ్యం బేర్పడ నాదరించితిరి; సుస్నేహమ్ము సంధిల్లె; మా
కియ్యారణ్ గడుఁ బ్రొద్దు నిల్వఁ జన దిం కెన్నెన్నియో సీమలం
దియ్యుద్యానముఁ జూడఁగావలయు; మన్నింపంగఁ గైమోడ్చెదన్.

క. కులశాఖాభేదంబులఁ
దలఁచి యిటులు తప్పుకొనువిధం బని యెంచన్
వలదు; ప్రయాణాంతరమున
మలయఁ దలఁపు లేమి నంటి, మన్నింపఁ దగున్. 170

క. వర్ణాంతోద్వాహోద్యమ
పూర్ణం బగు నేఁటికాలమునఁ గుల శాఖా
శీర్ణవిభేదము లెంచుట
యర్ణవమును దోడ గూడ లరయుట కాదే! 171

క. తా మన్యముగాఁ దలఁపకుఁ
డేము తిరస్కారబుద్ధి నిటు సల్పితి మం
చో మహనీయగుణాఢ్యా!
మామనవిని నాదరింపుమా!" యను నంతన్. 172

గీ. విన్నవోవు వృద్ధునిఁ గాంచి వినయ మలర
"నన్న! ప్రొద్దు వాటారె, నీనాఁటి కిచట
నైన నిలువఁగ వలయు, స్నేహాభిమాన
పూరితులకోర్కెఁ బోఁ ద్రోయఁ బోల దిప్పు"
డనెడు నానందుఁ గాంచి నెయ్యమ్ము దోఁప. 173

గీ. "మూఁడు పువు లాఱు కాయ లై పొలుపుఁ గనెదు;
కడుపుచల్లనిమాటను నుడివి తీవు;
మీరు మాయింట నిలువక దారిఁ బట్ట

నెత్తిపై నాకు వెండ్రుకల్ నిలుచు టెట్లు?
సాటివారలలో నగుబాటు కాదె?" 174

వ. అని యావృద్ధుఁడు సముత్సాహదీపితవదనుండై మాధవునాననం
బున దృష్టి నిలిపిన, నాతండు స్మితప్రభాసితముఖుండై తనయంగీ
కృతి నెఱింగించె; నంత ముఖశాలాంతర్ద్వారమున. 175

సీ. క్రొక్కారుమిసమిసల్ కుందనమ్మునఁ గూర్చు
లీల దేహప్రభాజాల మలర
గండరించినచంద్రకాంతోపలాకృతి
హాసియించు నునుదేహయష్టి తనర
సానఁబట్టిన మేలుజాతినీలపుధగ
ద్ధగ లీను పెన్నెఱి సొగసుఁ గుల్క
తెలిదమ్మిఱేకులచెలువమ్ము దిగఁదోఁడు
సోగకన్నులు వింత సొబగు లీనఁ

గీ. పైఁటపరికిణి ఱైక దృక్పర్వ మిడఁగ
వయసు తొలిసందె విచ్చిన వనజరాజ
మంగజునిచేతి చూతపుష్పాంబకమ్ము
బాల కాన్పించె నేణశాబకము వోలె. 176

గీ. నూతనాగతు లను శంక, తాత యచటఁ
గలఁడుగా యను చనవును, గవలఁ బోలు
యువకు లున్నా రనెడి సిగ్గు, నువిద లిర్వు
రుండి రను దిటవును గ్రమ్మ నొక్కమొగిని
బాల యుక్కిరిబిక్కిరై డీలు వడియె. 177

శా. ఆలావణ్యవిలాసరాశిఁ గని, నేత్రానందసంధాయకం
బీలోలాక్షిమనోజ్ఞరూపము బళీ! యీముగ్ధసౌందర్యరే

ఖాలాలిత్యగుణాభిజాత్యముల నేకంజాక్షి యీ షౌను ? మే
త్మే లీతన్విని జూడఁగల్గు టవి కూర్మిన్ గూడి నూత్నాగతుల్. 178

గీ. ఉత్సుకత తోఁప దృగ్వల్లు లొసర మూదుకఁ
బెనవ, నాతండు చేసన్నఁ బిలిచె బాలఁ
జకితనేత్ర యై రాజహంసమ్ము వోలె
నటకుఁ జనుదెంచు నాసుందరాంగి జూసి. 179

వ. అతిథుల నుద్దేశించి యి ట్లనియె. 180

క. దౌహిత్రి, పితృవిరహిత, స
దాహితకార్యరత, మద్హృదయరమ, పుత్రీ
మోహమ్ము నపుత్రత్వము
నీహారిశాక్షి నునిచె జననీసహిత నిటన్. 181

సీ. రాధ నాఁబడు, విశారద రాష్ట్రభాషను,
నింగ్లీషుతోడ నీయేఁట నెనిమి
దవ 'క్లాసు' గెలుపొందె, నవలీలగా నీమె
యాంధ్రామరములను నప్పగింపఁ
గలదు, పురాణము గడగడఁ జదువ స
మర్థ, మొన్నన్న నే మనుచరిత్రఁ
జదువఁ బట్టెను వ్యాఖ్యసహితమ్ముగా, నుంత
సంగీతమునఁ బ్రవేశమ్ము గలదు

గీ. కొడుకులుం గూఁతు లీమె యై కూర్చు ముదము,
నుభయవంశమ్ములకుఁ గుదు రొనర నీమె,
యీనిసుంగె మా జీవితోద్యానవాటి
నలరఁజేయు మధూదయ మై చెలంగు. 182

వ. పిదప నతిథులఁ బరిచయ మొనర్చ నెంచి దౌహిత్రిఁ గాంచి. 183

క. వీ రుద్యానవనీసం
చారాభిరతుల్, ప్రసిద్ధచరితులు, సారా
చారులు, మనకులజులు, దగ
బారువ పరిసరముఁ జూడఁ బయనించి యిటన్. 184

క. మనభాగ్యవిశేషంబున
ననుఁ దనుపఁగ నియ్యకొనిరి నా నంతట, వం
దన మొనరిచె రాధ కషున్
వినయావనతాంగి యగుచు వేడ్కఁ దగన్. 185

క. ప్రతివందనములు గొని యా
తతసంప్రీతి నిరుకేలఁ దగ లక్ష్మమ్మా
లతులకరమ్ములు గొనుచు న
వతలిగృహమునఁ గల తల్లిపజ్జకుఁ జేర్పన్. 186

క. ఆనందమాధవుల స్మే
రానన మలరంగ వృద్ధుఁ డంతర్గృహమున్
దా నంతఁ జేర్చి, కూఁతున
కా నల్వురఁ బరిచయమ్ముఁ గావించెఁ దగన్. 187

గీ. అరమరిక లేని కూరిమ సంతలోన
క్షీరనీరమ్ము లట్లుఁ జెన్నారునట్టి
బిడ్డలను గాంచి వృద్ధుఁడు ప్రీతి గదురఁ
దలఁచె నెదను బూర్వానుబంధముగ దాని. 188

మ. అపరాహ్ణంబుననుండి బాలికలు విద్యావాద్యసంగీతకా
వ్యపురాణాదుల నొండొరుల్ పరిచయప్రావీణ్యముల్ గాంచువే
డ్క పరీక్షింపఁదొడంగ స్నేహ మతిగాఢం బయ్యె; “సన్మైత్రి సా
ప్తపదాధీనము” గాదె! చెల్మి యిల నవ్యాజంబ యై తోఁచెడిన్.

గీ. నివురు గప్పిన నిప్పనా నవిరతముగ
వినయవసనావకుంఠనమున నణఁగి
తెలియరానిమాలతిసుధీదీప్తి రాధ
వాక్యసంచయానిలమునఁ బ్రజ్వలించి
సంభ్రమము నించెఁ బ్రేక్షకస్వాంతములను 190

గీ. 'అతిపరిచయాదవజ్ఞ' నా నమితనాహ
చర్యమున గోచరింపని జ్ఞానసంప
దను గనుంగొని యెడను మాధవుఁడు మాల
తీసమాదరపూర్ణుఁడై చేసె వినతి. 191

గీ. బీజనిక్షిప్తశక్తి యుత్తేజ మొంద
నను వయిన ప్రక్రియలు సల్పునట్లు మిత్ర
జనసమాలాపమున రాధ తనరె నవన
వోన్మిషద్జ్ఞానలతిక యబ్బురము గూర్ప. 192

ఆ. వె. కలుపుగోలుతనము, కమనీయహాసము,
వినయగరిమ, బంధుజనసమాద
రము, విశాలదృష్టి సముచితజ్ఞాన
మలరు రాధ కూర్చె యమితముదము 193

కా. ఆలోలేక్షణమోముఁ దమ్మిఁ దిరవై యానందసానందదృ
గ్జాలాపంక్తులు నిల్వ, సంతట యదృచ్ఛావర్తనన్ రాధికా
లీలాపాంగము లాడెసన్ మరల వాక్యన్ రెంటిసంఘర్షణం
బాలో నేర్పడి తాఁకె బాకు లనఁగా నత్యంతగాఢంబుగన్. 194

ఆ. వె. మెఱుఁగుఁదీవ, గర్జ, యురువర్షమును గ్రమ్ము
భంగి దృజ్మరించి, స్పందనాహ్లా
దయము, ఘర్మవారి తనరార నంటటఁ
దొల్కరించెఁ బ్రేమ తొట్టతొలుత. 195

గీ. కంప మలరెను, బులకలు గ్రమ్మె నొడల
మంచుతెరలతెఱుంగున మలసె సిగ్గు
దొంతరలు, తలమున్కలై తోఁచెభావ
వీచికాపరంపర, తమి రేఁచె మరుఁడు. 196

గీ. సాహసము, నవిచారము, సజ్జనాప
చారము నమాన్య మని బుద్ధి సందడింప
మనము రాధికాహృదయశోధనకుఁ గడఁగె,
నింటఁ జొచ్చి వాసములు లెక్కించుపోల్కి;
నాత్మవర్తన మరసి యానందుఁ డంత. 197

గీ. చూపు వృద్ధునిపై నిల్పి సాపరాధుఁ
డను క్షమించుఁడు, లౌల్య మబ్బెను ననంగఁ
జూచె; ముదుకఁడు సాశ్రువిలోచనముల
మాలతిఁ గాంచు టెఱిఁగి సంబరము గనియె. 198

గీ. రాధ కడగంటఁ దనదువర్తనము నరయు
టెఱిఁగి, యభిమాన మొక్కింత పెరుఁగ, మగత
నంపుగరువ మేర్పడ నామె మురపఁ దొడరె
నంత నానందుఁ డెలమి దృగంబకముల. 199

గీ. ఒరయు, వెనుదీయు, నలుదెస లరయు, మరలఁ
దారసిలుఁ, బెనవైచును, మీఱు నొక్క
దాని నొక్కటి, శాంతించుఁ, బూను చౌర్య
వృత్తి వారల సాశంకదృష్టు లంత. 200

గీ. లక్ష్మిచిత్తము కావ్యకళావిమర్శ,
మాలతీహృది రాధవాక్యాళి, వృద్ధ
మాధవులమొదల్ మాలతీమహితలోక
విజ్ఞతను జొక్క, నొండొరుల్ విరతి లేక

సాభిలాష దృగ్యుద్ధము సల్పి రంత
రాధి కాసందు లత్యనురాగ మలరఁ;
గ్రాఁగి పొంగులు వారు దుగ్ధంబుపోల్కి
చెలు వలరు నూత్నయౌవనశ్రీసమృద్ధి. 201

శా. భావావేశరసైకలుబ్ధశవచఃప్రాగల్భ్యముల్ మాలతిన్,
భావోత్తేజకళానుశీలనవినూత్నప్రాభవాల్ రాధఁ, గా
థావిజ్ఞానదిదృక్షు లక్ష్మి, నలరన్ దద్వైఖరుల్ మాధవుం
డావిష్కార మొనర్చెఁ జిత్తమునఁ బ్రత్యగ్రంబు శోధింపుచున్. 202

సీ. ఎగదువ్వఁబడి నొక్కులుగ నైల్యదీధితు
లలరించు 'క్రాపు' సోయగముఁ దలఁచుఁ
గొట్టవచ్చెడి కంటికోనలందునఁ దళ
త్తళ లీను మగసిరి చెలువ మెంచు
రేఖాసమాంతరత్రితయసౌందర్యదీ
పితకంఠ మనురక్తిఁ బెంపఁ జూచుఁ
బీనోన్నతవిశాలమాననీయోరఃప్ర
దేశగాంభీర్యంబు నాశఁ గాంచు

గీ. మెలిఁ దిరిగి కండరములు దుస్తులను వెలికిఁ
గానసగు దీర్ఘబాహాయుగంబును గను
సర్వ మానందమయ మయి స్వాంత మలర
రాధ నూత్నానురాగాంకురము జనింప. 203

సీ. కలకంఠకంఠనిర్గతకలాలాపాను
కారికంఠస్వరగతులఁ జొక్కి
కేకిపింఛప్రాంచదాకార కేశను
ఖిచ్ఛాక్షిఘాత్యష్టలోచనుఁ డయి

కమలకుట్మలగర్భరమణీయపత్రసం
కాశనేత్రవిలాసగరిమఁ దనిసి
సందర్శమాత్రఁ బ్రేక్షకసమాదరపాత్ర
నవ్యలావణ్యాగణ్యతను సోలి

గీ. హృదయబాహ్యాంతరముల నభ్యుదయ మొందు
రాధఁ బొడఁగాంచి యానందరాజ్యభద్ర
పీఠికాధిష్ఠుఁ డై లోకవృత్త మెఱుఁగఁ
డయ్యె నానందుఁ డంత నూత్నానుభూతి. 204

ఉ. లాంతరు చేతఁ బట్టి సవిలాసముగాఁ జనుదెంచు కూఁతుఁ దా
నంతటఁ జూచి వృద్ధుఁ డిడి యంజలి దివ్వెకు, "నాలప్రొద్దు, చా
లింతము గోష్ఠి, మీర లిఁక లేవఁదగున్, మలయానిలంబు సే
వింతము, రం" డటంచుఁ గడువేడుకఁ గుఱ్ఱలఁ గొంచుఁ బోవఁగన్.

గీ. ఒండొరులగోత్రము లెఱింగి యొకరి నొకరు
వావివరుసలు నెఱపిరి; పాలు నీరుఁ
జేరువడువున నెదలు చెన్నారె నొక్క
టగుచు; ముగ్గురు బాలిక లంతలోన. 206

గీ. అక్క యయ్యె మాలతి రాధ కంత నేక
గోత్రసంభవు లగుటను; గూర్మి నించు
మఱఁదలుగ మాఱె లక్ష్మి; నర్మానురాగ
భాషణలు మీఱెఁ, జనవు పెంపారె మిత్రుల. 207

గీ. జనని సంగడికత్తెలు సానురాగ
మున నొనర్చిన సంభాషలను గ్రహించె
మాధవాంకిత యయ్యెను మాలతి యని,
కన్య నన్య నెవ్వతె నానఁ గట్టియుండ
మియును నానందునకు, రాధ మెలఁకువగను. 208

గీ. "బ్రతుకు జీవుఁడా! యింతవుఁ; బరులసొత్తుఁ
గోరి యగచాట్లఁ బొందమి కొంత మేలు;
నుదుటివ్రాఁత యెట్లున్నదో! యదియుఁ గాక
పెద్దయడ్డంకి యంతర్విభేద మగును,"
ననుచుఁ జింతించె నెద రాధ యంత వంత. 209

క. "కోరిన వన్నియు నెటఁ జే
కూరును! నింతకును జూచుకొన్నంతనె నా
పేరాస గాక యతఁ జే
తీరున వరుఁ డౌనుఁ? గడ్డి తినె బుద్ధి కటా! 210

క. ఏకన్నియ యీతని మదిఁ
జేకొనెనో మున్ను? పురుషచిత్తం బగుటన్
నా కేసి సాభిలాషను
నీకరణిన్ జూచి యుండు నేమో యెఱుఁగన్. 211

గీ. భాగ్యవశమున నతఁడు న న్వలచునేని
ధన్య నగుదును; కాని సాధ్యంబె యతని
చెట్టఁ బట్టి సుఖించుట? యెట్టు లీస
మాజశాసనమును దాఁటి మనుట జరుగు. 212

క. ఒకపరి చూచుటతోనే
వికలం బయ్యెను మనంబు; విధిచెయ్దని నా
సుకుమారుఁ బొందు భాగ్యం
బిఁక లేనియెడన్ సహింతు నే క్రియ భావిన్." 213

గీ. అని తలఁచుచుఁ బరధ్యాన యైన రాధఁ
బరిహాసించెను లక్ష్మి "మా వదినగారు
వరునికై చింతఁ గూరి రిప్పగిది" ననుచుఁ;
బుచ్చకాయలదొంగ నా భుజము తడువు

కొనెడివడువున రాధ లోగుట్టు రచ్చ
కెక్కనేమో! యటంచు గ్రుక్కిళులు మ్రింగి
కొనుచు నుక్కిరిబిక్కిరై గొబ్బున నొక
వెకిలినవ్వు జవాబుగా వెలయఁజేసి. 214

గీ. "ఆఁడుబిడ్డలు సామాన్యలా తలఁపఁ
బంది నందిగఁ జేయు నేర్పరులు, మగని
మగువనుంగూడ శాసింపఁ దగుదురు గద!
ఒంటిబ్రతుకు కెట్లు నెట్టంగ నోపుదాన. 215

క. మీయానందమె యగుఁ గద
మా యానందమ్ము పెక్కుమాట లిఁ కేలా?
చేయుఁడు మీ నచ్చిన యొక
మాయావి కొసంగి పెండ్లి మఱఁదలుగారూ!" 216

వ. అనుడు నయ్యువిద లెల్లరు గొల్లున నగిరి. లక్ష్మి ప్రహసితానన యై
రాధ వీఁపు తట్టి— 217

గీ. మేలు మేలు; మా యానందు కేలు పట్టఁ
గోరుచుంటిరా? మీ చమత్కార మింకఁ
గట్టిపెట్టుఁ డాతండు శృంగారవిముఖుఁ
డింక లోకంపుఁ బోకడ లెఱుఁగఁ" డనిన. 218

వ. రాధ నిజమధురాకాంతిపూర్ణహాసమ్ము విశదమ్ముగా నీయక లక్ష్మి నోటిని దన వలపలికరమ్మున మూసి "మీనోట రత్నాలు గురియుచున్నవి. వానిని పరాయింటఁ గ్రుమ్మరింపఁ జనదు. మీవలపుకాని కలుములపంటగా మీ యింటఁ గ్రుమ్మరింప నంపుఁడు. మీవలె మీ యన్నలుంగూడ లోకంపుఁబోకడ లెఱుంగరు. వ్రేలుఁ జూప మండ మ్రింగు నమాయుకులు. ఎవ్వరేని విన్న నగిపోయెదరు. మాయక్క—

నొక్కించు లోఁగొన, వేఱొక్క చక్కనిచుక్కకై మీ రురులొడ్డ నింతదవ్వున కేతెంచితిరా?" యని విజిగఁబడి నవ్వ, మాలతి మురి మురినగవులు నగుచు సాభిప్రాయమ్ముగా రాధికాజననిం జూచుఁడు నానందబాష్పార్ద్రనేత్ర యై యామె "గృహదీప మొకబిడ్డ యందురు. అట్టియెడ నేవురుబిడ్డల కిర వైన యింటిశోభ వర్ణనాతీతము గదా!" యని వారిని విషయాంతరమ్మునఁ బ్రవర్తింపఁ జేయు మాలతి తదీ యేంగితమ్ము నెఱింగి "పిన్నీ! మమ్మెల్లర నీపోషణమునం దుంచు కొనుము. నీవాత్సల్యమును దాతగారి యనురాగమ్మును దీఱు" నన నామె "యమ్మా! నా యంతరాత్మ మీ రాత్మీయు లని మిమ్ముఁ జూచి నప్పటినుండియే యుద్ఘోషించుచున్నది. అదృష్ట మున్న మీ యాద రాభిమానములకు దూరము కాఁజాలము గదా!" యనెను. 219

గీ. అంతలోఁ గుమారద్వయ మనుసరింపఁ
గూర్మినాయకుఁ డరుదేర గొబ్బున జల
కలశము లొసంగి కాలుసేతులు గడుగఁ దు
వాలు నిడి వారలకు గౌరవమ్ము నెఱపె
వేంకమాంబిక యాచారవిధిఁ గడువక. 220

క. క్షీరాబ్ధిపట్టుపంచలు
గూరిమిఁ గూర్మయి యొసంగఁ గొని తమదుస్తుల్
వేఱుగదిఁ జేరి, వీడి, కు
మారులు ధరియించి ముదము మల్లడి గొనఁగన్. 221

ఉ. ఆతనిఁ గూడి భోజనగృహమ్మును జేరఁగ, రుచ్యభోజనో
పేతము లైన యాకులను బేరిమి ముం దిడి వారి నేర్పడన్
మాతవిధాన వేంకమ సమాదరవృత్తి భుజింపఁ జేసె, రా
ధాతరళాక్షి వీవనను దాల్చి వినీతిని వీవ నర్తిఁకన్. 222

గీ. అభిమతమ్ముల నరయుచు వంత వంత
బిడియ ముడిపి వంటకముల నిడుచుఁ గొసరి
కొసరి తినిపించెఁ బెండ్లివారి కొంప యనెడు
భావము స్ఫురింపనీక యబ్బాలికలను. 223

గీ. నాయకుఁడును బ్రేమ మోదసంభాయక మగు
స్వానుభవమును దెల్పుచు, వారి నుల్ల
సిల్లఁ జేయుచు భుజియింప సిగ్గు తగద
టంచు నాత్మీయతను బచరింప మిత్రుల. 224

గీ. ఓరగంటను నానందు నొడలిసారు
భోజన మొనర్చుతీరును ముదము గదుర
నరయు రాధికాదృష్టుల నప్పటపటఁ
దారసిలెను నానందు శృంగారదృష్టి. 225

గీ. ఉచితరీతిని బ్రియభాషణోత్సుకతల
నలరఁ జేయుచు సంతృప్తి వెలయ భోజ
నము ముగించిరి; రాధ సీరమును బోయఁ
గడుగుకొనిరి కరమ్ము లేర్పడఁగ వారు. 226

శా. ధారాపాతముగా జలంబు విడువన్ దద్వారిఁ జేఁబట్టుచో
ధారాపూర్వముగా నొసంగెఁ దనచిత్తం బంచు భావించి, రా
ధారాజ్యేందిర కైవసం బగుటచే ధన్యంబు జన్మంబు, నా
కేదీ సాటి యటంచు సంతసిలెఁ దా నింపార నానందుఁడున్. 227

మ. కలకాలం బిటులే త్వదీయరజనీకాంతోపమానాస్యరో
చుల నాకృష్టసమగ్రచిత్త నగుదున్, శుద్ధోదధారాదృశా
మలరాగామృతధార పొందు; నిదె స్వామ్యం బైతి, న న్నింక నీ
వ్వలకేలం గొను మన్నచందమున భావావేశ యై రాధయున్. 228

క. ఆనందుఁడు తను పెఱుఁగక
తా నటనే నిలిచి తొలివిషంబుఁ జల మెం
తో నమ్రతఁ బోయఁ బర
ధ్యానము వేంకమ యొసంగి దరహాసమునన్. 229

శా. అమ్మా! వీడె మొసంగుమా చను మనా, సత్యాకులన్యాంత యై
యిమ్మాటల్ దనగుట్టు రట్టగుట సత్యోరాక్షి యూహించి, "చు
ట్టమ్ముల్ చూచిరో! యంచు తల్లడిలి, కష్టా! యెట్టి చెట్టయ్యె? మో
హ విమ్మాచందముగా నలంచెను, గిరుల్ హాస్యాస్పదం బైతి నే." 230

క. అని తను దూఱుచు మెల్లనఁ
జని, తాంబూలము లొసంగె సవినయలజ్జా
ననమును జంచలదృష్టులు
దనరారఁగ రాధ భావతతి పైఁ గ్రమ్మన్. 231

వ. అనంతరం బయ్యంగనామణు లెల్లరుం గుడిచి రా, నందఱు వివిధమ
ధురప్రసంగమ్ముల నుత్సాహంబు దీపింప నియమితశయ్యాతలమ్ముల
నిద్రింపఁ జేరిరి. 232

శా. పర్యంకమ్మున నుండి మాధవుఁడు సంప్రాప్తానుభావంబులన్
చర్యాస్నేహములన్ బునశ్చరణ స్వస్వాంతంబునన్ సల్పి, మా
ధుర్యం బై చెలువారె నేఁడు, తలఁపన్ దుర్వారబంధుప్రియుల్
ఆర్యుల్ నిర్మలు లీకుటుంబజులు విద్యాసంప్రదాయజ్ఞులున్. 233

క. అని మెచ్చికొనుచు, రాధా
వినయప్రియభాషణముల విద్యాసౌంద
ర్యనవోదయయౌవనములఁ
దనిసి "జననిఁ బుణికిపుట్టెఁ దరుణీమణియున్." 234

సిరులు గురియు నక్షులు, శాంత మురలు మోము,
జిగి మిగులు మేను, నంచలఁ దెగడు నడలు,

పేశలసుధామయోక్తుల రాశి, వాసిఁ
గనును రాధను జేపట్టఁగను ఘనుండు." 234

మ. అని భావించినయంత మాలతి యెదన్ హాసాస్య యై లీలఁ దోఁ
చిన నానందతరంగసంచయసమాశ్లేషాత్మ యై యెంచె ని
ట్లని వైదుష్యవిచక్షణావినయసద్యఃస్ఫూర్తిసౌజన్యధ
న్య నయజ్ఞున్ హృదయాసనంబు నిడి యభ్యర్చింతు నిన్నెప్పుడున్.

క. మాలతి శయ్యాతలమున
నాలోచనవీచికావిహారి యగుచు నా
వేళఁ గనిన యనుభూతుల
హేళిమెయిన్ నెమరు వేయు నవసరమందున్. 237

గీ. చలనచిత్రంపుబొమ్మలవలె నొకొక్క
దృశ్యమును దోఁచి యంతలోఁ దెరమఱుఁగుఁ
జేరి విస్ఫుటమాధవాకారచిత్ర
మాత్మ నిలువఁగఁ బులకాంకురాంగి యగుచు. 233

శా. నాపున్నెమ్ముల బాపె, భావలతికానవ్యాశ్రయారామ, మూ
హాపారమ్యమనోజ్ఞదృశ్య, మురుభాగ్యాయత్తసీమంత, మా
శాపూరార్థవిధిప్రభూతనిధి, సాక్షాత్కార మయ్యెన్ దయన్
నాపుణ్యంబు గణింపఁ బోల దని తా నమ్రాంగి యై మ్రొక్కుచున్.

గీ. కనులు మోడ్చెను బరచింతఁ గ్రమ్మనీక
భావసాహచర్యమున నప్పద్మనేత్ర
తనిసెఁ; బ్రియసమాలింగనమునఁ బరవశ
యైన యెలజవ్వనిం బోలె నతిముదమున. 240

క. శయనించుతఱిని రాగో
దయసంరంభమున భావదావానలసం

శయఝంఝామారుతములు
భయదముగా నుద్భవింప వ్యథ రాధ కడున్. 241

గీ. తలఁచె వ్యగ్రచిత్తమున నిట్టు "లకట! 'ప్రథ
మకబళే మక్షికాపాత' మనెడిరీతి
నంతరాయముఁ బరిహాస మమరె, నమ్మ
యయ్యో, నన్న్యాలు గాంచ నే మగును నేఁడు. 242

గీ. ఎన్నఁ డెఱుఁగని నేను నేఁ డేల బుద్ధి
మాలి యాతనిఁ బరికింపఁ బాలుపడితి?
అతఁడు పనిగట్టుకొని వచ్చినటులు నన్ను
సానురాగదృక్కులను నేచంగ నేల?

ఉ. ఎందఱిఁ జూడలేదు మును పెన్నఁడుఁ జిత్తము సంచలించు టీ
చందము గానరా దతనిస్వాంతము కేవల కామపూరితం
బందున! యంతరాత్మ తగ దంచును నిత్యము హెచ్చరించెడిన్
ఎందుల కీడ్వఁగాఁబడుదు నిందుఁ దగుల్కొని? వ్రాఁత యెట్టిదో.

మ. గోసముల్ శీలవయోనురాగములఁ, జక్షుఃప్రీతిఁ జేకూర్చుమో
హనరూపంబున, జ్ఞానసంపదలఁ దుల్యుం బేరుఁ గాన్పించ, రీ
తని నామానస మాశ్రయించుట కడున్ ధర్మంబె యౌఁ; నైన నీ
తనిఁ జేపట్టుట యభ్రమధ్యగతపద్మాకాంక్ష యౌ నెంచఁగన్. 245

గీ. ఎదను నిబ్బర మూనెద నెట్లు? ముందు
నున్నది ముసళ్లపండుగ, యెన్నికష్ట
నష్టముల కోర్చి యైన నానందు హృదయ
నాథుఁగాఁ జేసికొందు; నున్నతఫలార్థి
కార్యభారము శంకింపఁ గాదు మదిని. 246

గీ. లక్ష్మిపరిహాసమే మనోల్లాస మిడఁగఁ
గాంక్ష ఫలియింపఁ గొంగుబంగార మగుట

కేమికోదువ ? సద్మాలాప మెఱుఁగఁ జేసె
సతని ప్రథమానురాగపాత్రతను గంటి. 247

గీ. పూన్కి—మెయి యత్నమును సల్పఁ బోలు, విషతు
శంక; 'సంశయాత్మావినశ్యతి' యనంగ
వినమె, యనురాగపాశబంధనముఁ గూర్చి
చిత్తచోరుని మానసస్థితు నొనర్తు. 248

మ. విమలప్రేమను నొండొరుల్ మనిస భావిఁ దీర్పఁగాఁ దగ్గ కా
ర్యము గంధర్వులు తీర్తు రాదట; దృఢాత్యంతానురాగం బభే
ద్యముఁ గన్యాజనమానవప్రకవచం బై కల్పభూజంబు నై
యమరుఁ గాదె; యనర్ఘరత్న మిదియే, యాందోళనల్ వ్యర్థముల్.

గీ. నిశి తొలఁగ వీరు పోవ, రోదసిఁ బగుల్చు
నిడుదయూర్పులఁ బుచ్చుచుఁ గమపవలయు
క్షణికరాగ మతండు విస్మరణ సల్పు
నేని వ్యథఁ గూరి యెట్లు జీవించుదానఁ. 250

మ. ఎటులో పెద్దలయాజ్ఞఁ బొంది తగ నాహ్వానచ్చోరు వెన్నంటిపో
వుట కర్జం, బటులైనఁ బ్రేమలతికఁ బోషింప నా కేవు; నే
నిట మోమోటను నిల్వఁగాఁ బురిటిలోనే దయ్యముల్ గొట్టు, నాఁ
కటిబాధల్ సుఖభోగి కేల ? వెఱువంగారాదు లోకమ్ములై." 251

మ. అని కర్తవ్యపరాయణై కమతి నూత్నాశాంకురప్రోద్బలం
బున రాధాప్రసవాంగి జీవితసుధాపూరంబు నానందమో
హానదృగ్దీప్తసుధాకరాననమునఁ సాహ్వాయతం గ్రోలఁగాఁ
జను మార్గంబుఁ దలంచుచున్ బొరలె నాశయ్యాస్థలిన్ వంతలఁ.

ఆ. వె. కనులు మూయుఁ దెఱచుఁ గళవళపడు "రాధ
వలపుఁ బొందఁ గలనొ! చెలియ పరుల

కాన కట్టఁబడెనో!" యను సంశయముల నా
నందుఁ డెంతయు వ్యసనమునఁ జిక్కె. 253

గీ. అంత నాతండు హృదయము నదిమిపట్టి
సంస్కృతిద్యోతకమ్ముఁ గుణాగ్రితుల్య
మైనబుద్ధి నుద్దీపించునట్లు సలిపి
తలఁచెను సమస్య లోఁతుపాతులను నిట్లు. 254

గీ. "మూల నున్న గొడ్డలిఁ దెచ్చి కాలిమీఁద
వైచుకొను వెంగలిగఁ దోఁచె వర్తనమ్ము;
కంటి కిం పైన ముగుద వాల్గంటి యైన
మాత్రమున గంగవెఱ్ఱు లిమ్మాడ్కిఁ దగునె? 255

ఆ. వె. వావివరుస లెఱిఁగి కోవల యోచించి,
గోత్ర మెంచి, యెంచుకొందురి కన్య;
నింతచదువుఁ జదివి యి ట్లైతి నపహాస్య
భాజనుండ స్వార్థపరుఁడ నైతి. 256

గీ. సమయమున కుపయోగింపఁజాలని చదు
వున్న లేకున్న నేమి? లోనున్న హృదయ
లౌల్యమునఁ గీర్తిమూర్తు లమూల్యసాధు
వర్తనుల కెగ్గు సల్పినవాఁడ నైతి. 257

శా. లౌల్యం బెట్లగుఁ గాంచ నెందఱను బాల్యంబాదిగా నేను సౌ
శీల్యాకారగుణాభిజాత్యలను; రాజీవాననారత్న మి
క్కల్యాణీదృశ యన్నభావ మిపుడే కల్గన్ గతం బేమి? సా
కల్యం బత్తుల కిచ్చుటన్ బాడమె; రాగాంకూర మా నెంచఁగన్. 258

గీ. నిశితకంటకాకీర్ణ మైన నిరుపమాన
సౌరభముఁ జిమ్మెడి గులాబి చంద మయ్యెఁ

గతిసశాఖావిభేదసంఘప్రవృద్ధ
మూఢవిశ్వాసపరివేష్టమోహానాంగి. 259

శా. గుల్మాగ్రస్థితపుష్పమున్ గొనఁగ యత్నుల్ గాంతు సారించుచున్
బల్మాఱుల్ దిరుగాడఁగా నొసఁగు లాభం బేమి? యేణాక్షితోఁ
జెల్మిన్ బెంచి, తదీప్సితం బెఱిఁగి సుస్నిగ్ధానురాగంబు నా
శ ల్మిఅంగను వృద్ధి సేయఁదగు విశ్వాసంబు సంధిల్లఁగన్. 260

గీ. దొంగచూపుల నామె నిజేంగితమును
తెలియఁజేసెను గాదె! విధిప్రసాద
సమాచరినిగాఁ దలంపఁగఁ జనును రాధ;
ప్రేమబీజము నాఁట నీసీమఁ జేర్చె
నాపురాకృతభూరిపుణ్యంబె నన్ను. 261

చ. పరిచయమాత్ర నీమె నెడఁబాయఁగరా దెటులైనఁ బ్రేమపం
జరమునఁ జిక్కఁబట్టి యొలజవ్వని మానసకీరరాజ మా
దరమునఁ గొంచుఁబోవఁదగుఁ దప్పదు, పిమ్మట విఘ్ననిఘ్న మే
కరణినొ సల్పి జీవితసుఖంబును బొందఁదగున్ గ్రమంబునన్." 262

మ. అనుచున్ దుర్గమభావికార్యగతి నయ్యానందుఁ డూహింప, రా
ధ నవోత్తేజమనోజ్ఞభావముఖచిత్రం బాత్మఁ దోఁపన్, నిశీ
థిని వెల్గింప విహాయసాంచలమునన్ దీపించు శీతాంశుఁ డా
నని సానందముగా నొసంగె నెద సమ్యగ్భావపుష్పాంజలిన్. 263

మ. గృహిణీలోకశిరోవతంసమ! జగత్ క్షేమార్థగార్హస్థ్యధూ
ర్వహామర్మజ్ఞ! శ్రుతిస్మృతిగ్రథితధర్మప్రేష్యవృత్తా! యశో
వహానీరంధ్రజితేంద్రియప్రణుతభావా! సేవితానేకస
న్మహిళాసంఘ! సతీమతల్లి! జననీ! మాన్యాకృతీ! చిన్నమా! 264



శ్రీమన్మాతాపితృభ్యాం నమః

# మధూదయము

## చతుర్థాశ్వాసము



వత్ససగోత్రా! ధ
ర్మావనతత్పర! శమకుమాదికగుణ: వి
ద్యావినయవివేకనయ
జ్ఞా! వినమితచిన్నమాంబ! సన్నుతచరితా! 1

వ. అవధరింపుఁడు. 2

క. పరిభావితపూర్ణసుధా
కరబింబముఖీ! ప్రశాంతగంభీరదయా
దరహాసపూరితాక్షీ
స్ఫురదరవిందదళ! యన్నపూర్ణా! వినుమా! 3

వ. అనంతరం బారేయి గడువఁ, బ్రాతఃకాలంబున సముద్దీపితనూతనోత్సాహులై సాగరతీరంబునకుం జనఁ గోరిక లీరిక లెత్తఁ గాలకృత్యంబులఁ దీర్చి, తటాకవారిఁ గ్రుంకు లాడి, సజ్జపకాళిందిని, ప్రయాణోచితవస్త్రవిరచితసమాకర్షణీయాకారులై తత్తదుచితోపహారమ్ములను, బాసీయమ్ములను, జేతిసంచులను సవరించుకొను నవసరమ్మున, రాధ నిజజననీకరం బనురక్తిమెయిం బట్టి, గొందిలోనికిం దోడ్కొని పోయి, "యమ్మా! నేనును వారిఁగూడి బారువాపరిసరశోభల నరసి తిరుగ వారిం దోడ్కొని వత్తుఁ, గాదనక యనుజ్ఞ

నిమ్మా !” యని సవినయాభిలాషదైన్యంబుల నర్థించుఁడు, వేంక టాంబ యొకింతఁ గొంకి, యంతలోన సముదాయించుకొని, తాత గారికిఁ జెప్పిచూచెద నని, “యయ్యా ! చిన్నమాట” యనుడుఁ, గృహనాయకుఁడు గూఁతు డాసి, “యమ్మా ! పని యేమి ? నా నాము బాలికాభిమతమ్ము నెఱిఁగించి, యనుజ్ఞ నిమ్మా యను భావస్ఫోర కమ్ము లగు చూపులఁ బ్రసరించుఁడు నాతఁ డొక్కింత చలించి తత్క్షణంబ సంబాళించుకొని, “వారియభిమతం బారసి, యనుకూలం బయ్యేనేని యట్లు సలుపం జను” నని తెల్ప, రాధ యుత్సాహదో హాల నై చని మాలతీలక్ష్ములను దనయిరుకరంబులన్ బెనచి యొక్కిం తదవ్వు వారలం గొనిపోయి, “మీర లింత నిర్దయమై యి న న్నిట విడువ నొడఁబడితి రెట్లు ? మీ విహారానందంబున నాకుం బా లొసంగఁ దగదె ? మీ రన్యథా భావింపరేని, యేనును మి మ్మను సరించి, వివిధదర్శనీయప్రదేశమ్ములను మీతోడంగూడఁ జూచి తని యుదు. దాన మనస్నేహమ్మును బలవత్తర మై పెంపొందు. తిరుగఁ జనుదెంచునపుడు నే నిట నాఁగి మిమ్ము సాగనంపుదు. మా యమ్మను దాతను గోర వారు మీ కొంచు తెలుంగున నూహింతు రేమో! యనుసందియంబు నొందిరి” అని శంకోత్కంఠానురాగపూ రితమ్ము లగు చూపులఁ బఱుప, “నమ్మదొంగా! యెంతపన్నా గముఁ బన్నితివే!” యని మాలతియు “భేష్! అగ్గికిం గాలి తోడగు” నని లక్ష్మియు నానందోద్రేకంబునఁ బల్కిరి. పిమ్మట మాలతి “చెల్లీ! నా కీయభిప్రాయమ్ము గలదు; కాని పిన్నియుఁ దాతయు నేమం దురో! యను ననుమానంబున నోరు జాఱ వెఱచుచుంటి. వెదుకఁ బోయినతీవ కాళ్ళఁ దవిలె నన్నట్లు నీవే నా శ్రమ నపనయించితివి; కావునఁ గడమకార్యం బగు బావలయింగితం బెఱుంగ నున్నదిగా ముఱఁదలుపిల్ల” యని లక్ష్మిం గిలిగింత యిడ, నామె “నన్ను

రాయబారిణిఁగా నియోగించితిరా? సరి. సరి. శుభశకునమ్ము లాపన్న
మగుడుఁ బయనించెద నో రిమిఁ బూనుమా చిన్నవదినా!" యని
చిలిపితనం బొలయ రాధను గిల్లి, సవిలాసమ్ముగాఁ జని యన్నల
చెంతఁ జేరి నగుచు, 4

క. మనజట్టుఁ జేర్ప నింకొక
తెను గొనివచ్చితిని; గానఁ దెల్పుఁడు మీ కా
ననియో! కా దనియో! వెం
టనె; క్రొత్తవదెనను నే నిటుఁ బొడఁగంటిన్" 5

గీ. అనఁగ, నవ్వుచు, గుసగుస లాడుకొనెడి
మిముఁ గనుంగొని యూహించితిమి విశేష
మెద్దియో! యని; వల దన నేల? బరువు
మోయవలసిన దేమి మా భుజములందు. 6

క. సిరి రా మోకా లొడ్డెడి
నరుఁ డెవ్వఁడు? రాధ కిదె మనఃపూర్వకమౌ
నిరువురి స్వాగత మని నీ
వెఱిఁగింపవె" యనెడు నన్న లిరువురి నుడులన్. 7

వ. లక్ష్మి రాధ కెఱిఁగించి, ప్రయాణసన్నాహమునకై వేగిరింపఁ, దన
వాంఛ యవలీలగా సఫలం బగుట పరమేశ్వరసంకల్పంబుగా భావించి
హృదయమునం, "వసంతదయాసాగరా! నీయనురాగం బపారం" బని
నమోవాకంబు లొసంగి, బిరబిర నుచితభూషణభూషిత యై రాధ
సంసిద్ధం బగుఁడు, తండ్రు వేంకమాంబాకూర్మినాయకుల యనుమతిం
బడసి, పయనింపఁ గతిపయపదంబు లనిపి "భద్రం" బని హెచ్చరించి,
నాయుఁడును వేంకమయు గృహాభిముఖు లైరి. అంత సేవకుం డొక్క-
రుం డాతురమ్మునఁ దోలుపట్టియ వ్రేలాడు నొకవిచిత్రపెటికను

దెచ్చి "బాబూ! యిది యెద్దియో విడిచి" రన, నది ఛాయాగ్రాహ
కయంత్రంబుగా నెఱింగి నాయం "డోరీ! వాఁని వెనుకకుం బిలువకఁ
బరువెత్తి దీనిని భద్రంబుగా వారి కొసంగునది" అని పనిచిన నాతం
డట్లు సలిపె. అంత మాలతి యాత్మగతంబున నిట్లెంచె. 8

క. "చేతి 'కెమేరా' మఱచెను
నాతురమునఁ జిన్నబావ యాహా! మోహా
పేతుల కెందును సహజము
కాతరచిత్తంబు; యరెది గద! సంయమమున్" 9

వ. అనంతరం బయ్యేవురుఁ జెట్టాపట్టాలు వైచికొని. 10

ఉ. హాళిమెయిన్ సుధామధుర హాసమన్వితు లౌచు స్వేచ్ఛమై
గాలిని దేలియాడు విహగంబులచెల్వునఁ బోవుచున్ దిదృ
క్షాలసనేత్రపర్వ మగు శాద్వలముల్ నవపుష్పసౌరభ
శ్రీలతికావనీజములు చెన్నుగఁ గాంచుచుఁ బోవుచుండఁగన్. 11

శా. కేళీలోలవిచేష్టలున్, వరచలోక్తిప్రౌఢిమున్, హావభా
వాలోకప్రతిభాప్రపన్నతలు, గాఢానందచర్చల్, పురా
ఖీలోద్వేలవిశేషముల్, వివిధసత్ప్రేమానుభూతుల్, ప్రసం
గాళిన్ దోర్లి పరస్పరాత్మలను నేకాగ్రంబుగాఁ గూర్పఁగన్. 12

చ. చని చని బారువాటెసఁ, బ్రశస్తజలాండజసంకులారవం
బును విని, నవ్యపద్మవన భూరిసుగంధము నాసికావళుల్
దనియఁగఁ బీల్చి, మారుతవితానము తాపము లార్ప నంతటన్
గనిరి సరోవరస్థ పరికల్పితలోచనపర్వవీచికల్. 13

మ. సమదేందిందిరసుందరాలక, లసచ్ఛైవాలధమ్మిల్ల, ప
ద్మమనోజ్ఞాస్య, మృణాళబాహ, సితమత్స్యాలోక, కుట్మకృతీ
కుముదోరోజ, విహంగసంఘవిలసత్కోలాహలారావగా
త్ర, మహాజ్జీవనసజ్జీవనం బయి సరస్సన్నాఁగి శోభిల్లఁగన్. 14

మ. కని తచ్ఛోభకు ముగ్ధులై పరవశై కాగ్రస్మనోవృత్తిలో
చనమాత్రేంద్రియసాధనప్రభవవిజ్ఞానానుభావాత్ములై
తనరఁ జిత్రితలోహమూర్తులక్రియన్ దద్రూపముల్ శోభిలెన్;
గను లత్యుత్తమముల్ దశేంద్రియములన్ గావే శరీరంబునన్. 15

సీ. నీరబింబిత తటనారికేళచ్ఛాయ
లలరించువారిదములుగ చెలఁగ
కుముదోత్పలాంభోజసముదయమ్ములు మిన్కు-
లొలయునక్షత్రరాశులుగ వెలుఁగ
నశ్రాంతదృక్ప్రసారాతిక్రమగభీర
వారిపూరము వ్యోమవర్ణ మమర
నుత్ప్లవనాపతనోద్యస్మనోజ్ఞాల్ప
మీనముల్ చెన్నార మించులుగను

గీ. గగనసుందరకాసారభ్రమమూర్తి
నక్షిపర్వ మొనర్ప సమీక్ష సల్పి
దివ్యసౌందర్యపరమావధిగఁ దలంచి
రెద లనిర్వాచ్యమోద మభ్యుదయ మొంద. 16

మ. “కనుఁడీ సుందరసారసాకరము దృక్సాఫల్య మేపార, నెం
దు “న భూతో న భవిష్యతీతి” యన నా తోరంపునీరంపుశో
భను బెంపొందఁగఁ జేయుపక్షులు దలంపన్ డోలిక లూఁగు స్త్రీ
జనమున్ బోలును వీనుదోయి తనియన్ సాకూజితం బై కడున్. 17

వ. అని మాధవుం డెచ్చరికలు బలుక నానందుఁడు ఛాయాగ్రాహకయం
త్రమ్ముతోడ వివిధశృంగారదృశ్యమ్ముల ననేకభంగిమలం దీసె. పడపడి
వార లాబీసనాఁబడు సరోవరోత్తరతీరంబునఁ జనుచుండ నంత. 18

గీ. ఫుల్లకల్హారగంధము గొల్లలాడ
నోడల నంటిన వాని ప్రష్పాదులు వారి

శీకరమ్ముల కర్దమశ్రీ వహింప
జారపురుషులు నా వీచె మారుతములు. 19

సీ. చలదూర్మికాడోలికలఁ దూఁగుచును మద
కలరావములు సల్పు పులుఁగుసమితి
చంచలచంచరీకాంచితసంరంభ
సంభృతశతపత్రషండములును
జలబిందుమౌక్తికతళతళద్ద్యుతులను
రహించు పద్మపత్రములచెలువు
తటచుంబనాతివిస్ఫుటకాంతి నొండొండు
నారయుచుఁ జనుదెంచు తరఁగలగమి

గీ. గర్భనిక్షిప్తకర్దమాగ్రములు దేలు
పడువు నలరారు సాంద్రశైవాలజాల
మనుపమానందమున నోల లాడుచుఁ గని
రెదల భావస్రవంతిక లుదయ మంద. 20

మ. కుముదేందీవరపద్మసంచయములన్ గూలాగ్రభాగంబునన్
భ్రమదావర్గము నిల్చి యుండికొని సంప్రాప్తానుమోదంబునన్
సుమసంపాదన సేయ, రాధ యట నాచుం గూడి తీరప్రదే
శమునం దున్న యగాధవారిఁ గల పుష్పం బందుకో నెంచినన్. 21

గీ. కాలు జాఱి తటాలునఁ గంజనయన
నీటఁ గూలె దబేలున; పాటుఁ గాంచి
కుయ్యో! మొఱ్ఱో! యటంచు గగ్గోలు సెలఁగ
నెదల బాదుకొంచును నేస్తు సుదతులఁ గని. 22

వ. మాధవానందులు సంభ్రమాశ్చర్యచకితు లై పరువెత్తి వెనుకకు
వచ్చుచు దూరమ్మునుండియే ప్రమాదంబు నూహించి యానందుఁ

డతిసాహసభయావేశుఁ డై మార్గమధ్యంబునందే తన దుస్తులు విడ
ల్చివైచి కెమెరాఁ బడవైచి లాగుమాత్రిపసనుఁడై క్రీడార్థము
తటాకంబున దూకుపోల్కి లంఘించి. 23

ఆ. వె. నీట మున్గి, తేలి, బోఁటిని డాచేతఁ
జుట్టి పట్టి నిలుచునట్టు లేఁదు
కొనుచు రాఁగ, భయము గోల్పడి యుపగూహ
నమునఁ దనిసె రాధ యమితముగను. 24

ఆ. వె. అప్రియత్నముగను నమరిన సౌఖ్యము
మానవారుఁడై యెడుట ప్రాణములను
దైవకృతమా గాఁగఁ దలపోసె నెద రాధ;
యంతఁ బ్రేమ ద్విగుణమైై తనర్చె. 25

చ. కడచెఁ బ్రమాద మింక నని కన్నులు చెంపకుఁజేరెఁడై తన
ర్చెడువిధిఁ జూచుచుణ్ ఔమట చిత్తడియగ్గలు జాఱుమోము లే
ర్పడఁ దమచేలచెంగులను వారిజలోచన లంత నొత్తుచున్
విడిచిరి పెద్దయూర్పు లెద వీడఁగ భారము, హాస మొప్పఁగన్. 26

చ. మడుఁగును వీడు సారసమన్వితభద్రగజంబులీల నే
ర్పడరఁగ రాధఁ బట్టి తట మాతఁడు సేర్పఁగ మాధవుండు మ
ల్లడిఁగొనుచిత్త మంతఁ బదిలంబుగ నిల్పి, నిరస్తభీతుఁ డై
యిడెఁ గరుణాపయోధి యగు నీశున కంజలు లాత్మభక్తిమై. 27

గీ. శీర్ణనిటలాలకములు, విశీర్ణ వసన
రచన, వక్షోజసౌందర్యరుచి వెలార్చు
నార్ద్రకంచుక, మతిశయమైన మోహ
రాగసంపద తొలుకాడు రమ్యవదన
యమరు రమణిని తీరనీరమున దింప. 28

గీ. పైఁట సవరించి ముఖవారి పాణిఁ దుడిచి
పోవ నుద్యుక్త యయ్యె నప్పొలఁతి; కేలు
కేలఁ గీలించి యానందుఁ డాలతాంగి
నొడ్డుఁ జేర్చెను నుత్సాహ మొనర నంత. 29

ఉ. ఆ సుకుమారిఁ గాంచి కను నాదర మేర్పడ మాధవుండు "రా
ధా! సుఖవే గదా! కరుణ దైవము చూచుట మేలు చేకురెన్
వీసములో నపాయ ముడిపెన్ బహుసాహసుఁ డౌచుఁ దమ్ముఁ; డా
యాసము దీర్చుకొమ్ము, జన నౌను బదంపడి" యన్న నంతటన్. 30

చ. చెరియొకచేయిఁ బట్టి, పెరచేతుల రాధముఖంబు దుడ్చి, యి
ద్దఱు రమణీమణుల్ గనుల ధారలు గారఁగ, "మారుపుట్టు వీ
తెఱఁగునఁ గంటి పీపుడమిఁ దీరమి నూకలు, నేఁటి ప్రొద్దు ని
ద్దుర కనులం గనుంగొనిన దొడ్డమొగమ్ము ఫలమ్ము పెంపునన్. 31

గీ. గుండె బిబ్బర మధికమ్ము కుదురుకొన్న
దాన వగుటను నీప్రమాదమును దట్టు
కొంటి, వారు లైన భయమునఁ గూరి చత్తు
రెంతయాపదఁ గడచితివే" యటంచు. 32

వ. ఆమె నొకగుల్మపార్శ్వమునకుఁ దోడ్కొనిపోయి, యొడ లొత్తి, పొడిగుడ్డలఁ గట్టించి, కురు లార్చి, చిక్కు లెడల్చి సవరించిరి. అంత నానందుఁడు దన మేను దుడిచికొని దుస్తుల ధరించెఁ, బదంపడి వా రెల్లరు నొక్క శీతలచ్ఛాయాసమన్వితవృక్షమూలమ్మునఁ జేరి ప్రయాణోచితమ్ముగఁ దమతోడఁ గొనివచ్చిన బిస్కత్తులఁ దిని 'ఫ్లాస్కు'ల నున్న యావిరు లెగయు కాఫీని సేవించి వివిధమధురాలాపమ్ములఁ దనియుచు విశ్రమించిరి. అంత— 33

క. కడచిన యనుభవమును న
ప్పుడ కాంచినయట్లు మేనఁ బులకలు గ్రమ్మన్

గడకంటను నానందమునిఁ
బొడఁగనుచు౯ నాథ వినయమును నాతనికి౯. 34

క. కడు శ్రమఁ గూర్చితి మీ కి
య్యెడఁ, బ్రాణ మొసంగినార, లేవతువున మీ
యెడఁదన్ దన్పుదు? మ్రొక్కుల
నిడుదును ఋణ మెల్లఁ దీర్ప నివె చేకొనుఁడీ!" 35

క. అని కేలు మోడ్చు నాథను
ననురాగతరంగితాత్మఁ డై యానందుం
డనునయభాషణ లగ, దే
మొనరిచితిన్ విధిని తక్క యొం డధికంబున్. 36

గీ. ఆపద౯ గన్న శత్రువు నైన నెనరు
దోఁపఁ దోడ్పడవలయు నందురు వివేకి
సముదయము, నిర్మలస్నేహ మమరు నిన్ను
నార్తి నొందినఁ గాపాడు టది ఘనంబె? 37

గీ. ఇంతకును నీవు సుఖ వాట యంతె చాలు;
దైవకృత మిట్లు; నన్నుఁ గర్తవ్యకరణ
మునఁ బ్రశంసింప నేటికి? మన విహార
మిట్లు కలకాలమును నిల్చు స్మృతిపథమున. 38

క. ఉభయకులోద్ధారిణి, వే
యభవము శుభము నెఱుఁగఁబడని యలఁతివయసున౯
బ్రభవించెఁ బ్రాణగొడ్డము
శుభ మయ్యెను దైవకృపను క్షోభ యడంగన్. 39

గీ. నీ నమోవాకములను నే నైనఁ దోఁసి
పుచ్చనేరను; గంపెడు బుడమపంక్తిఁ

జోలు బిడ్డలతల్లివై పాలుపఁ గనుము
మా కనులు చల్లఁబడఁగ నిర్మలచరిత్ర!” 40

చ. అని పరిహాసభంగిమను నాడఁడు హ్రాస్వత మైన కాంక్షలన్
వినిచిన, సిగ్గుఁ గూరి నునుసేవళ చీరెక తెత్తె నాథ వం
చెను ముఖమున్, గిసుక్కున హసించిరి తక్కినవార, లంత నా
తనిఁ గని మేల మాడెడివిధంబున మాలతి పల్కె నేర్పునన్ 41

గీ. సంస్తుతాలి మా చెల్లిని హద్దు మీఱి
పల్కుముల్కుల నొంపఁగా వలదు; చిన్ని
కూన యెదలోనఁ గ్రొంగ్రొత్తకోర్కె లిగురు
లెత్తఁ జేయు జాణతనమ్ము లెఱుఁగఁబడియె. 42

గీ. మంత్రిముసఁ జింతకాయ లేమాడ్కి రాలుఁ?
గోరికల నామెపై రుద్దఁ గోరు టేల?
ప్రాణదాత కొసంగఁగా రాని దేమి?
సూటిగాఁ జోక యేల మోమోట మూన? 43

గీ. ముసుపు గట్టెను మన మెల్ల మొదటిచూపు
లోనె నీకయి యీబేల; లోఁతు లరయ
నేల? కోర్కెలు పండె; బెంబేలు వారు
దేల? యీ వంటయింటికుందేలుఁ గోరి. 44

ఆ. వె. త్రాడు నీవు, బొంగరమ్ము మా చెల్లెలు
నై రటించు వేడ్క నందుచుండ
గోష్ఠదైవ మామెఁ ద్రోచి పీటను నీకు
వశముఁ జేసె; నాత్మబంధు వీవ.” 45

క. అని నర్మోక్తులు పల్కెడి
వనితామణి వచనరచన, పరభావవివే

చన, హితబోధింతు నారసి
మన మానంబునఁ బొక్కె మాధవుఁ డెదలోన్. 46

గీ. అర్వాతమ మీఁతలంపు, వాక్యముల నింతి
చవులు గురియఁగ, ఫలియించు సన్నుతిఁ గను
టబ్బురంబె? గువ్వలజంట యట్ల కనుల
పండువుగ నుండుఁ బ్రోత్సాహ పఱుపఁ దగును, 47

క. అని తలఁచి సిగ్గుపెంపునఁ
దనమోమును వాల్చు రాధ దరహాసాస్యం
బునఁ జూడ్కి నిలిపె మాధవుఁ
డనియెను బరిహాసభాసురాలాపములన్. 48

క. “విన రాదా! ‘శుభస్య శీఘ్రము’
మ్మనఁ బెద్దలనుడిని, రాధ యగు మఱఁదలు; నా
కును సంతసంబె; త్వరగా
మనుగుడుపులు నడపునట్టి మార్గము గనుఁడీ!” 49

గీ. “వదిన నెకసక్కెముల నాడ వలదు, కోప
గించుఁ, జలిపితనంబు చాలించుఁ డింక
నెవరు తక్కువ తిన్నవా రిందు? నిర్వ్య
రిద్ధశీలలు సంకల్పసిద్ధ లైరి. 50

ఆ. వె. గాదెక్రిందియెలుక కావునఁ జేకూరెఁ
జాపక్రిందినీరు చందమొకట
పుట్టుభోగి కేమి పట్టును బోటికై
పాటుపడెడివారి పాటు లెల్ల.” 51

గీ. అనుచు రాధను జూసి “చిన్నమ్మగారు!
పెండ్లిసందడు లిపు డేల పెద్ద లుండ,

మోము నెత్తు:" యటంచు గారాము నూపు
లక్ష్మిఁ బొడఁగాంచి నవ్వి రెల్లరును జెలుల. 52

గీ. "ఆతుర మదేల ? తాళు; నీకై యొకండు
రాకపోవఁ, డక్కఁసు బూనరాదు; మాట
కారిమఱఁదలా ! మా యన్నగారి నేరి
యొకరిఁ జేకూర్ప వదినల మంటి మమ్మ ! 53

క. తుట్టు మనన్ దూ మెత్తుట
వట్టి కదా ! చెవిని నులిపి, వెడఁగుఁదనమ్మున్
గుట్టుతన ముడుపు గడుసరి
కట్టని వెదుకకయ నీవు కుదురుకొనుదువా ? 54

క. తగుముకుత్రాడునఁ గాకయె
పొగ రెక్కిన యాలపోతు బుద్ధినిఁ గన దా
పగిదిని బుస్తెనుగట్టన్
మగనాలై నోటితీట మానుదు వంతన్. 55

గీ. ఇల్లలుకఁ బండు వెట్లగు ? నెంతపెంకి
ఘటమవైనను నీమేలుకై శ్రమించు
బాధ్యతలు మావి యో యాడపడుచ ! యోర్మిఁ
బూను మారాట మొందఁగఁ బోల దమ్మ !" 56

క. అని మాలతి పలుకఁగ న
వ్వెను రాధ మొగంబు నెత్తి, విరఁబూసిన నూ
తనమాలతీలతాశో
భను దెగడు మనోజ్ఞరూపవైభవ మొనయన్. 57

గీ. లక్ష్మి యంతట హాసవిలాసభాసు
రాననమ్మునఁ బలికె "ధైర్యమును బూను

దాస; పెండ్లిండ్లకేరియస్య పియను గాంచ
నయ్యొ; నిమ్మకు నీ కెత్తునటుల నుందు. 58

గీ. కడుపులోఁ జల్ల కదులనికై వడి మఁగ
పురుగు దొరకుఁ, జెప్పు లిఁ కేల నరుగఁ దిరుగఁ
బెద్దలకు ? బుద్ధిఁ గలిగి మా పెద్దవదిన
యడుగులకును మడుగు లొత్తు డెడప కేను." 59

ఆ. వె. అనిన నగుచు రాధ "యక్కా! తలంపు మా
పలుకుతీరు; కూఁతఁ బట్టెఁ బిట్ట;
గరుల నల్లలార్చు గరువంపుపులుఁగున
బంజరమున నిడక బాగుపడదు." 60

వ. అనునవసరమ్మున మాధవప్రేరితుఁ డై యానందుఁ డా కన్నెమిన్నల ఛాయాచిత్రంబులను వారెఱుంగకయె వివిధము లగు తీరులఁ బరిగ్రహించి, "క్రొత్తబిచ్చగాఁడు ప్రొద్దు నెఱుంగఁ డనుపోల్కి మీ ప్రసంగముల కవధి కానరాకున్నది. మరల విరులు సేకరింతురో! సరోవరస్నానము లొనరింతురో! లెం" డని హెచ్చరింప, మాలతి "మెత్తిపోడుపు లేల? పుష్పసంపాదనమును మజ్జనమును నిష్ప్రయోజనములు కాలేదు గదా! చిరకాలస్మరణీయ మై జన్మాంతఫలప్రదమే యయ్యె" ననుచు నాసుందరీమణులను విహారోన్ముఖులఁగా నొనర్చె.

చ. పదపడి వారు సైకతవిభాసితసానుతలస్థదృశ్యసం
పదఁ గని మోద మంది, చని, వాఃకణపూరమరుత్ప్రచారమున్
హృదయవిభేదఘోషణపటీరము, దిగ్వలయాగ్రచుంబన
రసము, నుదగ్రకేళిసకరింగితరంగితవారిము వార్ధితీరమున్. 63

చ. దరిసి, విశాలసైకతతలసుధాధవళోపరిసీమ నేవురుఁ
వరుసగ నిల్చి, మానసవివర్తిసమాకృతిచిత్రితాబ్ధిఫే

కరవిపులక్షకరపఃకల్పితమూర్తికిః గాంచి దేహముల్
మఱచిరి, శిల్పి నిల్పిన సమాకృతులో యన సబ్బురంబునన్. 63

మ. పరిధానాంచలసంచలాంసతలముల్, ప్రాలంబశీలాలకా
పరిశోభాన్వితఫాలభాగములు, భాస్వత్కర్ణతాటంకర
త్నరుచిప్రస్ఫుటగండభాగములు, నుత్కంఠాప్రపూర్ణాక్షులున్
స్ఫురదంభోజముఖంబులున్ జెలఁగ సప్సాబోండ్లు నిశ్చేష్టలై. 65

క. కని, తనివి సనక లోచన
వనజములను ధాత పెద్దవానిని జేయం
డని, పెనువసటను గని భా
వకలను పనియఁగ నెంచి వా రుండంగన్. 65

శా. అనంతం డతిలోకమోహనమనోజ్ఞాకార లా వారలన్
నానాభావపరంపరాసృజనగణ్యస్థాన మా వార్ధినిన్
దా సంతం గొనెఁ జిత్రరూపములు హ్రాస్యం బైన దృశ్యావళిన్
జా నొందం బ్రచురింపఁ బత్రికల నుత్సాహాంతరంగంబునన్. 66

ఉ. మాధవుఁ డబ్ధిరాజపరిమాణగభీరసమున్నతాకృతుల్
దాఁ దలపోయుచున్ బ్రకృతితత్త్వముఁ జింతన సేయఁ దోఁచె దు
ర్బోధ మనంత మై సృజనపోషణనాశనరూపయుక్త మై
యేదియొ సూక్ష్మశక్తి యొకఁ డెల్లజగమ్ముల నావరించుటల్. 67

శా. సీలాభీలవిశాలవారిరుచియున్ నిత్యోగ్రఘోషమ్ము ను
ద్వేలోత్తుంగతరంగపంక్తులును నుర్వీతీరఫేనావళుల్
మాలాంభోదవిమానపంక్తులు చలన్మత్స్యోగ్రసత్త్వాళియున్
ఆలోకించి విచిత్రమౌ నవి భయాహ్లాదంబులన్ గూర్చెడిన్. 68

చ. అని యొడ నెంచి మాధవుఁడు సఖులు మెచ్చ "ప్రభూ! త్వదీయమహా
ఘనత నెఱుఁగనాధనముగా నొడఁగూర్చితి వద్ధి నిట్లు, నీ

వినుతవిచిత్రవర్తన మవేద్య మతీంద్రియ మై తనర్చు, నీ
మనికి నెఱుంగ భ్రాంతు లగు మానవసాధ్యమె యంచు భక్తిమై. 69

చ. కనుఁగొనలన్ బ్రమోదమునఁ గ్రమ్ము బాష్పకణాళి రెప్పదో
యిని జెలువార, లోఁ బొడమి యేచిన హాసమనోజ్ఞవీచికల్
మెసచి ముఖాగ్రసీమ నవవిద్యుతు లొల్క, ఏసీతి బ్రముక్కై, నా
తనిఁ గడగంటఁ గాంచి యెడఁదం గనె మాలతి భూరిహర్షమున్, 70

గీ. సాగరోర్మికాడోలల నూఁగులాడు
తీరకైవర్తనావలబారు లంత
లోచనోత్సవ మొనఁగూర్పఁ జూచి లక్ష్మి
సంభ్రమానందనిర్భరస్వాంత యగుచు. 71

క. అదె చూడుఁడు తూఁగాడుచుఁ
బదిలముగా నొడ్డుఁ జేర వచ్చెడి నౌకల్
కదుపులుగ నీటిపిట్టలు
వదలక వాని వెనువెంట వచ్చెడివిధమున్. 72

మ. అన, నుత్సాహతరంగితాత్మ లయి వా రవ్వాని దర్శింపఁగాఁ
జని రంభోధితరంగమాలికల నశ్రాంతంబుఁ జుంబింప మో
హానసుస్నిగ్ధమనోజ్ఞగండయుగసమ్యక్శోభఁ జెన్నారు లో
చనపర్వం బగు తీరభూమి దరియన్ సోత్కంఠు లై యంతటన్. 73

గీ. పాదముల సోఁకి గౌరవభావ మెఱుఁగఁ
జేసి వెన్వెంట గోతులఁ ద్రోసివేయఁ
జూచు తీరోర్మికావృత్తి గోచరింపఁ
జేసె ధూర్తులవృత్తవిశేష మపుడు. 74

ఆ. వె. తరఁగ లొడ్డుఁ జేరి విఱుగుచు నురగలఁ
గ్రమ్ముచును బ్రమోదగరిమ స్వాగ

తము నొసంగుపోల్కిఁ దటసంస్థితులఁ దమ
పాదములు స్పృశింప బహుముదమున. 75

గీ. అల్లనల్లనఁ జనుచు, జాలరులు నావ
నొడ్డుపట్టుటఁ గాంచి యయ్యుదధిగర్భ
సంపదలఁ గొల్లఁగొనెడి తస్కరులు వీర
లని తలంచిరి విస్మయ మంది వారు. 76

గీ. జాలసంస్థిత మైన మత్స్యాళి నిసుక
తిన్నెఁ జేర్చిన మగలకుఁ దిండి పెట్టు
పల్లెమగనాండ్ర యుపచారభంగిమఁ గన
సంతసము నొంది యేవురు చని దిదృక్షు. 77

వ. వలఁ జిక్కువడి యంతిమనిశ్వాసమును విడిచినవియు, విడుచునవియు
వగు వివిధవర్ణవిరాజిత మగు నామీలఁ దిలకించి రత్నాకరగర్భంబుఁ
జొచ్చి మణిమండిత మగు విత్త మిట్లు గొనివచ్చిరా యను సంది
యంబు వొడమ వేర్వేఱ వాని యాకారసౌందర్యాదులఁ గనుచు.

సీ. మగరాలపతక మీ సొగ సైన చందువ
వైడూర్యభూష యీ పండుమీను
గోమేధికశలాక యీ మీసములరొయ్య
పవడంపుబంతి యివ్వాలుదపీత
పుష్యరాగేష్టి యీ పొలుపొందు సొరచేప
మరకతాభరణ మీ మాగకూన
మాణిక్యరచిత మీ మవ్వంపు నాళువ
ముత్యాలనాశి యీ పొలుచుపొలస

గీ. వార్ధిఁ బొడమిన నీల మీ వంజరమ్ము
వేత్రహస్తుల బెత్త మీ వెలయు టేకి

రజితదంష్ట మీా ములువాడ, రత్నరాశి
యనఁ జనెడి మీాసములఁ జూడుఁ డనుచు వారు. 79

క. ఒండొరులు మీాఱఁగాఁ గను
పండువు నొడఁగూర్చు మీాలఁ బరికించి యెసల్
నిండుకొన ముదము నీశు స
ఖండాద్భుతసృజనశక్తిఁ గని వినమితు లై. 80

గీ. అజ్ఞతాదూషితములు నహంకరణస
మేతములు స్వార్థకల్మషోపేతము లగు
నరుల మానసవృత్తు లీశ్వరు నెఱుంగఁ
గా ననర్హము లని సిగ్గుఁ గనిరి వారు. 81

గీ. భూతలవిచిత్రదృశ్యముల్ ముగ్ధమాన
సుల నొనర్పఁగ, నీలంపుజలధిగర్భ
విస్తృతం బగు నిర్మాణవిభవ మరయఁ
బొడము నానంద మెట్టుల నుడువఁ జనును? 82

వ. అని విస్మయావిష్టు లై వార లాకైవర్తుల నిరాడంబరములును సమా
యకములును నగు జీవితవిధానములను బరిశీలించువా రై. 83

గీ. పుట్టగోచి కుళ్లాయియుఁ బొలుపు మీాఱ
దేహ మిరుగుడిచేవ నాఁ దేజరిల్ల
వేఁటవృత్తాంతమును దనబోఁటి కెఱుఁగఁ
జేయుచుఁ బువ్వుఁ దిను పల్లెచిన్నవాని. 84

గీ. మగని కభిముఖ యాచు గోముగ నొకొక్క-
యుప్పుచేపను నంజుకో నొసఁగుచు నను
రాగముఁ జూపు జాలరి సోగకనుల
నిండుజవ్వని కన్నుల నీటుదనము. 85

గీ. ఉదధి జీవన్మరణముల నూఁగులాడి
మిత్తికోరలఁ బెకలించి మీలఁ దెచ్చి
జీవగాఁ జుట్టు మూఁగినవారి కెల్లఁ
బంచిపెట్టెడి జాలరివాని యూని. 86

గీ. కాంచి, యానందమును బొంది కదలి దరిని
దక్షిణాభిముఖంబుగ దారిఁ బట్టి
చేవురు మహేంద్రతనయ తా నింపు మీఱ
సాగరముఁ గూడునట్టి దృశ్యమునుఁ గనఁగ. 87

క. దోనెలు డెప్పలు పడవలు
నానావిధజాలములు ఘనం బగు త్రాళ్లున్
మీనములపొలుసు తళ తళ
లీనెడు తావులను జూచు చేవురు వేడ్కన్. 88

క. కనుచూపుమేర సాగర
మున నిసుకం గూరి వ్యర్థముగ వీచికలన్
ముసుఁగుచుఁ దేలుచుఁ గనఁబడు
పసుజంతువుఁ బోలు నోడ వీక్షించి కడున్. 89

క. తరిసి యొకకొంత చని లో
చనదళకము నొక్కమారు సమ్మద మలరన్
గని రట దీపస్తంభం
బును బూర్వస్మృతులచిహ్నముగ నొకదానిన్. 90

శా. పౌరాతన్యముఁ జూపు నేఁటి శిథిలప్రాయంపుటాకారమున్
పౌరుఁడు గాంచి, వ్యథాశ్రుపూర్ణు లయి; నిశ్వాసంబులన్ బుచ్చుచున్
వా రాకంబముచుట్టుఁ గూలఁబడి యూర్ధ్వాలోకనల్ బర్వఁగా
హా! యెంతటివురశేం గనెఁ గళింగాంధ్రంబు నేఁ డక్కటా! 91

క. అని యప్రయత్నముగ వా
రనుకొనిరి; పురాతనస్మృత్యాలోచన లం
తనఁ గ్రమ్మఁగ మాధవుఁ డి
ట్లనె శిర మెత్తి సవిధాన సంజను గనఁగన్. 92

సీ. "తొలియోడ నిర్మించి తోడికి నిర్భయముగా
నుదధి దాఁటినదాని కిది ఫలమ్మ ?
వంశధారాసారవాఃనౌకాసైన్య
మేర్పరించుటకుఁగా నిది ఫలమ్మ ?
పరభీకరకళింగపట్టణనౌకాశ్రీ
యొందిరావిస్మృతి కిది ఫలమ్మ ?
నాగావళీతీరనౌకావినిర్మాణ
విదితయశోవల్లి కిది ఫలమ్మ ?

గీ. దిగ్దిగంతపరీవ్యాప్తదీప్తశౌర్య
ధైర్యసాహససంస్కారధుర్యమైన
ధర్మసామ్రాజ్యనిర్మాణదక్షత ప్ర
సిద్ధిఁ గాంచుట కిది లభించినఫలంబ ? 93

సీ. ఏ రాజమహాళి తా నిచ్చోట మీసము
మెలివైచి కడలియంచులకుఁ జనెనొ !
ఏ పరివ్రాజకుం డిచ్చోట ధర్మదీ
ప్తులు గ్రమ్మ ప్రాచ్యభూములకుఁ జనెనొ !
ఏ శూరశేఖరుం డిచ్చోట నిజబాహు
బలము చూపంగ దీవులకుఁ జనెనొ !
ఏ సంస్కరణదక్షుఁ డిచ్చోట నాచార
మలినమ్ము విడనాడి వలస చనెనొ !

గీ. ఏ నిరాతంకమతి కౌంశు నెడపి యిచట
దక్షిణాపదమ్ము నిడెఁ దోలి తరణియందు
ఏ వదాన్యుఁడు నిజసంస్కృతీవిలసన
మబ్ధి దాఁటింప నిట నెంచి యవల చనెనొ ! 94

సీ. ఏ వీరమాత తా దీవెనల్ పచరించి
తనయుని దిటవుగా ననిచె నిచట ?
ఏ శూరపత్ని దుఃఖించి రెప్పల నప్పు
లించి చెల్వునిఁ బయనించె నిచట ?
ఏ జెట్టి పుత్రికచేద్ధావృతమ్ము దా
నెడలించి పరభూమి కేఁగె నిచట ?
ఏ భిక్షుకశ్రేష్ఠుఁ డెద మాతృభూమిపై
మోగి నైన కన్నీటఁ దోఁగె నిచట ?

గీ. ఆప్తబంధుసమాదర మార్యమంగ
ళానుశాసనమ్ములు విజయాభికాంక్ష
లలమఁ గోలాహలమునఁ గన్నులు సెమర్ప
నే చమూపతి నావఁ దా నెక్కె నిచట ? 95

సీ. బర్మా సుమత్రా సువర్ణ యవద్వీప
నిష్కరాశులను గోనెలను నించి
చైనా జపాను సుక్షౌమమ్ములను చందు
గలను భద్రమ్ముగాఁ గట్టి యుంచి
తామ్రపర్ణీముఖద్వారపూక్తికరాజ
బోషాణములనిండ పొందుపఱచి
పగడంపుదీవుల భాగ్యసంచయము సం
చుల కెత్తి ముత్తులు మలఁచి కట్టి

# చతుర్థాశ్వాసము

గీ. వివిధనౌకలు గుమిఁగూడి యవిరతోత్స
వమున నిచ్చోట లంగరు వైచి మాతృ
భూమిఁ దిలకించి యొడళ్ళు లుప్పొంగ దిగిన
తొలికళింగబేహారు లెంతలకుఁ దగరు ?

సీ. సింహపురీవీరసింహులు మార్జాల
ముల వోలెఁ దోఁకలు మలఁగఁ గొలువ
మలయాసువిఖ్యాతదళవాయు లనురక్తి
వెలయ చెంగటను జేతులను నులువ
బ్రహ్మదేశసుధైర్యవర్ములు మైమరు
వృళ్లాడఁ బూఁటకాఁపులుగ నెలయ
సింహళరాజ్యప్రసిద్ధసేనాపతుల్
ధృతిఁ దూలి కనుసన్నఁ దెలిసి మెలఁగ

గీ. ప్రాజ్యపూర్వకళింగసామ్రాజ్యపూజ్య
దుర్నిరీక్షధ్వజాగ్రవిద్యుతులు దిశలఁ
బర్వ దిగ్విజయసమాప్తిఁ బడసి యిచట
మాతృభూమికి దిగిన రాణ్మణి యెవండొ !

సీ. మూఁడునిద్దుర లైనఁ గూడకమున్న ప్రే
యసిబిగికౌఁగిళ్లు వ్యర్థపుచ్చి
ప్రథమానురాగసంప్రాప్తపుణ్యఫలమ్ము
బురిఁటిపాపను గాంచ నరయ నోడి
వెన్నంటి మాలిమి వెలయంగ కూనిసా
గాలు దీసెడి బాలు గడిమి టెక్కిమి
ముక్కాలిముసలి ప్రేముడిఁ గన్నులు సెమర్పఁ
దనువును నిమురు తల్లిని విదల్చి

గీ. వీనుదోయిని యుద్ధప్రయాణభేరి
కాధ్వానముల్ మాఱుమ్రోఁగ నుత్కంఠఁ జనిన
విలయరుద్రులు జైత్రయాత్రలను సల్పి
ఇచట నోడ డిగ్గిన వీరనిచయ మెవరొ! 98

సీ. నిజభుజోపార్జితానింద్యయశస్సంప
దలు బిడ్డలకుఁ గానికలు నిడంగ
నశ్రాంతవీరవిహారప్రభూతశౌ
ర్యకృతుల్ గీర్తిముద్రలుగఁ జూప
సంగ్రామరంగప్రసారశౌర్యోదీర్ణ
గాథలు సద్యశోగ్రములుఁ బఱప
సాహసవిక్రమోత్సాహప్రదర్శనం
లబ్ధ మహా పదవు లుల్లసముఁ గూర్ప
గీ. మాతృదేశవైభవయశోమాలికలను
గూర్ప నసువుల నెదురొడ్డి కుధరతుల్య
ధైర్యమూర్తులు భేరికాధ్వాన మలర
స్వాగతాంజలు లిటఁ బొందఁజాలి రెవరొ! 99

సీ. స్పందించు నీభూమియందుఁ బ్రత్యణువును
వీరలోకానీకవిజయగాథ
మాఱ్మ్రోఁగు మున్నీటిమాలాతరంగసం
చలనమ్ములోఁ గళింగులచరిత్ర
వెలయించు నీదీపవేది కన్నులు జిగేల్
మన జయధ్వజపటంబును దెసలను
రచియించు నీతీరరామణీయకము ప్రా
క్పర్వగీతప్రబంధమును చిరము

గీ. నిలుపుఁ గడుబంతములను బూర్వులయశస్సు
నిచట జనియించు తెమ్మెరల్ ప్రచురపఱచి
తరతమ్ములఁ గూరి పాతరలఁ బోలు
భవ్యచరితల కిది యూటబావి నిజము. 100

గీ. అన్యభూముల నామమాత్రావశేషు
లైన భర్తలవృత్తాంత మరసి యిచట
కళవెళ వియోగశిఖ నెదల్ గ్రాఁగఁ బొంగు
వారి నెత్తురు కన్నీటిచార లురల
నిసుకఁ బొరలిన శోకార్త లెవరొ! మున్న. 101

సీ. ఏ రాజవదన కన్నీ రోడికలఁ గట్టి
నిచ్చోట విలపించె నెద లవరఁగ
నే సాధ్వి దీర్ఘనిశ్వాసమారుతహతి
నిచ్చోటఁ జివురాకు లెంతువారె
నే తన్వి యాక్రందనాతపమ్మున శిలల్
ప్రిదిలి రేణువులుగాఁ జెదరె నిచట
నే కాంత శోకసమాకులారవము సా
గరతరంగధ్వనిఁ గలిసె నిచట

గీ. నే వరారోహ ధమ్మిల్ల మిచట వీడ
గుండె చెఱువుగ రోదనఁ గూరె మున్న
జలధిఁ దరియించి ప్రాచ్యసీమలను మృతిని
గనిన భర్తలవృత్తాంతమును నెఱింగి. 102

గీ. కాలయవనిక వ్రాల నిక్కరణి మాటు
వడియెఁ బ్రాచీనవై భవ; ముడుకురక్త
మిట్టి స్మృతిచిహ్నములఁ గన, నీధరిత్రిఁ
బుట్టఁగంటిమి గర్వింపఁ బోలు మనము." 103

కం. భావోద్వేగంబున హ్లాద
యావళి యుప్పొంగఁ బులక లంగంబులఁ బె
ల్లావహిలఁ బలుక, గౌరవ
భావము పెంపొంద వినయభాషణ మలరన్. 104

వ. ఆనందుఁ "జన్నా ! ప్రొద్దింతయు లేదు. వాహినీసంగమప్రదేశమ్ముఁ
జూచి, బారువాఁ జేరునంతకు 'బస్సు' వేళయు నగు; జాల మొన
ర్చిన మన మీనాఁడు దీపారాధన సమయమ్మున కిల్లుఁ జేరు నవ
కాశం బుండదు. అట మనవారు మనరాకకై యారాటంబు గుడు
తురు." అనిన, మాధవుండు లేచి జేబురుమాలుం గొని కన్నుల నద్దు
కొని బయలుదేఱ నందఱు ననుసరించి యొకయరమైలుదూర మరిగి
మహేంద్రతనయాసాగరసంగమస్థలమ్మును దరిసి. 105

గీ. కులగిరిశ్రేష్ఠుగారాబుకూఁతుమిన్న
వాహినీనాథుముద్దులవారిజాక్షి
సుందరోద్యానసీమ విశుద్ధవేణి
కామణి మహేంద్రతనయానదీమతల్లి. 106

గీ. అచలనాథునియుత్సంగమందుఁ బెరిగి
చరియలం దనుజలను ముచ్చటలఁ గూడి
బయళులం బట్టి నవ్యజీవనము బడసి
తోయధీశుని నైక్యమై పోయె; ధన్య
జీవన మహేంద్రతనయ రాజీవనయన. 107

కం. అని తలఁచి వారు తటినీ
వనితామణి నెదను బొదువ వడిఁ దన వీచీ
ఘనబాహులు సాఁచెను నా
వననిధివిభురసికత కనుపండువు గూర్పన్. 108

మ. రససిద్ధుం డురుసారనిర్భరగభీరస్వాంతుఁ డాశామలీ
మసరాగల్ నదు లాత్మజీవనము ప్రేమం దోఁగి యర్పింప నీ
రసముం జూపక యొక్కమాత్రికిఁ దమప్రన్ రంజించు నుజ్జీవనం
బెసఁగంజేయు సముద్రుఁ డౌర యని వా రింపార నూహింపుచున్.

గీ. దక్షిణుఁ డితండు కడు జాణతనము మెఱయఁ
దరఁగచేతుల నీనదీతరుణిఁ బొదివి
సిగ్గు నొందక ఫేనసంస్మితముఁ బఱపె
బిరుదుమగఁ డను గుండెనిబ్బరమొ! యేమొ! 110

వ. అని తలంచుచు వా రా దృశ్యసందర్శనప్రభూతవినూత్నోత్సవభావ
పరీమళమ్ములు పొంపిరి వోవ నంత మాధవుఁడు దరహాస మొలయ
సాభిప్రాయమ్ముగా ని ట్లనియె. 111

గీ. "ఎంతదూరము పయనించె నీమహేంద్ర
తనయ ప్రియుఁ గూడఁ బ్రేమచిత్తమున స్వేచ్ఛ
దేహ యై యొంటిగాఁ; బ్రియాధీన లెంత
సాహసమ్మున కొడిగట్టఁ జాలకుంద్రు." 112

క. ఆవాక్యమ్ముల విని పలు
భావమ్ములు గ్రమ్మ బయలుపడ నెంచక రా
ధావనజాక్షియు మాలతి
యవిధినో మాట మార్ప నెంచుచు నుండన్. 113

క. పాణిం దగఁ దత్తటభూ
రేణువులం దీసి యందుఁ గృష్ణాభ్రికనూ
త్నాణువు లానందుఁడు గని
యేణీలోచనల డాసి యేర్పడ నంతన్. 114

గీ. "ఇదిగొ! వాహిని చూడుఁ డద్రీశ్వరుండు
జనకుఁ డాటను నీలములను బహూక

రింపఁ గొనివచ్చె రత్నాకరేంద్రుఁడన కన
న్నభ్రకరణంబు లిందుఁ జెన్నారు విధము." 115

క. అని చూపిన ప్రతికృతి మని
యనుకొని రాయువతు లెడల; సతికౌతుకసం
జననాత్మ లేచు నిసుకన్
గని రజుకృష్ణాభ్రకమును గను లార్ప కొగిన్. 116

వ. ఇట్లు వా రానందించు నవసరమున— 117

ఉ. మావుల నొడ్డి యం దెఱుకమాలి తగుల్కొను మత్స్యరాశులన్
చేవున దుల్చి, నేఁడి, సవరించినతిట్టిని గట్టికొమ్మునన్
వావిరిఁ జొన్పి మోచికొని వచ్చెడు జాలరిఁ బిల్చి మాధవుం
డీవిధిఁ బల్కె "నోయి! యివి యేటికి చంపితి? వింద పాపమున్
బ్రోవు నొనర్చుకోఁదగునె? బుద్ధియె యిట్టి యకార్యవర్తనల్." 118

వ. అనిన నా జాలరి విస్మయావిష్టుఁ డై తన మీల నచ్చోట నిడి సవిన
యమ్ముగ. 119

శా. "బాబూ! పాపమొ! పుణ్యమో! యెఱుఁగ, సంప్రాప్తించునేదో యొకం
డాబాల్యమ్మును మాకు వృత్తి యిది, యిట్లాయేటి మున్నీటిగా
రాబంబున్ గని జీవితాల్ గడుపుటే వ్రాసెన్ గదా! బ్రహ్మ; నీ
దాబక్కిన్ గన నాలుబిడ్డలను నేదన్ మాకు మార్గం బిదే. 120

సీ. కలముపోటున లోకములు తారుమారులు
సేయఁగాఁ జదువు మా చేతఁ గాదు
ముల్లై మూటలు పెదజల్లి సౌఖ్యమ్ములు
కొనుటకు మాచేత ధనము లేదు
నల్ల యంగళ్లలోఁ గొల్లఁగొట్టుదమన్న
వ్యాపారసరణి మావలనఁ గాదు

'బురఖా'ల మాల్చి సోమరుల పైని పడవుల
చాటున నిలుచు టీనాఁట లేదు

గీ. కలియొ గంజయొ త్రావ గఁగమ్మతల్లి
నాశ్రయించుట కులధర్మ మగును మాకు
దినదినము గండ మై బ్రతు కనుదినమ్ము
వెళ్లఁబుత్తుము సామి! యివ్విధిని మేము. 121

గీ. కల్లకపటము లెఱుఁగము; కలని గుండె
విఱుచుకొని చొచ్చు వీరుల తెఱఁగు మేము
పొట్ట చేతను బట్టుకపోయి, రోసి
నంత సంద్రమునందు వేఁటాడి తెచ్చి
కుడుతు మాలుబిడ్డలతోడఁ గూడు నింత. 122

గీ. కలుపుమొక్క లెడల్చి, క్రిముల నడంచి
ఎద్దులను నొంచి పంటఁ బండించు కాఁపు;
పాప మతనికి లేదె? యెవ్వరికి హాని
లేని మావృత్తి పాప మెట్లౌను సామి! 123

సీ. నకనక లాడు మానవుల నెత్తురు లోడ్చి
భోగాలఁ దోఁగుట పుణ్య మగునె?
కలకల లాడు మూకలను గంకాళమ్ము
లుగ మార్చు చాతుర్య మగునె పుణ్య?
మాఁకట ప్రమగ్గెడి యనదల నోటను
మట్టిఁ గొట్టుట పుణ్యమా? తలఁపుడు
నినదాలచాటున నీతిని విడనాడి
గోతులు త్రవ్వఁ జేకురునె పుణ్య?

గీ. మతివిచిత్రముగా నెల లాకసమును
దాఁకఁగాఁ బెంచి మానుషత్వమును దొరఁగి

గొంతుముడి లేక జనులను గోడుఁ గుడువఁ
చేయు టది పుణ్యమా? చింత సేయు మయ్య ! 124

గీ. నోరు గలవా రగుటఁ బెద్దపేరు లేవో
పెట్టి పిలుతురు; గాని లోగుట్టుఁ జూడ
నినుపగుండెలకాకాసు లసఁగ వేత
కలరె? సంఘవిద్రోహులు గారె వారు ! 125

గీ. బాల్య మగుటను లోకానుభవము మీకు
చాల; దీనాఁడు స్వార్థ మచ్ఛముగ ధర్మ
పన్నములచాటునం గడుఁ బ్రబలె; నన్ను
నన్యముగ నెంచవలవ దిట్లంటి ననుచు." 126

క. అని పలికిన జాలరివా
నినిగడుమెచ్చికొని, "వందసేయుఁడ వోయీ !
నినుఁ బోలువారె వలయును
మనదేశపురోభివృద్ధిమార్గము దిద్దన్. 127

గీ. వాక్యశూరత్వమును జూపువారె; కాని
కార్యశూరుఁ డొక్కఁడును గానరాఁడు;
ఆత్మలాభపరాయణు లై చరించు
వారలే దేశమం దెల్లఁ బ్రబలి రిపుడు. 128

క. ఎటఁ గన్న కుంభకోణము,
కుటిలత, కైంకర్యబుద్ధి, కోటులమార్పున్
నటనమ్ము మేర మీఱెను
గటికతనమె నాగరికతగాఁ బెంపొందెన్." 129

గీ. అనుచు మాధవుఁ డతని "సయ్యా ! క్షమింపుఁ
డింతసే పట నిల్పితి; నేఁగి మీాల

నమ్ముకొనుఁ" దన నాతిఁ దత్యంతముదము
నంది వందన మొనరిచి యరిగె నంత. 130

వ. ఆకై వర్తునిఁ దనదృష్టు లనుసరింప నొక్కనిముసమ్ము పరికించి మాధవుఁ
డి ట్లనియె. 131

గీ. "నిశితకంటకాంతరమున నిలిచియున్న
లలితసౌందర్యరాశి గులాబిపూవుఁ
బోలు నీతండు; హింసాప్రపూర్ణ మైన
వృత్తిఁ జేపట్టియు బహుపవిత్రుఁ డరయ. 132

గీ. అల్పమే యయ్యు దృఢనిశ్చయాత్మక మగు
జ్ఞానయుక్తుఁడు; మేధావిశాలుఁ డనఁగ
రాదు; హృదయమాత్రము రాటుఁదేర
కుండుటయె కడు వింతను గూర్చుచుండె. 133

గీ. ధీవికాసము గర్కశభావము నవ
నాగరకతగాఁ జెలఁగ, ననాగరికుల
యందు వ్యత్యస్త మయ్యె; నాత్మార్థు లొకట
వెలయ నిస్స్వార్థు లొండెడఁ గలరు నేఁడు." 134

వ. అంత లక్ష్మి యోజనాధీన యై బిట్టు నిట్టూరిచె. పదపడి వార లేవురు గృహాభిముఖు లై చన నాకాంక్ష పొడమ నన్నదీతీరమ్మున మీఁదుగాఁ గొంతద వ్వరిగి లవణోదకసమ్మిళితంబులు గాని జలమ్ములఁ బ్రక్షాళితముఖపాణిచరణు లై తత్తటసమీప సుందరనారికేళారామమ్మున సుఖోపవిష్టు లై మధురోదారసల్లాపమ్ముల నానందించుచు, మున్నసంగృహీతమ్ము లగు రొట్టియల నారగించి శేష సముచితోష్ణ మ్మగు కాఫీని సేవించి, మేనిబడలికలు వాయ ముహూర్తమాత్రము విశ్రమించి, తద్విహారానుభూతుల మనన మొనర్చు

కొనుచు, హృదయములఁ జిరస్థాయిగ నెలకొను వివిధసన్నివేశమ్ములఁ దలంచుచు, నందు మకుటాయమాన మనఁదగు రాధాప్రమాద మ్మును నెంచి యొడళ్ళు గరుపొడువ, సాహసమూర్తి యగు నానం దుని శ్లాఘించుచు బారువాపురిం జేరి యప్పురమ్మునంగల వింతలను గనుచు, బస్సులకై నిర్దేశిత మగు ప్రదేశమ్మును జేరిరి. పిదప మాధవుఁడు "రాధను గవిటియందు డించి, కడమవారలము సూటిగ నిచ్ఛాపురమ్మున కరుగుద" మనుచు, రాధ చిన్నఁబోయి "మీ రీరేయి మాయతిథులరు. నేను మున్న యిద్ధంబ యని మాయమ్మ కుం దాతకుఁ జెప్పి వచ్చియుంటిఁ; గావున మీ రొండువిధంబున నల్పుట తగునా? మన మేవుర మీరేయి మాయింట విశ్రాంతిఁ గొనుట తప్పదు. పిమ్మట మీ వలసినరీతి నొనర్పుఁ" డనిన మాధ వుండు "నీవలెనే మేమును మాపిన్నికిం జెప్పియుంటిమి. అన్యథా సంభవించిన వా రాందోళనమ్ము గుడువరా?" అనిన రాధ "యింతయే కదా! దానికిం దగు వెర వూహించి యుంచితిఁ; గావునఁ దొలుత నాయభ్యర్థనం బంగీకరింపుఁ డుత్తరోత్తరమ్ము బలీయ మ్మని కదా! శాబ్దికమతమ్ము; గావున నావాగ్దానమ్మె బలీయమ్ము. మీ రొకచీటి వ్రాసి మీవారల కనిచిన నెవ్వరికిని నాందోళన మందఁ బనియుండదు. అదియె కర్జం" బనిన, మాధవుండు "నేఁటికాలము ప్రజాస్వామికము; గావున నీళ్ళు నమలక మీ రెల్లరు మీ యభిప్రాయమ్ముల నెఱిఁగించునది." అనిన నానం దుఁడు స్మితము గదుర రాధ నవలోకించుచు "విందు సేయుదును రం డనఁ దిరస్కరించు నోపిక నాకు లే" దనియె. "చిన్నయన్న యభిమతము నాకు శిరోధార్య" మని లక్ష్మి పల్కె. "మా చెల్లిని బువ్వులం దిడి పెంచు మా కక్కయొడిం జేర్పనిదే నే నెందుఁ బోవ" నని మాలతి నుడివె. "ఆత్మీయుల యభిమతమే నాయభిమత" మని

మాధవుం డన, "మఱి నా యో టివ్వవలదా?" యని రాధ పకపక నగియె. అంత నానందుఁ డొంటుకాగితమ్మును నూటకలమ్మును గొని తమరాము నెఱింగించుచు జాబును విలిఖించి, వారలకుం జూపె. రాధ ముత్యాలకోవం బోలు నాయకుసకమ్యాత కాత్మ నుల్లసిల్లె. అంతలో బస్సు చనుదెంచుఁడు వా రం దధిరోహించి. 135

శా. దుమ్మున్ జిమ్ముచు వాయుసాగరము విద్యుద్వేగసంరంభి యై
సమ్మోదంబునఁ గూరఁ జీల్చుకొనుచున్ సాక్షాత్కృతానామసం
ఘమ్మున్ జానపదావళిన్ జిటికెలోఁ గుజాటుఁ గావించుచున్
గ్రమ్మన్ దిక్కుల బోఁయ్బోఁయారవము శ్రీక్షుస్ఫూర్తి బ స్సేఁగఁగన్.

క. కుడుపుల్ నభిముఖవాతస
ముదితం బగు తాఁకుఁ జుట్టపొగతావులపైఁ
బొదలిన పెట్రోల్ కంపును
మొదడులఁ బని సేయనీక మిగుల వ్యథ నిడన్. 137

గీ. కవిటిఁ జేరినమోదము కడలు ముట్ట
బస్సు దిగి వారు లేఖ డ్రైవరున కొసఁగి
యరుగుఁదెంచెడి కూర్మినాయకునిఁ గాంచి
సముచితముగ సల్పిరి నమస్కారములను. 138

శా. ధూళుల్ గ్రమ్మిన ముంగురుల్ సుమరజస్తోమంబు మై నంటు మ
త్తాళిం బోల, హిమావకుంఠనములో నట్టాక బెంపే దుషః
కాలాంభోజము లట్ల మోము లలరంగా, మేను లుష్ణోగ్రవా
తాళిం దూలిన వల్లికల్ తెఱఁగు నేత్రానందమున్ గూర్పఁగన్. 139

చ. కని సముదగ్రహర్ష పరికల్పితదీప్త విలోచనంబులున్
దనువునఁ బుల్కలున్ వెలయ, దత్కృతవందన మంది, గద్గద
స్వనమునఁ గూర్మినాయకుఁడు "సౌఖ్యమె మీకుఁ? బ్రయాణభార మే
చెను, గడు వాడి మోములను జెన్ను దొరంగితి" రంచుఁ బల్కుచున్.

చ. అనునయ మేర్పడం గొని గృహంబును సేర్చిన, వేంకమాంబ యా
ర్పును నెడలించి "యే నెదురుత్రోవలఁ జూచుచునుంటి మీకునై
మన మిఁక యూరటం గను, సుమంబులఁ బోలెడి చిన్నిమేను లెం
డను గడు వన్నెఁ దక్కెను, బడల్పడినారలు మీర లెంతయున్".

చ. అనుచుఁ గవోష్ణవారిఁ దగ నండఱి మజ్జన మాడఁజేసి, 'టీ'
యును నుపహార మిచ్చి బహుళోత్సవదాయక మా విహార మే
యనువున సాఁగెనో యెఱుఁగ, నాతుర లై తినుచున్న వారి యా
ననములఁ గాంచుచుండెను మనంబునఁ గీల్కొను ప్రేమ నెంతయున్.

మ. ఉపహారాహారణమ్ము సేయుచును వా రొక్కొక్కరున్ జెప్పఁగా
నిపు డెవ్వార లుపక్రమించు టని లో నేపారఁగా శంక, నే
రుపుగాఁ బల్కుట నా కశక్య మని యోరుం బూన, రల్లాట నా
తపబాధాపరిపీడితుల్ తగును సేదం దీర్పఁగా బిడ్డలన్. 143

మ. అని భావించుచుఁ దాళవృంతమున నాప్యాయంబుగా వీఁచుచున్
దనయుత్కంఠను డాచె వేంకమ; సుధాధారానుకారోక్తులన్
వినఁగా నెంచుచు యోచనల్ పరువ నా వృద్ధుండు సందేహమున్
గని తద్వృత్తము సూక్ష్మదృష్టి నరయంగాఁ బూనె విభ్రాంతుఁ డై.

గీ. పెద్ద లిద్దఱు మివుల గంభీర మొలయ
మౌనముద్రితు లగుటఁ బెన్మంటసెగలఁ
గాచుపోలిక హృదయము నేచ సైఁప
నోడి మాలతి పల్కె వా యోడ నంత. 145

ఉ. "పెద్దల కీవిహారములు ప్రీతినిఁ గూర్ప వటంచు నెంచెదన్;
ముద్దులు మూటఁ గట్టెడి విముగ్ధమనోహరనూత్నశోభలన్
దద్దయు నొప్పు నీప్రకృతితత్త్వ మెఱుంగను జిత్తవిస్మృతిన్
బెద్దగ నొంద నీశ్వరునిప్రేమ నెఱుంగఁగ నౌను వీనిచేన్. 146

చ. అనుకృతియే కళాంకురము, హర్షము తత్ఫల మౌను; నిత్యనూ
తనఘనసృష్టినిష్ఠ మగు ధర్మ మెఱుంగను మోద మొంద నెం
దును గళలే శరణ్య మగుఁ దోరపుఁ బ్రాకృతచిత్రశోభలన్
మనన మొనర్చుకొన్న ననుమానమె చిత్తము చెంగలించుటల్. 147

ఉ. నగ్నగభీరముగ్ధముల నవ్యవినూతనముల్ మనోజ్ఞముల్
భగ్నహృదాఘముల్ సరసభావసమన్వితముల్ విమోహదుః
ఖాగ్నిహరంబు లౌ ప్రకృతిగణ్యదృగంచలముల్ ప్రహర్షస
మ్మగ్నులఁ జేయుఁ బ్రేక్షకసమాజము సర్వవిధంబు నెంతయున్.”148

మ. అని యుత్సాహము గీలుకొల్పుచు విహారావశ్యకం బెంతయుం
గనుపట్టంగ నుదాత్తవైఖరిని నక్కన్యావతంసంబు ప
ల్కిన వా రెల్లరు హర్షనిర్భరసమాకృష్టాత్ము లై వీనులం
దున మార్మ్రోఁగు తదీయవాక్యములు వైదుష్యంబు సూచించుటన్.

చ. కని, బళిరా! విదగ్ధతయు గౌరవముం వెలయించి యీదురో
మను మన స్తబ్ధ మా ప్రకృతి సంతయు మార్చెను వాక్యనైపుణీ;
అనువు నెఱింగి కాదె ఘను లాత్మసమగ్రమనీష వెల్లడిం
చి, నుతులఁ గందు రెం దనుచుఁ జింత యొనర్చిరి చిత్తసీమలన్. 150

చ. విమలసరోజగర్భమును విచ్చి పరీమళ మేఁగు దిక్కులన్
సమయము చిక్క, నాక్రియను సన్నుతిపాత్రము గాఁగ నీయుప
క్రమణికఁ బల్కి ధీగరిమఁ గ్రాలెను మాలతి యంచు నెంచి కూ
రిమి వెలయంగ వృద్ధుఁ డలరించెడిమాటల నంత ని ట్లనెన్. 151

గీ. “జలము లెడలించి వైచిన నళినపుంజ
మనఁగ వసివాడి యున్న మీ యాకృతులను
నరసి వ్యథఁ గంటి మిట్టి విహారము లన
మాకుఁ గడుఁ గూర్చు నమ్ము మీ మాట తల్లి! 152

గీ. లేడికదుపులచందము నాడుకొనుచుఁ
గూడిమాడి విన్యాసముఁ గూడకట్టు
కొనుట కెవ్వ రభ్యంతరమును నొసర్ప
సాహసింతురు హృదయవిశాలు రైన. 153

గీ. నేడఁ దేరిసపిడపఁ బ్రశ్నింపవచ్చు
ననుచు మిన్నకున్నార మియ్యది నిరాద
రముగ భావింపవల దమ్మ! మిముఁ గనుఁగొను
వంతకును బెల్లు నారాట మందినాము." 154

చ. అన "నవిచారమూలకము తొ నుడు లేవియొ పల్కియుంటి; మీ
మనమున నుంపఁబోకుఁ డొకమాటయుఁ; బెద్ద లశేష మా కృపా
ధను లగు మిమ్ము రాధ తనతాతయుఁ దల్లియుఁగా గణింప నిం
కను లభియించె భాగ్య, మది కారణ మందఱ మిట్లు తొట్రిలన్. 155

మ. వినఁ డానందము మేర మీఱఁ జని మార్వీముక్తబాణంబులో
యనఁగా సూటిగఁ బోయి డాసితిమి బీళాఖ్యక, మదాళీవిహం
గనటద్భూరితరంగపాళి, విలసత్కల్హారరాజీవగం
ధనవామోదమరుత్ప్రసారలహరిఁ దర్శార్హదృశ్యావళిన్. 156

చ. అటఁ జని లోచనోత్సవము లై చెలువారెడి దృశ్యసంపదల్
తటమున నుండి కాంచుచుఁ దతఃపరము న్గమనింప నోడి యం
తటఁ గడుచేరువం గలుగు తామర లందఱ మందుకొంటి మ
చ్చటనచట న్వినోదమున సారసలోభవశీకృతాత్మలన్. 157

ఉ. ఈవిధి మేము ముచ్చరము నేర్పడఁ బువ్వుల నేరుచుండఁగా
బావలు సుంత ద వ్వయిరి, పద్మము నొందఁ గొనంగ వంగు రా
ధావనజాక్షి జాఱి పడెఁ దత్తటభూరిగభీరవారి; మే
మావిధిచెద్దియిఁ గాంచి యపు డార్వ సముద్ధతి సింగమో యనన్. 158

చ. ఉరవడి నేఁగుఁదెంచి భయ మొందకుఁ డంచుఁ జటాలున్ సరో
వరమున దూకి, చెల్లిఁ బెనవైచి కరంబున, నీఁదుకొంచు న
బ్బురముగ నొడ్డుఁ జేర్చె నొకపుణ్యుఁడు, గండము తప్పె నామెకీ
చరితము సంస్మరింపఁబడు శాశ్వతమై దృఢమైత్రిబద్ధమై." 159

క. అని మాలతి తెలుపంగా
విని కన్నుల బాష్పవారి వెలువడఁ గూఁతున్
అనురక్తి వెలయ నాలిం
గన మొనరిచి "యెట్టిచెట్టఁ గంటివి తల్లీ! 160

ఉ. నీరముఁ ద్రావితే? యొడలి నేమియు దెబ్బలు లేవుగా? కృపా
పూరముఁ జిమ్మి మా కనులముందట ని న్నిడుపుణ్యుఁ డెవ్వఁ? డా
భూరిదయామయున్ మిగుల మ్రొక్కి వినీతినిఁ గొంచురాకపో
తే! రజనీకరానన! యదృష్టముకల్మి శుభాంత మేర్పడెన్." 161

మ. అనుచున్ వేంకమ పల్కి వృద్ధుఁ డనుకంపాభోగుఁ డై రాఘవీ
పును హస్తంబునఁ దద్దయు న్నిమిరి, "నాపుణ్యంబునన్ జూడఁగం
టిని తల్లీ! నిను; నెంతసంకటము వాటిల్లెన్, బునర్జన్మమున్
గనినా వామహనీయుసాయమున, సాక్షాద్దైవ మాతం డగున్. 162

క. ఎవఁ డాతఁడు? తెరువరియా?
భువికిం దిగినట్టి దేవపురుషుండ? మహో
త్సవమునఁ గృతజ్ఞతాంజలి
ని వెలయఁగ నొనర్చితే వినీతిని దల్లీ! 163

క. ప్రత్యుపకార మొనర్చుట
యత్యుచితము; వానినామ మైన నెఱిఁగితే
మృత్యుకరాళాననసా
పత్యం బగు బీకఁ జిక్కుఁ బాపెన్ వంతన్. 164

క. కలకాల మతఁడు వర్ధిల
వలెఁ; నింటికిఁ దోడుకొనుచు వచ్చిన మా క
న్నులు చల్లఁబడఁగఁ గని చే
తులు గట్టుక వానిఋణము దొడరమె తీర్పన్." 165

చ. అనఁ జిఱునవ్వువెన్నెలల నాననబింబము చెన్ను మీఱ "మీ
మనములఁ జింతఁ దక్కుఁ డిసుమంతయుఁ గష్టము సంభవింపలే
దనుపమసత్త్వసాహసుఁడు నాఢ్యుఁడు నా నతఁ డశ్రమంబునన్
వనజము హస్తి పట్టుకొనుభంగిని దీరము సేర్చె సత్కృపన్. 166

క. నీటం బడి మునిఁగితి నిన
మాటు వెలికిఁ దేలి భీతి మల్లడిఁ గొనఁగన్
మాటికిని గొట్టుకొనుతఱి
నాటోపంబున నతండు హస్తముతోడన్. 167

క. ననుఁ బెనచి యొద్దుఁ జేర్చెను;
మనమునఁ బుఱిగొనెను భీతిమాత్ర మపుడు; నీ
టిని బ్రావ లేదు; భయ మా
తనిసాయము గలుగ నణఁగి, ధైర్యము బలిసెన్." 168

వ. అనెడి కుమారిం గని సమ్ముదశ్రులు జాలువార, వేంకమ యామెతల నిమిరి, ముంగురులు సవరించి, హృదయభారాపనోచ్ఛ్వాసంబు నొంపుఁ బుచ్చి, "దైవమ్ము నీపాలఁ గలఁడు; కావున బ్రతికి బట్టఁ గట్టఁగంటివి. చిరస్మరణీయుం డై, నిరంతరఋణభారంబునఁ గ్రుంగఁ జేసిన యప్పుణ్యాత్ముని గూర్చి తెల్పవే! వినియైన సంతసించెదము.

ఉ. ఊర్జితసత్త్వుఁ డా నతని యూరును బేరుఁ గులమ్ము లెవ్వి? యే
కర్జముకల్మి నీ వినతిఁ గా దని యాతఁడు వోయె! పావన
స్ఫూర్జిన మాఁ గనన్ సుకృతి; మానవరూపము గొన్నయట్టి యా
నిర్జరమూర్తి కే మిడ గణించునొ! సంతసము న్వహించునో." 170

మ. అను నామాట గని గొల్లుపట సగిరిక్రందై సంపడిన్ గూర్పఁ, బూ
చినతంగేడులఁ బోల నేవ్రుఱును; రాశీభూత మై విస్మయం
బెనయన్ వృద్ధుఁడు వేంకమాంబయును నూహింపంగఁ బాల్యోక వా
రిని వీక్షింపఁదొడంగి రంతట మనోవృత్తుల్ సశింపన్ గడున్. 171

వ. వారివిస్మయం బపనయింపఁ దలంచి యానందుం డిట్లనియె. 172

ఉ. "మీ యనురాగశీతలసమీరము ముమ్మర మై భరింపలే
నో యనుశంకఁ గ్రుంకెడి మనుష్యుఁడ నేఁ; గృతజ్ఞతాన్వితం
బై యభినందనాత్మకసుధానునయోక్తులఁ దోఁగి యుంటి మున్;
న్యాయమె పిన్నఁ బెద్దగ ననారతమున్ బొగడంగ నీగతిన్. 173

మ. మనుజుండో! దనుజుండొ! యెవ్వఁ డెటువాఁ మగ్నార్త బాలామణిన్
గని రక్షింపకపోఁగలం, డుచితసత్కారంబు గాకున్న నె
వ్వనికై నన్ జనుఁ గంప్లు నెత్తికి; సురాపానంబు బోల్ సన్నుతుల్;
చను నీసత్కృతు లాఁప, మీ కిదె నమస్కారంబు లర్పించెదన్. 174

శా. వైదగ్ధ్యం బెలయించు మాలతివచఃప్రాగల్భ్య మీరీతి నా
మీఁదన్ బర్వఁగఁ జేసె సన్నుతులు, చాల్మీ రీప్రశంసాత్రసం
వేదిత్వమ్మును మాన వేఁడెద, భవద్విఖ్యాతశీలంబు నా
పాదింపన్ దగ దీయనర్హునకు; దుష్ప్రాపంబు మీప్రస్తుతుల్. 175

గీ. అక్కనుడులకు మెఱుఁ గెక్కునట్లు నుడివి
జాణతనమున రాధ ప్రశంస సల్పి
మీ పరోక్షసంస్తుతులకుఁ బ్రాపు గాఁగ
నన్నుఁ బ్రత్యక్షముగ నిల్పి నటన సల్పె. 176

ఉ. ఓపిక యున్నచోఁ బొగడ నొప్పు సమాయక లైన వీరి, వా
జ్జైపుణి మీఱ మిమ్ము నొకనాటక మాడఁగఁ జేసి రిందు, నే
సైఁపఁగఁ జాలఁ బూజ్యులప్రశంస లనర్హముగాఁ గొనంగ, యే
దో పనిఁ గట్టుకొంచు వినుతుల్ పొసరింపుఁడు విందు విందుగన్. 177

ఉ. చేలచెఱంగులన్ వదనసీమల జాఁచి కిసుక్కు మంచు నా
మాలతి రాధఁ గూడి నగి మాఁర్మోగ మొప్పఁగఁ జేరె నావలన్;
ఆలలితాంగులన్ గని ప్రహర్షము మోమునఁ జెంగలింప దీ
ర్ఘాలసలోచనద్యుతివికాసము పర్వఁగ వేంకమాంబయున్. 178

గీ. తనివి తీఱ నానందమూర్ఛమును దడివి
హర్షబాష్పములను రాల్చె; నంత వృద్ధుఁ
డతనికరమును గొని స్నేహ మలమఁగ బహు
విధశుభాకాంక్షలను మది వెలయఁజేసె. 179

గీ. మాధవుఁడు వారిహృదయసద్మములఁ బొదలు
ప్రవిమలకృతజ్ఞతప్రభాపటలి నెటులఁ
గొలువఁ దగు నని యూహించికొనుచుఁ దృప్తిఁ
దీఱ నాసన్నివేశ మింపారఁ గనియె. 180

గీ. క్రేటు వడ్డ కురంగినివిధిని లక్ష్మి
హృదయ మత్తఱి పర్వ నాదృశ్యమందు
వివిధఘట్టములం దతివేలముగను
మధురభావోర్మికల రేచుమాడ్కిఁ గనియె. 181

శా. గారాబంబులు హాస్యగర్భితములున్ గాంభీర్యముల్ వైదుషీ
పూరంబౌ ననుభూతులున్ వివిధసత్పూర్వేతివృత్తంబులున్
సారాచారవిచారముల్ తమ భవిష్యత్కార్యచర్చల్ మహో
దారానేకసదాశయమ్ములును నుత్సాహప్రసంగంబులున్. 182

ఉ. ఏకకుటుంబమో యనఁగ నెంతయు వేడుక మాటలాడుకొం
చాఁకలిదప్పులన్ మఱచి; రంతట నాయఁడు హెచ్చరింప "నో
హో! కడుఁ బ్రొద్దు పోయె; జతరోత్సవమున్ గమనింప మైతిమే,
దూకలు చూచుచుండు" నని యాదట నేవురు లేచి మచ్చికన్. 183

మ. కొసరింపుల్ చిఱునవ్వులున్ గుసగుసల్ కూర్ముల్ సతాయింపులున్
గసరుల్ మవ్వపుబుజ్జగింపు లలమంగా వారు సాబంతి సం
తస మేపార భుజించుచున్ మఱచి వ్యత్యాసంబులన్ మెల్ల నా
రసి నాయుడును వేంకమాంబయును గాఢానందంబు పెంపారఁగన్. 184

క. "ఏపూర్వపుణ్య మిది యహా
నో! పరికింపంగఁ గడు వినోదముగా మై
త్రీపారమ్యము చేకుఱె
నీపగిదిన్, భావిఁ బరిణమించును నెటులో." 185

వ. అని తలంచుచు హర్షాశ్రుపూరితనేత్రాంచలు లై రి. ఆత్మపరభేదంబు
లను మఱచి, శంకాతంకములు విడిచి వా రెల్లరు స్వగృహమ్మున నిజ
జననీసమాదరమ్మునం దోఁగుచుఁ జనవునఁ దినుపోలిక, వలసినంత చవు
లూర శాకపాకంబుల నగ్గించుచుం గుడిచి, సంతృప్తి వెలయ గట్టునఁ
ద్రేన్చి ప్రక్షాళితముఖపాణిపద్ము లై యావలికిం జనిరి. 186

గీ. అంత వివిధప్రసంగము లలరఁ గొంత
ప్రొద్దుపుచ్చి నిద్రించి రప్పుడ మదులను
వ్యథలు లేమి? రాధానందు లమిత మైన
భావియోచనలను నిద్రఁ బడయ రై రి. 187

గీ. నిమిషనిమిషము భావవార్నిధిని దొప్పఁ
దోఁగి తలమున్క లై కన్నుదోయిముందుఁ
గానవచ్చెడి భావిదుఃఖమును సైఁప
నోడి రాధాకుమారి యల్లాడె వ్యథను. 188

గీ. పొరలుఁ బర్యంకమందు నిట్టూరుచుఁ బెలుచ
శూన్యమును జూచుఁ, గనుల నశ్రులను రాల్చుఁ
గొట్టుమిట్టాడుఁ, జిత్తముఁ గుదురుపఱుప
వ్యర్థయత్నము సల్పుఁ బెన్వంత రాధ. 189

గీ. నిద్దురయుఁ జిత్తశాంతి యమ్ముద్దుగుమ్మ
వడయనేరక తత్తర పడుచు బయట
మలయపవనము సేవింపఁ దలఁచి తులసి
కోటచెంతకుఁ జని మెట్లఁ గూరుచుండె. 190

గీ. మబ్బుతెరలలోపలఁ జందమామ తన్ను
బోలెఁ గూరియుండుటఁ గాంచి యాలతాంగి
నిడుదయూర్పొందుఁ బరపి కన్నీటిధార
లురలి పయ్యెదఁ దడుపఁ దా నుండె వనట. 191

క. ఆనందుఁడు రాధాచం
ద్రానన భావాంబరమున రమణీయముగాఁ
గానఁబడఁగా సమాధిన్
దా నుండెను యోగిలీలఁ దత్పరమతి యై. 192

గీ. కూర్మినాయఁడు సుఖనిద్రఁ గూరి గుఱ్ఱు
వెట్ట, నా నవ్వడి సమాధివిఘ్నకారి
యగుట వెతఁ గని యానందుఁ డంత వివిధ
భావవల్లికలన్ జిక్కువడి కలంగి. 193

చ. "వనజదళాయతాక్షి నెటు భార్యగఁ బొందుదు? నీనిశీథ మేఁ
గిన నిఁక నామెఁ గాంచుటయుఁ గేవల విభ్రమ మౌను; నింతలో
ననుపమరాగవల్లిక తనంత నడంగునొ! యెట్లు ప్రాణ మీ
తనువున నిల్పువాఁడ నని తద్దయుఁ జింతల మున్గి యంతటన్. 194

గీ. భాతృసంకల్పబలమె యింతకు బలీయ
మగును; నీసంఘటనఁ గూర్చినట్టి ఘనుఁడు
విస్మరించునె భావ్యభివృద్ధిఁ గనక?
విత్తు నాటి నీర మిడక విడుచు నెవఁడు? 195

గీ. అనుచు నాత్మోపశమనము నంది బహువి
భావనాతీవ్రతను సెగఁబారి యున్న
మేనితాపముఁ జల్లార్పఁగా నొకింత
కౌముదీవీచికలఁ దిరుగం దలంచి. 196

ఉ. ప్రాంగణసీమఁ జేరి జలవాహవిముక్తసుధాంశురోచులన్
అంగభవప్రభావ మట నాకృతిఁ గాంచె నటన్ జెలంగు సా
రంగవిలోలలోచన కరంబునఁ జెక్కిలి నాని యున్న యా
భంగిమఁ గాంచి సంభ్రమ మపారము గాఁగ నతండు చెంతకున్.197

చ. చని, తనరాక నారయక సంతతబాష్పకపోల యై ద్రవిం
చిన శశికాంతశిల్పమయచిత్రము నాఁ గనుపట్టఁ, దగ్గ; న
వ్వనరుహనేత్ర యంత స్మృతి వర్తిల నాతనిఁ గాంచి సంభ్రమం
బెనయఁగ సిగ్గు నొంది పరువెత్తె సుమించిన జాజిపొంతకున్. 198

ఉ. ఆ విరజాజిపూఁబొదకు నావలిపొంతను జేరి కన్నులన్
వావిరిఁ జెంగు నొత్తి, "నగుబాటుకు లోఁబడ నయ్యె నేఁడు, నే
నేవిధిఁ దప్పుకొందు" నని యింతి దిగుల్పడ, నాతఁ "డన్యథా
భావన లేదు; తాళు;" మని వల్లరి జూసి సమాదరంబునన్. 199

శా. "ఏదో బాధను జిక్కి పెన్వగను నీ విబ్బంగిఁ జింతించు నీ
యాదుఃఖమ్మున కేది హేతు వగునో యబ్జాస్య! తెల్పంగదే!
ఈ దేహమ్మును గొంత కే నిడుదు; నా కీభాగ్యముల్ గూర్పుమా;
నీ దీనస్థితిఁ గాంచ నామెడఁద మున్నీ రై ద్రవించెన్ గదున్. 200

ఉ. దైవకృతంబ యీఘటన, తన్వి నను న్గదు దుష్టచిత్తుఁగా
భావన సేయఁబోకు మని ప్రాంజలి మోడ్తును, నమ్ము మిద్ది, నా
నావిధచింతనల్ బొదవిన న్దరిఁ గానక చల్లగాలి కై
ఈవిధి వచ్చితిన్ దెలుపు మేర్పడ దాచక మైత్రి పెంపునన్." 201

మ. అనినన్ రాధ తదీయసప్రేమమధురవ్యాహారమున్ జొక్కి, లో
చనయుగ్మంబున నశ్రు లేర్పడఁగ, "మీస్వాంతంబునన్ గల్గు చిం
తన లేవో మును తెల్ప వేఁడెదను, చిత్తం బింత విశ్రాంతిఁ గూ
రిన, నాదుఃఖము తెల్పుదున్; బిదప నార్తిన్ మీరు బాపందగున్."

వ. అనిన నించుక సంకోచించి తనయనురాగము నామెకు నివేదింప నవకాశమును బ్రసాదించిన పరమేశ్వరునకు హృదయమ్మున నంజలిఁ గీలుకొల్పి. 203

ఉ. "ఓ సుకుమారి! పేరిమిని నుంపఁగ వేఁడెద; నేర మొండు నేఁ
జేసితి; లాలసాత్ముఁడ; వశీకృతచిత్తుఁడ నైతి నొక్క-క
న్యాసరసావలోకనసుధాంశురుచిన్, బెర లేరొ! నాఁగ నే
లా? పరకాంతరంగనవలామణి! నీవె సుమీ! నిజంబుగన్. 204

ఉ. ఏసుముహూర్తమందు భవదిందుముఖంబును జూచియుంటినో
మాసె నెడంద ధైర్య; మతిమానుష మై చెలువారెఁ బ్రేమ; నే
దోసమె సల్పియున్నఁ గృప తోఁపఁగ సైరణ సేయ మ్రొక్కెదన్
దాసునినేరముల్ దొలఁగు దండమునం గదె! మత్తకాశినీ! 205

శా. ఆసన్నం బగుచుండెఁ బ్రొద్దుపొడు పత్యాభీల మై, యెట్టు లీ
గాసిన్ గ్రమ్గెద? నొక్కసారి మదిలో గాఢంబు లౌ కోరికల్
నీ సాన్నిధ్యమునన్ నివేదనమునేనిన్ సల్ప లే నైతి నం
చో సౌందర్యవతీ! నినుం దలఁచి నే నున్నాఁడ భూరివ్యథన్. 206

ఉ. ఇంతకు నన్ను నీ వెటుల నెంచిన నైనను మేలు చేకురెన్
స్వాంతము నీపదాబ్జములపై నిడుభాగ్యము సంఘటిల్లె; నో
కాంత! పరిగ్రహింతువో! నఖాగ్రమునన్ విదలించివైతువో!
చింతిలువాఁడఁ గా నెట్టుల చేసిన; దాసునివృత్తి సేవ యౌఁగా. 206

శా. అంగీకారత్వత్కృతుల్ దలఁప భాగ్యాయత్తముల్ ప్రేమ స
ర్వాంగీణమ్ముగ నర్పణం బిడితి; హృద్వారంబు వీడెన్; కృపా
సంగుం డా పరమేశ్వరుం దలఁతు నీసాన్నిధ్య మవ్యాజ మి
బ్భంగిన్ నా కొడఁగూర్చెఁ దలఁకు; నీబాధల్ వినం బల్కుమా!"

మ. అను నానందునిప్రేమనిర్భరమనోజ్ఞాకారముల్, మానినీ
జనసత్కారవిశాలచిత్తమును, సౌజన్యంబు దీపించు నా
ననబింబంబును, సాధుశీలమును గన్యారత్న మీక్షించి, మిం
చినరాగమ్మున మోకరిల్లె నపు డక్షీణాశ్రులల్ రాల్చుచున్. 209

మ. నిజపాదాభిముఖంబుగా వెలయు నా నీరేజనేత్రల్ దగన్
భుజయుగ్మంబును బట్టి యెత్తె నతఁ; డప్పూవుఁబోఁడి మోహంబు మీ
ఱ 'ఋతోఽస్మీ'తివచస్క యై యురముపై వ్రాలన్, నభోవీథిపై
రజనీకాంతుఁడు తొంగి తొంగి ముదమారం గాంచె నయ్యొద్దికన్.

శా. విద్యుద్వాహికతాఁత్రమతంత్రు లన నుద్వేగప్రసారంబునన్
హృద్యం బై తనువల్లికల్ బెనఁగఁగాఁ బ్రేమాగ్ని వ్యాపించినన్
ఖద్యోతాకృతి నేత్రముల్ గొనఁ బరాకాష్ఠన్ భజించెన్ ముదం;
బాద్యంతంబు లెఱుంగరాని ఘనమోహాంబోధినిర్మగ్ను లై. 211

గీ. బాహ్యచైతన్యము దొరంగి బాహుపాశ
బద్ధు లై జ్యోత్స్నబంగారుప్రతిమలగతి
మధురగాఢోపగూహసమాధిఁ గూరి
ఘటిక నరనిమేషములీలఁ గడిపి వారు. 212

గీ. అంత బాహ్యేంద్రియజ్ఞాన మలమ నక్షి
యుగము లొండొంటిఁ దాఁకె; నాహూత మగుచు
నదరె నధరద్వయమ్ము; దేహములఁ దోఁచెఁ
బుల్కగమి; తమియును దలమునుక లయ్యె. 213

గీ. అధరము స్పృశించి గంధంబు లల్ల నిమిరి
ముంగురులు దిద్ది, చెక్కిలి ముద్దు వెట్టి
మోము మోమునఁ గీలించి ప్రేమ మోసు
లెత్త నానందుఁ డెద నామె హత్తె మరల. 214

వ. పిదప నాతఁడు సానునయమ్ము వెలయ ని ట్లనియె. 215

శా. "రాధా! నాహృదయేశ్వరీ! యిపుడు సంప్రాప్తించె నీప్రేమలో
మాధుర్యం బిసుమంత; ధన్యుఁడను; సన్మానంబుఁ గావింతు హృ
త్సౌధాంతఃపురరాజ్ఞిఁ జేసి నిను, విశ్వాసంబు సంధిల్ల నీ
బాధల్ నా కెఱిఁగింప వేఁడెదను; నేఁడ్వం గారణం బేమియో!"

వ. అనిన రాధ లజ్జావనతాంగి యై వినయప్రియభాషణమ్ముల మెల్లన
ని ట్లనియె. 217

ఉ. "ఏ మని తెల్పుదాన హృదయేశ్వర! మీ తొలిచూపుతోడనే
నా మనము గ్రహించితిరి; నన్ గుఱుతించితిరె కాదె మీరు న
న్నోమినయంత హాస్యముల నోడకఁ బల్కిరి మాధవాదు లే
మేమియొ! యావిహార మది యెందులకో తమ రెంచ నేరరా? 218

గీ. మనముఁ గొనుట చాలక ప్రాణమును నొసంగి
నన్ను సంపూర్తిగాఁ గొనియున్న మీరు
రేపు పయన మై యుండ నేరీతి వగలఁ
బొగులకయ సుఖనిద్రను బొందఁగలను? 219

గీ. వలచి వలపించుకొంటి; నావల సమస్త
భారమును మీదె; నీటనో? పాలనో? నను
ముంచ నెంతురో యెఱుఁగ; నా ముగ్ధహృదయ
మెప్పుడు మీపాదముల వీడ దింకమీఁద. 220

ఉ. పాదము లంటి వేఁడెదను; బాలను; మీచరణమ్ములే యెదన్
బాయకొసంగఁ జేసితిని; భావి నెఱుంగను ప్రాణనాయకా!

మీదయ నాదుభాగ్యము; నిమేష మొకఁడేని యుగమై తపింతు మీ
రేదియొ యన్యమున్ సలిపికేని ధ్రువంబుగఁ జత్తు నంతటన్. 221

గీ. ముడుపుఁ గట్టితి నాచిత్తమును; ద్వదీయ
మీయెడలు సర్వమును నమ్మమీ హృదీశ !
దీర్ఘనిశి నెల్లఁ బొగిలి పద్మిని యుషస్స
మాగమముఁ గోరు లీల వియోగజలధిఁ
దోఁగి యెన్నాళ్లు కుత్తరింతునో ! యెఱుంగ. 223

గీ. అత్యవిశ్వాసిని యటంచు నాత్మఁ దలఁప
వలదు ప్రాణేశ ! మీ చెట్టఁ బట్టుభాగ్య
మొందఁగలనో ! లేనో ! యని యెదవ్ర సంది
యములె నాపల్కులకు మూల మని యెఱుఁగుఁడు. 223

గీ. భావి విఘ్నపరంపరలే విశేష
మెద్దియును సులభోపాయ మెఱుఁగఁబడదు;
ఇంతకును నాకుఁ బ్రేమనిరీక్షణమ్మ
నుదుటివ్రాఁత యగా ననుచు నెన్నుదును స్వామి ! 224

గీ. ఏమి సేయుదు నిఁకమీఁద ? నెట్లు మీ శు
భాభిగమనమ్ము పోసఁగు; నిర్భరవియోగ
మది తలంపఁగ మది ముక్క లగును; జీవి
తేశ ! భావ్యంధతమస మెట్లెదపఁగలను ? 225

గీ. జీవధాతువులను మీరు చిక్కఁబట్టి
పోవుదురు రేపు; నేను వాపోవుచు నిట
ప్రోడువారుదు; నకట ! చెప్పకొని యైన
యూరటం గనుమార్గ మే మెుంచు నింక. 226

గీ. ఈ మహాత్తరసమయమం దిట్లె మీదు
కౌఁగిటం బ్రాణములు వీడఁ గలుగుదేని

జన్మ చరితార్థ మగును; నిష్పార్థ మగుచుఁ
బ్రేమ ఫలియించు; నాకును భీతి యణఁగు." 227

గీ. అనుచు రాధాకుమారి ప్రేమాతిరేక
మున ముఖమ్ము నాతనివక్షమున నడంచి
యశ్రులను రాల్చె; నెద భార మైన సంశ
యముల వెలిఁబుచ్చుచున్నదో యనఁగ నంత. 228

వ. ఆనందుఁ డామె నోదార్ప నెంచి "చెలీ! దుర్భరవ్యథాపరిపీడిత వై యీవిధి బేల వై వాపోవఁ దగునె? దైవకృతం బై పూర్వానుబంధప్రేరితం బయిన మనసంయోగ మనితరదుర్లభము. మనము సంకల్పసిద్ధుల మై యఖండానందమ్మునఁ బ్రేమసామ్రాజ్యాభిషిక్తుల మగుట తథ్యంబు. ఉదాత్తకార్యంబున కుత్తమోత్తమయత్నంబును నావశ్యక మనుట శ్రుతమతి వగు నీ వెఱుంగనిది కాదు. చింతఁ దక్కుము." అని యామెచిబుకము నెత్తి యశ్రుల నొత్తి మోహము గోముగా చుంబించి. 229

శా. "రజనీకాంతునిసాక్షిగా నిను మనోరాజ్ఞీమణిం జేసితిన్
ద్రిజగన్మోహనతావకాస్యమె సదా దీపించు నాచిత్తమం
దు, జయార్థంబుగ సర్వయత్నము లొనర్తున్ ధైర్యము న్గాంచు మం
బుజనేత్రా! విజయంబు తథ్య మనుచున్ ముమ్మాటికిన్ నమ్ముమా!

మ. మనప్రేమాంకురవృద్ధికై తొడరి నీమాతామహున్ దల్లి నే
ర్పున నానాఁటికి యాభిముఖ్యమునఁ బెంపొందన్ బొనర్పం దగున్
అను వౌ రీతిని నప్పుడప్పు డెదియో వ్యాజంబునన్ జూచిపో
దును నిన్నున్, దగునట్లు జాబులను బంతున్ క్షేమముల్ దెల్పుచున్.

ఉ. ఉన్నతవిద్య నేర్వఁ దగు నోడక నీ విటమీఁద, దైవమే
యున్నది నిబ్బరంబు గను, ముద్యమముల్ మనవంతు, దీక్షతో

నన్నియవాంతరమ్ములను నావలఁ ద్రోయ ఫలమ్ము లభ్య మౌ
నన్నిటికిన్ బ్రధాన మగు నెంచ నచంచల మైనప్రేమయే. 232

మ. తరుణీ ! మూల్య మొసంగఁబోక యెటు లుద్యత్ప్రేమచింతామణిన్
ధరియింపంగల ? మింకమీఁద హృదయద్వారంబులన్ విచ్చి నె
త్తురుముల్లెన్ వెల చెల్లునంత కిడ నుద్యోగింత; మాపిమ్మటన్
గరుణాసింధుఁడు దేవుఁడే సలుపుఁ గాంక్షల్ పంచబాణన్ దయన్.

గీ. డీలు వడి ధైర్యసంపదఁ గోలుపోయి
పొందఁగల దెద్దియును లేదు; పూను మాత్మ
యందు నిబ్బర మదియె ఫలాభిముఖ్య
హేతు వగు సుందరీ ! యెద భీతి విడుము. 234

గీ. హృదయమందుఁ బ్రత్యణువు స్పందించు రాధ
మధురనామంబె, కన్నుల మలయు నామె
దివ్యసుందరమూర్తియే తెలియు మబల !
రాధ కేజీవితమ్ము నీరాజనమ్ము. 235

క. రాధ వినా నాజీవిత
గాధయె లే దింకఁ, బ్రేమకల్పలతిక నా
రాధయె, రాధాప్రేమాం
బోధివిహారంబె జన్మభూరిఫలం బౌ. 236

శా. రాధానందులమూర్తి యొక్కెడ దగుచున్ రాజిల్లి సర్వార్థముల్
సాధింపన్ బరమేశ్వరానుమతి జ్యోత్స్నాసాంద్రనిస్తంద్రవా
ర్ధోధిం గూడితి మిట్లు, జీవితమునందున్ వేఱు సేయంగ లే
వాధివ్యాధులు సాంఘికస్మృతులు సత్యం బిద్ది చంద్రాననా !" 237

మ. అని నెమ్మేను చలింప నాతఁ డపు డత్యావేశచిత్తంబుతోఁ
గనులం ద్రావఁగ నెంచెనో యనఁగ నక్కంజాక్షిప్రత్యంగకో

భను వీక్షించుచు మేను పొంగఁ దమి యేపారంగ నాలింగనం
బొనరింపన్ విరజాజి రాల్చెను లతాంతోద్యన్మరందాశ్రుల్ దగన్. 238

గీ. అనవరతమానందసాగరమందు వారు
ప్రేమనౌకను బయనింప వెడలి రంత
నెన్ని సుడిగుండములు కాచి యున్నవో! యను
శంక యొక్కింత లేక యాసమయమందు. 239

మ. తమి యొక్కింత యడంగఁగాఁ బ్రియుని బంధం బూడ్చి "స్వామీ! సదా
మిము సేవింప ననుగ్రహించితిరి చాల్ మీమానసోల్లాసి నై
ప్రమదారత్నము నైతి; దాసి యిదె సద్భక్తిన్ బ్రణామంబులన్
దమ కర్పించెడు" నంచు మ్రొక్కెఁ బ్రియు రాధాతన్వి చెన్నారఁగన్.

వ. అనంతరంబ బాహ్యస్మృతి యలమ రాధాకుమారి యి ట్లనియె. 241

క. "ఒరు లెవ్వ రైన మనలన్
బరికించిన గుట్టు బట్టబయ లగు మీ రా
దరమునఁ బనుపుఁడు పోయెదఁ
బరమేశ్వరసాక్షిగఁ దమ భార్యను సుండీ!" 242

గీ. అనిన నానందుఁ డామెకరాబ్జ మంత
ముద్దుఁ గొని, "ప్రాణనాయకీ! వద్దు సంశ
యమ్ము; ముమ్మాటికిని మన మాలుమగల
మంతరాత్మల సాక్షిగ" ననుచుఁ బనుప. 243

క. వెనుకకుఁ జూచును జుట్టును
గనుఁగొను నూరుపులు విడువఁగా శంకించున్
ననురాగభయముదంబులు
పెనఁగొనఁగా రాధ తన్ను వీడఁగ; నామెన్. 244

క. కని యానందుఁడు లో
చనముల బాష్పములు గ్రమ్మ సముద్రవార్ధిన్

మునిఁగి యొడ ధన్యవాజము
లను నీశున కిడి చనియె విలాసము దోఁపన్. 245

వ. మఱునాఁడు ప్రాతఃకాలమున నక్కుమారద్వయమ్ము కన్యకాసహితు లై పయనింప సన్నాహము లొనర్ప నాయంఁడు వారిని సవినయమ్ముగ నాపూఁట విందుఁ గుడిచి యపరాహ్ణంబునఁ జనఁ దగు నని ప్రార్థియపడఁ, జెలిమికలిమి వారు తిరస్కరింప నోడిరి. ప్రియముఖావలోకనంబునకు మఱికొంత యవకాశము లభించె నని రాధ మిక్కుటమగు నానందమును గవియె. ఆనందుఁడు తనసంకల్పసిద్ధికై మార్గముల నరయువాఁడై ప్రసంగవశమునఁ గూర్మినాయకుని కి ట్లనియె.

క. "తాతా! మీ దౌహిత్రిని
నేతీరున భావి దిద్ద నెంచితిరి; మనీ
షాతులనాశక్యులు; మీ
చేతం బడి కనె యశేషశేముషి నిపుడే! 247

ఉ. ఆమెయు బుద్ధిశాలిని, సమాదరమేదురసాధుచిత్త, గా
రా మమితమ్ము నొందియును రాజిలె విద్దెల మేలుబంతి యై
ఏమి తలంచిరో యెఱుఁగ, మేర్పడ నాంగ్లముఁగూడ నేర్పుచో
మీమురిపెమ్ముతోడు గడు మేలును జేకురుఁ గాదె!" నావుడున్.

మ. "అదియే నామదియందుఁగూడఁ గల, దే మైనన్ సరే బాలికన్
జదివింపంగను గోరుచుంటి, మనయిచ్ఛల్ సాఁగునే ? దైవ మె
య్యది సేయన్ సమకట్టునో యటులె యౌ, నమ్మాయి నిచ్ఛాపురిన్
జదువన్ నాలవఫారమం దిడఁగ నుత్సాహమ్ముతో నుంటి నేన్."249

గీ. అనుచుఁ గూర్మినాయఁడు పల్క నంత లక్ష్మి
హర్షనిర్భరస్వాంత యై యనియె నిట్లు,
"వదినసహవాస మిఁకమీఁద వదలఁబోదు;
దైవనిర్ణయ మిది యెటుల్ తప్పఁగలదు ?" 250

వ. అన నందఱు సాశ్చర్యముగ నవలోకించుచుఁ, బరిపరివిధంబుల నాలోచించుచుండ, నామె "శుభవార్త నెఱింగింతు వినుఁడు. ఒకనాఁడమ్మయు నాన్నయు మా చదువువిషయమ్ము యోచించుచు మమ్మిచ్ఛాపురమ్మున మా పిన్నియింట నుంచి ప్రైవేటుగా మెట్రిక్యులేషనుకుఁ జదివింపవలె ననుకొనిరి. అట్లే యైనఁ దాతగారిసంకల్పమును వట్టిది; కావున మా ముగ్వురికలయిక యనివార్యము కాదె!" అనిన మాలతి చిఱునవ్వొలయ "మొదలు కలసి తనువులు విడివడుటెట్లా యని తపించునాకుఁ దన్నివారణోపాయమ్ము లభించినది. అవశ్యమీసంకల్పము నెఱవేఱు వేయిదేవుళ్లకు మ్రొక్కెదఁ; జెల్లినిగ్గూడ మెట్రిక్యులేషనుకుఁ జదివించుటవలనఁ గాలమును గూడివచ్చు. సహపఠనమును నలవడు" నన నందఱు నుల్లసిల్లిరి. రాధానందులు గటికచీఁకటి నలవడిన దీపకళిక వోలె లభింపనున్న సదవకాశమ్మునకు హృదయమ్ముల నీశ్వరున కభివాదనసహస్రమ్ములు సమర్పించి, తమప్రణయంబు భగవదుద్దిష్టంబ యని యూరటం గనిరి. 250

గీ. అనుపమానందమున వార లచటఁ గడిపి
యపరదివసమ్మునఁ గృతజ్ఞతాంజలి యిడి
పెద్దలన్ దన్పి; రాధ నొప్పిదము మీఱ
ననునయించి, ప్రయాణ మై యరిగి రంత. 252

గీ. మంద విడివడి కల్లోల మందు నావు
భంగిఁ దల్లడ మందుచు బాష్పపూర
మక్షులన్ గ్రాల విగ్రహ మటుల రాధ
చేష్టలన్ దక్కి వారి వీక్షించుచుండె. 253

వ. అంతఁ గ్రమక్రమంబుగ నన్నలువురుఁ బోవుచు; వెనుజూచుచు దవ్వగునంతకు. 254

ఉ. జేబురుమాళ్ళ వీచి తమ స్నేహసమాదరముల్ వెలార్ప, గా
రాబము మీఱ నాయఁ "జవ్వరా! యొకరెండుదినాలమైత్రికే
యీ బల ముండ వృద్ధి యగునేని మహత్తర మౌను గాదె! నా
కీబుడుతల్ చరించుగతి యెంతయు నింతయు సంతసం బిడెన్." 255

గీ. అనుచు నెంచుచుఁ గనుసన్న నాత్మజాత
తెలుఁగఁజేసెను గన్నీటఁ గరఁగు రాధ
నిశ్చలాకృతి; కూఁతును నిమిరి, వేంక
మాంబ యామెను గొని లోని కరిగె యంత. 256

ఆ. వె. కనులు దుడిచి కూఁతు గారాబమున నెద
నొత్తి, "బిడ్డ! యొకతె నుంటి ననుచుఁ
దల్లడిల్లవలదు; త్వరలోనె యొకచోటఁ
గలసి మెలసి యుండఁ గలరు కాదె!" 257

వ. అను జననియోదార్పుల విని "నిజేంగితం బెఱుంగలేదు కదా!" యని సంబాళించుకొని. 258

గీ. "ఎన్నిజన్మల స్నేహమో! యెఱుఁగరాదు;
కాంత మినుమును బోలె నా స్వాంత మిటుల
వార లాకర్షణము సేసివైచి రమ్మ!
ఇంతవఱ కిట్టియనుభవ మెఱుఁగనైతి. 259

గీ. వారి సల్లాపములు ఋజువర్తనములు
గౌరవమ్మును సుందరాకారములును
గలుపుకోలుతనంబు నిష్కపట మైన
ప్రణయశీలము నెంచఁగ వశము గాదు. 260

గీ. రెండుదినములుమాత్రమే యుండి వార
లెన్నియనుభూతులను గూర్చి రెఱుఁగరాదు;

శిశిరమున నాకులక్ష ఝల్లి చిన్నవోవు
ప్రోడుపోలిక వారలు పీడ నైతి." 261

వ. అనిన వేంకమ గద్గదకంఠి యై "యమ్మా! నీ వంత నోము నోచుకొన లేదు. నీతోఁబుట్టువు లైనను నలువు రుండిన సంఘజీవితానుభవముఁ గనియుందువు. ఒంటరి వై పుట్టినది మొదలు పెరుగుటవలన నీ కట్టి యనుభవ మపూర్వము. త్వరలో నీయభిమతము నీడేర్పఁ దగు జతన ములఁ దాతయ్య సల్పు చున్నాఁడు. చింతఁ దక్కు" మని బుజ్జగించె.

శా. కారుణ్యామృతవాహినీ! దివిజగంగామంగళాసంగదో
పారంభప్రశమప్రసిద్ధ బుధసేవ్యామోఘసజ్జీవనా!
సారోదారజగద్ధితస్తుతవచస్కా! మాతృదేవీ! యకూ
పారాకారగభీరచిత్త! మహిళాప్రామాణ్యమా! చిన్నమా! 263



శ్రీమ న్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

## ప ం చ మా శ్వా స ము



మహితోత్ప్రౌఢగృహస
నామక తేజోనిధీ ! సనాతనధర్మ
ప్రామాణికవర్తన ! హిత
కామా ! మాతృముఖశశివికర్తన ! జనకా ! 1

వ. అవధరింపుఁడు. 2

క. నయవినయధీరసారా
శయవిజయోపాయసుగుణచయసంస్తుత ! మ
త్ప్రియ ! ధర్మకర్మమర్మ
జ్ఞ ! యఘరహిత ! యన్నపూర్ణ ! శాంతోదీర్ణా ! 3

వ. సావధానచిత్తవై యవ్వలి యితివృత్తంబు నాకర్ణింపుము. 4

గీ. తన యమోఘానుభవములఁ దలఁపఁజేయు
నట్టి విరజాజిపాదను నిత్యమును రాధ
సఖిగ సమ్మాన మొనరించు స్వాంతమందు;
ననుదినం బటఁ జేరి యేకాగ్రవృత్తి. 5

ఉ. పొత్తము చేతఁ బట్టి యనుభూతులు మౌనముగాఁ బఠించు, ను
వ్వొత్తుగ రేగు నూత్నమధురస్మితముల్ హృదయమ్ము నింగిపై
కెత్తుకపోవ విస్మరణ నెన్నఁడొ ! ముంగిటఁ బడ్డ గ్రంథముల్
అత్తరళాక్షి కాన దనయం బపరాహ్ణములందు నొంటి మై. 5

మ. అనురాగాశ్రుల కాశ్రయం బయిన బృందావనసాన్నిధ్యమున్
దనజీవాణువులన్ జలించునటు లత్యంతంబు సల్పన్ సదా
చను నర్చింపఁగ దాని రాధ శుచి యై సాయహ్నమున్ బ్రొద్దుటన్
వినుతించున్ దలపోయుచుండు గతమున్, వేడుకన్ మనస్స్థితయై. 7

ఉ. మాననిప్రాణభీతిఁ దొలిమాఱు లభించె, వియోగవేదనన్
బూనఁగ నద్వితీయముగఁ బొందెను రెండవమాఱు దేహ మా
సూనశరానుకారుఁ డగు సుందరుకౌఁగిటఁ గూరుభాగ్య మం
చానవమోహనాంగి తనయందము నద్దముఁ జూచి యెంచుచున్. 8

గీ. పూత మా ప్రణయాగ్నినిఁ బుటము వెట్టఁ
బడిన మేలిమి కాదె యీయొడలు, జీవి
తేశ్వరానుభుక్తం బయి యెసఁగుటను బ్ర
సాద మిది యని యెంచు నాచాన యెదను. 9

శా. రాధానందసమాసనామమును నా రాకేందుబింబాస్య హృ
ద్వీథిన్ నిత్యము నిల్పి సంతసిలుఁ; బృథ్విన్ బ్రేమ మధ్యాంగుళిన్
రాధానందు లటంచు వ్రాసి ముదమారం గాంచి మే న్వొంగఁగా
"నాథా!" యంచు వచించు బిగ్గరగ నానందైకచిత్తంబునన్. 10

ఆ. వె. ఒడలు దెలిసి లజ్జ పొడమ నల్దిక్కులఁ
గలయఁ జూచు వినిరొ! కనిరొ! యనుచు;
నధరములఁ జెఱుపు టశుభంకరం బని
చెఱుప నోడు నుంప వెఱచు రాధ. 11

శా. ఏయేచోటులయందుఁ బ్రాణసఖుఁ డయ్యేపల్కులన్ బల్కెనో!
ఏయేవేళలయందుఁ బ్రేమ నతఁ డెట్లీక్షించెనో! తన్ను మో
హాయత్తుం డయి సల్పె నేమొ! యవి; తా నన్నింటి నూహించుచున్
జేయున్ రాధ ప్రియాకృతిన్ హృదిని నిక్షేపింప నేకాగ్రతన్. 12

చ. మధురవసంతకాలము సుమా! యని కోయిల హెచ్చరింపఁగా
విధుఁ డనురాగచంద్రికల విశ్వము నెంతయు దొప్పఁదోఁచఁగా
బధిరుఁడు నంధుఁ డై వెలుఁగుబాటలకై తపియించుయోగి నా
మధుకరవేణి శయ్యఁ దనమానసచోరుని గల్పితాకృతిన్. 13

ఆ. వె. పాదుకొల్పి మధురభావపుష్పమ్ముల
నర్చ సేయు విడుచు నశ్రువారి
విమలజీవితము నివేదన మొనరించుఁ
బ్రణయసిద్ధి నిశలఁ బడయ రాధ. 19

చ. పలువిధముగ్ధభావములు పైపయిఁ గ్రమ్మఁగఁ బ్రాణనాయకున్
దలఁచుచుఁ జిత్త మెంతయును దన్మయ మై యరగన్ను మోడువన్
జెలువుఁడు కౌఁగిలించి నునుజెక్కుల నంటుచు మోవిఁ ద్రావున
ట్టుల కలఁ గాంచి, భీతిలి, యిటుల్ సనుదేరఁగ నీతి యౌనె ? లో
కులు పలుగాకు లంచుఁ గనుకోనల విచ్చును రాధ భ్రాంత యై. 15

ఉ. శూన్యముఁ గాంచి తాఁ దెలిసి సుస్థితి చిత్తము గాంచ రాధ, సన్
ధన్య నొనర్ప వచ్చి యెదఁ దార్చినచెల్వుని నీసడించితిన్
మాన్యచరిత్రు నిట్టు లవమానము చేసితి మత్తురాల, న
న్యోన్యము ప్రేమఁ గల్గ నిది యర్హమె యంచుఁ దలంచి చింతిలున్.

గీ. ఇటుల రాధాకుమారి యుత్కటవిమోహ
లతిక లానందమూర్తి నాలంబనముగ
దినదినాభివృద్ధినిఁ బొందఁ దనరె నగ్ని
శిఖలు ఘృతధారలను వృద్ధిఁ జెందునట్లు. 17

క. మితభాషణము, గభీరత,
సతతాలోచనము, సుప్రశాంతిఁ గనమియున్
నుతయందు గోచరించుట
మతి నెంచెను వేంకమ యది మైత్రిబలముగన్. 18

వ. అంత నొకనాఁడు వేంకమ కూఁతు ననునయాలాపమ్ముల నాడుచు, "అమ్మా! నీ వేదియో వేఱొకతీరునఁ గన్పట్టుచుంటివి. వెతలఁ గుడుచునట్టి యిబ్బంది లేమికలవు? మనవారు వచ్చిపోయినది మొదలు నీయం దీమార్పు కననగుచున్నది. స్నేహము బలవత్తర మైనదియే; కా దనను; కాని మనము నించుక చిక్కఁబట్టుకున్న నెట్లు? ఇంకొక నెల కడచిన మరల మీరు పాలునీరుం బోలె కలసి మెలసి యుండఁ గలరు గదా!" యనిన రాధ నవ్వుచు "అమ్మా! యిట్లు పలుకుచుంటి వేమి! నా కేమికొదువ యని దిగు లొందుదునే? నీవెఱ్ఱి. కుడువ లోపమా? గుడ్డ లోపమా? ఏదో బలీయమైన స్నేహమేర్పడుటవలనఁ గొంచెము బాధగనే యున్నది; కాని దిగు లెందుకు? కొలఁదు లెఱుఁగని ప్రేమవలన నీవు నే నేదో వనటఁ గుందుచున్నా నని భ్రమపడుచుంటివి; కాని యట్టి దేదియు లేదు. చింతఁ దక్కు;" మని చెప్పునవసరమ్మునఁ దపాలాబంట్రోతు కేక వైవ, రాధ చావడిలోనికిం జని తనవిలాసము గల పార్సిలు సంతక మొనర్చి తీసికొని, యానందునిచేఁ బంపఁబడిన దని దస్తూరీనిఁబట్టి గ్రహించి, యానందనిర్భరహృదయ యై తల్లికడ కేఁగి ముఖవికాసము చెంగలింప "నమ్మా! బంగీ వచ్చినది. అక్కయ్య పంపియుండు" నన, నామె యాశ్చర్యానందపరిపూరిత యై "విప్పవే!" యనుడు రాధ దానిని విచ్చి యందు వేర్వేఱుకాగితపుసంచు లంటింపఁబడియుండుటం గాంచి, విస్మయంబునం దోఁగుచు నొక్కొక్కటిం దీయు వానిపైఁ దాతగారియు జననియుఁ దననామాక్షరంబు లుండుటఁ గానరా నవి వేఱ యుంచి విచ్చి పరిశీలింప మాతామహునిసంచిఁ దెఱువ నందు బుడితివెలమనూలు చిగురుబొత్తంచు చాపును, గుశలము నెఱింగించు జాబును; దల్లికై నిర్దేశింపఁబడిన సంచియందుఁ బొందూరు ముత్యాల పందిరియంచు జరీపాటెనూలుచీరెయుఁ గృతజ్ఞత వెలార్చు లేఖయును

గానరా నవి వేఱుగ నుంచి, సంభ్రమంబునఁ దఱచించి దెఱువ బరం
పురపు వంగపండురంగుపట్టుచీరెయు, నీలకెంపురంగు చెంగలించు
కంచుకమును, నాలుగు లేఖలును, వివిధము లగు విహారచిత్రము
లును గాంచి తన లేఖలను బైఁటలో దాఁచుకొని, యాచిత్రములను
దల్లికిఁ జూపించుచు నాయూసన్నివేశమ్ములు వర్ణించుచు నుబ్బి
తబ్బిబ్బైపోవు నవసరమ్మునఁ గూర్మినాయుం డరుదెంచి తాను
నాయూనందంబునఁ బాలు పంచుకొనియె. ఆనాఁ డెల్లవారి కాబహూ
కృతులఁ గూర్చియు వారి సౌజన్యమును గూర్చియు ముచ్చటలతోఁ
గడచె. రాధ యేకతమ్మున మైత్రివెలయించు నాలేఖ లన్నియుఁ జదివి,
యానందుని లేఖను బదేపదే చదువుచుఁ దనివి తీఱఁ గనుల నద్దుకొని
ముద్దుఁగొని పారవశ్యమ్మును దద్దయుఁ గని కొంతవడి కవ్వానిని దన
ట్రంకుపెట్టియయందు భద్రపఱచె. 19

క. మఱునాఁడు రాధ వేడుక
నరయుచుఁ జిత్రముల, నందు నానందుని చి
త్తరువుదరినిఁ దనబొమ్మను
గర మనురాగమునఁ జేర్చి కడుముద మొందెన్. 20

క. ఈ రెంటిని నొకచట్రముఁ
గూరిచి యుంచునెడ శంకఁ గొంచు రటంచున్
నేరుపుగా నేర్పఱచెను
నా రమణి మనోభిలాష మల్లన దీఱన్. 21

గీ. తనకుఁ గుడిదెస నానందుఁడును దదీయ
పార్శ్వమున లక్ష్మియును వలపలను మాధ
వుండు నంతట మాలతి యుండునట్లు
చిత్రములఁ గూర్చెఁ జట్రముఁ జెలువు మీఱ.

గీ. దానిఁ జల్లికిఁ జూపి యుత్సాహ మలర
"నర్వా మిది చూడు మనుజను సనుజు లిద్ద
రావరమ్ముఁప నిరుప్రక్కలందు నిలిచి
కాచుచున్నారు మేము ప్రక్కలను నుండ." 23

వ. అని పలుకు కూఁతు ముగ్ధభాషలకు వేంకమ సంతసిలి, "యమ్మా! చాల బాగుగా నమర్చితి" వని మెచ్చికొనియె. 24

చ. పదపడి రాధ యొంటిఁ జని పట్టుజరీపనిచీరె విప్పి స
మ్ముదమునఁ దాల్చుచుండ నొకముద్దులసిల్కురుమాలు జాఱెనన్
"ఇదికొమొకఁ డద్దిరా!" యనుచు నేర్పునఁ దీసి కనంగ నంచునం
దదికిన ప్రాణనాథు నభిధాక్షరముల్ గనువిందుఁ గూర్పఁగన్. 25

శా. "ఓహో! యియ్యది మానచోరుఁ డిడెఁ దా; నూహింపఁగా నన్ను సం
దేహానందము లందు ముంచుటకు నిం దీప్రేమచిహ్నంబు; స
మ్మోహావిష్ట మొనర్చె" నంచు మదిఁ బెంపున్ గాంచు ప్రేమత్రపో
త్సాహోద్వేగములన్ సుమాంగి మునిఁగెన్ దబ్బిబ్బు లై చేష్టలన్.

ఉ. కన్నుల నద్దు దాని, మది గాటపుకోర్కులు రేగ ముద్దు లె
న్నెన్నియొ పెట్టు, చెక్కిటను నేర్పడ గోముగ నుంచుఁ, గాంక్ష మై
చన్నులఁ గప్పి యద్దముదెసం గను, నాచికురాంగి మోహాసం
ఛన్నమనంబునన్ బ్రియుఁడు సన్నిధి నిల్చినపోల్కి నెంచుచున్. 27

శా. సింగారించెను జీరె రైకల వెసన్; జెన్నారె సౌందర్య మా
భృంగశ్రేణిసమాలకన్ ద్విగుణ మై, ప్రీతిన్ నిజాకారశో
భం గన్నార నతృప్త యై కనియె నప్పద్మాక్షి యద్దంబునన్;
బొంగు ల్వారినప్రేమవాహిని యనన్ బూఁబోఁడి భాసిల్లుచున్. 28

మ. చని యానందునిచిత్రమున్ గని నమస్కారంబుఁ గావించి, లో
చనయుగ్మం బరవిచ్చి "మానహర! మీ స్వాంతంబు రంజింపఁగా

ననువే దాసి వికృతవేష; మిషి మీ కర్ణ్వంబుగా జంచుఁ దోఁ
చిన మీరే సవరింపఁ జింపగ పసూక్ష్మిగ్ధాంతరంగంబునన్. 29

మ. మిము రంజించుట చేటిధర్మ మగు స్వామీ! లోపముల్ దిద్దుఁ, దం
డము గన్నారఁ గనుండు; తృప్తిఁ గనుడున్ ధన్యంబుగా నెంతు జ
న్మము, ప ల్కొంచు వినంగ నెంతు, ననుఁ దప్పన్ గూర్మితోఁ బల్కరే
యమృతస్వాదమనోజ్ఞకంఠమున నాయుండంబు శ్లాఘింపుచున్. 30

ఉ. ఏ మిది ప్రాణనాథ! తమ రీక్రియ మౌనముఁ బూన న్యాయమా?
నామది నెట్టు లోర్చెడ? ననాదర మొందఁగ నేమి చేసితిన్?
స్వామి! యెఱుంగఁజేయుఁ డపచారముఁ గా బొరపాటు సల్పినన్
దా మిటు నిర్దయం గనిన దాసి యుపేక్ష సహింప నేర్చునే?" 31

మ. అని భావించుచు రాధ బాష్పపరిపూర్ణాక్షిద్వయిన్ మోడ్పు లో
చనముక్తాశ్రులఁ బైఁట చెమ్మగిల నిశ్వాసోష్ణ మావారి నా
ర్పనుతిం గాంచెఁ గుచంబు లంతట హిమప్రాబల్య మేపార మో
డ్చినపద్మద్వయి వాయుపాతమున వాసిం గాంచుచందంబునన్. 32

గీ. ఇటుల రాధాకుమారి యుత్కటవియోగ
జలధి నీఁదఁగ సుఖయానసాధనముగ
ప్రియుఁ డనిచినట్టి వస్తుసంచయముఁ జేసి
కొని కడంగెను నాత్మేశుఁ గనఁగోరంగ. 33

ఆ. వె. చెలిని విడిచి యరిగి తలఁపుపొంతరలలోఁ
గూరి, వనట మివులఁ గుడుచు నెడఁద;
ననయ మిట్టు లగుట నానందుఁ డనురాగ
బలము సుంత యంతఁ దెలియఁగలిగె. 36

శా. సాయహ్నంబునఁ జల్లగాలికయి కాసారప్రదేశంబునన్
హాయిం బ్రొద్దులు పుచ్చువేళలను నయ్యానందుఁ డింపారఁగాఁ

దోయఁ బ్రోడ్కసంప్రపుటంబమును ముద్దుల్ వెట్టుచున్ గల్వ సా
ఖ్యాయత్తస్థితి నుంటఁ గాంచి యెదలోఁ గ్రాఁగున్ విషాదంబునన్.

ఉ. కోయిల మావిగున్నపయిఁ "గో" యని పంచమసుస్వరంబునన్
గూయఁగ మానసం బెచటికో పయనించును గుండె జల్లనున్
మాయును మేనిపైఁ జెలివి, బ్రమాన్పడు; నిత్యము నేకతంబు రా
ధాయువతీమనోజ్ఞముఖదర్శన మాతఁడు బొంది ముగ్ధుఁ డౌ. 36

శా. భావోద్వేగము మేర మీఱ నతఁ డబ్భామామణిన్ జిత్తమం
దావిర్భూత మొనర్చి తన్మయతచే నానందపాథోధివీ
చీవిన్యాసమునందు మున్కలిడు; హృత్సీమన్ సదా చిత్కళా
లావణ్యంబును గాంచు సాధకునిలీలన్ బొల్చు దా నొంటి నై. 37

మ. గతవృత్తమ్ముఁ దలంచు, భావిగతి కేకాగ్రాత్ముఁ డౌ, విఘ్నసం
తతి నూహించు, భయమ్ము నొందు, నెదలో ధైర్యంబు రేకొత్త నా
హుతి నాజీవిత మింక సల్పుదును నీహోమాగ్ని నం చెంచు, మా
రుత మశ్వత్థము నూఁచునట్టు లతఁ డాక్రోశంబునన్ గంపిలున్. 38

మ. "మొసళుల్ గ్రమ్మఁగ భీతిగొల్పుకొలఁకు న్స్మార్తాశ్రయం బై కడున్
గసి నొప్పారుసమాజ మొక్కటి యగున్; గార్పణ్యమాఢ్యంబులన్
మసిఁ గావించు నెదిర్చువారలను, దుర్మానంబు నాచారలా
లస లద్దానియలంకృతుల్, దలఁప నేలా! దైవమే తోడ్పడున్. 39

మ. కులమున్ విద్యయు రూపమున్ గుణము పేర్కోఁ దగ్గ సౌశీల్యమున్
గల వా లేమకు, వీని నన్నిటిని బైఁ గ్రమ్మంగఁ జాల్ ప్రేమ, ని
స్తులరత్నంబుఁ బరిగ్రహింపఁగను జేతుల్ ముష్వ నేలా? మహా
కలుషం బియ్యది; లేశమాత్ర మగు శాఖాభేదమే లెక్కయా? 40

ఉ. సంకుచితాత్ము లె ట్లనిన స్వాంతమునం దిడ నేల? మాధ్యదో
షాంకితు లెట్లు తృప్తిఁ గనఁజాలుదు; రెన్నఁగ నాత్మబుద్ధియున్

గొంకమియున్ జగున్ మఱఁగఁ గోరెడువో భుజిః సాహసాత్ముఁ డా
తంకము లన్నియుం గడచి తథ్యముగా విజయంబు నొందెడిన్. 41

మ. ఇరుపక్షంబుల నున్న పెద్దలను ము న్నేరీతిగా నైన లోఁ
బరుపంగావలె, నట్టు లైనయెడ సంప్రాప్తించు నాత్మాధికా
కరమున్ బట్టెడిభాగ్య, మిందులకు నొక్కండె నేను సాధింపఁగా
గురుభారం బగు, సన్నకుం దెలిపి నాకుం దోడు గా వేఁడెదన్." 42

మ. అని యానందుఁడు నిశ్చయించి యిటు సేయన్ బోలునో! కాదో! యే
మొనరింపం దగు నంచు యోచనలు తా నూహించుచు యోగ్యం బటం
చు, నుపేక్షించుచు నుండ మాధవుఁడు మోసల్ గొన్న గారామునన్
అనుజున్ గన్గొని యిట్లు పల్కె మధురం బైనట్టివాక్యంబులన్. 43

శా. "ఏరా! తమ్ముఁడ! నీవిధంబుఁ గన నా కేవేవియో యోచనల్
మేరల్ మీఱి జనించుచున్న విది యేమీ యోగ్య మై తోఁచ, దా
హారంబున్ సరిగా భుజింపవు, విహారానంతరం బిట్టికే
రై రూపొందఁ గతం బదేమి? కడుఁ జిత్రం బయ్యె నీపోకడల్. 44

ఉ. ఏదియొ కోలుపోయినటు లెంతయు డిస్వాడి కానవత్తు, వా
మ్లానము మచ్చుకైనఁ గన, వత్యధికంబుగఁ జిక్కిపోతి, వీ
మాదిరి నిన్నుఁ జూడ నొకమాఱును బాల్యమునుండి, తెల్పు నా
మీఁదను నొట్టుఁ బెట్టితి సుమీ! దాపరింపకు మింక" నావుడున్. 45

వ. వెదుకఁబోయినతీవ కాళ్లఁ దవిలెఁ గదా! యని సంతసమ్మును నాన
నిడియె నని ఖేదమును జెనఁగొన నానందుఁడు దన ప్రణయవృత్తాంత
మును తు. చ. తప్పకుండ నంతయు నెఱింగించి, యనంతర మి ట్లనియె.

గీ. "గగనరత్నముఁ గోరుచుఁ బాఁగులు చిన్ని
కుఱ్ఱవడు వయ్యె నాస్థితి; కొఱవితోడ

బుజ్జగించుకొంటిని; రాధ వెఱ్ఱి మొఱ్ఱి
నా నుడుల నమ్మి యాశల నూనె మదిని. 47

శా. అన్నా! యే మని తెల్పువాఁడ; మును నే నాకాంత నూరార్చి యె
న్నెన్నో బాసలు సల్పినాఁడ; శిఖినాన్నిధ్యంబునన్ లాఁచు వై
చెన్నారెం గస నామనస్సు; విను రాజీవాక్షి నర్ధాంగిగాఁ
గొన్నన్ ధన్యుఁడ, లేనినాఁడు గతి నాకుణ బ్రహ్మచర్యంబ యా.

క. ఇందునిభాస్యాసుఖమో
కందరముఖమో యొకండు గతి యా నాకున్
ఎందున్న నైన నామదిఁ
గుందరదనమూర్తి నిలుపుకొందును సతమున్. 49

క. భూరితపఃఫల మెదియో
యీరీతిని గూర్చె మమ్ము నీకఁ బ్రేమసుధా
పూరముఁ గ్రోలితి జుబ్బన
చూరఁగ, నన్యములఁ దలఁపఁ జూడను భావిన్. 50

గీ. ప్రణయసామ్రాజ్యపట్టభద్రతయొ లేక
ఘనవియోగాగ్నిశిఖలనిగ్రహముఁ బూని
మరణపర్యంతమును రాధ మార్గగామి
కాఁగఁ గడపుటయో యగు గతి ధ్రువమ్ము. 51

గీ. ఊర్ధ్వగతి నొప్పు కీలల నొందు దెసకుఁ
ద్రిప్ప శక్తు లెవ్వారలు; ప్రేమశిఖలఁ
జిక్కి పరసీమ ధ్రువముగఁ జేరఁగలను
నాజ్యధారవు నీ వైన నాదరమున. 52

గీ. కన్య వెన్నాడ జన్మముఁ గాంచి తీవు
దుస్తరసమాజవార్ధి నుత్తుంగసంప్ర

దాయభయదోర్మికలను నిస్తరణ సల్పి
రాధికామహాసక్తి క్రమముఁ బొందు బ్రాఁత నాకు. 53

గీ. సానుభూతిని బూని నీ సహజకోమ
లం బయిన చిత్తమందుఁ జలింపు మన్న !
కుప్పఁగూల సగాధమం డిప్పగిడిని
నుద్ధరింపఁ దలంచుట యుచిత మనుచు." 54

క. అని పల్కు తమ్ముగుజ్జను
ననునయదృష్టులను గాంచి యమృతకల్పం
దనము లగు వాక్యముల ని
ట్లనియెను మాధవుఁడు చింత నందుచు సంతన్. 55

చ. "ఇది యొకకష్ట మైనపని యేమియుఁ గాదు; విశేష మేమనన్
జదువు సమాజమందుఁ గడు స్వల్పము; కావున మాత్య మెంతయున్
గుదురుకొనెన్, రవంత మదిఁ గొంకును వీడిన శాసనంబె యు
న్నది తగురక్ష యై; వెత గనం దగ దించుక దీనఁ దమ్ముఁడా ! 56

ఉ. నీమదిలోనిశంక యవినింద్యము; పెద్దలు సమ్మతింపఁగా
నామెఁ బరిగ్రహింపఁ దగు నంచుఁ గదా ! తలపోయుచుంటి; విం
దేమి మునింగె ? యత్నముల కేమి కొఱంత ? పొనర్చిచూచి, వా
రేమి యొనర్తురో కనుద; మీఁతకు మించినలోఁతు యున్న దే. 57

చ. చదువరి యామె, ధైర్యమున స్వాభిమతం బెఱిఁగింపనేర్చుఁ; గా
దిది, యది యా నటంచుఁ దగఁ దెల్ప సమర్థ; తలంప నింతటన్
వదలక ప్రేమ పెంపుఁ గనుభంగుల నారయ నౌను, స్నేహసం
పద చివురింపఁజేయు మనపంచిన మొన్నటికాన్క లెంతయున్. 58

చ. అదను నెఱింగి నేఁడుమొద లందఱమున్ బుడిసెంతువారి పో
యుద మనురాగసస్యము మహోద్ధతిఁ బెంపుగనంగ; మేలిదో

హృదమున రెండువంశములయందున స్నేహము వృద్ధిఁ గాంచుచో
నిది యొక టేమిగొప్ప ! భువినే దివిఁ జేర్పఁగవచ్చు సోదరా ! 59

చ. చదువులు నేర్వ మీజనని సన్నిధిఁ జేరినఁ గూడిమాడి చే
యుదు రనురాగ మెంతయును యుక్తముగాఁ జివురింపఁ జెల్లి మీ
వదినయుఁ; గాన నీపని సవశ్యము సల్పఁగఁ బ్రోత్సహింత; మి
య్యది మనయత్నలబ్ధికి మహత్తరసాధన మంచు నెంచుమా ! 60

క. లక్ష్మికి వెలార్చు లోచన
పక్ష్మలముల రాధ ప్రేమఁ బఱపుట మున్నే
లక్ష్మమాలతు లెఱిఁగిరి
సూక్ష్మంబుగఁ; గాన వారుఁ జొత్తురు పెనుపన్. 61

క. కీ డెంచిమె మే లెంతము
గూడక పెద్దలు శశింపఁ గొనఁ దగు నామెన్
ఓడక గాంధర్వంబునఁ;
గాడిని పెద్దలను బిదపఁ గట్టఁగవచ్చున్. 62

గీ. తలపోయఁగ మొలబంటియె
జలనిధి తెగువరికి; నీవు జంకవలవ, దా
శల వీడఁ దగదు; సాహస
మలరన్ సంస్కార మిద్ది యగుఁ జేయవలెన్. 62

గీ. అంతరాత్మసాక్షిగ నీకు నన్నిగతుల
సాయ మొనరింతు; సంఘసంస్కారబుద్ధి
చిరము నీయందు నభివృద్ధి నేయఁ గోరి
యనుదినమ్మును సేవింతు నాదిదేవు. 63

క. కార్యవిధిజ్ఞత వెలయన్
దోర్యగమున దీనిఁ బూనఁ దొడరుము లక్ష్మి

ధుర్యుఁడు సాహసుఁ డను నుడి
యార్యస్తుత యిద్ది సంశయము నొందకుమా! 65

క. తలఁపుము "స్త్రీరత్నమ్ దు
ష్కులా దపి" యనెడి నుడిన్; విశుద్ధకులజ యౌ
లలనారత్నము దానే
వలచి యరుగుఁదేరఁ జింత వల దూసంగన్. 66

గీ. భార మీశునిపై నిడి పాటుపడుట
కర్జ మింక మీఁ దెట్టిసంకటము లెదురు
పడిన నడుము బిగింపఁగ వలయు, నిందు
మీనమేషముల్ లెక్కింపమియె శుభంబు. 67

క. మానఁదగదు షష్టాష్టక
మైనను బెద్దలకు మనకు నానుడతిని నె
ల్లైనఁ గొనుట లక్ష్యముగా
నీనాఁడే కార్యసాధనేచ్ఛ చెలంగన్. 68

గీ. అందఱమును మీచిత్తము లైక్య మగుచుఁ
బ్రణయఫలసిద్ధు లగునంతవఱకుఁ గార్య
దీక్ష వహియింత మింక సందేహ మోహ
సంఘమాధ్యమ్ము లడఁచి సంస్కారదృష్టి." 69

గీ. అనుచుఁ బురికొల్పి మాధవుఁ డన్నివిషయ
ములను, సాధకబాధకములను దెల్పె
మాలతీలక్ష్ములకు; భావిమార్గము నవ
రింప సంసిద్ధు లైరి సంప్రీతి వారు. 70

మ. ఇటు లానల్వురు భావికార్యగతినే యెల్లప్పు డూహింప నం
తటఁ బ్రత్యుత్తర మంపె నాయఁ డతి హృద్యం బైనవాక్యాళి వి

స్ఫుటరాగం బెలయించుచున్, బనిచె వస్తువ్రాత మానందసం
ఘటనార్హంబుల వేఱువేఱుగను వేశ్యన్ సల్వురం గూరఁగన్. 71

చ. అవి కొనిపోయి వారలు ముదాబ్ధి సుభద్రను నారసింహునిన్
మిపులఁగ మెచ్చి "యెన్నతరమే యతిసజ్జను లైన వారి; బం
ధువు లసఁ బ్రాణ మొడ్డుదురు; దుర్భర మాయనురాగ" మంచుఁ జె
ప్పి, వినుతిఁ జేసి తన్ని రతివేలముగాఁ దగ నొక్కగొంతునన్. 72

గీ. "ప్రాంతవస్త్రస్నేహమ్మును బాంధవమును
వెలికిఁ దెచ్చితి రీరీతి వేశ్య యయ్యొ"
ననుచు నరసింహుఁ డెంతయు నభినుతించెఁ
గుజ్జులను భూరిమైత్రి యతులను వెలయ. 73

గీ. వేంకమాంబను రాధను విమలమధుర
మూర్తులుగ నాత్మ భావించి ముగ్ధచిత్త
మలరఁగ సుభద్ర బిడ్డల నడిగి వారి
వర్తనాకారరాగసంపదల నెఱిఁగె. 74

గీ. "పిలుపమువేని చదువఁగా బాలిక లట
కేఁగినంత నే నొకపరి యెట్టులైన
సీతతోఁ గూడి పోయి దర్శింతు వారి;
ముఖ్యముగ రాధపై మది పోవుచుండె." 75

గీ. అని సుభద్ర పల్కఁగ విని "యమ్మచెల్ల!
కుదుటఁబడెను ప్రాణము" లనుకొనిరి బాలి
కలు; "లభించె నేఁ డొకతెప్ప కడలి నీఁద"
ననుచు మాధవానందులు గనిరి ముదము. 76

వ. అంతఁ గతిపయదినమ్ము లరుగుఁడు నానాఁటికి వృద్ధి నొందు గ్రీష్మము
భీష్మమ్మగుఁడు. 77

చ. తపనమయూఖతీక్ష్ణపరితప్తవిశాలవసుంధరాసతీ
విపులమహోగ్రనిస్స్వసనవేష్టితమో యనఁ మేక మీఱఁ గా
డుపు లతియుష్ణమై దెసల, మల్చిన మైకలపంబు నాఁగ నా
తపపరిశీర్ణభూరజము దద్దయు విస్తృతిఁ గాంచె నంతయున్. 78

చ. చెఱువులు దొర్వ్వ లాజేచి, కృశింపఁగఁ జేసి నదుల్, వినోదమే
దురరమణీయశాద్వలులఁ దూలఁగఁ బుచ్చి, లతాలతాంగులన్
గరుణఁదొఱంగి మాడ్చి, పగఁ గైకొని కేలను బ్రుక్కఁజేసి, దు
ర్భరపరిపాలనంబు దినపాలుఁడు గ్రీష్మమునందు సల్పెడిన్. 79

మ. వడగాడ్పుల్ పచరించి, సత్త్వముల తాపం బొందఁగాఁజేసి, చే
ఱెఁడు నీరైన లభింపనీక, కడు నార్తిం గూర్చి, యాకైన నొ
క్కఁడు సల్లార్పఁగనీక మిక్కిలిగ యుక్కుం దక్కఁగాఁజేసి, యే
పడుపం బూనెను గ్రీష్మ మన్నక్రియఁ దా సత్యుగ్రమై నట్టెలెన్. 80

శా. పోడుల్ ధూమసమూహ మభ్రమునఁ బెంపుం గూర్పఁగా మండె, మ
ల్లాడెన్ భూరితృషాప్రపూర్ణ మయి వన్యప్రాణిసంఘంబు, తా
రాడెన్ గ్రామసమీపభూములను నీరాకాంక్ష భల్లూకముల్,
లేడుల్ వారిని నెండమావులను హోఘిం ద్రావఁ బర్వెత్తెడిన్. 81

చ. ఖరకరుఁ డుగ్రమూర్తిఁ గొఱకంచుల మించు మయూఖజాలముల్
బఱపి చుఱుక్కునన్ బుడమిపైఁ దలిఁ జూడిన వాఁత లెంతయున్
దిరముగ నిల్చెనో యనఁగఁ దేలెను బీఁటలు గాటమౌచు, న
బ్బురముగ లోకబంధుఁ డెదఁ బూనె క్షమాక్షమఁ జూడనో యనన్.

క. చలివేంద్రలు చవికలు గడు
వెలసెఁ, గవాక్షముల వట్టివేళ్ల తడికలున్
జెలు వలరెఁ, దాళవృంతా
నిలములు లేపనములు హావణించెను జెలుచన్. 83

గీ. ఉక్క మిక్కిలి మై చెమ టెక్క ప్రక్క
కొత్తి గిల్లిన గుబ్బెత యుబ్బుగుబ్బ
లబ్బురముగఁ బయ్యెద వీడు టరసి వేఁగు
జామునఁ బ్రియుండు కౌఁగిటఁ జానఁ జేర్చు. 84

క. తరవాణియుఁ బులిమజ్జిగ
కర మిష్టము లయ్యె; నుసిరికాయలు మాగా
యరుచులును ముద్దకూరలు
తఱ చయ్యెను భోజనము నిదాఘమునందున్. 85

మ. కుచమధ్యంబుల బాహుమూలముల వక్షోజంబులన్ నాభిఁ జే
రిచె ఘర్మాంబువు, ప్రేవు నేపుఁ గొనె, నారీలోక మింపొందఁ గూ
రిచి మైఁ జందనలేపనంబులను గూర్మిన్ నించి రాత్మేశులన్;
రచనాకర్షణవేషభాషలను నేర్వంబోలుగాఁ బైఁదలుల్. 86

క. జుబ్బాలను విడి యువకులు
కబ్బాలను దాల్ప వయసుకత్తెలు గులుకుం
గుబ్బలపై 'బాడీ' లిడి
తబ్బిబ్బు లొనర్చిరి యువతతి వేసంగిన్. 87

సా. సాయహ్నంబుల నాలిగాలి మెసవన్ సర్పాళి వల్మీకరం
ధ్రాయత్తస్థితి భోగముల్ దెఱచి సంప్రాప్తానుమోదంబునన్
వాయుస్వీకరణం బొనర్పఁ బృథివీభా మాత్మతాపంబుఁ బోఁ
జేయన్ వాయుకుమారు బాహువుల నాశ్లేషించున ట్లొప్పెడిన్. 88

మ. సుడిగాడ్పుల్ పచరించి గుండ్రముగ వీఁచున్ దుమ్మునున్ జెత్త నే
ర్పడ మధ్యాహ్నములందు మింటికెడసఁ జేర్పన్ జిమ్ము 'నీవేడితాఁ
కుడు విశ్వంబున కెట్టిచెట్ట నిడెఁ గన్గొమ్మయ్య! చండాంశుఁడా!
విడునంబోలును దైన్యము మంచు సతమున్ వేఁడన్ జగత్ప్రాణుఁడున్,

చ. ఒడలు కృశింప భూషణము లూడిచి విన్నఁదనంబుఁ దోఁపఁ బెం
పడరెడు పెద్దయూరుపుల నారఁటఁ బుచ్చెడి విప్రలంభ నాఁ
బుడమి చెలంగె; సస్యములపోడిమి లేక విశీర్ణభూరజం
బెడలఁగ గాడ్పు లుష్ణమయి యేపు గొనం గడు నీరసంబునన్. 90

చ. పనసలు పండి ప్రీలి రుచిఁ బాఱెను, నామ్రఫలాళి కొల్లలై
పెనిచెను గాంక్ష, వేసఁగిని; బేరిమిఁ దాళఫలమ్ముఁ గాంచినన్;
దనిపెను నీతపండ్లు; జనతండము కర్బుజమున్ గులాబిజా
మిని ఫలకాంక్ష మూఁగిరి, సుమించెను ద్వాదశమాసి చూతముల్.

శా. బారామాసి నవామ్రపల్లవరుచిప్రాప్తానుమోదంబునన్
నోరారం దగఁ బంచమశ్రుతిని నెన్నోమాఱు లాలాపసల్
మేర ల్మీఱఁగఁ గోయిలల్ సలిపెఁ దా మీఁదమీఁద వర్షర్తునన్
నోరు ల్మూసుక దాఁగియుండుగతి మున్ముం దబ్బ నం చెంచుచున్.

చ. తృణ మణుమాత్రమున్ బసరుఁదేరమి దుబ్బుల నాలతండముల్
పుణుకఁగఁజొచ్చె, దున్న లెలప్రొద్దునఁ గర్దమమందుఁ గూరె, దా
రుణముగఁ బుల్గుతండములు రూపఱెఁ, బందులు రొచ్చుగుంటలం
దణఁగె నలంత, గ్రీష్మమున నత్యధికోష్ణము భీష్మమై చనన్. 93

గీ. లేఁతయాఁబెయ్య భరియింపలేదు తాప
మని తలఁచి కాఁపుమగనాలు కనికరమున
సగము పితికినపాదుగు వత్సమున కిడియెఁ;
బాపలం గన్న ప్రేమ యేపారుఁ గాదె! 94

క. ఎదిగినలేఁగలు బాగుగఁ
బాదిఁగొన విఁకఁ బాలుఁ దీయఁబోల దనుచుఁ బో
వదలిరి తల్లులచెంతకు
సదయత వేసఁగిని గృహికసంతానంబుల్. 95

ఉ. కాననసీమలందుఁ జెలఁగం జెనఁ జిచ్చులు, పల్లెపట్టులన్
గాసఁగనయ్యెడున్ భగభగ ల్మనుమంటలు నచ్చటచ్చటన్;
వానికిఁ దోడు నల్వ నన వాతపరంపరయున్ జెలంగు, నెం
డైనను గోరుచుట్టుపయిఁ జప్పడు రోఁకటిపోఁటు నూటిగన్. 96

క. ఊరించెడి తెఱఁగున గం
భీరముగా మేఘపటలి వినువీథిపయిన్
దారాడు, భూరిగర్జలు
మీఱుఁ బ్రభంజనుఁడు చెదర మీటును వానిన్. 97

గీ. జ్యేష్ఠమాసమునం దెల్లఁ జినుకుఁ గోరి
మొగము వాచిన ప్రాణుల దగ నడంప
నంబుదమ్ము లాషాఢమునందుఁ బూనె
ననఁగ నాడంబరముగ మింటను జెలంగె. 98

క. రాక యొకజల్లు వెనుకకుఁ
బోకట వేఱొక్కజల్లుఁ బోరిపోరిఁ గురియన్
నాకుపాలమ్ములు దున్నుచుఁ
బ్రాకటముగ నెరువు లిడఁగఁ బాల్పడఁ గృషికుల్. 99

గీ. పుడమిచేడియ నెమ్మేనఁ బొడమె నంత
సవ్యసస్యాంకురములు గ్రొన్ననలు దోఁపఁ
బ్రేమరసపరిప్లావితకోమలాంగిఁ
బ్రియుఁడు చుంబింపఁ బులకలు వెలయునట్లు. 100

మ. నవలావణ్యము నించుకొన్న వసుధానవ్యోత్సవాకారమున్
అవలోకింపఁగ మాలతీహృదిని నాహ్లాదంబు రేకెత్తఁ దా
నవలన్ భావిఁ దలంచి ‘నే నిఁకను నెన్నాళ్లో వియోగంబుఁ బూ
నవలె న్మాధవుఁ బాసి’ యంచు మదిఁ జింతాక్రాంత యై యొక్కటన్.

ఉ. "ఏమిప్రశాకృతమ్మొ జనియించినపిన్నటినాఁటినుండియే
ప్రేమను దోఁగఁ గంటి; సుకుమారనిమనోజ్ఞత సాధుశీలమున్
గోమలచిత్తమున్ బరమగూఢసుధామధురానురాగమున్
ఆమహితాకృతిం గొనియె, సంచితపుణ్యవి నెంచ శక్యమే. 102

ఉ. ఆకనుకోనలందుఁ జెలువారెడి చెల్వము ముద్దుఁ గొల్పు, ల
క్ష్మీకర మామొగంబు, నిరుచేతులఁ ద్రావఁగవచ్చు నోయగం,
బాఁకలి దప్పి కానఁబడ వాసవమోహను గాంచ, మోహ మ
త్యాకులపాటుఁ గూర్చు వినయప్రియభాషణముల్ చెవిం బడన్. 103

చ. అనలములీలఁ బక్ష్మలముఖాగ్రము వీడి మదీయవర్తుల
స్తనముల గాడి చుట్టు మన స్వాంతప్రలోఁతులఁ జూచి తాపమున్
బెనచి మనోజకీలలను బెల్లుగ దేహము నింధనమ్ముగా
నొనరుచు నామనోహరు మనోజ్ఞవిమోహదృగంబకంబులన్. 104

ఆ. వె. ఎటుల మఱవనేర్తు ? నెల్లియో యావల
నో ప్రయాణ మగును; నూత్నమిత్ర
సంఘమున నతండు సంతోషమున మున్గి
ననుఁ దలంచి ప్రేమఁ గనునొ ! లేదొ ! 105

గీ. సేతువును శీతనగమునాఁ జెరియొకదెసఁ
జేర్పఁబడుదుము మున్ముందు; చిరవిముగ్ధ
భావలతికలు వ్యాపింపఁ బ్రాపు వీడఁ
జిక్కువడుదు వియోగాగ్నిశిఖలఁ గ్రాఁగి. 106

క. విద్యావ్యాజమ్మున విధి
యుద్యోగించెను బవాలుశవియోగాగ్ని నిడన్
సద్యఃఫలముగఁ; బిదప న
వేద్యము చోద్యము లవెన్ని వెడలునొ ! కడకున్. 107

శా. ఏకాంతంబున నుండువేళలను దా నేదేదియో సాకుతో
నాకై వచ్చు ప్రియుండు, మోహమునఁ గన్నార్పకేం జూచు, నే
వో కల్పించుఁ బ్రసంగముల్, జడను దాపుల్ నించుపూగుత్తు ల
త్యాకాంక్షన్ గయిసేయు, మోవి నిడఁగా నర్థించు ముద్దాడుచున్.

శా. మాలా! నాగళమాల నీ వనుచుఁ బ్రేమన్ బల్కువాక్యంబు లె
వ్వేళన్ వీనుల మాఱుమ్రోఁగుఁ, దమి నువ్వొత్తైన వక్షోజముల్
లీలం దాఁకుప్రియాంగుళీచయము హాళిం గూర్చి మోహంబు ను
ద్వేలంబున్ బొనరించు, నెట్లు ప్రియు భావి న్వీడి జీవించెదన్. 109

శా. బావా! యంచును దొంటిచందమున నాప్రాణేశునిం బిల్వఁగాఁ
బోవన్ గొంతును నొక్కు సిగ్గు, తమి పెంపుం గాంచ ధారాళ మై
పూవుందావియుఁ బోలు చెల్మి నలమెన్ భోగేచ్ఛ, యద్దానఁ బై
నేవో మేలిముసుంగులం బొదువ నయ్యెన్ బ్రేమమాణిక్యమున్. 110

గీ. కూర్మిఁ గొనకొమ్మపై వేఁడ్కఁ గొలుపు ముద్దు
సుద్దులను దేలు గువ్వల కుద్ది యగుచుఁ
గేళిఁ దేలక పలుసంశయాళిఁ జిక్కి
ముసుఁగులో ముద్దులాటల పస యి దేమి? 111

సీ. ననుఁ జూచు వెను జూచు నల్దిక్కులను గాంచుఁ
జెలువుఁడు నాచెంతఁ జేరునపుడు
హసించు బులిపించుఁ దలఁచి సంకోచించుఁ
బ్రియుఁడు కౌఁగిటఁ దార్చి పెనచునపుడు
పలికించుఁ గులికించు యలికిడి గురుతించు
నాథుఁడు మోవిని నానునపుడు
నవ్వించుఁ గవ్వించు నవ్వడి వారించు
విభుఁడు నాసన్నిధి వెలయునపుడు

గీ. వలచు వలపించుఁ బెరలకుఁ దెలియనీక
వినును వినిపించు నితరుల విననఁగనీక
మానచోరుఁ డిట్టుల ననుమాన మలము
కొనెడి సుఖ మైన నిఁక నోచుకొనదు గాదె? 112

చ. తెలతెలవాఱుచుండఁగ మదిం బ్రియుఁ డెంచుచుఁ బక్కపైని గ
న్నుల నరవిచ్చి యుండఁగ ననున్ ఘనరాగముతో గవాక్ష మా
వలఁ దగ నిల్చి చూచుప్రియువర్తన మారసి దొంగనిద్ర నే
నులుకక నోరకంటఁ గని యుబ్బుట చేకుర దింకమీఁదటన్. 113

మ. తొలిరేయిం దగ కేడిరెయో వినుచు గీతుల్ వార్తల న్వించు వె
న్నెలలోఁ గాలము పుచ్చునప్పు డట న న్నేకంట వేటాడుచున్
బులకింపంగ నొనర్చు నాప్రియుని యుత్ఫుల్లాననశ్రీనిఁ గో
ర్కులు దీపింపఁగఁ గాంచి లోట్ట లిడ నాకుం గల్గ దీపిమ్మటన్. 114

శా. క్రీనీడం జనువేళ నొంటిమెయి నా కెంగేలు ముద్దాడుచున్
దా నంతం జను నే మెఱుంగనటు లత్తామామ లున్నా రనఁ;
నే నాథంగిమఁ గాంచి నవ్వ, సరి; కాని; మ్మన్నపోల్కిన్ దలన్
దా నాడించు ప్రియానురాగమును బొందం గల్గు దెట్లీ పయిన్. 115

ఆ. వె. చెరఁగు మాసి పంచఁ జేరిన నన్నను
రాగదృష్టులందు దోఁగఁజేయు
మూఁడుదినములందు ముప్పొద్దులును, నింక
నట్టిభాగ్యమునకుఁ బెట్టి పుట్ట." 116

గీ. అనుచుఁ బూర్వస్మృతుల మున్గి యంబుజాక్షి
ప్రియసమాకృష్టహృదయ యై పెల్లు చేష్ట
లుడిఁగి విగ్రహమో యన నుండ నామె
వెనుకనుండి మెల్లఁగ లక్ష్మి కనులు మూసె. 117

గీ. మాధవావిష్ట యగుడు సమ్మాలతి యపు
"జరసితిని నాథ ! విడువుఁ; డిం దరుగుఁడెంచు
లక్ష్మి నావద్ద కిప్పు; డుల్లసము సల్పుఁ
జూచెనేని; దెప్పుల నింక సైఁచలేను." 118

గీ. అని పలికి చేతులను విప్పుకొనఁదొడంగ
గాజులు ధ్వనింప మాలతి కట్టవారె
గుట్టు ర ట్టయె ని ట్లనుకొనుచుఁ; గన్న
గాని తేలు కుట్టినపోల్కిఁ గళవళమున. 119

గీ. "దొంగ చేఁజిక్కె; నెన్నొనీతులు వచింపఁ
గలరు జాణలు; నూలుపోగులను గొంతు
కోయ నేర్తురు బేలలమే యటంచుఁ;
గామినీజనహృదయ మగాధము గదె !" 120

గీ. అనెడి లక్ష్మినిఁ గని సంస్మితాననమున
"నాథ ! యాగ్రహింపకుఁడు; నెన్నఁడును దప్పు
-సేయ నిటమీఁద; మన్నన సేయవలయుఁ
జరణదాసిని బోనాడఁ జనునె యలుక. 121

ఆ. వె. ఆఁడుబొట్టె లక్ష్మి యరుదెంచుచో నను
బ్రతుకనివ్వ దింకఁ బ్రాణనాథ !
మీరె నన్ను విడువ వారేల కరుణింతు
రాఁడుబిడ్డ ముక్కుత్రాడు గాదె !" 122

క. అను మాలతిపల్కులు విని
కననేరక సత్య మెదియొ కంగారు పడెఁ
మనమందు లక్ష్మి; స్త్రీ ప
న్నిన మోస మెఱుంగఁ బోలునే విధి కైనన్. 123

వ. అంత లక్ష్మిని బూర్తిగాఁ జిత్తు సేయ నెంచి మాలతి యి ట్లనియె.

ఆ. వె. "ఆఁడుబిడ్డ, మగఁడు నన నొక్కరూపమె
పడక నొకరు మనువు గడప నొకరు
గుట్టు సేయ నొకరు కట్టు సేయ నొకరుఁ
గాక భేద మేమి కలదు చెప్రుమ. 125

క. మగనికనుసన్న మెలఁగిన
మగువకు సుఖ మబ్బు నొక్కమంచమునందే
మగనాలి బ్రతుకఁ గోరెనఁ
దగు నిత్యము నాఁడుబిడ్డఁ దప్పఁగ నెంచున్. 126

క. ఇది పెద్దల నుడి; కావున
మది నిత్యము నిన్నుఁ బిన్నమగనిగ నెంతుఁ
ముదితా! నీకై గౌరవ
మది తా నరుదేర విడువ నగునే చెప్రుమా!" 127

వ. అని, "యనుంగుమగఁడా! నీయాదరమ్ము నీదాసురాలిపైఁ బ్రస
రింపుఁ" డనుచు నామెను ము ద్దిడుకొనుచు బుగ్గలను మెత్తగాఁ
గొటికె నయగారము వెలార్చ, లక్ష్మి జలధరమాలావిముక్త మగు
సుధాంశుబింబమ్ము వోలె సంశయావరణవిరహిత యై ముఖబింబము
మధురహాసజ్యోత్స్న వెలయింప ని ట్లనియె. 128

గీ. "ఆఁడుపడుచులఁ గూర్చి నీ వనినపల్కు
లన్ని యెడలను సార్థక మనఁగరాదు;
ఆమెయును నొకయింటి యిల్లాలు గాదె!
నన్నుఁ బోలువా రెవ్వరైన నున్నఁ గాక. 129

గీ. అత్త యొకనాఁడుఁ గోడలె యందు వేమొ!
కా దనఁగరాదు; సర్వథా కన్నవారి

యింట నుంచెడి తలచెడ్డ యింతిపట్లఁ
జెల్లు నీవాక్యములు చింత సేయఁ గొంత." 130

వ. అనిన, మాలతి విన్నఁబోవుచు "లక్ష్మి! 131

గీ. హాస్యభాషల కింత వ్యాఖ్యాన మేల?
నన్నుఁబోలువా రంటివి న్యాయ మగునె?
కన్య మాతృగృహమ్మునఁ గాక యెచట
నిలుచు? నా భావ మొందుగాఁ దలఁపవలదు." 132

వ. అన, నొచ్చుకొని లక్ష్మి "వదినా! యి ట్లనఁ బాడియె? 133

క. పలికిన వాక్యములందున్
జెలువారెడిభావ మొకటి చేకొను టొక టై
వెలసెను; వెట్టి కుదిరె నీకఁ
దలఁ జుట్టఁడు రోఁకలి యనఁ దగు నీనుడువుల్. 134

గీ. పలుకుల నపార్థ మొదవినఁ దలఁపు మది మ
దీయభావతీవ్రతగ, నన్యాయ మగును
హృదయనైర్మల్యమున శంక గదిరెనేని,
వినుము సావధానముగ నావిషయ మింక. 135

గీ. కొన్నిదినములనుండి నా చిన్నియెడఁద
స్త్రీకి దాంపత్యము వినా విశేషసౌఖ్య
మొందుమార్గముఁ బరికింప నుత్సహించి
కన్యగా జీవితముఁ బుచ్చఁ గాంక్ష వొడమె. 136

గీ. అదియె ననుఁబోలువా రనునట్టి పలుకు
గాని; నీ విమలాత్మయం దేను గల్మ
షంబు నారోపణమ్మును సల్పఁ దలఁపఁ
గాచు; మన్నింపవలయు నిక్కముగ వదిన!" 137

మ. అనినన్ సాదరమేదురేక్షణములం దానందబాష్పమ్ము లం
తనఁ గ్రమ్మన్ దరుణీమణీశిరము వాత్సల్యంబు దీపింప గో
మున హస్తంబున దువ్వి, మాలతి యనెన్ బొల్పొంద సమ్మేళనా
ఘనవీణాశ్రుతిమోహనస్వనసమాకారస్వరం బేర్పడన్. 138

శా. "ఆదర్శం బతియున్నతంబ, యొలప్రాయంబ, చింతలో యౌవన
ప్రాదుర్భావము సంతరించు నొకొ, లుగ్రం బై సమాజంబునం
దేదో వాదు జనింపఁగూడదు, సమున్మేషంబు లే దింక నీ
ధీదార్ఢ్యంబును విశ్వసించుటకు నాఁతీ! సంశయం బయ్యెడిన్. 139

మ. మృగతృష్ణాసదృశంబు లై యలమి నామీప్యంబునఁ దోఁచుఁ బె
న్దగ రేచున్ బరువెత్త దూర మగు నాదర్శంబు, లవ్వానిఁ జే
రఁగ సామాన్యముగాఁ దలంపఁ దగ; దారంభంబునన్ భవ్యభా
వగతం బై మది చొక్కి యిక్కట్టులఁ దల్పంబోవ దేమాత్రమున్.

ఉ. పాదతలంబునం గలుగుబండను పర్వతశృంగపీఠకం
బాదుకొనంగఁ జేయుట సుమా! తలపోయుము నీదుయత్న మం
దేదియొ విఘ్న మేర్పడిన నేమరుపాటునఁ జాఱఁబుచ్చుచో
నాదిమమైనచోటఁ బడ కయ్యది చేరు నగాధ మెందునో. 141

గీ. పడినవారిని లోక మెప్పుడును గనదు;
లేని యాశల నున్నది మానుకొనుట
ముల్లు దీయఁ గొ ఱ్ఱడఁచుట; మొసలు చెడ్డ
చేర వెందు? కీయాబిలోఁ గూర సబల! 142

ఉ. కంటకదుర్గమం బయినకానఁ జరింపఁగ నిచ్ఛ యేల? వా
ల్గంటి! మనోజ్ఞపుష్పలతలం గదుఁగూర్చెడి పూలతోఁట ల
న్నింటిని వీడి; యామని రచించిన సీబెగువుల్ దొలంగఁగన్
రెంటికిఁ జెడ్డ రేవ డయి చేలుఁబగల్లును దల్లడిల్లవే! 143

గీ. అందుకోనఁజాల నని రాధ యట్టు లెత్త
నంది యంటక నే నెదఁ గుందుచుండ
నెండలో వేచి యుండ నీపొందుఁ గోరి
బాల! పెడతల నీబుద్ధు లేల చెప్రుమ? 144

గీ. నీచెరఁగుగాలి సోఁకిననే తరింతు
ననుచు నారాటమును గనునట్టి వలపు
కాఁచు లభియింపఁగలఁడు; క్రీఁగంటిచూడ్కి-
నతని వశవర్తిగా సల్ప నగును గాదె! 145

గీ. సౌఖ్యమే కోర నీలీలఁ జనఁగ నేల?
ఎన్నికొను మొక్క-సుందరు నెనరు దోఁప
నతనిఁ బెనచుక స్వర్గమర్త్యములయందు
సౌఖ్యడోలావిహారము సల్పఁ దగును. 146

గీ. ప్రకృతిసూత్రముఁ ద్రెంపఁగఁ బాటుపడుట
తన్న, దానికిఁ లోఁబడి, కల సమస్త
శక్తి సంస్మృతి నిత్యవసంత మహిత
మొనరుపఁగ ధారపోయుట యుచిత మగును. 147

గీ. బాధ్యతలు లేని సౌఖ్య మేపగిదిఁ గలుగు
నప్పగించిన పని వీడి యవల నేవొ
కార్యములఁ జొచ్చు వెంగలికై వడి జన
నీత్వ మది యుజ్జగించుట నీతి యగును! 148

గీ. నవవసంతశోభను గని యవలఁ దాప
తప్తమై జీవనము నొంది ధరణి సస్య
సంతతిఁగ బ్రసవించి తద్దయును బెనిచి
పిదప సోయగ మెడలఁగ విన్నఁబోవు. 149

క. ఆటీరున మాతృత్వము
నాఁటికి విహితంబు, శోభనం బదె; సస్యో
పేతక్షేత్రప్రాభవ
మేటీరు నెడాఁటెనేల కేర్పడుఁ జెప్పుమా ? 150

ఉ. ఆఁకట మాడుపొట్ట రుచి కోరఁటఁ బొందదు, త్రాఁడు వీడినన్
ఏకడ కేఁగు బొంగరము నెంచఁగఁజాలము, నింగి జాఱి యెం
దో కడముట్టుఁ జుక్క, తననోటిని విచ్చి సమాజ ముగ్రభ
ల్లూకము వోలె భీతి నిడు, లోకము మాయఁగ మూఁతు మున్నదే!"

గీ. అనినఁ, జిఱునవ్వు వెలయ ని ట్లనియె లక్ష్మి,
"తావకాభిమతంబు స్తుత్యంబె యైన
నీయుపన్యాసమందు మానినికి సాహ
చర్యమే గతి యనుట నే సైఁపఁజాల. 152

గీ. ప్రాత రోఁతతలంపు లర్థాంగి యనుట
స్త్రీని, వ్యక్తిత్వగౌరవశ్రీ నడంచు
స్వార్థపూరితము లవి విస్పష్టముగను;
పడఁతి సంపూర్ణమానవవ్యక్తి నిజము. 153

గీ. దీనిఁ గా దనవేని నేఁ దెలుపుదాన
వినుము, చెట్టునఁ బొడమిన విరుల నెన్ని
ఫలసముద్భవకారులు ? తలల నెన్ని
వెలయు ? దైవార్చనావిధి నలరు నెన్ని ? 154

క. పలుగాకులు లోకులు; కూ
తల భీతిలఁ జేయఁగలరె ధార్మికకృత్యం
బులు; నాత్మల నైర్మల్యం
బలరన్ సత్కృతుల శంక నందఁగ నేలా ? 155

ఉ. పూఁచుట కాఁచుటల్ తలఁపఁ బోలదు నైజము, వానిలో ఫలం
బై చిరముగ స్మరింపఁబడుభాగ్యము గొన్నిఁటికే లభించు; సర
కోచ మిఁక కేల నేను గయికొందును దీక్ష సమాజసేవకై ;
కాఁచుటఁ జెట్లు కాంచుఁగదె గాటముగా నల రాళ్లదెబ్బలున్. 156

క. పిల్లాపిచ్చుకతో మీ
రెల్ల వసుంధరను స్వర్గ మేర్పఱుపుఁడు; నా
వల్ల నగునంత జీవిత
కల్లోలార్తులకు సేవఁ గావింతుఁ దగన్. 157

గీ. గుంటకాకి యే మెఱుఁగును వింటిదెబ్బ
యందు వేమొ ! లోకజ్ఞత యల్పమె యగుఁ
గాని; నేఁటిసమాజముఁ గాంచి చింత
పొడమ నాజీవితము సేవ కిడితి ధార. 158

గీ. భావిమార్గము కంటకబహుళమె యగు
నైన భయ మొంద; సత్కార్యమందు చావు
వేయిరెట్టులు మే లగు వికృతకలుష
పూరితం బగుజీవితమునకు వదిన ! 159

సీ. సంసారజీవితసారకేదారాళి
నలరెడి కలుపుమొక్కలను గనవొ !
నవనవలాడు సంతసముఁ గూర్చెడు సస్య
ములఁ బట్టు చీడపుర్వులను గనవొ !
మిసమిసలాడు సత్కుసుమవ్రజంబును
దొలిచెడి కీటకములను గనవొ !
రసతుందిలస్వాదురమణీయఫలగర్భ
ముల దాఁగియున్న క్రిములను గనవొ !

గీ. సుందరోద్యానవాటికలందు భూజ
నివహావరశాఖలన్ బజనికలఁ గనవొ!
మిల మిల హసించు క్రొక్కారుమెఱుఁగుఁదీవ
వెనుక దాఁగిన పిడుగులఁ గనవొ! వదివ!
ప్రకృతి కేవల మానందభవన మగునె? 160

గీ. హాసచంద్రికాశోభలయందు దుఃఖ
మతులసౌఖ్యాంతరమున నత్యధికకష్ట
మిష్టభోగములందు నికృష్టరోగ
మలము; ప్రకృతిని నిరుడెస లరయఁ దగును. 161

గీ. ప్రేమమాధుర్యలావణ్యవిభవభోగ
సముదయమ్ముల నొకబంతిఁ జదువ, దాని
క్రిందివరుసనె క్రౌర్యవికృతదరిద్ర
వేదనలు గానఁబడుఁ బెనవేసికొనుచు. 162

శా. ప్రాతస్సంధ్యల నెట్లు పుచ్చు టనుచున్ భావించఁగా భోగి, య
య్యో తారాడెడి పాపల న్మనుచు టెట్లో యంచుఁ జోగి, బా
ధాతప్తుం డగు; విత్త మొక్కెడ వ్యర్థం బౌచు మూల్గన్ క్షుధో
పేతుల్ కానిని గానలేక వెతలన్ బెంపారు టింకొక్కచోన్. 163

ఉ. ఆఁకట, మేను గప్పుకొన నైనను వస్త్రము లేక దైన్యమే
యాకృతిఁ గొన్నలీల వికలాంగులు రోగులు స్త్రీలు బిడ్డలున్
మూఁకలు గాఁగ సౌధములముందును బాఁటలఁ జెత్తగుట్టలన్
నాకుల నెంగిళు ల్గుడుచు టారయ సృష్టి యొకింత తెల్లమా. 164

శా. కుక్కల్ గూడి హోటళ్లముందు బులియాకు ల్గోరి కాట్లాడుచున్
దిక్కుమ్రొక్కులు లేక నిత్య మిటు లీదీనుల్ క్షుధామూర్తులై
యిక్కట్లొందుటఁ గాంచి భూతలమునం దేపారుసౌందర్యమున్
లెక్కింపం దగు, ధర్మసూత్రముల వల్లింపంగఁ బోల్ పిమ్మటన్. 165

గీ. ఉత్క్షేపక్షి మస్తకమును నూడ్చి యిసుక
నరులకుం గానరాను నే ననుకొనుగతి
నగ్నబీభత్సదైన్యవినాశదృశ్య
చయముఁ గానక యాత్మవంచనము తగునె? 166

సీ. ప్రాణాధికం బైనమానంబు వెలఁ బెట్టి
దినములఁ బుచ్చు నిర్ధనులఁ గనవో!
అధికారదర్పభాగ్యాంధులగుప్పిళ్లఁ
దునిసిన దీనమానినులఁ గనవో!
కపటానురాగసత్కారమ్ములకుఁ జిత్త
మలవోక నొసఁగు బేలలను గనవో!
కామాగ్ని యలమ యుక్తాయుక్తములు లేక
మేను లర్పించు కామినులఁ గనవో!
గీ. కన్నసంతానమును సాఁకుగతి నెఱుఁగక
కలఁగి తను వమ్ముఁ దోడరు తల్లులను గనవో!
కల్లు ద్రావి దోప్పను వీడుకరణి వయసు
తొలఁగ వెలిఁ ద్రోయఁబడ్డ భామలను గనవో! 167

శా. స్వారాజ్యంబు స్వరాజ్య మానటుల సల్పం బోలు; నీక్రుళ్లు పెం
పారన్ బీరము లెన్నిపల్కినను లాభం బుండ దేమాత్రమున్
బ్రారంభింపఁదగున్ సమాజమును నిద్రాహారముల్ వీడి మే
లారీతిన్ సరిదిద్ద స్వార్థమును దూలంబుచ్చి యేకాగ్రతన్. 168

శా. అజ్ఞానంబు, నిరక్షరాస్యతయు, మూఢాచారముల్, స్వార్థమున్
బ్రజ్ఞాప్రాభవముల్ గణింపమియు, దుష్పత్యాభిమానంబు, స
ర్వజ్ఞుల్ మేమె యటన్నభ్రాంతియును, నర్థారాధనల్ మీఱె, శా
స్త్రజ్ఞానం బుడివోయె సంఘమున దిద్దం బోలు సేవారతుల్. 169

ఉ. దొంగలు కల్లకీఁడ్రు వినుతుల్ గని యుబ్బుట, శ్రామికుల్ జగ
న్మంగళకారు లౌ ఘనుల మాన్యతఁ గాంచుట నైజ మయ్యెఁ, జె
ప్పంగల నెన్నియైన, నిటు పల్కఁగ నేమిప్రయోజనం బగున్
గొంగళియందు నాపముచుఁ గూడును సేఁకల లెక్కవెట్టఁగన్. 170

గీ. శాసనము లెన్నియేనియు సల్పుచున్న
దీసిక ట్టగుచున్నది; వేసికట్టి
చోటునే యుండు గొంగడి చోద్య మయ్యొ
మనసమాజ మీనాఁడు ముందునకుఁ జనక. 171

మ. వలయున్ దేశహితైషు లై వెలయు నిస్స్వార్థుల్ దయాశీలు రీ
మలినక్షాళన సల్ప సేవకులుగా, మార్గావరోధంబులన్
దొలఁగింపంగదె బండి సక్రమముగాఁ ద్రొట్రిల్లఁ బో కేఁగు నా
కల లివ్వానిని దెల్పితిన్ వదిన ! నిక్కం బౌనొ ! కాకుండునో ! 172

మ. పలుసారుల్ జనకుండు దల్లి కెఱిఁగింపన్ వింటి నీభావముల్;
తెలియం గంటిని కొన్ని సత్య మని; సందేహమ్ములన్ దీర్చుకో
వలెనం చీపథకంబుఁ దెల్పితిని, నొప్పన్ సూచనల్ సల్పుమా !
కలకాలంబు నెదుర్కొనంగవలె నికార్యంబు సామాన్యమే !" 173

వ. అనిన, మాలతి యమందానందకందళితహృదయ యై లక్ష్మిచిత్తంబునఁ
బాదుకొనిన భావమ్ములకుఁ గరంబు మెచ్చికొని యి ట్లనియె. 174

గీ. "చిన్ని యెడఁదలో నిలిపితి వెన్నిదివ్య
మధురభావముల్, లోక మమర్త్యభూమిఁ
జేయ నెంచిన నీకు నాశీస్సు లెపుడు
దీనజనబాంధవుఁ డొసంగఁ బూను కృపను. 175

గీ. రాజహంసకు నడలు నేర్పంగఁ దొడఁగి
రెవ్వరు ? వనస్రియమ్ము రవింపఁజేసి

ేరు? సుచరిత్ర! తనిసితి నెడను మీవుల
సహజసిద్ధము గాదె! విశ్వానురక్తి. 176

వ. మా కందళికి గర్వకారణంబు నీసంకల్పము. అయినను నా దొక చిన్న సూచన గమనింపఁ గోరెద. 177

ఉ. బాలవు, లోకవృత్తమును భావసమన్వయమున్ దలంప, వె
క్కాలము నేది చేయఁదగుఁ గన్గొని సల్పిన సత్ఫలం బిడున్,
దాళుము కొంతకాలము, యథార్థము నిశ్చిత మైన జ్ఞానమున్
జాలినయంత కూర్చుకొని సల్పఁ గడంగుము లోకసేవలన్. 178

శా. ఆవేశం బనురక్తి సాహసము కార్యారంభమాత్రంబు లై
పోవున్; లాభము లేదు; విద్యయును నైపుణ్యంబు ధైర్యంబు వి
ఘ్నావిఖ్యాతి నడంచుఁ గానఁ; జను నేకాగ్రాత్ము వై విద్యలన్
బ్రావీణ్యంబును గాంచ, నాదటఁ దగున్ భావ్యర్థయత్నంబులున్. 179

గీ. ప్రౌఢసన్న్యాసమును బాలవైద్య మటుల
కర్మసంబంధవిజ్ఞతఁ గలుగనట్టి
సంఘసేవయు లోకనాశంకరంబె
కలికి! కార్యసాధనకు యోగ్యతయు వలయు. 180

సీ. మునుమున్న సవరించుకొనఁ దగు నాత్మవ
ర్తనమును వజ్రవర్మంబు గాఁగ
నాపట శాంతవిద్యాదీక్షలను గూర్ప
వలయును వస్తుసంభారములుగఁ
బదపడి నైపుణ్యసదయత లలరింపఁ
దగును శస్త్రాస్త్రసంతతులు గాఁగఁ
బిదప నిస్స్వార్థనివేదనాభావని
ష్కములను వెదజల్లఁ జనును విజయ

గీ. సాధకులు గాఁదలంచు ప్రశస్తమోక్షు
లహరహంబు సమాజము వలముకొనిన
కలుషరోగదైన్యావిద్యఘనదరిద్ర
వేదనాస్వార్థశత్రులఁ బేచ మఱఁచ. 181

గీ. దహనకీలలఁ జల్లార్పఁ దలఁచి తగు ను
పాయరహితు లై స్వప్రాణభంగమునకుఁ
బాలుపడునట్టి సాహసపరుల తెఱఁగుఁ
గాక దృఢముగఁ గాఁ బూనఁ గలుగవలయు. 182

చ. కళపెళఁ గ్రాఁగు తైలమునఁ గ్రన్నన వాతికణంబు వైచినన్
దెలియదె పొంగి యుక్కుపరి దేహము బొబ్బల నెక్కఁజేయు, నూ
హలకును వర్తనంబునకు నంతర మెంతయు నుండుఁ; బెద్దచేఁ
తల నసమగ్ర వై తొడరఁ దానఁ బ్రమాదము సంఘటిల్లదే! 183

మ. బుసలుంగొట్టెడివ్యాళభోగమును బొల్పొందన్ విహంగేంద్రుఁ డా
కసమందుండియె కాంచి రివ్వున నుదగ్రాకారుఁ డై వచ్చి చీ
ల్చు, సమాజాంతరకల్మషంబు నటులే సూక్ష్మంబుగాఁ గోలుపు
చ్చి సుఖంబున్ గనఁబోలు నాత్మపరదృష్టిన్ క్షేమమున్ బొందుచున్.

ఉ. ఆశయసిద్ధిఁ గోరి తగునట్లుగ సర్వసమగ్రవిజ్ఞతా
వేశదృఢేప్సితంబులు వివేచనయున్ బరివృద్ధి సేయు, మ
త్యాశల సంఘకల్మషము నంతయు తూళన సల్పఁ బూన కే
దో శతపత్రనేత్ర! యొకదోషము చేకొను మాది నేర్పడన్. 185

శా. అర్థోపజ్ఞలు రెండు సాధనము లౌ నగ్రేసరంబుల్, సమా
జార్థం బియ్యవి వెచ్చపెట్టవలయున్ సంస్కారదక్షుండు; ని
స్స్వార్థుల్ లోకహితంబు జీవితము స్వచ్ఛందంబుగా నిత్తు, రీ
వర్థం బీ నసమర్థ; వింక గతి యా ప్రజ్ఞాప్రభావంబులే. 186

మ. తపయత్రాదు జగద్ధితం బొనరుపన్, ధర్మంబె లక్ష్యంబుగా
యుడుతాబత్తిని సర్వసత్క్రియలలో నుత్సాహ మేపారఁ గా
లిడ సన్నద్ధపు కమ్ము; నేను దగున ట్లీయత్నసంసిద్ధికై
యొడలుం దాఁపక కేలు నూఁత నిడ నుద్యోగింతు నిక్కంబుగన్.

గీ. పడుచు లేచుచు నేర్చును నడలు శిశువు;
అటులె యారంభ మొసరుప ననుభవమును
గూడఁగట్టుక పైఁ బోవఁ గూడుఁ; బడక
యెట్లు పాఁతరగోతి లోఁ తెలుఁగ నగును? 188

గీ. కాలమే సంస్కరించు నీ కార్యపథక
మది స్మరింపఁగ నేల; నేఁ డనుసరింపఁ
దక్షణం బెద్ది యోగ్య మా తలఁపఁదగును
సంఘకల్యాణ మొనఁగూర్పఁ జాలు దాని." 189

వ. అని పల్కుసమయమున నచ్చటి కేతెంచుచు. 190

గీ. "విద్య కాదె యత్యుత్తమవిషయ మెందు
సంశయం బేల? యాత్మసంస్కార మిదును"
అనుచుఁ దమప్రసంగాంతరమందు ననెడి
మాధవునిపల్కు చెవిఁ బడ మాలతి తగ. 191

మ. "అదె యాలించితె నీసహోదరులు ప్రేమాంభోనిధుల్ గారె, పెం
పుఁ దలిర్పన్ భవదీయకాంక్షఁ గని కాఁబో లిట్లు సూచించి రో
ముదితా! విద్య ప్రశస్త మంచుఁ, దగు మున్ముం దీసమస్యన్ గొనన్;
ఇది యార్యాభిమతంబుగా నెఱుఁగు మిక్లే తోడు చేకూరెడిన్."

వ. అనఁనవసరమ్మున మాధవానందులు వారి కభిముఖు లై యరుదెంచి
నిలిచిరి. అంత మాధవుఁడు మాలతీప్రసంగమునందలి చివరివాక్యము
నుటంకించుచు ని ట్లనియె. 193

గీ. "ఎవ్వ రాతోఁడు ? మీ రిర్వు రేడరొ బహు
యోజనాపర లై శ్రమ నొందినటుల
నున్నవారలు; ముఖముల నుబ్బియున్న
ధమనులే తెల్పు యోచనాతత్పరతను." 194

వ. అనినఁ జిఱునవ్వు వెలయ లక్ష్మి యి ట్లనియె. 195

ఆ. వె. "వదిన కీవు, కవిటిసుదతికిఁ జన్నన్న
మీరు నల్వురు దయ మీఱ నాకు;
నేవురమును మనము నేవేళ దీనుల
కరయఁ దగును దో డటంచు నన్న !" 196

వ. సోదరీవాక్యంబులు నర్మగర్భితము లై యమృతప్రాయమ్ము లగుట నానందమాధవులు సోత్కంఠు లై వారిప్రసంగమ్ము సవిస్తరంబుగ నెఱుంగఁ గుతూహలంబు సూపుఁడు మాలతి లక్ష్మిమోమున దృష్టి సారించి తదింగితం బరసి యి ట్లనియె. 197

గీ. "భావికార్యప్రణాళిక నేవిధి రచి
యించుటా యని మేము యోజించుచుంటి
మిదియె మా దీర్ఘచింతన మింతలోన
వచ్చు మిముఁ గాంచి తోఁడు గావచ్చు నంటి." 198

వ. అని సమగ్రమ్ముగ లక్ష్మియభిప్రాయమ్మును దనసూచనయు నెఱిం గించుఁడు మాధవుఁ డనురాగ మ్ముల యఁ జెలియలి నాలోకించి యి ట్లనియె. 199

ఉ. "బేలవు, పిన్నపాపవు, వివేకము విద్యయుఁ గూర్చుకొంచు స
చ్ఛీలము సంతరించుకొనఁ జిత్తము నెంచుట యోగ్య మిప్పు, డె
వ్వేళల నేది నల్పఁదగు విజ్ఞత యయ్యది నల్పఁబూనుచేఁ;
కాలము కొంత తీఱి భూమికల్ గడిదేరఁగ నన్యయోజనల్ 200

క. మహదాశయమ్ముకలిమియె.
విహితం బభినందనీయవిషయము శోభా
వహమును నిస్సంశయముగ;
సహజం బిది సజ్జనులకు, సంతస మిడియెన్. 201

ఉ. నీమహితాశయమ్ము స్తవనీయము, దానిని విస్మరింపరా
దేమిపాసంగినన్, దలఁపు మేక్రియ సూక్ష్మముగా లభించు నీ
కామిత మంచు, మార్గములు గల్గు ననేకము, భావి నెంచ నౌ;
మామిడి పల్కుఁబారి రసమాధురిఁ గాంచఁగఁ దాంద్ర. చేయుటల్.

గీ. విహితకర్మల సంఘాభివృద్ధిఁ గోరి
స్వార్థమున కన్యహితము నాశన మొనర్పఁ
బోక సల్పుటయే యెన్నఁబోలు నుత్త
మోత్తమారాధనము సమాజోన్నతిఁ గన.. 203

గీ. హాలికుఁడు క్షేత్రమును దున్ని యవసరోచి
తమ్ము లౌ యెరువుల నిడి తగిన సస్య
రాశిఁ బెంచులీల సమాజరక్షణార్థి
యాత్మపరిణతి యోగ్యత నందవలయు. 204

సీ. సంతతి సరిదిద్దఁ జాలినమాత; బి
డ్డల నుత్తములఁజేయఁ గలజనకుఁడు
శిష్యుల యోగ్యులఁ జేసెడియొజ్జ, బీ
దల నాదుకొనెడి వర్తకుఁడు, రుజలఁ
బోకార్చువెజ్జు, సప్పుల ధర్మవృద్ధికి
నిడుసాహుకారు, వినీతి- మఱుఁగు
దొ డ్లూడ్చునాతఁడు, దుర్భిక్ష మెడలించు
రైతు, స్వధర్మానురక్తి కలుగు

గీ. కర్మకరులును, మహాత్ములును గాఁదగువారు
ధర్మవిధి నిర్వహణదక్షుఁ డైన రాజ
కీయువాదియుఁ, బలి కల్పఁ జేయుఁ దగుదఁ
బహువిధోద్యోగి సంఘసేవకులు గారె. 205

గీ. ఔషధము జీర్ణమై రక్తమందుఁ గలిసి
రోగబీజసమూహమ్ము రూపడంచు
లీల జనులతో జీవితోద్వేలకలుష
మందుఁ జొచ్చి యద్దానిఁ బోకార్పవలయు. 206

క. కావున సంఘోద్ధారకు
లేవిధి వ్యక్తిత్వభంగ మేర్పడకుండన్
బ్రాపింత్రు సాధుశీలము
నోవృత్తుల నారితేర నొప్పును మిత్రులన్. 207

ఉ. నీట మునుంగువానిఁ గని నిర్భరసత్కరుణార్ద్రమూర్తి యై
గాటపుఁగూర్మి నం దురకఁగన్ ఫల మున్నదె యీఁత రాక, యీ
రాటము నొంద సంస్కరణ రాదు; తలంపుము నిప్పుతోడఁ జె
ల్లాటగ దీని, విద్యయు నిరంతరసాధన మర్హ మెంతయున్. 208

గీ. లక్ష్యశుద్ధిఁ గోల్పోవఁ దలంపవలదు;
తదనుకూలమౌనట్టి యత్నములఁ దొడరఁ
దగును నీనాఁటినుండి, విద్యకు నొసంగ
వలయు నగ్రతాంబూల మేర్పడఁగఁ జెల్లి! 209

గీ. సేవ ముఖ్యము, భావి నీజీవితమ్ము
నెట్లు పుచ్చుటా యనుచింత యేల యిపుడు;
కాలగర్భంబులో నేమి కలదొ! ముఖ్య
మరయ నాత్మ; పై మెఱుఁగులే యగుఁ గడమవి. 210

సీ. శ్రీరంగనీతులు సెప్పుచు దొమ్మర
గుడిసెలఁ దూఱు మూర్ఖులును గలరు
పరిశుద్ధధర్మముఁ బ్రవచించి లోకవం
చకులైన గూఢతస్కరులు గలరు
కటకటా! యంచు నాఁకట మ్రగ్గుమూఁకల
రక్తంబుఁ ద్రావు దుర్జనులు గలరు
ఆత్మార్థమై సమాజాభివృద్ధికిఁ బూని
'బ్యాంకు'ల నింపు దుష్టధులు గలరు
గీ. కనికరము లేక యనపలఁ గాలఁ ద్రొక్కి
నగ్నపైశాచికాఖేలనప్రియు లగు
కఱకుగుండెలపచ్చిరక్కసులు గలరు
కాన; యాత్మ ప్రధానముగా నెఱుఁగుము. 211

క. కులపావని వై చదువుల
నలవఱచుకొనంగఁ దొడరు మావల మా క
న్నులు చల్లఁబడ సమాజపుఁ
గలుషముఁ బోకార్పఁ బూనఁగాఁ దగుఁ జెల్లీ! 212

గీ. నిను నిరుత్సాహపఱుపఁగా ననినమాట
గాఁ దలంపకు మొకపథకమును వేసి
కొని తొడంగుద మండఱమును సమగ్ర
యోజన మొనర్చి రాధికాయూహా నెఱిఁగి." 213

గీ. అనుచు మాధవుఁ డనురక్తి యతిశయిల్లఁ
దల నిమిరి, ముంగురులు దిద్ది, చెలువు మీఱఁ
జుబుకమును జేతఁ బై కెత్తి, చెలిమి నెఱపెఁ;
నాదరపుఁబరసీమలు ననుజ లెందు. 214

వ. పిదప మాధవుఁడు "వీరు వారమునెలలలో మూఁట ముల్లెఁ గట్టుకొని ప్రయాణమునకు సిద్ధముగా నుండుఁ డని చెప్పుటకే వచ్చితిమి. మెట్రిక్ పరీక్షకు వీరికిఁ దగిన శిక్షణము నిచ్చు నేర్పాటులఁ జూచుటకు రేపే నానందుఁ డిచ్ఛాపురము పోనున్నాఁడు. నాన్నగారిప్పుడే యిట్లు చేయు మని యాజ్ఞాపించిరి. మిమ్మనిచి మేము పదిరోజులపిదప విశ్వవిద్యాలయమునకుఁ బను నేర్పాటు కావింపఁబడినది." అనిన లక్ష్మి "అన్నా! మ మ్మిచ్ఛాపురమునఁ దిగనాడి మీ రక్కడ మాతో నొకవారము గడిపి పిదప నింటికి వచ్చి చదువఁబోవుఁ" డని దైన్యము గదుర బలుక, మాధవుఁడు మూఁతి ముడుచుకొని, "పనికిరాదు. అమ్మసెలవు లేనిదే యిచ్చటికిఁ గదలము." అనిన లక్ష్మి "సరే. అమ్మ సెలవేగా? అవలీలగా సంపాదింతును లే" మ్మన మాధవుఁడు నవ్వుచుఁ "జెల్లి! నీకోరిక తీరదని చెప్పెదనా? దైన్య మెందుకు తల్లీ!" అని సహకారము వెలార్చె. అంత మాలతి "తా నొసర్చిన యేర్పాట్లను చిన్నబావ మాచెల్లి కెఱిఁగించునా?" యని చిఱునవ్వొలయఁ బ్రశ్నించిన నానందుఁడు ముసిముసినగవుల నగుచు మాధవు నానన మాలోకించుచు నతఁడు "చూచితివా? మీ వదిన యనురాగము. ఈకారణమున నీ కిం కొక సదవకాశము గల్పింప నూహించినది. ఎన్నటికైన మీ యొక్కకగూటిం జేర్చున దామెయే సుమా! ఆమెయాజ్ఞ యవశ్యము నెఱవేర్పఁదగినదే!" అనుచు నానందుఁడు "వదినా! కృతజ్ఞుఁడ" ననెను. మాలతి నగుచుఁ "గృతజ్ఞతల కేమి కాని మాకుఁ గబురు త్వరగా నంపఁజేయుఁడు. క్రొత్తబిచ్చగాఁడు ప్రొద్దెఱుఁగఁ డనునట్లుమాత్రము సేయవలదు." అనిన నానందుఁడు "సరి సరి. మంచిమా టంటివి. పోవుట కేమిసాకు దొరకునా యని తొట్రుపడుచుంటిఁ, గదలి రాకపోవుటకూడనా?" అనిన మాలతి "వాణిజ్యములందు వైవాహికములందు బొంకవచ్చు

నన్నారుగా యాచార్యులవారు; కావున నెవరో మిత్రుని బారు వాలోఁ జూచివత్తు నని యత్తగారికిఁ జెప్పి బయలుదేఱిన నన్నియుఁ జక్కఁబడును." అనిన మాధవుఁడు "కల్పనకుఁ గోమలాంగులకుఁ బెట్టినది పేరు. వారు తలంచుకొనినఁ గ్రొత్త గోడకుఁ జేమాకువలె మాటల నమరింపఁగలరు." అనిన మాలతి కడకంటివింట సునిశిత మగు చూపుతూపు పొంచు దొడిగి సూటిగ నాట మాధవు నేసి చిఱు నవ్వు లురలించె. 215

క. మఱునాఁ డానందుఁడు నిజ
పురమునకుఁ బ్రయాణ మగునపుడు తమస్నేహ
స్ఫురణముగ రాధతో నన
నెఱిఁగించిరి కన్య లిరువు రెన్నిరొయు నుడులన్. 216

క. ఏకాంతమ్మున నవి యతఁ
డాకర్ణించి నగవు ముఖమందుఁ జెలంగన్
మీకోరినగతి నన్నియుఁ
బ్రాకటముగ నామెతోడఁ బల్కుఁడు ననుచున్. 217

వ. అక్కన్నియలు మచ్చికలు వెలయ ముచ్చటలు గొల్పు చిన్నికానుకలు రాధ కీఁబనిచిన, నవియెల్ల సంగ్రహించి, వారి వీడ్కోలు నంది, నిజపు రంబున కరిగె. అందు జననీజనకుల కెఱిఁగి, వారి యనురాగవారి మజ్జన మాడి తా వచ్చినకర్జం బెఱిఁగించి, బాలికలకు విద్యాశిక్షణ మునకుఁ బేరొందిన శిక్షకు నొక్కని నేర్పఱిచి, విద్యావ్యాసంగ మమ్మున కుచిత మగు నేకాంతగృహంబు నొంటు నిర్ణయించి, తగిన కట్టడుల నలరించి, జననీజనకుల యనుమతంబున మఱునాఁ డపరాహ్ణం బున బారువాకుం జను బస్సు నధిరోహించి, కవిటిఁ జరియునంత. 218

చ. మనమునఁ బెక్కుభావములు మల్లడిఁ గాంచ నతండు సంశయం
బును ఘనమోదమున్ గనుచు ముందటఁ దా నెటు సంచరింతు, నే

యనువున నన్ను వారు గని యాదరణంబు బొనరింతు, రిట్లు పో
యినఁ జెర లెట్టు లెంతు రని యెంతయుఁ జిత్తము తత్తరింపఁగన్.

ఉ. భామ ననుం గనంగఁ జెరభావన సేయునొ? గారవించునో!
ప్రేమను దొంటియట్లఁ దగుకేళి మనంబున నిచ్చి పల్కఁగా
రాము వెలార్చునో! దరికి రాకయె లజ్జను దూర మానునో! యే
దో మిష నేకతం బచటఁ దోఁచునొ! లేదొ! యటంచు నెంచుచున్.

ఉ. గాటపుఁగూర్మి నాసుదతి గాంచినయంతన పెల్లుబ్బగ నా
మాటలు చేత లేపఁగని మాటునొ! యన్యులదృష్టిఁ జుల్కనై
పోటున వెన్ను జూపి చను పూరుషునట్టుల విన్నఁబోదునో!
మాటలె యించుకైన ననుమానము దోఁపనిలీల మెల్గుటల్. 221

చ. తరుణికటాక్షవీక్షణలఁ దప్పకపోవదు; మేను వొంగ నా
దరమధురోక్తు లీచెవులఁ ద్రావఁగఁ గల్గుదు; సానుకూల మా;
పరిపరి మానసంబు దెలుపన్ విననేరక మందబుద్ధి ని
త్తెఱఁగునఁ జింత సేయుట యక్షీరులనై జము, శాంతిఁ గూరెదన్. 222

మ. అని భావించుచు నాపురీపరిసరస్థాగణ్యదృశ్యావళిన్
గని పూర్వస్మృతు లెంతయు న్మదిని దీఁగల్వోలెఁ బ్రాఁకన్ మహే
శుని కారుణ్యముకల్మి రాధ నిట నేఁ జూడంగఁ బ్రేమింపన
య్యెను, సంశుద్ధదృఢానురాగ మిది యూహింపన్ గడున్ వర్ధిలున్.

గీ. అనుచు సంతృప్తితో బస్సు నవతరించి
నిశ్చలాత్ముఁడై కూర్మన్ననిలయమునకు
సూటిగాఁ బోయి మొగసాలఁ జొచ్చి యందు
నేరిఁ గానక లోపలి కేఁగి యంత. 224

గీ. రాధగది వాసి ద్వారపార్శ్వమున నిలిచి
దింపు నానుక వక్షఃప్రదేశమందుఁ

జిత్ర మొక్కఁడసు వెలయ సుస్నిగ్ధగండ
పాళి నశ్రులు జాఱ్చెడి పడఁతి నొకతె. 225

చ. కనుఁగొని రాధగా నెఱిఁగి కాంతుఁ మహోత్కట మై చెలంగ నెం
దును జను లుండకుంటఁ గని తొట్రిలుపాదము లీడ్చుకొంచు మె
ల్లనఁ జని, నిల్చి, శీర్ణనిటలాలక యై కడు స్రుక్కి విస్మృతిన్
దను గమనింపనట్టి వనితామణి నారసి సంభ్రమంబునన్. 226

చ. అనునయ మొప్ప సందియము లావలఁ బుచ్చి, సుమాంగి యశ్రువా
రినిఁ గొనగోళ్లఁ జిమ్మునఁ బరిస్ఫుటపక్ష్మల యౌచు రాధ తాఁ
గనుఁగొనె విభ్రమం బలరఁగా సముదుజ్జ్వలరాగశోభితా
ననుఁ బ్రియు, మానినీజనమనఃప్రియు, మన్మథమన్మథాంగునిన్. 227

చ. కని కలఁ గాంచినట్లు తమకంబునఁ జేతుల వానిఁ జుట్టి మో
మునఁ దనమోముఁ జేర్చి "నవమోహన ! నీదయ కల్గెనే !" యటం
చనునయ మొప్ప ముద్దిడియె నంగజగాఢశరానువిద్ధ యై
తనువు నలంచి మించు ఘనతాపము మాపఁగ నోప కేపునన్. 228

మ. తమి యొక్కింత యడంగ నాతరుణి చైతన్యంబు చేకూఱు, మో
హమునన్ మోవినిఁ గ్రోలు ప్రాణవిభుచర్యాకారముల్ గాంచి, వి
భ్రమమా ? నిక్కమ ? యంచుఁ దల్లడిలుచున్ బల్మాఱు లవ్వానిదే
హము చేఁ దాఁకి యథార్థ మం చెఱిఁగి యత్యంతానురాగంబునన్.

చ. తటుకున లేచి, చిత్రమును దల్పముపై నిడి భక్తిభావము
త్కట మయి ప్రీతి నొంప, విరిదాయము లౌ కరము ల్మొగిడ్చి యం
తటఁ బ్రియుపాదదోయిని వినమ్రత మ్రొక్కెను బాష్పనేత్ర యై
మిటమిట లాడు గబ్బిచనుమిట్టలు బిట్టడరంగ పొంగునన్. 230

ఉ. పాదనఖాగ్ర మంటఁ బలుభంగుల ముంగిట నంగజాంగు లె
న్నో దినముల్ తపింపఁగఁ గనుంగొనలం గనకే కడుంగడున్

వేదనఁ గూర్చు సుందరి నివేదిత యై ప్రియుపాదపీఠికన్
బాదుకొనంగఁ జేసె సరబాకుమగం డతఁ డెంతదిట్టయో. 231

మ. నిజపాదానత యైన కాంత శిఖసాన్నిధ్యంబునన్ లాక్ష యై
సజలాక్షిన్వయి సర్వ సేయు చెలువున్ స్వాంతమ్ము నుబ్బూఁచ నీ
రజనేత్రం దగ నెత్తి పక్షమున విశ్రాంతిం గనం జేయఁగా
భుజమధ్యంబునఁ దాల్చె నాతఁ డెలమిన్ బుష్పాస్త్రరాజ్యేందిరన్.

చ. ఇరువురిదేహముల్ పెనఁగ నెంతయు శోభిలె మావికున్న పైఁ
బురిఁ గొను మాలతీలతిక పోల్కిన, నొండొరు లన్యభావముల్
ఎఱుఁగక మేనుల న్మఱచి యీక్షణవాలికలన్ బరస్పరాం
తరమధురానురాగమును ద్రావఁగఁ బాల్పడి సొక్కులీలగన్. 233

గీ. క్షణముగ ముహూర్తకాలము గడపి, తెలిసి,
"నోము ఫలియింపఁ జేయ నా ప్రేమసుమము
పూని వ్రాలెను; నాథ! క్షేమమె" యటంచుఁ
గనుల నానంద మొల్కఁగా ననియె రాధ. 234

గీ. అనినఁ దటములు మీఱు ప్రేమామృతమ్ము
నిలువరింపఁగఁ గౌరవాలి చెలియ నెదను
గాఢముగ హత్తి 'యిపుడు నిక్కముగ సుఖిని'
అనియె నానందుఁ డానందమున మునింగి. 235

వ. అంత రాధ యాతని బాహుబంధమును సడల్చి "దైవము మన పాలఁ గలఁడు; కావుననే యతఁ డిట్టి యసదృశసన్నివేశములను గల్పించుచున్నాఁడు. నేఁడు మాయమ్మయుఁ దాతయుఁ గొబ్బరతోఁటకుం జనిరి. నా కిమ్మహాభాగ్యంబుఁ గల్పింప వా రటకుఁ జనియుండిరు. లేనిచో గుటకలు వైచుచు మి మ్మంతంతదూరమునుండి వీక్షింపవలసి వచ్చియుండెడిది. రండు. మిమ్ము నాజీవితమునఁ దొలియతిథిగా

నర్పింపనిండు." అని యాతనిఁ దోడ్కొని చని ముఖప్రక్షాళనం బొనర్పఁ గలశంబుతో జలం బొసంగి, యతనిపాదమ్ములం గడిగి, తజ్జలంబును శిరంబునఁ బ్రోక్షించుకొని, పయ్యెదచెరఁగున వారి నొత్తి, కురిచీయందు సుఖాసీనునిఁ గావించి, లోనికిఁ జని మనుచరిత్ర మును దెచ్చి యాతని కొసంగి, 'యొక్కక్షణము మీ రిద్దానినిఁ జదువుచుండుఁడు. నే నిప్పుడే యరుదెంతు' ననుచు లోనికిం జని కుంపటిపై నొక్కింత తేనీరమును గాచి కప్పుల నించి, నాన్చి చక్కెర కలిపిన యడుకులను, గదళీఫలమ్ములను నొకపళ్లెరమ్మం దుంచి, తెచ్చి, యాతనిముం దుంచి, 'వస్తుప్రాధాన్యమును గాక దాసి యను రాగమునుమాత్రమే గణింపుఁ' డనుచు వినయము దోఁపఁ బల్కి స్వీకరింప వేఁడె. ఆనందుఁడు చిఱునవ్వొలయఁ "గలిసి భుజింత" మనుడు, రాధ నాసాగ్రసంస్థితతర్జని యై "యపచారము. శేషమునకే దాసి యర్హురాలు. క్షమింపుఁ" డని వారించి "త్వరగా కానిండు. వా రరుదెంచినచో నేను తెరమఱుంగునఁ జేరవలసివచ్చు" నని వెలుపుఁ గూర్చి, భుజింపఁజేసి తేనీరమును బిడ్డని ద్రావించుతల్లివోలెఁ దానె త్రావించి తచ్ఛేషము నాతఁడు కనుమఱుఁ గగునంత మహా ప్రసాదముగ స్వీకరించి యరుదెంచి, యాతని కభిముఖంబుగా నించుక దూరమునఁ బీటపై నాసీన యై తాళవృంతమును బూని విసరుచుఁ గనులు తనియ నాతని సాభిలాషమ్ముగా నాలోకించుచు ని ట్లనియె.

ఉ. "ఇంతకృపారసమ్ము వెలయించుట కేమికతంబు ? క్షేమమే !
ఇంతకు మీర లీసమయ మెట్టు లెఱింగితి; రమ్మదొంగ ! న
న్నెంతలు సేసినారు ? కలయే యనుకొంటిని; మీదు రాక యే
కాంతమ ? లేక యేదయినఁ గార్యమునన్ జనుదెంచియుంటిరా ! 237

ఉ. ఇంత కృశించియుంటి రిది యేమి మనోహర ! గ్రీష్మకాలమే
యింతలు చేసెనా? యొడలి కేదియొ స్వస్థత తప్పె నేమొ ! యా

వంతయు దాఁచఁజాలక తెలుపఁగదె! నారట మొందఁ జిత్త మే
కాంతమునందు బాసి కనుకంపమెయిన్ బలపోతువా! ప్రియా! 238

ఉ. ఆసలుగాని తీరుబడి యూనె తలంప వియోగబాధలం
దీసము చిక్కి యుత్పలిక లెంతయుఁ గాంచు గలంచు మీకు, ను
ల్లాసముఁ గూర్చు మిత్రులు కల ల్లగ నేమిగలమ్ము దాసికై;
నాసిలుఁగుల్ నివేదన మొనర్చఁగ నేల మనోహరా! యిఁకన్. 239

ఉ. దాఁపఁగ నేల సుందర! సదా తను కంపిన దివ్యచిత్రమే
ప్రాపుగ జీవితంబు గడుపఁగను చోపితె; మీ రుమాలె నా
తాపము బాపి యశ్రుల నతంబును నొత్తును, మంత్రరాజ మై
చేపడె మీ సుధారసముఁ బండెడి పావననామరాజమే. 240

చ. మును నను గాంచియుండుదు విభూ! తమకన్న సమాధి నాకు నూ
తన మనరాదు, నిత్యమును తావకదర్శనభాగ్య మిట్టులే
కనుదును జిత్తమందుఁ, బలుకం గడు సిగ్గ జనించు; దేవియో
యనునయచేష్టలం దనిపి యాదరముక్తి వెలయింతు రెప్పుడున్. 241

చ. మన విరజాజిపూఁబొదను మానక నిత్యము నశ్రువారిఁ బ్రో
తును ననురక్తి, నేమరకఁ దోరముగాఁ దులసీసతీమణిన్
గనులను జిందు నీర మిడి కావు మటంచును రెండుప్రొద్దులున్
వినతి యొనర్తు, నాహృదయవేదన వానికె వేద్య మోప్రియా! 242

మ. తలఁపంబోకుఁడు ప్రాణనాథ! నను మిథ్యావాదిగా, సత్య మి
ప్పలుకుల్, చూడుఁడు కంటిపాపలను గాపట్యంబు లే దింత, ప్రొ
ద్దులు వేగించుట కష్ట మాను, నిశి సంతోషప్రదం బౌను, లో
కులు నావృత్తము సంశయింతు రను సంక్షోభంబునన్ జిక్కుటన్.

ఉ. మిన్నక చూతు రేల? తమి మీఱ వచింపఁగరాదె పేరు లాఁ
కొన్నవి ముద్దుగుల్కుపలుకుల్ చవులూరఁగఁ గ్రోల, నిత్య మీ

వన్నెలకామచిల్కఁ గనుభాగ్యము నొందఁగఁ బెట్టిపుట్ట, నా
పున్నెము పండఁబార నిటుఁ బోలదె మాలిమిఁ దేలఁజేయఁగన్." 244

వ. అని దైన్యంబు గదుర వల్కి నాజవరాలి కానందుఁ డిట్లనియె.

చ. "కొలఁదులు లేనిభావములకుం దగుభాష లభింపకుండుటన్
అలమటఁ బొందుచుంటిఁ జెలియా! తెలియన్వలె నన్నుఁ డెంపమే
యొలిచి భవత్పదాబ్జముల నుంచెదఁ గాంచవె; యాఁటబొమ్మగా
నిలిచితి వల్లనాఁడె; తగవే తలపోయఁగ నన్ను నన్యుఁగా. 246

ఉ. ఏనిముసమ్ములందుఁ గుటిలేక్షణ పన్నితొ చూడ్కి-జాలమున్
మానసకీర మియ్యది యమాయకమై యటఁ జిక్కెఁ, జక్కెరల్
ఆనఁగఁజేసి పల్కు మెటు లన్నఁ దలంపవె పల్కునట్లు; పా
దానతుఁ జేసి న న్నిటుల నాడఁగఁ బాడియె భామినీమణీ. 257

మ. హృదయస్పందనతాళమై వెలయ నారీలోకసీమంత మె
య్యది మధ్యం బగుస్థాయిఁ బాడఁబడు నిత్యాలాపనల్ గాఁగఁ జూ
డఁ దలం పుండిన నాయెదన్ జెవిని ప్రీత స్వాడి నిల్పంగదే!
సదయాత్మ,ప్రియ! నాధ! నాధ! యని యశ్రాంతంబు మార్మ్రోగెడిన్.

చ. ప్రణయిని! నేను స్రుక్కి కడువంతలఁ గూర్చితి నీకు, నాకు నీ
క్షణములఁ జిమ్మచీఁకటులఁ గ్రమ్మఁగఁ జేసితి నేమి చెప్పుదున్
గణకణ లాడు నిప్పుకలకై వడి నా కను లేమి? విన్ననై
యణఁగిన తీవఁ బోలెడి కృశాంగ మ దేమి యెఱుంగ సుందరీ! 249

చ. ఒకనెల వేచుమాత్రమున నూపిరి కన్నులఁ బట్ట, నెట్టు లో
సిక బిగఁబట్టు దీయొడలు ప్రేమ ఫలించెడునంతదాఁక? ప్రే
మిక! యకటా! యిటుల్ హరము మీఱఁగ దేహము స్రుక్కఁజేయ నే
టికి? తలపోయ వెందుకు త్రుటిన్ సమకూడెడి యత్న మిద్దియా?

శా. రాగోద్వేగముచేతఁ జిక్కి బహుసంత్రాసంబుఁ గల్పించితే,
బాగోగుల్ గమనింప కిట్టి యనర్థప్రారంభ మై విష్ణుఁడోఁ
గాఁ గాన్పించెనశీలాభ మేమి? స్మృతివిస్మారిన్ న్యాపథ్యముల్ వీడి యు
ద్యోగార్థం బెటు లంపనేర్తు వీరి మోహోద్వృత్తి నేమైనచో. 251

గీ. అవభృథస్నానపరిశుద్ధ మై రహించు
సోముడమ్మ నెమ్మోమునా స్తుతినిఁ గాంచు
ప్రణయహోమాగ్ని నాహుతిఁ గని విశుద్ధ
మైన నీమూర్తి; రాధ! ధన్యాత్మ వీవు. 252

చ. మఱచితె రాధ గాక యొకమాఱిది కీర్తనృదయంబునందుఁ జే
కురదు స్థలం బటంచు, బ్రతుకు స్మృతియు స్సుఖదుఃఖయుగ్మ ము
ర్వర నలస్వర్గమందు నెడఁబాటుగఁ బొంద నశక్య మింత, నా
హరిహరపద్మగర్భులకు నైన నశక్యము జంటఁ బాపఁగన్. 253

శా. బృందాసుందరి కాదె తోఁట్టతొలిఁ జేర్చెన్ బ్రీతి నీయిద్దఱిన్
విందే యీమెచరిత్ర? వాసనము నుర్వీమానవాదర్శ మై
విందుం గూర్చు, మహాసతీమణి కృపావీక్షల్ వృథా పోవు, పూ
వుందావుల్ వలెఁ బోయి మ్రొక్కఁ దగు నప్పుణ్యాంగనారత్నమున్."

మ. అని యానందుఁడు చుట్టుఁ జూచి "సమయం బర్హంబె ర"మ్మంచు నా
వనితారత్నము కేలుఁ గేలఁ గొని సంప్రాప్తప్రభాభక్తి లా
వనసీమం దొలుకాడ మ్రొక్కులిడఁగా నాకీమణిం గాంచఁబో
యెను నిశ్శంక; గణింతురే పరులు దమ్మెల్లెంచినన్ బ్రేమికుల్. 255

గీ. చని, తులసికోటసన్నిధిఁ జానఁ గూడి
మోకరిల్లి కన్నులు విచ్చి మూసి మఱలఁ
దులసిదళ మొంటఁ దీసి కన్నులను నద్ది
చెలియతురుమునఁ దురిమెఁ గోర్కులు నెలఁగ. 256

గీ. అంత విరహాపహంత్రి యయ్యబలఁ గొంచుఁ
బోయి ప్రాశ్వస్త్రుతులు రేపఁ బొటమరించు
తమిని రాధను బాహాబంధమునఁ దార్చి
యలరఁజేసెఁ బరస్మరశాస్త్ర్వా మనుచు. 257

గీ. పిదప నామానినీమణి యొసఁగు దృష్టిఁ
బర్వఁగాఁ జేసి "నాథ! యిప్పుడిది మధుర
సమయము లభించు నంచు లేశముఁ దలంప
నైతిఁ బయనించుతఱిని; భాగ్యంబు పండె." 258

గీ. అనెడిప్రియునకుఁ దృప్తనేత్రాంచలముల
నప్పగించి చేష్టలఁ దక్కి యలరె బాష్ప
వారి కన్నుల జాఱ, విశ్వప్రవృత్తి
మఱచి యున్నట్టి యోగినిమాడ్కి రాధ. 259

సీ. వసివాడి వత్తయౌ కుసుమవల్లికి రే
యిని వానజల్లు పెంపెసఁగినట్లు
గాఢవియోగాగ్నిఁ గ్రాఁగుచక్కవపుల్గు
కరుణరాగోదయ మమరులీల
నకనకలాడు పేదకుఁ గంచెఁడన్నము
గా మృష్టాన్నంబు గలుగుభంగి
చలినున్నవాని భాస్కరకర మొండు స్పృ
శింపఁగా మోదంబు చెందుభంగిని

గీ. వలపుపంట వై ప్రియుఁడు తన్నలరించెయ
రాధ నిష్కామసంప్రాప్తమునఁ బొక్కి
యాహ్లాదపూర్ణయై మునిఁగెను; బ్రణయమగ్న
కాంతలకుఁ బలెఁ గూడుట కాదె సుఖము. 260

ఉ. అంత నొకింతఁ దెప్పిరిలి, యానసకుమారి “ప్రియా! భయంబు లే
కెంతయు బోలఁకోర్చినార, లాఁడు దేవ కయుంగొనిరేవి డీని గో
రంతలు కొంచెఁ జేయుము, దయా! ప్రభుఁ డింక సశక్య మాఁ గృపా
స్వాంతమునన్ క్షమించి తొలిచందము నెప్పటి కేఁగుఁడీ!” యనన్.

ఉ. చిత్తమునం దెటన్ ముదము వెంచెదరో! తోఁపని భావతంతువుల్
గ్రొత్తగఁ దోఁచి యుల్లకొని గుండెలు జల్లన, నంత నాతఁ డు
న్మత్తునిఁ బోలెఁ డీబ్రనముగ మాటికి పీఠి చనంగ; నాథయున్
దత్తర మంది సంశయమునాత్మ ననూనముగాఁ జెలంగఁగన్. 262

చ. ఇటు నటుఁ జూచి పండడిగ నేఁగి కనెన్ మొగసాలయందు, న
ప్పటి కొరు లుండమిన్ గని, చివాలునఁ జెల్వుని వాసి, “దాసి మి
మ్మిటు నలయించె నందుఁ గడు నేను వహించినవార లేమొ! యి
క్కుటిల మహాపచార మొకఁ డయ్యెను, నెట్టి యొకర్పుఁ డిచ్ఛమై. 263

ఉ. ఇంచుక యాదరించి ప్రియుఁ డిష్టము సూపెన నిజ్జవీఁగ యూ
రించుట మాస్వభావము, స్మరింపకుఁ డీదొసఁగున్ మనోహరా!”
యంచు వినమ్ర యై యతని కంజలి మోడ్చెను నాథ; భక్తిఁ గీ
లించినపాణియుగ్మ మెడలించి కరుల్ సవరించి యాతఁడున్. 264

చ. “చెలి! తలపోయ నీ విపుడు చేసిననేర మదేమి? కన్నులం
దలమెడుకాంతిఁ జూచి తెలియందగుఁ గోపమొ! తాపమో! ననుం
గలఁచినదాని నంచుఁ బమతంబున ముద్దిడ నక్షులందు శో
భిలు తమమోములం గనుచుఁ బెద్దయుఁ బ్రొద్దు ప్రవించి కొంతొరల్.

శా. ప్రత్యక్షీకృతదైవమా! మధురభాషాతోషితాత్మీయ! దాం
పత్యావిర్భవ! కర్మయోగిని! ప్రణమ్యా! మానినీరత్నమా!
భృత్యార్థిప్రతికల్పభూజమ! సదావేదాంతచర్చాప్రియా!
స్తుత్యాంభోరుహపాదయుగ్మ! జననీ! శ్రీధామమే! చిన్మయా! 266

శ్రీమ న్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

## ష ష్ఠా శ్వా స ము




యుత ! యార్యజనస్మర
ణీయ ! తురీయార్థసాధనీయసుధీగా
ధేయ ! వదాన్యాపరరా
ధేయ ! గుణప్రణుతమాతృదేవీసేవ్యా ! 1

వ. అవధరింపుఁడు. 2

క. రాకాపీయూషాంశుస
మాకారమనోజ్ఞవదన ! యమృతస్రవనే
త్రా ! కల్యాణగుణవ్రా
తా ! కృతపుణ్యాకృతవనితాలోకమణీ ! 3

క. విను మవ్వలివృత్తాంతము,
వినుచుము భావార్ణవ మతివేలం బై యెం
దున మర్యాదాతిక్రమ
మొనరించిన నాకు శంక నొందక పూర్ణా ! 4

గీ. అంత, రాధ "మనోహరా ! యాలసింప
నొంపుగా నెంతు, రొక్కింత యుండుఁడు, కబు
రనిచె దన్యునిఁ బంపించి యైనఁ దాత
కమ్మకును జుట్టములు వచ్చి రనుచు నిపుడు." 5

గీ. నిర్భయమ్ముగా మీచెంత నిలిచి, తనివి
తీఱ మీచెల్వ మీక్షించి, తేనెవాఁక
లైన మీనుడు ల్విని, కాంత మనఁ దగు తను
బాహుమధ్యమునన్ జక్కుభాగ్య మెవ్వనో! 6

క. అని, రాధ వీధిలోనికిఁ
జని యొకబాలికను జీరి జననికిఁ దెలుపన్
బనిచెఁ గబు రయిష్టంబై
నను సందేహమ్మనయఁ జనందగ దఁపన్. 7

చ. పదపడి నేఁగుఁదెంచు ప్రియభామను నాతఁడు లోచనద్వయిన్
బ్రిదులఁగఁ జూచుచున్ బలికెఁ "ప్రేయసి! నీదగు స్వార్థచిత్త మె
ట్టిదొ! గమనించి తేర్పడ, నటింతువు స్నేహము గాని నీకునై
మదిఁ గడు నారటం గుడుచు మాలతినైనఁ దలంపవైతివే!" 8

మ. అనినన్ రాధ "ప్రియా! నిరాదరముమై నాడంగ న్యాయంబె నా
మన మీరీతి నెఱుంగుటా? మదిని నిమ్మాడ్కిన్ యథార్థంబుగా
ననుమానించిరో! ప్రేమసాగరసముద్యద్వీచికామగ్న నై
నను నేనే గమనింపలేనిస్థితి నున్నా నన్యమున్ గాంచమిన్. 9

చ. నటనము గాదు నా తప మనంతము మూర్తినిఁ గాంచి చెల్వుగాఁ
దటుకున నాయొడిం బడిన దానిని గన్నుల నద్దికొంచు ను
త్కటముదవార్ధి మున్గితిని, గల్మషభావము మైత్రిఁ గూర్చునం
తటి కుటిలాత్మఁ గాను; నను నమ్ముఁడు మానసచోర! పేరిమిన్. 10

గీ. అల్లముం దిను గాకి నై యలమటించి
కాలుగాలిన పిల్లి నై కలయఁదిరిగి
కంట వత్తిడుకొని నిరీక్షణము సల్పఁ
జుక్క తెగిపడి చేతికిఁ జిక్కె నేఁడు. 11

క. ఒడిఁ బడ్డ చందమామన్
విడువక మన సొప్పు నిట్లు వెంగలి నై నేఁ
దడసిన వేల్పులవశ మై
యడలు గుడుపకున్నె మీఁద నహరహముఁ బ్రియా ! 12

మ. ఇది నానేరము, స్వామి ! భూరికృప నా కీదివ్యభాగ్యంబు న
మ్మద మేపార లభించె, నిట్టికరుణమ్ముం దేరగాఁ బుచ్చనే
ర్చుదు నె ? ట్లించుక చింతసేయుఁ డెవ నాశుద్ధాంతరంగంబుఁ, ద
ప్పదు నా కొక్కక్షణంబునం దిచట స్తంభాలంబసంవీక్షయున్. 13

మ. మది మిమ్మే పెనవైచి యుండుటను నామాలిన్యమున్ మిమ్ముఁ దా
కదె ! దొంగా ! కనుకోనలం దదిగొ చక్కం గానఁగా నయ్యెఁ, దు
ర్భద మాలిన్య మటంచు రాధ తమి నాశ్లేషించెఁ బ్రాణేశ్వరున్
మదపీనస్తనవిస్ఫుటాగ్రములు గ్రుమ్మన్ రొమ్ము నిశ్శంక మై. 14

ఉ. గాటము లౌచుఁ దూటు వడ గాటె భవత్కుచపర్వతాగ్రముల్
బోఁటి యెదన్ గనుంగొనవె ! పోలునె యింతమిటార మంచు న
ప్పాటలగంధిచన్నుఁగవపైఁ గొనగోట రచించె వాట మా
కాటుల, వీని కింతచెలగాటము పాటియె యంచు నాతఁడున్. 15

చ. తెలియనివాని నిట్లు కసిఁ దీరఁగ గిల్లుట న్యాయమా యటం
చలుకను గంప మొందు రుచిరాధర మాతటఁ గాంచి యింక నీ
కులుకుతనంబు చాలు నని గొబ్బున నాతఁడు వాడిపంట న
య్యలికులవేణిమోవి చవి నంతయుఁ జిమ్మఁగ నొక్కిపట్టినన్. 16

ఉ. బాలయు బేల యౌ నబలపాటును జాటున నిల్చి పిచ్చుకల్
కేళిఁ దొఱంగి యుస్సు రని క్రీఁగనులం గనె సానుభూతి; మా
ర్జాలము జాలిమైఁ గనె వసారను జేరి కడుం గలంగి; చాల్
చా లని హెచ్చరించెఁ బెలుచన్ గడియారము గంట మ్రోఁగుచున్.

చ. తెలిసి యొడల్, తమిం జెలియ తీరిచి దిద్దినలీల ముచ్చ టౌ
చెలువునిమోముచెల్వుఁ బరిశీలన సల్పి, ద్రవించి, దృష్టిమై
నలమెనొ! యంచు సంశయము నంది, సఖాగ్రముతోడఁ గంటికో
నల నలరారుకజ్జలమునన్ బ్రియుచెక్కిటఁ జుక్క నుంచుచున్. 18

చ. తనిసితి నింక నుష్ట్రమువిధంబున నెన్నిదినాలకోఁ గదా!
యనుపమ మైన రాగరస మబ్బుట; దీనిని దాఁచుకొందు; జీ
వనమరుభూమి వప్రపలు బారలు దీరి లభింప నేర్చు నే
యనుచును దుష్టఁ బ్రేమ వసనాగ్రమునన్ బ్రియుమోము గోమునన్.

ఉ. ఆతని దొంటియ ట్లతనియాసనముందున నుంచి యేకతం
బై తను గాంచె నద్దమున; నంతటఁ జెక్కిట మోవిఁ గంటులన్
ఆతరళాక్షి కాంచి యవి యారయ సంశయ మౌను, బౌడరున్
బూతును వీడె ముంతుఁ దగ మోమున మోవిని నంచు నెంచుచున్.

చ. నలిగినదుస్తు లూడ్వఁ గడు నచ్చినచీరయుఁ గంచుకంబునున్
దెలియక తల్లడిల్లుచును దీయు నొకొక్కటి, కా దటంచు న
వ్వలువలు దీసి ద్రోగు నిడి వానినిఁ డోడ్కొనిపోయి నాథ! నా
కలరెడుచీర నెన్నుఁ డన నాతఁడు నవ్వుచు నొందు దీసినన్. 21

చ. చని, ప్రియమార లోఁదలుపుచాటునఁ దాల్చెడివేళ రోమ్ములన్
గనుపడు గోటిగంట్లు పులకల్ దులకింపఁగఁ జేయఁ జొక్కి య
వ్వనిత ధరించుచేల మిలపైఁ బడు టారయఁబోక నిల్చె, ని
ల్చిన నవనగ్నహేమమయవిగ్రహమో యన నింపుఁ గొల్పుచున్. 22

ఉ. పోళి నలంకరించుకొని యద్దముచెంతను వస్త్రవైఖరిన్
మేలుగ రాధ దిద్ది నవమేచకరోచిరుదగ్రకేశముల్
కీలుజడన్ రచించెఁ బులకీకృతదేహము, నూత్నభావశం
పాలతికల్ చెలంగఁ గనుపండువుగాఁ దిలకంబుఁ దీర్చుచున్. 23

చ. తిలకమ ! యెల్లవేళల సతీతిలకంబుగ నన్ను నిల్పుమా !
చెలువుని మాఱురూపముగఁ జెన్నలరారఁ గదమ్మ ! యంచు న
క్కలికి తలంచి తత్తరము గన్నులఁ దోఁప "ప్రియా ! క్షమించుఁ డ
వ్వల మిము నిల్పితిన్ దలఁపవద్దు సఖీకృతదోష మియ్యెడన్." 24

మ. అనుచుం బోయె మరాళమందగమనం బాహ్లాదమున్ గూర్ప, లో
చనపర్వం బగు నూతబాలివిరిదోసం బెంచు నెమ్మోము హా
సనవోత్తేజవిలాసముల్ బఱుప, విశ్వప్రేక్ష్యసౌందర్య మ
చ్చునఁ గాంతాకృతిఁ గొన్నలీలఁ బ్రియునకున్ బర్వె నచ్చోటికిన్.

మ. చని యనురక్తి పెల్లుబుక ఝర్ఝరితాంగము సొంపు నింప, "నే
మొనరుపవద్దు నాథ ! యిఁక నూరక చూచుటమాత్రమే తగున్
గనుఁ డిఁకఁ దల్లిచాటు మనుకన్యకఁగా నను; దొంగచూపులన్
బనుపకుఁ డోర్వఁజాల, మనవారలచెంతను గుట్టు రట్టగున్." 26

చ. అన నాతండు సఖీ ! సమగ్ర మగు నీయాకారసౌందర్యమం
దున లోపం బొకయింత తోఁచె, వడిఁ దీర్తున్ సైఁపుమీ యంచుఁ దా
మును గుప్తంబుగఁ దెచ్చినట్టి యొక సొంపుల్ గుల్కు రోజాసుమం
బును బొల్పొంద నలంకరించె జడ నప్పూఁబోఁడిమే న్వ్రాఁగఁగన్. 27

మ. కనుమా సుందరి ! సోయగంబుఁ దగ, నిక్కం బిప్పు డానందనం
దనమందారమ వైతి వంచుఁ జెలి నద్దంబందుఁ జూపంగఁ దో
డ్కొనిపోయెం గడుసంభ్రమంబు నెదఁ గోర్కుల్ మోసు లెత్తంగ, మో
హన మా స్వాకృతు లద్దమందు ననురాగాయత్తులై కాంచుచున్.

చ. ఎద లదరంగ ముగ్ధ లయి యెన్నియొభంగులఁ గూడి వీడుచున్
ముదమునఁ జెల్వ మారసి యపూర్వము లౌ ననుభూతు లెన్నియోఁ
గదుర నొకింత పుచ్చి తమకం బతివేలము గాఁగ నాతఁ డ
మ్ముదితకుచాద్రులం జెనకఁ బొల్పుగఁ జేయిఁ గదల్ప నామెయున్. 29

చ. "తగదు ప్రియా! యొకింత మదిఁ దాల్చుఁడు నిగ్రహ, మింక సంశయం
బుఁ గదురఁ గాన వానిదెసఁ బోలదు చూడఁగ, నాతురంబునన్
బొగులుట సంభవించు, దయఁ బూనుఁడు, రం" డని చేయిఁ బట్టి, చి
ర్నగ వలరారఁ జేర్చెఁ దననాథుని రాధ యథాస్థితిం దగన్. 30

శా. అయ్యో! స్వామిఁ దృణీకరించితిని నె ట్లాతండు భావించునో!
ఇయ్యావేదన నెట్లు సైఁచు నని యయ్యోగాక్షి చింతించుచున్
నెయ్యం బేర్పడ నాతనిం దరిసి పాణిం బాణిఁ గీలించి "యో
చెయ్యా! నన్ను క్షమింపు" మంచుఁ గడు రంజింపంగ ముద్దాడినన్.

ఉ. ఆతఁడు సంతసిల్లి "చెలియా! తలపోయఁగ నైతి నే" నటం
చాతరుణాంగి వ్రేలను గరాంగుళిఁ గుల్కెడియుంగరం బిడెన్
కాతరచిత్త యై ప్రియుముఖంబును గాంచఁగ నామె, "సుందరాం
గీ! తగు ప్రేమచిహ్న మిది కేల ధరింపు" మనంగ రాధయున్. 32

శా. "స్వామీ! దీని ధరింతు నెట్లు? పెర లెవ్వారైన నీక్షించినన్
ఏమందున్? నను సంశయింతు" రన "నోయింతీ! భవద్దత్తమున్
ఏమాడ్కిన్ గొనఁజాలువాఁడఁ? దగు నీ వేకాంతమున్ దాల్పఁగాఁ;
బ్రేమన్ దాఁపవె యన్యకాలముల" నాఁ డెంపారుమోహమ్మునన్. 33

గీ. అంగులీయకమును ముద్దు లాడి రాధ
దానిఁ గొని చని దాఁచె భద్రంబు గాఁగ
నాత్మపేటికఁ, బిదప నయ్యాలివ కతఁడు
తనదురాక వినిచె సవిస్తరముగాను. 34

చ. వినిచి, "చెలీ! తలంపు మిఁక వెన్నెలరాత్రులు గాఁగ జీవితం
బున, నెటు లందువా? వినుము; పూనికతో విజయాప్తిఁ గాంచఁగా
నను వగుమార్గ మేర్పఱుప నన్నయు మాలతి లక్ష్మియున్ గడున్
ఘన మగుదీక్షఁ బూనిరి, సుఖంబుగఁ గార్యము సానుకూల మౌ. 35

క. విద్యావ్యాజంబున నన
వద్యముగా మనము క్షేమవార్త లెఱుఁగుటల్
సద్యఃఫల మగుఁ గడ కీ
యుద్యమసాఫల్యమునకు నూహలు వినుమా! 36

క. ఇరుదెసల నంపుపెద్దలఁ
గర మనురాగమున వెలయఁగాఁ జేసి తుదిన్
ఎఱిఁగించిన నభిమతసం
స్కరణము సుఖ మౌను గాదె! చను నీవిధమున్. 37

క. భయ మొందం దగదు ఘనవి
షయ మంచుఁ బరిష్కరింపఁ జను నయముననే;
భయమునఁ బాలుం ద్రావరు
నయమున విష మైనఁ గొంద్రు నవ్వుచుఁ దరుణీ! 38

క. ఇటు లెంచిఱు కానికలను
నిటునటుఁ బంపంగఁ జేసి యేర్పడఁ జెలిమిన్
బటుతర మొనర్పఁ జేసితి
మటులైనన్ రాకపోక లలవడుఁ గాదే! 39

గీ. రాకపోక లేర్పడినచో రాజు లైన
చుట్టములు గారె? మిమ్ములఁ జూడ నెంచి
మాజనను లిర్వు రెంతయు మనసుపడిరి
యనిన స్నేహఫలం బెట్టు లల్ప మగును? 40

గీ. సామమునఁ గార్య మొనఁగూడ శస్త మగును
ననుచుఁ దలపోసి యీమార్గ మరసినార
మింతలోఁ బెద్దయోచన లేల యనుచు;
గోటఁ బుచ్చెడిదానికి గొడ్డ లేల? 41

గీ. కథయె యడ్డము దిరిగినఁ గలదు కాదె!
పెద్దలను ద్రోసి 'రా జని ప్రేమ సఫల
మొనరుపఁగను గాంధర్వమే యున్న; దెదను
భీతి నిసుమంతఁ బూనకు నాఁతి" యనిన. 42

గీ. ప్రియుని వీక్షించి రాగసంశయవిషాద
యోచనాద్ధైర్యసాహసయుక్త యగుచుఁ
"జరమసాధన లేకున్నఁ జాల మేలు"
అనుచు నప్రయత్నముగను ననియె రాధ. 43

గీ. అంతలో సవ్వడి నెఱింగి యవలఁ దొలఁగి
యున్న రాధను బొడఁగాంచి యుక్తరీతి
నన్యులకు సంశయము సుంత యైనఁ గలుగ
నట్టు లానందుఁ డామెకు ననియె నిట్లు. 44

ఉ. "విద్య నెఱింగెనేని యవివేకము మాయును, లోకవృత్తమున్
వేద్య మగున్, జెలంగు మది విస్తృత మై, చతురార్థసాధనల్
సాధ్యము లౌను, బెక్కు లగు సత్కృతులన్ బొనరింపఁగల్గు, సా
న్నిధ్యమునందుఁ గల్పకము నిల్పుట విద్యలు నేర్పుటల్ భువిన్. 45

ఉ. లింగవివక్ష యించుకయు లేక సమస్తజనుల్ నిరంతరం
బంగన! విద్య నేర్వ నగు; నారయ స్త్రీలకు నాత్మరక్తమాం
సాంగము లన్నియుం గలుగ నర్హలు కా రను టెట్లు విద్యకున్;
మంగళదాయి విద్య; యణుమాత్రము సందియ మొందఁ బోలునే. 46

మ. ఇరువంశంబుల నుద్ధరింపఁ దగు నీ వి ట్లున్న నేమందునో
సరసీజాసన! తృప్తిఁ బొందఁ జనునే చా లంచు విద్యార్జనన్;
బరు లెవ్వార లొసర్ప నేర్తు రిఁక నీభవ్యన్ భవత్తుల్యలే
కరణీయంబు గణింపకున్న, యిది నే గన్గొంతుఁ దీవ్రంబుగన్. 47

ఉ. పూరికిఁ గాని మాఘ్యపరిప్రాఢిసాక్ష్యము లాదరింతువో
సారమతుల్ వచించిన ప్రశస్తసుభాషితముల్ దలంతువో
యారయు మింక; వాదమున కై యిటు లన్న సహింతుఁ గొంత, యా
కూరిమినాయకాగ్రణికిఁ గూర్చుట కాదె! కళంక మానుషుల్." 48

మ. అని యానందుఁడు వాక్యనై పుణినిఁ గన్యారత్నముం గూర్చి ప
ల్కినపల్కుల్ వినుచు న్ముదం బెనయఁగాఁ గీల్బొమ్మ లై చెంత ని
ల్చిన వేంకమ్మను గూర్మినాయకునిఁ దాఁ జెన్నారఁగా నంతఁ జూ
చినయ ట్లాతఁడు లేచి మ్రొక్కె వినయస్ఫీతాననం బేర్పడన్. 49

ఉ. నాయఁడు బాష్పవారి నయనంబులఁ గ్రమ్మఁగఁ గౌఁగిలించినన్
జేయి శిరంబునం దిడుచు స్నేహ మెలర్పఁగ వేంకమాంబ "దీ
ర్ఘాయువు నాయనా! యిడు దయానిధి నీ" కని పల్కెఁ, బుల్క ల
త్యాయత మై చిగుర్పఁ బరమాద్భుత మొందుచు రాధ యాత్మలో.

ఉ. "ఎంతటిజాణ కాంతుఁ? డెటు లేర్పడ వారల సంశయంబు నా
వంతయు నొందనీయక యపారముదంబునఁ గూరఁజేసె; నా
చింత యణంగె; నింకఁ బ్రియుచెంతను సిగ్గిలక న్మెలంగఁగాఁ
గాంతును, నొక్కతూఁపున ఖగంబుల రెంటినిఁ గూల్చె నేర్పునన్."

చ. అని తలపోసి నిబ్బరము నంది విలాసము దోఁపఁ దల్లిచే
తినిఁ దనచేతఁ బట్టి ముఖదీప్తులు చిమ్ముచు "నమ్మ! కొట్టుకొం
టిని, యిటు లొంటిపాటును ఘటించితి రిద్దఱుఁ బోయి మెచ్చనా
ఘనకరుణామతిన్ దనువుఁ గాచిన పుణ్యనిరాశ చేకురన్. 52

చ, టకటక లాడు చెప్పుల సట న్వడి వచ్చిరి; నిల్చి రిచ్చటన్;
జకచజ లోనికిం జని వసారను నిల్చిరి; మొక్కలిష్ట యిం
చుక యెడిరో తలంచి, వెనుజూచుచుఁ బోవఁదొడంగ నేను నూ
రక యిఁకఁ జూడవా దని త్వరన్ గదిఁ బొత్తము పీడి దగ్గితిన్. 53

క. సవ్వడి విని నిలిచి ననున్
నివ్వెఱపాటలమునఁగ గమనించిన, "మీరల్
ఇవ్వీథిఁ బోవఁగఁ గన" డన
నవ్వుచు "మీ రిట నుండినారా?" యనియెన్. 54

క. రం డని యాసన మిడి కూ
ర్చుండన్ నియమించి యేమియొనరుతు నంచున్
మెం డగు సంశయమున మీ
రుండుమెడకుఁ గబురు పంచి యుదకం బిడఁగన్. 55

క. కరచరణమ్ములు గడిగిరి
పరిపరి మీరాకఁ దొట్రుపడుచు సపెయుఁగాఁ
దొరఁకొని రంతట 'టీ' నే
మరఁగించి యొసంగఁ జదువుమాటలఁ దెచ్చెన్. 56

క. అమ్మయ్యా! బ్రతికిపోతిని;
ఇమ్మాడ్కిని నన్నుఁ డెఱుఁగ; నే మనుకొనిరో
నెమ్మనమున నా గూరిచి?
ఇమ్మగువ కృతఘ్న యంచు నెంచిరో! యేమో!" 57

గీ. అనుచుఁ బ్రియువాక్యములకు నయ్యలరుఁబోఁడి
మెఱుఁగు దిద్దెను, భావబంధురసజీవ
పదములకు నుడికారసంపదను గూర్చు
కావ్యశిల్పనిష్ణాతుఁ డౌ కవినిఁ బోలె. 58

గీ. "ఇంత బెంబేలువారఁగా నేల తల్లి!
వావివరుసలు నెఱపుటవలన సిగ్గుఁ
బొందియుందువు గాని; నీపుణ్యము గదె!
ప్రాణదాతను సేవించుభాగ్య మబ్బె. 59

గీ. ఏ మొసంగి నీఋణమును నీఁగఁగలవు ?
వినయ మలరఁగ నొక్క-వందనము నైన
సల్పి తియ్యని నుడులతో స్వాగత మిడ
వెఱ్ఱిబాగులపిల్ల ! యీవిధము తగునె ? 60

క. విను ప్రాణమానదాతలు
జననీజనకులును నొక్క-చందము, వీరిం
గనునంత నన్యభావం
బున నెన్నఁ డుపేక్ష సల్పఁ బూనరు సుజనుల్. 61

క. కొఱమాలినశంకల ని
త్తెఱఁగు హితైషి, నతిథి, గృహదేశాగతునిన్
బరికించుచు గది దాఁగుట
వెఱ వగునే ? మందబుద్ధి వీడదు నిన్నున్." 62

చ. అనుచుఁ గుమారి వేంకమ నిరాదర యై పలుకంగ, నాయఁ డా
ననమున హాస మేర్పడ "గుణంబును నొక్కె-డ దోష మౌను, ని
ట్లనఁ జన దమ్మ ! కన్య యగు నామె యొరుల్ దరి లేనివేళ నే
మొనరుప నేర్చు? సంశయము నొందుట నైజము కాదె! యింతకున్.

గీ. చెలిమికలిమియు లోకముఁ దెలిసియుంట
నంతమాత్రమైనను జేసె నమ్మ ! దిట్ట
తనము గలది కాకున్న నింతకును సాహ
సింప నేర్చునే ? దాని దూషింప నేల ?" 64

గీ. అనుచు నానందుఁ గూర్చొన నాజ్ఞ చేసి
కుశలసంప్రశ్న మొనరించెఁ గొసరి కొసరి
పేరుపేరులఁ జిన్నలఁ బెద్ద లచట
నిచటఁ గల యెల్లవారిని నెనరుఁ దోఁప, 65

క. వేంకమయును నంతట నిరు
వంకలఁ గల యాఁడువాండ్ర బాగు లరయఁగన్
గొంకుచును రాధ యడిగెను
బొంకముగాఁ జెలులక్షేమముల నంతంతన్. 66

ఉ. అర్వాముగా జవాబు లిడి యాపట నాతఁడు రాధఁ గాంచి "యీ
సర్వాము గావు, స్నేహమున కౌ నివి సంజ్ఞలుమాత్రమే, మదిన్
గర్వాణ సేయ వ" ద్దనిర కానిక లల్పము లంచు, నీచెలుల్
"బర్వాము బర్వి కిచ్చుక్రియఁ బంపిరి వీనినిఁ గొమ్ము సుందరీ!" 67

చ. అని తన చేతిసంచి నిడె నాదర మొప్పఁగ రాధచేత, దా
నినిఁ గొని యామె వందనము నెమ్మి నొనర్పఁగ, నవ్వి యాతఁ "డీ
వొనరుచు వందనం బెవరికో యెఱుఁగన్, దగ నాకె యైనచో
మనుము చిరంబు శోభనసమన్విత వై గృహలక్ష్మి వై" యనన్. 68

ఉ. నవ్వుచు రాధ కిట్లనియె నాయఁడు 'చూడఁగదమ్మ! యింతలో
నెవ్వఁడో వచ్చి నీకునయి; యేర్పడు నింటను బెండ్లిసందడుల్
పువ్వులపాలకిన్ మగనిపొంతను గూర్చొని, నన్నుఁ జూచి, వీఁ
డెవ్వఁడొ బక్కపీనుఁ గని యీసుచు గందువొ! యాదరింతువో!'

వ. అనుడు, రాధ—

శా. హో! తాతా! యని యోరకోర బలుచూపుందూఁపు లేపార శం
కాతంకంబు లడంగ నాథువిధుబింబాకారభాస్వన్ముఖ
శ్రీ తుల్కింపఁగ గాడ నేసి, దరిసెన్ జెన్నార వ్రీడాభరో
జ్జాతాప్యారుణదీధితుల్ బఱవ విస్రంభంబునన్ స్తంభమున్. 70

మ. చని తత్పార్శ్వమువందు నిల్చి యెద లజ్జామోహముల్ పొంగువా
రిన వే రూనినకోరికల్ బెరుగ నీరేజాక్షి చొక్కంబుగాఁ
గనుగోన ల్వీరఁజిమ్మె ముమ్మురముగా ఖద్యోతవిద్యుద్వ్రజం
బును నాత్మేశ్వరుసాంద్రచంద్రముఖసంభూతాంశులం దేలఁగన్. 71

గీ. "అసలు సిగ్గరి, పరిహాస మాడ మాతి
ముడుచు, నీకాలమందలి పడుచు కాదు;
మీార లిరువు రద్దానిఁ గంగారు పటిచి"
రనుచు వేంకమ కూఁతును ననునయింప. 72

గీ. "తాతపలుకుల కులుకుదే తలిరుఁబోఁడి!
ఎవ్వా రన్యులు కలరు? నీ కేల సిగ్గు?
నీచెలులు పంచినట్టి కానికలు తాత
గారికిం జూపి తన్ప రాఁగదె!" యటంచు. 73

వ. కూఁతుఁ దోడ్కొనివచ్చి యందలి వివిధము లగు నల్లికపనులఁ గనుల నలరించు వస్తువులం గని, తన్నిర్మాణచాతురిని మెచ్చుకొనిరి. రాధ వానిని భద్రపఱుపఁ గొని చనునపు డానందుఁడు 'వస్తువులనుమాత్రమే నీచెలు లిచ్చిరి. సంచి నాది. దానినిఁగూడ సంగ్రహించుచుంటివే!' యనినఁ 'జిలుకతోడిదే పంజర' మనుచు లోనికిఁ బోయె. అంత నానందుఁ "డత్తా! పిట్ట కూఁతఁబట్టినది. మెట్రిక్ పూర్తియగునప్పటికి మీాయమ్మ యీనాఁటిపడుచులనే కాదు, రాఁబోవుపడుచులం గూడఁ దలఁదన్నఁగల" దనిన "నేమో! నాయనా! పరమేశ్వరుని దయ. ఇంతకు బాలికల చదువుమాట యేమిచేసిరి?" అని యడుగ నతఁడు "పేను తనపేరు మఱచిపోయినదన్నట్టు లదేపనిమీాఁద నిచ్చాపురము వచ్చి యన్నియేర్పాట్లు చేసి యది మీా కెఱిఁగించి పోవలె నని యిట కరుదెంచితి. మీా రడుగకున్న నే నావిషయ మెఱిఁగింపక పోయియుందునేమో!" యన రాధ నగుచుఁ "బుల్లాయివేమవర మని చెప్పి మీాచెల్లి మరల మిమ్ముఁ బంచియుండునేమో!" యన వేంకమ కూఁతుఁ గన్నుల నపవారించె. అంత నానందుఁడు "నష్ట మేమి? మఱలి రావలసివచ్చినచో యీసారి వెలుపలినుండి పిల్లివలె వచ్చి తలుపు గొళ్లెము పెట్టి, నాకుఁ గావలసినవానిని సంగ్రహించుకొందు"

సని పరిహసించి తా నాచరించిన చేష్టాదుల నెఱింగించె, పదపడి
నాయనిముఖము నుపలక్షించి బాధవిషయ మేమిచేయనున్నా రను
నట్లుగా వీక్షించె. 74

ఉ. నాయఁడు సంతసించి, "విను నాయన! బాలిక సమ్మతించుచో
నేయవరోధముల్ గలుగ వెప్పటికిన్ సదుపాయసంచయం,
బాయమ యిష్టముల్ గనవియట్టుల మున్న యెఱింగినాఁడఁగా
మీయుభయుల్ ప్రసంగముల, మే మొనరింతు మిఁక కేమి తెల్పుమా."

మ. అన నానందుఁడు "మీదువాక్య మది సత్యం బెంతయున్, జెట్టు నె
క్క నిరుత్సాహముఁ జూపువాని నెటు లెక్కంజేయఁగా నేర్చు ము
ద్దిని జే నానుచుఁ ద్రోచి యన్యుఁ; డొక నాడెంబైన యబ్బాయిచే
తిని దౌహిత్రికిఁ గూర్చ నామె కనుఁ బ్రీతిం గూర్పఁగా బిడ్డలన్." 76

మ. అనినన్ రాధ చురుక్కుసం గనుచు నయ్యానందు, "నా కేమియున్
బని లే దన్యులు పెండ్లిసేయ నిట, నా ప్రాణేశ్వరున్ నేన చే
కొననేర్తున్, శ్రమ నొందఁబోకుఁ డిఁక, నాకుం గూర్పఁగాఁ జాలువా
నిని మున్నే వరియించి యుంటి, నను మన్నింపంగఁ జే మోడ్చెదన్. 77

చ. దయ కలదేని మీచెలియఁ దన్వఁడు దీవెన లిచ్చి పెండ్లి నా
కయినపు డేఁగుదెంచి, మిము నర్చన సేయనె ప్రాణదాత! ని
ర్భయముగ నగ్రపీఠి నిడి, భావమునన్ బరశాఖ యంచు ని
ర్దయ నిట రాకపోవుదురొ! తద్దయుఁ గూర్మి వెలార్తురో!" యనన్.

క. నవ్వుచు వేంకమ "బాబూ!
కవ్వించితి వామె నొడుఁగాఁ బలుపకమా!
నివ్వటిలుకోపమున నిను
నొవ్వఁగ నే నైనఁ బలుకనో యనుకొంటిన్. 79

క. రవ్వంత లోక మెఱుఁగవు
ఎవ్వారియెడ నెట్లు మెలఁగు టెఱుఁగవు నీపై
రువ్వక రాళ్లను, గూరిమిఁ
బువ్వులనే విసరెఁ, గోపమును మ్రింగుకొనెన్. 80

క. కోపమున నైన మును నీ
వాపెకు నొనరించుమేలు నాత్మ మఱవలే
దీపాటి తెలివితేటలు
సూపినఁ గడు మేలు కాదె! చూడఁగ" ననినన్. 81

వ. ఆనందుఁడు నవ్వుచు రాధ నీక్షించి. 82

ఉ. ""నీవరియించినట్టి గణనీయచరిత్రుఁడు విద్య నేర్వఁగాఁ
బోవల దంచు నడ్డుకొనఁబోలు, నతం డతిమందబుద్ధి యౌ,
నీవిధి భావివృద్ధి కతఁ డేటికి యడ్డము వచ్చుచుండె, రా
ధా! విడు మట్టికుత్సితు, నుదారునిఁ జేకొనరాదె యాదినే." 83

చ. అనఁ, "బరిహాసవాక్యమున నైనను నాతని దూరు టోర్వ, మా
న్యుని సుగుణాలవాలుని వినూతనభావసమన్వితున్ దయా
వననిధిఁ జంద్రసుందరు నపారమనీషిని సాధుశీలు న
య్యనఘునిఁ దప్పుపట్టకుఁ డహర్నిశముల్ జదువంగఁ గోరెడిన్." 84

వ. అని, రాధ కడు పుబ్బ నవ్వఁ దొడఁగ నానందుఁడు నాయని నుద్దే
శించి "తాతా! మీమనుమరాలి లోఁతుగుండెం గల మధురభావ
ముల నాలోకించితే? ఈమె యసాధ్య. తన కాఁబోవువరుని కెన్ని
లక్షణము లరయ నుద్దేశించినదో తలంపుఁడు. ఇట్టిదిట్ట నుపేక్షించిన
లాభ ముండదు. త్వరగాఁ బుస్తెముడి వేయించి యేబాజ్జరాయనికో
యంటఁగట్టు" మన నాతఁడు నవ్వుచు. 85

గీ. "కమరు గుఱివెంచఁబట్టె యిక్కరణి వరుని
నెన్నికొన్నది; చెప్పఁల నింక వరుగఁ

దిరుగవలసిన పని చెప్పి, పరుసోక్తుల్
మింతెఁ జేసూర్చుకొందు నా కేమికొదువ? 86

గీ. తాత కొక్కింత చూప్ప మాత్రనివి జూచి
సంతసించెద" ననుచు, నప్పాన కంటి
పాపలఁ జూపె నంత నప్పుష్మనేత్రి;
నాయఁ డనురక్తి వెలయఁ జక్కగవ్వు డసర. 87

క. "నాసూపము కన్పడెఁ, ద
న్నారివి ముదివగ్గుపై మనం బిటు పట్టుపడ్డ
ఏమైన నవ్వోపోదురు
నేరుప్పుమై మంచివానినే యెన్నితివే!" 88

క. అనిన ఒకపక నవ్వుచుఁ
"దనయా! తాతయ్యతోడఁ దలపడి నీ వె
య్యానువున మాటల గెల్చెద"
వనియెను వేంకమ్మ కూఁతు ననునయ మొసరన్. 89

క. "వంగ ముదుర వరి లేఁత య
నంగ న్వినియుందు రాధ, నాటుచెఱకునన్
బొంగారురసము ముదురుగఁ,
దుంగ ముదుర ముస్తె తావిఁ దులకించుఁగదే! 90

మ. అని యానందముఁతు వల్కి నిగ్గుల ముఖం బబ్జాక్షి ప్రాల్పంగ మో
ద్భిన కెందామరచందమై వెలసె; సంస్కృత్యానురాగప్రపా
జనకం బైన కటాక్షవీక్షణము నిశ్వాసంబుతోఁ బుచ్చు న
ప్పనికాంతరత్నముఁ గాంచి బాలిఁయునుఁ దాపం జేర్పుకన్ దాంతఁదన్.

ఉ. తుంటరి కొంచు నిక్షయము మద్దూరవాక్యవిటీముఖాగ్ని వా
ల్గంటిని కొవ్వఁజేసితిఁ బెంపక, నాయన పిన్నఁబోయె, నా

వంటిజడాత్ముఁ డౌకటికవాఁ డెవఁ డుండును ? బాపి నైతిఁ, జే
యంటిన వాఁడునట్టి సుమమందున నిష్ఠురవజ్రఘాతముల్. 92

చ. అనుచుఁ దలంచి చింతఁ గని యూడట నాతఁడు రాధఁ గాంచి "నే
ననిననుడుల్ సుమాంగి ! కదు నారటఁ గూర్చెనటంచు నెంతు, నీ
మనమున బాధ నొందకుము, మైత్రిని నించుక మేరమీఱితిఁ
అనుపమతాప మందితి ననార్యకృతం బిది పెల్లు మానినీ !" 93

వ. అని కలగుండు పడునెడ. 94

చ. హృదయమునందు వహ్ని విపరీతముగాఁ జనియించి మించి య
భ్యుదయము నొంద నాసెగల నోర్వక కందె ముఖంబు నాఁగ వి
న్నఁదనము దోఁపఁజేయు నిజనాథునియాననబింబ మంత న
వ్మదకలహంసగామిని నమందవిషాదమునందు ముంపఁగన్. 95

ఉ. " ఏ మిది హాస్యభాషణల కేమి మునింగెను ? మీర లెద్దియో
నామది నొవ్వఁజేసి రని న్యాయమె చింతిల, మైత్రి యగ్గలం
బై మనునప్పు డొండొరులు హాస్యము లాడుకొనంగ దానికై
తా మిటు చిన్నవోయి యనుతాపము మా కిడ నేల చెప్పుఁడీ !" 96

గీ. అనుచు రాధాకుమారి నెయ్యమునఁ బలుక
బాలమైత్రియు సహానభావంబుఁ దెలిసి
మెచ్చికొని రెల్లరును; నాత్మ మివ్వుల నామె
యలరె యానందుఁడును శాంతి నందె; యతని. 97

గీ. హృదయనైర్మల్యమును నెదిరిని సమాన
గౌరవమ్మునఁ జూచుట కాంతలయెడఁ
గలుగుసత్కారభావముఁ దెలిసి వేంక
మాంబయును నాయఁడును ముద మందిరె కడు. 98

చ. కలకలలాడు నాథుముఖకాంతి జనాంతికమందుఁ బొందుగా
జిలిబిలిచూపుకూలం గనిసఁ జిత్తజుఁ డత్తటి నొత్తె శంఖముఁగ

నలిఁగులి దైనచిత్తము నణంపఁగఁ జెల్లుఁగఁ దల్లడిల్లె న
చ్చెలువ; వలవోకయే చపలచిత్తము తత్తఱ మొందఁ బట్టుటల్ ? 99

చ. హృదయము చిక్కఁబట్టి చెలి వృద్ధునిఁ గాంచి మనోహరుండు త
న్నిదివఱ కెంతయుఁ జతుర తేర్పఁగఁగాఁ జదువంగఁ గోర ది
మ్మదవతి యన్నమాటకు ననుమానము దోఁపఁ సటీలఁ బల్కుటల్
మదిని దలంచి యుక్త మగుమాటల నాతని దిద్దఁగోరుచున్. 100

శా. "తాతా ! యోపినయంత మీయెదుట విద్యల్ నేర్వఁగా నయ్యె, రే
పీతీరింకఁ బొసంగఁబోదు, ముదు నే నింగ్లీషుపై మోహముగాఁ
బ్రీతిం గల్గినదాన నంచు నను నీక్రైస్తవోక్తుల్ దప్పలే
దా ! తాటస్థ్యము విద్య నేర్వఁ గనుచుండం బెంతయున్ గర్వ్యమా.

మ. అదియే వారును గొంతు చించుకొని యత్యావేశ మేపార నా
కిది యేమాత్రముఁ గూడ దం చనిరి; మీ కేతెంచి విన్నారుగా,
ఎద నాసంశయ మేది యన్న విను: షే పీవిద్యలోఁ గూడినన్
దుద కెన్నాళ్లకు నొడ్డుఁజేరు దని యెంతున్ మీరు సైరింతురే ? 102

శా. నాసంగాతులు చూడ విద్యకయి యెన్నాళ్లైనఁ గష్టింపఁగా
నాసల్ బూనిరి, నాకు సాధ్య మగునే య ట్లొంచఁ బేరాస యా
నోసీ ! యింతను జాలు నీచదువు మే మోర్వన్ గదున్ గష్ట మీ
వీసంకల్పము మాను మన్నయెడ నా కెట్లుండు నెంచంబదున్. 103

క. మూరెఁడు మీఁదికిఁ జని దిగఁ
బారుట బారెఁ డది యేమిపని ? కను సిగ్గుం
గూర నగుఁ, జెలులచెంతను
నారయఁ దలతీసినట్టు లగు నని యెంతున్. 104

శా. కంటన్ బెట్టుక సాఁకుతల్లి, యనురాగస్వాంతుఁడౌ తాత నా
వెంటన్ వారు విడంగ నోఁప రెటు లీవిద్యన్ గడంగాంతు ? న

నొక్కింటి స్వీకుట కిచ్చగించునెడ నత్యుత్సాహి నై నచ్చెలుల్
వెంటన్ విద్దెలఁ దద్దయుం గఱతు భావింపంగదే దీనినిన్. 105

గీ. చేయి చూపి భ్రష్టనె నని చింతఁ గనుట
యేమి తెలివైనపని యని యెంచి వారి
కాక్రియఁ బల్కితిని; మిన్న యగును గాదె!
ఆదివిఘ్నూర్య మంత్యమునందుకన్న. 106

గీ. కాఁటిమూఁకులమంటచందమున భగ్గు
మనుటమాత్రముచే నేమి యగును చెపుడు ?
మందుగుండు సిద్ధము చేసి ముందు చూపుఁ
గలిగి కాదె లడాయిలో కాలు నిడుట. 107

ఉ. సూచన సల్పుఁ డిట్టిపనిఁ జొప్పడ సొంతము లాభకారియే ?
తోఁచిన దొక్కయూహ యని తొందర పడ్డ ప్రయోజనంబె, సం
కోచము మాని ముందు మనకుం గడుఁగూర్చెడితోవ నెంచి దీ
క్షాచరణమ్మునన్ మొసలియట్టుల పట్టును బట్టు టర్హమా." 108

గీ. అనిన, రాధాకుమారివాక్యముల నమిత
మోద మందె నానందుఁ డమ్ముదిత భావి
కార్యసాధనోన్ముఖత నిక్కరణిఁ గూర్ప
యుక్తరీతిని యత్నించుచుండు టరసి. 109

గీ. "చిచ్చుబుడ్డీవిధంబునఁ జెన్ను మీఱు
నీయెదను దాఁగియుండె నెన్నియొ మనోజ్ఞ
భావదృశ్యముల్ మూర్తిని బడసి బాల !
కార్యదక్షత యోజనాగరిమ ఘనము !" 110

క. అని మెచ్చికొనుచు నాయం
డనె "నమ్మా ! నీవు విద్దెలార్జించి కులం

బును వెలిఁగింపఁగ నెంచిన
ననువుగఁ బ్రోత్సాహము నిడదు సంతసము వ్యథన్. 111

మ. అతివేలం బగు క్షేమ ముంచు టది సత్యం బౌను; నామాత్రను
న్నతిఁ జేకూర్పఁగ నెక్కుకొందు మనుచింతే బూనఁగారాదు, మా
లతియుక్తా సిప్ర కవల్పిషంబున జనాలభ్యంబు లౌ జ్ఞానదీ
ధితులన్ గూర్చుకొనుండు ముక్త మునకీలెం, గూర్చు మాకెంతయున్.

క. ఈయేఁ డుండఁగ విరా చిత
నాయన కల్గఁ, డచట నుండిరక గడచుచు; బై
నేయను వని తలఁపకు; మే
నాయావిషయములఁ జూతు నక్షాళిషముగన్." 113

వ. అని తనూజముఖంబున ప్రశ్నిఁ సారించుఁడు, వేంకమ జనకునభిమతం
బెఱిఁగి కూఁతుం బ్రోత్సహించునదై యై. 114

శా. "అమ్మా! నెమ్మది సమ్ముదమ్ముఁ గను మభ్యాసార్హకృత్యంబు మో
హమ్మున్ గూరి యొనర్పనీయకు యగుఁ హాన్యాస్పదం, బింతమా
త్రమ్మున్ బుట్టినమునుంగు నేమి? ఘనవిద్యాప్రాభవస్ఫూర్తిఁ గై
కొమ్మా! కొమ్మలమేలుబంతి వయి మాకుం బేరుఁబెం పేర్పడన్. 115

ఉ. కష్టమె నిన్ను వీడి కొడిఁగట్టినదీపములీల విన్ననై
వృష్టిగ గ్రుక్కెఁ డైన జలపానము చేయుట మాకు; నైన నీ
యిష్టము, భావివృద్ధి, గమనింపకపోవుట యోగ్యమే? మహో
త్కృష్టపథంబు పెద్దలను దిద్దుటయే యగుఁ గన్నవారికిన్. 116

చ. వలసినసాయసంపద లవశ్యముఁ దాత యొసర్చు, నాపయిన్
వెలయు నిరంతరాయముగఁ బెంపుఁ గనంగను నాశుభాభికాం
క్షులు, చెలువారు నేస్తములసాహ్యాదయంబు ప్రతోభివృద్ధి నీ
కలవడఁజేయుఁ; జింత నిసుమంతయుఁ గాంచకు విద్య నేర్వఁగన్." 117

వ. అని పలుకు మాతృదేవివిశుద్ధానురాగస్వరూపము నంతఃచక్షువుల దర్శించి, రాధ నిష్కలానందతరంగితాత్మ యై తనయభిమతంబు లంతనె ఫలియించె నని యెంచి సజలాక్షిగోళ యై యామెచేతిని దనయిరు కరంబులం బట్టి స్పృశించుచుఁ గృతజ్ఞతానురాగమ్ముల వెలయించి, మాతామహు భక్త్యనురాగవినయసౌమ్యసంతృప్త్యన్వితమ్ము లైన యీక్షణమ్ములఁ దనియించి, నిజప్రియు విజయస్ఫోరకమ్ములు ప్రేమప్రపూరితమ్ములు నగు నిర్వక్రదృష్టుల నలరించి జలతరంగిణీస్వరానుకారమధురమంజులరుతంబున ని ట్లనియె. 118

సా. "సందేహమ్ము లడంగె, భావిగతి కై స్పష్టంబుగా బాటఁ నీ
చందానన్ సరిదిద్ది రెంతయుఁ గృతజ్ఞన్, ముష్వు రీజీవితం
బందున్ నిత్యసమర్చనార్హు లరు, మి మ్మశ్రాంతమున్ గొల్తుఁ గై
కొందున్ మహాళి ధరింతు సూచనలు, సంకోచింప నీపిమ్మటన్. 119

క. జీవనదాతయుఁ బునరు
జ్జీవనధాతయును భావిజీవితసౌభా
గ్యావననేతయు నిట నా
జీవితమార్గమును దిద్దఁ జేపడియెఁ దగన్. 120

గీ. మహితజిజ్ఞాస వెలయ నెమ్మాడ్కి విద్య
నభ్యసింపఁగ నను వౌ నటంచు వెతలఁ
గుడుచు నా కలవడియె మీకూర్మి యిటులఁ
దృషితునకు లభ్య మైనట్టి తీర్థ మటుల." 121

వ. అను రాధమధురోచితభాషణమ్ముల కమ్మువ్వురు సంతసం బెదలఁ గదుర వికసితముఖు లైరి. పదపడి యానందుఁడు రాధ నిచ్ఛాపురమ్మునకు నిర్ణీతదినమ్మునఁ బనుపఁ దగు ననియుఁ, గడమయేర్పాటుల నన్నింటిని దా నింతకుమునుపే కావించితి ననియుఁ దెలిపి, తా నత్యవ

సరంబుగా వెతలవలసియున్న దని యొసంబడఁ బలికి వారలచే ననిపించుకొని స్వగృహమ్మున కరిగె. మఱునాఁ డాతఁడు పుష్పపురిం జేరి సమస్తవృత్తాంతమ్ము నగ్రజనకజనకుల కెఱిఁగించి యేకాంతంబునఁ దనయనుభూతులందు నుడువ నర్హంబు లగువానినెల్ల మాధవాదుల కెఱింగించి రంజించె. 122

చ. పదపడి నారసింహుఁడు సుభద్రయు బిడ్డలుఁ జెంత నుండ "నె
య్యది భవదీయభావిపథ మారసినాఁడవు విద్య నేర్వ నె
మ్మది; నెఱిఁగింపుమీ!" యనుచు మాధవుఁ బృచ్ఛ యొనర్చెఁ; నంత స
మ్ముద మలరారఁగా జననిమోమున దృష్టి నిగుడ్చి యాతఁడున్. 123

చ. "అనునయమార మీహృదయమందున నెయ్యది యైన నిచ్ఛ క
ల్గిన నెఱిఁగింప వేఁడెదను; గీర్వాణ భక్తి వహింతు మౌళి, నం
దను నను మిన్నఁ జేయ నిటు తారు వచించుటగాక యేమినే
ర్తును గ్రమమార్గ మారయ, సుతున్ దగ మీరలె యాజ్ఞసేయుఁడీ!"

గీ. అనెడి సుతుఁ గాంచి వికసితాననము దనర
ధవునిముఖసీమను సుభద్ర తనదుచూపు-
లలముఁ జేసె; సతీమణి నరసి నార
సింహుఁ డిట్లనె మోమున స్మితము గదుర. 125

ఉ. "జీవిక యత్యభీష్టమగుఁ జెల్లును విద్య నెఱుంగుమార్గముల్,
భావిఫలార్థి పూర్వవిధిఁ బాల్పడ, నన్య లభీప్సితక్రియన్
బోవుదు; రెన్న రెండవది భూరిఫలప్రద మండ్రు పెద్ద; లిం
దేవిధి నిశ్చయింపవలె నెంచుచు సాధకబాధకంబులన్. 126

ఉ. ఆరయఁ బట్టముల్ బ్రతుక నౌ నని పొందుటచేత మేలు చే
కూఱదు, విద్య విద్య కనుకో క్రమెయిన్ గణవంగఁ జూచు న
వ్వారలె వెల్గుబాటల నవశ్రమముగాఁ బయనించి సంఘమం
దారని జాగృతిం జెనుప నర్హులు నిత్యవసంతమూర్తులున్. 127

మ. ధనసంపాదనమే ప్రయోజనము విద్యాసంగృహీతు ల్కనం
జన, దాత్మోద్ధరణంబుఁ గాంచుచు సమాజక్షేమముం గూర్చ నె
వ్వనివిద్యావిభవంబు లయ్యవియె సంభావింప నౌ; నర్థచిం
తన గోల్పుచ్చును మానవత్వమును స్వార్థప్రేరితం బై కడున్. 128

గీ. బ్రతుకుబాటను వెదకును బ్రాకృతుండు
విజ్ఞుఁడును దాన మగ్నుఁ డై వెలయునేని
యగునె క్షంతవ్యుఁ? డాతని కగును ధర్మ
మనుచరులమార్గమును దిద్దు టర్హ విధిని. 129

గీ. వలయు సదుపాయము లొసంగువారలె జన
నీజనకు; లభికాంక్షను నీవ యెన్ను
కొనఁదగున్ జదువుతెరువుఁ గూర్చుదాని
నింకమీఁదట" ననఁ దండ్రి నెనరు దోఁప. 130

గీ. మాధవుఁడు గాంచి భక్తిసమ్మానపూరి
తాత్ముఁ డై పల్కె "వందనీయములు మార్గ
దర్శకమ్ము లీ నుడులు; సత్యమును బ్రాప
మెఱుఁగ నయ్యె; నాయభిరుచి నింక వినుఁడు. 131

మ. మధురోదాత్తమనోజ్ఞభావమణిసంపద్విశ్రుతం బై పురా
బుధవిజ్ఞానవికాసభాసురము నై పొల్పొందు సాహిత్యనీ
రధిఁ బ్రాచీనసమాజసంస్కృతిసమగ్రస్ఫూర్తిమాలోర్మికా
ప్రథితాకారము సంది తోఁచు, నిడు నిర్వాచ్యప్రమోదోన్నతిన్. 132

శా. నైరంతర్యము భావబంధురము నానందైకగమ్యంబు సం
చారీభావసమూహపోషితరసప్రాంతానుభావ్యంబు దో
షారంభప్రశమప్రవీణము విమోహాజ్ఞాననాశంకరం
బై రాణిల్లును సాహితీపఠనశ్రేయస్సాధనం బై భువిన్. 133

గీ. హృదయపుటభేదసస్థితారిందమమ్ము
పూర్ణపురుషత్వమార్గావబోధకమ్ము
ధర్మసంక్షోభనాశనోద్యమము ప్రజకు
సారసారస్వత మ్మనఁ జనును గాన. 134

క. సాహిత్యపఠన సల్పఁగ
నూహింతును, జొక్కు నందు నుల్ల మనయమున్
స్నేహితుని వోలె నిత్య మ
నాహూతగుహూత్తముక్రియ నరయుదు దానిన్." 135

చ. అని, సవిమర్శదృష్టుల నిజాననము న్గను పుత్రుఁ గాంచి, లో
చనములఁ గ్రమ్మ బాష్పములు సమ్మదమున్ వెలయింపఁ జేలచెం
గున జల మద్దికొంచుఁ గనుకోసల దృష్టులు పర్వఁగా సుభ
ద్రను గనె నారసింహుఁడు ముదంబునఁ బాలు నొసంగుపోలికన్.

వ. అంత లక్ష్మి యగ్రజునందు దృష్టి నిల్పి కౌతుకాయత్తచిత్త యై.187

క. "ప్రాకృతమా? సంస్కృతమా?
వైకృతమా? ద్రమిళమా? స్వభాషయె యగునా?
గ్రీకా? లాటిన? యాంగ్లమ?
చేకొనఁగోరితి వెఱుఁగఁ జేయు" మనంగన్, 138

వ. ముసిముసినగవుల నలరారు మాతాపితరులం బిలకించి మాధవుఁ
డానందసుందరవదనుఁ డై యనుజ కాదరమ్మెుయి నిట్లనియె. 139

క. "పలుకులచెలి వై నీ వీ
పలుభాషలఁ బాండితీవిభవ మందంగన్
వలయును; నే నాంధ్రింబే
వలతును, బ్రస్తుతము కడమవానిఁ దలఁపన్." 140

వ. అనిన, విస్మయం బేపార లక్ష్మి "యన్నా! తెలుఁగా వలచితివి?
విద్యార్థిమొదలు విద్యాశాఖామాత్యునివఱకుఁ గల యెల్లరు నీసడించు

మాతృభాషనా కఱచుట ? ప్రాచ్యభాషానిష్ణాతు లనఁబడు బిరుదు
మగలే తెనుఁగును దిరస్కారపూర్వకమ్ముగా నవహేళనము సల్పుచు
నిందు నేర్వఁదగున దేమి యను నిక్కాలమున నీసంకల్ప మబ్బురమ్ము
గొల్పుచున్నది. జపానుబొమ్మ లని తెలుఁగు యమ్. ఎ. లు, నాశ్ర
యలబ్ధభాషాప్రవీణు లని తెలుఁగుపండితులు, నేతిబీరకాయబిరుదు
రాయుళ్ళని తెలుఁగుకవులును సమ్మానింపఁబడుచుండ నీ విట్టియవజ్ఞకు
లోఁబడ నుత్సహించితి వేమి ?" అనిన మాధవుఁ డాననమ్మున మంద
హాసము దొలుకాడ నించుక యోచించి యామె కిట్లనియె. 141

గీ. ఆత్మవిశ్వాసశూన్య మై యణఁగె జాతి
బహుశతాబ్దముల్ బానిసత్వమునఁ జిక్కి;
దానిఫలములె తొలిదశాబ్దమున స్వేచ్ఛఁ
బడసినను గానఁబడుఁ భ్రాంతవాసనలుగ. 142

మ. స్వజనావజ్ఞ యనైకమత్యము నవిశ్వాసంబు స్వార్థంబు సూ
రిజనానాదర మన్య పంథు లయి పేర్మిన్ మిన్నఁగా నెంచుటల్
ప్రజలన్ బాదుకొనంగఁ గాదె యడఁగున్ స్వాతంత్ర్య; మివ్వానినే
విజితవ్రాతమునందుఁ బెంచి యణఁచున్ బృథ్వీశుఁ డవ్వారలన్. 143

ఉ. బానిససంకెలల్ దొలఁగి బంధము వీడినయంతలోన వే
దూనినదోషరాశి యెటు లొక్కమొగిన్ గనరాక మాయుఁ ? గా
లానఁగఁ దాచిపట్టిన శిలాంతరమందున జాతి యెందఱో
మేనులు బొప్పిఁ గట్టఁ గనమే యనుయాయులు హోయి నేఁగుటల్.

చ. తెనుఁ గన నేల ? నన్నియు నిదేగతి భారతదేశభాష లా
లనమునఁ బాలనంబునఁ దులన్ సరితూఁచఁగవచ్చు, దీనికై
వనరి స్వభాష వీడు టది భావ్యమె ? సంధియుగంబునందు నె
వ్వని నని లాభ మేమి ? తలఁపందగు దిద్దఁగ సోదరావళిన్. 145

శా. మూలద్రావిడసంభవం బగుచు నామూలంబు గీర్వాణభా
షాలాలిత్యగభీరతల్ గనిన సుస్వాదాంధ్రభాషామత
ల్లీలీలాపలాస్యమంజులత నుల్లేఖింప సాధ్యంబె? కా
వ్యాలాపమ్ములఁ దేనెవాఁక తెనుఁగై యగ్రాసనం బందెడిన్. 146

ఉ. ద్రావిడసంస్కృతాంధ్రములతత్త్వ మెఱుంగక యాంధ్రభాషయం
దేవిధి వై దుషీగరిమ యేర్పడు నెవ్వనికైనఁ? బల్కులన్
జేవను జూపు మూఢుల విచేష్టల నెంచఁగ నేల? మూర్ఖుఁ డా
నూవుల నూనె లేకయె యనూనపుగాఁగఁ దప్పువట్టినన్. 147

చ. అనుజల మిన్నయై వెలసె నాంధ్రము సందియ మంద నేల? ప
ల్కున, నుడికారసంపదను, గుంఫనఁ, బోకట, మార్దవంబునన్,
సునిశితభావబంధురతఁ, జొక్కపుశయ్యను, బాకమాధురిన్
అనుపమసంస్కృతిప్రథిత మై తలఁదన్నును సాటిభాషలన్. 148

క. పొరుగింటిపుల్లకూరయె
కరము రుచికరం బటంచుఁ గనుటయు, నెద మ
త్సరములఁ జివికెడి పండిత
వరుల కుఱుచచూపు విన్నఁబాటును గూర్చెన్. 149

ఉ. మాతృస్తన్యము కొల్లలై వెలయ దంభాచారులై దాదికై
చేతుల్ సాఁచుట వెఱ్ఱి కాదె! యొడలిం జేకూఱఁగాఁ జేవ పై
పూఁతల్ గూర్చుట; కాని నేల విడి సాముం జేయఁగాఁబూనుటల్
కూఁతల్ గూయుట శ్రేయ మెన్నఁడును జేకూర్పంగలే వారయన్.

గీ. మాతృభాషానుభోగ్యసంపదను మాని
యన్యసాహిత్యసంపాదనార్థు లగుట;
ఉట్టి కెక్కఁగఁ జాలనియట్టియామె
స్వర్గమున కెక్క నెంచెడిచంద మగును. 151

గీ. ఆత్మసంస్కృతివిలసితు లై నవిదపఁ
గఱవఁదగు నన్యప్రజలసంస్కారగరిమ;
బలముగు ఫునాదిపైఁ గట్టఁబడిన భవన
మటుల దృఢముగ సంస్కృతి యమరు దాన. 152

గీ. తల్లియొడినుండి మాతృచిత్తమునఁ బాదు
కొనిన సంస్కారమును దీయఁదనము శిశువు
కైవస మొనర్చుకొనియె లోకమునఁ జొచ్చు
నదియె యోగ్యము సాహిత్య మందు నెందు. 153

గీ. పట్టభద్రుఁడ నై కావ్యపద్ధతులను
లేశ మెఱిఁగినవాఁడ స్వదేశసాహి
తీసుధామాధురిని దృప్తిఁ దీఱఁ గ్రోలి
యవల నుంకింతు నాంగ్లకావ్యాబ్ధి నీఁద. 154

క, ఇంగువ ముడిచిన పాఁత తె
ఱంగున, యోగ్యుండు నెల్లరం గను వాసిన్;
బంగారుసారు దుమ్ము న
డంగఁగ నేక్రియను గోల్పడం గల డెందున్ ? 155

క. ఇంతకు నభిరుచి కల్గిన
స్వాంతము సత్కృతిని గోరఁజాలునె ? లతికా
సంతతి ప్రసవించుట యొ
క్కింతయు సత్కారకాంక్షయే యనఁ జనునే?" 561

వ. అనిన, నందనువిజ్ఞతకును, హృదయవైశాల్యనైర్మల్యములకు నుల్లము పల్లవింప నరసింహా మానందుని నవలోకించి చిన్నబాబూ! నీయభిమతం బేమి" యని యడిగిన నతం డాంగ్లవైద్యశాస్త్రము నభ్యసింప నుత్సహింతు ననుచు— 157

శా. అంతఃకౌశల మన్న కోరఁగ శరీరారోగ్యమున్ గూర్ప నూ
హింతున్ సంఘహితైకచిత్తమున, సాహిత్యంబు భైషజ్య మ
త్యంతాపేక్ష్యము లౌను క్షేత్రమున క్షేత్రజ్ఞుండు నా నొప్పి, దు
ర్దాంతాఘౌఘరుజావ్రజప్రహరణోద్యత్సాధనద్వంద్వ మై." 158

వ. అని లక్ష్మి దెసఁ జూడ్కులఁ బఱపి "నీయభిమతం బేమి ?" యనుడు
నామె. 159

గీ. "అన్న యాత్మీయసాహిత్య మభ్యసింప
నవల నాంగ్లాభిరుచిఁ జూపె ; నట్టు లీవ
సలుపఁదగును; నాయుర్వేదశాస్త్ర మెఱిఁగి
పిదప నాంగ్లవైద్యజ్ఞానవృద్ధిఁ గనుము. 160

క. ఆసూత్రంబులె వర్తిలఁ
జేసి పలుకుచుంటివి, జ్ఞానసింధువు జనకుం
డీసంశయమ్ము దీర్పఁగ
నాసింతు" ననంగ మందహాసాననుఁ డై. 161

క. నరసింహుఁ డనియెఁ "గన్నులు
దెఱువని నీప్రాయ మేడ ? ధీమంతుల క
బ్బుర మిడు యోచన లేడ ? మ
ధురభాషిణి ! వినుము దీర్పఁ దొడరుదు శంకన్. 162

క. సారస్వతమును శాస్త్రము
ప్రారంభాశయఫలానుభవముల భిన్నం
బై రాజిల్లును శుభసం
భారము లధిభౌతికములు భౌతికములు నై. 163

శా. ఆయుర్వేదము నాంగ్లవైద్యమును శ్రేయస్సాధనం బై జగ
ద్ధీయం బొప్పుఁ బరస్పరాశ్రయ మపేక్షింపంగఁ బో వింతయున్

నీయాత్మేపణ చెల్లనేర దిట, దేనిం దానిగా నుంచు టే
న్యాయం, బిష్టవిధాన నేర్వఁ దగు శాస్త్రాధ్యాపనాసక్తి మై." 164

వ. అనిన, జనకు నాలోకించి లక్ష్మి "యయ్యా! వదినయభిరుచి నెఱుం గుదువా?" యనుడు నాతఁడు "తల్లీ! మి మ్మింక నడుగఁదగు సమ యము రానున్నది. అపుడు విచారింతును లె" మ్మనుడు నందఱు గొల్లున నవ్విరి. 165

* * * * * *

ఉ. "కాలమహాప్రవాహమునఁ గానక యే పడి జీవసంఘముల్
దేలుచు మున్గు చావృతులఁ ద్రిప్పట నొందుచుఁ గూడి వీడుచుళ
పోలుచుఁ జొక్కుచున్ వెనుకచూపును లక్ష్యము లేక భావి శం
కాలవ మైన నొందక యొకాయొకఁ గొట్టుకపోవఁగాఁబడున్. 166

చ. ఘనగణకాళిమానపరికల్పన లన్నియు నీటిరాఁత లై
తనర నఖండ మవ్యయ మతర్క్య మనాద్య మనంత మై జగ
జ్జననవినాశసాక్షియును శాశ్వత మా ఘనకాలమూర్తిఁ దోఁ
చిన యొకచిన్నియూర్పునను చేపను నెన్నియొ మానవాబ్దముల్. 167

గీ. విస్మృతకళింగమున రై తుబిడ్డ నగుచు
జనన మొందితి నిస్లామసంస్కృతియును
నార్యసంస్కారమును గూడి యలరుభాగ్య
నగరమునఁ జిక్కుకొంటి నీనాఁటి కిటుల. 168

క. కోటిత్రితయాంధ్రస్వర
పేటి చిరంతనమహాంధ్రవిఖ్యాతయశో
ఘాటి యగు భాగ్యపురి నీ
నాఁటికి వత్సరము గడిచినది మధురముగన్. 168

క. స్మరణార్హ మైన దీవ
త్సర మాంధ్ర చిరాభిమతముఁ దాల్చెను రూపుఁ

బౌరహేచ్ఛము లణఁగఁగ సో
దరు లైక్యము నొంది దెద్దఁజలఁచిరి భావిన్. 170

ఉ. మానవుఁ డెన్న సౌను గొలఁమాలినవానిగ, నెన్నిరీతులోఁ
దా నెద నెంచుఁ గర్త నని, తద్దయు నుల్లస మొందు మూఢుఁడై;
కాని యొకప్పు డట్టు తిరుగంబడు, నూహలు గాలిఁ దూలుఁ, గ
న్గోనలయందుఁ జింత ముడుకు ల్దలఁ జేర్చుట తప్ప దెప్పుడో! 171

గీ. తీఱె నానర్సు బెడఁద వాత్తెరుసందు;
నంతఁ బోళె యమ్. ఎ. పట్ట మాంగ్లభాష
యందుఁ జేకొనఁ దలఁ పేల? నాంధ్రరాజ
ధాని ననుఁ జేర్ప నేరు కర్తలొ యెఱుంగ. 172

ఉ. ఎన్నఁడు నీపురిం జదువ నెంచఁగ లే దెద నిచ్ఛ యందునా!
న న్నిటు సంస్కృతిప్రచురణమ్మును గూర్పఁగ నాత్మఁ గోరి యె
న్నెన్నియొరీతు లమ్మ కెటెఁగించి యొకంబడఁ బల్కి పంపెఁగా
నాన్న; యతండు కర్త యగునా? మఱి యొండొకశక్తి యున్నదా!

క. పౌరుషమా? దైవంబా?
పౌరుషదైవముల? ప్రకృతిపరిణామమ? క
ర్మా? రూపింపఁబడని దగు
కారణ మెయ్యదియొ సృష్టిగతికిఁ గతి యగా! 174

శా. ఆనందుం డొకయేఁడు న న్విడిచి యె ట్లారాటమున్ బొందెనో!
నేనే సర్వముగాఁ దలంచుఁ, ద్వరలోనే చూడఁగా వచ్చు, వాఁ
డైనన్ వచ్చినఁ జింతల న్మఱచి యత్యానందసంధాయకం
బౌ నానాకమనీయదృశ్యముల నెయ్యంబారఁ జూపించెదన్. 175

గీ. లక్ష్మి వ్రాసెను శ్రీకాకుళమ్మునుండి
"ముప్పూరముఁ గృతార్థుల మాదుము ధ్రువముగను,

ఇంటి కీనాఁడె పయణింప నెంచినార"
మనుచు వేఱొండు జాబు రే పండవచ్చు. 176

గీ. ఇంక రెండేండ్లు కాలేజి కేఁగవలయు
వారు మువ్వు, రానందుఁ డప్పటికిఁ జదువ
నొక్కయేఁ డుండు, నే నొకయేఁడు ముందుఁ
జేరు దింటికి విఘ్నముల్ జెనకకున్న. 177

గీ. చెల్లియెడఁదను ననురక్తి చెంగలిఁచె
నేమొ! యీయేఁట, లేక తా నెంచుకొనిన
దుర్గమపథాభిముఖ్యమే తుట్టతుదకుఁ
గార్యరూపముఁ గాంచి, నిగ్రహముఁ గనునొ! 178

గీ. రాధ విమలానురాగసామ్రాజ్యపట్ట
భద్ర యగుట నిర్విఘ్నము, భాగ్యశాలి
యనఁదగున్ దమ్ముగుఱ్ఱ, శుద్ధానురాగ
పూరితులకాంక్ష రిత్త కాఁబోదు నిజము. 178

ఉ. పట్టుపరీక్ష నొంది తనప్రాణధవుఁ గొనఁజాలు రాధ, యిం
కెట్టిసమాజశాసనమునేని యెదుర్కొనఁగల్గు నామె, చే
పట్టినకార్య మంతసులభంబుగ వీడుస్వభావ కాదు, క
న్గట్టును భ్రాంతభావములఁ గూరినపెద్దల కీవివాహముల్. 180

గీ. కఱడుగట్టినయాచారపరుల జాతి
గుండెలు ద్రవింపకున్నను గొదువ లేదు;
గోడమీఁదిపిల్లులఁ బోలు కొంతమంది
సానుభూతిపరులఁ గూర్పఁ జాలు నింక. 181

గీ. ఇప్పుడే యాఁడుపిల్లల కేమిఁచదువు?
ఎవనికో యంటఁగట్ట కిదేమి యొడ్డె

తన మనుచు గుసగుసలాడు జనులనుడులు
చెవిని బడియెను; మేలె యోచింప నిదియు. 182

ఆ. వె. గూళ్లు కట్టి నోళ్లు కొన్నాళ్లు నొక్కక
నొవ్వ, జనులు సేయు రవ్వ యణఁగుఁ;
బిదపఁ బెండ్లి సలుప, బెదర వీకంచర
పిల్లు లనుచు సద్దు చల్లఁబడును. 183

ఆ. వె. వేయ మునగకొయ్య తీయంగ సంభ్రమగ
కొయ్య యనెడులీలఁ గొన్నినాళ్లు
మెత్తఁదనము సూపి మెలకువగా నంత
కఱకుఁదనము నూనఁ గడఁగవలయు. 184

ఉ. చేకురె స్నేహసంపద యశేషముగా నిరుపక్కలన్, దగన్
రాశలుఁ బోక లేర్పడెఁ, బరస్పరమున్ హితకాంక్షు లైరి, ప
ల్గాకులమూఁకగోలకుఁ జికాకును భీతియు నేల ? డాబుగా
మేఁకను బోలు లోక మిది; మెత్తనివారిని మొత్తఁ గోరెడిన్. 185

క. గతవేసఁగిఁ బ్రియసఖి మా
లతితోఁ గడిపితిని బ్రొద్దులను; నీ యేఁ డే
కతమున నిటుఁ జిక్కితి హా
రతికర్పూరము హరించుక్రమమున గాలిన్. 186

గీ. పట్టభద్ర వైమె మాలతి భావిజీవి
తమ్ము నేలీలఁ గడుపఁగఁ దలఁచు, నేమొ !
ఎందు కీచింత ? రెండేఁడు లేఁగఁ బోడము
నీసమస్యను గూడి యోచింప నగును. 187

గీ. ముగ్ధభావప్రపూర్ణ మా ముగుద కనులఁ
దోఁచె నాకాంక్ష, చెంతఁ బ్రొద్దులను బుచ్చ

సాకుగా సంశయములఁ బ్రసంగములను
గుప్పి జిజ్ఞాస లాలసల్ గ్రుమ్మరించె. 188

గీ. ఊహ కందని గాంభీర్య మొందు చెలియ
పల్కులను జూపులను నిత్యవర్తనమున
వెలసి ననుఁ బాశవికకామ మలమనీక
నెత్తిపై మొట్టి హద్దుల నిత్య మిడియె. 189

క. గౌరవమా ? భయమా ? శృం
గార మిగిరిపోదొడఁగుట ? కాఁగనైతిన్
సారసముఖిఁ గనఁగాఁ జే
కూఱెడి భావంబు వింతఁ గొలుపు నేఁటికిన్. 190

క. నిరతమ్ము చెంత నుండన్
దొరఁగెనొ యాదరము ! కాదు; దుర్భర మాసుం
దరి వీడి యొంటిగా నొక
యరనిముస మ్ముండుటయును నాశ్చర్యంబే. 191

క. ఏమంత్రశక్తితో నా
కామభుజంగమును గట్టఁ గల్గెను జెలి, ని
ష్కామప్రేమతపస్విని
యేమో ! యాయమమహత్త్వ మెఱుఁగఁగ నైతిన్. 192

క. వినయం బిబ్బడి యయ్యెన్;
గనరా దొక్కింత యైన గర్వం బా వ
ర్తనమున; లావణ్యంబుకా
గొనియె శతగుణముల వృద్ధిఁ గోమలి నరయన్. 193

క. చూపులతోడనె నను నా
జ్ఞాపింపఁగ నోపె నాపె; స్వాంతము కామో

దీపిత మొనర్పనీయక
పాపగిదిని నిల్వరించె నింతి యొకొకయుఁగా. 194

గీ. పుట్టిపై నున్న చిఱుతిండ్ల నట్టె చూచి
లోట్టలను వైచు బుడుతనియట్టు లైతి
మూఁడునెల లిద్దఱముఁ గూడిమాడి యున్న
హారి హారీ! కొనగోరైన నంట నైతి. 195

క. కనుచూపైనంతన నా
మనమున జనియించు నెన్నొ మధురాకాంక్షల్;
చనుదెంచునంతఁ బ్రేయసిఁ
గని చిత్తము తోఁకముడుచుఁ గారణ మేమో! 196

గీ. పిఱికితన మబ్బె నెట్టు లబ్బురము గొలుపు;
రమణి కామశాంతికి సాధనముగఁ గాక
నన్ను శాసించు శక్తి యైనది క్రమముగఁ
బ్రణయినీపాదపద్మసేవకుఁడ నైతి. 197

గీ. క్షేమవార్తల నరయు, విశేషము లెఱిఁ
గించు, నాత్మానుభూతు లొక్కింత యొఱుఁగ
నీయకుండును లేఖ లన్నిఁటిని శ్రద్ధఁ
ద్రవ్వి తల కెత్తుకొన్న స్వార్థంబు గనను. 198

గీ. దాసి నని వ్రాయు, సల్పు పెత్తనము మీఁదఁ;
జరణరేణువు నను, శిరోభరణ ముగును;
ప్రేమ చిప్పిల్ల వ్రాయుఁ, బ్రేరేచుఁ గామ
మతినిగూఢస్వభావ ప్రేమానుభావ. 199

మ. అని ఖుర్దాద్ నెలయందు నైదవదినాం తానందదృశ్యావళిన్
గనఁగా వేడ్క హుసేనుసాగరచలత్కల్లోలోర్మికానీకన

ర్తనలోలానిలమాలికాప్రసరవిశ్రామార్హ మా 'పార్కు'లో
ననుభూతుల్ మనసంబు సల్పుచును నేకాగ్రాత్ముఁడై వేదికన్. 200

గీ. విశ్రమించి మాధవవర్మ వివిధభావ
వీచికలఁ దేలియాడుచు వేచియున్న
సుందరీమణి నభిముఖిఁ జూడఁ డయ్యె
నతని యేకాగ్రతను గని యాసుమాంగి. 201

గీ. కరములను మోడ్చి హెచ్చరికగ 'నమస్తె'
యనిన, మాధవుఁ డతిసంభ్రమాత్ముఁ డగుచు
లేచి, ప్రతివందనము సల్పి, "చూచియుండ
లేదు, క్షమియింపుఁ" డనఁగ నాలేమ నగుచు. 202

గీ. "తగని మర్యాద నిడుట యుత్తమము కాదు;
తోడివిద్యార్థి ననురక్తితోడఁ బలుకు
టంతె చాలును; కూర్చుండుఁ," డనుచు నామె
యతని కొక్కింతయెడముగా నధివసించి. 203

గీ. "మొదట నాయభినందనములను గొనుఁడు
నేఁడె యింగ్లీషుసంచికఁ జూడ నన్ను
మివుల నాకర్షణము సల్పె మీరు వ్రాసి
నట్టి 'భారతసంస్కృతి' వ్యాస మొండు. 204

గీ. వక్తలే యనుకొంటి నీవఱకు, నేఁడు
మిత్రుఁ డుత్తమరచయిత, స్తోత్రపాత్రుఁ
డని యెఱుంగ నాయానంద మవధి నెఱుఁగ
దయ్యె" నని కరచాలన మామె సల్పె. 205

గీ. "మధురభాషిణి వగుటచే మధువు నాఁగఁ
బిలువఁబడితివి; యభిమాన మొలుకు నీదు

పలుకులకు ముగ్ధుఁ డైతి; నావ్యాసమందు
బొగడఁ దగునది లేదు; నవ్వులకుఁ బోకు." 206

వ. అనిన, మధు వాసనమ్ము వికసింప "సరే! లెండు. మీతోఁ దర్కింప నేల! నే పాచార్యవర్గము ప్రశంసింప మీకే తెలియఁగలదు. నేను మాత్ర మున్నమాటఁ జెప్పితి. యోగ్యతను బ్రశంసింపకుండుట, యయోగ్యతను మెచ్చికొనుటవంటి యపచారమే కాఁగలదు; కావున నావిధి నిర్వర్తించితి. ఇంతకు మీకు నే యభినందనపరంపరలు రాక మానవు. అందుమాత్రము నాది ప్రథమస్థాన మని గుఱుతించుట మఱువవద్దు." అనిన, మాధవుఁడు పకపక నవ్వుచు "సరే! కానిమ్ము. నీకలలే ఫలించిన నాయభినందనపత్రము లన్నియుఁ గట్టకట్టి నీకే నివేదించుకొందు" ననిన, "నంతమాత్రమునఁ దీఱదు. విందు కంగీకరింపవలె", నన "మధూ! యీమాత్రమునకే వెనుదీయుదునా? చద్దియా? పలావా? యేదియో తెలియకున్నది. దయచేసి యదిమాత్ర మెఱింగింపు" మను మాధవునిఁ గాంచి కడు పుబ్బ నవ్వుచుఁ, "గాదు బాబూ! కాదు. కష్టపడి వ్రాసినది చాలక జేబుకూడ ఖాళీ చేసికొందురా? నేనే విందు చేతును. మీరు రా నంగీకరింపుఁ డని మనవి." అనిన మాధవుఁడు వెరగుఁ దోఁప "నీవా?" అనుచు, "మీపంతుళ్లతో నిదియె బాధ. మీ రంత కంగారు పడనేల? మీ కాయకసరులే వడ్డింపింతును రండు" అను మధును గాంచి మాధవుఁడు నవ్వుచు. 207

ఉ. "బాపఁడఁ గాను నీవలయుభంగుల నచ్చినవాని నన్నిటిన్
మేపఁగవచ్చు, నాకును నమేయమె యాఁకలి; శంక నొంద నే
సాపడ నెచ్చ లైన, నొకసందియము న్గని కొంకుచుంటి, నీ
కీపని కష్ట మౌను, నెటు లీజతనంబుఁ బొనర్తు వంచు నే. 208

క. ఏప్రాఁటకూటియింటికి
ఈపనికై పోదు ? వింత కేమి మునింగెన్ ?
సాపడినమాత్ర స్నేహం
బేపారున ? వ్యర్థకష్ట మేటికి చెప్పుమా !" 209

చ. అనినఁ, బ్రహాసభాసురముఖాంబుజ యై మధు వాదటం గనుం
గొనలఁ జెలంగురాగము నిగూఢముగా నణఁగించి మెల్ల ని
ట్లనియె, "నెఱుంగనయ్యెఁ దమయాత్మగతం బగుసంశయంబు, స్త్రీ
యన నొకయింత చుల్కఁదన మారయ నో తమదృష్టి నక్కటా !

ఉ. ఉత్తమసంస్కృతిం బొడము నూహలె యీగతి నుండె, మైత్రియుక్
జిత్తము స్త్రీల కుండ దని సృష్టిని వా రొకచీడపుర్వులో
గత్తరప్రోవులో యనియెగాఁ దలపోతురు, చాలు లెండు; మీ
చిత్త మెఱుంగ కిట్లు కడు సిగ్గిల నయ్యె క్షమింపు మాధవా ! 211

ఉ. సాకు లవజ్ఞచిహ్నములు, స్వాంతములో నొకదాని దాఁచి, యే
దో కను లిట్టు లొత్తుటయె దోషము, మైత్రినిఁ గాలరాచి న
న్నాకుల మొందఁజేయఁ జనునా ? తలపోయఁ దుదాత్తచిత్తు లా
మీ కిది యర్హకృత్యమె ? యమిత్రతఁ జూపుదు వేల మాధవా! 212

వ. అని పలుకు నవ్వనితారత్నమును గాంచి, 213

గీ. వజ్రహతిఁ గూలినట్టి పర్వతము పోల్కిఁ
గుప్పఁగూలి మాధవుఁ డంతఁ దెప్పిరిల్లి
కనుల బాష్పముల్ గ్రమ్మ ప్రకంపమాన
గాత్రుఁ డై పల్కఁదొడఁగె శోకమున మునిఁగి. 214

గీ. "మోడ్తు నంజలి మన్నింప మొదటఁ, బిదప
వినుము సావధానముగ నా విన్నపంబు
నామనమున నవజ్ఞ యేనాఁడుఁ గలుగఁ
బోదు మిత్రులయెడ, విడఁబోలు శంక. 215

ప్రేమసౌహార్దసహనమూర్తిగఁ దలంచి
యగ్రతాంబూలము సమాజమందు నొసఁగఁ
దగును స్త్రీజాతి కంచు స్వాంతమున నెంతు
మాతృమూర్తులె జాతినిర్మాత లగుట. 216

పలుకుల నపార్థ మొదవుటఁ
గలఁచెను నీమనము, చింతఁ గనకుము; దోషా
విలచిత్తుఁడఁ గాను; హితా
వళి నొవ్వంజేయునంత పాపిని గా నేన్. 217

వ. నన్ను విశ్వసింతువో! యీవాక్యంబులను గపటంబులుగాఁ, దలంతువో యెఱుంగ. నీ క్లేశము లెందుల కంటివి; కాని నీకోర్కెఁ దృణీకరించితినా? నీ వించుక తొందర పడితివేమో! యుద్రేక మణంగినపిమ్మట యోచింపు" మను మాధవునాననంబుఁ గాంచి సానుతాపాశ్రులు గ్రమ్మ మాధవుకరంబును దనచేత నొత్తుచు "నవనీతకోమలహృదయుల రగు మిమ్ముఁ గలంచి నేను గలఁతఁ బొందితిని. క్షమింపుఁడు. దైవవంచితనై మాతృప్రేమకు వెలియైన నిర్భాగ్యకు మార్దవానురాగము లెట్లలవడు?" నని జొటజొటఁ గన్నీరుఁ గార్చు నాయమం గాంచి మాధవుఁడు "మధూ! హృదయము చిక్కఁబట్టి నీవృత్తాంతమును విన నర్హుం బేని వినుచు" మని యామెమోమును దనచేతితోఁ దుడిచి యుపశమనవాక్యంబులఁ బల్కునంత నించుక తేరుకొని కలఁకదేరిన కాసారంబువడువున హృదయము ప్రశాంతిఁ గన "మాధవా! యీజీవితంబున నాత్మీయజీవ మొండు గల దను విశ్వాసమును గలిగించితివి. హృదయతాపోపశమన మ్మొనరుప నీవ యర్హుండ వనుభావమ్ము సంధిల్లె. నావిషాదగాథ నీ కెఱిఁగింతు వినుము. 218

గీ. కులమునం దవిశ్వాసము గలుగుదాన
నైన వినిపింతుఁ గరణము లండ్రు మమ్ము;
ఔత్తరాహుల మటఁ; దీర్ఘయాత్ర సలుప
వచ్చి మాపూర్వు లిట స్థిరపడిరి మున్ను. 219

గీ. మాజనకుఁ డీపురమ్మున మాన్యులైన
హిందువుల నొక్కఁడై కీర్తిఁ బొందె; నగల
వర్తకుఁ డతండు; బహుధనవంతుఁ; డతని
పేరు గోవిందరావు; వత్యుదారశీలి. 220

క. పరదేశవర్తకులతోఁ
విరివిగ వర్తకము చేసి విశ్రుతుఁడై సుం
దరభవనమ్మును గట్టెను
తఱుఁగనిసంపదలఁ గూర్చి దాతగ వెలసెన్. 221

గీ. జనని మోహమైన గుర్తింపఁజాలని పసి
తనమునందె న న్విడి భూతలము విడిచె;
నాఁటినుండి దాదులపోషణమునఁ బెరిగి
జనకుఁదొడ నాడుకొంటిని శైశవమున. 222

గీ. మాసవిత్రీసమాఖ్యయు మధుకుమారి
యగుట స్మృత్యర్థముగను మాయయ్య యదియె
నామ మిడి పెంచఁదొడఁగెను న; న్నతండు
విడె వాణిజ్యమును భార్య వెడల వ్యథను. 223

మ. ధనసంపాదననాస్థ విడి తనమొత్తం బెల్ల బొంబాయియం
దుఁ బ్యాంకిన్ బడవైచి నిత్యమును నాతోఁ బ్రొద్దులన్ బుచ్చుచున్
బెనిచెన్ న న్నొకలోపమున్ గనక యా పెంపైన సైరింపమిన్
గను గుట్టన్ విధి కూర్చె దుర్భరము లౌ కష్టమ్ము లొక్కమ్మడిన్.

గీ. మీరు వినియుందు రా రజాకారుదుండ
గమ్ము లేషేండ్లక్రితము; నగ్నప్రసిద్ధ
విలయపై శాచికాకృత్యములను జిక్కి-
భాగ్యనగరము నెత్తుటివరదఁ దేలె. 225

శా. హాహాకారము లెల్లెడన్ జెలఁగ మూర్ఖావేశ మేపారఁగా
సాహేబుల్ దమతోడిమానవుల స్వేచ్ఛా, సౌఖ్య, జీవార్థసం
దోహమ్ములఁ హరియింపఁ బాల్పడిరి; క్రుద్ధుల్ దేశచారిత్రమం
దూహాతీతవిషాదకృత్యముల నెన్నో చేయుటల్ గాంచమే. 226

శా. పాకిస్థానము ప్రోత్సహింపఁగను గోవావారు పంపన్ దుపా
కీకుంతాసిసమూహముల్ గొనుచు సంక్షోభావముల్ వీడి యు
గ్రాకారంబున హైందవావళిని గ్రుక్కం ద్రిప్పుకోనీక చీ
కాకుం గూర్చి వధించి రెంతయు రజాకారుల్ దయాశూన్యులై

వ. ఆ దుర్భరహత్యాకాండ మొదలిడునప్పటికి నేను భిత్రుసహితంబుగఁ గార్యాంతరంబున బొంబాయియం దుంటిని. అప్పటి కింకను గల్లోలము చెల్లచెదురుగా నుండుట విని నాజనకుండు నన్నుఁ దనమిత్రుఁ డగు సేట్ జానకీరామ్‌గారియొద్ద విడిచి హైదరబాద్‌పరిస్థితులఁ బరికించివత్తు నని బయల్వెడలె. నామనమ్మున శంకాభయమ్ములు పెనఁగొన జనకుని వారించితిఁ; గాని యాతఁడు నాకు ధైర్యంబుఁ గొలిపి 'పరిస్థితులు కుదుటఁబడిన మంచిదే! లేకున్న సంగ్రహింపఁ దగు చరాస్తులను భద్రపఱిచికొని చనుదెంతు' నని బయల్వెడలె. నా జనకుఁ డీనగరమ్మును జేరి యొకలేఖమూలమునఁ బరిస్థితి దుర్భరముగా నున్న దనియు, నిజ్జిత్రప్రణాళిక ననుసరించి లూటీలు, హత్యలు, మానభంగములు, మతపరివర్తనములు జరుపఁబడుచున్న వనియు, నిట్టియెడ శాధ్యలతకల పౌరుఁ డెవ్వఁడు సోదరులఁ గటికవాండ్ర యని

వాఁడుద్రోహి స్వార్థపరుఁడై స్వప్రాణరక్షణకుఁ బాల్పడఁజాలఁడనియుఁ, దా నీవిలయాగ్ని నణఁచుటయో లేక స్వజనార్థ మయ్యగ్ని నాహుతి యగుటయో చేయుదు నని, తన యుదాత్తసంకల్పము నెఱింగించి తన మరణశాసనమును జతచేసి సేట్‌గారికిఁ బంపించె. ఆజాబుఁ గని పితృతుల్యుఁ డగు సేట్‌గా రెంతయుఁ గలఁత నొంది హృదయమును జిక్కఁబట్టి న న్నన్నియోరీతుల నోదార్చి తన యేకైకపుత్రి యగు వసుంధరాదేవితోఁ దుల్యఁగా న న్నాదరించె. పిమ్మట వార్తాతంత్రులు దెగనఱకుట, రైళ్ల నాఁపివేయుట మున్నగు దుశ్చర్యలవలన మాకును నాజనకునకును వార్తామాత్రసంబంధమును దెగిపోయె. దుర్గమువంటి మాభవనమును నాజనకుఁ డనాథనిలయముగ నొనరించి తన పలుకుబడిని ధనమును వినియోగించి హిందువులయందు ధైర్యస్థైర్యములు పెంపొంది యేకీకృతు లయి స్వప్రాణరక్షణ-పరులుగా నొనర్ప నహోరాత్రములు కృషి సల్పి నగరమధ్యము నం దొక యభేద్యదుర్గముగ నిలిచె. ఆమహాత్ముని యవిరతకృషివలన నసంఖ్యాకహైందవకుటుంబములు ధన మాన ప్రాణములు నిల్పుకొనఁ గలిగిరి. ఇది రజాకార్ ఘాతకులకుఁ గడుపుమంట యై నాజనకుని హతమార్ప శతవిధంబులఁ బ్రయత్నించియు వలనుపడక తఱి వేచి యుండిరి. విశేష మేమన, ననేకులగు ముసల్మానుప్రముఖులే యాత నిపై నీఁగనైన వ్రాలనీయక కనుగలిగి కాఁచుట. నగరమధ్యభాగ మున దుండగులచర్యలు కొనసాగమి వారు సివార్లం బట్టిరి. నాజన కుఁ డద్దానిని వారించుటయందును దోడివారి సాహాయ్యమున నెన్నియో కట్టడుల నొనరించుచుఁ బ్రమాదవశమున నొకదుండ గుని తుపాకిగుండు కెర యై నిండుజీవములఁ గోలుపోయె. కొంతకా లమునకు భారతప్రభుత్వపుఁబోలీసుచర్యవలనఁ బరిస్థితి కుదుటఁబడుట సువిదితమే ! ప్రశాంతనగరజీవిత మలవడినపిదప జానకీరామ్‌సేటుగారు

నన్నుఁ దోడ్కొని మాగృహమునకుఁ జని పరిస్థితి నెఱింగి పసిబా
లుని వోలె విలపించె. నాస్థితిఁ జెప్ప నవసర ముండదు. పెంపుడు
తండ్రిగా సేటుగారు మాయింటిని సరిదిద్ది న న్నింటిగా నుంప నిచ్ఛ
గింపక తనతో బొంబాయియందే యుంచుకొనుచు గనుగలిగి సాఁకె.
నేను బి. ఎ. పట్టమటనే పొంది గతవత్సరమే మాయింటికి వచ్చి
పాలుపోవక మీసహపాఠి సౌభాగ్యము నొందితి. 228

గీ. త్రాడు తెగిన గాలిపటము, దయ దొఱంగి
త్రెంపఁబడిన లతిక నై ధరిత్రిఁ గష్ట
సంచయమ్ములమూర్తి నై జాలిఁ గొల్పు
నష్టజాతకురాల నీనాఁటివఱకు. 229

గీ. కలదు కొల్లలుగా మల్లె; కాని నాను
భూతిఁ జూపు నాప్తులఁ గానఁ బుడమియందుఁ;
బితృసదృశుఁ డైన సేటును బృథ్వి వీడె;
నా యఁనెడువారు లేక యనాథ నైతి." 230

గీ. అనుచు నవిరళాశ్రులఁ జేల నంత నొత్తు
మధుకుమారినిఁ గన్గొని, మనము వికల
మగుడు భాషింప నేరక, యతఁడు లేచి
యామెశిరమును నిమిరెను ననునయమున. 231

క. జొటజొటఁ గారుచుఁ దలపైఁ
దటుకునఁ బడు నశ్రువారిఁ దడుపఁగ ముఖ మం
తట నెత్తి మధుకుమారి వ
నట నెంతయుఁ గను హితునిమనం బరసి వెతన్. 232

క. "ఇది యేమి మాధవా ! నీ
మది నొవ్వఁగఁ జేసియుంటి మన్నింపవె; యా

పదలం గూడిమె ప్రట్టితి
సదయుఁడు భగవానుఁ డతని సనవలె" ననుచున్. 233

ఉ. చీరచెరంగుతో నతనిచెక్కిళులన్ జెలువారు వారి నొ
ప్పారఁగఁ దుడ్చి చేయిఁ గొని ప్రక్కను గూర్చొనఁజేసి మైత్రి పొం
గార విమర్శనాత్మకముగాఁ బరికించుచుఁ దృప్తనేత్ర యై
యారమణీయగాత్ర తగ నాదర మేర్పడ నంత నిట్లనెన్. 234

ఆ. వె. "కట్టుపుల్ల చేతఁ బట్టిన మసి యంటు
నట్టి లీయభాగ్య నాదరించు
వారి కెల్ల నంటు వంతలదొంతులు;
మీ కకారణముగ నోఁకెఁ జింత. 235

గీ. సభ్యత, విశాలహృదయము, సాధుశీల
మలరు మీహృదయమ్ము నా కవగతంబె;
యైనఁ జూతము మీర లేమందు రనుచు
లేనిదోష మారోపింపఁ బూనినాను. 236

గీ. మంచిగంధపు ద్రుమాను ఛేదించుచున్నఁ
బలుపును సుగంధ మట్టులె పాపి నగుచు
మి మ్మవజ్ఞ నొనర్చియు మీ యమేయ
సానుభూతినిఁ జేకొంటి; సత్ఫలంబె. 237

గీ. తెలిసితి శిరీషకుసుమకోమలమనోజ్ఞ
హృదయు లీ రని; మీశుభాకృతినిఁ దైల
వర్ణచిత్రముగా భద్రపఱుపవచ్చు
మానసంబున; శాశ్వతమైత్రి యలర. 238

గీ. పూఁటకూటియింటను నాకు భోజనమ్ము
నేర్పరింపఁగా శ్రమ నొంద నేల యనెడి

మీా నుడుల్ సాక్ష్య మిడియె; నేమియును శ్రద్ధఁ
బూన రీ రస్యలవిషయముల వసంగ. 239

క. ఏఁడాదినుండి యొక ఠాఁ
గూడితి మిట విద్య నేర్చుకొనఁగా, మీా చే
న్వాఁడు సహపాఠి నెఱుఁగన్
జూడమి కడువింతఁ గూర్చు సుగుణంబె యగున్. 240

క. కనులందు విసము గదురం
గ నసభ్యముగాఁ జరించి కషు సి గ్గిడు వ
ర్తన గల విద్యార్థుల మి
మ్మును జేర్పఁగరామి మిగుల మోదం బిడియెన్. 241

చ. కల దొక బిక్కుబిక్కు మను కన్నుల కిం పగుసౌధరాజ్య, మం
దలరుదు మిన్కుమిన్కు మను నాముదపుంజిఱుదివ్వె వోలె, మి
త్రుల ? చెలులా ? సహోదరుల ? దుఃఖము నించు పురాతనస్మృతుల్
దలకొనఁ దల్లడిల్లుదు సదా యుటిఁ జిక్కిన పుల్గులీలఁగన్. 242

శా. స్త్రీ నై పుట్టితి, మిత్రు నొక్కని దయాస్నిగ్ధాంతరంగున్ లస
న్మానానూనచరిత్రు గేహమున సమ్మానంబు దీపింపఁగా
నానందింపఁగఁ జేయ నేర్తును; సుహృద్వ్యాపార మాతిథ్యమున్
ఏనారీమణి సల్పఁ గొంకు ? తగు మీా రేతేర స్నేహంబునన్. 243

శా. కారుం దోడ్కొని వత్తు మిమ్ముఁ గొనిపోఁగా రేపు మాయింటికిన్;
మీా రా నంచుఁ వచింపుఁ డింపుగను; సంప్రీతిన్ దల న్నూఁచుఁ, డా
హారస్వీకృతి కేవి లేవుగ నిషేధాద్యావరోధంబు, లీ
సారే మిమ్ము నలంతుఁ బ్రశ్నముల, దోషం బెంచఁగాఁబోకుఁడీ." 244

గీ. అనుచు మధుబాల పల్క, నయ్యలరుఁబోఁడి
ననునయానందదృష్టుల నలరఁజేసి

పలికె మాధవుఁ డనురక్తి పులకరింప
నమృతమధురానుకారవాక్యములు వెలయ. 245

గీ. మధుమధురభాషిణీ! మధూ! మామకేంగి
తమును నెఱిఁగింతు వినుము, నిత్యమును నిన్ను
ననుఁగునెచ్చెలిగా హృదయాసనమున
నిల్పఁ గృతనిశ్చయుఁడ నైతి నేఁటినుండి. 246

క. బహుకష్టపరంపర దు
స్సహముగ పైఁ గ్రమ్మ నోఁపఁజాలిన నీ యా
సహనంబె భావిఁ దోడ్పడు;
బహుమానించెదను మిత్రభావమున నినున్. 247

క. నీసంతసమునకై నే
నేసిలుఁగులు దాల్పవలసెనేనియు బహుసం
తసమునఁ దల నొగ్గుదు; ను
ల్లసమున్ గను మింక శంకల న్గనక చెలీ! 248

క. విదుషివి, లోకజ్ఞవు, సం
పద కలదు, విశుద్ధసాధువర్తనవు, సుఖా
స్పద మాను భావి, కష్టాల్
గుదురుకొనవు, చింత నొందకుము మదియందున్. 249

గీ. అర్హ మగురీతి నీ యీ ప్రియాత్మమిత్రు
వలయునట్టుల సుఖదుఃఖములను బొలు
గొనెడిభాగ్యముఁ జేకూర్పఁ గోరువాఁడఁ;
దలఁపఁదగును న న్నాత్మబాంధవుని గాఁగ. 250

గీ. భోజననిషేధములు లేవు; పొలఁతి! వర్ణ
భేదము న్గాఁషఁ జాల తప్పిదము గాఁగ

నెంతు; నీభేదములకాల మేఁగె; నింక
ప్రాఁతతలపోత లెంచుట కోఁత యగును." 251

చ. అన విని "మాధవా! వినత నైతిని, నిన్నిఁక సద్గ్రశిష్యులో
నునుచుట ధర్మ మౌను; విను ముత్తమఁగా గణియింప నాదునం
చనుకొనుచుంటి నింతవఱ; కాగురుగౌరవయోగ్యుఁ డీవ; వి
ద్యను ఋజువర్తనన్ వెలుఁగుదారుల నిన్నిఁక వెంబడించెదన్."

చ. "తలఁపవుగా మధూ! మదినిఁ దార్చుచు నుంటివి సమభావ మెం
దులకో! యెఱుంగ, నాయెడలఁ దోఁచిన గొప్పతనం బదేమి! వి
ద్యలఁ గఱవంగ నొంటరులఁ దద్దయు మీఱఁ దలంప వశ్య, మ
ట్టులె కృషిఁ జేయకుండిన నెటుల్ బెనుఘనమును వ్యక్తి విద్యలన్.

శా. వ్యక్తిత్వంబు నడంపఁ దోఁపడిన స్నేహం బెంతయున్ వ్యర్థ; మ
త్యుక్తుల్ కావివి, తావకప్రతిభ యత్యుత్సాహ మీరీతిగా
రిక్తం బై చను, నోర్వ దీనిని; సుహృత్ప్రవృత్తంబు విద్యార్జనా
సక్తిన్ శ్రద్ధను బెంచి యాత్మఘనవిశ్వాసంబుఁ జేకూర్పదే. 254

చ. అనునయమార నొక్కపరి నాదరవాక్యాలు బల్కుమాత్ర నే
రిని మది విశ్వసింపకుము, ప్రీతి ముఖంబున నాత్మ మోసముల్
దనరఁగ మేడిపండులవిధం బగు; తేనెలు చిల్కఁ బల్కు నా
తనునిసమగ్రమూర్తిని యథార్థముగా గ్రహియింప సాధ్యమే? 255

ఉ. చూపఁగవచ్చు గౌరవము చొప్పడ దందుఁ బ్రమాద మంతగా;
లోపముగా గణింతు నెదలో నొకయించుక మైత్రి కల్గినన్
నీపగిదిన్ విమర్శన మనీషయుఁ గొల్వడి విశ్వసించుటన్;
గోపము నూనఁబోకు మిటు కుండపగిల్చినలీలఁ బల్కితిన్. 256

గీ. కాలవాహినిఁ బడి యిట్లు కట్టెపుల్ల
లటులఁ గూడితి మిచ్చట; నంతమాత్ర

నేమిఁ గ్రాహ్య మయ్యెను నీకు నామనంబు
స న్ననుసరింతు నను టది న్యాయ మగునె?" 257

గీ. అనిన, మాధవు, "విసిగింపఁ జనదు నన్నుఁ,
బసినిసుంగును గాను మీపల్కులు విని
భ్రమయుటకు; నేను మీసహపాఠి ననుచు
మఱవఁ దగ; దింతకును నేను మగువ నగుదు. 258

చ. కఱచితి విద్య నెంతయు, జగం బన నేమియొ చూచియుంటి, నె
వ్వారి నెటు గౌరవింపఁదగు బాగుగ నేర్చితి; నొక్క దీర్ఘవ
త్సర మయిన న్నిమముం దెలియఁజాలనిబాలను గా; నొకింతయుం
బొరపడలేదు; స్వేచ్ఛమెయిఁ బోదును, నాప్తుని నేర్పరించితిన్. 259

శా. మాన్యామాన్యవిచక్షణారహితదుర్మానంబు వ్యక్తిత్వ మా
నా? న్యాయంబె యహంకృతిన్ బెనుప; గణ్యప్రాభవం బెంచమిన్
నాన్యంబుల్ దలపోయకుండుటయు నౌనా? యాత్మవిశ్వాస, మో
ధన్యాత్మా! యిఁక నాఁప వేఁడెదను వ్యర్థస్వాత్మనిందాక్రియల్. 260

శా. మీయంతఃకరణంబు నైజమును గూర్మిన్ సజ్జనత్వంబు వి
ద్యాయోగ్యాదిక మెల్ల మున్నె ఘనశాస్త్రజ్ఞుండు సత్యార్థి యై
చేయం బొల్పడునట్లు నే విభజనన్ జిత్తంబునన్ సల్పితిన్;
న్యాయం బీవిషయంబు నెంచమియె నాయానందమున్ బెంపఁగన్.

గీ. వినుచుఁ డొక్కింత మీ గతవృత్తము విన
నర్హ మగునేని? దానితో నవసరమ్ము
లేమి నిజ మైన నుంత చెల్మికి సహాయ
పడినఁ బడవచ్చుఁ; గోపము నుడిపి దయను." 262

గీ. అనిన, విహసితవదనుఁ డై యనియె నతఁడు
"మధుకుమారి స న్నొకత లోకమాన్యుఁ జేసె;

నే మొసంగి యాఖుణ మింక నీగఁగలను ?
ధన్యవాదము లొనరించి తన్పువాఁడ." 263

గీ. "చాలులెం డిఁక నన్ను హాస్యము లొనర్పఁ
దొడరితిరి; మాట మార్పక యడుగుదాని
కుత్తరం బిడుఁ డూరింప కొనరఁ ద్వరగ;
నెంతచీఁకటి పడియెనో యెఱిఁగి సుంత." 264

క. అను నామె కనులయందునఁ
గన నగు హాసమ్మును గని కాంతామణి యా
యనువున శాసించెడిశ
క్తిని బడసెను; చెలిమిపెంపు దివ్యము గాదే! 265

చ. అని యెదలోఁ దలంచి కుసుమాంగిని నాదరదృక్కు లేర్పడన్
గని "మధు! నానివాసము శ్రీకాకుళమండలమందు వంశధా
రనికటమందుఁ జెన్నలరు గ్రామము పుష్పపురంబు, నందు నే
జననము గాంచినాఁడ నొకక్షత్రియవంశములో నొకండ నై. 266

క. జననీజనకులు గల; రొక
యనుజయు నున్నది; కుశవఁగ నర్థుల కిడఁగా
ననువుగ భూవసతి కలదు;
జనకుం డొక్కింత కీర్తిశాలియె యచటన్. 267

క. ఆనర్పుఁ జదివి యాంధ్రము
లో, నిట కరుదెంచితిని; గలుగ విదివఁటకున్
మానిని! యే యిక్కట్టులున్
సానునయంబునను దండ్రిచాటున నుంటిన్. 268

ఆ. వె. చెల్లి లక్ష్మి పూర్తి చేసె నింటరు తొలి
యేఁడు మొన్న; మీఁద నెట్టు లున్న

నీటితామరటుల లోటుపాటులు లేక
పెరిగినార మేము ప్రేమ మీఱ. 269

గీ. సహనమున నిన్ను సరితూఁగఁ జాల నేను
బహుళకష్టానుభవము లేర్పడమి జీవి
తమున నింతకు; లోకతత్త్వము నెఱుంగ
సాధనం బగు భూరికష్టములగములె." 270

వ. అనిన, మధుకుమారి విచలిత యై. 271

గీ. "మాధవా! వెఱ్ఱి ముదిరె నామాట లింకఁ
గట్టిపెట్టుఁడు వినుటకే కష్ట మగును;
లెండు; నాకారుతోడ మీ రుండుచోటుఁ
జేర్తు" నంచు నాయమ లేచెఁ జేయిఁ బట్టి. 272

మ. జలయంత్రమ్ములు చిమ్ముతుంపరల నుత్సాహంబు సంధిల్లఁ, దా
వులు పైఁగ్రమ్మఁగఁ జిమ్ము పిల్లవలిగాడ్పుల్ మైకమున్ గూర్ప, వె
న్నెల యుల్లమ్ములఁ బల్లవింప, రజనీనిర్నిద్రశోభాసము
జ్జ్వలదృశ్యంబును నాకళించుకొనుచున్ సమ్యగ్వచోభాషు లై. 273

శా. వ్యోమాగ్రస్థితవృద్ధిచంద్రరుచి, విద్యుద్దీపచిత్రోజ్జ్వల
శ్రీమత్కాంతులు, వృక్షగుల్మలతికాప్రేతచ్ఛాయాకృతుల్, లీల హ
ర్మ్యామంబందు మనోజ్ఞచిత్రముల సద్యస్స్ఫూర్తిఁ గల్పింపఁగా
నామిత్రద్వయ మంత నంతఁ జని రత్యానందనిర్మగ్ను లై. 274

శా. హేమాభూష! శిరీషకోమలపదవ్యాఘాంబుజాతా! కృపా
శ్లేషోద్వృత్తరశీక్షణా! మసృణరాశీభూతవాత్సల్యమా!
భూషాభూషణ! భాషణామృతరసాపూర్తీ! మనీషాసము
న్మేషా! తోషపయోనిధీ! జనని! సామీచీన్యభవ్యాకృతీ. 275

శ్రీమన్మాతాపితృభ్యాం నమః

# మధూదయము

## సప్తమాశ్వాసము



క. శ్రీ నీలమాంబపుత్త్రా !
మానవరూపప్రసిద్ధమందారమ ! వి
జ్ఞానఖనీ ! చిన్నమహా
జ్ఞాని ! వరాహనృహరీ ! విశాలయశస్వీ ! 1

వ. అవధరింపుఁడు. 2

క. దీనార్థిలోకరక్షా
నూనవ్రతధారిణీ ! వినూతనభావో
ద్యానవమల్లికాసుమ
మా ! నిర్మలశీల ! సుగుణమణిగణ ! పూర్ణా ! 3

శా. ఆకర్ణింపుము సావధానముగ, నిట్లాయిద్దఱున్ 'గారు'లో
నాకల్యాణి స్వయమ్ముగా నడుప నిష్టాలాపసంయుక్తులై
చీకుం జింతయు లేక భాగ్యనగరీస్నిగ్ధోరుఘంటాపథా
లోకప్రీతిని మెల్లఁగాఁ జనిరి పోల్పున్ జేర గమ్యస్థలుల్. 4

గీ. మాధవుని నాతనినివాసమందిరమునఁ
జేర్చి మధుకుమారి యతని సెలవు వడసి
"యరుగుఁడెంతును రే" పని యంత హెచ్చ
రించి చనియెను వేడుక గృహముఁ జేర. 5

క. మఱునాఁడు కేపకడ నా
సరసిజముఖి మేలుకాంచి స్వాగతరచనా
కరణీయమ్ములఁ దీర్పన్
దొరఁకొనె నిర్ణీతపథము దోఁపఁగ నాత్మన్. 6

శా. నవ్యోత్సాహము చెంగలింప మధు నానాభక్ష్యభోజ్యంబులన్
భవ్యానేకఫలద్రవంబులను సంపాదింపఁగాఁ బంచి, సం
సేవ్యవ్యంజనసంచయంబులను దాఁ జేయించె; గేహంబునన్
నవ్యాలంకృతిఁ గూర్చె సోయగము నానందంబుఁ జేకూర్పఁగన్. 7

సీ. అత్యల్పవిషయంబు నైన నుపేక్షింప
కేర్పడఁ బర్యవేక్షించు నన్ని
శౌచసౌందర్యవిశ్రామసమాకర్ష
కముగ నుండఁగ నలంకరణ సల్పు
పఠనమందిరకోశభండారముల సక్ర
మస్థితి నుంపఁ బల్మాఱుఁ జూచు
మందిరోద్యానశుంభద్వేదికానికుం
జలతాంతసంస్కారకలన నరయు

గీ. భృత్యపరిచారికాజనశ్రేణి వలయు
కృత్యముల నియోగించి పరీక్ష సేయు
సర్వసూచన లిడుచు నయ్యతివమిన్న
శ్రాంతి నెఱుఁగక కమ్మరిసారె వోలె. 8

గీ. వలయునేర్పాటు లెల్ల నజ్జలరుహాక్షి
తీర్చి యొంటిమై మాతృమందిరము సొచ్చి
యాత్మజననీజనకుల సమగ్రరూప
చిత్రపటమును భక్తి దర్శించి మ్రొక్కె. 9

చ. పరవశచిత్తనై హృదయభారము దీఱఁగ నశ్రుబాష్పముల్
బరిపఱిఁ గార్చుచున్ "వెలుఁగుబాఁట యొకంతు లభించె మీదయా
గరిమను నేఁటి; కీపయి సుఖంబుగ నేఁ బయనింపఁజేయుఁ డా
దరము శుభాభికాంక్షలు సతంబును బర్వఁగఁజేసి నాపయిన్. 10

గీ. ఒకసుదీర్ఘవర్షమ్ము నే నోర్మిఁ బూని
సకలకోణములందుండి జాగరూక
మతినిఁ బరికించి సుజనసమ్మాననీయు
నెన్నికొంటి; మీదీవెన లిడుఁడు ప్రేమ." 11

వ. అని తలపోసి, యొడలు దెలిసి, రిస్టువాచీనిఁ జూచి, పదిగంటలు కావచ్చెనే! జాగయ్యె నని బిరబిరఁ జని కన్నీటిచారలు గడిగికొని సర్వసన్నాహమ్ము లాయత్త మగుటఁ బరికించి సంతృప్తి వెలయ కారుతోఁ జని మాధవునివాసమ్మున కరిగి, గ్రంథపఠనైకాగ్రచిత్తమ్మునఁ దనరాక నెఱుంగని మాధవునాసనంబున కొకింత సమీపమ్మున వెనుక నిల్చి యనిమేషనయన యై యాతని సమగ్రరూపరేఖావిశేషంబుల సరయుచు నుల్లము పల్లవింపఁ బులకీకృతాంగి యై మెల్లన నాతనిశిరోజమ్ములఁ దన ప్రకంపమానాంగుళులం జొనిపి సవరించుచుండ నాతండు సంభ్రమంబున వెనుదిరిగి మధుకుమారిం దిలకించి, యభివాద మొనర్చి, లేచి, "మధూ! నీ వరుదెంచి యెంతసేపయ్యెనో యరయనైతి. మన్నింపు" మనుచు నాసనంబుఁ జూపుఁ డమ్మదవతి చిలిపితనమ్ము వెలయఁ "జెలి యొకతె మిమ్మాహ్వానించియున్న దనియైనఁ దలపోసితిరా! లెండు. ఇప్పటికే జాల మయ్యె" ననుడు మాధవుఁడు నగుచు "నాత్మీయు లన్నియు సవరించుచు నుండ నాకెందులకు వ్యర్థాలోచనలు? పూఁటకూటిబెడఁద యున్నచో నయ్యో! కాలము గడచునేమో! యని యోచించియుందు," ననిన మధుకుమారి కోటుం దెచ్చి "యిదియేనా

తొడుఁగుదురు ?” అనుచు నందింప మాధవుఁ డద్దానిఁ గొని ధరించి
“సరే! సెలవు మింక” ననుచు గది బంధించి తాళము వైచి
యామెం గూడి కారు నధిరోహించి కతిపయనిముసమ్ములకు
మధుకుమారీమందిరమును జేరె. 12

గీ. ప్రాంగణద్వారమందు ఘూర్ఖాసిపాయి
కేవి నభివాదన మొనర్ప, సేవకుండు
సంభ్రమంబునఁ జనుదెంచి స్వాగతమ్ము
నెఱప నిర్వురు దిగి కారు నింటిముందు. 13

గీ. చికిలిచలువరాపలకలఁ జెన్ను మీఱు
మెట్ల నారోహణ మొనర్చి మెఱుఁగు లీను
వివిధవర్ణవిరాజితవిభ్రమాస్ప
దప్రకృతిదృశ్యచిత్రసంతతులఁ గనుచు. 14

చ. చని హృదయప్రమోదము నొసంగెడి దిం డ్లమరించి యున్న యా
సనములశోభఁ గూర్చు సువిశాలము భూరిసుగంధబంధురం
బును నవపుష్పగుచ్ఛపరిపూరితకాచమనోజ్ఞపాత్రికా
ప్రణుతము నౌ గృహంబుఁ దగ భామినివెంటను జేరె నాతఁడున్. 15

చ. “వినుతగుణాఢ్య! మీకు నిది విశ్రమయోగ్యముగాఁ దలంతు; నా
జనకుఁడు నిందె యాప్తజనసంగతి నుండెడివాఁడు, నేఁడు మీ
కును నిట స్వాగతం బిడుదుఁ, గూర్చొనుఁ డించుక ప్రొద్దుపుచ్చి, భో
జన మొనరింపఁ బోద” మని సాదరమేదుర యై వచింపఁగన్. 16

ఉ. కన్నులలోఁ గృతజ్ఞతయు గౌరవము న్వినయంబు దోఁప నా
యన్నులమిన్న యాననము నారసి మాధవుఁ డాసనంబునన్
జెన్నలరారఁ గూర్చొనియెఁ; జేరువ నుండినవృద్ధధాత్రిఁ జే
సన్నను జీరి, తా నతనిసన్నిధిఁ గూర్చొనె బాల పొల్పుగన్. 17

శా. పంకాబిబోటను నొక్కి, ఘూపప్రాంగణాగల్ పైఁ గ్రమ్మఁగాఁ జేసి ని
శ్శంకన్ సన్నిధిఁ జేరి, మాధవు విమర్యాదృష్టి వీక్షించి, మీ
నాంకుం గిరిః డటంచు సంకసిలి, ప్రాస్వాయంబు కోకొత్తఁగాఁ
బంకించెన్ దల ధాత్రి యంత ముద మొప్పన్ స్వాగతం బిచ్చెనన్.

గీ. "మాతృసదృశ యీధూరివిక్రమలచరిత్ర
కనులఁ బెట్టుక సాఁకు సత్కారుణ నన్ను
నీమెయొడి నాకుకొనియె నే చింత లైలిః
బూజనీయ నా కెప్పుడును బుద్ధిఁ గఱపు." 19

గీ. అనుచు మధుబాల పరిచయ మాచరింప
నతశిరస్కుఁడై యభివాదనము నొనర్చె
ధాత్రి కతిభక్తి నంత మాధవుఁడు; కనులు
చెమ్మగిల్లఁగ ధాత్రి యాశీర్వదించి. 20

గీ. "బాబు! మగవాసనే లేక భవన మెల్ల
విన్నఁదన మూనె; నెపుడు మా వెఱ్ఱితల్లి
యొంటిమై చిన్నవోవుచు నుండు వెతల;
నేఁడు మీరాక శోభ నందినది గృహము. 21

గీ. అనుదిన మొక్కపరి మీర లైన వచ్చి
చూచి పోవుఁడు; మాతల్లి సొబగు లీను
మొగము వికసించు టీనాఁడె మొదటిసారి
చూడఁగంటి, మీమైత్రిఁ బ్రస్తుతి యొనర్తు." 22

వ. అనిన, సమాధాన మిడ నుంకించుమాధవు మధుకుమారి కండ్ల నపవా
రించి పరిహాస మాడునదియోలె దాని నుద్దేశించి. 23

క. "మామంచిమాట యంటివి,
ఏ మనుకొందువో! తలంప; వెటు వేగుదు నీ

తో, మకయింటను నిలువం
గా మాన్యుఁడు రా నిటుపలుకం దొడరితివే! 24
ఉండ నరుదెంచువారిని రంపు మీర
లనుదినం బను టది పరిహాస మగును;
ఇంతకును వీరు సహపాఠి, కొంత మేలు;
పెద్ద లగువారితోడ నీవిధము తగునె ?" 25

వ. అని నవ్వు సంబాళించుకొను మాధవు ననురక్తి వెలయఁ గన్నుల నాఙ్ఞాపించు మధుకుమారిం గాంచి యావృద్ధురాలు వాయుసంచలితాశ్వత్థవృక్షంబు నా చలించి. 26

శా. "బాబూ! రెండవబాల్య మందురు గదా! వార్ధక్య; మీయవ్వ యే
దో బుద్ధిన్ వినవాడి పల్కె నని క్రుద్ధుల్ గాకుఁ; డీవార్త నా
కీబాలామణి తెల్పియుండమియె నే నిబ్బంగి భాషించితిన్;
అబో రుండదు చిట్టితల్లికడ ని క్కైనందునన్ నా కిఁకన్. 27

క. చిలుకా గోర్వంకలు నాఁ
జెలువారుఁడు గనులఁ జల్లఁ జేయుచు; మీ న
వ్వులసంపడితో నింటికిఁ
గిళఁ గూర్చుఁడు; నాదువాక్కు గణియింపకుఁడీ!" 28

క. అని, మధుకుమారిఁ గన్గొని,
"చినబాబుకు నాన్నగదిని సిద్ధము చేయిం
తును దల్లీ! నీగదిప్ర
క్కను నుండును మీవుల సుఖముగా నుండు" ననన్. 29

గీ. "వీరి కాగదిఁ జూపించి క్రీలిఁ గూర్చు
నేని సవరింపఁడగును; పి వేఁగి కడువ
నన్ని యేర్పాట్లు సేయుఁడ సరుగు" మనుచు
వాది ననిచి మాధవుమోముఁ వమ్మిని మధు.

గీ. సానురాగమునం జూచి "సరసహృదయ!
సమ్ముద మ్మిదేనా ప్రహసనము? కన్న
ప్రేమ కెక్కుడు పెంపుడుప్రేమ యనుట
కడిగిపోసిన నిజము; మీాగడికి రండు." 31

క. అని ప్రియ యంతస్తున కా
తనిఁ దోడ్కొనిపోయి జనకధామముఁ జేర్పం
గను లప్పగించి మాధవుఁ
డనితరదుర్లభముదంబు నందుచు నంతన్. 32

సీ. వాతాయనముల శోభలఁ గుల్కు పట్టుంబట్టు
తెరల సింగారమ్ము సరసి యరసి
నల్దిక్కులను ముఖమల్దిండులను జెన్ను
గనెడు సోఫాలను గాంచి కాంచి
మంచిగంధపుఁబ్రమాను మలఁచి నిర్మించిన
సొబగైన టేబల్లఁ జూచి చూచి
కుడ్యపార్శ్వములను గూర్చిన బహువిధ
ప్రాంచదాకృతులను నెంచి యెంచి

గీ. రమ్యలాలిత్యశోభావిరాజమాన
మాననీయంపురత్నకంబళి స్పృశించి
సంభ్రమాశ్చర్యహర్షముల్ స్వాంతమందు
ముప్పిరిఁ గొనంగ నాతఁ డపప్పాలుపు గనుచు. 33

గీ. నిలువుటెత్తున మేల్మిపూఁతలఁ జెలంగు
జిలుఁగుచత్రమునం దమర్చిన మెఱుంగు
లీను నద్దంపుఁదెరఁ బ్రక్క కెడలఁజేయు
సుందరీమణి ననురక్తిఁ జూచి దరిసి.

ఉ. "వైభవపూర్ణ వై వెలయు పైఁడలి వయ్యు వినీతవేష వై
శోభిలు నిన్నుఁబోలెఁ గడుసొంపునఁ బెంపు వహించు నద్దమున్
శోభను గప్పిపుచ్చఁ దెరఁ జొన్పుట నిత్యము యోగ్య మౌనె? యే
లా భయ మొంది సోయగవిలాసములన్ గనుచాటుచేయుటల్." 35

చ. అనిన, గులాబిపూవళ్లము లట్టులఁ జెక్కు-ళు లెఱ్ఱవార నా
తనిఁ గడకంటఁ గాంచి ముఖధామమునం దొకహాసరేఖ తోఁ
చిన నది యంతలో మఱుఁగుఁ జేసి వినమ్రత యచ్చుఁబోసిన
ట్లనె నయ మొప్పఁగా మధు సుధార్ద్రమనోజ్ఞవిదగ్ధభాషలన్. 36

ఉ. "అద్దముఁ గప్పకున్న భ్రమ నందుచుఁ బిచ్చుక లాత్మరూపముల్
దద్దయు దానఁ గాంచి నిరతంబును మత్సర మూని దాని నే
ప్రొద్దును ముక్కు-లం బొడుచుఁ; బోలునె స్పర్ధలు పెంచి యొంచుటల్?
పెద్దలు మీ రెఱుంగనిదె! పేర్మి వెలార్చుటఁ గాక యీక్రియన్. 37

గీ. ఆత్మనిక్షిప్తభూరిశోభానుభోగ్య
మధుపరీమళములు నెట్లు మాధవాగ
మమ్ముఁ బడయక విరఁజిమ్ము సమ్ముదమున
లేఁతప్రాయంపుఁజిన్నారిజాతిసుమము." 38

మ. అని, నిట్టూరుచుసుందరాంగిఁ గని ద్వంద్వార్థంబు లౌ నానుడుల్
మనము న్నాటిగ నాట మాధవుఁ డసంభావ్యంబుగా నెంచి, యం
తన మిత్రత్వము సంశయించు టది హృద్దౌర్బల్యచిహ్నంబుగా
ననుమానించి, ప్రయత్నలబ్ధ మగు సామ్యానందసంయుక్తుఁ డై. 39

క. "వలయు నుదారప్రియచే
ష్టలు సంభాషణము లుభయసంగతియందున్
గలకాలము విమలం బై
చెలువారఁగవలెను మనము చింతింపంగన్." 40

గీ. అనిన, మాధవుఁ గాంచి "ధన్యాత్మ నైతి
సరళహృదయుల రగుట నిస్సంశయముగ
మదిని దాఁచక యెఱిఁగించి మనిచి రిట్లు
తమయనుజ్ఞను దలఁ దాల్తుఁ బ్రమద మలర." 41

గీ. అనిన, మధుఁ గాంచి మాధవుఁ డాత్మ నామె
వినయభాషణముల నెంచి, వెడఁగు నగుచు
సంశయించితిఁ జెలిని దోషంబుఁ గూర్చి;
యల్పు లాత్మదోషము నింతు రన్యులందు. 42

ఉ. ఉన్నతవంశజాత, విభవోజ్జ్వలజీవిత, సాధుశీల, నా
యున్నజనుల్ లభింపమి సమాదర యై ననుఁ గూర్మిఁ జూడ, నే
నిన్నివిధంబులన్ దలఁచు టేమియు నర్మము గాదు, మోహసం
ఛన్నుఁడ నౌట నామె విలసన్నుతవృత్తముఁ దప్పు వట్టితిన్. 43

గీ. కృషికకులమునఁ బుట్టి యొక్కింత విద్యఁ
గఱచినంతమాత్రమున నాగరికజనుల
జీవితం బెట్టు లర్థ మౌఁ? జిత్తము వికసింపకుండుటయే యిట్టిచేటుఁ గూర్చె. 44

ఉ. అగ్నిపరీక్ష యేర్పడెడినంతకు నందఱు సాధుశీలురే,
నగ్నముగా స్వరూపము గనంబడె నేఁటికి; మోహపంకని
ర్మగ్నుఁడ, నొక్కమాన్య నవమానము సల్పితిఁ; బాపబుద్ధి నై
భగ్నమొనర్చితిన్ సుహృదవర్తన మీక్రియ నంచు నెంచుచున్. 45

క. దుశ్చిత్తుఁడ నై యామె న
నిశ్చితమతి సంశయించి నిందించితిఁ బ్రా
యశ్చిత్తమె కర్తవ్యము,
నిశ్చయముగ నీమెమైత్రినే పెంపఁ దగున్. 46

మ. అని కర్తవ్యపరాయణుం డగుచు నయ్యబ్జాతనేత్రల్ "మధూ !
విను మీవే విజయంబుఁ గాంచితివి ; భావి న్మన్మనోసాధమం
దు నవీనోజ్జ్వలరత్నదీపికగ నుంతుల్ నిన్ను మన్నింతు న
ర్చన సేతుల్ ధ్రువ మిద్ది, యెద్దియు నవిశ్వాసంబు లేకుండఁగన్." 47

గీ. అనుడు మధు వినమితమనోజ్ఞాకృతి యయి
కనుల నానందబాష్పముల్ గ్రమ్మ మధుర
భావపూరిత యై నేలపై నీఁ గాలి
బొటనవ్రేల గీఁతల గీయఁ బూనె నంత. 48

గీ. ఆమెగౌరవాకృతి హృదయము వశీక
రింప మాధవుఁ డవశుఁ డై యింపుఁ గూర్ప
"మధు ! యి దే మిట్లు యోచనామగ్న వైతి"
వనుచుఁ గుసుమాంగిమస్తక మంత నిమిరె. 49

సీ. విచలితం బగుమేనఁ బ్రచురమ్ముగాఁ బుల్క-
లేపార లత చివురించులీలఁ
గంపితాధరరక్తకాంతులు నిట్టూర్పు
సెగఁ గంది ముదిరిన యిగురులీల
నర్ధనిమీలిత మైనయక్షిద్వయి
ప్రాభాతపద్మపత్రములలీలఁ
బొంగారి నూగారు చెంగలించినగబ్బి
చన్నులు కుసుమగుచ్ఛములలీల

గీ. నలరి మాధవసంస్పర్శ నాలతాంగి
పారవశ్యముఁ గని యనిర్వాచ్యసౌఖ్య
సాగరోర్మికావిహారణస్వాంత యయ్యెఁ
బ్రణయభావానుభావసంపదల మలసి. 50

ఆ. జలతరంగిణీమంజులస్వనము వోలె
గోడగడియార మంత మ్రోఁగుటను నొడలు
దెలిసి మధు సంభ్రమమున మీఁదికి విలోక
నములఁ బఱపి "జా గయ్యె నెంతయును రండు." 51

ఆ. అని మాఘప్రకరము న్గాని
చని డాపటిగదినిఁ జేర్చి సంస్మితముఖి యై
"చను దుస్తులఁ దొలఁగింపఁగ
మనయాచారమున భుక్తి మదిఁ గోరెద నేన్." 52

ఆ. అనుచు, బీరువాఁ దెఱచి యయ్యలరుఁబోఁడి
చలువజేసినపట్టువస్త్రమును తుండు
గుడ్డఁ జేరువబల్లపైఁ గూర్చి నుంచి
"మార్చుకొనుఁడు దుస్తులు, నేను మరల వత్తు." 53

మ. అని యేణాక్షి బిరాన నామెగది సత్యానంద యై చేరి తా
ల్చెను దుస్తుల్ గమనీయభంగిమను, ప్రాచీనాంధ్రసీమంతినీ
జనవస్త్రాభరణాదికమ్ము లలరన్ సౌందర్య మేపార లో
చనపర్వంబుగఁ గ్రాలు బాల మరలన్ సాన్నిధ్యమున్ జేరఁగన్. 54

మ. "అరరే ! యే మిది వందయేండ్లమునుపై యాకారశృంగారముల్
స్ఫురియింపంగ నొనర్చుచుండె, నెటు లీముత్తైదువన్ బోలు సుం
దరి పాశ్చాత్యసమాజనాగరకతాధ్వాంతంబునన్ రిక్క యై
పఱతెంచెన్ ! ముఖహాసరోచులను దృక్పర్వంబుఁ గావింపుచున్. 55

చెంపకుఁ జేరఁ డై చెన్నారుకన్నుల
విలసిల్లఁ జేయు కజ్జల మదేమి ?
అష్టమిచంద్రుని నపహసించెడి ఫాల
మలరించు కాశ్మీరతిలక మేమి ?

పోఁకపూఁబోత్తుల బూఁకరించుకరాల
రాజిల్లు నా నల్లగాజు లేమి?
పొన్నపూవువిధానఁ బొలుపొందు చిన్నారి
నాసికయందు నా నత్త దేమి?
గీ. కర్ణతాటంకములఁ జిమ్ము కాంతు లేమి?
మేలిమురిపెఁపుదండవంకీ లదేమి?
పసిఁడియొడ్డ్యాణ మొలికెడి ప్రభ లదేమి?
చెలువుఁ గూర్చెడి పైఁడిపాఁజేబు లేమి? 56

శా. కుచ్చీళ్ళుందును వెన్కఁ బింజ నిడ నాకోకన్ బుటేదార్పనిన్
బెచ్చున్ వన్నెలు, చిల్కపట్టువలువన్ జెన్నారు సౌందర్యమున్
మెచ్చన్వచ్చును, పైరణీరవికపై మేల్ జిల్గుపుష్పావళుల్
నచ్చన్ గంటికిఁ, గ్రామ్యమౌనుగు లివె విన్నాణంపుసింగారముల్. 57

శా. చెవ్వాకుల్, మెడఁ దాలిబొట్టుఁ, దలపై సీమంతముల్, మైఁ గడుల్
మవ్వం బై చెలువారు చాయపసుపుం, బారాణి పాదంబులన్,
బువ్వుల్ దండలు గ్రీవమందు వెలయన్ బొల్పొందు సంపూర్ణ మై
యువ్వామాక్షికిఁ బెండ్లిసందడియుఁ బె ల్లొప్పారుసింగారముల్. 58

సీ. రంగుటద్దాలచక్రమ్ములమఱుఁగున
నిలిపితే కన్నులకలికితనము
పొడరుపూఁతలపై మోజు చెలువార
నణఁచితే మోముసోయగము సతము
ఎత్తైనమడమల నేపారుచెప్పుల
దాచితే పాదపద్మములచెలువు
మిల్లుగుడ్డల నొప్పు వెల్లఁదనమ్మున
విడిచితే లావణ్యవిభవగరిమ

గీ. ఇంతవఱకును మధు ! మధిరేక్షణముల
నాగ్రహింపకు, సౌందర్య మర్చనీయ
మగుఁ గళారాధకునకు, సత్యప్రియుండు
అన్య మేరీతి భాషింప నగును జెపుమ ?" 59

గీ. అనిన, మధు జాజువారిన యాననమున
మధురహాసమ్ము వెలయ "నో మాననీయ !
కనుల సౌందర్యమును గ్రోలఁ గడఁగుదేని
ఆవు రను ప్రేవులకుఁ బస్తు లగును రండు. 60

గీ. అస్మదాహూతులరు; మిమ్ము సర్వవిధిని
నన్నపానాదులను దన్పు టగును నీతి
మాదృశుల కెందుఁ; గావున మనము వీడఁ
జనదు విషయాభిలాష నేసమయమందు." 61

గీ. అనఁ, గశాఘాతములఁ దిన్నయట్టు లైన
మాధవునిఁ గాంచి "మీకు నిమ్మాడ్కి మాట
లందు నేకాగ్రచింతన మర్హ మగునె ?
సన్నిధానులహృదయానుషంగ మొసలి." 62

వ. అని, యనునయంబు దోఁపఁ బల్కి, సుప్రసన్నంబు గాని యాతని ముఖభంగిమ న్గమనించి, ప్రేటువడ్డ కురంగినిం బోలె హృదయమ్ము తల్లడిల్ల విచలిత యై యామె "మాధవా ! యిదియేమి నన్నారాట మునఁ ముంప న్యాయంబె ? నే నొనర్చిన యపచారం బెఱింగించి దండింపరాదా ? ఇంతకు మీకు హృదయాకర్షకంబు కానిచో నీ యలంకరణము నుజ్జగింతు. నన్ను పేక్షాళుగమ్మున నొంపఁ బాడియే!" యని కన్నీరుఁ గార్చు నాసుకుమారిఁ గాంచి మాధవుఁడు విచలితుఁ డై "మధూ ! నే నొనర్చిన యపచార మేమి ? నిన్నవజ్ఞ సేయు

తలం పిసుమంతయు లేదు. ఎద్దియేని నీహృదయాఘాతంబు కలిగించు కృత్యం బొనర్చిన మన్నింపు" మని యామెకపోలములఁ దనచేతితోఁ దుడిచి యూఱడింప సమ్మదవతి సమ్ముదమ్ము గదుర "యీయాకారంబు మీామది కెక్కలే దనుకొనియెద. తొలఁగింపనా?" అని మురిపె మ్మలర నవలోకించుచుఁ బ్రశ్నించిన మాధవుఁడు నవ్వుచు "మధూ! నీ వెంతయమాయకవు. పొగడినఁ గసరుకొందువు. ఊరకొనిన పొగడమందువు." అని యామెచిబుకమును బుణికి నయగారము వెలార్ప నామె సముత్సాహదీపిత యై యాతనిఁ దోడ్కొని పోయి కరపాదముఖప్రక్షాళనం బొనర్పఁ జేసి తానును బరిక్షాళిత చరణకరపంకజ యై శుచిమంతమును, సువిశాలమును, నగురుధూప సంవాసితంబును, సుసజ్జితంబును నగు భోజనగృహంబున వెండిపీరుపూఁత నలరారు మనోజ్ఞపీఠికాధిష్ఠితు నొనర్చి, ధాత్రినిఁ గను సన్న నాజ్ఞాపించుఁడు నామె వివిధరజతపాత్రికల నాహారపదార్థపూరితంబు లగువానిఁ గొనితెచ్చిన వాని నమ్మచ్చెకంటి స్వహస్తమున మాధవునకు వెండిపళ్లెరములయందు వడ్డించి "భుజింప నుపక్రమింపుఁ" డని సవినయమ్ముగాఁ బలుకుఁడు మాధవుఁడు విస్మయాలోకనమ్ముల మధు నాలోకించిన నామె యతనియభిమత మ్మెఱింగి వినయమ్మున.

ఉ. హైందవసంప్రదాయ మిది యర్హసమర్చల నాగతావళిన్
ముందుగఁ దన్పి యాపిదపఁ బోలును చేకొన భుక్తశేషమున్;
ఇందు మఱెవ్వరుం గలుగ రేర్పడ మీాసహపంక్తిఁ గూర్చొనన్;
బొందుగ నారగించి నను మోదము నొందఁగఁ జేయ వేఁడెదన్." 64

వ. అని, యతని భుజింప నుపక్రమింపఁజేసి— 65

శా. పంతాగారిని ముందఁ పరుల్ చెవర, సంభాషింపుచున్, సన్నిధిన్
పంకేజాక్షి వసిపైఁ గూర్చొని మదిన్ బైగ్రమ్ము మోహమ్మునన్

జంకున్ గొంకును లేక కన్నులను నాస్వాదింపఁగాఁ జొచ్చె, మీ
నాంకున్ బోలెడి వానిసోయగముఁ దా నావేగచిత్తంబునన్. 66

వ. అంత నొక్కింతవడికి యొడలు దెలిసి నాలుక కొఱుకుకొని. 67

గీ. "ఆఁకటన్ వేచియున్న దీయతివ యనుచు
వేగ ముగియింపఁబోకుఁ, ముద్వేగచిత్త
నని యెఱుంగుఁడు; ననుఁ దన్పుఁ డాదరమునఁ,
గసిబిసి యొనర్పఁబోక చక్కగను దినుఁడు. 68

గీ. స్వగృహమ్మున మోమోట చనునె ? యన్య
భావనల నేల సతమత పడుదు రిట్లు
కొంచెమే తినుఁ డియ్యది కొసర నేల ?"
యనుచు భుజియింపఁజేసె నెయ్యమునఁ జెలియ. 69

గీ, "మీయుదాసీనభావము మెప్పుఁ గూర్చె
నభిమతం బెద్దియో సుంత యైనఁ దెలియ
నైతి, నేమిట మిముఁ దన్ప నగునొ ! యెఱుఁగ
ముందు విందొనఁగూర్చు టేచందమునకొ ?" 70

వ. అనినఁ, మాధవుఁ డామెఁ గాంచి "మధు! నీయాకాంక్షయొక్కింత తీ
అనియట్లున్నది, కంఠదఘ్నముగ సర్వం బి ట్లగస్త్యుండు నాఁ
దినఁగాఁ బూనితి, నిన్ను లోఁగొనమి నాదే దోష, మివ్వానఁ జ
క్కనినీతాకును దేనె లూర నెటు మెక్కంజాలుదే యొక్కటిన్. 71

గీ. విందులకు విందు వగుదు వో సుందరాంగి !
కొందల మ్మేల వేడ్కఁ గైకొందు నిపుడె
కర మలర శాశ్వతాతిథ్యకాంక్షఁ దనరు
నీశుభాహ్వానపత్రము నిన్నుఁ దనుప. 72

వ. అనిన మాధవు ననురక్తి మెయి వీక్షించి మధు. 73

గీ. "నన్ను లోఁగొందురా ? వంచనము లొనర్తు
నీయనాథ యదృశ్య వై యిష్టసిద్ధిఁ
గాంచి చరితార్థ యగును లోకమున సకల
మానవతులకు నుత్తమమార్గ మదియె." 74

వ. అని. 75

ఉ. లేఁతగులాబిరంగు గల లేమమనోహరగండపాళికల్
పూఁతమెఱుంగు లీన, మదిఁ బొంపిరి వోయెడి మోహకేళికిఁ
లాతతిఁ గ్రమ్ము ధూమపుటలన్ జెలువంబున నూర్పుగాడ్పు ల
జ్జాతమనోహరాననభృశంబును బుచ్చుటఁ గాంచి పెన్వగన్. 76

గీ. "ఈకుసుమగాత్ర కష్టముల్ సోఁక మివులఁ
బసిమొడంద నారాట మిప్పిది నొంది
నిస్పృహం గనె, నభినందనీయచరిత
సానునయమున నోదార్పఁ జను" నటంచు. 77

క. తలపోసి మాధవుఁడు "నీ
వలమటఁ గుడువంగ నోర్వ, నానందసుధా
కలిత మగు భావి, సైఁపఁగ
వలయును మధుమాసదివ్యవాసరముల కై." 78

క. అనిన దరహాస మొలయన్
గని యిది మధువాసరమ్ము గాదే ! మిమ్మున్
దనుప నలవడిన యీదిన
మునఁ జింత న్మనుఁగ నేల పూజ్యులచెంతన్." 79

గీ. అనుచు మధుబాల భోజన మంతఁ బూర్తి
చేసి లేచిన మాధవుచేతిపైని
స్వయముగా నీరు వోసి 'విశ్రాంతిఁ గొనుఁడు
చిటికెలో వత్తు', నని పంచె స్నేహ మలర. 80

గీ; భుక్తశేషము ననురక్తిఁ బూజ్యభావ
భరిత యై స్వీకరించు నబ్బాల కిడియె
భోజనమ్మును వాత్సల్యపూరిత యయి
ధాత్రి యానందబాష్పనేత్రములు దనర. 81

క. ఎంగిలిపడి మధుబాల కు
రంగిని నాఁ జెంగు లిడుచు రయమునఁ జనుచో
ప్పుం గన్గొన ధాత్రి మదిన్
బొంగారెను విస్మృతానుభూతులు పెలఁచన్. 82

వ. అంత, మధు సముత్సాహదోహల యై మాధవు డాసి "మి మ్మెంటి నంపవలసివచ్చినది! క్షమింపుఁ" డని తాంబూలకరండము గ్గొనివచ్చి విడె మొసంగి, పొగత్రాగునలవా టున్నచో స్వీకరింపుఁ డని సిగ రెట్టుడబ్బీ నం దుంప, నాతఁడు నగుచు "నా కింతవఱకు నీయభ్యాస మలవడలేదు. నీ కభ్యాస మున్నచో నా కెట్టియభ్యంతరమును లేదు." అనినఁ జురచురఁ జూచుచు, "చాలులెండు. పూర్తిగా దొరసాని నై ననాఁడు మీ రవహేళనమ్ము సలుపఁదగు. నే నిపు డచ్చ ముగ నాంధ్రమహిళను." అన మాధవుఁడు నవ్వుచు "మధూ! నీ కీవేష మమరినది; కాని యీశతాబ్దమునకే చెందని యీయలంకారము లెట్లు సేకరించితివి?" అనిన "శ్రమయనక మీరు కొంచెము లేవఁ జను. మీకు సమాధానము మాటలతో నిచ్చి లాభ ముండదు." అనుచు నాతని చేయిఁబట్టి తోడ్కొనిపోయి నిజమాతృమందిరమునకుఁ జని జననీజనకుల తైలవర్ణచిత్రంబులఁ జూపి, "యివి నామాతాపిత రుల వివాహకాలపు చిత్రములు. పరిశీలింపుఁ" డన మాధవుండు బద్ధాంజలి యై వినయంబు దీటుకొనఁగాఁ జిత్రములకు నమస్కరించి, "మధూ! నీధరించినయవి మీజననీవివాహాలంకారములు. నే నూహించినట్లు నూత్నవధ్వలంకారముల నించుక కొఱంత యుండుట

సత్యమే. అలంకారవైఖరుల జననిం బోలియున్నను నీముఖలక్షణ
ములు జనకునే యనుకరించుటఁ జూడ నీవు మిగుల సదృష్టశాలినివి."
అనిన, మధు "మీపరిహాసమున కవధి కానరాదా? పుండుపైఁ
గారము సల్లుదురా? ఈజీవితమున నేఁ డొక్కనాఁడే యానంద మన
నేమో చవి చూచితి. మీవాక్కు రిత్త పోనేల? నాదాది కాంక్షిం
చినట్లు మీరు నా కీయానందమును నిత్యమును బ్రసాదించుచో
సదృష్టవంతురాల నగుదు." అనిన మాధవుఁడు సవిమర్శగాఁ జూచి
"మధూ! నీయభిమత మేమి? స్పష్టముగాఁ దెలుపుము. సందేహింప
వలదు." అనినఁ గన్నుల దైన్యంబు గోచరింప" మీరు తిరస్కరిం
చినచోఁ దలతీసినంత పని యగు. ఐనను దమయాజ్ఞ నతిక్రమింప.
విశాలగృహము. సర్వవస్తుసంపన్నము. నా యన్న దిక్కు లేదు.
మీరా పరవాసులు. పూఁటకూళ్లఁ గుడుచుచు నిక్కట్టులు పడుట
నాకు బాధాకరముగ నున్నది. సహపాఠులము. సన్మిత్రులము. సహ
భావప్రేరితులము. ఆప్తబంధుత్వమును గుదురుకొన్నది. ఇట్టియెడ
నొండొరులు కష్టసుఖములఁ బాలుగొనుటలో దోష ముండదను
కొందును. కనీసము మీ యీప్రియసఖ యానందమును గోరియైనఁ
దా మిట నివసించుట భావ్యము." అని యాందోళనము వెలార్చు
చూడ్కులఁ బఱుప మాధవుఁ డించుక విచలితుఁడై యూర్ధ్వదృష్టి
లోలయు యోజనాధీనుఁడై తలఁ బంకించి హృదయభారాపనద
మ్మగు దీర్ఘనిశ్వాసమును బుచ్చి "మధూ! యని నీభావిజీవితమునకుఁ
గళంకాపాదక మ్మగునేమో యని శంకింతు. యోచింపు" మన నామె
నిడుదయూర్పును బుచ్చి" హృదయసాక్షి యగు భగవానుఁడును,
ప్రియబంధువు లగు తాము నాకుఁ గళంక మాపాదింపఁ దొడ
రనిచో నా కీలోకమ్ముతోఁ బనియేమి? నాసంతాపము నీలోకము
దీర్పఁగలిగెనా? నేఁడు దోసి లొగ్గి తీర్పునకై యెదురు చూడనేల?

నాలోకములో న న్నానందింపనిండు." అనిన మాధవుఁడు "నా మూలమున నీకుఁ జెట్ట కలుగవచ్చును గదా! అది క్షంతవ్యము కాదనుకొందు;" నన మధు "నాయంతరాత్మ నన్ను మోసపుచ్చదు. ముమ్మాటికి మీవలన నాకుఁ గీడు వాటిల్లదు. దృఢమైన నావిశ్వాసమును జలింపఁజేయకుఁడు. మీరు నాకుఁ జెట్టఁగూర్తు రను కఠోర వాక్యము వినుటకును నుడువుటకును నే నోర్వఁజాల. మీవలన లభించు మృతినైన నను విశ్చలచిత్తమున ననుభవింతు. నాజననహేతుభూతుఁ:రగు నీపవిత్రమూర్తుల సన్నిధిని ద్రిశుద్ధిగ నేను బొరపడలే దని మనవి సేయుచున్నాను." అని యావేశపూరిత యై సజలాక్షిగోళ యై పలుకు నాసుందరినిఁ గాంచి యార్ద్రీహృదయుఁ డై మాధవుఁడు "మానినీ! నీయచంచలస్నేహమున నన్ను విజితు నొనర్చితివి. ఇంక నీకు మారు వల్క" ననుడు నమ్మదవతి 'ధన్యురాల' ననుచుఁ దటుకున నాతనిచరణములపై వ్రాలిన నాతండు సంభ్రమంబున నామె నిరుకేల లేవ నెత్తి కన్నుల నొత్తిన, నామె మోము నాతనియెదఁ జేర్చి సమాశ్వాసిల్లె. 83

గీ. సఖునియంగీకృతి లభింప సంతసమునఁ
దిమిరమున నార్తిఁ గుడుచు పద్మిని ప్రభాత
రుచిని జెన్నారుపోల్కి వికచమనోజ్ఞ
వదన యై మధు శోభిల్లె వనటఁ దక్క. 84

చ. జనకునిమందిరమ్మును సుసజ్జిత మౌనటు లాచరించి య
వ్వనరుహనేత్ర మాధవునివాసముగా నొనరించి యాతనిన్
దనుపఁ దొడంగె మిత్రునివిధంబునఁ గాక గృహాధినేతగా
ననయము భక్తిభావవినయంబుల నచ్చిక మచ్చి కేర్పడన్. 85

క. అనుదిన మాతనితో నో
జన మొనరించును సకలవిషయములఁ; గూర్మిన్

వినుచును సర్వం, బాతని
కనుసన్న మెలంగు నన్నికార్యములందున్. 86

క. యజమాని మాధవుం డని
ప్రజలకు సేవకుల నమ్రభావము దోఁపన్
నిజవర్తన మాయమ య
క్కజముగ సరిదిద్దుకొనియెఁ గడు చతురతమై. 87

సీ. సహపాఠి యై కావ్యచర్చల నొనరించుఁ
జెలిమి వెలార్చు మచ్చిక చెలంగ
ననురక్త యై క్షేమ మరసి సంతస మొందు
మంతనం బొనరించు మైత్రి వెలయఁ
జేటి యై పరిచర్యఁ జేయు నొద్దిక మీఱ
హెచ్చరికల్ సల్పు హితము గదురఁ
బ్రభుభావ మలమ గౌరవమును జూపును
వెచ్చము లనయము వినుచు శ్రద్ధ

గీ. ననుదినవ్యంజనమ్ముల నడుగు హితవు
నడుగులకు మడుగు లిడు నెయ్యమ్ము దనర
నార్యగృహిణీత్వనైపుణి నభ్యసించు
లీల మధుబాల సుగుణాలవాల శీల. 88

సీ. చర్చింతురు ప్రపంచసారస్వతవిచిత్ర
భంగిమల్ జిజ్ఞాస ప్రబల నొకటఁ
బఠియింతు రిర్వురుఁ బందెమ్ము వైచిన
క్రియ నాంగ్లసాహిత్యరీతు లెఱుఁగ
విహరింతు రుత్సాహవేల్లితచిత్తు లై
మోటారులో నేఁగి తోఁటలందు

దర్శింత్రు చలనచిత్రంబులఁ గ్రొత్తవి
'బాల్కనీ'లో జంటఁ బాయ కెపుడు

గీ. రాజకీయమ్ములను విమర్శనము సేతు
రాంధ్రరాష్ట్రసమస్యల నాకళింపఁ
బూనుదురు వార లిర్వు రపూర్వభూరి
గౌరవపురస్సరముగ ననారతంబు. 89

సీ. వైవిధ్య మలరెడి వ్యాసమ్ములను వ్రాసి
సరిదిద్దఁగ విమర్శ సలుపుచుంద్రు
క్రోడీకరించి చేకూర్చిన గ్రంథవి
షయచయమ్మును దీవ్రచర్చ సేతు
రనుపమానందద మౌ గ్రంథభాగము
లొండొరుల్ వినిపింతు రుత్సవమునఁ
గావ్యభావాన్వయక్రమమున నుభయులు
నర్థింతురు పరస్పరాభిమతము

గీ. లహరహము మధుమాధవు; లమితమైత్రి
దినదినాభివృద్ధినిఁ బొంది తీఁగసాఁగ
దుస్తు లిరుప్రొద్దులను దాల్పఁ దొడరునంత
నిర్వురును సంప్రదింపక నెన్నికొనరు. 90

సీ. చేఁ జిక్కె నింక నీచెల్వంపుజతగాఁడు
నా కేరు సాటి యెన్నఁగను భువిని
నెమిలిఁ బోలు నితండు నెఱదంట యొకనాఁడు
మన సిడఁ జేరీతి మనుదు నింక
స్వార్థపూరితము నాస్వాంతమ్ము గావునఁ
బ్రణయఫలమ్ము చేపడదు నిజము

భౌతికభోగానుభవకాంక్ష ప్రేమను
కలుషపూరితముగ సలుపఁగలదు

గీ. అనుచు మధు శేయనించెషునట్టితఱిని
బలువిధం బగుభావముల్ ప్రబల నెదను
గొట్టుమిట్టాడుచును గడ ముట్టరాని
వనట నాశానిరాశలఁ గనుచుఁ బొగులు. 91

సీ. ధనసంపదలు గల్గి తలఁప దవ్వానినిఁ
బూతికవలె నైనఁ బుణ్యచరిత
విద్యావికాసధీవిభవ యయ్యును నిసు
మంత గర్వ మెఱుంగ దమలశీల
మధురవయోరూపమహిత యయ్యును గామ
వాసనారహిత పావనగుణాఢ్య
స్వాతంత్ర్యభావాభిభరిత యయ్యును స్వార్థ
కల్మషరహిత నిష్కలుషహృదయ

గీ. కష్టమహితోగ్రదంష్ట్రాభిదష్ట యగుట
వ్యష్టిజీవిత మెడలి విశిష్టమార్గ
మనుసరింపఁగఁ బొల్పడ్డ యమృతమూర్తి
సానఁ దీరిన జాతివజ్రమ్ము నిజము. 92

గీ. మైత్రి పరసీమ, సుగుణధామము, విశుద్ధ
శీల, విదుషీమతల్లి, విశేషధీస
మేత, గర్వవిహీన యీ మించుఁబోఁడి
యనుచు మాధవుఁ డెపు మధు నభినుతించు. 93

ఉ. కాల మవక్ర మై నడువఁగా నొకయెన్మిదిమాసముల్ చనెఁ
బాలయు మాధవుండును బ్రవర్తితమైత్రి నిరంతరాయ మై

క్రాలఁగ నెమ్మనంబు లతిగాఢముగ న్బెనవైచి వీడ నే
వేళను సైఁచ వయ్యెను; నవేద్యము చెల్మిబలమ్ము లీలలున్. 94

ఆ. వె. ఆకుఁజిలుక వోలె నాకర్షకమ్ముగా
మధు మనోజ్ఞవస్త్రమాల్యములను
మురిపె మలరఁజేయు ముస్తాబుఁ గావించి
తనుపు మాధవుమన మనుదినమ్ము. 95

సీ. పాశ్చాత్యసుందరిభంగిమ నొక్కట
వంగకురంగాక్షివలెను నొకట
బర్మాకుసుమగాత్రఫక్కిని నొక్కటఁ
గాశ్మీరకన్యకగతిని నొకటఁ
పాంచాలమదవతివడువున నొక్కటఁ
పార్సీకుమారికపగిది నొకట
ద్రావిడసుదతిచందంబున నొక్కట
మలయాళబాలికమాడ్కి నొకట

గీ. వస్త్రవైఖరి వెలయించి వలయు హావ
భావము ల్చెలువార నిర్భరముదంబుఁ
గూర్చు మాధవునకు మధు, కొనలు సాఁగు
ప్రేమవల్లిక యాతనిఁ బెనఁగొనంగ. 96

గీ. అట్టుడుకునట్లు కుతకుత లాడు నెదను
వ్యథను నేకాంతమందు, దివ్యానుభూతి
నొందు మధుబాల మాధవునొద్ద నుండ
స్తబ్ధ గంభీర భూరికాసారమటుల. 97

సీ. ఎఱుఁగఁడా ? సహచరి యింగితం బీమాత్ర
మతిగభీరార్థంబు లరయువాఁడు

పరికించి ప్రణయంబు పలికింప నా చేత
గడుసుతనమ్ముగాఁ గడపునేమొ !
ప్రణయభావన లేరుపడకుండెనా ? లేక
వలచి వచ్చితి నని చులకఁదనమొ !
అన్యానురక్తుఁడా ? యాక్రియ నెపుడు ప
రాకునైనను గానరాఁడు తెలియ

గీ. వలపు నెఱిఁగించి బెండుఁ గావలయు నేమొ !
ఎటుఁగఁజేయక వేదన నెట్లు లోర్తుఁ?
డెలుపఁగా నాతఁ డొకవేళ వలవ నన్న
హరిహరీ ! నేను బ్రతుకఁగఁ డెరువు గలదె ? 98

గీ. పాపుంబుంగ యగును నా పాడుచిత్త
మెన్నిదుశ్చింతలన్ జొక్కి యున్న దకట !
కరఁగి పోసిన బంగారుకణికఁ బోలు
మధురమాధవుఁ డాదరింపఁడొకో ! నన్ను. 99

చ. అని తలపోయు చేకతమునందుఁ బురాస్మృతులన్ మనంబునన్
మనన మొనర్ప నొక్కదినమధ్యమునన్ దినచర్యపుస్తకం
బున గతవృత్తపుంబుటలు మోదముతోఁ బరికించు నమ్మధూ
వనజదళాక్షిచిత్తమున భావ మొకండు స్ఫురించెఁ దళ్కునన్. 100

ఉ. ఆననసీమఁ గాంతి చెలువారఁ దటాలున లేచి, నిల్చి, వే
దూనిన నిశ్చయస్థితిని నూఁచి తలన్, దనపృష్ఠభాగమం
దానిచెఁ జేతు లొండొకటి, యక్షులు దీప్తిని గ్రుమ్మరింప, 'మే
లౌ నిది' యంచుఁ బల్కెను బ్రయత్నము లేక ప్రతిధ్వనింపఁగన్. 101

గీ. ఇటునటుం దిరుగాడుచు నిందువదన
యర్హ మిది ప్రాణనాథునియక్షిదోయిఁ

బడిన నీపొత్త మెఱఁగించుఁ బ్రణయమగ్న
నైన నాకాంక్ష గూఢదౌత్యంబు నెఱపి. 102

గీ. గుట్టుగా సల్పుదేని నా కోర్కి సఫల
మొనరుపంగల దీపొత్త ముచితరీతి
నెట్లు సేర్చుట యనుచు యోచించు నామె
కమృతతుల్యమై ప్రియుపిలు పలరఁజేసె. 103

చ. "ఇదె యిదె వచ్చుచుంటి" నని యిందునిభానన పొత్త మంత స
మ్ముదమునఁ గొంచుఁ బోయె, విడఁబోలుఁ బరాకున నున్నయట్టు లి
య్యది యట నంచు నెంచి, నిజహస్తమునం దొకలేఖఁ బట్టి యో
జన మొనరించు మాధవునిసన్నిధిఁ జేరఁగఁ దత్తరంబునన్. 104

శా. "ఈసంక్రాతికి నింటి కేఁగ నని నే నెంచంగ దైవంబు వే
ఱే సంకల్ప మొనర్చెఁ జూడు మిది మాతృప్రేమ పొంగారులే
ఖాసీమంతము, దేహమందు నునుబుల్కల్ దుల్కరింపంగ ను
ల్లాసంబున్ గలిగించుచున్నది సుధాలాపంబులన్ విందుగన్." 105

చ. అని తనచేత నుంచిన సమాదరమైన కొని లేఖ సాంతముగ్
గని, మధు యోచనం బడి ముఖంబున దైన్యము దోఁపఁ దక్షిణం
బునఁ జెలువంబుఁ గోలువడి పుచ్చెను ఛారము గాఁగ నూర్పుగా
డ్పును, నొకయాసనంబునఁ గడుంగడుఁ జింతను మేను జేర్చుచున్. 106

ఉ. ఆచికురాంగివిన్నదన మారసి మాధవుఁ డార్ద్రచిత్తుఁ డై
పూఁచినమల్లితీవ వడఁ బొల్పెడల న్వసివాడునట్టు లై
యీచెలి యారటం గుడువ నేమికతం బగు మాతృరక్షకే
నోచని దాట నాస్మృతి మునుంగఁగఁ బోలు నటంచు నెంచుచున్. 107

ఉ. "ఏటికిఁ జింత నొందఁ దరళేక్షణ ! నీజనయిత్రిమారుగా
గాటపుఁగూర్మిఁ గాంచు, నినుఁ గన్నులఁ బెట్టుక సాఁకు నమ్మ ము

మ్మాటికిఁ బ్రేమవాహినియె మాజననీహృదయంబు, నీవు నే
లాటిచిరాకు లోటుఁను గలంగుటయు న్గన వామెసన్నిధిన్. 108

ఉ. ఎన్నియొనాళ్ళనుండి నిను నింటికిఁ దోడ్కొనిపోవఁ గోరియున్
ఎన్నఁడుఁ దెల్ప నైతి; చెలి! యేర్పడె నేఁ డవకాశ మీక్రియన్
నన్నుఁ గృతార్థుఁ జేయుట కనన్, దలపోయుము మిత్రుఁ దన్పఁగా;
సన్నుతశీల! యీవర మొసంగఁగదే! కరుణార్ద్రచిత్తవై. 109

మ. కలిమో గంజియొ యింత పోసి తగుసత్కారమ్ము గావింతు, మీ
కలుముల్ లేములు లెక్కసేయకుము; వేడ్కన్ గూర్తు మాతాపితా
దులకున్ నిన్నొకమాఱు చూపి; యటఁ బ్రొద్దుల్ పుచ్చఁగావచ్చు ని
స్తులసౌందర్యవిరాజమాన మగు పల్-చోటుల్ విలోకించుచున్. 110

చ. ఒకపదినాళ్లమాత్ర మట నుండి యనంతర మేఁగుఁడెంత, మెం
చకు మిది యొండురీతి మది; సంపదలందున నిన్నుఁ బోలఁజా
లక వెనుబడ్డ, మైత్రిని దలంపుము నీ కొకయింత తీసిపో
ము, కలుషహీనచిత్తమునఁ బోలుదు మించుక నిన్ను నెచ్చెలీ! 111

గీ. జీవితం బను కుంపటి సిలుగుసెగలఁ
గ్రాఁగి మీఁగడఁ గట్టిన కన్నెవయసు
దుగ్ధ మతిమైత్రిఁ దోడ్కొనఁ దోడరి యోర్మిఁ
జిలికి తీసిన వెన్న నీ చిత్తము మధు. 112

ఆ. వె. సెలవ లగుట నటకుఁ జేరుదు రాత్మీయు
లెల్ల రీవు వారి నెఱుఁగ నగును;
అందఱమును గూడి యానందసాగర
మీఁద నగును మైత్రి యేపు మీఱ. 113

ఆ. వె. పూర్వపుణ్యమహిమఁ బొడమిన మనమైత్రి
యవధు లెఱుఁగరాని యంతవఱకు

విస్తరింపఁ జేయ వేడుక గల నా మ
నోరథంబుఁ దీర్పఁ గోరుదుఁ జెలి ! 114

ఆ. వె. నీవు చెంతఁ గలుగ నిఖిలంబుఁ జేపడు
నట్టు లుండు నన్య మైన నెంత
సంతసమునఁ దేల స్వాంతంబునం దది
పానకమునఁ బుడుకభంగి యగును. 115

గీ. కనులు మిఱుమిట్లు గొలుప నొక్కపరి యైన
నీయనర్ఘరత్నమును జూపించి తనియ
నిమ్ము సుందరీమణి ! సంతసమ్ము నాప్త
జనులతోఁ గూడి యనుభవింపంగవలయు." 116

వ. అని యామెముఖమునఁ దనచూపుక్కలఁ బఱపి మాధవుఁడు పరి
దేవన మొనర్చుచందమునఁ జూచుఁడు, మధు సిగ్గిల్లి సంకుచితాంగి
యై యీతండు సాక్షాత్కృతదైవంబ యగు నని భావించి, యొకి
నాఁడి యెడ నొక్కచందమ్మున నీతనిగౌరవాదరము లాత్మీయతఁ
జెనుచుచు మఱుక్షణముననే నన్ను మరుభూములం బడవైచు
చున్నవి. ఈవైచిత్ర్య మేమొకో ! యని పెద్దయుంబ్రొద్దు విచారించి
పరిమితం బగు నాబుద్ధి యియ్యద్భుతచరిత్రు సమగ్రస్వరూపము నాకళిం
చుకొనఁజాల దని తనయోటమి నంగీకరించునది వోలె యతని ననుస
రించుట యకర్తవ్యంబుగా స్థిరనిశ్చిత యై తదుపక్రమణికగా ని
ట్లనియె. 117

గీ. "పల్లెపట్టుల సంస్కారపరతఁ గొఱత
యగుట ననుఁబోలు కన్య వెన్నాడ మీకు
గౌరవకళంక మేర్పడఁ గల దటంచు
సంశయ మ్మలమెడుఁ జింత సల్పఁ డిద్ది. 118

గీ. నగరజీవిత మైన మీ-నసవడి నిసు
మంత పట్టించుకొనరు, మీయట్టి లెటు లు
దారు లౌదురు మిముఁ గన్నవార ? లిందు
వలనఁ బొడమవె సంశయములు దలఁపుఁడు. 119

మ. కులభేదంబును నెంతు, రస్పృలకు నాకు న్భోజనం బుంచి యా
వల వడ్డింతు రటంచు నింటి; నిది సంభావ్యంబె ? నాచిత్త మిం
దుల కేమాత్రము సైఁచనేరదు; జనుల్ తోఁబుట్టువుల్ గాఁగ శో
భిలకున్నన్ మనసంఘ మొందఁగలదే ! వృద్ధిన్ బురోగామి యై. 120

శా. రంగేళిన్ గొనివచ్చె నెవ్వతెనొ ! యీరాజీవనేత్రుం డటం
చుం గూఘోక్తులు, గూర్లు కట్టి ప్రజ విస్తుంబోయి వీక్షించుటల్
కంగారున్ గలిగింప మోదమును సౌఖ్యం బెట్లు మీ కబ్బు ? ని
య్యంగారమ్మను మూటఁగట్టుకొన మీ రాశింపరా దీక్రియన్. 121

ఉ, ఎల్లరు మీక్రియం దలఁప, లేర్పడు నెంతయు రవ్వ, మీకునై
తల్లియుఁ దండ్రి చిచ్చిలుట తప్పను, మెప్పునకై నటించినన్
జల్లుదు రాత్మబంధువులు శాపశతాశుగముల్, గృపాళు రై
పిల్లినిఁ జంకఁ బెట్టుకొని పేర్మిఁ జనం దలపోయ నర్హమే ? 122

చ. ఎఱుఁగరె మీరు నాచరిత; మీపాతభాగిని వెంటనంటియే
యురవడిఁ గ్రమ్మ కష్టచయ ముద్ధతి మేఘము లట్ల, మీకృపా
పరతకు సంతసించితిని, బొప్పడఁబోవకుఁ డాత్మబంధుని
ష్ఠురభయదాగ్రహానలముఁ జొప్పఁగ మీచెలి, మీరు దూరఁగన్.

క. ఈ జనవరి పదినే యగు
నాజన్మదినోత్సవము నొనర్పంగా నూ
హాజగతిన్ విహరించితి
సాజము నిర్భాగ్య కాత్మశాంతి తొలఁగుటల్. 124

గీ. కనుల మెసలుచునున్నట్లు గన్నతల్లి
చూడఁ గోరి వ్రాయంగ, మీతోడ గాలి
పటమునకుఁ దోఁక వోలె యచ్చటికి నేను
వెనుదగుల నేల? మన్నింప వేఁడుదాన. 125

సీ. మన్నించి మీరు మీమాతఁ జూడఁగఁ జనుఁ,
డిపుడు మీతోడ రా నెంచ, వారు
సముచితసంస్కారసంపన్ను లైనచో
నీయభాగినిఁ గూర్చి యెఱుఁగఁజేయుఁ
డాదట వార లౌ నన్నచో నాహూతఁ
గాకయే వెన్నాడఁగలను మిమ్ముఁ
దంత్రులు తెగినసితారు నై యిచ్చోట
మీరాకఁ గోరి నిమేష మొక్క-
గీ. యుగముగాఁ బుచ్చుచుండు నీయువిద, మఱవఁ
బోకుఁడు పరీక్షలుఁ డాసె, బుద్ధిపూర్వ
కముగ మీయాజ్ఞ నేఁ దిరస్కరణ సల్పఁ
బూనితిని యుభయులక్షేమమును దలంచి." 126

క. అని, మధు మేజాపైఁ దా
నునిచెఁ దినచర్యపొత్త మూహించెడి యా
తనిముఖలక్షణములఁ గనుఁ
గొనలఁ బరికించుచు వ్యథఁ గూరుచు నంతన్. 127

వ. మాధవుఁడు మధును సుప్రసన్నచిత్తమున నాలోకించి. 128

గీ. "మధు! త్వదీయేంగితమ్ము సమ్మాననీయ
మగును; గీ డెంచి మే లెంచ నౌను, దల్లి
దండ్రు లెంతయౌదార్యచిత్తములు గలుగు
వార లైనను సంభ్రమాపాదక మగు. 129

గీ. అర్హరీతి నీయోగ్యత లన్ని తెలిపి
తొలుత వారిని రంజింపవలయు నిజము;
లేనిచోఁ దిరస్కృతి కల్గెనేని దానఁ
గలుగు శాశ్వతహృదయసంఘర్షణమ్ము. 130

గీ. కులధనాదులతో వ్యక్తిఁ గొలువఁ బోవ,
రతియుదారులు, సంశయ మందఁ జనదు,
మానవీభూష వగు నిన్ను మౌళిఁ దాల్తు;
రైన వారల కెఱఁగింప నైతి మున్ను. 131

క. కలవారి తప్పు లెన్నం
గలవారలు లేరు; మంచి కార్యమునందున్
బలుగాకిలోకమును నెదఁ
దలపోసెడి భీరువుగను దలఁపకు నన్నున్. 132

ఆ. వె. నా కనుజ్ఞ నొసఁగి నవనీతహృదయ! యో
ర్మిని వహించు; మమ్ముఁ దనిపి ప్రేమ
మూర లాడి నిన్నుఁ జేరఁగ నరుదెంతుఁ
బదిదినమ్ము లైనపిదపఁ ద్వరగ. 133

గీ. జన్మదినపర్వమందు నీస్వాంత మలరఁ
జేయలేమికిఁ జింతింతుఁ జెలియ! యుచిత
మైనకానుక యెద్ది నీయాత్మఁ గూర్చు
నట్టి దని యెంచుచుంటిఁ గల్యాణి! యిడఁగ." 134

గీ. అనిన దరహాసవికసితాననము దనర
"ఆఁకొన్నన కొకింత బెల్లముఁ జేతఁ బెట్టి
బుజ్జగించెడి చంద మొప్పునె? తలంపుఁ
దేమి యొసఁగిన నీలోప మీగసగునా? 135

గీ. సాహచర్యము వడయ నోచంగ నైతి;
దయ కలుగునేని మీదుచిత్రంబు నొకటి
నా కొసంగుఁడు; చాలు; నానాఁడు దాని
మిమ్ముఁగాఁ జూచుకొని సంతసమ్ము గందు." 136

గీ. అనిన మధుఁ గాంచి మాధవుఁ డాననమున
హాసరోచులు బర్వ ని ట్లనియెను; "మధు!
అల్పసంతోషి వేమన నగును నిన్ను
బాల్యచేష్టలు విడువ వీ ప్రాయమందు. 137

శా. భావోద్వేగము, మూర్తికల్పనము, సర్వస్వంబు నీరాజనం
బీ వెన్కాడమి, పారతంత్ర్యమున సేవింపంగ నారాట, మా
శావాల్లభ్యముఁ గోరి యెంతయుచు విశ్వాసంబుతో వేచి వి
ఘ్నావిస్ఫూతిని నోర్మి సైఁచుటయు నా నైసర్గికం బింతులన్. 138

మ. విదుషీరత్నమ వైన నైజ మెటు ని న్వీడంగ నా? నన్ను నీ
వెది యో యొక్కయపూర్వదైవ మని భావింపంగఁబోల్, దాన నీ
మది సర్వంబును ధారవోసి కడుసమ్మానంబునం జూతు, వి
య్యది వ ద్దన్న సహింపఁబోవు పరతంత్రాత్మన్ సఖీరత్నమా! 139

ఉ. నీపరతంత్రతాస్థితి గణింపకపోవుట యట్టులుండ, నే
నే పురుషోత్తముండ నని యెంచుకొనం గడువిభ్రమస్థితిన్
ఈపగిదిన్ సృజించుటకు నేటికి పాల్పడ? నిట్టిచేష్టలే
మాపును విజ్ఞతాగరిమ మానుము పీనిని మానినీమణీ! 140

మ. అదిగో! మోమునఁ గెంపుడాలు చెలువై యాహ్లాదము న్గూర్చె, న
వ్వది నన్నుఁ గనులందు వారికణముల్ పొంగారు, సైరింపనే
ర్వదు నాచిత్తము వానిఁ జూడఁగఁ, ద్వదర్థం బేను నా నందు; మా
నుదువా బొమ్మలకొల్వు? నెందులకు నిన్నున్ జింత నొందింపఁగన్."

వ. అనిన, మధు మధురహాసంబు నొంచు వెలయించి, యింతకుఁ దమ ప్రయాణ మెప్పుడు ? సన్నాహంబు సేయవలె;'' నన నతండు నవ్వు చు "సాయంకాలము; అదియైన నీ వనుజ్ఞ నిచ్చిననే", యన "నింక నాలసింప వలదు. మీవారలకు బయలుదేఱుచున్నట్లు తంతివార్త వ్రాయుఁడు. టీ త్రాగి స్టూడియోకుఁ జనఁగు. తక్కిన వన్నియు నేన సవరింతు'' నని హెచ్చరించి పరధ్యానంబున నున్నదివారి లేబి లుపైఁ గల మాధవునిడైరీని గ్రహించి తనగది కేఁగె. పదపడి తంత్రీ వార్తను సేవకునిచేఁ బనిచి, రైలుటికెట్టు విలువ నియోగించి, వివి ధము లగు ఫలాదుల నంగడియందుఁ గొని తే సనిచి, మధు మాధ వున కవశ్యము లగు దుస్తులఁ దోలుపెట్టియయందు సర్ది, "పాత్తము లేమైనఁ గొనిపోదురా ? యన నతఁడు తల నూఁచుచు ''వల; దీ డైరీనిమాత్ర మం దుంపు" మని మాధవుఁ డటనున్న దినచర్యా గ్రంథము నందించుఁడు, మధు దాని నందుంచి ''యన్నియు సవరిం చినట్లే. ఇంక మీచిత్రము లనుగ్రహించుటయే తడ" వని సంతృప్తి వెలయఁజేసె. అనంతరము వారు టీ సేవించి 'స్టూడియో'యం దిరు వురు కూర్చొనియున్న బ్లాకచిత్రమును వేర్వేఱుగా మఱిరెండు చిత్ర ములను దీయించుకొని పైక మొసంగి తమచిరునామాఁ దెలిపి వానిని బనుచునదిగా నియోగించి గృహాభిముఖు లైరి. వలయుసంబారము లన్నియుఁ జేకూఱినయనంతరము మధు రైలువేళకు వానినన్నింటిని గారునం దుంపించి తాను స్వయముగా మాధవుని రైలుస్టేషనునకుఁ దోడ్కొనిపోయి నాతనికీడ్కోలొసంగి హృదయభారముతో విషాదమూర్తి యై యింటికిఁ జన. 142

చ. భవనము విన్నఁబోయి కనుపట్టఁగఁ గన్నులఁ జిమ్మచీఁకటుల్
దవిలె, వివిక్తగేహమునఁ దా నొకబంధిత యైనపోల్కి నెం

చి వికలచిత్త యయ్యె; మధు జీవనసారముఁ గొల్లవెట్టి మా
ధవుఁ డపురా! విచిత్రముగఁ దన్విని జేసె శవానుకారిగన్. 143

చ. కలఁగినచిత్తయై వెడఁదకన్నుల నన్నిదెసల్ గనుంగొనన్
జెలికి మనోజ్ఞరూపమునఁ జెల్వుఁడు కానఁగ నయ్యెఁ; గన్నులన్
జలజల రాలె బాష్పములు, సాంద్రముగాఁ బులకల్ జనించెఁ, గో
ర్కులు దులకింపఁ గోపమున భ్రూలతిక ల్ముడివడ్డఁ బెల్లుగన్. 144

ఉ. "మానహరా! యిదేమి కొఱమాలినదానిగఁ జేసి నన్ను నె
న్నో నెలలైన గాంతను మునుంగఁగఁ జేయుటె కాని తీర్పఁగాఁ
బూనినచొప్పుఁ గానఁ బ్రియురాలిసుధామధురానురాగపా
దానతచిత్తముగ్ గొనక యార్తినిఁ గూర్తె? సహింప నేర్తునే? 145

చ. నెఱపితి సఖ్య మెంతయు, ననింద్యను, మీచరితంబు వింటి, మి
మ్మెఱిఁగితి, దాసి నైతి, ఘటియించితి నంజలి, నర్చఁ జేసితిన్;
స్మరణ యొనర్చి, చింతనము సల్పి, వినీతిని సేవఁ జేయు సుం
దరి ననుఁ జేరరాఁమి తగునా? పరదైవమ! ప్రాణనాయకా! 146

మ. ఒకకారుణ్యకటాక్షవీక్షణము నూత్నోత్సాహసందీపకం
బొక ప్రేమామృతపూరవాక్యము నవీనోద్వేగసంధాయకం
బొకమోహాన్వితచుంబనంబు స్మరతాపోన్మూలనాదక్ష, మే
నొకటా! పొందఁగ నోచనైతిఁ బ్రియ! భావ్యం బౌనె నీచెయ్దముల్.

గీ. నాఁటి, నీదైన్యచరిత మరాతిరాతి
గుండెలైనను గరఁగించుఁ; గూర్మి నిన్ని
నెలలు సేవింపఁగా నుక్కు బలిసె నెడఁద
రాతిపై నార తీయు నేర్పరులు తాము. 148

గీ. జీవితాంతము మీసేవ సేయఁ గోరి
నిలువుదోపిడి నిచ్చితి నీరజాక్ష!

కలిగినది యెల్ల మీకె; లోకమున నింక
నా యనఁగ నెద్దియును లేదు; నమ్ముఁ డిద్ది. 149

సీ. స్మరసుందరా! నీకు దొరతనం బొడఁగూర్చి
కనుసన్న మెలఁగితిఁ గరుణ లేదె?
నవనీతహృదయ! యెన్నండైన నొక్కింత
యెదిరింప నదియైన నెంచ లేదె?
మంగళాకార! నామాన మప్పన మిచ్చి
వేచిన నన్ను భావింప లేదె?
ప్రాణనాయక! నాకు బ్రతుకును మృతియు మీ
తోడిదే యని యుంటిఁ జూడ లేదె?

గీ. ఏమహాపచారము సల్పి నిట్లు న న్ను
పేక్ష యొనరించి శిక్షింప దీక్షఁ బూని
రెఱుఁగఁజేసిన దిద్దుకో నెంతు; దండ
నార్హ ననియైన సంతృప్తి నందఁగలను." 150

మ. అని భాషింపుచు శూన్యదృష్టిని బహిర్వ్యాపారరాహిత్య యై
కను నక్కాంతను ధాత్రి శీతలదయాకంఠస్వరం బంతఁ జే
ర్చెను భావాంబరవీధినుండి భువిఁ; బేర్మిన్ జూపుహాసంబు మో
మునఁ జెన్నారఁగ నామెహస్తమున నప్పూఁబోఁడి యై రాయుచున్.

చ. "పొలయలుకల్ వియోగములు ముద్దులు సుద్దులు పల్కరింపు లా
టలుఁ గులుకుల్ వినోదము లసంఖ్యము లాఁ దొలినాళులందు, వె
న్నెలయును జీఁకటింబలె; ననింద్యగుణాకరు నన్యకామినీ
విలసితదృఙ్మరీచులు వివేకిని నాతనిఁ జేరనేర్చునే? 152

ఉ. బాలవు, లోకవృత్తమును భావసమన్వయ మెంచి మెల్లఁగాఁ
జాలవు, భాగ్యశాలినివి; సద్గుణు నెన్నికొనంగఁ గోరి నీ

చేలచెరంగునఁ జుడిచి చింతిల నేలను జేల వోలె? లె
మ్మా లలితాంగి! బువ్వఁ దిన, మానస మించుక చిక్కఁబట్టుమా!"

ఆ. వె. అనిన దాదిచేయి నానందమునఁ బట్టి,
"చనవు సూపఁ డేమి సల్పుదాన?
దేవిచెంత భక్తిభావమ్ము వెలయించు
నట్టు లుండు నవఘు లందు నెపుడు. 154

గీ. ననుఁ దనుపఁ గోరు నాతఁ; డెన్నఁడును నతని
నేను దనియింప లేకుంటి నేమి సేతు?
నగ్గిఁ జేరని చెదపుర్వు నై తపింతు
నతనికర మైన నంట సాహసము లేదు. 155

సీ. ఆప్యాయముగ నను నాహ్వాన మొనరించె
నేమిలాభము కూడి యేఁగనైతి
నేనాఁడు న న్నీసడించెనా యందునా
యిన్నినాళుల నట్టి దేది లేదు
కఠినుఁ డందున యెన్నికన్నీళ్లు నాకయి
కార్చెనో తెలుప శక్యంబు గాదు
ప్రత్యూషమున బాధ పడుదు నాతనిఁ గోరి
యాతఁ డ ట్లెలనో యార్తిఁ గనఁడు

గీ. స్వార్థపరుఁ డనఁ బాపము సంభవించుఁ
బరులఁగూరిచి యొకచెడ్డపలుకు ననఁడు
ఒకయవిజ్ఞేయశక్తి యై యుండు నతఁడు
ఇది యొకసమస్య యై నను నేఁచు సతము. 156

మ. పరిచర్యాఘనభాగ్య మబ్బె, సుఖసంపచ్ఛోభలుం గల్గె, నం
దఱు నాభాగ్య మనన్య మందురు, యథార్థం బౌను సర్వంబు, నా.

పురుషోత్తముని లోకగౌరవంపఁ దగునేర్పున్ గాన; నేమందు ? దు
ర్భరసంతాపముఁ గూర్చు నియ్యదియె; నేర్వం బోలునే తెల్పుమా !"

వ. అనిన, నాదాది చిఱునగవు దనర నామె కిట్లనియె. 158

గీ. "ప్రేమ గ్రుడ్డిది తల్లి ! నీ వేమియుఁ బొర
పడఁగ లే; దాతఁ డగును నీవాఁడె; మదిని
వనటఁ దక్కుము; గంభీరవర్తనుఁ డగు
పురుషసత్తముఁ డతఁ డని యెఱుఁగఁదగును. 159

గీ. ధాత్రికప్రలోభములకుఁ బొలువడరు
సజ్జనులు; వారి రంజింపఁ జాలు నొక్క
యాత్మసౌందర్య, మీ రహస్యమును దెలిసి
స్వార్థరహిత వై యాత్మ నొసంగఁదగును. 160

గీ. కామ్యసుఖములు తాత్కాలికములు నల్ప
ఫలదములు నింద్రియార్థసంభవము లగుట
మానినీ ! వానిఁ గోరి శమప్రధాను
లారటం గనఁబోరు మోహమునఁ జిక్కి. 161

గీ. నీవు చెప్పిన పలుకుల భావ మెఱుఁగ
దైహికాకాంక్షయే వెల్లితలలు వైచు
టెఱుఁగనయ్యెను నీయందుఁ ? దరుణి ! తొలుత
నాత్మ నాత్మను బెనుచుటే యర్థ మగును. 162

ఉ. కర్మ నొనర్చుమాత్ర మధికారము మానవులందుఁ గల్గు, నా
కర్మఫలంబు యోగ్యతను గాంచి యొసంగును దైవ మొక్కఁడే
నిర్మలచిత్త వై మదిని నిల్పు మచంచల మైనప్రేమ, స్త్రీ
ధర్మము ప్రేమసిద్ధికి సతంబు తపస్విని యాటయే యగున్. 163

ఉ. కన్నులముందు నేఁడు బొడకట్టును గాంతలమేలుబంతి నీ
పున్నెపుఁబంట యా జనని పూజ్య, స్మరించినయంతమాత్రనే

కన్నులు చెమ్మగిల్లుఁ బులకల్ జనియించును మేన; స్వర్గమం
దున్నను బ్రాణనాథు భువి నొద్దిక దిద్దఁగ నేర్చె ధన్య యై." 164

వ. అనిన, మధు సంభ్రమోత్సాహములు సెలరేఁగ ధాత్రి నాలోకించి నా కావృత్తాంతము సమగ్రముగ నెఱిఁగింపవే యనుడు, ధాత్రి సాశ్రునేత్ర యై. 165

గీ. "జీవితం బెల్ల నీయింటిసేవలం దె
కడపియుండుట నే నెఱుంగనిది లేదు;
వినుము మీతండ్రి విద్యావివేకచతురుఁ
డయ్యుఁ బ్రాయంబునందు వేశ్యాప్రియుండు. 166

గీ. విభవచిహ్నము లై నాఁడు వెలయునట్టి
కామినీపానములు రెండుఁ గలిగి యతఁడు
మీాజననిరూపరేఖల మిపులఁ జొక్కి
పరిణయం బాడె బహుళవై భవంబు వెలయ. 167

ఉ. ఏ మని చెప్ప నేర్తు నతఁ డిందునిభానన ! శోభనంబునాఁ
డామహిళామణిం దలఁప కానిశియందును వేశ్యవాటికన్
గామము కన్నుఁగప్పఁగ సుఖంబునఁ బుచ్చుచు వేఁగుఁబోకటఁ
గీమును జేరెఁ దూలుచు నికృష్టదశన్ గను లెఱ్ఱవారఁగన్. 168

సీ. అవనతవదన యై హస్తమ్ము చెక్కిట
నానించి నేల నాసీన యగుచు
నిట్టూర్పుగాడ్పుల నిరతప్రచాలన
మున శోభనపుగది పొగలఁ గ్రమ్మఁ
గంటికిఁ గడవెడు కన్నీరుఁ గార్చుచు
జిలుఁగుపయ్యెదచేలచెరఁగుఁ దడుప
వెక్కి యేడ్చుచుఁ జెవుల్ నిక్కించి యొక్కింత
యలికిడి కై నను నులికిపడుచుఁ

గీ. కుములుకుంపటి యనఁగ నక్కమలాంగి
వగలఁ బొగులుచుఁ దొలిరేయి మగనిఁగూర్చి
గడపుదృశ్యమ్ము నేఁటికిఁ గనులఁ గట్టి
మనము ద్రవియింపఁజేయు నే మనఁగవచ్చు. 169

చ. చెలువుని రాకఁ గాంచి ముఖసీమ వికాసము చెంగలింప, న
య్యలికులవేణి నేత్రముల నద్ది చెరంగున, దుఃఖరేఖఁ గ
న్నులఁ దులకింపనీయక, యనూనవిలాసము దోఁపఁ బోయి చే
తులఁ బెనవైచి సంబరము దోఁపఁగఁ దోడ్కొనిపోయె లోనికిన్. 170

గీ. ఇంతమాత్ర మెఱుంగుదు, నేమి చెప్ప
నేమహామంత్రశక్తియో యెఱుఁగరాదు;
మఱుసటిదినమ్ము పతి నొక్కయరనిముసము
విడువక యనేకగతుల సేవించి తనిపె. 171

గీ. దొడ్డయిల్లాలి కన్నులఁ దొణుకు కాంతి
నెంతయధికారదర్పము లిమిడెనేమొ!
నాఁటినుండియు నిలు వీడినాఁ డనంగ
రాదు మీజనకుండు విభ్రమముఁ గూర్చ. 172

గీ. తాను గీచినగీటును దాఁటనియక
బ్రతికినన్నాళ్లు నిల్పు టేపాటిగొప్ప?
తాను గతియించియును భర్త మానసీయ
శీలుఁగా దిద్దుకొనియె నచ్చెలువ తల్లి! 173

చ. మిసమిసలాడుప్రాయమున మీజననీమృతి సంఘటిల్లినన్
విసముగఁ జూచె లోకమును, విశ్రుతుఁ డాతఁడు సాధుశీలుఁ డై
రస మొకయింత నాహృదయరాజ్ఞయె చేకొనె, నింకఁ జాలు నీ
రస మగు జీవనం బని నిరంతర మాప్తులతోడఁ బల్కెడిన్. 174

గీ. ఆమహాసాధ్వీరక్తమే నైన నీవు
ప్రియువశీకృతికై యేల పేద వగుదు
వమ్మ! నీసామ్ము వారసత్వమ్ముఁ జేసి
భక్తిపూర్వకభర్తృసేవాదిదృష్టి. 175

మ. గొనముల్ ప్రో, వతికోవిదుండు, శుచి, నిర్దోషర్ధుండు, సౌజన్యధీ
వినయాగ్రేసరుఁ డౌటఁ గాక వ్యసనావిష్టుండు గాకుండె, స్త్రీ
జనసద్భావ మశేషగౌరవము మెచ్చున్వాచ్చు, సంస్కారి, నూ
తనభావాభిరతుండు నౌ నతనికై తల్లీ! విచారించెదే! 176

గీ. నీపురాకృతపుణ్యమె నిరుపమాన
శీలు నాతని వరియింపఁ జేసె నిజము;
సర్వ మర్పించి సంకల్పనిర్వాహణము
సల్పి నీపే రొనర్పుము సార్థకముగ. 177

గీ. జన్మజన్మలకైన నిశ్చయము జయము
అమృతహృదయునియర్ధాంగి వై సుఖింప
దీవెన లొసంగు మీతల్లి, దీక్షఁ బూని
తల్లిసారము బిడ్డ నాఁ దనరు మమ్మ!" 178

వ. అనినఁ బ్రమోదమానస యై మధు హృదయంబున నూత్నోత్సాహంబును మాతృభక్తియు దీపింపఁ దల్లికి జేజే లిడి యపరమాతృస్వరూపిణిగా సంభావించు ధాత్రికరంబులఁ దనకరంబుల నొత్తుచు "యిదే నీయాజ్ఞ శిరసా వహించెద, విశ్వమెదురునడిచినను మధుమాధవుల యేకీకృతికి భంగము వాటిల్లనేరదు. నాజననీజనకుల యాశీర్వాదబలమ్మును సముచితం బగు నీప్రోత్సాహంబును నండగా నుండ నాయంతఃకరణసాక్షిగ మాధవుఁడే నాదైవము. ఇహపరములయందామహాత్ముని చరణదాసి నై మనఁ బ్రతిజ్ఞ సేయుచుంటి;" నన

మధుశరంబును దనవక్షంబున నదిమి ధాత్రి "యమ్మా! నీసంకల్ప
మమోఘము. విజయవై యజరామరకీర్తిఁ గందు" వని యాఱ
డించి కుసుమవం దోడ్కొని చనియె. 179

ఉ. మానస మెల్లవేళలను మాధవుపై నిడి యన్యచింతనల్
మాని చరింపఁజొచ్చె మధు; మానసచోరుఁడు పెక్కుమైళ్లదూ
రాన వసించుచుండియు నిరంతర మామెకుఁ జిత్తగోచరుం
డై నటియింపఁజొచ్చెను దృఢాత్మబలమ్మున నబ్బురంబుగన్. 180

ఉ. దైహికమైనయావరణ దాఁటి చరింపఁగనేర్చు మానసం
బూహాలతో విశాల మగు నొండుజగమ్మును నేర్పరింప నం
దాహరిమధ్య మాధవు సనారతము౯ బెనవైచి నూతనో
త్సాహము పల్లవింప సుఖసంగతిఁ బ్రొద్దులు పుచ్చు మచ్చిక౯. 181

గీ. కేలు విసరుచుఁ దనకు వీడ్కో లొసంగు
బాష్పపూరితనేత్ర యా పడఁతిరూప
మచ్చుగ్రుద్దినలీల భావాంబరమునఁ
గనుచు మాధవుఁ డెదఁ గడుఁ గలఁతఁ బొందె. 182

గీ. ధూమశకటంబు వాయువు దూసికొనుచు
బయన మొనరించురయము దుర్భరవిషాద
బంధురం బగు తనమదిపైని నలఁగఁ
ద్రొక్కులీలగ నతనికిఁ దోఁపఁజొచ్చె. 183

గీ. అతఁడు సమాధి నుండి త న్నరయకునికి
నెదురుగా నుండి భాషింప నెంచుకులుకు
లాఁడి యవమానముగ నెంచి వాడిమాడ్కిఁ
బలుపి గొణిఁగెను నాంగ్లేయభాష నేమొ! 184

గీ. మిధున మిట్లుండవలె నని మధురభావ
భరితుఁడై యున్న రని నిజపత్ని నెంచి

ఎగుడుదిగుడుల జీవిత మెడలఁజేయు
నడివయస్కుఁ డొక్కఁడు చింతఁ గుడువఁదొడఁగె. 185

గీ. బోసినోటితోఁ జెంత నెప్పుడును విడక
కాటిలో నక్కకై వడిఁ గాచి యుండె
ననుచు నెలనాఁగ మగనిపై నక్కసుఁ గనెఁ
గాంచి మధుమాధవుల నోరకంటఁ బ్రీతి. 186

గీ. "కళ్లులేనికబోదిని కాని యిడుఁడు
అయ్యగా" రని పలుమాఱు లడిగి తన్నుఁ
జూడకున్న మాధవుఁ గాంచి గోడుఁ గుడిచి
యరిగె వృద్ధునితో బాల యచటినుండి. 187

శా. ఆ హేమంతదినాంతవేళ పొగమం చంతంతకున్ దట్టమై
బాహాటమ్ముగ నేఁగుదేర రజనీపర్యంకమధ్యంబునం
దూహూా యంచు వణంకఁజొచ్చె భువి; ఖద్యోతమ్ము లందందుఁ దా
మూహించెన్ జలి మాన్ప నిప్పుక లనా నొప్పారు దేహంబులన్.

చ. కని, ప్రతిబింబ మియ్యది యగాధవిషాదహృదుగ్రమూర్తి కా
నని తలపోసి మాధవుఁ "డహా! సహియింపఁగరాని శీత మై
వనటను గూర్చుచుండె నెడఁబాటు భరింపఁగఁజాల, బాలలో
చనయుగళీస్రవాశ్రులు తుషారకణంబు లవంగఁ గ్రమ్మెడిన్." 189

క. అని తలఁచి లేచి, చని, 'బే
సిను'లోఁ దనముఖము గడిగి చిత్తము యత్నం
బునఁ గుదురుకొల్పి, యతఁ డా
ననము రుమాల్తోడఁ దుడిచి చలి వేయంగన్. 190

మ. కిటికీయద్దము దించి, రేయిఁ దిన నక్షీణానురాగంబునన్
దృటిలోఁ గూర్చి యమర్చియుంచిన చపాతీల్ వేడికుర్మాయు నాఁ

కటిఁ జల్లార్పఁగ నాహరింపఁదొడఁగన్ గల్యాణిరూపంబు వి
స్ఫుట మై కన్నులఁ గట్ట మాధవుఁడు విస్తుంబోయెఁ బూర్వస్మృతిన్.

గీ. విఱుచుప్రతిముక్కలోఁ బ్రేమ యుఱక లిడఁగ
నూరు లాలాజలము చవు లూరెడి మధు
భాషణామృతధార లై ప్రమద మిడఁగ
మధు కుడుపులీలఁ దినియెను మాధవుండు. 192

ఆ. వె. పరుపుచుట్ట విచ్చి బడలికఁ బోకార్ప
విశ్రమింప నతఁడు వేడ్క నందుఁ
జేరఁబడిన యతని నారసి యభిముఖ
నాగరకసుమాంగి నవ్వి పలికె. 193

క. "క్షమియింపుఁడు, తొలినాళులఁ
దమి నాఁపుట కష్ట మగును; దమసతి ఘనభా
గ్యముఁ బొగడనేర, నామెయుఁ
దమవెంటను నున్నఁ జింత తప్పును గాదే!" 194

గీ. అనుచు నాంగ్లమునందు సాంత్వనము గూర్చు
పలుకు లనుచు సంభాషింపఁ దలఁచు భామఁ
గాంచి కొఱకంచుఁ జూడినగతిని నుస్సు
రంచు వ్యథ నొంది మాధవుఁ డామె కనియె. 195

మ. క్షమియింపందగు సోదరీ! మృదులసుస్వాంతంబున న్నీవు నె
య్యముఁ జూపించితి, వర్హ మౌదు వివె జోహారుల్, ప్రసంగించుకొం
దము విశ్రాంతి యొకింతఁ గాంచి, నను నిద్రన్ బొందఁగానిమ్ము, కో
పముఁ జూపన్ దగ దిట్లు పల్కితని నాపై, నీకు మేలయ్యెడిన్." 196

ఉ. నాలుక లల్లనార్చుచు ఫణంబును హాళిని విప్పి యాడఁగాఁ
గాలిని నేల రాచఁబడు గాలభుజంగినిభంగి రోఁజుకొం

చాలలితాంగి కంటికొనలందు విసమ్మును గ్రుమ్మరించి, "చాల్
చాలు శ్రమింపఁబోకుఁ" డని చట్టున మోమును ద్రిప్పివైచినన్. 197

ఆ. వె. కాలిఁ ద్రొక్కఁబడుచుఁ దేలు నశించియుఁ
గాటు మేను నలఁచు కైవడి నెద
గాటముగను బలుకుగాలమ్ము నాటుట
నామె విడువఁ జింత యణఁగ దయ్యె. 198

చ. అని తలపోసి మాధవుఁడు నావలిమోమయి మేను వాల్చె, నే
చిన పొగమంచువెల్లువను జిక్కి ప్రకాశము మాసినట్టి చం
ద్రుని కెన యాచు మోముపయిఁ దోఁప విషాదమలీమసంబు, గూ
రెను నవమానభారమున; వ్రీలినచిత్తము నొత్తి యత్తతిన్. 199

శా. ఔరా! దుర్భరసన్నివేశ మిది; మిథ్యాభాషణం బయ్యె దు
ర్వారం బై మది నూఁచముట్టుగను విధ్వంసంబుఁ గావించె, నా
నారీరత్నము శీలసంపదయు జ్ఞానజ్యోతియున్ సంఘసం
స్కారాపేక్షయు భూరిమైత్రి యిటులా? సమ్మానమున్ గాంచెపిన్.

మ. చెలియా? బంధువ? దేవతా? యనుచు యోచింపంగఁబోఁ కేక్రియన్
దలఁపన్ గారణ మేమి? ప్రాయమున మిత్రత్వంబు వాటింపఁ గాం
తలతో సాధ్యము గాదొ! స్త్రీపురుషబాంధవ్యంబు దాంపత్య మై
యలరంగావలెనో! విచిత్ర మిది, యూహాతీత మై తోఁచెడిన్. 201

ఉ. ఈమెగతిం దలంచెద రనేకులు సంకుచితాత్ము లౌ జనుల్
కామినిమాట కేమి? గుణగౌరవశూన్యఁ దలంప నేల? యిం
దేమియు వక్రమార్గమున నేఁగుట లేదుగదా! మనంబు; నా
కేమియుఁ దోఁచదయ్యె మధు నేక్రియ నిల్పితి నాత్మవేదికన్. 202

శా. ఐశ్వర్యంబును దూపురేఖలును విద్యాయావనశ్రీ లిటుల్
పశ్చాపేక్షల రేఁచె నంచుఁ దలఁపన్ భావ్యంబె? నారీమణిన్

విశ్వాసంబుఁ దొఱంగి యెంచఁ జనునే ? విజ్ఞానసౌశీల్యముల్
శశ్వచ్ఛీలము నన్ను లోఁ గొనియె; నిస్స్వార్థంబు మాస్నేహముల్.

శా. కన్యారత్నము యౌవనాంగి మధు లోకం బిట్లు భావింపఁగా
నన్యాయంబుగ నెట్టిచెట్టఁ గను నూహాశూన్యుఁడన్ నేను; సా
మాన్యంబా యొకజీవితం బిటు లసమ్మానంబుపా లౌట ? యే
మాన్యుం డామెఁ బరిగ్రహించు విని మామైత్రిన్, గటా! భ్రష్టుఁడన్.

ఉ. కష్టచరిత్రమున్ విని సృగాలముమాడ్కిని వంచనామతిన్
దుష్టుఁడ నామెఁ జేరి తగుదున్ బరిమార్పఁగ వంత నం చహో!
నష్టముఁ గూర్పఁగల్గితి; ఘనం బగు నామెపవిత్రశీలమున్
భ్రష్టముగాఁ దలంపరె యభంబు శుభం బిసుమంత నెంచమిన్. 205

ఉ. కా లోకయింత జాణెఁ, గలకాలము నాసుగుణంపుదొంతి వ్యా
ఖ్యాలము నైతి నక్కట! విశుద్ధచరిత్రుఁడ నంచు నెంచి న
న్నాలలితాంగి చేర్చుకొన నగ్ని రగిల్చితి, మూఢచిత్తుఁడన్,
మాలతి దీని నారసి క్షమామతి నన్ గన దెంతమాత్రమున్. 206

మ. అకటా! కంటికి రెప్ప యై మనిచె నవ్యాజానురాగంబునన్,
సకలావస్థలయందు నుల్లసము నాస్వాంతంబునన్ నించెఁ, దా
నొకయైశ్వర్యగృహాధినేత్రి యనియే నూహింపలే దెన్నఁడున్,
వికలం బౌ మధు భావిజీవితము భావింపంగలే నైతినే. 207

సీ. కలసి మెలసి యొక్కకడ మెలంగిన మమ్ము
దంపతు లని మదిఁ దలఁచి రేమొ!
ప్రకట మామైత్రి నచ్చిక మచ్చికల విహా
రింపఁగా నెంచిరో ప్రేమికులుగఁ
జెలియ నానందింపఁ జేసిన నాచెయ్వు
లను మోహముగను గన్గొనిరి యేమొ!

ఏకమందిరవాస మాకాంత లోఁగొనఁ
జేసితి నని చింతఁ జేసి రేమొ!

గీ. పరులు; కటకటా! స్నేహతత్పరుఁడ నౌచు
మాన్పఁజాలని మచ్చను మధుకుమారి
శీలమున కొడఁగూర్చిన చెనఁటి నైతి;
నేమిటఁ బరిష్కరించెద నీసమస్య. 208

ఆ. వె. పరులమాట దేవుఁ డెఱుఁగు నాచిన్నారి
జీవితంబు నెట్లు భావిఁ బుచ్చు;
సతియసహ్య మైన యవమానదూషిత
యగుచు రామ! రామ! యాత్మ వ్రీలు. 209

ఉ. హే పరమేశ్వరా! హృదయహీనుఁడ, నిష్కృతి గోచరింప దీ
పాపికి, నోర్వఁజాల నఘభారము, ప్రాణములోని ప్రాణ మై
మాపులు రేపులుం దనుపు మానిని కీయపచార మీక్రియన్
జేపడ నైఁపనేర్తు నెటు? జీవిత మేగతిఁ బుత్తు దైవమా! 210

ఉ. నా మధుబాల దివ్యనయనస్రవదుర్భరబాష్పవారి స్వా
మీ! మనుజుండ నై కనమి మేలు; విమూఢతఁ గూర్చినాఁడ నా
లేమకుఁ బెద్ద మచ్చ, గతి లే దిఁక జానిని మాప, నైఁపలే
నోమహనీయమూర్తి! నిరతోగ్రమనోవ్యథఁ గ్రాఁగి స్రుక్కఁగన్.

గీ. కంఠమం దిడు సుమమాల కాలపాశ
మయ్యె నే మందు? మధు మంజులాస్యబింబ
మింక నేలీల దర్శింతు? నింతిఁ జూడ
కెటుల దుఃఖార్ణవంబును నీఁదఁగలను? 212

మ. పదినాళ్ళుల్ చని వత్తు నన్న మధు కల్పం బట్ల భావించి వి
న్నదనం బూనెను; చెమ్మగిల్లెఁ గను లానాళీకపత్రాక్షికిన్

మది నాచిత్రము వ్రాయ దిప్పటికి, యెమ్మాడ్కి బునర్దర్శనం
బది లేకున్న భరించు నామె? తగ వెల్లెనన్ సఖి పీడఁగన్. 213

గీ. ఉభయులము గూడి యోచించి యుచితరీతి
భావికార్యప్రణాళి కేర్పఱుపవలయు
నర్థ మియ్యది; యుచితజ్ఞ ననునయించి
కోరఁదగును క్షమాభిక్షఁ గూర్మి మీఱ. 215

చ. అని తలపోసి చిత్తమున నమ్మధుమోహాసహాసశోభితా
ననమును గాంచి సిగ్గుఁ గని నాఁతి! యనేకవిషాక్తయోచనల్
బెనువఁగఁ బ్రేమవార్ధి నినుఁ బెక్కువిధంబుల నల్పబుద్ధినై
కనలఁగఁ జేసినాఁడ, క్షమ గన్నులఁ జిందఁగ నాదరింపవే! 216

చ. అమృతమయస్వరూపిణి! విహాయసరత్నము వోలె వెల్గు నీ
విమలముఖప్రకాశమును వీరిఁడి నై కనఁజాల కీమెయిన్
గుమిలితి వంత నీకు నొనఁగూడఁ గళంక మటంచు దేవి! ద్రో
హము నొనరించినాఁడ, నెటు లంటుఁ జెదల్ నవనాగ్నికీలలన్. 217

శా. పీయూషాంశుమనోజ్ఞదీప్తులకు నై భీతిల్లి దూషించు నా
మాయోపాయధురీణఁ దస్కరజనుల్ మాడ్కిన్ నినుం దూరితిన్
నాయజ్ఞానము నేమనంగఁ దగుఁ గాంతాలోకచూడామణీ!
శ్రేయోఽర్థిం బలెఁ గొంపఁ జిచ్చు నిడు నాచేఁతన్ క్షమింపంగదే!

సీ. రుచిరాస్యబింబ! నీరూపంబునం దొక
లోపంబు గల్గునే చూప నెందు
గౌరవాకార! నీగౌరవంబున కొక
మచ్చయే కనరాదు మచ్చుకైన
ఐశ్వర్యవతి! నీకునైశ్వర్యవైభవ
మెన్నఁగా దొసఁగు లే కున్నదామె

మానినీతిలక ! హిమానీనదాకార
మైత్రి మాలిన్య మేమాడ్కెఁ దోఁచు
గీ. నవతరించిన సురధేను వై ధరిత్రి
వెలయు పూజ్యచరిత్ర ! యత్నులను జిందు
ప్రేమపీయూషరసము సంప్రీతిఁ గ్రోలి
తనియుభాగ్యము జీవితాంతమును నిడుము. 219

మ. అని యుత్తేజితుఁ డై మనోవ్యథయుఁ జల్లారంగ గ్రామాఁగన్ను ప
ట్టై; నయోమార్గమునందు బండి కడుధాటిం బోవఁ జేకూఱు కం
పన యుగ్యోలను నూఁచునట్లు, రొద జోల్పాటల్ వలెన్ గాఁగ మే
ల్కొనఁగా నల్లులపించు మాధవుఁడు గూర్కన్ బొందె నంతంతకున్.

శా. చింతాధ్వాంత మడంచి, నూతనబలోత్సేకంబుఁ జేకూర్చి, దు
ర్దాంతశ్రాంతిని గూర్చి, యేపుఁ గన నుత్సాహంబు సంధించి, స
ర్వాంతర్యామికి నుద్ది యై సుఖ మనిర్వ్యాజంబుగాఁ గూర్చు ని
ద్రాంతర్మగ్నత సర్వమున్ మఱచి సౌఖ్యం బొందె నాతం డటన్. 221

చ. తెలతెలవాఱఁగాఁ గలఁకఁ దేరిన చిత్తముతోడ లేచి, క
న్నుల నిరుకేల నుల్పుచు ననూనపుభక్తిని దేవు నెంచి, చే
తులు ముకుళించి, యాత్మను నుతుల్ పొనరించుచు, నావలించి, తె
ప్పలఁ దెఱువంగ మాధవుఁడు పద్మనిభానన యోర్తు కన్పడన్. 222

క. ఈజవ్వని సంక్రాంతికిఁ
దాఁ జనుచుండంగనోపుఁ, దలిదండ్రులపై
సాజ మగుప్రేమయే యీ
రాజముఖిం గాన నయ్యె రమ్యము గాఁగన్. 223

ఉ. మాలతి యేఁగు నేమొ తన మాతృగృహంబున కీమెలీల, నే
నాలలితాంగిఁ జూడ సమయం బొడఁగూడునొ ! లేక సంశయాం

దోఁళనముల్ పెనంగ వ్యథతోడ గృహంబున నొంటివాఁడ నై
గోళ్ళులు గిల్లుకొంచు గదిగోడలఁ జూచుచుఁ బ్రొద్దుపుత్తునో! 224
మ. ఇటనే యుండిన స్వాగతం బెటుల నా కీనేర్చునో! ముగ్ధగా
నటియింపంగఁ దొడంగునో! సఖుని నెన్నాళ్ళయ్యె దర్శించి, యు
త్కటమోహంబున ముంచు నెంతయును నక్కల్యాణి, సౌందర్యవి
స్ఫుటవత్కోరకపుష్పగుచ్ఛములు చూపుందూఁపులున్ గాఢ మా.
వ. అని భావించునవసరంబున నాతనియోచనల కంతరాయమ్ముగ. 226
క. బంగారుతీఁగెచెఱకుం
దుంగలు సందిటను బట్టి ద్రుతగమనమునన
జెంగాపిపంచె వాయిల్
అంగరకాఁ దాల్చి యరుగు నతిదృఢగాత్రున్. 227
క. పరికించి, కాఁపుకొమరుఁడు
కరము వినోదంబు గూర్పఁ గడఁగెఁ, గపటమే
యెఱుఁగని యీమొగ మారా!
పరిశుద్ధాత్మస్థితి కగుఁ బ్రతిబింబ మిలన్. 228
గీ. అంచుఁ దలపోసి కాలకృత్యాళిఁ దీర్చి
కూడలి యగుట సామర్లకోటయందు
నారగించి యల్పాహార మతఁడు వేడ్కఁ
'ప్లాటుఫారము' పై నిల్చి పరిసరముల. 229
ఉ. అరయుచుండ బండి యొకఁ డన్నిదిశల్ దెర లొప్ప జోరుగాఁ
జేరువఁ జేరవచ్చుట విచిత్రముగాఁ బరికించి, దానిఁ గ
న్నారుపఁబోక చూడ నది యచ్చట నాఁగి విలాసమూర్తి యా
సారసనేత్ర యోర్తు దిగుచందము గాంచుచుఁ గౌతుకంబునన్. 230
గీ. పిండిబొమ్మ తెఱంగునఁ బీలవారి
కాసవచ్చు నిక్కనకాంగి గౌరవార్థ

మింటఁ బరదాలనడుమ బంధించియున్న
దొరల మెలనాఁగ యామె నని తోఁచుచుండె. 231

క. అని తలఁచి తెరలనడుమన్
గనరాని సుమాంగి రైలుకడ నందఱిమ
ధ్యను దిరుగుట యబ్బుర మై
కనుపట్టఁగ నాత్మవంచకం బిది యనుచున్. 232

చ. తలఁపన్, గ్రొత్తగులాబిపూవులు జడక్ దావుల్ బిసాళింప, మేల్
వలిపెంబు న్ధరియించి కుల్కు-నడ లొప్పారన్ విలాసంబుగా
వలకేలన్ గల తోలుసంచిని బ్రజన్ వారించుచున్ దత్తరం
బలమ న్వచ్చు కుమారి యాతనికి నత్యానందమున్ గూర్పఁగన్. 233

క. కని, యుచ్చ నాకు పెద్ద్యుల
కెన మై యాయువతివెంట నేఁగుచు నెవియో
వినరానినర్మవాక్యము
లను బలికెడి పోకిరీల లఘుమానసులన్. 234

క. తిలకించి, వంతఁ గని, దు
ర్బలహృదయముతో నసభ్యవర్తను లై బా
లలవేఁటయె పనిగా దిన
ములఁ బుచ్చుట నైచ్యము, పాడమును లజ్జ కడున్. 235

మ. అని చింతించుచు, బండి నెక్కి- దినచర్యాగ్రంధమున్ దీసి కూ
ర్చొని, యాముందటినాఁటిసంగతు లెదన్ రూపొంద యోచింపఁజొ
చ్చెను నొక్కొక్కటి, బండి యింటిమొగ మై శీఘ్రంబుగాఁ బోవుచుం
డ ననంతత్వరఁ బోయె మానసము గూఢం బై మధుం గూడఁగన్.

గీ. గతదినానుభవము సమగ్రముగ నెదను
మూర్తిఁ గల్పించుకొని పాత్రమును దెలుపఁగ

ముత్తెపుంగోవమూడ్కిని ముద్దుఁ గూర్చు
కలికిచేవ్రాఁత యాతనికనులఁ బడఁగ. 237

ఆ. వె. స్మితము గదుర మదినిఁ జింతించి పొరపాటు
పొడమె; మధుకుమారి పొత్త మిద్ది
తారుమాఱు లయ్యెఁ, దనగ్రంథ మీలీలఁ
గొనుట యెట్టు లెంచుకొనునొ! యకట! 238

గీ. పరులహృదయానుభవము దర్పణములీలఁ
జూపు దినచర్య; కావునఁ జూడఁదొడర
రాదు పెరవారిగ్రంథ; మర్మముగ మధు కు
మారి కెఱిఁగింతు నని యెంచి మాధవుండు. 239

క. పొత్తమును మూసి యంతట
నుత్తరమును మధుకుమారి కొనర రచించెన్
జిత్తమునఁ బొడము భావము
లత్తఱి వేఱొండుపత్రమందు లిఖించెన్. 240

మ. అతఁ డాజాబుఁ దపాలుపెట్టె నిడి యూహాల్ గేహమున్ గూర్చి రా
నతిలోకోత్తమసాధుశీలురును సారాచారులున్ సద్గుణుల్
స్తుతసచ్ఛీలురు తల్లిదండ్రు లగుచున్ శోభించె నాజన్మ, సం
చితపుణ్యంబున నిట్టిభాగ్య మలమెన్ సేవింతు నవ్వారలన్. 241

చ. అని తనజన్మదాతల సమాదరచిత్తముతోడ మాధవుం
డనితరదుర్లభార్థముగ నాత్మఁ దలంచి నిమీలితాక్షుఁ డై
కనుల ముదశ్రుబిందువులు గ్రమ్మఁగ నంతటఁ గేలు మోడ్చి భ
క్తిని; దలిదండ్రులందు నరుదే సుజనాళికిఁ బూజ్యభావముల్? 242

క. జననీజనకులఁ జిత్తం
బునఁ దలఁచుచు నతఁడు మోదమునఁ జెలువారన్

గననయ్యె జన్మభూమియు
నినుమడిగా ముదముఁ బెంప నేర్పడ నంతన్. 243

శా. ఆదృశ్యమ్మును గాంచి శోణితము పొంగారన్, వినోదంబు నా
హ్లాదంబున్ బెనవైచి చిత్తమున కేకాగ్రత్వమున్ గూర్ప, న
న్నాదివ్యామృతసీమ యామెఁ గృపఁ దా నిన్నాళులున్ గ్రాసవా
సోదైన్యంబులు లేకయుండ నని, దృష్టుల్ పర్వపర్యంతమున్. 244

మ. అనిమేషేక్షణుఁ డౌచుఁ గాంచి తృణకాష్ఠాంభఃప్రపూర్ణంబు, లో
చనపర్వంబుఁ, బురాస్మృతుల్ బఱపి యాశ్వాసించు నన్నీకుమా
రుని నీమాత యటంచు నెంచె; జననీరూపంబునన్ జన్మభూ
మినిఁ బ్రేమించుట నైజ మెందుఁ దమ లేమిన్ గల్మిఁ దత్సంభవుల్.

ఉ. శీతలపూర్వవార్ధి జలశీకరసంయుతవాయువీచికల్
ప్రీతినిఁ గూర్ప మాతృభువి ప్రేమను బాహులఁ దార్చినట్లుగా
నాతఁడు సాక్షి మేనఁ బులకాంకురముల్ బొడమన్ బ్రయాణసం
జాతతనుశ్రమం దొఱఁగి స్వాంతము పల్లవితం బొనర్పఁగన్. 246

గీ. అమ్మయొడి నుండి స్తన్యము సమ్ముదమునఁ
గ్రోలుచును నామెమోమునఁ గొనలు సాఁగు
ప్రేమ నక్షులఁ ద్రావెడి బిడ్డ వోలె
మాధవుఁడు తోషవార్నిధిమగ్నుఁ డయ్యె. 247

శా. లాంగుల్యానది యక్షిపర్వముగ నీలప్రాంశుదేహంబుతో
శృంగారంబుగఁ బోవుచొప్పుఁ గని, మాతృక్షేత్రకల్యాణి ! కా
ళింగీ ! మంగళజీవనా ! సరసనాళీకాక్షి ! జోహారు లం
చుం గేల్మోడ్చెను మాధవుం డెదను నశ్రుల్ గ్రమ్మ నేత్రంబులన్.

చ. చెఱకులఁ గొట్టి బొద్దులుగఁ జేర్చి రసంబును బిండ గానుగన్
దరియఁగ మోసికొంచుఁ జను తామరసాక్షులు ప్రాంతభూములన్

హారువును గూర్చ మాధవుఁ డహో! శ్రమగౌరవ మిందుఁ గాన నౌ
నిరతపరిశ్రమాలస మనింద్యము శ్రామికజీవితం బిటన్. 249

ఉ. పూరికిఁ గానివాక్యముల బోధన సల్పుచు నుండు నేఁటివా
క్కూరుల నెత్తి మొట్టి తెగఁ జూపుచునుండిరి మార్గ మద్దిరా!
సారసనేత్ర లిందు, శ్రమసల్పుట గౌరవహీన మంచుఁ జే
కూటినహీనభావమునఁ గొల్కొనఁ బోదు సమాజ మెన్నఁడున్. 250

చ. అని తలపోసి పందిళులయందున గానుగ లాడుసోయగం
బును గని, క్రొత్తబెల్లమునఁ బొంపిరి వోయెడితావి నాసికన్
దనియఁగఁ బీల్చి, స్వస్థలము దా పగుటన్ గమనించి, మానసం
బున నన లెత్తువేడుకను మోము వికాసము నంద సందడిన్. 251

శా. సామానుల్ సవరించి పుష్పపురిదృశ్యాలోకనాపేక్ష హృ
త్సీమన్ బాదుకొనంగ మాధవుఁడు వీక్షించెన్ గవాక్షంబులో
మోమున్ జొన్పి పురోపకంఠమున సొంపుల్ గుల్కు శైలేంద్రమున్
హేమంతమ్మున స్రుక్కియున్న జలదేయిన్ వంశధారానదిన్. 252

ఉ. సైకతవేదులం దొడిగి శాంతరసాన్విత యై స్రవంతి యి
య్యాకృతి బక్కచిక్కఁ బరిహాస మొనర్పఁగ రెల్లు క్రొల్లలై
పైకొని పూఁతనవ్వులకుఁ బాల్పడెఁ; గల్మిని విఱ్ఱవీగుటే
గాక పరావమానమునఁ గందురు మోదము నల్పు లెంతయున్. 253

మ. అని భావించుచు బల్లకట్టుపయి సాయహ్నానిలస్పర్శ స్రు
క్కినవెమ్మేనుల నూత్నసత్వజవముల్ గీల్కొల్ప గేహావళిన్
గనఁగాఁ బోయెడి శ్రామికప్రకరమున్ గన్నార్పకే చూచి దాఁ
టెను నేటి న్మది నాతురం బలమఁగా స్టేషన్ సమీపించుటన్. 254

శా. గమ్యస్థానము బండి చేరఁ దనకై గాలించుకొం చాత్రమున్
సౌమ్యత్వమ్ము వెలార్చుసేవకుని విశ్వాసార్హు చేఁ జీరి, రా,

సమ్యగ్భాషలఁ బల్కరించి యతఁ డాసామానులం దీయ, శ్రీ
రమ్యుం డై చని మాధవుండు శకటప్రాంతస్థలిన్ జేరి తాన్. 255

క. శకటాధిరూఢుఁ డై వా
దకుఁ డంతన్ బండిఁ దోల దరహాసముఖ
ప్రకటరుచు లలము నానే
వకు క్షేమము నడుగ నతఁడు వాత్సల్యమునన్. 256

చ. వినయము దోఁప "బాబు! మనవీటను నందఱు క్షేమమే, నినుం
గనుఁగొని రెండపంట లయి కన్నులు గాయలు గాచెఁ, జేతితో
డను ననుఁ బిల్వకుండినఁ దడంబడుచుంటిని నిన్నుఁ బోల్చలే
క, నిరుటికంటె మాఱితివి; కన్నుల నమ్మఁగలేకపోయితిన్. 257

ఉ. మీసము దీసివైచితివి; మిక్కిలి మో మది చిన్నవోయె, నీ
వేస మిదేమి? జుట్టు నిటు వెన్కకు దువ్వితి? వీపరాయి కూ
ర్పాసము వోలె కాళ్ల నిటు పట్టెడు చిన్నదె? గాలి యొంటికిన్
వీసము సోఁకనీయ కిటు వ్రేలెడు 'కోటు' విచిత్ర మయ్యెడిన్. 258

ఉ. నామము వెట్టి, తుమ్మెదల నవ్వెడుమీసము ద్రిప్పి రీవిగా
భీముని వోలెఁ బొంకమును బింకము దోఁపఁగఁ బెద్దబాబు గే
రా మురు వొప్పఁ జుట్టి తనప్రాయమునందున వీధిఁ బోవఁగా
నే మనవచ్చుఁ గ్రీఁగనుల నెందఱొ చూచెడివారు గుబ్బెతల్. 259

గీ. నామమే పెట్టవైతి వెన్నాళ్లనుండి;
మీసముం దీసితివి కడు దోస మిద్ది,
పురుషుఁ డై పుట్టి మగసిరి దొఱఁగ నేల?
బాబు! నే నిష్టపడ నిట్టిపనికి నెపుడు. 260

గీ. నే ననఁగ నేల చిన్నమ్మ యైన దీనిఁ
జూచి సహియింపనేరదు; చూడఁ జూడఁ

దురకవేసంబువలె నిది తోఁచుచుండె
వినవు సహవాసగుణము లెయ్యెడ నరులకు. 261

ఉ. పున్నమచందమామ యనఁ బోలినమోము; సలాక యానొడల్
వన్నెలు చిన్నెలుం గలుగువాఁడవు నీ కిది యేమివేష ? మి
ట్లున్న ననుం గనుంగొనక యాగ్రహ మూనుచు, నిన్నుఁ జేతులం
జిన్నటినాఁటినుండియును బెంచినవాఁడను గానఁ బల్కితిన్." 262

ఉ. నావుడు మాధవుండు వదనంబున హాసము మోసు లెత్త, నా
సేవకుచిత్తశుద్ధియును స్నేహము నిష్కపటత్వ మాత్మ సం
భావన చేసి, డెందమున బాల్యమనోజ్ఞచరిత్రసంస్మృతుల్
తీవలు సాఁగ, సాదరమతిం బరికించుచుఁ బల్కె నీక్రియన్. 263

శా. "నీ వీవేషము మెచ్చలేదు; కనవే నెత్రహూమహానేత, తా
నీవేషమ్మును తాల్చు, పెద్ద లగువా రీదుస్తులన్ మిన్నగా
భావింపంగను నేనుగూడ నిదియే బాగుండునం చెంచితిన్;
ఈవే యి ట్లన నవ్విపోవు ననుఁ దా నీక్షించి చిన్నమ్మయున్. 264

గీ. ఇంతకును నామె నావేష మెట్లు చూచుఁ ?
బదిదినము లుండి పోవుదుఁ బట్నమునకుఁ;
గన్నవారింట నుండును గాదె యామె;
బ్రతికిపోతిని మెగతాళి పాలు గాక." 265

వ. అనిన, నాసేవకుఁ డాశ్చర్యంబున నోరు దెఱచి కనురెప్ప లల్లార్పక మాధవు నాలోకించి "చిన్నబాబూ! యి ట్లనుచుంటి వేమి? చిన్నమ్మ యిచ్చటనే యున్నది. 266

ద్వి. నిరు లొల్కు నాతల్లి చిన్నబా విటకు
నరుదెంచె నని విని యమ్మసన్నిధిక్
నేలేలఁ బోఁగిల దెఱఁగవా యెల్ల

వేళల నినుఁ జూడ వేడుక పడును
ఊర్మిళాదేవి నా నొప్పారి యెపుడుఁ
గూర్మి నీబొమ్మనే కొలుచుఁ జూచిలిని. 267

ఆ. వె. అదియుఁగాక యమ్మ యాహ్వాన మొనరింప
నీవు రాకయుండ నేర్తు వెట్లు ?
నిన్నుఁ జూడకున్న నీ రైనఁ జిన్నమ్మ
త్రావ నిష్టపడదు తథ్య మిద్ది. 268

సీ. జంగాల గంటలసవ్వడి విని బండి
యరుదెంచునో యని యాతురపడు
నంబార మొసగఁగ నరుదెంచు రైతుల
సడి విని నీ వని తడఁబడుఁ గడు
నిదె వచ్చె నని వేడ్క నెకసక్కెముల నాడు
లక్ష్మమ్మతోడ నుల్లసము లాడు
నెదు రేఁగుటా లేక పొదిగట్టుఁ బట్టుక
నిలుచుటా యను యోచనల మునుంగుఁ

గీ. దప్పకిప్పుడు నినుఁగూర్చి తలఁచుచుండు
నందములబావి చిన్నమ్మ; యామె నీవు
వత్తు నని తీఁగపై నొకవార్తఁ బంపఁ
గన్నవారింటి కెట్లు పోఁగలదు బాబు !" 269

ఉ. నా విని సంతసంబును గనంబడనీయక మాధవుండు నా
సేవకు వీపుఁ దట్టి, "నుతి సేతువు నాపయిఁ బ్రేమకల్గుటన్
ఏవిరొ పెట్టిమొట్టినుడు లేటికి వాగుట ? కుట్టువానిగా
భావన సేయ; కేను సులభంబుగ నమ్ముదె నీదుమాటలన్." 270

వ. అనిన, నాసేవకుండు తత్తరంబునఁ జిత్తంబున శంకాందోళనమ్ములు పెల్లుబుకఁ; దటాలున వెనుదిరిగి మాధవునాననంబును బరిశీలించి యిద మిత్థం బని భావంబేర్పరింపనేరక కొట్టుమిట్టాడి యుద్వేగంబున నిట్లనియె.

ఉ. "అచ్చము రైతుబిడ్డ హృదయంబున నొక్కటి దాఁచి నల్వురున్
మెచ్చుకొనంగఁ బల్కు నన మిక్కిలి సిగ్గిలుచుంటి, నింతకున్
జచ్చుట మేలు కాదొకొ యసత్యము లాడుటకంటెఁ, బొట్టకై
యిచ్చక మాడఁ జూడ, నొకఁడేనియు నన్నిటులాడఁ గల్గెనే! 272

ఆ. వె. గంగిగోవువంటి కన్య, నీయందను
రాగ మలమఁగా నిరంతరమును
నిన్నుఁగూర్చి కలలు నెన్నియొ కనుచుండ
నున్నమాటఁ బల్క నోడ నేల? 273

ఆ. వె. చదువు గిదువు లెఱుఁగఁజాలను నిజమైన
నెదుటివారిచిత్త మెఱుఁగఁగలను;
అమృతహృదయ కాంతలందు మేల్బంతి, మా
చిన్నతల్లి సాధుశీల నిజము. 274

క. ఆయమ్మ కాలు సోఁకిన
నేయిల్లైనను వెలుంగు నింద్రభవనమై
వేయేల సర్వమంగళ
యే యాయమ, శోభనముల కిర విరుప్రొద్దుల్. 275

క. సిరులు ప్రసరించు నక్షులు,
కురియును నమృతంబు వాక్కు, కోటివరాల్ చే
కురినట్టు లుండుఁ గన, నే
గరితలు దిగఁదుడుపుకైనఁ గా రామె కిలన్." 276

వ. అనిన, నవ్వు నాఁపుకొనఁజాలక పక పక నగి. 277

శా. "అప్పన్నా! నటియింపఁజాలను, నుపన్యాసంబు చాలించు, నీ
మెప్పుల్ మోదము గూర్పఁగా వినుటకై మేలంబు గావించితిఁ
దప్పైనన్ క్షమియింపఁ గోరెదను; స్వార్థప్రేరితం బిద్ది; నిన్
నొప్పింపంగఁ దలఁపు లేదు, మది నిన్నుంగూర్చి శంకింతునే." 278

వ. నావు డమందానందమ్మునఁ దోఁగి యప్పన్న "అమ్మబాబూ! నీపన్నా
గము గుర్తింపలేకపోయితి" నని యాశ్చర్యము వెలార్చె. 279

మ. హనుమంతాన్వయదుగ్ధసాగరరమా! హార్దస్వభావా! కృత
ప్రణుతానేకసుకార్య! భిక్షుకజటివ్యాప్తాంగణాగార! పా
వనమూర్తీ! నిరతాన్నవస్త్రధనసేవాదానభూరివ్రతా!
వనితాకారవదాన్యతా! జనని! విద్వల్లోకమందారమా! 280



వ. అనిన, నాసేవకుండు తత్తరంబునఁ జిత్తంబున శంకాందోళనమ్ములు పెల్లుబుకఁ; దటాలున వెనుదిరిగి మాధవునాననంబును బరికించి యిద మిత్థం బని భావంబేర్పరింపనేరక కొట్టుమిట్టాడి యుద్వేగంబున నిట్లనియె.

ఉ. "అచ్చము రైతుబిడ్డ హృదయంబున నొక్కటి దాఁచి నల్వురన్
మెచ్చుకొనంగఁ బల్కు నన మిక్కిలి సిగ్గిలుచుంటి, నింతకున్
జచ్చుట మేలు కాదొకొ యసత్యము లాడుటకంటెఁ, బొట్టకై
యిచ్చక మాడఁ జూడ, నొకఁడేనియు నిన్నిటులాడఁ గల్గెనే! 272

ఆ. వె. గంగిగోవువంటి కన్య, నీయందను
రాగ మలమఁగా నిరంతరమును
నిన్నుఁగూర్చి కలలు నెన్నియొ కనుచుండ
నున్నమాటఁ బల్క నోడ నేల? 273

ఆ. వె. చదువు గిదువు లెఱుఁగఁజాలను నిజమైన
నెదుటివారిచిత్త మెఱుఁగఁగలను;
అమృతహృదయ కాంతలందు మేల్బంతి, మా
చిన్నతల్లి సాధుశీల నిజము. 274

క. ఆయమ్మ కాలు సోఁకిన
నేయిల్లైనను వెలంగు నింద్రభవనమై
వేయేల సర్వమంగళ
యే యాయమ, శోభనముల కిర విరుప్రొద్దుల్. 275

క. సిరులు ప్రసరించు నక్షులు,
కురియును నమృతంబు వాక్కు, కోటివరాల్ చే
కురినట్టు లుండుఁ గన, నే
గరితలు దిగఁదుడుపుకైనఁ గా రామె కిలన్." 276

వ. అనిన, నవ్వాఁపుకొనఁజాలక పక పక నగి. 277

గీ. కళ్లములఁ జేరె రైతులకష్టఫలము;
సృష్టి కెల్లను బువ్వ నర్పించు ధన్య
జీవనుఁడు కర్షకుఁడు శాంతజీవి; యనుచుఁ
దలఁచి మాధవుఁ డానంద మొలయ నంత. 6

గీ. శకటమున్ గ్రామమునఁ జొచ్చి చనఁగ నతఁడు
మదిని నువ్వెత్తు రేగిన మధురబాల్య
వర్తన స్మృతిఁ జొక్కి నిర్భరముదంబుఁ
గనియె నిరుగెలంకుల దృష్టి కడలుకొనఁగ. 7

సీ. ఎఱ్ఱమట్టిని నోర్పు లింపార, వేదుల
గోమయం బలికించి, గోడలందు
గుల్లసున్నపుఁబూఁత మొల్లంబుగా వేసి,
ద్వారబంధములకుఁ దారుఁ బూసి
తలుపులఁ బలురంగు లలరఁగ, హారిదళ
మును ద్వారపాదసీమను నలంది
రంగవల్లులను జిత్రంబుగ నలరించి
వరివెన్నుకుంచె లేర్పడఁగఁ గట్టి

గీ. ముంగిళులయందు పండుగ(ముగ్గు లుంచి
ముగుదసింగారములఁ జూచి మురిసిపోవు
రైతుపడుచుల గృహచిత్రరచనఁ గాంచి
మునిఁగె నానందసాగరమున నతండు. 8

ఆ. వె. బచ్చు మిద్దెటిల్లు, పండాల గేహముల్,
భుక్త జీర్ణగృహము, పొలువు మీఱు
కరణము భవనమ్ముఁ గన్గొని, పొందరి
పూరిగుడిసె బండి సేరఁ, బొంత. 9

క. గుడియావాఁ డంగడిలో
నిడి యమ్ము నవాతుఁజిలుక వీక్షింపంగన్
బడిఁ జదువుకొనెడి పిన్నటి
నడువడి స్మృతిఁ బొడ నతఁడు నవ్వుకొనెఁ గడున్. 10

గీ. రచ్చకొట్టము గడచి యఱవలయిండ్లు
దాఁటి నగరాలకొంపల దరిసి యవల
దైన్య మొలికెడి సాతానిధామ మరసి
ఇంపుఁ గుల్కెడి కమసాలియిల్లు మెచ్చి. 11

గీ. నిజగృహాభిముఖమ్ముగ నిలిచియున్న
బండి నవరోహణ మొనర్చి ప్రమద మలర
గడపలో నున్న జనకునిఁ గాంచి మ్రొక్కి
కుశల మెఱిఁగించి కాంక్షలు కొనలు సాఁగ. 12

ఉ. లోనికిఁ బోవ మాధవవిలోకనపంక్తులఁ దన్పె మాతృశో
భానసబింబ మంత, నిరువంకల నిర్వురు కన్యకామణుల్
మేనిరుచుల్ వెలార్ప ననిమేషతఁ గన్నుల నాశ్రయింప, నా
మానవతీశిరోమణి కుమారుని బ్రేమను జేరవచ్చినన్. 13

గీ. నతశిరస్కుఁడై సల్పె వందనము నతఁడు;
సుతుని ననురాగ మొలయ నాసుందరాంగి
ఎదను బొదివెను; బులకించె నింతియొడలు
చనులుఁ జేఁపఁగఁ బురఁటాలిచంద మగుచు. 14

క. ఉల్ల మవశ మై యాతఁడు
తల్లియెద నఖండసౌఖ్యధాముం డయ్యెన్;
ఢిల్లికి రా జైనను దన
తల్లియొడిని బిడ్డఁ డగుట తథ్యము గాదే! 15

ఉ. కన్నులు చెమ్మగిల్ల సుతుఁ గాంచి కటాలున దృష్టి సోఁకునో
యన్న భయంబుతో నతని నారయఁబోక, ప్రయాణవార్త లె
న్నెన్నియొ ప్రేమమై నడుగ నేర్పడ నాతఁడు పూసగ్రుచ్చిన
ట్లన్నియుఁ దెల్పి సంతసము నందఁగఁ జేసెను మాతృదేవతన్. 16

చ. పదపడి లక్ష్మమాఘ్రిఁ దనపల్లవహస్తము సేర్చి ప్రేమ పెం
పొదవఁగ గోముగా నిమిరి, యొప్పుగ సుందరమందహాససం
పద తొలుకాడఁ గ్రొఁగనుల మాలతి నాదరణం బొనర్చి, స
మ్మదమునఁ దేల్చె మాధవుఁడు పొందుగ నందఱి నర్హరీతులన్. 17

క. మఱునాఁ డరుణోదయమునఁ
జరణములు స్పృశించునట్టిచందము గాఁగన్
దెఱచెఁ గనులు మాధవుఁ డ
బ్బురముగ, మాలతి బిరబిరఁ బోవఁగ నంతన్. 18

శా. 'మాలా! మాట' యటన్న నెమ్మదిగ భామారత్న మేతెంచి, ల
జ్జాలోలాక్షుల నేలఁ గాంచుచు భయస్వాంతంబునన్ దోషి నన్
లీలన్ జెంగట నిల్వ మాధవుఁడు నాలీలావతీస్నిగ్ధకం
కేళీపత్రసమానగండయుగ మీక్షించెన్ విలాసంబుగన్. 19

ఉ. కాంచి, మనంబునం దలముకాంక్షల పెంపు నడంప నోడి, కీ
లించెను సుందరీకరము లీలఁ గరమ్మున, నంతలోన సా
రించెను నిక్షుధన్వియుఁ బరింబరిఁ దుమ్మెదబారునారి, దీ
పించిన మోహకీల లెలయించు విలోచనరోచు లేర్పడన్. 20

ఉ. ఆతఁడు లేచి నిల్చి, "చెలియా! గమనించితి నీదుచెయ్వులన్,
నీతరళాక్షులందున ఘనీభవ మొందిన ప్రేమఁ జూడ నా
రీతిలకంబ! ధన్యుఁడ; ధరిత్రిని నా కెన లేరు, సుందరీ!
నా తప మిట్లు పండెను ఘనంబుగ" నంచు సమాదరంబునన్. 21

ఉ. సంపిటఁ జార్చి, నాతరుణి సాధ్వసమున్ భయమున్ దొఱంగి యా
నందమహార్ణవంబున మనంబు మునుంగఁగఁ బారవశ్యమున్
బొంది ప్రియానుషంగమునఁ బొల్పుఁ గనెన్, సుమబోండ్లు కాంతునిన్
బొందఁగ స్వర్గసౌఖ్యములఁ బూరిగఁ గాంతురు గాదె యెయ్యెడన్. 22

ఉ. ముద్దు రచించి, మోవిఁ గొని, మోహము ముమ్మర మైన నాతఁ డ
మ్ముద్దియయద్దపుందళుకుముగ్ధకపోలములందుఁ దన్నుఁ దా
నొద్దికఁ గాంచఁ జొచ్చెఁ; నయనోత్పలయుగ్మము విచ్చి మైనపున్
ముద్దరయొ నాఁగ మాలతి యపూర్వముగా మెయి నంటిసోలఁగన్. 23

ఉ. పుల్కలు దుల్కరించె మెయిఁ, బొంగె స్తనద్వయి, ఘర్మబిందువుల్
జిల్కెను బాహుమూలములు, చిత్తము ఝల్లనె, నాననంబునన్
గీల్కొనె వింతచెల్వమునఁ గెంపులడాల్, మృదులాధరంబునన్
గల్కికిఁ గంప మేర్పడెను గాంతునికౌఁగిటఁ గూరు నత్తఱిన్. 24

ఉ. ఆవనజాక్షి మాధవు సహర్నిశమున్ హృదయాధినాథుఁగా
సేవలు సల్పి తన్పుఁ దనచిత్తమునన్ దలపోసి, యాశతో
నావిధి సంగ్రహు లంటఁగ నయాచిత మై నెఱవేఱెఁ గోరికల్
భావభవాకృతిన్ బ్రియుఁడు బాహులఁ దార్చి యాదరించుటన్. 25

చ. "విడువఁడు, సేవకుల్ దిరుగువేళ, సురార్చన సల్ప నత్తయున్
దొడఁకెను, లక్ష్మి లేచు, ననుఁ దోయము లాడఁగనిండు, పాపి నై
బడలిక వాయనీయకయె భంగ మొనర్చితి మీఁదునిద్ర; తా
ళుఁడు నిముసం" బటంచుఁ జెలి లోలవిలాసమనోజ్ఞదృష్టులన్. 26

ఉ. ఆననమోహనాంగుమొగ మారసి మారకళీముఖంబులన్
మేను గలంగి తూలఁ దమి మీఱ స్తనాంశుక మోర జాఱ నా
చాన మనోహరుం బొదివె సందిట సుందరకంఠకద్వయిన్
బో నసఁగించుచున్నుఁగవఁ బొంకము బింకము రొమ్ముఁ గ్రుమ్మఁగన్.

క. తరితీఁపు లుట్టు నాసుం
దరిగాఢాలింగనమున దరిఁ గానని ని
ర్భరమోదవార్ధి నీఁదన్
దొరఁకొనె మాధవుఁడు చెలియదోర్యుగతరణిన్. 28

క. మునిపంట మోవి నానుచు
ననురాగముఁ జిందు యువతియాననశోభన్
గని, యినుమడించుమోహం
బున నామెను బాహాయుగళిఁ బొలుపొంద వడిన్. 29

చ. వెనుదెస నాన్చి యెత్తి, తనివిన్ గన కామెను నూఁచి, ముద్దు లుం
చెను నుదుటన్ గనుంగవను జెక్కిళులన్ మృదులాధరంబునన్
నునుచిబుకంబునన్ మెడను నూగు గనుబ్బెడువన్ గుచంబులన్
దనియక నీవిపైఁ గనులు దార్పఁగ లేమయుఁ దత్తరంబునన్. 30

చ. చెలువునికన్నుదోయి నొకచేతిని మూసి, మఱొక్కదాని నీ
వలఁ గను మన్నలీలఁ జెలువంబునఁ ద్రిప్పెను మోము; నాతఁ డ
క్కలికియురోరుహాగ్రములఁ గన్గొని కంచుక మించు కేర్పడన్
దొలఁగఁగఁజేసి పంటఁ, దమి తోఁపఁగ ముమ్మర మాచు నంతటన్.

మ. లలి మారేడులజోడుపండ్లచెలు వుల్లాసీదగాఁ జేయు గు
బ్బలనిద్దంపుమిటారమున్ బిగువుచెల్వంబున్ విలోకించి కో
ర్కులు రేఁపన్ నవచూచుకంబులను జెక్కుందోయిపై రాయుఁ
న్నుల నద్దు న్నగ మూర్కొను న్బెలుచ నాను న్ముద్దులన్గూర్చుచున్.

గీ. నడలు నేర్చిన పిన్నటినాఁటనుండి
ముడుపుఁ గట్టెను మనము నప్పువ్వుఁబోఁడి,
యుడుగర యొసంగె నభిమాన మొదలి గొదలి
నంతఁ గాంతునకున్ దృష్టి నలరఁ జేయ. 33

గీ. తనివి తీఱఁగఁ జుంబించి తల్పమందు
నింతి నాతండు నునుపఁగ, నింగితమును
లీల గ్రహియించి, తటుకున లేచి నిలిచి
కాంతు వెదజల్లు నాతనికన్ను లరసి. 34

గీ. గుత్తఁ గొన్నారుగా, యోర్వఁ గొనుఁడు నాథ !
పరులదృష్టిని ననుఁ జుల్కఁబఱుపఁ దగదు
వేఁడుకొందును మితి మీఱఁగూడదే? డెదను
దాసిపరతంత్రభావముఁ దలఁపఁజనును. 35

గీ. దొంగ నై పాదముల నంటఁ దొడరి ప్రతిఫ
లమ్ముగాఁ బొందితిఁ గృపారసమ్ము నిట్లు;
స్వేచ్ఛమై భవచ్చరణముల్ సేవ సల్పి
కొంగుబంగార మొసరుచుకొందు ననుచు. 36

చ. మునుకొనుభక్తిభావమున మోకరిలెన్ బ్రియుపాదసన్నిధిన్
గనుల ముదశ్రువుల్ దొలుకఁ గాంత వికుంచితదేహ యాచుఁ, బెం
పెససిన మాలతీలతిక పేరెమిఁ జందనవృక్షమూలమున్
బెనఁగొనఁ జూచులీలఁ జెలి పెంపు వహించె సమంచితాకృతిన్. 37

మ. చరణద్వంద్వము ఫాల మంటఁగ నమస్కారంబు గావించి, ని
ర్భరమోదాశ్రులఁ జిల్కరించి, తనశీర్షంబందుఁ దద్రేణువుల్
తరుణీరత్నము దాల్చి, దోసి లిడి "నాథా ! జన్మజన్మాల కీ
తరుణాంఘ్రిద్వయిఁ గొల్చుభాగ్యమును వాత్సల్యంబునన్ గూర్పవే."

మ. అని సాక్షాత్కృతదైవమున్ వరము నభ్యర్థించు సద్భక్తురా
లనఁ జెన్నారెడు మాలతీమృదులహస్తాంభోజయుగ్మంబులన్
బ్రబుతాత్మేశ్వరుమోదబాష్పకణపూరం బంత ముత్యాలు రా
లినమాడ్కిం బడ ధన్య నైతి నని మౌళిం దాల్చు నాపైఁదలిన్. 39

ఉ. గౌరవ మేర్పడన్ భుజయుగంబును జేతులఁ బట్టి యెత్తి "మా
లా! రమణీశిరోమణి! తలంతును బ్రేమపరస్వరూప విూ
తీరున మానినీత్వమున దీప్తులఁ జిమ్ముచునున్నయట్లు; చే
కూఱెను నాపురాసుకృతి కోమలి యై తరియింపఁజేయఁగన్. 40

శా. కొమ్మా! నా యనునట్టిసర్వమును గై కొమ్మా! తృణీకారభా
వమ్మున్ బూనక, నూలుపోగున నిశాబంధున్ సమర్చించుచం
ద మ్మిమ్మాకానిక నెంచఁ గోరెదఁ గృపాధౌరేయచిత్తమ్మునన్;
సమ్మానించుట యెట్టులో యెఱుఁగ నీవే; సైరింపు నానేర్వమిన్" 41

గీ. అంచుఁ బ్రాణేశ్వరిని వక్షమందు నతఁడు
బొదివి సమ్మాన మొనరించె, మోముఁదమ్మి
నాథుహృది నాన్చి మాలతి నాకలోక
పట్టమహిషీత్వ మందినభంగిఁ దనిసి. 42

చ. అనుచుఁడు నాథ! నన్నుఁ బ్రియమారఁగ, రెండుసుదీర్ఘవర్షముల్
గనినవియోగవహ్ని ననుకంపమెయిం దొలఁగించి నవ్యజీ
వనము నొసంగినారు; సెలవా? తలవాఁకిలి విచ్చి పల్కు—నక్
జనుదు నటంచుఁ జుంబనము సల్పెను నాథునిమోవి కీవిగన్. 43

మ. కలకంఠాంచితకంఠచుంబనమునన్ గాంక్షల్ పిసాళింప, గు
బ్బలపై దృష్టినిఁ బర్వఁజేసె నతఁ, డాభావంబు నూహించి చే
తులఁ బ్రాణేశుకరంబులన్ గొనుచు ముద్దుల్ గుప్పె నవ్వానిపై
నలరన్ ఘట్టకుటీప్రభాత మనున్యాయం బౌట శంకించుచున్. 44

గీ. వలదు వల దంచుఁ దరితీఁపు లోలయఁజేయుఁ
బోదుఁ బోదు నంచును గాంక్షఁ బొడమఁజేయు
తగదు తగ దని యనురక్తి నెగయఁజేయు
లోలనేత్ర విమోహేంద్రజాలమహిమ. 45

గీ. ముంగురులు మోముఁదమ్మిపై మొనసియాడ
  వ్రేలుజడనుండి నలిఁగినవిరులు రాల
  మాలతినిఁ జేరఁగ శయనమందిరమును
  వీడి వెరటికిఁ జను లక్ష్మి వెంటనంటె. 46

శా. "అమ్మా! యిప్పుడు లేచితే!" యనుచు దేవార్చావిధుల్ దీర్చి మో
  ద మ్మేపారఁగఁ బోవు సత్తనుడు లంతన్ వీనుల న్సోఁకఁ, జి
  త్త మ్మందుం గడుఁ దత్తరం బలమ "నాధా! వత్తు నుండుండు, మీ
  యమ్మ న్వీంటిరె" యంచు మాలతి చనెన్ వ్యగ్రాత్మ యై మెల్లఁగన్.

వ. పదపడి మాధవుఁడు కల్యంబులఁ దీర్చి కవోష్ణవారి మజ్జన మొనర్చి తనగదికిం జనునంత వలయుదుస్తు లుచితస్థలమున సజ్జితమ్ము లై యుండు టరసి సంస్మితాననుఁ డై యాది మాలతీకృత్యంబుగా నెఱింగి, ధరించి, యంత. 48

శా. సీమంతోభయపార్శ్వవేణి నరయన్, సింగారముల్ గుల్కఁ నా
  సామర్థ్యం బయి యర్థవృత్తములు విస్పష్టంబు లై కానరాన్,
  శ్యామాధఃకృతపక్ష్మలంబు లతివాత్సల్యంబుఁ జిందన్, సుభ
  ద్రామాన్యాకృతిఁ దోఁప నాతఁడు వినమ్రాంగంబు శోభిల్లఁగన్. 49

గీ. నాచిరంతనపుణ్య మీ నాకసురభి
  యన్నపూర్ణామహాదేవి యనఁగ నన్నుఁ
  దనుపఁగా నుపాహారముఁ గొనుచు వచ్చె
  నని తలంచి మాధవుఁ డాత్మ జనని కెరఁగి. 50

గీ. సంస్మితానన యై సుతుసమ్ముఖమున
  బల్లపై ని నల్పాహారపళ్య ముంచి
  బాబు! మొసవరా! యనుచు సుభద్ర యతని
  కభిముఖంబుగ నాసీన యయ్యె నంత. 51

గీ. ఆతఁ డాప్యాయముగఁ దిన నంతఁ దొడరి
"అమ్మ! యిదియేమి యీపదార్థమ్ములందు
నమృతమాధుర్యమును దావి యవఘళించె
నెంతవాత్సల్యపూర్ణ మా నెడఁద నీది." 52

చ. అనునెడ వారిఁ గొంచు నట కాదట వచ్చిన లక్ష్మి చెంతఁ గూ
ర్చొనఁగ, సుభద్ర నవ్వుచు "రుచుల్ గడు మెచ్చుచునుండె నన్న, నే
నొనరిచియుండు నన్న భ్రమ నొందినయట్టులఁ దోఁచె, మాల వ
చ్చినమఱునాఁటినుండి ననుఁ జేకొననీయదు పాకకార్యముల్. 53

మ. వలదమ్మా! యనఁ జిన్నవోవు, సకలవ్యాపారముల్ దాన యై
యలవోకన్ సరిదిద్దుఁ, గాల మిసుమంతైనన్ వృథా పుచ్చ, ద
న్యుల కొక్కించుకచో టొసంగక యనూనోత్సాహసంయుక్త యై
మెలఁగున్, గాల మెఱింగినట్టిగృహిణీ మించున్ క్షమాసంపదన్.

ఆ. వె. శుచియు రుచియుఁ బొదుపు సుళువును వెలయించుఁ
బచనకార్యమందు బాల మివులఁ
జేతిసారము నుతి సేయు నశక్య మా
మాల సకలసద్గుణాలవాల. 55

ఉ. మీాజనకుండుఁ గోడలిని మెచ్చుకొనెన్ బలుసారు లొంటిమై,
భాజన మయ్యె సేవకులప్రస్తుతికిన్ గృహలక్ష్మి నాఁగ, నా
రీజనరత్న మాయమ తరింపఁగఁ జేయును రెండువంశముల్
తేజము నించి, యంచితసతీతిలకం బనఁ జెల్లు మాలతిన్. 56

ఉ. పీసము గర్వమా? వెకిలివేసములా? దుడుకుందనంబ? పే
రాసల? మిట్టిపాట? యిసుమంతయుఁ గానము, నందనీయు, యే
దోసము నెన్నరాని గుణతోయధి మాలతి కోడ లౌట నేఁ
జేసినపుణ్య మా, వినుతి సేయఁగఁబోలును నామె నేర్పడన్." 57

వ. అని సుభద్ర మాలతినిఁ బ్రశంసించునవసరమున. 58

సీ. వలుదపెన్నెరిముడి చెలువార నంసభా
గమ్మున విరి తావిఁ గ్రమ్ముచుండఁ
జిల్కపచ్చనిపొత్తిచీర వెన్కను బింజ
యలరఁ గుచ్చిళ్ళుందు నంద మిడఁగఁ
గాంచీపురపుఁబట్టుకంచుకంబున డాఁగ
నోడి గుబ్బలు గ్రుద్దులాడఁదొడఁగఁ
గటిసమృద్ధియు నురోగాంభీర్యమును ద్రొక్కు
లాటఁ గా నసియాడి యలఁతఁ గాంచఁ

గీ. దిలక మలికంబునన్ ముద్దు లొలుకఁ, గులుకు
నడలు రాయంచగరువము నడఁప, రజత
పాత్రఁ గాఫీని గొనివచ్చు పంకజాక్షి
మాలతిన్ గాంచి యంతట మాధవుండు. 59

క. కనుసన్న జననివాక్యము
లను నాఁపి ముఖంబునన్ విలాస మొకింతై
నను గనసీయక మాలతిఁ
గనుఁగొననివిధంబునఁ బలుకందొడఁగెఁ దగన్ 60

క. "బాడ్డాడని బిడ్డలపై
గడ్డుపనులఁ బెట్ట నిట్టిగతినే యుండున్
ముడ్డికిఁ బే డంటుటయే
దొడ్డతనమ ? బండి నీడ్వఁ దొడఁగునె పెయ్యల్ 61

క. కులగోత్రము లెన్నైనన్
మలమూత్రము లొకటి యైనమాడ్కిని నాంగ్లే
యులచదువులు చదివెడి కాం
తలకున్ దలబిరుసు మొదు తప్పక కలుగున్ 62

ఆ. వె. చేతవాఁతఁ గాదు; చెప్పిన వినఁబోరు
బద్ధకమ్ము, మిడిసిపాటు, గోటు
నీల్గు, ప్రల్లదనము, నెఱజాణతన మధి
కమ్ము; యూఁక దంచఁ గలరు వీరు. 63

గీ. చెల్లి కోపించు నీకఁ బల్కనొల్లఁ గాని
ఇంచు కిద్దాని నోటను నుంచు మమ్మ !
తెలియు దొరసాని ఘనపాకకళభృశమ్ము
నాలుకన్ గడ్డి మొలచు నీనాఁటినుండి." 64

వ. అని మాలతియాభిముఖ్యంబు గాంచి తటుకునఁ బ్రసంగము నాఁపు
లీల నటించునవసరమ్మున నాయమ సమీపించి. 65

ఉ. ఆకులచిత్త యై ప్రియునిరాదరవాక్యము లాలకించి యే
దో కడుతప్పు సల్పి తని తొయ్యలి సంకుచితాంగి యౌచు దై
న్యాకృతిఁ బాత్ర బల్ల నిడి యావలికిం జనె మాఱుమాటయే
లేక ప్రియాగ్రహానలము క్లేశముఁ గూర్పఁగఁ జూడ నోడుచున్. 66

మ. కుహనాభాషల కల్గి మాలతి చనన్ "గూర్మిల్ పిసాళింప న
న్వహమున్ గోడలిఁ జూడఁగావలయు, నీభావంబు నూహింప కా
గ్రహమున్ బూనె గ్రహించినాఁడవె కుమారా! మాల సద్వృత్తమున్
సహనం బిప్పుడ కాంచితే" యనుచు వాత్సల్యంబు పొంగారఁగన్. 67

వ. సుభద్ర లేచి యామె నోదార్చి కొనివత్తు నుండుఁ డని చిఱునవ్వో
లయఁ బాకశాలకుం జని, యందు. 68

గీ. కుములుకుంపటి నా వ్యథాకులిత యగుచు
నిడుదయూర్పులఁ బుచ్చుచు నేల దృష్టు
లోలయు మోజనాధీన యై యున్న బాల
జాలిగొల్పఁగఁ జెంతకుఁ జని నిలువఁగ. 69

గీ. ఆమెఁ బొడఁగాంచి మాలతి “యత్త! చేత
గాని నావంట యిష్టము గాకపోయె;
నెట్టు లిష్టమొ కనుఁగొని యెఱుఁగఁజేయ
దిద్దుకొందును నీ వేఁగి తెలిసికొనుము. 70

గీ. తెలియరాకుండె వా రిట్టి తీవ్రభావ
లాడఁ గత మేమొ! చదువుకొన్నంతమాత్రఁ
దలబిరుసు కల్గు ననుట న న్నలఁచుచుండె;
నైన నాగర్వమే హేతు వంతటికిని. 71

చ. కసిబిసి చేసి నోట నిడఁగాఁ దొలఁగించిరొ! మీకుఁ దృష్టికై
విసముపిధాన మ్రింగిరొ! వివేకము గోల్పడి నొవ్వఁజేసితిన్
బసరములీల, నొంచుతినుబండము జేసెదఁ బావుగంటలో
నొసఁగుఁడు; వారి నాఁకటను నుంపఁగ నాతను వేల కాల్పనా?” 72

క. అని ‘యుష్మా’ చేయుటకై
చనుకోడలిఁ గాంచి సంతసము నిర్భర మై
కనులను బాష్పము లురలఁగ
దను వంత సుభద్ర మఱచి తా నుండంగన్. 73

మ. ధవుఁ డేతెంచుట పాదరక్షయుగశబ్దస్ఫూర్తి నూహించి హా
సవిలాసాంచిత యై ప్రియాభిముఖ యై సమ్మానమున్ జూప నా
ధవళాంభోరుహనేత్ర యేఁగి సలిపెన్ దద్యోగ్య మా నర్చనల్
విభాత్మస్మృతు లంతసంతఁ దనహృద్వీధిన్ బ్రకాశింపఁగన్. 74

శా. అంతన్ మాలతి నమ్ర యై యటకు రా, “నమ్మాయి! యబ్బాయి నీ
వంటే; చేకొని పొమ్ము; మామ కిట సంప్రాహార మే నుండి వీ
క్షింతున్; సిగ్గిలనేల బావకడ; లక్ష్మిన్ బిల్తు నిచ్చోట నా
క్కంత తామెన్ జనిఁగొందు” నంచుఁ బనిచెన్ గ్రీఁగంట నీక్షింపుచున్.

సీ. పలుకరించునో లేక యలుక ముమ్మర మైన
నను జూచి తా నూరకొనునో! ప్రియుఁడు
ఇదివఱ నాతని కింపుఁ గూర్చునో! దుర
దృష్టమ్మువల్ల ననిష్ట మగునో!
అభిమతశాకపాకాదులఁ బ్రశ్నించు
టర్హమా? యత్తయే యడుగఁదగునో!
ఎన్నఁడు నిగ్రహ మీలీల నాథుఁడు
గోల్పోయి విరసముఁ గూర్పలేదె?

గీ. మఱపురాని ప్రాభాతసమయమనోజ్ఞ
మధురమూర్తి యీవిధముగా మాఱెనేమొ!
అని తలంచు చల్పాహారమును నొసంగ
నరుగుమాలతి కభిముఖ యైనలక్ష్మి. 76

మ. "వదినా! యే మిది? యమ్మ నన్నుఁ బిలిచెన్ వత్తున్, సరే! పొమ్ము నె
మ్మదిగా; నాగ్రహ మెక్కుఁ డౌను; తగ దీమాత్రంబుకే యాతఁ డ
ట్లదయన్ బల్కుట; యైన లెక్కఁగొన కేలాగైన సంతృప్తిఁ గూ
ర్పఁదగున్ గాదె విసీతిమై; పతిహితారంభంబు సామాన్యమే." 77

క. అని స్మేరానన యై చన,
మనమున భయసంశయములు మల్లడిఁ గొనఁగన్
వనితామణి విభుఁ గడకం
టను గాంచుచు నంతఁ జనెఁ దడంబడఁ బదముల్. 78

ఉ. పళ్లెము బల్లపై నునిచి బాలవికుంచిత మైన మేనుఁదీ
వల్లల నాడ గద్గదిక పల్కులఁ దుల్కఁగ "స్వామి! నేఁడు వా
టిల్లిన తప్పు సైఁపుఁ; డిఁక నెన్నఁడు నీక్రియ మీతిరస్కృతిన్
బెల్లు దహింపఁ బొల్పడక పేరిమి దిద్దుకొనంగఁ గోరెదన్. 79

ఉ. నేర్వమి కల్గవచ్చు, నను నింద యొనర్చిన మేలు కల్గునే ?
గర్వ మొకించుకైనఁ బొడకట్టెనె వర్తనమందు మీకు ? మ
త్సర్వముఁ ద్వత్పదాంకితము సల్పితి, నన్యనె ? తూలనాడ నే
నోర్వఁగ నేర్తునా ? కరుణ నోడక చూడఁగ వేఁడుదున్ బ్రియా ! 80

శా. మీకున్ బుద్ధులు దిద్దఁ బాల్పడితి స్వామీ ! యేమి నామౌఢ్య; మే
దో కోపంబున నొవ్వఁబల్కి రని యెంతున్; గ్రొత్తయే సత్కృపా
శ్రీకల్యాణకటాక్షవీక్షణము; దాసిన్ దన్పఁగాఁ బ్రేమతోఁ
జేకొం డియ్యది; ప్రాఁతనేరమును మీచిత్తంబునన్ సైఁచుచున్." 81

ఉ. అంచు సుమాంగి బాష్పముల నాఁచెడిరెప్పల విప్పి దృష్టి సా
రించెఁ బ్రియాకృతిం గన; స్రవించఁదొడంగిన నీటిబుగ్గలన్
మించిన కన్నుదోయి నలమెన్, జలధార లపార మాచుఁ బ్రో
క్షించె నురోరుహంబు లెదఁ జేష్పడఁ జల్లదనంబు పెల్లుగన్. 82

శా. దుశ్చర్యన్ గడు నొవ్వఁజేసితిఁ జెలిన్ దోషంబు పెల్లయ్యెఁ బ్రా
యశ్చిత్తం బెది యంచు మాధవుఁడు నూహామగ్నుఁడై యాత్మలోఁ
బశ్చాత్తాపము ముమ్మరం బయి వ్యథాభారంబు పైఁ గ్రమ్ముచున్
నిశ్చేష్టాకరణమ్ములన్ దనువు గ్లానిం బొంద నొక్కమ్మడిన్. 83

చ. బొటబొటఁ గారుబాష్పకణముల్ గమనించి నిజేశుఁ డెంతయున్
సటమటఁ గాంచు టోర్వక "ప్రియా ! తగ దీక్రియఁ జింత నొంద, న
క్కట ! కుటిలాత్ము నై కలఁచి కన్నుల నీ రిడఁజేసికొంటి; మి
మ్మిటు లెటు లేను గాంతును ? క్షమింపుఁడు నేరము నాదరంబునన్."

మ. అనుచున్ బాలకురంగనేత్ర నిజచేలాగ్రంబునన్ వారి నొ
త్తెను బ్రాణేశ్వరుఁ జేరి; మాధవుఁడు "నాఁతీ ! నన్ను సైరింతువా ?
నిను నిష్కారణ మెంతయో యలఁచితిన్; నిక్కంబుగాఁ బాపి నై
తిని; నాదోషనివారణం బెటుల సాధ్వీ ! సాధనార్హం బగున్." 85

ఉ. ప్రస్తుతి సల్పితిన్ దెలియ; పాకచమత్కృతి నాత్మ మెచ్చి; 'నీ
యీస్తుతు లన్ని చేరు నళినేక్షణ మాలతి' కంచుఁ బల్కి నిన్
నిస్తులభంగిఁ బ్రస్తుతు లనేకము సల్పెను గన్నతల్లి; నీ
వాస్తుతివాక్యముల్ వినఁగ నర్హము గా దని యుల్లసంబునన్. 86

చ. నిను గమనింపనట్లు తరుణీ! పచరించితి వక్రభాషలన్
జను నిది యింతమేర యని స్వాంతమునన్ దలపోయ నైతి; నీ
మనమునఁ జిచ్చు వెట్టి కొఱమాలినవంతలఁ జిక్కి స్రుక్కితిన్;
వినిచితి సత్య మియ్యది వివేకవిదూరుఁడ నైతి మాలతీ! 87

గీ. ఎంతదురపిల్లితో సఖి! స్వాంతమందు;
నిర్దయాత్ముఁడ నన్ను మన్నింపవలయు;
మరల శ్రమ నొందితే క్రూరమానసుండ
నైన ననుఁ దన్ప నీలీల నమృతహృదయ!" 88

క. అని మాలతి చేదోయినిఁ
దనచేతులఁ బట్టి ప్రేమ తళ్కొత్తఁగ వేఁ
డెను మాధవుఁడు క్షమాభి
క్షను; దుఃఖము నీటవ్రాఁతచందము కాఁగన్. 89

ఉ. నీరజపత్రనేత్ర నవనీతము నాఁ బ్రియుఁ డంటుమాత్రఁ జె
న్నారెను, ఖేద మించుక కనంబడ దయ్యెను, శారవశ్య మే
పారెను, బుల్కరించె మెయి, పార మెఱుంగని ప్రేమవార్నిధిన్
దీరసమీపవీచికలతీవ్రత నేరు గణింత్రు మిన్నఁగన్? 90

సీ. హాస్యము నూహింప కాత్మేశ్వరుని నొవ్వఁ
జేసితి నే నెంతచెనఁటి నైతి
నశ్రువారిని గ్రమ్మ నయ్యెను నాచెల్వుఁ
జెలువంపుఁగందోయి చెన్ను దొఱఁగి

కలుములపంట నాకల్యాణసంధాత
హృదయమార్దవము నామదికి నెక్కఁ
జిత్రంబుగా నేఁడె చెలరేఁగె మోదజఖే
దమ్ములు పవలురాత్రమ్ములఁ బోలె

గీ. నత్తె యీలీల మాప్రేమ సతిశయింపఁ
జేయ నేకాంత మొదఁగూర్చెఁ, జింతఁ జేయఁ
బ్రియుసమాకృష్ణ నగుట కీరీతి సంఘ
టించె దైవ మటంచు నూహించి సుదతి. 91

గీ. "చిత్తజాకార ! నవనీతచిత్త ! కడచెఁ
బీడకల; దాని మఱవఁగ వేఁడుకొందు;
దాసి ననుఁ దన్న మీర లిద్దానిఁ గొనుఁడు
నోరుఁ దెరువుఁ" డటంచు నన్నీరజాక్షి. 92

శా. అల్పాహారము బిడ్డకుం గుడుపున ట్లాత్మేశునోటం దగన్
నిల్పెన్ మాలతి చిన్నముద్ద, నతఁ డానిద్దంపుసింగారిప్రేల్
బొల్పారన్ మునిపంటఁ బట్టి తరితీఁపుల్ గ్రమ్మ నేత్రంబులన్
సల్పెన్ భావభవాభిరామ మగు సంజ్ఞల్ గాంక్ష లుప్పొంగఁగన్. 93

శా. "ప్రేలున్ మ్రింగెద రేమిచోద్యము ప్రియా ! వీక్షింపుఁ డీచక్కి మి
మ్మాలోకించు నివేదితం బయినయల్పాహార మొక్కింత, మే
ల్మే లీచెయ్యలు నాగడంబు తగ దీమేలంబు చాలించుఁ డే
వేళాపాళయు లేదె ? యత్తఁ బిలుతున్ వేవే భుజింపంగదే !" 94

క. అని, యనునయ భయ వినయము
లను బ్రేమను బొదివి, ప్రియు విలాస మెలర్పన్
దనియించుచు మాలతి కుడి
పెను; నాతఁడుఁ జిలిపితనము పెంపెనయఁ దుదిన్. 95

శా. "మాలా! తాళఁగఁజాల దాహ మలమెన్ మన్నించి పాసీయ వీ
వే లోలాక్షి బిరాన" యంచు హృదయోద్వేగంబునన్ సుందరిన్
లీలన్ బాహులఁ దార్చి మోవిచవి హాళిం గ్రోలఁ, దబ్బిబ్బు లై
నాళీకాస్య తటాలునం బడియె విన్నాణంబుగా నాథుపైన్. 96

చ. ఒడి నుడురాజబింబముఖి యోసరిలన్ బిగికౌఁగిలింత లే
ర్పడెఁ, గడముట్టె మోహము, త్రపాస్మృతులచ్చము మచ్చుమాసె, న
ప్పుడ యొకఁగూడె శాంతి; తలఁపుల్ వలపుల్ బులుపుల్ సమాజపుం
గడబిడ లెల్లఁ బెల్లడఁగఁగా సవికల్పసమాధి నిర్భరున్. 97

ఉ. పెద్దయుఁబ్రొద్దుఁజొక్కి స్మృతిపెంపెనయన్ బ్రియుబాహుబంధమున్
నొద్దిక విచ్చి లేచి, నయనోత్పలయుగ్మము విచ్చి చెల్వునిన్
ముద్దులగుమ్మ కాంచి పొలుపుం బిలిపిందనమున్ వెలార్చుచున్
దద్దయుఁ గొట్టవచ్చుకనుదమ్ములు చిత్తముఁ జొక్కఁజేయఁగన్. 98

శా. శౌరా! యెన్నియుగాలు సాధనము సేయన్ ధాత విన్నాణి యై
ఈరాకావిధుబింబ మిట్టిగతి సృష్టించెన్, సుధాశైత్యశ్రీం
గారమ్ముల్ సరిపాళ్లు గట్టి సలిపెంగాఁబోలు నీకన్నులన్,
నారీమన్మథుఁ డీతఁ డౌను, గనె ధన్యత్వంబు నాజన్మమున్. 99

ఉ. అంచుఁ దలంచి చెక్కిళుల నంటినకుంకుమ చేలఁ దుడ్చి మో
హాంచితదృష్టులన్ గనుచు హాసము తుల్కఁగఁ 'బోయి వత్తుఁ; జా
లించుఁడు దొంగచూపు' లని లేచు భుజించినపళ్లెరంబులన్
గొంచుఁ జనెన్ గటాక్షములఁ గోర్కులు పర్వఁగఁజేయు చేర్పడన్.

శా. పూర్వాపూర్వవివేకసంస్కృతుల నిప్పూఁబోఁడి శోభిల్లి హృ
త్పూర్వాకారము దాల్చెఁ; బ్రాచ్య మగుచు న్పాశ్చాత్యమున్గూడి ని
ర్గర్వాహంకృత యాట శీలము విమర్శాదృష్టి పెంపారుటన్
సర్వాతిక్రమనూతనత్వమున నక్రాంతంబుఁ జెన్నారెడిన్. 101

శా. పాశ్చాత్యాభిరుచుల్ స్వకీయగుణభావాలాపవేషంబులన్
నిశ్చింతన్ జను లాశ్రయించుట మహానింద్యమ్ముగా నెంచుచున్
బశ్చాత్తాపము నొందఁగోరు సఖి, విభ్రష్టాత్ము లై యందు లా
దుశ్చారిత్రల నెత్తి మెట్టె వృజినోద్ధూతార్యసచ్ఛీల యై. 102

ఉ. గణ్యచరిత్ర యీ చెలి, యగాధ మమర్త్యము నై నప్రేమ నా
పుణ్యముకోర్దిఁ బొందితి; నపూర్వము గాఁగ; క్షణక్షణంబుఁ బ్రా
వీణ్యము మీఱి న న్ననుపు; విజ్ఞత నమ్రత మాటలందు నై
పుణ్య మనన్య; మార్యనుతభూరికళాకలితాత్మ చేకురెన్. 103

ఉ. ఎంగిలియింగిలీషునుడు లిన్ని గ్రహించినయంతమాత్రఁ గ
న్నుంగవ నెత్తి కెక్కఁగ ఘనుల్ తమకంటెను లే రటంచు ను
ప్పొంగెడి యాత్మవంచకుల బుద్ధులు శుద్ధ మొనర్ప దిద్దఁబో
లుం గుణశీలవిజ్ఞతల లోలవిలోచనమాల యొజ్జ యై. 104

సీ. ఆచారదాస్యంబు నంగీకరింప, ద
నాచారములపొంత కరుగఁబోదు;
ఈసడింపదు పెర నెల్లను; నాత్మీయ
మఖిలము ఘన మని యరయఁబోదు;
వ్యక్తివివేకగుణార్హతల్ గణియించు,
నేకోదరులుగ భావించు జనుల;
మానవత్వంపుఁబ్రమాణము లక్ష్యించు,
నాత్మవంచకవిభేదాళిఁ దెగడు;
గీ. మాతృకుల మైన స్త్రీలోకమాన్యశీల
సమానవినయానురాగప్రసన్నహృదయ
శాంతినిస్వార్థములు గల్గి కాంత వెలసె
నాపురాకృతపుణ్య మెన్నంగ వశమె ? 105

క. అని మాలతీగుణాదుల
మనమున నూహించుకొనెడి మాధవుహృదయం
బున మెఱుఁగుఁదీవ వడువునఁ
గనుపట్టెను మధుకుమారి కమ్రాకృతి యై. 106

ఉ. ఆనవమోహనాంగమహితాకృతి కాండపటంబునందు శో
భానవకంబు లుట్టిపడు బ్రాంచితచిత్ర మనంగఁ దోఁప, మో
దానునయంబు లొక్కమొగి హద్దులు మీఱెను; పూర్ణిమానిశా
జానిసమంచితోదయము శాంతమహోదధి రేఁచు కైవడిన్. 107

ఉ. మానసమానసోర్మికల మంజులరాజమరాళి హాళి నై
కానఁగవచ్చులీల మధుఁ గాంచి యథార్థముగా భ్రమించి స
మ్మాన మెలర్ప స్వాగతము మానిని కేఁ దలపోసి లేచె; వే
దానుకృతజ్ఞతాస్మితము లొప్పులు గుల్కఁగ మోముఁదమ్మిపైన్.

ఉ. శూన్యము గాంచి నవ్వి యటఁ జూపుచు నాసన మొందు "మానినీ !
ధన్యుఁడ నైతి నీ విటుల దర్శన మిచ్చుటఁజేసి, మేము సా
మాన్యుల మాట మీాదృశుల మన్నన సల్పు టెఱుంగ; మైన నీ
వన్యముగాఁ దలంపక దయామతిఁ గొమ్ము మదీయసత్కృతుల్."109

చ. అని, తనముందు నిల్చినప్రియుఁ మధుగాఁ దలపోసి పల్కు చె
ల్వుని ననురక్తి మై దరిసి 'పూజ్యులు దా మిటు గౌరవింపఁగాఁ
జనునె ? కటాక్షవీక్షణము చాలదె దాసి' కటంచుఁ బల్కి యా
సనమునఁ దన్నుఁ గూర్చొనఁగసల్పిన మాలతిఁ గాంచి యంతటన్.110

చ. కళవళ మంది మాధవుఁడు గ్రన్ననఁ జిత్తముఁ జిక్కఁబట్టి న
వ్వులవెలయింప యత్నము నపూర్వముగాఁ బొనరించుచుంటఁ జూ
పులఁ బసికట్టి మాలతి నిగూఢముగా మది సంశయించి, యి
య్యలఘుచరిత్రుఁ డిట్టిగతి నారట మొందుట కేమిహేతువో. 111

గీ. అంచుఁ దలపోసి "ప్రియ! మీరు వ్యగ్రచిత్తు
లైతి రేమి? మీ కష్టము లైనశాక
ముల నెఱుంగ వచ్చితిని; నావలన దోసఁగు
పొసఁగెనేని మన్నింపఁగ మ్రొక్కుదాన. 112

గీ. మీరు సామాన్యులా? నన్ను గౌరవింప
నెఱుఁగరా! శునకమునకు నిట్టిలీల
రాచమరియాద సల్పఁగరా దటంచుఁ
దెలియదా? యిట్లు నొప్పింపఁ దలఁచు టేల? 113

గీ. కనుల మిముఁ జూడవలె నను కాంక్ష నాఁచు
కొనఁగ లేకెవ్వియో సాకులను వెదకుచు
నరుగుదెంతును మీచెంత; కంతె గాక
ఎన్నఁ డేడ్చితి మఱియాద లిడఁగ స్వామి! 114

చ. ఒకచిఱునవ్వు, ప్రేమమధు వొల్కెడి 'మాల' యటన్నపిల్పుతో
సకలము విస్మరింతు; గుణసాగర! నామన మింతకాలమున్
అకటకటా! యెఱుంగరె? తృషార్తికిఁ గార మొసంగులీల నీ
వికృతపుగౌరవం బిడుట విజ్ఞతగాఁ దలపోయవచ్చునే? 115

క. కొఱమాలినగౌరవమును
నెఱపి సఖిన్ జిన్నఁబుచ్చ నేర్పు లుడిఁగి, మీ
కరుణారసమ్ముఁ జిందుఁడు;
తరియింతు, సుఖింతు, మివ్రులఁ దనియుదును బ్రియా!" 116

క. అని పరిదేవన మొనరుచు
సనుదాగతరంగిణీసమాకారసతీ
ప్రేంఖత్స్వాపమును గని
కనులు సెమర్పఁగ నతఁడు గద్గదికమునన్. 117

శా. "మాలా! బేలవు; నామనం బెఱుఁగ కిమ్మాడ్కిన్ వ్యథాభారవై
చాలం దూలితి వేమి చెప్పుదును వీసం బైన నిన్నొంపఁగా
నాలోచించినవాఁడఁ గాను; జెలివై యానందసంధాత్రివై
నాలో నిత్యము తేజరిల్లు నిను నేనా? నొవ్వఁగాఁ జేయుదున్. 118

శా. కల్యాణీ! గుణశీలరూపముల నిర్గర్వంబునన్ మైత్రిఁ ద్వ
త్తుల్యన్ నాసహపాఠి నొక్కతెను నీతోఁబుట్టువే యన్న సా
ఫల్యం బొనుడి; యామెఁ గూర్చి తలఁపన్ బొల్పడ్డ, నీ వంత సా
కల్యం బేర్పడ నేఁగుదెంచితివి; సత్కారంబుఁ గావింపఁగన్. 119

శా. నీవే యాసుకుమారి వన్నభ్రమఁ దన్వీ! పల్కు నావాక్యముల్
నీ వీలీల సమన్వయించితివి; నా నేరమ్ము సైరింపు రా
జీవాక్షీ! విభవాభిరామ యగు నాస్త్రీరత్న మార్యస్తుతం
బై నైదుష్యవినమ్రమతీసహితమై వ్యక్తిత్వ మేపారెడిన్." 120

వ. అనిన, మాలతి విచలితయై యెడంద జల్లుమన మోమున విన్నఁదనం బొలయ మాధవప్రముఖలక్షణంబు లుపలక్షించి రాకాసుధాకరబింబోపమానం బగు నెమ్మొగంబున నైర్మల్యాకర్షణమ్ములు యథాతథమ్ముగాఁ బెలువారుటఁ గాంచి, యగ్ని కళుచి నంటఁగట్టితినే యని నాలుకఁ గఱచుకొని, మదిఁ గుదురుపఱచుకొని చిఱునవ్వు చెంగలింపఁ "బ్రియా! మీ యావేశహృదయము నవగతమ్మొనర్చుకొనఁజాలని బడుగుమానిసిని. నన్ను మన్నింపుఁడు. ధన్యురాలగు నాసోదరీమధురనామాక్షరంబు లెఱుంగఁ గోరుదు. విన నర్హమేని యా విద్దెలమేలుబంతిచరిత్ర మామూల మెఱుంగఁజేయఁ బ్రార్థన" యనుడు, నాతఁడు "మాలా! యామెచరిత్ర మొక దివ్యప్రబంధమనఁ జను. ఆమెనామధేయము మధురకుమారి. సంక్షిప్తంబుగ మధునా వ్యవహరింతురు. సావకాశమ్ముగా మీ కెఱింగింపవలయు ననియే

తలంచియుంటి. భోజనానంతర మామెఁగూర్చిముచ్చటించుకొందము."
అనిన మాలతి హాసస్ముఖి యై ప్రియాభిమతమ్ము లగు శాకంబు
లారసి చన నుంకించుఁడు నాతఁడు మాలతీమోష్టసంపుటిం జూపుఁ
డు నాయమ ముక్కుపై వ్రేలు నాన్చి బుద్ధి! బుద్ధి! యని హెచ్చ
రించుచు నొయ్యార మ్మొలయఁ జనియె. ఆమె నాలోకించుచు
మాధవుఁడు. 121

శా. మాధ్వీమంజులకోమలామలలసన్మాన్యాత్మ దేహంబుల౯
విధ్వస్తాఖిలకల్మషౌఘసదసద్వేతృత్వభావంబులన్
సాధ్వీలోకశిరోవతంస మగు భాస్వచ్ఛీలవృత్తంబుల౯
ప్రధ్వంసం బొనరించె మామకఘనప్రారబ్ధపాపంబులన్. 122

శా. అంచు౯ భావన సల్పి; చిత్తమున హృద్యం బైన రూపంబుల౯
ప్రాంచత్తారకలట్ల మాలతి మధుప్రాలంబ యై తోఁచినన్
మించె౯ హర్షము; సౌమనస్యము సమున్మేషంబునుం బొంద నీ
మించుంబోండ్లవినూతనప్రియము గూర్మిన్ గూర్చు నశ్రాంతమున్.

మ. ఇది యోగ్యంబు ప్రవర్ధమాన మగున ట్లీమైత్రి నే నింక దో
హదమున్ సల్పుదు; నిర్వురున్ బ్రణయదివ్యాకారసౌజన్యసం
పదలన్ దుల్యులు మాననీయులు జగన్మాంగళ్యకాంక్షల్ దురా
సద మా మానవజీవితైకఘనలక్ష్యప్రేక్షితల్ శిక్షితల్. 124

మ. మధు నిస్స్వార్థ, సురాపగాసదృశప్రేమ; న్మాల భాగీరథీ
మధురాంబఃపరివాహినీప్రణయ, ధర్మప్రేరితం బయ్యె నీ
విధుబింబాస్య ప్రయోజనార్థి యగుటన్ విశ్వాంతరవ్యాప్తియం
దధమం బౌ; పరిధుల్ మధుప్రణయమం దాలోకనాసాధ్య మా. 125

శా. విశ్వాసార్హవిమర్శనానునయధీవిజ్ఞానలోకజ్ఞతల్
శశ్వచ్ఛీలవిశాలచిత్తముల లేశం బెక్కుఁ డన్నన్ మధున్

ఆశ్వాసించుటగాఁ దలంప; మది సత్యం బిద్దిగా నెంచుఁ దా
నిశ్వాసంబును బుచ్చఁబోక చెలియున్ నిర్మత్సరస్వాంత యై. 126

గీ. అంచుఁ దలపోయునవసరమందు లక్ష్మి
"వదినగారిచిత్తం బింత కుదురుకొనెనె?
ఆమెఁగూర్చియె యోచింతు వనుకొనెదను;"
అని స్మితానన యై చెంత కరిగి నిలిచి. 127

క. "చిన్నన్న లేకపోవుట
వన్నె తరిగె శోభ; యొక్క వారము మాతో
నున్న సరే; లేకున్నన్
ఎన్నఁడు మఱి జాబు వ్రాయ నీక నని నిన్నన్. 128

గీ. జాబు వ్రాసితి నీరాకసంగతియును,
జిన్నవదిన మాతోడ వచ్చినవిధంబు;
రెండుమూనాళ్లలోన రాకుండఁ బోదు;"
అనిన సోదరికే లాతఁ డంతఁ బట్టి. 129

గీ. "చెల్లి! నీచిత్త మనురాగసింధు వమ్మ!
నేనె వ్రాయంగ నూహించినాను; గాని
తీఱుబడియె లేదయ్యెఁ; గంగారు వెట్టి
మాల నోంచినప్పటినుండి మనసు చెడియె. 130

మ. ఇదిగో! వచ్చెద రేపు మాపు నని నా కెన్నెన్నియో లేఖలన్
బదిమాసంబులనుండి వ్రాసి విసుఁగున్ బల్మాఱుఁ గోపంబుఁ బెం
పొదవం జేసె క్షమాపణల్ దెలిపి, మీాయున్నట్టియ-చ్చోటికై
న దయాత్మన్ జనుదెంచియుండు నని నే నమ్మన్ బ్రబుద్ధుండుగా. 131

గీ. కుడితిలోఁ జిక్కువడి కడుఁ గొట్టుకొనెడి
ఎలుకవడువునఁ దన్నుఁ దానేనిఁ గనక

'డాక్ట' రొచుండఁబోలు; గాఢంబె వారి
ప్రణయ ? మది రైన స్మృతి యున్న బాధ లేదు. 132

క. ఆకస్మికప్రయాణము
నాకయి వాల్టేరునందు ననుఁ గలియుటకై
నా, కడ కొకజాబు ననుప
లేకుంటిని; నమ్మకంబు లే దెట రాకన్. 133

క. మీతోడ రాధ వచ్చెనె ?
ఏతీరున సంఘటిల్లె నిది ? సత్కారం
బాతన్వికిఁ దగువిధమున
మాతాపిత లిడిరె ? యింటిమైఁ జనియె నొకో !" 134

వ. అనిన లక్ష్మి యగ్రజున కభిముఖ యై వేత్రాండాసనంబునఁ గూర్చొని హాసభాసురానన మలర ని ట్లనియె. 135

ఆ. వె. "ఇరుగుపొరుగుబసలనే యుండు మచటఁ
జదువుసందె లునికి సకల మొకట
జరుగుచుండు మాకు నిరతమ్ముఁ; బండుగ
సెలవు లిత్తు రనఁగఁ దెలిసి యటకు. 136

గీ. కూర్మినాయఁడు ననుదెంచెఁ గూర్మి ననుమ
రాలిఁ దోడ్కొని పోవంగ; రాధ నిటకు
వెంటఁబెట్టుక రా నెంచి వృద్ధు ననుమ
తింప వేఁడితి మిర్వుర మంప రాధ ! 137

గీ. అతఁడు తా దన లేక యా నని యెను; బది
దినము లుండి వచ్చును రాధ యనఁగ, నతఁడు
తాని యరుదెంచి కొనిపోవఁ దలఁచె; జంట
పిట్ట లొకదెబ్బఁ గూలుట ప్రీతిఁ గూర్చె. 138

క. "మాస్వాగతి యని యంటిమి;
భాస్వన్ముఖుఁ డౌచు నవ్వి; వరమైత్రిని మీ
రాస్వాదించుచు శుభ్రయ
శస్వినులై వెలయుఁ డని ప్రశంసించెఁ గడున్. 139

శా. సత్కారమ్ముల కమ్మ యుండ నొకలేశంబైన లోపంబె ? యా
పత్కాలమ్మున నైన యర్థు లురునిశ్వాసంబుతోఁ బోయిరే !
సీత్కారమ్ము లెఱుంగునే జనని ? సుస్నేహమ్ము వాత్సల్యమున్
ఉత్కంఠమ్ముగఁ ద్రావఁజేసె మదిలో నుప్పొంగఁగన్ రాధికన్. 140

శా. గంభీరుం డగు నాన్నయున్ వివిధసత్కారంబులన్ సల్పుచున్
స్తంభీభూతుల సల్పె మమ్ము; నిఁక రాధాభాగ్య మేమందుఁ బ్రే
మాంభోధిన్ దలమున్క లయ్యె; జనకుం డత్యంతమున్ బ్రీతిమై
సంభాషింపుచుఁ గన్నబిడ్డవలె వాత్సల్యంబు నించెన్ గడున్. 141

శా. అన్నయ్యా ! మనయయ్య రాధగుణశీలాకారనమ్రత్వముల్
ఎన్నోమాఱులు ప్రస్తుతించె; నటము న్నిన్నాళ్లు మాబోంట్లతో
నెన్నం డింతగఁ గూడిమాడి యొకఁడై యింపారఁగాఁ బల్కలే
దన్నన్ బొం కనరా; డెఱింగితిని నే నామాన్యవ్యక్తిత్వమున్. 142

శా. హర్షోద్భాసముఖారవిందమును సౌహార్దంబు లౌ చూడ్కు లా
కర్షింపంగల పెట్టిఱాతియెద, నిర్గర్వంబు నమ్రత్వ ము
త్కర్షాహేతువు లౌచుఁ దోడుపడె రాధాసుందరికి, బాష్పముల్
వర్షింప న్సుజనాళి మోదమున సంభావింపరే యాసతిన్. 143

గీ. పేదగుండెతల్లిని నింకఁ బేర్కొనంగ
నేల ? యమృతవాత్సల్యము నెంత చిందె
మానసీయఁ దెల్పుదు నెట్లు ? తేనె లూరు
పండి ప్రిదిలిన ఖర్జూరపనస వోలె. 144

సీ. తలలోని నాల్కకై చెలువాకై నమ్మకు,
సంగడికత్తె యై జనకుఁ దనిపె,
నాట బొమ్మై నను నలరించె, వదినకు
నూఁతకట్టునఁ జేతియూఁత యయ్యె,
నరచేతికలకండ మై నించె సఖియల,
వాఁదోడుగాఁ జనివాంఛఁ గూర్చెఁ,
బొరుగమ్మలకు 'గ్రామఫోను'గా రంజించెఁ
గప్పూరదీపికై క్రాలె నింట

గీ. నొక్కవారముదినములే యుండి రాధ
యైంద్రజాలికవడువున నంత మంది
విభ్రమానందముల ముంచి వెడలిపోయె
నామెఁ దలఁచి మెచ్చనివారి నరయ మెందు. 145

గీ. ఆర్ద్రహృదయుఁడు పూజ్యుఁడు నాదరాభి
మానమాన్యప్రమాణము మంజుభాషి
కూర్మినాయఁడు దౌహిత్రికోసము తన
మాటచొప్పున నైదవనాఁట నిటకు. 146

ఉ. కమ్మనిబొండముల్ ముదురుకాయలు మేల్ కరిడీలు కొబ్బరల్
తమ్మలపాకుమోదలును దాడిమపండ్లరఁటుల్ గెలల్ వినో
ద మ్మిడు పోకకాయ లమృతప్రతిమానము లౌ సపోటలున్
గుమ్మడి వంగ పెన్మునగ గోబి టొమాట విదేశశాకముల్. 147

ఉ. చిమ్మిలిమేలుకజ్జములఁ జేకొని నాఁ డొకబండిబర్వుతో
గుమ్మముముందు నిల్చెఁ గనుకోనల మైత్రి వెలార్ప నాయఁడున్;
నమ్మవు వాడవాడలజన మ్మది కాంచుచు విస్తుఁబోయి హ
ర్షమ్మునఁ దేలియాడి పలుచందములన్ దలపోసి రాత్మలన్. 148

గీ. రెండునా ళ్లుండె నతఁ డిటఁ; బంధు వయ్యె
నేమిచెప్పుదు కాలమే యెఱుకపడక
పోయె; నింటికి యొకక్రొత్తపొలుపుఁ గూర్చి
సరసహృదయుఁ డెల్లరితోడఁ జనవు నెఱపి. 149

గీ. ఊరిపొలిమేరవఱకు మే మెల్లరమును
రాధ ననిచితి మది మర్వరానిదృశ్య
మిప్పటికిఁ గండ్లఁ గట్టి న ట్లేఁచు మిగుల;
బండి ముం దేఁగుచుండ వెంబడిని మేము 150

మ. చనఁగాఁ దాత యొకింత గద్గదిక బాష్పస్రావ మేపార 'వ
త్తు' ననెన్; నాన్నయు మేము మోడ్చితిమి చేతుల్; రాధ పాదాభివం
దనముల్ సల్పఁగ లేవనెత్తి శిర మంటెన్ బ్రేమతో మూర్కొనెన్
జనకుం, డమ్మ యెదం గదించి తడిపెన్ సమ్మోదవాఃపూరమున్. 151

మ. విజయధ్యాన మనంగ సెద్దులమెడన్ విన్నాణమై ఘంటికల్
స్వజియింపన్ రవ, మశ్రుధార లలమన్ స్నిగ్ధాబ్దగండంబు ల
క్కజము న్గూర్పఁగ రాధ పోవుటఁ గనన్ గందోయిఁ గ్రందయ్యె బా
ష్పజలం బందటికిన్; సమగ్రముగ మాస్వాంతంబులన్ జేకొనెన్. 152

గీ. రాధకూరిమి లోకోత్తరమ్ము, పరమ
పావనం, బది యీభౌతికావరణము
లధిగమించి గమ్యముఁ జేరు; నరయ భ్రాతృ
సంచితతపఃఫలమ్ము నిశ్చయము చెలియ. 153

గీ. హైదరాబాదు బహుదూర మగుట నన్న
తీరుబడి లేక రాకుండు; తీవ్రహృదయుఁ
డతఁడు రాధను మఱవ సాధ్యంబె? క్రింద
టేఁడు మముఁ జూడ నైదుసా ర్లేఁగుఁదెంచె." 154

క. అను ననుజుఁ గాంచి "శుభవా
ర్తను నెఱిఁగించితివి; యిటకు రాధను గొనివ
చ్చిన మీాయూహయు నభినం
దనపాత్రము యోగ్యఫలము దానన్ గలిగెన్." 155

గీ. అనెడిమాధవునకు నట కరుగుదెంచు
మాత నవ్వుచు "బిడ్డ ! యీామంచిఫల మ
దేమి ? మీాయమ్మ కిడఁ దెచ్చి తెఱుఁగబలుకు"
మనఁగ సంభ్రమ మొలయఁగ నతఁడు నవ్వె. 156

క. అనువగు సమయం బియ్యది
యని తలఁచుచు నిట్టు లనియె "నమ్మా ! ఋణము
క్తినిఁ గోరి తొలుత వందన
మొనరుతుఁ గై కొమ్ము; పిదప నొసఁగుదు ఫలమున్." 157

గీ. అంచు నిజపాదముల నంటు నాత్మజాతుఁ
గాంచి వివశ యై మేనఁ బుల్కలు జనింప
'నిత్యకల్యాణ మగుఁగాక నీ !' కటంచుఁ
బల్కెను సుభద్ర శిర మంటి ప్రమద మలర. 158

వ. పదపడి యాసీనయైన జననిం గాంచి రాధప్రణయవృత్తాంతము నెల్ల
ఱుంగఁజేయుటా యని యోచనాధీనుఁ డైన యాతని నుపలక్షించి
సుభద్ర "నాయనా ! యేమి శంకించుచుంటి" వన నాతఁడు. 159

శా. "పిచ్చాపాటిగ మాటలాడుకొన మీాప్రేమామృతం బెంతయున్
సచ్చారిత్రమువల్లఁ జారఁగొనె నాచంద్రాస్య రా ధంచుఁ దా
నిచ్చోటన్ మును మెల్గినట్టిచెలువం బింపారఁ జెల్లాయి వా
క్రుచ్చెన్ ముచ్చటఁ గూర్పఁ; బల్కితిని చేకూర్చెన్ ఫలం బంచు నేన్.

శా. అమ్మా ! నీ విట కేఁగుదెంచుచును న న్నర్థించి తీసత్ఫలం
బిమ్మంచున్, గొను మింక రాధికను; నా కీభారముల్ దీఱు నీ

కమ్మాన్యాత్మయుఁ జిన్నకోడలిగ సత్యాహ్వానమ్ముఁ గూర్చు, స
ర్వమ్ముఁ జక్కపడున్; సువర్ణమున వజ్రం బేర్పడన్ గూర్పుమా!”

గీ. అనెడి సుతుఁ గాంచి సంశయవ్యథలు చివురు
లెత్త విచలిత యగుచు మే నెఱుఁగఁబడక
కోప మలముఁగఁ గన్నులఁ గురియనున్న
నిప్పుకల నశ్రువారిని నించి యార్చి. 162

శా. “బిడ్డా! యేమిది? నన్ను నీక్రియను నూబిన్ ద్రొక్కి బాధింతువా?
గ్రుడ్డున్ సాఁకితి, దిద్ది తీర్చితిని, నీకుం గూర్పదే మాల? యే
యడ్డున్ లే దని దొడ్డపిల్ల నిటు లీ వాక్రోశ మొందింతువా?
అడ్డాల్ బిడ్డలు గాని గడ్డములు రా నమ్మల్ దలం పుందురే? 163

శా. ఓరా! దుర్విధి గాక సర్వగుణరత్నాలంకృతుల్ కూర్చి నీ
కై రాత్రింబగ లెంతకష్టపడి యిక్కన్యావతంసంబు నే
ర్పారన్ దిద్దితి; నే మెఱుంగుదువు వత్సా! నేను సైరింప నీ
క్రూరత్వం; బెటు నిల్చు నొక్కయొర బాకుల్ రెండు రాపాడుచున్.

శా. ఉద్రేకమ్మునఁ జిక్కఁబోకుము సుతా! యూహింపవే మాల నీ
యీద్రోహంబును సైఁపనేరదు, దయాహీనమ్ముగాఁ బూను నీ
విద్రోహమ్మునఁ బ్రాణ మొడ్డుదును; భావిన్ నీవు భావించి; నా
హృద్రోగమ్మున కంకురార్పణము పేర్మిం జేయుమీ పిమ్మటన్.” 165

మ. అనినన్ గొల్లున నవ్వుబిడ్డలను నయ్యబ్జాక్షి యీక్షించి లో
చనముల్ విభ్రమమున్ వెలార్ప “నను నీచందంబునన్ రెచ్చఁగొ
ట్టిన మీనాటక మర్థ మయ్యె; నీకఁ బాటింపంగరా దేను వ
ల్కినమాటల్ ననుఁ గన్నతండ్రి!” యను తల్లిం గాంచి యుల్లాసియై.

ఉ. మాధవు డామెచేతులు సమాదరచిత్తముతోడఁ బట్టి “య
మ్మా! ధరణీసమాన వగు మాన్యచరిత్రవు నీకు నెన్నఁడున్

బాధ యొసర్తునే ? యమృతభాండమము మాలతిఁ గాలిఁ దన్న నీ
మాధవుఁ డెట్లు పాల్పడు ? నమాయిక యాయకలంక నాయదే.”

క. ఒడి నిడుకొని మ ఖ్మిరువురిఁ
గుడిపితి వోరెమ్ము ప్రేమ కోల్కొన; మాకుఁ
నడకలు నడతలు నేర్పితి;
వెడఁద న్నిడి సాకు నిన్ను నెఱుఁగనె జననీ ! 168

ఉ. భంగురమైన యీతనువుపై నధికారము నీది; సర్వథా
మంగళమూర్తి ! నీహృదయశుద్ధ్యమునం దె సుఖింతు, నీదు క
న్నుంగవఁ దొల్కు సత్కృప వినూతన మై పులకింపఁజేయు; నా
కుంగలభాగ్య మెల్ల నినుఁగొల్చుటగాఁ దలపోతు నిత్యమున్. 169

శా. అమ్మా ! యన్నపదంబులో నిముడు ప్రేమానందమాధుర్యముల్
ఇమ్మాహాత్మ్యఁ దెఱుంగనేరఁ డని భావింపంగరా దెన్నిలో
కమ్ముల్ బోయిన నీశుభాంఘ్రియుగముం గన్నీటఁ దేలింతు; స్వాం
తమ్మం దెన్నఁడు సంశయింపకుము పుత్రత్వంపుశత్రుత్వమున్. 170

క. భుగ భుగ పొగ లెగఁజిమ్ముచు
నగుపించెడి యగ్నిపర్వతాకృతి వయ్యుఁ
వగపే కనుపించెను గను
సెగలను వెలయింప వెట్టచిత్తము జననీ !” 171

వ. అను నందనునివాక్యసుధాధారాపరిషేచితాత్మ యై సుభద్ర విప్పారిన
హృదయమ్మున. 172

ఉ. బంగరుకన్నతండ్రిఁ గులపావను మాన్యచరిత్రు నొవ్వనా
డంగఁ దొడంగి చిత్తము బడల్పడఁజేసితి; బుద్ధి మండిపో
యెం; గరుణావిహీనమతి నీక్రియ నెన్నఁడు వల్కఁ, జిన్నికూ
నం గుటిలాత్మ నై పలుకునారసముల్ గడు నాటఁజేసితిఁ. 173

శా. యుక్తాయుక్తము లుజ్జగించి మదిలో నుద్వేగ ముద్వేల మై
త్యక్తాత్మాన్యవిభేదబుద్ధి సుతు నిందాపాత్రుఁ గావింపఁ గ్రూ
రోక్తుల్ ముమ్మర మాచు నాయెదన పెల్లుగ్రమ్మఁగా నాఁటె, నే
యుక్తిన్ బుత్రునిఁ దన్పి తత్ఫలముగా నుల్లాసమున్ గాంచెదన్."174

వ. అని కటకటఁబడు జననీముఖ్యవైవర్ణ్యం బుపలక్షించి మాధవుఁ
డామె ననునయించువాఁ డై. 175

శా. "విస్పష్టైశ్వర్యంబుగ భావ మేర్పడమి నీ భ్రాంతి వాటిల్లె, భా
వాస్పష్టత్వముకల్మి నానుడులు దోషాపాదకం బౌను, నీ
విస్పష్టం బగుధర్మదీక్షయుఁ బవిత్రం బై నవాత్సల్య మా
హా! స్పందించు టెఱుంగనే యెడఁద; నీయాఁదోళనల్ మానవే.176

క. ఆనందునిఁ దలపోయుచు
నే నంటిని; రాధ సుగుణయే గాక మహా
జ్ఞానధన; మచ్చరయేఁ గన
రానిది; వెలలేనిదివ్యరత్నము గాదే! 177

ఉ. పిన్ని కుమారుఁ గాంచె ననుపేరె; దయామతిఁ బెంచి పెద్దఁగా
నన్నివిధాల గౌరవము నందఁగఁ జేసితి వీవె తమ్ముఁ; నీ
యన్నులమిన్న రాధ తగు నాలనికిన్ సమకూర్చు; నీవ యా
నన్న సమస్తమున్ వలయునట్టులఁ జేకురు నక్రమంబునన్. 178

చ. కుల గుణ శీల రూపములఁ గోమలిఁ జెప్పిరె యన్యకన్య నా
వలఁ దలపోయఁగావలయు, వాస్తవ మెంచఁగ రాధవంటి వి
ద్యలనెల వొండు గానఁ, దనతల్లిగ నిన్ను గణించుతమ్ముఁ నా
వలె వలదా వివాహితుని వైభవ మొప్పఁగఁ జేయు టారయన్.179

గీ. పక్షపాతము సూపె సుభద్ర యనెడి
నింద వహియింప నేల? మానిని సమాన

మౌల కన్నిటఁ గాన నెమ్మాడ్కి నైన
రాధ నానందుఁ గూర్చుటే ప్రాజ్ఞత యగు. 180

మ. కుల మొక్కం డయియుండ శాఖలను జేరోకం నేల ? యిక్కాలమం
దలి వర్ణాంతవివాహముల్ నతుమ నెన్నం బోల దీభేద; మ
న్యులు ప్రే ల్జూపుదు రన్నసందియము డిందున్ నేఁటి దేశాభిమా
నులు సంస్కారరతుల్ సయజ్ఞులును మాన్యుల్ దీని హర్షించుటన్.

ఉ. శారదచంద్రచంద్రికలసారునఁ దమ్ముఁడు రాధఁ గూడఁ బెం
పారుదు; రిట్లు సంఘటిలు టర్హముగా నెవ నెంతుఁ; బెద్ద లు
న్నారుగదా ! తలంపుఁడు; వినమ్రుఁడనై తలఁ దాల్తు యుక్తమా
తీరున నాన వెట్టుఁ” డని తీయదనం బొలయించువాక్యముల్. 182

గీ. పల్కుసుతుఁ గాంచి యోచనాపరతఁ జొక్కి
యాను కా దనఁబోక కార్యావబోధ
మరయ శ్రమ నొందు జననిఫాలాంతరమున
విస్ఫుటం బగురేఖల వీక్ష సలిపి. 183

వ. లక్ష్మి జననివహించిన మాన మర్ధాంగీకారమ్ముగా నూహించి కార్యానుకూలతకు యథాశక్తిఁ దోడుపడ నుబలాట మొంది జనని నుద్దేశించి “యమ్మా ! యన్ననుడివిన యోగ్యతాయోగ్యతలప్రశంస యటుండనిమ్ము. నే నంతకన్న ముఖ్యమగు వేఱొండువిషయం బెఱిఁగింతు. విను” మన సుభద్ర కౌతుకదృష్టులఁ బ్రసరింపఁజేయ నది యాజ్ఞగ గ్రహించి లక్ష్మి యి ట్లనియె. 184

గీ. “దైవసంకల్ప మగును జిత్తమున నన్న
రాధఁ బ్రేమించె; నాల్గేండ్లగాథ నెఱుఁగఁ
జేతు విను మింక; నెపుడు నీచెవిని వైతు
దీని ననుచుఁ దల్లడము నందితిని మిపుల. 185

క. మును మే ముద్యానము గను
గొనఁ జనుతఱిఁ బ్రేమ కుదురుకొనె; రాధ జలం
బున మునుఁగ సాఁకి డానిం
బెనిచెను; నిచ్ఛాపురమునఁ బెరిగె ద్విగుణమై. 186

క. కాలేజిచదువునం దతి
వేలం బై యొకరినొకరు విడిచిన బ్రతుకం
జాల మనునంత యయ్యె, నిఁ
కేలా ? యవిభాజ్య మనుటయే తగుఁ బ్రేమన్. 187

గీ. జంటపూవులపుష్పగుచ్ఛమ్ము వోలె
ప్రణయమకరంద మొలుకుచు భావిజీవి
తమ్మునఁ బరిమళము విరఁజిమ్మఁ బూని;
రతిశరాసక్తిగఁ దలఁపకు మమ్మ ! దీని. 188

క. పలుతడవు లతఁడు రాధను
దిలకింపఁగ వచ్చుచుండుఁ; దెలియఁబలుకు లే
ఖలమూలమ్మున క్షేమము;
కలుషరహిత మైనజంటగా భావింతున్. 189

క. రాధ తలపోయు నెపుడు స
నాథగఁ దన్ను; హృదయాసనము నన్న కిడెన్
సాధన మొనర్చుఁ బ్రేమప
యోధిఁ విహరింప గురుతరోత్సవ మలరన్. 190

చ. అవధు లతిక్రమించెఁ బ్రణయం బని నీవు తలంపవచ్చు; నా
ప్రవిమలశీలురన్ వెడఁగుపల్కుల నాడఁగ నోరు రాదు; మా
తవు పరిశుద్ధవర్తనవు తప్పక నీవును సానుభూతిఁ గాం
తువు; గుణ మెందునున్నఁ బరితోషము గూర్చుట సత్య మౌఁగదా!

క. ప్రేమించి పెండ్లియాడుట
యే మంచిది నేఁడు; ముఖము నెఱుఁగనియొకనిన్
స్వామిగ గ్రహించి పిదపన్
బ్రేమించుట పూర్వపక్కి, ప్రియజనని !" యనన్. 192

వ. అంత మందహాసమ్ము వెలయ "నేదియో ! ప్రేమవివాహములఁ గూర్చి చిట్టితల్లి గంభీరోపన్యాస మిచ్చుచున్నదే. నేనుగూడ విన నిండు." అనుచు నరుదెంచు నృసింహునిఁ గాంచి వారెల్లరు సంభ్ర మవినయమ్ములు దొలఁకాడ లేచి నిలిచి స్వాగతమ్ము నెఱపిరి. నృసిం హుఁడు వారినెల్లరఁ గూర్చొనఁజేసి సుఖాసీనుఁ డై కూఁతు నుద్దే శించి "అమ్మా ! యేమది ? ప్రేమించి పెండ్లియాడుటా ? పెండ్లాడి ప్రేమించుటా ? యని మీయమ్మ నడుగుచుంటివి. నేను విన నర్హ మగునేని యెఱుంగఁబల్కు" మన, 'ముసిముసినగవులఁ జిమ్ము జననీ ముఖంబును, గంభీరమందహాస మ్మొలయు నగ్రజునిమోమును నుప లక్షించి, సుప్రశాంత మగు జనకు నాననరోచులవలన నాశ్వస్తహృ దయ యై వినయానురాగమ్ములు పెనఁగొన బల్లపైఁ దనయిరుకరమ్ము లానించి కలకంఠకంఠస్వరమ్మునకు మెఱుంగులు దిద్దు కమ్రస్వరంబున లక్ష్మి యి ట్లనియె. 193

శా. "నాన్నా ! ప్రశ్న మొకండు మీరు కృపతో నా కేర్పడం జెప్పుఁ; డే
మన్నన్ బెండ్లియ? ప్రేమయా? తొలుత; యోగ్యం బెద్ది యిక్కాలమం
దెన్నన్ ? మీ రిడునట్టియుత్తరము మేమెల్లన్ బ్రసాదంబుగా
మన్నింపంగల మాను గా దనక; ధీమంతుల్ గదా ! మీరలున్."

వ. అనునవసరమ్మున నట కరుదెంచుమాలతిం గని నృసింహుం డాదర పూర్వకముగ నామెం జూపుచు, "నీప్రశ్న మాగృహలక్ష్మి నడుగు నది. కర్మరహస్యపరిజ్ఞాత యగు నామెసమాధానము మన కందఱకీని

సమ్మాననీయ" మనుడు మాలతి లజ్జావినయములు ముప్పిరిఁగొన
వికుంచితాంగి యగు టరసి సుభద్ర సానురాగమ్మున నామెకరంబు
వట్టి తనచెంత నాసీనఁ గావించి "యమ్మా! మీమామగారికి నీబుద్ధి
నైశిత్యమునందును, గర్మపరిజ్ఞానమునందును గౌరవ మపారము.
వారు నీ కాదేశించిన ప్రశ్నకు సమాధాన మిమ్ము." అని వెన్ను
నిమురు నపరమాతృమూర్తి నుపలక్షించి మాలతి "గుణమాన్యులు,
వయోవిద్యాపరిజ్ఞానాధికులు, దైవస్వరూపులు నగు తమయెల్లరి
సమక్షమున నేనా సమాధానించుట? గత్యంతరము లేమి మీయాజ్ఞ
మౌళిఁ దాల్చి యథాశక్తి నివేదించుకొనెద. ప్రశ్నమును సెలవిం"
డను కోడలి నయవినయపారీణతకు సంతసిల్లి "ప్రేమించి పెండ్లాడుటా?
పెండ్లాడి ప్రేమించుటా? యేది యీకాలమున యోగ్య? మను
నదియే యాప్రశ్నము. కొంకక సమాధాన మిమ్ము." అన నత్తం
గాంచి పూర్వోత్తరం బెఱుంగమి యయ్యది తన్నుద్దేశించియే యడు
గఁబడిన దని యూహించి కలకంఠఖండమ్ము గొంతుఁబడ్డలీల నుక్కిరి
బిక్కిరి యై సంబాళించుకొని ప్రియానుమతిఁ గొనుపోలికఁ గ్రీఁగంట
నొకపరి యాతని నాలోకించి సామోదసూచకంబు లగు నాతనిముఖ
లక్షణంబులం గనిసి, యభిముఖంబుగాఁ జూడ నోడు తనచూడ్కులఁ
బ్రక్కవాటుగ శ్వశురవదనంబునఁ బఱపి ధైర్యము చేకూర్చుకొని
యంత సవినయంబుగ ని ట్లనియె. 195

ఉ. "బాల్యవివాహముల్ దొలఁగెఁ బ్రస్తుత మెల్లయెడన్, వధూవరుల్
తుల్యగుణాభిజాత్యములతోఁ జెలువారుట యుక్త మౌను, సా
శీల్యము గోలుపుచ్చకయె చిత్తములన్ బెనవైవఁజేసి సా
కల్యము గాఁగ నొండొరులకాంక్షలు నాశయముల్ స్వభావముల్.

క. యువతీయువకు లెఱుంగుట
స్తవనీయం బౌను; బెండ్లి సలిపినపిదపన్

అవరోధము లేర్పడినన్
సవరణ బహుకష్ట మగుఁ బ్రశస్తియుఁ బోవున్. 197

శా. కామోద్రేకము కన్నుఁ గప్పునెడ యుక్తాయుక్తముల్ యౌవనుల్
తా మూహించుట కష్టసాధ్య మగు; స్వార్థప్రేరితుల్ కన్యకా
క్షేమంబున్ బలిఁ గొందు; రట్టియెడ సౌశీల్యంబుఁ బోనాడఁ బో
రాముల్ పుట్టును; గాన శీల ముడివోరా దెందుఁ గన్యామణుల్. 198

గీ. శీలసంపద విడువని చిగురుఁబోఁడి
వలచి వలపించుకొని సౌఖ్యవనధిఁ దేలు;
దేల నైన దైహికాపేక్షఁ దూలిపోవు
పడఁతి తూలిక నైన విన్నఁబాటుఁ గనును. 199

గీ. ఒండొరు లెఱింగికొనిన భావోన్నతి కది
తోడుపడుట తథ్య; మొద్దుదొడుకులు గడుఁ
బాడమనేరవు; ప్రేమికుల్ పూతచరితు
లగుట కెంతయు సంస్కార మవసరమ్ము. 200

ఆ. వె. గౌరవమ్ము నెఱపఁగా నిట్లు నానోట
వింటి రే మెఱుంగు వెడఁగునిసుఁగు;
పరిణతాత్మ లిందు దొరలుదోషమ్ములు
పరిహరించి కృపను బఱుపుఁ" డనుచు. 201

గీ. పల్కుమాలతిఁ గని "ముద్దు లొల్కునుడుల
సత్య మెఱిఁగించితివి తల్లి! సాధుశీల
రాధకును నీకు భేద మేర్పఱుపరాదు
ఉచితభాషణములు సుగుణోన్నతిఁ గన." 202

క. అని మెచ్చుకొనెడి నాథునిఁ
గని సంస్మిత యైన సుభద్ర "కరుణామతి! మీ

వినుతులోఁ గను రాధాగా
ధనె విని యోచించుచుండ దైవవశమునన్. 203

గీ. మీరు దయచేసి రిటకుఁ; నమ్మించుఁబోఁడి
సార్థకాభిద యనవచ్చుఁ; సంగ్రహముగ
నెఱుఁగఁజేతును సారాంశ మింక వినుఁడు
హర్ష నిర్భరహృదయుల రగుడు పొగడి. 204

గీ. పక్షపాతము మీ కింకఁ బనికిరాదు;
మాధవునిఁ జూచుచుండినమాడ్కి మీరు
బుధుత నానందుఁ జూడ రెప్పుడు నటంచు
వచ్చె నపవాదు; దీనిఁ దీర్పంగవలయు. 205

క. కావున నానందుని కే
దోవిధి మాధవుని పెండ్లితోడనె పెండ్లి
పోవలె నని యోచింపఁగ
భావంబున రాధ పెద్దబాబుకుఁ దోఁచెన్." 206

వ. అని విభునిముఖలక్షణంబుల నుపలక్షించు సుభద్రను గని నృసిం
హుఁడు బాధాకరముగ నవ్వుచు. 207

గీ. "స్నేహముచఁ జేసి కలుములచెలియఁ బోలి
ఇంటి కరుదెంచె నామె నిం కేల వీడ
నని తలంచిరో! విజ్ఞానధనగుణాభి
జాత్యములు గల రాధ నీచంద మకట! 208

క. తేలికగా మాటాడుట
కేలీలను బాలుపడితి రెఱుఁగను; గుణర
త్నాలంకృతమిత్రునకు సు
శీలుని కిది యెట్టిచెట్ట చేయు నెఱుఁగరో! 209

గీ. పెదవి దాఁటినతోడనే పృథివి దాఁటు
మాట లెందుఁ గావున నవ్వులాట కైనఁ
బల్కరా దన్యులకు విన్నఁబాటుఁ గూర్చు
నట్టు; లాప్తమిత్రులమాట నరయ నేల ? 210

ఉ. ఇంతకుమున్న రాధ మన మేరి కొసంగెనొ ! స్వార్థబుద్ధి న
య్యింతి కవజ్ఞఁ గూర్చునదు లేటికి వాకొన ? సాటివారి నే
కాంతమునందుఁ జుల్కనగఁ గాంచుట హేయము; మానుఁ డింక; ని
శ్చింతగ యోగ్య మాతరుణిఁ జేకొనఁజేయుఁడు వాని; నింతకున్. 211

క. మీ రీక్రియ నానందుని
కై రాజీవముఖి నొకతె నరయకమునుపే
నేరైన వానిమదిలో
వేరూనిరొ ! తెలియుటయె వివేకము దలఁపన్. 212

క. మూ మూ బసవఁడు గాఁ డతఁ
డాడుమనినలీల బుఱ్ఱ నాడించుటకున్;
వేడుకలముందు నాతని
తోడన్ భాషించి, పిదపఁ దొడరుటయ తగున్." 213

చ. అని తనుఁ గాంచుప్రాణవిభు నన్యసమాదరబుద్ధి కెంతయున్
దనిసి, సుభద్ర చిన్నగవు తళ్కు మనన్ ముఖసీమఁ; గార్యసా
ధనమున కాభిముఖ్యముగఁ దత్పరిణామము గోచరింప లో
చనశతపత్రముల్ మధురసంబు స్రవించుచు నింపు పెంపఁగన్. 214

ఉ. "మాన్యచరిత్ర ! నావెడఁగుమాటల నెన్నకుఁ; డేను వింటి న
న్యోన్యము ప్రేమతో మెలయుచుండి రటంచును లక్ష్మి చెప్పఁగాఁ;
గన్యల కేమిలోప; మతిగాఢపరస్పరమైత్రికల్మి సా
మాన్యమె ? దైవికమ్ము లనుమాట యథార్థము ప్రేమబంధముల్.

గీ. ఒంపొరులడెందములఁ బ్రేమ నింపువారి
యుండె నని తోఁచుచుండె; మీ రొండురీతిఁ
దలఁప కాప్రేమికులను మోదమున 'సమ్మత
మ' న్నచు శుభాకాంక్ష లియ్యంగవలయు. 216

చ. మఱచితి రేమొ నాథ! మనమాలతి నుయ్యెల నూఁచునాఁడు మీ
మఱదియు నుండ రేయి నొకమాఱు ప్రసంగమునన్ గళింగు లే
కరణిని రెండుశాఖ లయి కష్టము లొందిరొ! పల్కియుండి రా
తరుణమునందు నాయనుజ తా నరుదెంచెను జ్ఞప్తి యున్నదా? 217

గీ. కులవిభాగమ్మునకు మీరు గోడుఁగుడుచు
చిన్నె లానాఁడు పరికించి యున్నదాన;
భూరి కరుణాసముద్రుఁ డా నారమేశుఁ
డిడియె సంకల్పసిద్ధి కై యీపథమ్ము. 218

శా. పూతాత్ముల్ ప్రణయప్రపూరితులు నై పొల్పొందు నానందరా
భాతన్వంగులఁ గూర్పఁ బాటుపడుఁ డద్దానన్ బురోవృద్ధి వి
ఖ్యాతుల్ సంస్కరణమ్ము చేకురును శాఖాభేదముల్ మాయు, నా
చేతం గాదగు తోడు సూపుదును నాక్షేపింపరా దీపనిన్. 219

శా. మీసౌజన్యవిశాలచిత్తములు స్వామీ! క్రొత్తయే నాకు; మీ
రీసత్కార్యము సల్ప దీక్షఁగొనుఁ డత్యేకాగ్రచిత్తంబునన్;
వాసిం గాంతురు; కార్యసిద్ధి నిజ; మర్వాచీనసంస్కారముల్
జేసెన్ నాప్రియుఁ డన్నగర్వమును నాచిత్తంబునన్ గూర్పరే! 220

గీ. వార లధునాతనంపుభావములు గలుగు
వార లగుట నుపేక్షింపవలవ దరయ;
చేయి దాఁటిన మన మింకఁ జేయఁగలుగు
కార్య మేమి? కావునఁ గూడఁగట్టవలయు. 221

గీ. స్వార్థమునకైన నీపని సల్పుచున్న
కాలిఁ దన్నుసిద్ధాన్నము కైవడి మన
కందకుందురు; తక్క లల్లార్చుపులుఁగు
లట్టుల వయస్కులను నెంచనగును గాదె!" 222

గీ. అనిన, నిజసతిముఖము సమాదరమునఁ
గాంచి నరసింహ మనియెను "కాంత! యెంత
కనుగలిగి నీవు భాషింపఁగలవు; స్వర్గ
మర్త్యములఁ ద్రిప్పి నన్ను నీమాటనేర్పు. 223

శా. కార్యోత్సాహము సంఘటించితివి; సత్కార్యంబుగాఁ జూపి యౌ
దార్యం బర్హ మటంచుఁ బల్కితివి; స్వార్థంబేని సాధింపుఁ డి
క్కార్యంబం దని హెచ్చరించితివి; సంస్కారప్రియత్వంబు మీ
భార్యే నాకొఱకైనఁ బూనుఁ డను నీపల్కుల్ గదం జిత్రముల్.

గీ. మాటపొందిక లేమియే తూటువడిన
చిత్తములతోడఁ గాఁపురాల్ చెడుట విడుట
జరుగు హతభాగినులకు శిక్షణ మొసంగ
నమృతభాషిణి! నీవ యోగ్యవు నిజముగ." 225

గీ. అనుచు విషయాంతరమునఁ ద్రోయఁగఁ దలంచు
ప్రియునియింగిత మెఱిఁగి యవ్వెలఁది కనులఁ
గపటకోపముఁ జిమ్ముచుఁ "కన్నబిడ్డ
లుండఁ జాలించుఁ డిడుట యుద్యోగములను. 226

గీ. బిడ్డలసమస్యలను దీర్చి, పెండ్లి చేసి,
ధర్మమూర్తుల సలిపి యిద్దఱముఁ బోవ
నగు నుపన్యాసము లొసంగఁ, దగును గాదె!
ఇంట గెలిచి రచ్చ గెలువ నేఁగు టొందు." 227

వ. అని పల్కి, ప్రత్యుత్తరమ్మునకై నిరీక్షించు సుభద్ర నాలోకించి
నృసింహుండు పులకితాంగుఁడై. 228

ఆ. వె. "కన్నవారిఁ జుట్టుఁ గాఁపుంచి, యూపైని
కనుల నాగ్రహమ్ము గ్రమ్మ నాజ్ఞ
సేయు, కా దనంగఁ జెలువ గుండెయ నాది ?
కార్యసాధనమునకై తోడరుదు. 229

క. మీకుట్రఁ దెలిసికొంటిని,
ఏకమె మీరందఱు నిఁక నేలా నేనే
మీకందఱికిన్ వెలియై
చీకాకుం బెట్ట ? లెక్క సేతురె నన్నున్." 230

చ. అనునెడ నున్న రంచుఁ దమయాత్మగతం బగుసంశయంబు లం
తన వెలిఁ జిమ్మిరో యనఁగఁ దద్దయు నూర్పులు బుచ్చి రందఱున్;
గనుల ముదశ్రువుల్ వెలయఁ గన్గొనుబిడ్డలఁ గాంచి నవ్వి "మీ
మనములు చల్లనయ్యె, ననుమానము దీఱె, సుఖించుఁ డీపయిన్.

ఉ. ఏతపుఁగోల వోలె నయ మేర్పడ వంగుచుఁ బూజ్యపాదు ల
త్యాతతసత్కృపారసము నద్భుతలీలను బాఱఁజేసినా;
రీతలఁపుల్ దొలంగుఁడు, త్వదీప్సితసిద్ధికి యోగ్యమార్గముల్
చూతురు వారె" యంచుఁ బ్రియు శోభిలఁ గాంచి సుభద్ర నమ్రయై.

శా. "స్వామీ ! గూఢపురాణి నల్పితిమిగా ! సత్కార్యసంసక్తియున్
క్షేమాపాదకదృష్టియున్ గలిమి నాక్షేపించినన్ సైఁచెదన్;
ప్రేమింతున్ నిజపుత్రుఁగా మదిని నావిజ్ఞాని నానందు; నే
నీమాత్రంబుఁ దలంపనే కృపను నన్నీరీతిగా మెచ్చుటల్. 233

ఆ. వె. వరునిపక్షమందు వలయుప్రయత్నముల్
సల్పు దేను; సుగుణసాంద్ర ! తాము

వధువు డెసను గూడివచ్చెడి జతనంబు
లాచరింపఁ దొడరు టర్హ మగును." 234

వ. అనిన నృసింహావర్మ సమ్మతించుటీల హాసమ్ము వెలార్చి, "సిద్ధసంక ల్పువు. నీ కన్యథాత్వమ్ము కలుగనేర్చునే ? అవశ్య మట్లే యత్నింపఁ దొడరుదు;" ననునవసరమున గోడగడియారము పదునొకండుగంటలు కొట్టుట నాకర్ణించి, "వింటిరా ? విజయఘంటికారావము. విజయము మీ కభిముఖ మైమ్మ యున్నది. భుజింప లేవఁదగు" నని హెచ్చరించి సుభద్ర భోజనగృహమ్మున కరిగె. 235

చ. జఠరము మాధవాదులకుఁ జల్లఁబడెన్ బరమోత్సవంబునన్;
గఠినసమస్య యై మిగుల గాసిని గూర్చిన రాధగాధ క
ర్మఠుఁడు తురీయమార్గమున రాగ మడంగ నకర్మి యై క్రతుల్
పఠనము మానుటీల నెడఁ బాసి ప్రశాంతిని బొంది రెంతయున్. 236

సీ. చిన్నన్న కీవార్తఁ జెప్పి ప్రప్రథమబ
హూకృతిఁ గొన లక్ష్మి యుత్సహింప,
నభినందనాత్మక మైనలేఖను రాధ
కతివేడ్క వ్రాసె మాలతి సమస్త
విషయంబులను బహువిస్తృతంబుగ నాంగ్ల
మందు గోప్య మొనర్ప నాత్మ నెంచి;
ప్రవిమలప్రణయంబు ఫలకారి యగుటకు
దైవసాహాయ్య మెంతయును గూడె
గీ. ననుచు మాధవుఁ డానంద మంది, భావి
నెట్టివిఘ్నముల్ లేక ఫలించి సౌఖ్య
మొందవలయును రాధికానందు లెపుడు
ననుచుఁ బరమేశ్వరునకుఁ దా నంజలి యిడె. 237

సీ. నాజాబు చేరు నీనాఁ డరుదెంచును
జూడు మంచును నన్నతోడఁ బలుకు
మాడాక్టరున కతి మధురశుశ్రూషాపర
మొనరింపు మంచు వదినకుఁ జెప్పు
నీచిరంజీవికై వాచిపోయె మొగమ్ము
చనుదెంచు నిపు డని జనని కనును
మీ దూరకొనుఁడు కంగారు వెట్టెదఁ జిన్న
యన్న నంచును దండ్రి కనును వేడ్క

గీ. నేక్రియ నుపక్రమించెద ? నెటుల వినిచి
తొలుత నాందోళనము గూర్పవలయును ? శుభ
వార్త నెఱిఁగించుపట్ల నేబహుమతి నిడఁ
గోరఁదగు నని యోజనల్ గూరె లక్ష్మి. 238

ఆ. వె. బండివేళ లరయుఁ, బలుచందముల నెంచు,
రాక మానఁ, డుత్తరం బతనికి
నందియుండలేదొ ! య ట్లైల యగు నని
సంశయముల లక్ష్మి సతమత మయి. 239

గీ. మూఁడుదినములు గడు విన్నఁబోయి, వేచి
చూచి, కన్నులలో నీరు నాఁచికొనుచు
జాబు లిఖియించి దీర్ఘనిశ్వాసనయుక్త
యగుచు నామె యన్నకుఁ గ్రోధ మతిశయిల్ల. 240

ఉ. లేఖ ముగించి, తీవ్రముగ లేదుగదా ! యని పెక్కుమార్లు దే
యాఖరుసారిగాఁ దలఁచు చారసి, కోపము శాంతి నొంద నా
రా ! ఖరవాక్య మొక్కటియు వ్రాయఁగ నోడితి నంచుఁ జంద్రికా
రేఖల నీసడించుచు మరీచులు గ్రమ్మెడి మందహాసముల్. 241

ఉ. మోహమునఁ గీల్కొనన్ సుగుణమూర్తిని నొవ్వఁగ వ్రాయుటెట్లు? గా
రాముసకైన హద్దు తగు; రామికి హేతు వెఱుంగ నంచుఁ దా
నేమియొ యోజనల్ సలుపు చేకతమందున లక్ష్మి యుండఁ "జె
ల్లీ! మఱి యేమి వ్రాయఁదగు లేఖను జూడు" మటంచు బల్లపైన్.

గీ. మాధవుం డుంప నామె సంభ్రమముతోడ
దానిఁ బఠియించి చెలియుత్తరము నన్న
కొసఁగి కటువుగా వ్రాయలేకుంటిఁ జూడు
మనిన నవ్వుచు దాని సమగ్రముగను. 243

ఆ. వె. కాంచి, యొసఁగి, "చెల్లి! కనుఁగొంటి నీయెద
ఎంతమధుర మమ్మ! యిక్షుకాండ
మటుల కటువు గాఁగ నగుపింతు, వంతర
మందుఁ బ్రేమ తొణుకు నధిక మగుచు." 244

వ. అనునవసరమ్మునఁ బోస్టుజవాను కేకవైచుట విని యులిక్కిపడి యేదియో యుత్తరమ్ము వచ్చియుండు నని భావించి మాధవుఁ డను జతో నావలి కేఁగి తనకు హైదరబాదునుండి యరుదెంచిన యొక రిజిష్టరుజాబు గ్రహించి యరుదెంచి హృదయము మధుమధురభావ సమ్మిళితము గాఁగ నద్దానిని దెఱచి యం దొకపెద్దలేఖయు మధు కుమారితోఁ దా నట బయలుదేఱకముందు దీసికొనిన చిత్రమ్ము లుండుటకుఁ బరమానందంబు నొంది లేఖ సాంతముగఁ జదివి యప్ర యత్నముగ 'నమృతమయి' యని పల్కుటకు విభ్రమమ్ము నొంది లక్ష్మి "యన్నా! యే మది" యనుడుఁ "జెల్లీ! యిది యొక్క దివ్యవాణి. ఇదె యీయమృతమయి యని లేఖయుఁ జిత్రముల నామె కొసంగిన లక్ష్మి చిత్రములఁ దొలుతఁ బరిశీలించి హృదయమున గౌర వభావము నెలకొనఁ బదపడి లేఖ నక్షరంబు పొల్లుపోనీక చదివి

యూర్ధ్వదృష్టి లోలయుఁ గొంతసేపు యోచించి, మరల సమగ్రమ్ము గాఁ జదివి యాచిత్రంబులఁ గనురెప్ప లార్పక పరికించునవసరమ్మున నట కేరుదెంచిన మాలతీసుభద్ర లాచిత్రమ్ములఁ గాంచి లోలోపల మెచ్చికొని పరిశీలించుచుండ మాధవుఁ డాలేఖను ముందునకుఁ ద్రోచి పరికింపు మనునట్లు చూడ మాలతి సవినయంబుగ నద్దాని గ్రహించి విచ్చి ప్రతివాక్యమును మరల మరలఁ బఠింపుచు నామూలాగ్రము బరిశీలించి 'మీ రింతకుమున్న వాగ్దాన మిచ్చినతీరున నీమెచరిత్ర మెఱింగించినచో మా కందఱికి నానంద మితోధికముగ సమకూర్చి నవా రగుదు' రన, నతండు జననీయాభిముఖ్యమును జూపుకల గ్రహించి చిత్రము నుద్దేశించి "యీయమ, 245

చ. సిరియపరావతార మని చెప్పుట యే సహజోక్తి; బ్యాంకునం
దిరువదియైదులక్షలకు నెక్కుడురొక్కము గల్గియున్న; దీ
సురుచిరగాత్రహర్మ్యమున శోభయు వైభవ మెన్నఁజాల, నెం
దఱో నౌకర్లు చాకరులు తద్భవనంబును గొల్తు రిచ్చలున్. 246

క. ఆగర్భైశ్వర్యమ్మును
భోగమ్ములు గలిగి తప్పఁబుట్టె ధనికులం
దీగర్వాహంకారమ
దాగణ్యస్వార్థరహిత యతిశయబుద్ధిన్. 247

ఉ. కుమ్మరిపుర్వు నా వెలయుఁ గోమలి; యుల్లము ముల్లెకొల్ల లై
సొమ్మసిలంగ మైమఱచి శుద్ధపశుత్వము నాశ్రయించి రో
క్కమ్మునె తానుగాఁ దలఁచు కర్కశచిత్తము లేమియే యదృ
ష్టమ్మనవచ్చు, నీమె కపచారము సల్పుటె విత్త మెంచుటల్. 248

గీ. మంజుభాషిణి; గంభీరమధురహాస
మాననంబున శోభిల్లు; నాకృతిఁ గన

వినయసౌజన్యములు పెనవేసికొనఁచు
శత్రు నైన నను గౌరవస్వాంతుఁ జేయు." 249

వ. అని మాధవుం డాదరమ్ముగఁ దనసహపాఠి గుణశీలవయోదికముల నెఱింగించి, యామెనామధేయమ్మును, నది లభించిన వయువును, మధు కుమారీహృదయపరిభేదకస్థితియు ననుకంప శ్రోతలహృదయములు ద్రవించున ట్లభివర్ణించి, సహపాఠిగఁ బ్రథమవత్సరమున నామెప్రవర్త నంబును, నామె ప్రప్రథమమునఁ దన్నుఁ గలిసికొనినవృత్తాంతంబును, దాను విందున కాహూతుఁ డై నవిధంబును, మధు త న్నుపచరించిన విధంబును, సహవాసమ్మునకుఁ దా నొడంబడినసంఘటనమ్మును గనులఁ గట్టునట్లు తెలియంబలికి, యాతఁడు మధుకుమారియం దలమిన నూత్నోత్సాహంబును, దమసహవాస విశేషమ్ములను, విద్యావ్యాసం గమమ్మును, దా నామె నాహ్వానించుటయు, నామె తిరస్కృతియుఁ, దన్నామె జన్మదినోత్సవమున కర్థించిన కానుకయుం దెలియఁ బలికి, యాయుత్తరమ్మును సమన్వయించుచుఁ దెలియం జదివి, యామె హృదయనైర్మల్యము నగ్గించుచుఁ, దనకు వీడ్కో లొసంగి మధుచనిన యనంతరము రైలునం దొకయాంగ్లవిద్యావతి తనతోఁ బ్రసంగించిన విధంబును బల్కి యి ట్లనియె. 250

గీ. "స్వేచ్ఛగా నాగరులు తమజీవితముల
యందు లింగవివక్షను నరయ రెందుఁ;
బల్లెపట్టులయందునఁ బౌటక జను
లించుమించుగ నీలీలనే చరింత్రు. 251

గీ. మధ్యమశ్రేణికిన్ జెందు మనలఁబోలు
వార లిరుకక్ష్యలను జేరువారుఁ గాక
పాత్ర నెడఁబాయఁగా మనోబలము లేక
క్రొత్తఁ జేపట్టనేరక కుములుచుం డు. 252

ఉ. మధ్యమకక్ష్యవారలకు మానినికిన్ మగవానిపొత్తు దు
ర్బోధ్యము, భల్లుకంబుగతిఁ బోవును వారలదృష్టి వెన్కకున్;
సాధ్యము లైంగికైకసుఖసాధనమే యగు వారి; కెందు నా
రాధ్యము మానినీత్వముఁ బరస్పరగౌరవధర్మకర్మముల్. 253

శా. వ్యక్తిత్వంబు గణింపనేర్చుజనుఁ డెవ్వాఁ డైన స్త్రీజాతి న
వ్యక్తం బౌస్థితి నుంపఁ జూడఁడు, సమాజాగ్రాసనంబున్ బరా
శక్తిస్ఫూర్తి వహించి మాతృకుల మర్చాభాగ్యమున్ గాంచు లే
భుక్తిన్ ముక్తినిఁ గూర్చు జాతి; కదియే ముందంజగా నెంచెదన్. 254

మ. సహవాసంబును సాహచర్యమును నిస్స్వార్థానురాగంబు లే
గృహమం దందఱి కర్థ మౌనెడ, ధరిత్రీవ్యాప్త మా జాతిలో
సహనత్యాగపరస్పరప్రణయవిశ్వాసాదులా గర్హ్యముల్ ?
మహిళాలోకము నిట్టిభావము లసమ్మానంబు పాల్సేయవే. 255

మ. అని, భావించుటఁ జేసి యమ్మఘుసమాహ్వానంబు మన్నించి యా
మెను నోదార్చి వినూతనోత్సవము నే మేల్కొల్పఁగాఁ గంటి, స
జ్జనసాంగత్య మలభ్య మన్ననుడి యా సత్యంబు; సౌశీల్యచిం
తనమాత్రమ్మున లభ్య మౌనె యది ? యేతత్సాధనల్ కావలెన్.

క. పురుషుండు భావయిత్రియుఁ
దరళేక్షణ కారయిత్రి, తలపోయఁగ నీ
యిరుతెఱఁగుల కూడిక యే
ర్పఱుచున్ జీవితసుకావ్యపరమామృతమున్. 257

గీ. దృష్టి యొక్కింత మీరలు గృహపరిధుల
దాఁటఁ బ్రసరింపఁజేయుఁ డద్దానఁ దెలియు
మనము విశ్వకుటుంబంపుమధ్య నొక్క
యణుసమాన మౌ నావర్తమందు నునికి. 258

క. తలపోసితి పూర్వాపర
ములు; మనగృహసంప్రదాయములు శ్రేష్ఠము లై
విలసిల్లు, నై న రబ్బరు
వలె సాఁగుస్వభావ ముంచవలయును వానిన్. 259

క, తరుణుల బోనులలో నిడు
కరణిన్ బంధించి కాముకత్వంబునె దు
ర్భరముగను నంటఁగట్టుట
సరి యగునే ? మహిళ కామసాధనమేనా ? 260

గీ. సాధుశీల, సంస్కృతభావ, సహృదయ, దుర
దృష్టవతి, మిత్రు ననుఁ బరిదేవనమ్ము
సల్ప నీకొంటె వసియింపఁ జానఁ గూడి;
విజయవంతము యయ్యె నావృత్త మింగు. 261

క. కరుణామయుఁ డగు పరమే
శ్వరుఁడు ప్రసాదించె నొక్కసద్గుణవతి నా
మరణంబు మైత్రితో ననుఁ
బరిశుద్ధ మొనర్ప వెలుఁగుబాటలు దీర్పన్. 262

సీ. ప్రతిమాసమును నాకుఁ బంపెడి విత్తమ్ము
నామె కోసంగ ననాదరించెఁ
గై కొన, నేను నిక్కచ్చిగాఁ జేకొను
మనఁ జిఱునవ్వుతో నందికొనుచు
నిర్భాగ్యవిద్యార్థినీవర్గమును జేరి
యుచితవేతనముల నొసఁగఁదొడఁగెఁ;
ననుదినదానము లవి యగణ్యమ్ములు
నెలసరి యీాగి లెక్కలను వేలు

గీ. దాఁటును; వదాన్యతయె మూర్తిఁ దాల్చె ననఁగఁ
చేతి కెముకయె లేక యాచిగురుఁబోఁడి
ఆర్తిదైన్యాసమత్వము లణఁపఁ గంక
ణమ్ము దాల్చినలీలఁ జెన్నారు నీవి. 263

క. పరిణతమతి యాయమ యే
ర్పఱుపం దలపోయు బ్రతుకుబాటలలో దు
ర్భరవేదనఁ గనుస్త్రీలకు
శరణాలయ మొంపు; నార్తజనబాంధవి యై. 264

గీ. జన్మదాయిని, యనుజ, శాశ్వతసహాచరు
లగుచుఁ బరమపవిత్ర లై యలరు మీకు
దాఁపఁగాఁ నేల యీావనౌద్ధత్యసహజ
మైన దైహికాపేక్ష మ్మృగ్యంబు మధుకు. 265

గీ. తమ్ముఁ డరుదేర నమ్ముద్దుగుమ్మఁ గొంత
యర్థ మొనరించుకొనఁగలఁ డనుచు మిగుల
సంబరము నొందితిని; పల్కుఁజాల నామె
యాత్మసౌందర్య మెల్లఁ బ్రత్యక్షపఱుప." 266

వ. అని, సహజకోమలావక్రహృదయమ్మునఁ బలికి తనివి సనక "మీకె
ల్లరకు నామెఁబరిచయ మొనర్ప నువ్విళ్లూరిన నాయభిమతంబున కంత
రాయమ్ము వాటిల్లె; నామె యిరువదిమూఁడవజన్మదిన మీ రానున్న
పదియవతేది; కావున నాఁటి కామెకుఁ జేరునట్లు తక్షణ మొకజాబు
వ్రాయునగు;" నను నందను నాలోకించి సుభద్ర నెమ్మనమున నాతని
ముగ్ధహృదయసౌందర్యమ్మునకుఁ దనిసి "బాబూ ! మధు ననురాగ
మొలయ నాశీర్వదింపఁ గుతూహల మగుచున్నది. నీ కభ్యంతరము
లేనిచో నే నామె కొకజాబు వ్రాసి యామె మన్న నోపాధి
చిన 'త న్నర్థము చేసికొనలే' మనుకళంకమును దుడువ ప్రయత్నించెద"

నన మాధవుఁడు పరమానందమును బొంది "మాతృవిరహిత యగు
నామె కవశ్యము నీశుభాకాంక్షలు మహోత్సవప్రదములు గాఁగల" వని
లేఖ విలిఖింపఁ గోరుఁడు 'నట్ల కాని' మ్మని యామె చనియె, నంత లక్ష్మి.

ఉ. ఊఁటకలమ్ముఁ గాగితమునొత్తును జేకొని రాఁగ వ్రాసె న
య్యోటికి మాట మాట సుధ పొంగిపోవఁగ మాధవుండు; మో
మోటఁ దొలంగి మాలతి విముగ్ధమనోహర మాప్రియాకృతిన్
గాటఁపుఁ బ్రేమఁ గాంచి తమకంబును గౌరవమున్ వెలార్పఁగన్. 268

శా. భావస్ఫూర్తి వెలార్పఁజాలుపదముల్ బల్మాఱు రాకుండినన్
నావేశంబును దృప్తిలేమి ముఖమం దం దందుఁ గన్పట్టఁగా
నావిజ్ఞుండు గనుల్ మొగిడ్చి హృదయంబందున్ సజీవంబు లౌ
భావస్ఫోరకశబ్దముల్ వెదకు నప్పాటుల్ నిదానించుచున్. 269

గీ. లక్ష్మి యుత్కంఠ నేత్రాంచలములఁ దొణఁక
నూర్పు ధారాళముగఁ బుచ్చి నోడి చూడఁ
దొడఁగె నగ్రజు; నంత నాతఁడు సమాప్తి
సూచకముగ నవ్వుచు మాలఁ జూచి యనియె. 270

చ. "ప్రియుఁ డొనరించుతప్పులను బ్రేయసియే సవరింపఁగాఁదగున్
నయము భయమ్ముఁ జూపి; లలనా! పరికింపుము దీని; నన్ను ని
ర్భయముగ నాజ్ఞ చేసి పొరపాటులు గల్గిన దిద్దుకొమ్ము; సం
శయములఁ దూల నేల? యిదె సర్వము నీకె యొసంగియుండఁగన్."

వ. అని లేఖ నొసంగిన మాలతి సగౌరవమ్ముగా దాని నందుకొని లోలో
పొంగుముల నాతనిఁ గనుంగొని. 272

గీ. "ఆఱునెలలలో వారు వీ రగుదు రనుట
కడిగిపోసిన సత్య; మేర్పడియె నింక
మధుమధురమూర్తి; మాననీమాననీయు
లర్చనార్హులు; శాసనానర్హు లగుట." 273

క. అని పలుకునంత లేఖం
గొని యటకు సుభద్ర రాఁగఁ గూర్మిని నారెం
టినిఁ జదివి వివిధ మా సూ
చనల నొనర్పంగఁ జేసి సవరణ వారల్. 274

ఆ. వె. మరల వ్రాయునంత మాలతి తిలకంపు
కుంకుమంబు వ్రేలికొనను దీసి
మధురభావ మలమ మధునామమున నద్దె
నొడుగ లచె దాని నరసి యత్త. 275

గీ. మాధవుఁడు ప్రియఁ గాంచి "సుమంగళి యగు
మనుచు దీవించుచుంటివా ?" యనియె; నంత
విచలితాత్మ యై యచ్చోటు వీడి పోయి
యర్చనామందిరముఁ జొచ్చె నా సుభద్ర. 276

క. చిరునామా వ్రాయఁగ స
త్వరముగ నవ్వానిఁ బంచి వారలు మధునే
పరిపరి తలపోయుచు ని
ర్భరమోదాంబునిధిఁ గ్రుంకఁ బొల్పడి రంతన్. 277

శా. పూజామందిరమందుఁ జొచ్చి యపు డప్పూఁబోణి శర్వాణికిన్
జేజేల్ సల్పె నమంగళంబు తొలఁగన్ శ్రేయంబులన్ గూర్ప నం
భోజాక్షిద్వయ మశ్రులం గురియఁగన్ మూర్తిభవచ్చింత నా
రాజద్బింబనిభాననంబు రుచిపూరం బెంతయున్ గోల్పడన్. 278

శా. హింసావర్జితవాఙ్మనఃక్రియ ! కృపాహేరాళ ! స్వైరక్రియా
హంసధ్వంసవినీతసంయమ ! సదాహారోపవాసాదిక
ధ్వంసాధివ్యధజాడ్యవర్గ ! ఘనతత్త్వజ్ఞానవేత్త్రీ ! జగ
త్సంసారా ! మహిళాకులాభరణ ! మాతా ! చిన్నమాంబాసతీ ! 279

శ్రీమన్మాతాపితృభ్యాం నమః

# మధూదయము

## నవమాశ్వాసము


బాగెమదేవీసుత!
ప్రాబంధోక్తిప్రచారభాషానిధి! స
త్ప్యాబంధదానశీలా!
ప్రాఁబలుకుల తుదను గనువరాహనృసింహా! 1

వ. అవధరింపుఁడు. 2

క. నవనీతమృదులహృదయా!
ప్రవిమలరాకేందుబింబభాస్వద్వదనా!
యవిరళసత్కార్యరతా!
యవధానంబున వినంగ నగు నీకఁ బూర్ణా! 3

క. తనరాకన్ విని చూడఁగఁ
జనుదెంచిన మేనయత్త సదమలభక్తిన్
దనియించె మాధవుఁడు; దన
యనుజాతులక్షేమములను నారసి జననిన్. 4

గీ. వివిధపరిచర్యలను సల్పె వినయభక్తి
భరితచిత్తయై మాలతి; ప్రముద మలర
రోహిణి కుమారిఁ గాంచి యశ్రులను రాల్చెఁ;
గన్నకడుపుతీఁపును వెలఁ గట్ట వశమె? 5

క. అట భాగ్యనగరి మధువ్యా
త్పుటమున ననురాగమధువు తొల్కాడఁగ నా
ఱటఁ గన కనిశముఁ బ్రియులం
పటచిత్తమ్ముల క్షణ మొకమన్వంతర మై. 6

గీ. తోఁచ దినములు పోఁద్రోయఁ దొడఁగె; నంత
నొక్కనాఁడు కళాకారు నొకనిఁ జీరి
తనమనోహరుతోఁ గూడి కనులవిందు
సల్పు తనచిత్ర మతని కొసంగి దాని. 7

ఆ. వె. విస్తరింపఁ జేసి వివిధవర్ణాత్మక
మానవప్రమాణమహితచిత్ర
రచన సల్పఁ బంచె రాజీవనేత్ర ని
శ్శంకఁ బ్రియుని హృదయజానిఁ జేసి. 8

సీ. అపరంజిలతలఁ జెన్నారుదంతపుచట్ట
మందు మాధవుచిత్ర మమరఁ జేసి
యభిముఖంబుగ శయనాగారమునఁ దన
టేబిలుపై నిల్పి, రీవిఁ గుల్కు
నమ్మంజులాకార మనురక్తి భక్తివి
నీతి హర్షామర్ష లాతతముగఁ
గ్రమ్మ నతృప్తనేత్రమ్ములఁ బరికించు
జలజల హర్షబాష్పముల రాల్చు

ఆ. వె. మధుకుమారి మనము మాధవుతో నిండి
ఛాతికావరోధపటలి నుడిపి
నిర్భరానురాగనీరధి విహరించె;
నాశ్రయించి చిత్రయానపాత్ర. 9

సీ. ఎద భావములు నిండి ప్రిదులునో యనుశంకఁ
జిత్రంబు గుండెపైఁ జేర్చి యదుము
నదిమి మోహము వృద్ధి నందఁగాఁ బరవశ
యగుచుఁ బర్యంకమునందు వాలు
వాలుగన్నులఁ బొంగువారఁ గాంక్షలు చిత్ర
ఫలకమ్ముపైని ముద్దులను గ్రమ్ము
గ్రమ్మునశ్రులు ధారగా గండముల డిగఁ
బాఱఁ బుల్కలు దేహవల్లి నలము
గీ. నలమటం గాంచు రక్తరక్తాణువులను
స్పందనస్ఫూర్తి మాధవస్మరణ వినుచు
వినిచెఁ జిత్రముఁ బ్రియునిగాఁ గనుచు భ్రాంతి
గదుర హృదయవ్యథను మధు కాంక్ష నొకట. 10

సీ. చిత్తజాకార! నీచెలిచెల్వ మీలీలఁ
గోలుపుచ్చఁగ నెట్లు తాళఁగలను?
కరుణాలవాల! యక్కటికంబు వలదె ని
ష్కలుషచిత్తను నన్నుఁ దలఁప వేల?
మహదాశయా! నీదుమగువను నీక్రియ
నలఁత నొంచుట సజ్జనార్హ మగునె?
సరసాంతరంగ! నీసరసిజాక్షి నుపేక్ష
సల్పఁ బొల్పడిన నే సైఁపఁగలనె?
గీ. పుడమి నాయొక్కనెత్తినే ప్రొద్దుపొడిచె
నయ్య! పూర్ణాహుతిగను బ్రేమాగ్ని సర్వ
మర్పణ మొనర్చుకన్యక నాదరింప
వకట! యాఁడుపుట్టువె యుపేక్షార్హ మేమొ! 11

గీ. అనుచుఁ గను లప్పగించి శూన్యమును గొంత
తడవు కామిని యోచనాతత్పర యయి
కాంచె; శ్వాసావరోధము గలుగఁ బ్రణయి
నీత్వమును వీడి చెలి యోగినీత్వ మందె.

ఉ. ఆదట విన్నఁబా టొలయ నాసుకుమారి వినమ్ర యై ప్రియా!
లే దొకదోస మెన్న, మతి లేక యవాకుచెవాకు లిన్ని మీ
మీఁదను రుద్దియుంటి; మిడిమేలపుసౌఖ్యముఁ జిక్కఁబట్టఁగన్
మాదృశు లెట్లు యోగ్యులు? క్షమం గనుమా చరణంబు లంటెదన్.

మ. అనుతాపాశ్రులు జిందియుంటిరి; మదీయాహ్వానముల్ ద్రోసిరా
జనఁబోకే దయచేసినారు, కరుణాస్వాంతంబు జెన్నారఁగా
నను రంజింపఁగఁ దోడునీడ యయి యున్నా; రెన్ని జన్మాలకై
నను దీర్పంగలనే ఋణంబును? గృతఘ్నత్వంబునన్ గూరితిన్. 14

సీ. త్రికరణమ్ములను నా కొకచెట్టయును గూర్ప
వాత్మేశ్వరా! నింద లాడియుంటి
సరసభాషణాల విజ్ఞాన మెంతయుఁ గూర్చు
నాచార్యవర! తూల నాడియుంటి
మన మిచ్చి నాదుసేవను నచ్చి మన్నించు
నమృతస్వరూప! యె గ్గాడియుంటి
నెనలేని కనరాని యనురాగమునఁ గను
నాప్తబంధువ! కారు లాడియుంటి

గీ. నిష్కృతి లభించునే మాననీయ! నిన్నుఁ
గన్నుఁగానక దూషింపఁ గడఁగు నాకు?
నమృతభాండమె యొడి నుండ ననుభవింప
నోడి యంగలార్చెడి ననుఁ జూడు కృపను. 15

గీ. అనుచు భావోర్మికల నీఁదు లాడెడిమధు
నిశ్చలస్థిత యై మనోర్మిలనమ్ము
సల్ప యత్నించుచుండెడి సమయమందుఁ
జేటి నొండు చేకొని వచ్చి సేవకుండు. 16

చ. వినయముతో నొసంగి, యరవిందదళేక్షణఁ బాసి, ద్వారసీ
మను గొన నాజ్ఞ నిల్చెఁ; మధు మానసమున్ వడిఁ జిక్కఁబట్టి వా
నినిఁ గని 'వచ్చెదన్ గదిని నిల్పుము వారి' ననంగఁ 'జిత్త' మం
చనునయు మేర్పడన్ జనియె నాతఁడు; నంత వితర్కచిత్త యై. 17

క. ఎవ రీయానందుఁడు! బాం
ధవుఁడా? పరిచితుఁడ? వ్రాసె నామముమాత్రం
బవురా! విచిత్రమే! చూ
డవలెన్ బని యేమియో యిటన్ నాతోడన్. 18

ఆ. వె. అని తలంచి చెలియ యద్దముచెంతకు
నేఁగి వేషము సవరించి మంద
హాస మొలయఁ జనియె నతిథిమందిరమున;
కామెఁ గాంచి విభ్రమాస్పదుఁ డయి. 19

ఉ. ఆగతుఁ డంత లేచి వినయంబున వందన మాచరించి, యే
దో గొణఁగం దొడంగె; నది తొయ్యలి క్రీఁగనులన్ గ్రహించి యు
ద్వేగము దోఁపనీయకయె తీయనిపల్కుల స్వాగతంబు న
భ్యాగతితోడఁ బల్కి- యపు డచ్చటిగంటను మీట మీటఁగన్. 20

క. శ్వేతాంబరి యా చేటి వి
నీతిన్ జనుదెంచి చెంత నిలువన్, మధు తా
నాతన్విఁ జూచెఁ; జూపున్
బాతుకొనినభావ మెఱిఁగి పరిచారికయున్. 21

గీ. అరిగి తేనీరమును దెచ్చి యచట నుంప
నాదరమ్మున మధు దాని నాగతునకుఁ
గప్పులో నించి యొసఁగె సగౌరవమున;
నాతఁ డద్దానిఁ గొని వినయమును నెఱపె. 22

గీ. ఇరువురును స్వీకరింపఁగ, నేఁగె దాసి
పాత్రములఁ గొంచు; నంత సంభ్రమము వెలయఁ
గాంచు నాతనితోడ 'మీకార్య మేమి
సంశయింపకుఁ' డనియెడి చాన కతఁడు. 23

క. "క్షమియింపుఁడు; నూతనుఁడను;
తమయాదరణమ్మునకుఁ గృతజ్ఞుఁడ, మీకుఁ
శ్రమఁ గూర్చితి నామము లో
క్కమొగిఁ గనుపట్ట నిదియెఁగా భ్రమ పడితిన్." 24

గీ. అనుచు నాతఁడు తనజేబునందు నున్న
జాబు నొక్కటిఁ దీసి "నాసన్నిహితుఁడు
వ్రాసెఁ దనచిరునామ; నభ్యంతరమ్ము
లేనియెడఁ దాముఁ జూడుఁ డిద్దాని" ననుచు. 25

ఉ. గౌరవభావ ముట్టిపడఁగా నతఁ డిచ్చెను జాబు; దాని నా
సారసపత్రనేత్ర కని, స్వాంతము జల్లు మనన్ దటాలునన్
జాటిన లేఖఁ దీసి, వికసన్ముఖ యై వినయాదరంబు లే
పార 'క్షమింపుఁ డిందుఁ బొరపాటు లవంబును లేదు' నావుడున్. 26

వ. అతఁడు విభ్రమం బినుమడింప నామెఁ బరికించుచు నేమిపలుకుటకుం దోఁపక యున్న నాతని గమనించి మధు మధురస్వరంబున నిట్లనియె.

శా. "తా మిం దెట్టిభ్రమప్రమాదములు బొందం రాదు; నామిత్రులే
యీ మీ బంధులు; తల్లిఁ జూడఁ జనినా; రీనాఁటి కౌ నాఱునా;

ల్లేమీ యాత్రము నొందఁబోకుఁ, డిది మీయిల్లే; కృపాచిత్తు లై
నామైత్రిన్ గణియింపఁగోరుదును మాన్యాత్మా!” యటంచంతటన్.

గీ. సేవకునిఁ జీరి, “సామాను జేకొని చని
వారిమందిరమున నుంపవలయు” నవిన
వినయమున నాతఁ డవి కొనివెడల, నంత
హాసచంద్రిక లలమ నయ్యులరుఁబోఁడి. 24

క. “ఎందుండి రాక ? తా మీ
చందమునన్ గాక యొక్కజాబును వ్రాయన్
మందిరమున్ జేర్పఁగ రా
కుందుమె ? యెఱిఁగింప వేఁడికొనుదు” ననవుడున్. 30

వ. ఆనందుఁడు తనవృత్తాంతమును వినుచువాఁడై “నేనును మాధవుండును నాబాల్య మొక్కయెడఁ బెరగినవారము. మాజననీమతల్లులేకగర్భసంజాతలు. నేను మాయగ్రజననిచేతులందె యగ్రజునితోఁబాటు పెంపఁబడితిని. యమ్. బి., బి. యస్., నాలవయేఁడు విశాఖపట్టణమునం జదువుచున్నవాఁడ; నిందు రా నెన్నియోసార్లు యత్నించి యెవ్వియోయాటంకములు గదురఁ దుదకు మాయన్న యిట బయలుదేఱిననాఁడే విద్యావిషయికపరిశీలనార్థము మద్రాసు నా సహపాఠులతోడ బయలుదేఱి, నాఁడే యిట కొకజాబు వ్రాసితి, నదియుఁగాక విశాఖపట్టణంబున నాచిరునామా కంపఁబడు లేఖ లిటకుం బనుపఁ దపాలాఫీసునం దెఱింగించియుంటి. ఇంతకు వానిగతి యేమియయ్యెనో యూహింపనేరకున్నాఁడ” నన, మధు జరిగినపొరపాటు గుర్తించి లేచి సవినయంబుగా నాతని రం డని తనతో మాధవనివాసమందిరంబునకుం గొని చని, “యిది మీయగ్రజుని నివాసము. వారి కరుదెంచిన జాబు లిం దుండు” నని యొకయరయందలి జాబులు దీసి బల్లపై

వైవ వానిఁ బరిశీలించి యానందుఁడు తాను పనిచిన జాబు దీసి యామె కొసంగి పరికింపుఁ డని యొసంగ నామె దానిం జదివి చిఱు నవ్వు చెలువారఁ "బలుతడవలు వారిని మోసగించితిరి. తా మిప్పుడు మోసపోతి" రన, నవ్వుచు నాతఁడుఁ దనకుఁ బుష్పపురమ్ము నుండి చనుదెంచిన చెలియలియొక్కయు, నగ్రజునియు లేఖల గ్రహించి పరమాదరమ్మున విచ్చుచు నియ్యవి నాయగ్రజుండును ననుజయుఁ బనిచిన లేఖ లనుచు నొక్కొక్కటి చదువుచుండ నాతనిముఖభంగిమల నరయు మధుం గనుఁగొని చనవు మెఱయఁ "జూచుఁడు. మా చెల్లి యాగ్రహించినది. మఱి జాబునే వ్రాయనన్నది." అనుచు నద్దానినిఁ బఠవైచి యగ్రజులేఖ విచ్చి చూడ నందు సోదరిలేఖయు నుండుట గమనించి ప్రహసితవదనుఁడై యాలేఖల నామూలాగ్రముగఁ బఠించి యానందనిర్భరహృదయుఁడై పరమేశ్వరున కంజలి మోడ్చి నాతని మధు కాంచి "యనిర్వాచ్యానందమును గృతజ్ఞతాంజలియు ననునట్లు న్నది." అని సాభిప్రాయముగ నాతని నీక్షించుచు నానందుఁ డామె యింగిత మెఱింగి "నాయానందమున మీకును బాలొసంగుట ధర్మ మని యెంతు;" ననుచుఁ దనప్రణయసాఫల్యమునకై మాధవుఁ డొనర్చిన కృషియుఁ దత్సాఫల్యమును నెఱింగించి యమందానందమునఁ దోఁగె. ప్రియుని సువిశాలసౌజన్యపూరితహృదయమును విని మధు పారవశ్యమ్మునఁ జొక్కె. అనంతర మానందుఁడు సగౌరవమ్ముగ మధుం గాంచి "దయచేసి తమవృత్తాంతము వినఁ గుతూహల మగు చున్నది. మాయన్న లేఖామూలమ్మున నేని మీవృత్తాంత మెఱింగించియుండలేదు." అనిన మధు తనచరిత్రము నామూలముఁ దెలియంబలికి, మాధవు నుద్దేశించి కినుకఁ బొందినదో యనఁ దోఁపఁ జేయుచు "నంతయుఁ బేటిస్వభావుల నెఱుంగను. అందునను స్త్రీ లన్న వారి కింత నికృష్టభావ మేలనో!

ఆ. వె. మహిళ యనఁగ నొక్క మైలపాఁతయొ నాఁగఁ
జూచు టేమిఘనము ? చూడుఁడు దన
చెలిమికత్తెఁగూర్చి చెప్పఁ డొక్కింతయుఁ
దమకునైన యోగ్యతమము గాదె." 32

చ. అనఁగ ముఖంబునకా మధురహాసము దోల్కఁగ నాతఁ డింతి కి
ట్లనెఁ "బొరపాటుగా నతని నర్థ మొనర్చుకొనంగ నౌను; మీ
రనినది సత్య మంచు లవమైనను నమ్మను; నే నెఱుంగు దా
తనిఁ, దలలోనినాలుకను, దజ్ఞు లెఱుంగరు నన్నుఁబోలఁగన్. 33

ఆ. వె. వినయధనుఁడు సుకృతి విజ్ఞాని పరహితా
చరణరతుఁడు సతతసత్యభాషి
కపటరహితుఁ డన్యకాంతాజనసమాద
రాత్ముఁ డతఁడు నింద నందఁ దగఁడు. 34

శా. రెండేరెండు సుదీర్ఘవర్షములు నారీలోకరత్నమ్మ ! యా
తం డుండెన్ నను వీడి యీపురిని; విద్వాంసుండు, ధీమంతుఁ, డె
న్నండున్ జీవితమందు లక్ష్యము విడన్ నాశంబుఁ గాంక్షింపఁబోఁ;
డుండున్ మీభ్రమ కన్యహేతు వెదియో ! యూహింపలేనింతయున్.

ఆ. వె. అతిగభీరుఁ డగుట నాతనివలె నేను
మిమ్ముఁ దలఁపకున్న మీవుల దోసఁగు
పొడమవచ్చు నంచుఁ బూజ్యుఁ డూహించి యు
త్తరమువలనఁ దెలుపఁ దలఁపకుండు." 36

గీ. ప్రియగుణాకర్ణనమున నవ్వోలఁది యొడలు
మఱచి యవ్యక్తసుఖ మొందె; సరసిజాక్షి
ముఖవికాస మాతఁడు గని "పొడమిన తమ
సందియ మడంగెనా ?" యన సంస్మితమున. 27

ఆ. వె. "అన్నగారి గుణము లన్నియుఁ బ్రచురింప
వలదు మీర; లెఱుఁగవచ్చెఁ గొన్ని
ఒక్కగూఁటిపిట్ట లొండొకూఁతలు గూయ
నేర్చు నెట్లు ? వందనీయు లీరు." 38

గీ. అనిన మధుఁ గాంచి "మీచిత్త మరయఁజాల
నింద యభినందనము వోలె విందుఁ గూర్పఁ
బలుకు మీవాక్యచాతుర్య మలఁతి కాదు;
గౌరవార్హుల నే మనఁగలను మిమ్ము ?" 39

చ. అనుసంతం గడు నమ్రమై వెలయు 'ట్రే' యందున్ దపాల్ దెచ్చి డా
సిన దాసిం బొడఁగాంచి యమ్మధు తగన్ జేసన్నఁ గావింప నం
తన నద్దానినిఁ జెంతబల్ల నిడి హస్తంబుల్ దగన్ మోడ్చు దా
సినిఁ బోఁబంచి, "క్షమింపుఁ డించుక పరీక్షింతున్ దపాల్" నావుడున్.

ఆ. వె. హాస మొందుఁ బఱపి యానందుఁ డనుమతి
నొసఁగె; మధుకుమారి యుత్సుకతను
గుక్కటంబు పెంటఁ గెక్కరించెడిలీల
జాబులెల్లఁ గెలికె సమ్ముదమున. 41

గీ. ప్రియుని దస్తూరి గమనించి ప్రేమ మోసు
లెత్త జా బొండుఁ గొని యామె తత్తరమున
విచ్చుటా ? మానుటా ? యని వెఱచి దాని
నంతఁ బడవైచి లేచి యొక్కింత పోయి. 42

ఉ. సంచిక నొండు నాతని కొసంగి, క్షణం బిది చూచుచుండుఁ, డా
క్కించు కవశ్యలేఖలను నెల్లఁ బఠించెద; నొండులీల భా
వించకుఁ డంచు నాచపలవీక్షణ జాబులు గొంచుఁబోయెఁ,గా
మించినమత్తకాశిని స్మరించునె కొండొకచెల్మి మిన్నఁగన్. 43

చ. తనగదిఁ జేరి తొయ్యలి ముదంబతివేలము గాఁగ జాబులె
ల్లను బడవైచి "నాథ! నవలానవమన్మథ! దాసిఁ దన్పఁ బం
చినశుభవార్తఁ దెల్పుఁ" డని చెంతను జెన్నలరారుచిత్రమున్
అనునయమార ముద్దుఁ గొని యాదట జాబును విచ్చి మెచ్చుచున్.

ఆ. వె. కవ రెడల్చి చూడఁగా రెండులేఖలు
గానరాఁగఁ గౌతుకంబుఁ బెరుగ
నేది ముందు గొనుట యెఱుఁగక తొట్రిల్లి
యొక్కదానిఁ దెఱచి యొకటి పట్టి. 45

సీ. సంబోధనము గాంచి సమ్మదాశ్రులు గ్రమ్మ
నాపైనిఁ జూడఁగా సలవి కాక
మధు వనుపేరు కీమాధుర్య మెడఁగూర్చు
సమ్మతస్వరమ్ము మీ కమరె స్వామి!
ప్రేయసీ! యనివ్రాయు నీవలె నిత్యముఁ
బిలుచులీలను వ్రాయఁ దలఁచి రేమి?
యర్ధాంగి నై తమయాదరమ్మును ధ్రువ
పఱచుకోఁ గలుగు టెప్పటికొ! నాథ!

ఆ. వె. చరణదాసి ననుట స్మరియింప కీలీల
గౌరవమ్ము నెఱపఁ గడఁగు టేమి
న్యాయ మౌను ప్రాణనాయక! నాభాగ్య
మింక పండఁబార దేమి సేతు? 46

మ. అని చింతించుచు నశ్రు లోడికలుగా, నక్షుల్ ప్రసారించి కాం
చెను; బ్రత్యక్షరమందుఁ జిందు విమలస్నేహాంతరంగంబు న
వ్వనితారత్నము చూరలాడి, శిర మప్పత్రంబుపై మోపి చే
సెను సమ్మానము; మానసీయము గదే స్నేహానురాగక్రియల్. 47

ఉ. రెండవజాబు విచ్చుచుఁ బరిస్ఫుట మై యపరిష్కృతమ్ము లై
యుండెడియక్షరా ల్గని మహోత్సవ మేర్పడ వ్రాలు గాంచె న
య్యండజయాన, సంతకమునందు సుభద్రసమంచితాక్షరా
లుండ వితర్కకౌతుకము లొక్కమొగిన్ జెలరేఁగఁ బత్రమున్. 48

శా. ఆమూలాగ్రముఁ గాంచి, సంతసిలి, నాయారాధ్యదై వంబు నీ
భూమిన్ మాన్యుని గాఁగ దిద్దినమహాపుణ్యాత్మ నాభావిభా
గ్యామూల్యామరరత్నముల్ బడయ నాకాంక్షించి దీవించె; నా
నోముల్ పండెను బుణ్యసాధ్వికరుణాపూనాభికాంక్షన్ గడున్. 49

ఆ. వె. అని సగౌరవముగ నంజలి నెద మోడ్చి
తనివి సనక మరల దానిఁ జదువఁ
దొడరునంత దిలక మిడియున్న తనపేరుఁ
గాంచి చకిత యాచుఁ గౌతుకమున. 50

ఆ. వె. ప్రియునిజాబు విచ్చి వీక్షింప నందును
దొంటిలీలఁ దిలక మ్ముంటఁ గాంచి
గౌరవమ్ము పెరుగఁగా నియ్యది సుమంగ
ళీత్వవాంఛ నిట్టిలీల సల్పె. 51

గీ. అని తలంచి కృతజ్ఞత యతిశయిల్ల
"నపరమాతృస్వరూపిణి వై న నీదు
యాజ్ఞఁ దలఁ దాల్తు" నం చెంచి యతివ దానిఁ
దీసి ఫాలంబునందున దిద్దునంత. 52

మ. గడియారంబున మ్రోఁగె టంగు మనుచున్ గంటల్, జయధ్వాన మి
ట్లొడఁగూడెన్ సఫలార్థి నై తి నని యత్యుత్సాహ మేపార న
య్యుడురాజానన భక్తి నై ప్రియునిచిత్రోపాంతమం దంతటన్
గడుభక్తిన్ దల మోపి మ్రొక్కె ననురాగప్రాంచితాకార యై. 53

గీ. కొంతవడి తామె యక్షులఁ గురియుబాష్ప
జలము నప్పళించుచుఁ జూడ సాశ్రునేత్ర
యగుచు సంస్మితాననమున నలరుధాత్రి
చెంతఁ గానవచ్చినఁ గడు సిగ్గు నొంద. 54

గీ. చేలచెరఁగునఁ గను లొత్తి" చిట్టితల్లి!
నాకడను సిగ్గు నొందఁగఁబోల" దనుచు
నననయము సూపి 'ప్రత్యేక మైనయతిథి
సత్కృతు లవశ్యమా! తెల్పఁ జను' ననంగ. 55

గీ. "చెప్పమఱచితి నాతఁడు స్నేహితుండె
కాఁడు, మఱిఁదియు; బాంధవగణమునందు
ముఖ్యుఁ; డిప్పుడు వాహ్యాళి పోవలయును
దగినయేర్పాట్లఁ జూడుము త్వరగ" ననఁగ. 56

వ. ధాత్రి నిష్క్రమింప మధు సముల్లసితహృదయ యై యాలేఖలు రెం డింటినిఁ బట్టుకొని యానందుని డాసి "క్షమింపుఁడు. మిమ్మొంటరిగా నుంపవలసివచ్చినది. చూడుఁడు మీయగ్రజు లెంతగంభీరులో! ఇట నున్నంతకాలము తమ జననీనామమైన నెఱింగింపక యింటి కేఁగి చేసిన విచిత్ర" మనుచు నాలేఖల నాతని కొసంగ నాతఁ డవ్వానిని జదివి వికసితముఖుఁ డై "యిపుడైన మీరు విజిత లైతి రని యంగీకరింతురా? ఆతనిస్వభావము గుర్తింపక మీ రేమో పల్కి తిరి. నాకును నాతఁడు జనని కెఱిఁగించులీల ముఖస్థముగ మిమ్ముఁ గూర్చి యెఱిఁగింపనెంచి యుండుు. మీ రద్దానిని సాకుగాఁ దీసికొని శంకించితి" రనిన, మధు పకపక నగుచు "నే నంగీకరించుట కేము న్నది? నే నేనాఁడో విజిత నైతి. మీముఖమ్మున వారిగుణస్వభావ ముల వినఁ గుతూహలమున నుల్లస మాడితి. కొంపతీసి వారి క్షిప్రహా సన మెఱిఁగింపకుఁడు. తాము స్నాన మొనర్చి దుస్తులు మార్చు

కొనుఁడు. నూతను లెన్నియో చూడఁ గుతూహలపడి వచ్చియుంటిరి. మీయన్నగారిభారము నేన వహించుట ధర్మము గదా !" అని పలుకుచు వలయునేర్పాట్లొనర్చె. 57

క. ఆనందుఁ డాదినమ్మున
సానందుం డై పురమును సందర్శింపన్
బూని మధుఁ గూడి నగరో
ద్యానమ్మున కేఁగెఁ బెక్కుతావులఁ గనుచున్. 58

క. అందు మును మాధవుని మధు
సందర్శించిన ప్రదేశసంస్మృతి యొద నా
నందమును గూర్పఁగాఁ 'గూ
ర్చుందద' మిట నటంచు నగవు శోభిల్లంగన్. 59

గీ. పల్కి యానందుతో నటఁ బంకజాక్షి
వేదికాసీన యై మనోవీధి నురక
లెత్తు మధురస్మృతుల నాకళించుకొనుచు
నన్యచిత్త యై యాతని కనియె నిట్లు. 60

క. "ఇటనే మీయగ్రజు లా
రటఁ గుడిచిరి నాకు నై; దురంతవిషాదో
త్కటజీవితగాథను న
క్కటికె మెలర్పంగఁ దెలుపఁగా నానోటన్. 61

క. సరిగా నేప్రెల్ తొమ్మిది
గుఱు తున్నది; నేఁటి కెట్టికొఱఁతఁ గనకయే
సరిపడెఁ దొమ్మిదినెల; లా
పరిశుద్ధచరిత్రుచెలిమిఁ బడసితి నాఁడే. 62

క. కరుణాతరంగిణియె కొనెఁ,
బురుషాకృతి; వారి నెన్నఁబోలునె ? నాఁ డా

పరసాత్మని బాష్పము లీ
శిరమును బావనము సల్పెఁ జిరసంస్మృతు లై. 63

గీ. స్త్రీ నగుట వారికిఁక విందు సేయ నఖిల
పించి యొడఁబడఁజేయఁగఁ జెప్ప నేల
ప్రాణమే కడఁబట్టెను; రామ ! రామ !
అస్మదశ్రులు చూడ కా ననిరె యొకట ? 94

క. మఱునాఁడు విందు సల్పితిఁ;
బరిచర్యయు హేతువాదపద్ధతియును ని
ర్భరపరిదేవనమును దను
గరఁగింపఁగ సమ్మతించి కరుణామతి నై. 65

క. సహవాస మియ్యకొని రా
మహనీయులు; గూడిమాడి మసలుటచే దు
స్సహ మయ్యె వారి వీడుట;
బహుళవ్యథ, యాత్మకృతమె భావింపంగన్. 66

మ. అనురాగమ్మున నన్నుఁ జీరిరి; తదీయాహ్వానమున్ ద్రోసిపై
చిన నేనర్హను వంత నొంద; జననీస్నిగ్ధానురాగంబు నీ
కనుభావ్యం బగు రమ్మనన్ వినక మిథ్యాగౌరవాపేక్ష వా
రినిఁ బోనాడితి; నేఁటిలేఖఁ గని యార్తిం బొందితిన్ దల్లికై." 67

చ. అని యనుభూతు లాతనికి నాదరచిత్తముతోడఁ జెప్ప న
వ్వనరుహనేత్రమైత్రి ఋజువర్తన మార్దవచిత్తశుద్ధులున్
మనమున లోఁగొనన్ "మధురమంజులభాషణు లై నమీరు త
ప్పొనరిచినారు; మీరు చన నుత్సవ మచ్చటఁ గాంచి యెంతయున్.

క. మాయగ్రజనని విమలా
మాయకచిత్తమున వ్యథల మఱచి శిశువు నా

హోయిఁ గనియుందు; రనురా
గాయత్తల్ వినుతకన్యకామణియుగమున్. 69

ఆ. వె. సరసమతులు వినయసౌజన్యమూర్తులు
స్నేహపాత్రలు నవనీతహృదయ
లగుట వారు మిమ్ము ననుఁగుసోదరిలీల
గారవించి మెప్పుఁ గాంచియుండ్రు." 70

గీ. అనిన నుత్కంఠ పెనఁగొన నతనిఁ గాంచి
"భగిని తా మొక్కతే యని పల్కియుండి
రిద్ద రెవ్వారు కన్యక లింటఁ గలరు ?
తెల్పుఁ" డను మఘు కన్నులదీప్తి నరసి. 71

వ. ఆనందుఁడు సంశయాందోళనమ్ములు చెలరేఁగ దైవమా ! యిన్యో లనాఁగ పేర్మివాఁగునం దోఁగలేను కదా ! యని తలంచి, సంకుచితత్వంబు తనదిగా నూహించి యాందోళన మ్మడంచి యమ్మించు బోణి కి ట్లనియె. 72

గీ. "బిడ్డ లిద్దరఁ గనియె మా పెద్దతల్లి;
ఆమహాసాధ్వియే తన యాఁడపడుచు
సుతను నన్నును సాఁకె నిస్తులకృపాను
రాగముల ముంచి కన్నగర్భముల వోలె. 73

గీ. మ మ్మెఱుంగుదు; రింకఁ గుమారికలను
దెల్పుదును; లక్ష్మి సోదరి; దివ్యచరిత
మాలతీనామశోభిత మఱఁద లగును
జదువుచుండి రిద్దరుఁ గళాశాలయందు. 74

ఉ. మాలతి సాధుశీల, నయమార్గపురోగమనైకచిత్తయై
చాలగుణాలతుల్య యనఁ జాలును మీరు; త్వదీయమిత్రుఁ డే

మాలసచిత్తమున్ గొనిన యార్య; యరుంధతి వోలె భూరిస
చ్ఛీలమునన్ స్మరింపఁబడు సిద్ధముగా గృహిణీమతల్లి వై." 75

మ. అను నానందునిపల్కు- ములుకు-గతిఁ గ్రూరాఘాతమున్ గూర్ప జ
వ్వని శాతోగ్రకుఠారపాతమున రంభావృక్షమొక్కు-మ్మడిన్
అనుకంపాకర మాచుఁ గూలుగతి నయ్యానందుపాదస్థలిన్
దను వల్లాడఁగఁ గుప్పఁగూలుచును జైతన్యంబుఁ గోల్పోవఁగన్. 76

గీ. నింగి తెక్కు- లల్లార్చు విహంగకన్య
యలుగు సోఁక విహాయసాంచలమునుండి
జాలిమై నేలఁ గూలెడిలీల వాలె
నతివ యానందువాక్యశాతాంబకముల. 77

ఉ. ఆసుమకోమలాంగి వివశాత్మతఁ గూలుటఁ గాంచి దైవమా!
యీసుకుమారి యిట్లగుట కేమికతంబు? మునింగె మూర్ఛలో
మోసము సంఘటిల్లెఁ; జెలి ముగ్ధమనంబును నన్నవశ్యమున్
జేసె; నిరాశ పైకొనఁగఁ జేద్పడె నీగతి నక్క-టక్క-టా! 78

గీ. అని తలంచి యానందుఁ డత్యంతవంతఁ
దటుకునను లేవనెత్తి యాతలిరుటాంగిఁ
జేర్చి వేదికాంతరమునఁ జెంతఁ గలుగు
జలములను దోసిటను దెచ్చి కలికిమోము. 79

చ. తుడిచి, రుమాలుతో విసరఁ దోయరుహానన మేలుకాంచె; యా
రడి ద్విగుణమ్ము కా నతిభరమ్ముగ నూర్పులఁ బర్వఁజేయుచుం
జెడిచెలి జాలిమై నతఁ డనేకవిధంబుల నూఱడింపఁ బా
ల్పపఁ, గపఁ గ్రాఁగుతైలమున వారినిఁ జల్కి-నపోల్కి- యా వగన్.

ఉ. చిత్తరవోయి చూచుఁ గడు వ్రేగు, సెగల్ నెగయుంచు నూరుపున్
మొత్తము బుచ్చుఁ, గాలువలఁ బోలె నిరంతరబాష్పధార లు

ష్ఫోత్తుగఁ బారఁజేయుఁ, బలవించును, దైవము దూరుఁ, జింతనా
యత్తమనంబునం గను విహాయస మాచెలి దైన్యమూర్తియై. 81

గీ. ఆమెఁ గూర్చొనఁజేసి "మీ కార్తిఁ గూర్చి
పాపి నైతిని; దుర్గమప్రణయపథము
నం దవాంతరములు పెక్కు; లంతమాత్రఁ
డ్వాదృశులు క్రుంగిపోవుట ధర్మ మగునె? 82

గీ. అమృతము విసమ్ముగను విష మమృతముగను
గాలవైపరీత్యమ్మునఁ గానఁబడును;
దైవసంకల్ప మెట్టిదో తలఁప వశమె?
ధైర్యమును జిక్కఁబట్టుఁడు; తగునె పొగుల? 83

గీ. విస్మరింపుఁడు జరిగిన విషయ; మింకఁ
గ్రొత్తయుత్సాహమును గీలుకొలుప యత్న
మొనరుచుట యోగ్య మగు; సుఖ మొంద గతము
విస్మరించుటయే యగు విజ్ఞపథము." 84

గీ. అనఁ జివాలున మధు లేచి "యగును సౌఖ్య
మొంద విస్మృతిసాధన; మొందు నేల?
యాత్మనే విస్మరించుట యార్యనారి
ధర్మ; మర్మ మెఱింగితి; ధన్య నైతి." 85

మ. అని శూన్యంబును గాంచి హస్తయుగ మయ్యబ్జాక్షి కీలించి మో
జనసీ! ప్రేమపగస్వరూపిణి! కృపాస్వాంతంబునన్ నాకు దీ
వెన లిమ్మా! భవదీయపుత్రికను నుర్విన్ డించి పోనాడఁగాఁ
జనునే? దుర్భరదుఃఖపావకశిఖాసంఘన్న నన్ జూడవే!" 88

గీ. అంచు నన్మీలితాక్షి యై యశ్రుధార
లొడిఁకలు గట్ట స్మృతిఁ దక్కియుండె; యవన

శిల్పభంగిమ మలఁచియుంచిన పసందు
పాలరాబొమ్మ యనఁగ జవ్వని చెలంగ. 87

ఉ. గౌరవభక్తి లొక్క-మొగిఁ గ్రమ్మఁగ "హే! కరుణామయా! దయన్
సారసనేత్ర దుర్భరవిషాదవిముక్తగ సల్పుమయ్య! ని
ష్కారణ మార్తిఁ గూరిచి వసంతమనోహరపుష్పరాజ్ఞి నీ
తీరున స్రుక్కఁజేయఁగ విధించితె? యెంతటిరాతిగుండెయో! 88

ఉ. వ్రేఁకటిచిత్తులై వెతలవెల్లువఁ జిక్కఁగ గోరుచుట్టుపై
రోఁకటిపోటునా వలపుసొంపిని దించి యలంపఁబూనుటల్
నీకృపకున్ నిదర్శనమ? నీరజనేత్ర దృఢానురాగ మ
య్యో! కడముట్టు టెట్లు? విరహోత్కట యెంతకు సాహసించునో?

ఆ. వె. రాక రాక వచ్చి రక్కసతుప్పలోఁ
జిక్కుకొన్నలీల నక్కటకట!
భగ్నహృదయఁ దేర్చుపని నెత్తిపైఁ బడె
విధివిధాన మెంతవింత తెలియ." 90

వ. అని యానందుఁడు కలఁతఁ బొందుచుఁ గర్తవ్యచింతనామతి యో
చించుసమయమున నామె యుత్తేజితస్వరమ్మున నానందు నుద్దేశించి
"మీ రన్యథా భావింప వలదు. స్వవిషయమునఁ జిక్కి బంధు
మర్యాదల కెడ మైతి. మన్నింపుఁడు. నామన మించుక విశ్రాంతి
నొందు టావశ్యకము. గృహోన్ముఖుల మగుదుమా?" యనిన
నానందుఁ డామెగంభీరవదనమును జూచి విచలితుఁడై దీప్తిమంతము
లగు నామెకన్నులఁ జూడ నోడి యామెకుఁ బురోగామి యై కారుం
జేరి యం దాసీను లై గృహంబుఁ జేరునంత కతిథిమందిరమ్మునందు
మధుదర్శనార్థ మై వేచియున్న చిత్రకారునిరాక నెఱింగి యాతనికి
దర్శనం బిచ్చి తదానీతచిత్రమ్ము నాలోకించి మెచ్చి యతని నుచిత
రీతి సమ్మానించి పనిచె. పదపడి చిత్రమ్ము నానందునికిం జూపి "మీ

దృష్టి నిది నిషిద్ధం బగునేమో ! కాని యనాఘ్రాతకుసుమంబున
కర్పించుకొను స్వాతంత్ర్యము జన్మసిద్ధము. దాని నెవ్వరు వారింపఁ
జాలరు. ఏకలవ్యుని కస్త్రగురునిచిత్రంబు వోలె నా కిదియే మార్గోప
దేష్ట యై తరింపఁజేయఁగలదు." అని శుష్కహాస మొండు బఱపి
పరిచారకులచేత దానినిఁ దనశయనమందిరమున సముచితస్థలంబున
నలంకరింపఁజేసె. 91

ఆ. వె. నివురుఁ గప్పినట్టి నిప్పుకకై వడి
మధుహృదంతరమున మఱఁగుచున్న
వ్యథ నణంచి వినయవర్తనం బేపార
నర్హవిధుల నతిథి నర్చఁ జేసె. 92

క. ఆ మాన్యచరితచరితం
బామూల మెఱుంగుకొలఁది నద్భుత మలమన్
భామాహృదయంబున కీ
కోమలియే గీటుఁరాయి; గుణమణి యనుచున్. 92

గీ. తలఁచి యానందుఁ డమ్మధు నలరఁజేయ
బహువినోదవిచిత్రసంభాషణముల
నల్పఁదొడఁగెను; ఫలము లేశంబు లేక
మేలుకొనువాని మేల్కొల్పులీల కాఁగ. 94

గీ. చూపులను మాధ్వ్య మిసుమంత తోఁపకునికి
హాసమునఁ దీయఁదనము దొల్కాడకునికి
వదనగాంభీర్య మొక్కింత వదలకునికిఁ
గాంచి యాతఁ డమ్మలిక యగ్గలము గాఁగ. 95

వ. మధును విశ్రాంతిఁగొనఁ బంచి తాను శయనింపఁ జని మధుభావికై
దిగులు గుడుచుచు. 96

గీ. ఈసమస్యాపరిష్కృతి కేను దగను;
అన్న యిట కవశ్యము రాకయున్న సిలుఁగు
లెన్ని వాటిల్లునో ! బాల నిట్టిచెట్టఁ
గాంచఁజేసితి నేన నిష్కారణముగ. 97

వ. అని యనుతప్తుఁ డై ప్రాతఃకాలమున నగ్రజుని కొకతంత్రీవార్త నొసంగఁదగు నని నిశ్చయించి, యాతఁ డరుదెంచునప్పటికిఁ దా నచట నుండుట యోగ్యంబు గానేర దనియు, నాతఁడు తంతి నందుకొని యెంతత్వరగా బయలుదేఱినను నెల్లి మెయిల్‌లోఁగాని రానేరఁడు; గావున నాతని సంధించునట్లుగ రే పిట బయలుదేఱి పయనించిన సామర్లకోటయం దాతనిఁ గలిసికొని సమగ్రవృత్తాంతమును నివేదించినచో వలయుప్రతిక్రియ నాతఁడే యోచించి మధు నోదార్పఁగలఁ డనియు నూహించి యాతండు నిద్రించె. 98

గీ. అతఁడు మఱునాఁడు నౌకరు ననిచి తంతి
వార్తఁ బంచి ప్రయాణ మై బహువిధముల
నూఱటం బల్కి చనియె నిట్టూరుచు నను
రక్తనేత్ర యా బాలకుఁ బ్రణుతి సల్పి. 99

వ. అటఁ బుష్పపురమ్మున నరమరికలు లేనికూరిమిని మాలతీమాధవులు భవిష్యజ్జీవితప్రణయసౌధనిర్మాణపరాయణు లై దినమ్ములఁ బుచ్చుచు జనవరి పదియవ తేది మధుజన్మదిన మగుట నాఁ డామె యాయురారోగ్యకల్యాణముల నాకాంక్షించి దైవప్రార్థన మొనర్చి మాలతీప్రేరితుఁ డై మధుకుమారికి శుభాకాంక్షలు వెలార్చుపద్యమ్ముల వ్రాసి ప్రియురాలి కొసంగ నామె పరిశీలించుచు సూచన లొనర్చు నవసరమ్మునఁ దంతివార్త సేరుఁడు మాధవుఁ డద్దానినిఁ బఠించి ప్రకంపితాంగుఁ డై నిట్టూర్చుఁడు, మాలతి 'యే మది ? దుర్వార్తయా?'

యనుచు దానిని గ్రహించి, పరికించి, విన్నదనం బొలయ 'నయ్యో! యేమికష్టమో!' యని నిట్టూర్చె; నంత సుభద్రాదు లట కరుదెంచి యావృత్తాంత మారసి చింత నొంది కర్తవ్యాలోచనఁ దగిలియుండ మాధవుండు వారి నుద్దేశించి యి ట్లనియె. 100

గీ. "అమృతమైత్రిస్వరూపిణి యార్తిఁ జిక్కఁ
దమ్ముఁ డానందుఁ డనిచె వార్తను; నతండు
నాకునై పోయియుండు; నారాశఁ గోరు
టరయ నాపద మిక్కుట మగుట నిజము." 101

గీ. అంతట నృసింహ మచ్చటి కరుగుదెంచి
విషయ మారసి 'పోవుటే విజ్ఞత యగు'
ననిన 'నెపు' డన్న తల్లి కి ట్లనియె లక్ష్మి
'సాధ్య మైనంతత్వరలోన చనుట తగును. 102

వ. అదృష్టవశమున రేపు భువనేశ్వరమునుండి యుదయమునసే విమానము హైదరబాదు పోవ నిర్ణీత మైన దినము గావున నన్ను సాయంతనపు మెయిల్‌లో నటకుఁ జేరిన రెండునా ళ్లాందోళనమ్ములో సంకట పడ నవసరముండక యే రేపుమధ్యాహ్నంబునకు మధుం జేరఁగలఁడు. యోచింపుఁ' డన నదియయుక్తంబుగ నంద ఱంగీకరించిరి. 103

గీ. వలయుజత్నంబు లొనరుపఁ దలయొకొక్క
పని వహింప, మాలతి తనప్రాణవిభుని
పెట్టె సర్దఁగఁగడఁగెను బ్రియవియోగ
దుస్సహావ్యథఁ దలపోయఁదొడఁగి యంత. 104

గీ. మధురభావము లలమఁగ మాధవుండు
సఖియసన్నిధి నిలిచి "యో చంద్రవదన !
త్వద్వియోగము సైఁచు టెబ్బంగి నెఱుఁగ
దైవసంకల్ప మిట్టివిధంబ యయ్యె. 105

ఆ. వె. మధుకుమారి నెంచ మానసం బేలకో !
కళవళంబు నొందఁ గడఁగె మిగుల;
నూయి యెదుట వెనుక గోయి నా నాస్థితి
యయ్యె నేమి చెప్పు దబ్జవదన !” 106

వ. అనిన మాలతి హృదయమ్మునఁ బెల్లురేగువ్యథను గాననీయక. 107

గీ. “ఱోలు మద్దెలతోఁ దన జాలిఁగోలుపు
గోడు నెఱిఁగించె ననులీలఁ గోమలాత్మ !
నామనోవ్యథఁ దెల్పుచు మీమనమ్ము
గ్రీలఁజేయఁగఁ బాల్పడఁజాల నిపుడు. 108

గీ. భగిని మధు నాదుకొనుఁడు; దుర్భరవిషాద
భరితజీవన సంకటపడఁగ నన్య
యోచనలు సేయఁ దగునె ? విమోచనంబె
ప్రథమకర్తవ్య; మంతటఁ బ్రణయచింత. 109

మ. కరుణాసింధుఁడు దీనబాంధవుఁడు మీకల్యాణహస్తంబు ని
ర్భరకష్టాత్మ మదీయసోదరికిఁ సంప్రాప్తింపఁగాఁ జేసి స
త్వర మానందపయోధిఁ దేల్ప నిట నేఁ బ్రార్థింతు; నామానినీ
వరసన్మానము తాము గాంచు టది నాభాగ్యంబు గాదే ప్రియా! 110

గీ. చిక్కుబట్టుఁడు మనము; నిశ్చింత నామె
నుద్ధరింప యత్నించి విశుద్ధకీర్తిఁ
గనుఁడు; కర్తవ్యవిముఖతఁ గలుగఁజేయ
దెందుఁ బ్రణయము; తమ కెఱిఁగింపనేల ? 111

క. డాయఁగ వచ్చెఁ బరీక్షలు;
నాయమ యస్వస్థ యయ్యె; నారోగ్యముఁ బోఁ
జేయువిధంబున మీరలు
రేయింబవ లధికమైన కృషి చేయకుఁడీ ! 112

గీ. మధుకుశలవార్త వ్రాయుఁడు; మానసమున
లేనిపోనిచింతలఁ జొక్కి-రేని చదువు
భగ్న మగును; నౌన్నత్యము వడయ నన్ను
సాధనమ్ముగఁ గొనుట ప్రశస్త మగును." 113

మ. అను నమ్మాలతి దివ్యమూర్తి మదిఁ బ్రత్యగ్రంబుఁ దా నొచు నిం
డిన సమ్మానపురస్సరం బగుచుఁ బాణిం బాణిఁ గీలించి కాం
చెను నాతండు సగౌరవప్రణయవిశ్లేషవ్యథాఖిన్నదృ
ష్టినిఁ బంకేరుహనేత్రదృక్కులను నాశ్లేషింప నొక్కుమ్మడిన్. 114

చ. వివశమనంబునన్ జెలియ వేదురు దాఁపఁగ నోపఁజాల క
శ్రువులను రాల్చె, దానిఁ గని శోకనిరుద్ధగళస్వరంబుఁ గ
న్గవ నవిముక్తబాష్పములు గ్రాలఁగ మాధవుఁ "డంబుజాక్షి ! బే
లవు; తగ దిట్లు ధైర్యము దొలంగుట; సైఁచెద నెట్లు నేఁ బ్రియా !

గీ. నేఁడు గాకున్న రేపైన వీడి చనుట
తప్పదుగదా ! యెఱుంగవె ? యిప్పు డిన్ని
బుద్ధులను జెప్పి నీ వ్వీడి పోవునప్పు
డలమటం గూర్ప నే నెట్టు లరుగఁగలను ?" 116

గీ. అనినఁ గన్నుల నాలేమ యంత నొత్తి
పాదధూళినిఁ గొని "పొరపడితి నాథ !
సుఖముగాఁ బోయి రం" డను సుదతిఁ బ్రేమ
నెత్తి యెద హత్తి వీడ్కొని యేఁగె నతఁడు. 117

ఆ. వె. అచట మధుకుమారి యానందుఁ డరిగినఁ
జిక్కఁబట్టి యున్నచిత్త మంతఁ
గట్ట తెగినయేఱుకై వడిఁ జెలరేగ
దుస్సహార్తిని ధృతిఁ దూలి యొకట. 118

చ. అకట ! విశాలభూవలయమందున నా కెన యౌ సభాగ్య వే
ఱొకతెను గానఁ; గష్టముల నొందుటకే జనియింపఁబోలు; నో
ర్వక పరమేశ్వరుండు పగఁబట్టెను; సౌఖ్యము పెట్టిపుట్ట; నే
నిఁకఁ గ్రిమిదష్టమైన విరి, నీజగమందున వ్యర్థజీవితన్. 119

గీ. ప్రేమదుగ్ధము హృదయపాత్రికను నించి
స్వామికి నివేదన మొనర్ప నేమిసేతు
నతఁడు గాలఁ దన్నెను; వ్యర్థ మయ్యెఁ బ్రణయ;
మింక నీరిక్తపాత్రము నేల దాఁచ ? 120

గీ. భ్రమను గూర్పఁగవచ్చు; స్వార్థమును రేఁప
వచ్చు; నపకీర్తి సమకూఱవచ్చు; వ్యర్థ
జీవితంబుపై మమకార మేవిధానఁ
దగదు; నిష్క్రమణంబె యుత్తమము నాకు. 121

ఉ. సోదరి మాలతీసతి విశుద్ధచరిత్ర సుఖించుఁగాక; నే
నా దివమందు నుండి ప్రియు నారయుచుండెదఁ; బ్రేమమూర్తికిన్
ఖేదముఁ గూర్పఁగా మనుట క్షేమము కా; దనుభుక్తసౌఖ్యమే
నాది, సహోదరీసుఖము నాశ మొనర్పఁగ నేల దుష్టనై. 122

చ. ఇరువదిరెండువర్షములకే పరమాయువు పూర్తి యయ్యె, నె
వ్వరికిని హాని లేనిక్రియఁ బాయఁగ నా నసువుల్, విరించి యి
క్కరణిని వ్రాసెఁ; జింతఁ గనఁగాఁ దగునే ? సమకూఱె జన్మవా
సరమును నేఁడె జాలమును సల్పఁగ నేల యటంచు నెంచుచున్. 123

వ. కొండొక యోచించి జన్మవాసరంబును మృతదినంబును నొక్కటియే
యయ్యె. దీర్ఘవిశ్రాంతిఁ గొనుటయ కర్జం బని యెంచి యిష్టదైవం
బును మాతాపితరులను మనోహరుని సునిశ్చితాత్మయై ధ్యానించి
జోత లిడి. 124

గీ. స్థిరచరాస్తులు మాధవు సెందునట్లు
మరణశాసన మొండు నమ్మధు లిఖంచి
యంతిమాభ్యర్థనము సల్ప నభిలషించి
జాబు ప్రియునకు వ్రాయ నాచాన తొడరి. 125

సీ. ప్రాణేశ్వరా! లోకపరిధులు దాఁటఁగ
నున్న యీ సమయమం దుత్సహింతుఁ
గపటమ్ము లేక నా కాంక్ష దెల్పఁగ; క్షమి
యించెదు; మిమ్ముఁ బ్రేమించియుంటి;
భగ్నాశయమ్ము దుర్భరజీవితమ్మును
భరియింప నోడి, మీభావిసుఖముఁ
గాంక్షించి మర్త్యలోకము వీడ నున్న నా
నేరము మన్నింపఁ గోరుచుంటి

ఆ. వె. నస్మదగ్రజాత యైనమాలతి చిర
సౌఖ్య మొంద నేను శాంతిఁ గందు
నామె కీడుదు నాప్రణామంబు లందించుఁ
డీయభాగ్యచిత్త మెఱిఁగి మీరు. 126

గీ. త్వత్పదాంకితఁ, దమసౌఖ్యభంగ మొంచి
తప్పుకొనుచుంటిఁ; జివరిప్రార్థనము నొకటి
త్రోసిపుచ్చక నన్ను సంతోషపఱుపఁ
బ్రాణనాయక! యొడఁబడవలయు మీరు. 127

గీ. నాతనువుఁ జిత్తమును మి మ్మనారతంబుఁ
గోరి తపియించి నశియించెఁ, గొదువయున్న
మరణశాసనమును దృఢీకరణ సల్ప
ననుభవించెదు దివి సుఖ మంద నేను. 12

ఆ. వె. అనుచు వ్రాసి కనుల నశ్రుధారలు గార
వ్రాయలేక తుదను వ్రాలు చేయు
చెలియశిరముమీఁద జలజల కన్నీరు
పడుట నొడలు జెలిసి పద్మనేత్ర. 129

ఉ. కాంచెఁ, బ్రకంపితాంగు, నురుఘర్మజలస్రవవక్త్రు, నశ్రునే
త్రాంచలు, శీర్ణకుంతలు, నిరంతరనిశ్వసనోర్మిమాలికా
సంచలితోన్నమద్హృదయు, సాధ్వసముం భయముం బెనంగ నే
తెంచినమాధవున్ వినయధీసువిశాలు మహానుభావునిన్. 130

ఉ. కాంచి, హసించి, యొక్కకలఁ గాంచినలీలఁ దలంచి, దృష్టి సా
రించి, సమంచితాకృతి ధరించినభావము గాఁగ నెంచి శం
కించుచు 'వంచకత్వము వహించుట మేలె ?' యటంచుఁ గేలుఁ గీ
లించె వికుంచితాంగము చలించుచు నుండఁగ నంచితంబుగన్. 131

ఉ. సుందరి విభ్రమస్థితినిఁ జొక్కుటఁ గాంచి విషాదచిత్తుఁ డై
"కొందల మందఁబోకు చెలి! కోల్కొను మించుక; మాధవుండ నా
నందునితంతివార్తను మనంబు తపింప విమాన మెక్కి నే
నిందుల కేఁగుదెంచితి భ్రమింపకు" మంచుఁ గరంబు వట్టఁగన్. 132

ఉ. లేచి కృశాంగి చెక్కిళుల లేతగులాబిజగామెఱుంగుతోఁ
బూచిన క్రొత్తచెంగలువపోలిక మోము చెలంగ మోహముం
ఆఁచుకొనంగలేక ప్రియమారఁ బ్రియుం బిగిఁ గౌఁగిలించెఁ; గాల్
రాచె నిరంకుశత్వముగ రాగము ముమ్మర మూచు శంకలన్. 133

చ. అటమట మైనజీవితమునం దొకయించుక శాంతి చేకుఱం
బొటబొటఁ గారె నశ్రువులు, పొంగులు వారుచు నంత డెందముం
దటతట కొట్టుకోఁదొడఁగెఁ, దన్వి మనోహరమోముదమ్మిపై
నిటునటుఁ బర్వె మోహతరళేక్షణపంక్తులు గ్రమ్మఁజేయుచున్. 134

ఉ. "గుట్టలు మిట్టలున్ నదులుఁ గొండలుఁ గారడవుల్ పురంబులున్
బట్టెలుఁ జెట్టులుం గడచి బాలకు నై ప్రియ ! ఱెక్క లక్కటా !
ఇట్టులఁ గట్టుకొంచుఁ గృప నేటికి వచ్చితి వయ్య ! చావుకై
పుట్టినకట్టెపై మరల మోహముఁ గూర్చితి వేమిసల్పఁగన్." 135

గీ. అనెడి చెలిఁ గాంచి, చెయ్యెల నరసి, పల్కు
లెంచి, మాధవుఁ డెదను దలంచె మించుఁ
బోఁడి యున్మాదమును బొందఁబోలు ననుచు;
వ్యగ్రచిత్తుఁ డై సఖిని సోఫాను నుంచి. 136

మ. తనయుత్సంగమునందు మాధవుఁడు నాతన్వీమణీమస్తకం
బును స్నేహంబునఁ జేర్చి, కన్నుఁగవ నింపున్ గుల్కఁగా నొత్తి, మో
మును గారామునఁ దుడ్చి, ముంగురులు గోముల్ జూపుచున్ దిద్ది కీ
ల్కొనుశోకమ్మున బాష్పనేత్రుఁ డయి యాలోకించి లోలాక్షికిన్.

గీ. ఎలుఁగు రాల్పడ "మధు ! విధు నీసడించు
నగుమొగం బిట్లు విన్నఁదనంబు నొందఁ
జిక్కి సగమైతి వేమి ? నీచిత్త మిట్లు
వికల మగుటకు హేతు వవేద్య మకట ! 138

గీ. ప్రాణ మిడియైన స్త్రీకులాభరణ మైన
నిన్నుఁ గాపాడుకొన నెంచియున్న నాకుఁ
దెలుప కీక్రియ లోలోనఁ దేవులు గొనుట
నిర్దయగ నెంచనేరవే నీరజాక్షి ! 139

సీ. ఒకజాబులో నైనఁ జికురాంగి ! నీకష్ట
మెఱిఁగింప వన్యుఁగా నెంచినావె ?
కట్టడివిధిచెయ్యిఁ గాక ని న్నెడఁబాసి
పోనేల సంకటమున నలంచి

పలుకవా మధు ! మధు వొలుక నీయాత్మబం
ధుని నన్ను సంతోషమున మునుంగ
బాస యిచ్చితిని నీ కాసలు గొల్పుచు
దుఃఖవిముక్తిఁ గూర్తును నటంచు

గీ. స్వార్థపరుఁడ నై ని న్వంతపాలు సేసి
యున్న నానేరమును సైఁచు ముత్పలాక్షి !
వ్యథను నామూల మెఱిఁగించి వలయురీతి
నన్నుఁ బనిఁగొనఁ దగదె ? మానసము దనియ. 140

గీ. ఎప్పు డరుదెంచె నానందుఁ ? డిట్లు నీవు
సంకటస్థితి నుండంగఁ జనియె నెటకు ?
నగరవీక్షణాసక్తి నరిగెనె యతఁడు ?
పలుకు మొక్కింత మదిఁ జిక్కఁబట్టి బేల !" 141

గీ. అనెడి ప్రియుబాష్పములు మోమునందుఁ బడఁగఁ
తాళఁజాలక హృదిని దత్తరము నొంది
ధన్య నైతిని, జన్మ సార్థకత కలిగె,
నెంతసుకుమారచిత్తు సేవింపఁ గంటి. 142

సీ. ఉత్సంగ ముపధాన మొనరునిత్తఱిఁ బ్రాణ
వాయువుల్ చన సుఖపడుదుఁ గాదె !
అనుమతించఁడు నాథుఁ డమరలోకము సేర
నితని కన్మొఱఁగక మృతి యదెట్లు ?
నిష్కల్మషాత్ము వినిర్మలప్రేమస్వ
రూపు వంచింపంగ నోపఁగలనె ?
వంచకి యని శోకవనధి మునుంగునే !
పతివంచనం బఘప్రదము గాదె !

గీ. ఇంతకును నన్ను రక్షింప నేఁగుదెంచు
సదమలాత్మున కాతిథ్యసరణిఁ గనక
కలఁతఁ గూర్చితి నే నెంతకలుషమతి న
టంచుఁ దలపోసి మధు చలదాత్మ యగుచు. 143

చ. తటుకున లేచి నిల్చి పరిధానపుఁ జెంగును బట్టి మోహ ము,
త్కట మగుచుండ మాధవుని గన్నుల నొత్తి ముఖంబుఁ దుచ్చి "సం
కట మడఁగెన్ భవచ్చరణకంజము లంటుటఁజేసి; మిమ్ము ని
ష్కుటిల యలంచె, నించుకయుఁ గోపము నూనకుఁ" డంచుఁబల్కెనన్.

వ. మాధవుఁ డామె నుపలక్షించి, మనంబు కుదుటఁబడె నని యూహించి, సంతసించి "మధూ! నీ కీయున్మాద మెట్లులవడె? ఆనందుని వృత్తాంత మేమి? తెలుపుమా?" యన నవ్వుచు మధు "మీ సంశయ మింకను దీఱలేదా? తమయశ్రులు నాశిరమున రాలినప్పుడే నాయున్మాదము తొలఁగినది. మీయనుజుఁడు మద్రాసు పోయి తిరుగు దలలో మిమ్ము దర్శింప మొన్న నిట కరుదెంచెను. నేఁటిప్రాతఃకాల మాతఁడు వెడలిపోయె. మీకుఁ దంతి నిచ్చియుండెనా?" యనిన, "నయ్యో! వాఁ డెంతమూఢుఁడు. 'మధు ప్రమాదావస్థ నున్నది- బయలుదేఱుము.' అని తంతి నొసంగి, నే నిందుఁ జేరకమున్నే వెడలి పోయెనే! ఇంతకు నీప్రమాదస్థితి యున్మాదమేనా?" అనిన, నవ్వుచు "గట్టెక్కిన ప్రమాదవిషయముతో నిప్పుడు పని యేమి? తొలుత స్నానపానము లొనర్చి తరువాత నావిషయమును బ్రసంగించుకొన వచ్చు" ననుచు మధు మాధవుచరణసన్నిధి నాసీన యై కాలిజోడు త్రాడు విప్పుచుండ "నేమిది? మధూ! నీయున్మాదచర్యలలో నిది యొకటియా?" యన, "వారింపకుఁడు. నిర్బాధకము లగు నిట్టిచర్యలను వారించుచో నున్మాదము వృద్ధిపొందఁగల" దనుచుఁ దనపని

ముగించె. మాధవుఁ డామెకన్నులలోనికిం జూచుచు ‘‘నుద్వేగినీ! నే నరుదెంచునప్పటి కేదియో లిఖించుచుంటివే! ఏమది ?’’ అనిన, “లేఖ. తమకే” యని మధు పల్క, మాధవుఁడు నవ్వుచు “నీపిచ్చి వ్రాఁతలఁ జూడనిత్తువా ?” యన, “నిపుడు కాదు. నే ననుమతించు వఱకుఁ జూడరాదు. మీవద్ద నుంచుకొనుఁడు. అనుమతిఁ గొనుట మఱవకుఁ” డనుచు నామె యాలేఖను, మరణశాసనమును నాతని జేబులో నిడిన, మాధవుఁ ‘డట్లే కాని’ వ్మని ‘దుస్తులు తీసి యరు దెంతు’ నని తనగదికిఁ జన మధు మాధవు ననుగమించి యాతఁడు తీసివైచిన కోటుజేబు లన్నియుఁ దడివి యందున్న పైకమును దీసి తాళపుఁజెవులగుత్తియు, నొకచిన్నిపొట్లమును గని విస్మయంబున నప్పొట్లము దీసి యాతనికిం జూపి, ‘యిదియేమి ? నాకై సంజీవనిఁ దెచ్చితిరా ?’ యన మాధవుఁడు చకితుఁ డై దానిని గ్రహించి, విప్పి, యందుఁ గుంకుమ ముండు టరసి, యది మాలతిచర్యగా గ్రహించి నవ్వుచు, “ఔను. మధూ ! సత్యముగా నిది సంజీవనియే. నిత్యసుమంగళీత్వమును జిరంజీవత్వమును నర్థించి నీకై తెచ్చిన పరమ పవిత్రసంజీవనియే” యనుచుఁ జూప నామె పరవశయై “మీ రెంత యుదారులు. ‘‘మీపవిత్రహస్తముతోడనే యీపునర్జన్మదినమున నాకు సుమంగళీత్వమును బ్రసాదింపుఁ’’ డన నతఁ డామెయింగిత మెఱింగి, ‘‘అమరమూర్తివై నా మధు నిత్యసుమంగళీత్వమున నల రారుఁగాక !” యని యాశీర్వదించి తిలక మామెయలికమున నుంప మధు సజలాక్షి యై యాతనికిఁ బాదాభివందన మొనర్చె. 145

ఉ. ఆలలితాంగి మాధవున కర్ఘ్యసపర్య లొనర్చి, మంజువా
చాలతఁ గూర్చె నుల్లసము, సారసనేత్ర నిరస్తసంకటో
ద్వేలమనంబునన్ వెలయ విస్మయహర్ష పరీతుఁ డౌచుఁ గ
ల్లోలిని శారదాగమవిలోకనఁ బొల్చెడిలీల శాంతుఁ డై. 146

వ. మాధవుండును మధుమధురాలాపంబులఁ దనివిసనక వివిధప్రసంగంబులఁ
ప్రవర్తింపఁజేయుచు నామెయందలి పరిణామముఁ గనుచు. 147

ఆ. వె. వాన కురిసి వెలిసె; నాననబింబమ్ము
కాఱుమొయిలుగమినిఁ గ్రమ్మఁబడక
హాసకౌముదీవికాసము సెన్నారెఁ
జిత్ర మిద్ది యనుచుఁ జింత సల్పి. 148

ఉ. మానెడిపుండుపై బురుటుమాడ్కిని సంకటహేతు వారయన్
బూనిక చూప నేల ? విరిబోఁడి యొకించుక తేఱుకొన్నచోఁ
దానె యెఱుంగఁజేయు, సరదాగనె కాలము బుచ్చఁ జెచ్చెరన్
బో నడఁగింప నా రుజ; యమూల్యమహౌషధ మిద్దియే యగున్.

క. అని నిశ్చయించి మధుఁ డా
మునుపటివలెఁ గాక చనవు మోసులు గొనఁగా
ననునయసమాదరంబులఁ
గనఁదొడఁగెను మాధవుం డకల్మషమతి యై. 150

వ. మజ్జనభోజనాదు లొనర్చి మధుమాధవులు యదృచ్ఛాప్రసంగములఁ
గాలక్షేప మొనర్చుతఱి. 151

సీ. అనురక్తి మాధవుహస్తంబుఁ జేపట్టి
రేఖల నాస్థఁ బరీక్ష సలిపి
ద్వికళత్రయోగ మీధీశాలి కలవడె
నంచుఁ దలంచి యోచించెను మధు
అదృష్టవశమున నమరు నేమో ! నాకు
నీమహాపురుషు సేవించుఘనత
లేనిచో మరణింపఁ బూన విఘ్నంబుగాఁ
జనుదెంచ నేటి కీసదమలాత్ముఁ

గీ. జేవిడైనను జచ్చి సాధింతు నేమి ?
వేచి చూచుట యగును వివేక మొందు;
నిదియు నొకమేలు కే యని యెంచునామెఁ
గాంచి మాధవుఁ డనురక్తి కడలుకొనఁగ. 152

క. "సాముద్రికశాస్త్రంబును
నామూలముగాఁ బఠించి నట్లున్నది; యో
స్వామిని ! భావిఫలమ్ములఁ
దా మెఱిఁగింపుఁ" డన నింతి దరహాసమునన్. 153

క. "ఎగతాళి కాదు స్వామీ !
మగరాయలు గాన మాట మన్నింపరు; నే
నగపఱతు సాక్ష్యముగ మీ
కగణిత మహా గ్రంధములను నారయుఁ" డనినన్. 154

గీ. "తగదు కోపింప, వినిపింపఁదగును సరిగ;
సత్య మగునేని యిడుదు నిశ్చయముగాను
వలయుపారితోషికము నీ కలర" ననెడి
మాధవునిఁ గాంచి యి ట్లనె మధుకుమారి.

గీ. "ప్రణయజీవను; లుత్సాహపరులు; ధర్మ
చిత్తులు, ఋజుప్రియాత్ములు; స్త్రీధనంబు
కొల్లలుగఁ జేర్చుకొందురు; కోమలాంగు
లిరువురం జెట్టఁబట్టుదు రింక వినుఁడు. 156

చ. లలితకళాభిలాషయుఁ గళాకుశలత్వము మొందు, దెబ్బదేఁ
షులు దమయాయు వౌఁ, గొమరుఁడు న్సుత లిర్వురు సంతు, తాళుఁ డి
ప్పలుకులు సత్యమంచుఁ దెలుపం దగుసాక్ష్యము నిత్తు" నంచు న
య్యలికులవేణి గ్రంథముల నాతనికిన్ దగఁ దెచ్చి చూపినన్. 157

మ. పరిశీలించి, విమర్శ సల్పి, నిజ మై భాసించునవ్వాక్యముల్
కర ముత్సాహవిషాదముల్ బెనుప నక్కంజాక్షి నీక్షించి, "నీ
కరమున్ జూతు" మటంచుఁ జూపు మనఁగాఁ గన్గొనలం గాంచి యా
సరసాత్ముండు విషాదమొందె నని యాశ్వాసింపఁగా ని ట్లనెన్. 158

గీ. "మి మ్మలంచినవిషయ మేమియొ యెఱుంగఁ
జెడ్డ నే నేమియును మీకుఁ జెప్పలేదె!
యరయ ద్వికళత్రయోగమే యగును హేతు;
వది పురాకృత మగు వంత నంద నేల?" 159

గీ. అనిన మ్లానముఖుం డయి యతిశయార్తి
నుస్సు రని యూర్చుమాధవు నువిద కాంచి
"స్వామి! యిదియేమి మానసస్వాస్థ్య మెడలి
చిన్నఁబోతిరి మన్నింపఁ జేతు వినతి." 160

మ. అను నాసుందరిఁ గాంచి గద్గదికమై నాతండుఁ గాంతామణీ!
విను మీ వెంతటిభాగ్యశాలినివి? యీప్రేమాబ్ధిలోఁ జిక్కి వం
తను నొక్కించుక కాంచవైతి; వటు లెన్నాళ్లైనఁ బోఁద్రోయఁగాఁ
జను; నిర్భాగ్యుఁడు ప్రేమజీవి; ఫల మశ్రాంతవ్యథల్ ప్రేమకున్. 161

సీ. కామవాసన వీడి కలుగనేకలుగదు
కలిగిన నిరుపక్షములను నరుదు
అరుదుగా నిరువురియందు సంభవ మైనఁ
గలయిక నూటి కొక్కటియుఁ గనము
పుణ్యావశేంబునఁ బొసఁగినఁ గలయిక
కొనసాఁగుచుండును గోటి కొకటి
అవఁగడుగునఁ బెక్కు లవరోధములు సంశ
యమ్ములు వ్యథలుఁ బె ల్లమరుచుండఁ

గీ. బ్రేమ; నిశ్వాసములు నెద ప్రీలుఁ శోక
మశ్రులును నాత్మహత్యలు నగును దాని
ఫలము; లనిశము సల్పఁగ వలయు హృదయ
శోణితార్పణ ప్రేమింపఁజొచ్చువారు. 162

ఆ. వె. అమరె బాల్యమాది యమృతస్వరూపిణి
మాలతీసమాఖ్య మంజువాణి
ప్రణయమూర్తి ప్రేమభాగిని యై నాకు;
నరకొరలును బ్రేమ నెఱుఁగ మెందు. 163

ఆ. వె. మాన్యచరిత ! యామె మానవాంగన కాదు
జన్మఁ గన్న దేవసంభవి యగు;
నీచరిత్రఁ దెలుప నాచంచలాక్షి య
శ్రులను రాల్చెను నిజసోదరి యన. 164

క. గుఱుతించినావొ ! లేదో !
తరళేక్షణ ! జాబు వ్రాయఁ దనతిలకముతోఁ
గర మనురాగంబున నీ
కు రచించెన్ దిలక మామె గుణమున్ గనుమా ! 165

గీ. ఇంతి ! నాజేబులో లభియించినట్టి
కుంకుమయు నామెయే యిడెఁ, గోమలాంగి
సర్వమంగళఁ బూజించి సకలశుభము
లలర నీ కిచ్చినప్రసాద మదియ సుమ్ము ! 166

ఉ. ఆసుగుణాఢ్య పత్ని యిహమందుఁ, దలోదరి నన్య భార్యగాఁ
జేసికొనంగఁ గోర; విధిచెయ్ది మఱొక్క విధానఁ దోఁచుటన్
జేసి మనంబు ప్రీలె; మనచేతులఁ గాఁగలకార్యమా ? కృపన్
బాసి పరాత్పరుండు తలవ్రాసినవ్రాలును దప్ప శక్యమా ? 167

మ. భ్రమతోఁ గర్తల మే మటంచును నహాంభావంబు దుర్గర్వమున్
దమలోఁ బెంపెనయంగఁ బ్రాకృతులు గానంజాల రీవిశ్వసూ
త్రముఁ జేపట్టిన కర్త యొక్కఁడు సమస్తం బాత్మసంకల్పమా
త్రమునన్ ద్రిప్పుట; భ్రాంతిమగ్నులు యథార్థం బెట్లు దర్శింపనౌ.

గీ. జీవభావంబె భ్రమ, గుణసింధు వైన
దేవభావంబె సుజ్ఞానదీప్తి యగును;
దేవతాత్వసాధన మనుదినము సల్పు
టరయ మానవధర్మ మౌ నార్యశీల ! 169

ఉ. కర్మరహస్య మౌను మమకారవిదూరత; స్వార్థచిత్తు లీ
మర్మముఁ గాననేరక భ్రమ స్గఘమండలి యోగలీల మో
హోర్ముల౯ జిక్కి స్రుక్కుదురు; యోగులుగూడఁ బ్రమాదబుద్ధి నీ
ధర్మవిమర్శ భ్రాంతిఁ గనఁ దజ్ఞుల నెన్నఁగనేల మానినీ ! 170

గీ. ప్రేమ యుదయింపకుండుటే క్షేమ మగును;
సంచితఫలమ్ము వలన జనించెనేని
ఎగుడు దిగుడులు లేక నీ కగణితసుఖ
దాయక మ్మగుఁగాక నిత్యమ్ము ను మధు !" 171

మ. అన నక్కోమలి శోకరుద్ధగళ యై యశ్రుల్ ప్రవర్షించు లో
చనయుగ్మంబును గప్పి చేతులను, "హే స్వామీ! దయామూర్తి వై
నను దీవింపుము ప్రేమసిద్ధిఁ గన; నెన్నాళ్లైన నే వేచియుం
దును బోఁద్రోయఁగదయ్య! మారుమనుపీదుఃఖాత్మకు; న్మ్రొక్కెదన్."

క. అని వెక్కి వెక్కి యేడ్వన్
మునుకొన విస్మయవిషాదములు మాధవుఁ డ
వ్వనితామణి కను లొత్తుచు
ననునయ మలరారఁ బలికె నాతురమతి యై. 173

ఆ. వె. "ఏమి సంభవించె నెఱిఁగింప కీలీల
బేల వగుచు నేడ్వ నేల బాల!
అలఁతఁ జిక్కి పలుకవా వంత, సంశయా
విష్టఁ జేసి యిటులఁ గష్టపఱుతె?" 174

చ. అన సజలాక్షిగోళముల నాతని నల్లనఁ గాంచి, లేచి, యేఁ
చినయనురాగదుఃఖములఁ జెచ్చెర నించుకదూర మేఁగి, 'నా
జననమె దోషదూషితము; సైఁపఁగనేరను; జూచుకొండు మీ
రునిచిననాదులేఖ' నని యూర్పుసెగల్ నెగయించు చంతటన్. 175

చ. చనియె మరాళయాన ప్రియుసన్నిధిఁ బాసి బిరానఁ దత్తరం
బునఁ బదముల్ దడంబడఁగఁ, బొంపిరివోయెడి బాష్పవారి పై
కొనఁ జనుదోయి చెమ్మగిలి గొబ్బునఁ గుల్కఁగఁ గాను తూల, నే
సినమరుమార్గణంబు లన స్నిగ్ధదృగంచలముల్ వెలార్చుచున్. 176

ఉ. శోకసమున్నతిం గనినసుందరి యాత్మగృహంబు సొచ్చి చి
త్రాకృతిఁ దాల్చి నిల్చి "ప్రియు నారటఁబుచ్చితిఁ బాపచిత్తనై
ఆకరుణామయుం దనుపు సర్వవిధాన మెఱుంగ, దైవమా!
చేకొనరాదె? వ్యర్థమగు జీవిత మేటికి కంటకాకృతిన్." 177

చ. అని తలపోసి కూలఁబడి యార్తినిఁ జేతుల నెత్తి మోదుచున్
గనలి, మనంబునన్ దెరలుకై వడి వచ్చెడి శోకదైన్యముల్
పెనఁగొన నేలపైఁ బొరలి, పేరుటెలుంగున రాల్ ద్రవించఁగా
బనవుచు నేడ్చె; నంత వ్యథభారము గొంత శమింప వెక్కుచున్.

శా. తన్నోదార్పఁగ వచ్చినట్టి ప్రియుపాదద్వంద్వమున్ బాహులన్
గ్రన్నన్ బట్టి "ప్రభూ! క్షమింతురె ననున్ గారుణ్యచిత్తంబునన్,
విన్నంబోయితి రేమి? యేక్రియను భావిన్ మీకు సౌఖ్యంబుఁగూ
ర్ప న్నేర్తున్ సెలవిండు; పాపి ననుకంపాదృష్టి వీక్షింపరే!" 179

గీ. అనెడి బాలామణిని నాకులాత్ముఁ డగుచు
నిరుకరంబుల నెత్తి యాదరము మీఱఁ
గనులు దుడిచి యాసనమున నునిచి యతఁడు
గద్గదిక దోఁప నోదార్పఁగడఁగి పలికె. 170

సీ. "ఇందీవరాక్షి! నే నిన్నాళ్లు నీచిత్త
మెఱుఁగకుండుట నింత యేరుపడియె
నేరము మన్నింప నిన్ను వేఁడుదుఁ దొలి;
మన్నించి, పిదప నామాట వినుము;
నాసౌఖ్యమునకుఁ బ్రణయమున కంతరా
యమ్ము గూర్పమి యోగ్య మగును తరుణి!
ఆత్మసమర్పణ మాచరింపకపూర్వ
మొక్కఁటే దోష మీ వొనరించితివి
గీ. యుక్త మేమన నీప్రేమ నొక్కసారి
తెలిపి యాదరానాదరముల నెఱుంగు;
టిది తలంపక సాహస మిట్లు సల్పఁ
బూన నేటికి యుద్వేగమున మునింగి. 181

గీ. ఏది కాంక్షించి మరణింప నెంచినావొ!
ఆసుఖంబె జీవితమున నబ్బ కేను
వనటఁ బొందుటఁ దప్పించె ఘనకృపాళు
వైన పరమేశ్వరుండు న న్ననిచి యిటకు. 182

చ. గతజలసేతుబంధనముకై వ్యథఁ గూరఁగ నేల మానినీ!
ధృతినిఁ దొఱంగఁబోకుము; సుధీమతి వై యతిలోకపుణ్యసం
చిత వగునీవు ప్రాకృతులచెయ్వులకుం దొడఁగం దలంచితే
మతి చలియింప; నీప్రియునిమానస మెట్టిదొ! యెంచియుంటివా?

శా. నీయస్వస్థతఁగూర్చి వార్తఁ గనఁగానే కండ్లు చీఁకట్లు గా
వహో! యంచున్ స్మృతి తప్పనంత యయి నే నారాటమున్ గాంచితిన్;
నీయీయత్నము దప్పెఁ గాని లలనా! నీమేనుతో నాయొడల్
ద్రోయంగాఁబడియుండు వహ్ని" నన నాక్రోశించి యుద్వేగయై. 184

గీ. చేతితోఁ బ్రియునోటి నచ్చెలువ మూసి
"స్వామి! యశ్లీలములఁ బల్కఁ జనునె? వినఁగఁ
జాల; నాయపచారము సైఁపుఁ డికఁ;
గౌరవితోఁ దలగోకెడి కూర్మ నైతి." 185

క. అను నామె నాదరంబునఁ
గని "కాంతా! నీదుప్రేమ కలుషరహిత, మీ
వనురాగాన్విత వై నా
కొనరుపు మొకబాస నన్ను నుత్సవపఱుపన్." 186

గీ. అనిన వినయాన్వితాంగి యై యబ్జవదన
"బాసయా? నల్పవలెన? పర్వమ్ముఁ గూర్ప
వలయునే? త్రికరణశుద్ధి వెలయఁజేయు
దాన; సెలవిందు కృప తోఁప దాసి" కనిన. 187

గీ. "మళ్లు మాన్యాలుఁ గాంక్షింప మగువ! భావి
నెన్నఁడును నాత్మహత్యకు నిచ్చగింప
ననుచు నామీఁదఁ బెట్టుము యాన" యనెడి
మాధవునిఁ గాంచి చిత్త మమ్మలికఁ గాంచ. 188

మ. "తగునా నిర్దయ నిట్లు వల్కఁగ బ్రియా! తన్వంగి యాత్మేశు నా
నగఁ దా నెన్నఁడు బాస నల్ప; డిటు లన్యాయంబుగా నొంప మీ
కగులాభం బదియేమి? యెన్నకుఁడు మిథ్యాభాషిగా నన్ను; ధ
ర్మగతిం దప్పుదు నాత్మహత్య సలుపన్ బ్రాణేశ! పాల్పడ్డఁబోన్. 189

క. జననీజనకులసాక్షిగ
నినతారాచంద్రధారుణీసత్యంబుల్
గన నాత్మహత్య సలుపను;
అనుమానము దీఱనే దయామయ ! వినవే ! 190

మ. అమరప్రేమమయస్వరూపిణి మదీయారాధ్య యమ్మాలతీ
విమలప్రేమను మీసహోదరుఁడు దా విచ్ఛేసి యేదో ప్రసం
గమునన్ జెప్పెను; దాన మత్కృతము దుష్కార్యంబుగా నెంచి వి
శ్వము వీడన్ దలపోయు న ద్దగ దవిశ్వాసంబునన్ జూడఁగన్." 191

వ. అను నమ్మానవతి చిబుకము ననునయంబుమీఱఁ బుణికి, గండపాళి కల నిమిరి, మాధవుఁ డామెకన్నులలోనికిం జూచి, "చెలీ ! నీ న్నవిశ్వాసంబునఁ జూచుటా ? పుట్టుగతు లుండునే ? అమూల్యమగు నీజీవితము వ్యర్థముగా నొసంగెదనని భావించుట నీయుద్వేగదోషము. ఏపరమప్రయోజనము నర్థించి నిన్ను సృజించెనో యెఱుంగుదువా ? దయామయుఁడగు నాపరమేశ్వరుని సంకల్పమునకు భిన్నముగా నాత్మహాననమునకుఁ బాల్పడుటవలన నీవు సాధింపఁగల ప్రయోజనముల నెఱింగింతు వినుము. మొదటిది జగత్పితయాజ్ఞాతిక్రమణదోషము. నిర్దోషయు, నీ చిరసౌభాగ్యకాంక్షిణియు, నీ వెవ్వరో ! నీయాకార మెట్టిదియో ! యెఱుఁగకయే నిన్నుఁ దనసోదరిగా స్వీకరింపఁగలిగిన శిశుహృదయయగు మాలతిప్రణయజీవితమునందు విషము చిల్కుట రెండవది. నీదుఃఖవిముక్తికై దృఢసంకల్పుఁడనై నీసౌఖ్యసౌభాగ్యములకై కలలు గాంచుచు నీయాత్మబంధుఁడ నగు న న్నారనిదుఃఖాగ్నికీలలం ద్రోసి యామరణము వెతలఁ గుములఁజేయుట మూఁడవది. తీఱని కోరికలు, నారని హృదయవేదనలు, ముగియని జీవితము గలిగి పునర్జన్మమునకుఁ గాలపరిపక్వము గాక, మానవాకారము లేక ప్రేతరూపిణివై సూక్ష్మశరీరమున నాక్రోశించుచు నారకయాతనలకు విధు

షీమణివి, యాగర్భశ్రీమతివి, యపూర్వసౌందర్యవతివి, యమరాంశ సంభవవి యగు నీవు లోనగుట నాలవది. ఒక్కయవిచారదోషమున నెన్నిపాతకములు, నెన్నియాతనలు గుడువవలసివచ్చియుండెడిదో గ్రహింపుము. 'కర్మణ్యేవాధికారస్తు మాఫలేషు కదాచన' యను భగవత్సూక్తిని వినుము. నీవలెనే భారతవీరుఁడగు పార్థుఁడు వ్యామోహమునఁ జిక్కి కర్తవ్యనిర్వహణమునందు విముఖుఁ డౌనెడ భగవానుఁ డొసంగిన యమృతసందేశము 'కర్మ చేయుటకే నీ వధికారివి. ఫలప్రదానము పరమాత్మునిది' అనియే. నీ తఱుఁగని సంపద, వెలలేని జీవితము, ననుపమానవిజ్ఞానము నొకయల్పభౌతికప్రయోజన మర్థించి మట్టిఁ గలుప నూహించితివా ? భౌతికప్రయోజన మత్యల్పము. ఇంద్రియతర్పణమే దాని గమ్యము. నేను నిన్నుఁ బ్రేమింప లేదని బాధ నొందుచుంటివా ? నీ కాసంశయము వలదు. నీహృదయమే నీకు సమాధాన మిడఁగలదు. ప్రేమించితివి. ప్రభునిగా సేవించితివి. మానసికముగ నారాధించితివి. సర్వస్వ మర్పణ మొనర్చితివి. మఱి నీ కీయసంతృప్తి యెందులకుఁ గలుగుచున్నదో యోచింపుము. కామము. లైంగికసౌఖ్యము. కా దందువా ? యెంతయల్పప్రయోజనార్థివై నీయమూల్యజీవితము బలిపెట్ట నూహించితివో యూహింపుము. నన్నింకొకకోణమునుండి చూడుము. నీప్రేమ సిద్ధించినదని భావింపుము. సమాజమునం దాలుమగలుగా ధ్రువపఱుపఁబడితి మనుకొనుము. నీకామవాసనలను రగుల్కొలుపు నా యీదేహము రోగగ్రస్తమై తాకరాని దైయభోగ్య మైనచో నేమిచేయుదువు ? మరణింతువా ? నీకామతృప్తి నెట్లు పడయుదువు ?" అనిన జలజల కన్నీళ్ళు గార "స్వామీ ! మన్నింపుఁడు. మీనోట నట్టివాక్యములను రానీయకుఁడు. మీహృదయ మింతపాషాణమా ?" యని వల వల యేడ్చు మధుముఖమును దనయెదను జేర్చి "మధూ ! నన్నుఁ

బరిశీలించుచుంటివా ? నాహృదయసంఘర్షణము నీవే విను" మని
యతఁ డావేగమున సోఫాపై స్మృతివిహీనుఁడై పడియె. 192

చ. విచలితచిత్తయై మధు 'వివేకవిదూరత నింతచెట్టఁ గూ
రిచితిని హా! ప్రియా!' యనుచు వ్రీడపడంగ నొడల్, రయంబునన్
బ్రచురముగా స్వనం బెసఁగఁ బల్మరు ఘంటిక మీట నొక్క యా
రిచె 'జల' మంచుఁ, దా నటఁ బరిభ్రమణం బొనరించు చారిణై.

ఉ. దాసి వినీతియై యొసఁగు తజ్జలమున్ గొని, యామెఁ బంచి, తా
నాసుకుమారుమోవి నొడియం దిడి, నీరముఁ జిల్కి, నాత్మలో
మోసులుగొన్నప్రేమఁ బ్రియుమోమునఁ బయ్యెదతోడ నొత్తుచు
న్జేసెను తెమ్మదేర నొగిఁ జేలచెరంగున వీచి పొల్పుగన్. 194

మ. తనుఁ గన్నార్పక చూచుమాధవుని సాంద్రప్రేమ నీక్షించి," దా
సిని మన్నింపుఁడు; వంత గూర్చితిని, దోషిన్, గాముకస్వాంతఁ, బా
పిని, పైశాచికవృత్తికిం గడఁగి యాభీలార్తి నిర్మగ్ననై
తిని, నే నింక నిరస్తమోహమున మీదివ్యాంఘ్రులన్ గొల్చెదన్.

గీ. భగిని మాలతి గృహలక్ష్మి యగుచుఁ దమకు
సాధనంబు చతుర్వర్గసాధనమున
నగునుగాక! ముదశ్రుల నదియె యాత్మ
సుఖముగాఁ దృప్తిఁ గాంతు విశ్రుతచరిత్ర! 196

గీ. ప్రాణనాయక! ప్రోషితభర్తృక నయి
గడుపఁగోరుదు, నీమాత్రకరుణ నైనఁ
బర్వఁజేయుఁ, డనాథ నై పశులదృష్టి
విన్నఁబోనీయకుఁడు స్వామి! వేఁడుకొందు." 197

గీ. అనెడి మధుమోముసందు సాంద్రానురాగ
దీధితులఁ గాంచి పులకించి ధృతిఁ దొలంగి

మాధవుఁడు బోరగిలఁబడి మగఁడయోడిని
మోముఁ జొన్పి దుఃఖోద్రేకమునఁ గలంగి. 198

ఉ. "హే పరమేశ్వరా! హృదయహీనుసిగా నొసరింపఁబోక న
న్నీపగిదిన్ బరీక్ష నిడ నేమికతంబు; విరక్తచిత్త యా
పూపబెడంగుసుందరిని బో నడఁగింతున? యూశయంబులన్
బాపి యధర్మమార్గమును బట్టుదునా? కరణీయ మెద్ది యా? 199

ఉ. దత్త మొనర్చుకొంటి నొకతన్వికి సర్వము; నాత్మవంచనా
యత్తుఁడఁ గాక యెట్టు లిడనౌను జవాబు సుమాంగి కక్కటా!
కత్తెరఁ జిక్కుకొంటి, హితకార్య మెఱుంగ నసాధ్య మయ్యె, నా
కిత్తఱి ధర్మమార్గ మెఱిఁగింపఁగదే! కరుణాపయోనిధీ!" 200

గీ. అనుచుఁ బరమేశు హృదయమునందు మ్రొక్కి
ధర్మరక్షణ ప్రథమకర్తవ్య మగుటఁ
గాఁ దలంచి చిత్త మొకింత కలఁకఁ దేర
లేచి సుస్థితుఁ డై మధుఁ జూచి యతఁడు. 201

గీ. "త్యాగశీలవు ధర్మవర్తనవు మాన
నీయచరితవు నభినందనీయ వైన
మానినీరత్నమా! భవన్మైత్రిఁ జేసి
చారితార్థ్యము నొందె నాజన్మ మిపుల. 202

శా. ఉచ్ఛిష్టాన్నముఁ గోరులీల మధు! నీ వూహింపకున్నావు; నా
కిచ్చో నేమిస్వతంత్ర ముండు నిటమున్నేనాఁడొ నాసర్వ మా
సచ్చారిత్రకు నీమసోదరికి స్వాస్వం బయ్యె; మన్నించి నీ
యిచ్ఛన్ వీడఁగ వేఁడుకొందుఁ; గను మీ బిందుండుధర్మవ్యథన్.

ఉ. నా యనుభావ మేర్పడఁగ నాఁటి యెఱుంగవె కోపతాపముల్
బాయవు, దాన ఘర్షణయు నైరము లేర్పడు; ధీరచిత్త నై

ట్రోయఁగదే యపేక్ష; కృప తోఁపఁగ సన్నిహితాత్మమిత్రుఁగా
నే యిఁకమున్ను నుంచుటయ నీతి, తలంపుము నిర్మలాత్మ వై. 204

గీ. త్యాగసహనానురాగసద్ధర్మగార
వాశ్రయులు మానినీమణు లగుదు రెందు;
సుగుణశీల! మధూ! నీకుఁ దగునె యిటులఁ
బ్రోత్సహింప నధర్మంబుఁ బొంద నన్ను. 205

క. క్రూరాత్ముఁగాఁ దలంపకు;
మారయు మిం దుండుధర్మ; మది పో నాత్మో
ద్ధారకమార్గముఁ బాయుచు
నారీరత్నంబ! చనునె నరకాగ్నిఁ బడన్. 206

వ. అని పలుకు నాతనిధర్మదీక్షకును నచంచలప్రణయమునకు మధు హృదయమ్మున నభినందించునది యై యేపవిత్రహృదయశక్తులవలన నతఁ డాకర్షణపాత్రుఁ డై తన కారాధ్యుఁ డయ్యెనో యాదివ్యశక్తు లనే తానును మనన మొనర్చి జీవితమును బునీత మొనర్చి తనప్రేమ కమరత్వమును సంపాదింపఁ గృతనిశ్చయ యై ముఖంబున దివ్యతేజః పుంజమును విరఁజిమ్ముచు "స్వామీ! మీయమృతప్రబోధమునకుఁ గృతజ్ఞను. జీవితలక్ష్యమును దత్సాధనమ్మును నెఱింగించిన తమ కభి వాదములు; భ్రమప్రమాదములకు లోనుగాక కర్తవ్యనిర్వహణము నకుఁ దగు నుత్సాహశక్తులను బరమేశ్వరుఁడు ప్రసాదించుఁగాక!" యని సముత్సాహంబున జననీమందిరమ్మును జొచ్చి మాతాపితరుల చిత్రముల కభిముఖ యై మోకరిలి యంజలి మోడ్చి. 205

గీ. "ప్రేమమయులార! నా హితకాములార!
హృదయదౌర్బల్య మెడపి నారీకులమున
లోకమాన్యతఁ గనునట్టి ప్రాకటగుణ
సంచయ మొసంగుఁడు జననీజనకులార! 208

మ. జనకా ! సోదరమానవార్తి నెడపన్ స్వప్రాణదానం బొన
ర్చిన దివ్యాశయు మీకుమారికకు నాశీర్వాదమున్ సల్పి నూ
తనలక్ష్యం బిడు; మర్థ మున్నది జగత్కల్యాణసంపాదనే
చ్ఛను వెచ్చింపఁగఁ జేసి యోరసను నన్ సల్పంగదే సత్కృపన్. 209

మ. జననీ ! ప్రేమమయీ ! త్వదీయమధుర స్తన్యంబు నేఁ గ్రోలనై
తిని, నాపాప మగణ్య మమ్మ ! ఘనసాధ్వీమాళిరత్నంబ వై
జనకున్ దిద్దఁగఁజాలినావఁట ! కృపాస్వాంతంబునన్ సీతనూ
జను దీవించి యొసంగుమా ప్రణయవిశ్వాసస్తుత్యశక్తిన్ దగన్." 210

గీ. అనుచు నేకాగ్రచిత్తయై యంజలి నిడి
నూతనోత్సాహదీక్షాసమేత యగుచు
హర్షబాష్పములను రాల్చు నబ్జవదనఁ
గాంచి నీరవుఁడై యార్తి కడలుముట్ట. 211

గీ. మాధవుం డేఁగి యోచనామగ్నుఁ డగుచుఁ
దంతివార్తను వ్రాసి పత్రమును రుసుము
నిచ్చి సేవకు ననిచి, తా నేఁగుఁదెంచి
మధుకుమారినిఁ జేర, నమ్మగువ లేచి. 212

ఉ. హాససమన్వితాననమునం దొకనూతనతేజ మొల్క "నేఁ
జేసిన పిచ్చిచెయ్వులను జిత్తమునం దిడి మీర లీపయిన్
గాసినిఁ బొందఁబోకుఁ; డిటు కారియఁ బెట్టిన మిత్రురాలిపే
రాసను విస్మరింపుఁ డిదె యంజలి మోడ్చెద" నంచు మాధవున్.

ఉ. డాసి, నమస్కరించి, "పవడంబునఁ బుప్పియుఁ జెల్మిఁ దప్పునున్
దోసము గాదుగా ! నయవిదుల్, దమ కే నెఱిఁగింప నేల? మీ
కీసిలుఁగుల్ ఘటించితి క్షమింపుఁడు జ్ఞానవిహీన నౌటఁ; దా
మీసఖిఁ దొంటియట్లఁ గృప యేర్పడఁ జూడఁదొడంగ వేఁడెదన్. 214

గీ. అనెడి మధుచిత్తవైశాల్య మరసి 'యార!
పరిణతాత్మ యా నీలేమపాదధూళి
నంట నర్హుఁడనే ?' యని యాత్మ నెంచి
మాధవుండు లజ్జించి సన్మాన మొలయ. 215

గీ. "మానినీమణి! నిన్ను నేమాడ్కి గౌర
వించఁ దగునో యెఱుంగ; మన్నించి దివ్య
మూర్తిగా హృదయాసనమునఁ బ్రతిష్ఠ
సల్పి కొలువఁగ నాజ్ఞ యొసంగవలయు." 216

వ. అనిన మధుకుమారి విన్నఁబోయి సుదీర్ఘోచ్ఛ్వాసమ్మును బఱపి యాతని కరపల్లవంబును మెల్లనఁ దనచేతఁ బట్టి డగ్గుత్తిక వెలయ నిట్లనియె.

ఉ. "పిన్నను బెద్దఁ జేసి యిటు పేరిమి సూపుట యోగ్యమౌనె ? నే
నెన్నఁడు నిచ్చగింపఁ గొన నిష్టసఖార్చన; మానవత్వమం
దున్న యనేకదోషముల నుక్కిరిబిక్కిరియై పురోగతిన్
గ్రన్నన నొందఁగోరుచెలిగా ననుఁ గాంచుఁడు సంతసించెదన్." 218

గీ. అంచుఁ దోడ్కొనిపోయి నెయ్యమ్ము మీఱ
"వెలిసెను దుపాను; దానినిఁ దలఁపఁబోకుఁ
డిర్వురము విజిగీషను నేఁగుఁదెంచు
నంతిమపరీక్షలకు సిద్ధ మగుట తగును. 219

ఉ. లక్ష్యము దప్పు పెట్టియవిలంఘ్యపరిస్థితులందునున్ నిరా
పేక్ష్యము; గాన మీహృదయవేదన మాని పరీక్ష నగ్ర మా
కక్ష్యఁ గృతార్థులై ఘనతఁ గాంచఁ బ్రయత్నము సేయవేఁడెదన్
లక్ష్యము దప్పఁజేసె మధులాలసయై యనునింద మాయఁగన్." 220

శా. సర్వస్వంబు నొసంగి, మాధవుతిరస్కారంబునున్ సైఁచి తా
నిర్వర్తింపఁగఁ జొచ్చె నిత్యవిధులన్ నీరేజపత్రాక్షి త

తత్పూర్వం బెట్టివిభేదముల్ గననిపోల్పున్, వింత యూ; స్త్రీజనం
బుర్వీతుల్యలు గారె యోరిమిని లోకోద్ధారణప్రక్రియన్. 221

సీ. చిడిముడిపాటును జింతయు విసుఁగును
గనఁబడకుండు మొగంబునందు
వినయవిదూరత విషయాభిలాషయు
గోచరింప దొకింత లోచనముల
నైరాశ్యమును దృణీకారము లేశంబు
వర్తనంబునఁ గానవచ్చు టరిది
కార్యదీక్షయు హితకాంక్షయు రూపరు
చిన్నె లేమియు లేక చెలిమిబలిమి

గీ. తగ్గుదల సూపు టించుకంతయును లేదు
ఇంద్రియప్రవృత్తులనెల్ల నిద్ధచరిత
యెటుల శాసింపఁగలిగెనో ! యెఱుఁగవశమె ?
యని మధున్ గాంచి మాధవుఁ డాత్మఁ దలఁచు. 222

సీ. తరళాక్షి శాంతమార్ధ్యమ్ముల విరఁజిమ్మి
ప్రేరేచుఁ గాంక్ష లీవింత యేమి ?
మధురభాషిణి హితమంజులాలాపముల్
సంతాపమును గూర్చువింత యేమి ?
మానవీభూష సన్మానవిశ్వాసముల్
విచలితాత్మునిఁ జేయువింత యేమి ?
త్యాగజీవన యసిధారావ్రతోద్యోగ
మింతగా న న్నేఁచువింత యేమి ?

గీ. కాంత నైరాశ్యమున సౌఖ్యకాంక్ష వీడ
నింతగా నేను మదిఁ దల్లడిల్లు టేమి ?

అనుచు మధు తనభావము లాక్రమింప
మాధవుఁడు శాంతిసౌఖ్యముల్ మఱచె వనట. 223

సీ. ప్రళయఝంఝూవాతపాతంబునను జిక్కి-
కొట్టుకపోఁబడునట్టు లొకట
కల్లోలసాగరగర్భంబునకుఁ దరం
గము లీడ్చుకొనిపోవుగతిని నొకట
అశనిపాతమునఁ బుష్పాళితో వృక్ష మా
మూలంబు నుసియైనలీల నొకట
బలమైన మందిర మలవోకగఁ బునాది
సడలి కూలినయట్టిచంద మొకట

గీ. కలఁతనిద్దురలోఁ గలల్ కాంచి తెలిసి
యున్న రంచును నిట్టూర్చుచుండు వ్యథను
మాధవుండు; దా నెఱుఁగకే మధుకుమారిఁ
బ్రణయభాగినిగా నెంచి భ్రాంతి గదుర. 224

సీ. మాలతి కపచారమా ? యొల్లనేరను;
మధుఁ ద్రోయు టన్యాయమా ? యెటు లిది ?
దోష మెవ్వరిది ? మధున్ దప్పు పట్టుటా ?
నానేరమును రుద్దనా ? మగువకు;
ఇరుబాకు లొకరియొర నిరుకుటా ! హరిహరి !
యరులకై నను గోర నగునె దీని ?
దిగఁద్రోయ గోహత్య యెగఁద్రోయ బ్రహ్మహ
త్యయు నైనచో జీవితం బదెట్లు ?

గీ. తిరుగటం బడు గింజలతీరు నలిగి
సున్న గాఁబోవుగతిఁ దోఁచుచున్న బ్రతుకు

నెటుల వేగింతు ? నని మది నెంచియాతఁ
డుమ్మలికఁ గాంచు ఘూర్ణిల్లునుదధి వోలె. 225

మ. విమనస్కుం డయి మాధవుండు హృదయోద్వేగంబునన్ శాంతిసౌ
ఖ్యములన్ బాసి తపింప నాచెలియ నిష్కల్మష్యచిత్తంబునన్
సమకూఱంగను నుల్లసంబు సలుపున్ సమ్యగ్విహితప్రక్రియల్;
ప్రమదం బయ్యువి కూర్పఁజాలక వ్యథాప్రాబల్యమున్ గూర్పఁగన్.

ఆ. వె. మాధవుండు హృదయమథనంబు సైఁపక
వికలచిత్తుఁ డౌను, విధిని దూరు;
సీరుకారిపోవ నిశ్చయాత్మకబుద్ధి
భావి నెంచి బెగడువడును నెదను. 227

వ. శంకాభయస్వాంతుఁ డై మాధవుండు మధుకుమారీహృదయవైశు
ధ్యమునకు ముగ్ధుఁ డై కాంత మయశ్శలాక నాకర్షించువడువునఁ ద
న్నామె లోఁగొన భూమ్యాకృష్టచంద్రగ్రహమ్మువడువున నామె
దృక్కక్ష్యం బరిభ్రమించుచు సుఖభోజననిద్రావిరహితుఁ డై మూఁడు
నాళ్లు పరితాపమగ్నుఁ డై శుష్కాంగుండును రక్తరంజితనేత్రుండును
యోజనాధీనుండును నిరంతరభారదీర్ఘోచ్ఛ్వాసుండును నెపుచ్చియాత్మ
సంయమనమునకు గతిం గానక తపించుట నరసి మధుకుమారి దుర్భర
వ్యథాపరిపీడిత యై యాతని ననయంబు విడువక వలయురీతి నుపచ
రించుచు నిశ్చలకాసారంబున రాయి రువ్వి ప్రశాంతి నశింపఁజేసితినే
యని నాలవనాఁటి పూర్వాహ్ణంబున విచారించునవసరమ్మున. 228

ఉ. "బీగ్గముపేఁట పోవలయు, వేళ యగున్, జనుదేరఁగోరు వో
వేగ మలంకరించుకొన వేఁడెద" నంచు వినీతి నంతలో
నాగతుఁ డైన మాధవుని నారసి వాక్యశితాశుగమ్ములన్
దాఁ గడు నొచ్చి యార్తియును దత్తరమున్ మధు గాంచి యల్లనన్.

సీ. "కరుణించి మనచెల్మి స్మరియించి యైన నా
కెఱిఁగింపరాదె యొక్కింత మున్ను ?
పోయెద ననునెడ నీయభాగ్యాంగన
యంతరాయము గూర్చునయ్య ! తమకు ?
వాయుయానమున నీవాతావరణ మతి
త్వరితంబుగా దాఁటఁ దలఁప నేల ?
తలఁ గడుగం బోవఁ దప్పదు వడగండ్ల
వాన పేదకు ననువాక్య మిటుల
గీ. నిజ మొనర్పఁగఁ దలఁచితే ! నీతి లేని
నాఁతిగా నన్ను నెంచుట న్యాయ మగునె ?
తలను దెగఁదీసి మొలవైవఁ దలఁచినావె ?
క్రూరవిధి దుర్విపాక మీతీరు నుండె." 230

మ. అని, నిట్టూరిచి యశ్రువారి గురియున్ హా ! యంచు సోఫాపయిన్
వనితారత్నము గూలె మూర్ఛఁగని; విభ్రాంతిన్ సఖీరత్న మొం
దినవైక్లబ్య మెఱింగి మాధవుఁడు నార్తిన్ మున్గి పోకార్చె మూ
ర్ఛను శైత్యోపవిధుల్ పొనర్చి మధు నాశ్వాసింప నూహించుచున్.

మ. గడియారమ్మును జూచి మాధవుఁడు నాల్కన్ బండ్లతో నొక్కి యి
య్యెడనే మెండుగ జాల మయ్యె నని పోయెన్ దత్తరం బొప్ప; నె
న్నఁడుఁ ద న్నింతయనాదరంబునను నిన్నా ళ్లాతఁ డీక్షింపఁ, డి
ప్పుడ న న్నొక్కతె డించి యేఁగెనని యప్పూఁబోఁడి దుఃఖమ్మునన్.

మ. మగవాండ్రైజనియించునందఱికి దుర్మానంబు స్వార్థంబు పె
ల్లు గదా ! కట్టడిదైవమా ! యితఁడు నాలోపమ్ములే చూసి మో
ట్టుగ వర్తించె; నొకింత సిగ్గుపడ కిట్టుల్ నన్నుఁ దా నొక్కబా
డుగికొంప న్గనుసట్లు చూచుటయె గోడున్ గూర్చు నత్యంతమున్.

క. ప్రేమించుటయే నేరం
బా ? మగవాండ్రకు లేశ మైనను గనరా
దా మరియాద ? కపటియు, య
య్యో ! మాయలమాట లాడియుండెనె యితఁడున్. 234

క. ధన మడిగితినా ? యాతని
యనురాగము విడువు మంటినా ! యీహతభా
గినిఁ జివరకుఁ జనవుమెయిన్
గనుటకు నతఁ డిచ్చగింపఁగడఁగఁడె యకటా ! 235

క. తనుఁ జూచియైన నూఱటఁ
గనుభాగ్యము లేకపోయెఁ, గడ కీక్రియ నా
యనువారె లేకపోయిరి;
యనురాగమె స్త్రీలపాలి యపరాధ మగున్. 236

వ. అని విషణ్ణచిత్తయై మధు పులుకుపులుకునఁ గన్నీరుఁ గార్చుచు హా పరమేశ్వరా ! నన్నామరణమ్ము భగ్నప్రణయినిగనే కాక దుర్భరావమానదూషిత నై యీనోట తారకమంత్రమ్ముగా జపించిన నాప్రియునినామమును గళంకభూయిష్ఠముగఁ గారు లఱవఁజేయఁ బాల్పఱచుచుంటివా ? నాపాపమునకు నిష్కృతి గోచరింపదే. ఇట్టి దురంతకలుషముల కాశ్రయమగుదు ననియే ప్రాణాతిక్రమణంబునకుఁ బాల్పడ నామాయలాడు, యెఱఁగ్రుచ్చిన గాలము, పయ్యోదండాఁగిన పూతిక తనతేనెపూఁతమాటలతో నన్ను సమయబద్ధగ నొనర్చెనే ! నా కింక గతి యేమి ? యంచు చింతించుచు. 237

గీ. కొట్టుమిట్టాడు వెత నొంది, గ్రుడ్ల నీరుఁ
గ్రుక్కకొనుచు నిట్టూర్చును, గొనలుసాఁగు
భావములఁ దీవ్రత నడంపఁ బాటుపడును
గవఁదొఱంగిన జక్కవకరణి నామె. 238

గీ. నిండుచీఁకటి యలమిన యొండలీల
శూన్యగృహ ముండఁగా నామె చూడ నోడి
యర్వామీదివాంధమునకు నన్నిగతుల
గోడుఁ గూర్చు నీచీఁకటికోణ మింక. 239

గీ. దైన్యసంతాపవహ్ని విదగ్ధహృదయ
కుసుమసౌరభ మకరంద కోమలతలు
మాడి మసిగుట్టలై యుండ మానవత్వ
మెడలి జీవసమాధి నా కిందుఁ దగును. 240

గీ. వగపె యోరెము; కన్నీరె దగ నడఁచు
వారి; బ్రతుకెడారి నాదారి; తోడి
బాటసారి నిరాశగాఁ బడసి పయన
మగుదు నే నింక భ్రష్టలక్ష్యమును జేర. 241

గీ. ఎంగిలాకునై సుడిగాలి నెగసి తిరిగి
ఎందుఁ గడముట్టుజీవిత మెఱుఁగరాదు;
తంత్రు లూడి వ్రీలిన వీణెఁ దలఁచి యొక్క
యశ్రుకణము రాల్చెడిప్రాణి నరయ నింక. 242

గీ. అనుచు వెతఁ గను మధు పార్శ్వమందు నిలిచి
బాష్పవారిని నొత్తెడి భద్రమహిళ
నొర్తుఁ గాంచి యాశ్చర్యము నొంది సాను
భూతిఁ జూపు నాగౌరవమూర్తి కెఱఁగి. 243

ఆ. వె. "అమృతహృదయ ! మంజులాకారముఖరుచు
లలరఁజేయు టరయ నమ్మృత్కాంత
వనుతలంపుఁ గూర్చు; ఫార్త్రావనాపేక్ష
నింతశ్రమను గొంటి వేమిచెప్పుమ ? 244

గీ. భగ్నహృదయను, నవమానభారసార్థ
వాహి నై మరుభూమిని బయన మైన
నన్ను నాశీర్వదించదే సన్నుతాంగి !
త్వరగ నీసన్నిధిం జేరఁ గరుణ వెలయ. 245

గీ. సమయనిగళమ్ములను గూర్చి సరళహృదయుఁ
డొకఁడు స్వాతంత్ర్యము హరించి యుసురు వెట్టి
చనియె నిశ్చింతగ యథేచ్ఛ; మనుజరూప
దనుజుఁ డో, ననుకంపను గనుము జనని ! 246

ఆ. వె. మగువ వగుట నాదుమానసవ్యథ నీకు
గ్రాహ్య మగును; బ్రణయకలితహృదయ
నగుట నేర మయ్యె; నబలాజనమ్ము ప్రే
మింపఁ జుల్క నగుట యెందు నిజము. 247

గీ. మంటఁ దరిసి ఱెక్కలజంట మాడ్చుకొనెడి
ఱెక్కపుర్వుల నేనును నొక్కదాన;
ఆశ లోఁగొన సర్వవినాశ మిట్లు
గూర్చుకొంటిని నవ్వఁబోకుము సుమాంగి ! 248

చ. అనునెడ బాష్పవారి నయనాంచలభాగములందుఁ జిందన
వ్వనరుహనేత్ర 'సోదరి ! శుభంబు లొసంగును దైవ మింక, నీ
వనటను నుజ్జగింపుము; భవద్ధితకాంక్షిణి నేను, విభ్రమం
బును గనఁబోకు' మంచుఁ గడుమోదమునన్ బిగిఁ గౌఁగిలించినన్.

ఉ. చొక్కి, యఖండమోదమున 'సోదరి ! మ్రోడువిధాన నున్న న
న్నిక్కరణిన్ గృపారసము నెంతయుఁ ద్రావఁగఁజేసినావు; నా
మ్రొక్కులు గొ' మ్మటంచు మధుమోదమునన్బలుకంగ నామెయున్
'జక్కరబొమ్మ! కూర్చొనుము; చాలును మ్రొక్కులుగిక్క లేటికిన్.'

గీ. అంచు సంస్మిత మొలయఁగ నబ్జవదనఁ
బ్రక్క నాసీనఁ గావించి ప్రేటచేరఁగు
తోడ మధుమోము దుడుచుచుఁ దుల్కరించు
ప్రేమఁ గుంతలములు దిద్ది ప్రియము గదుర. 251

క. "ఎవరమ్మా! దనుజుఁడు? ని
న్నవమానించె నొకో! యాస లడియాసలుగాఁ
జివికెడి నీ కొనరించిన
యవినయకృత్యం బదేమి? యమృతాంశుముఖీ! 252

మ. అనినన్ దత్తర మేర్పడన్ మధు ప్రకంపాంగంబు చెన్నార 'దో
షిని, నిష్కారణ మామహాత్మునకు నాచిత్తంబు గోల్పోయి ప
ల్కినవాక్యంబులఁ దప్పు పట్టకుము నాళీకాస్య! నాదుర్విధిన్
జనినాఁ డాతఁడు; నాకు నల్పుఁడొకదోసంబేని స్వప్నంబునన్. 253

శా. చిత్తస్థైర్యము గోలుపుచ్చి విమలస్నిగ్ధాంతరంగున్ దయా
చిత్తు, న్మాన్యజనావతంసుఁ, బ్రణుతస్నేహాంతరాత్మున్ మదో
న్మత్తాలాపము లాడియుంటి ననుజా! మన్నింపు మీచెయ్ది, దు
శ్చిత్తల్ గామిను లర్హ లెట్లు పురుషస్నేహంబు నూహింపఁగన్. 254

గీ. నను విమానాశ్రయంబున కనుపఁగోరె;
నేన చనఁబోక నిల్చినదాన నిందు;
తాను జనియెను; దోషి యాతండొ! నేనొ!
నిర్ధరింపవె సోదరీ! నీవె దీని. 255

గీ. అమృతహృదయుఁడు, సుగుణాఢ్యుఁ, డార్యమౌళి
సదమలప్రేమసింధు వొసంగెఁ జిత్త
మమరమూర్తి నాసోదరి; కతనిఁ బతిగఁ
బ్రేమ నెఱపిన భగ్నజీవితను నేను. 256

గీ. ప్రియునిసుఖమును బోఁద్రోయఁ; బెట్టిపుట్ట
నట్టి నాసౌఖ్యమునకు దుఃఖాత్మఁ గాను;
గాని సమయబద్ధగ నల్పి కడకుఁ బ్రాణ
మైన వీడంగనీయఁ డేమందు నతని. 257

గీ. చచ్చి సాధింపఁ గోర్కి లేశంబు లేదు;
తత్పదాంకిత మైన యీతనువు కెప్పు
డెట్టిదోషంబు సమకూఱు నెటుఁగఁజాల
నది ప్రియాపచారం బగు నని వనరుదు. 258

గీ. మానవస్వభావమ్ము ప్రమాదములకు
నెలవు; కాంచితె యట్రేక మొలయఁ గారు
లాడియుంటి నాస్వామి; ని ట్లఘము లెన్ని
మాటఁ గట్టఁగవలయునో బోఁటి యెఱుఁగ. 259

క. తా మెవరు ? వ్యర్థజీవిత
నీమాడ్కిన్ గృపను ననునయింపఁగఁ గత మే
మీ ? మహిళారత్నమ ! నా
యీమందిరమునకు నెట్టు లేతెంచితిరో !" 260

వ. అనిన నిట్టూర్పుచు. 261

ఉ. ఆగతభద్రకాంత "చెలియా ! సుగుణాన్విత ! నిన్ను వీడి తా
బీగమువేఁట పోయె నని వేదురు నొందితి వేరికోసమో ?
ఆగుణసాగరుం డిటకు నాదర మొప్పఁగఁ బంచె నన్ను; నీ
బాగును గోరి యాతఁ డెసఁబాసెఁ దదన్యము గాదు" నావుడున్.

శా. "ఏమేమీ ! యతఁడే కృపామతిని మి మ్మిచ్చోటికిన్ బంచెనా ?
ఆమాన్యుం డెటు వోయెఁ ? దా మెవరు ? నన్నాందోళనన్ ద్రిప్ప కో
భామారత్నమ ! సర్వమున్ దెలుపుమా ? బాగున్ విచారించి నా
గీమున్ జొచ్చితి వెట్లు సేవకులు రక్షింపంగ ముప్పొద్దులున్." 263

గీ. అనుచు సంభ్రమాన్విత యయి యనుగు మధును
సంస్మితానన మలర నాచంద్రవదన
"ఇర్వురముఁ గూడియే యిట కేఁగుదెంచి
నార; మాతఁడు తనగదిఁ జేరె వినుము. 264

మ. నిను నీ చింతల ముగ్గఁజేయుటకుఁ దన్వీ ! నేనుగా హేతు; వా
ఘనప్రేమామృతమజ్జనంబున నఘౌఘంబెల్లనుం బాయ నో
చినధన్యాత్మను మాలతిన్; గరుణఁ బంచెన్ దంతి నేతేరుమం
చను జెల్లీ ! చనుదెంచినా నిటకు నిన్ జూడంగ నాకాంక్షమై." 265

చ. అనునెడ విస్మయప్రమదహాససమన్విత యౌచు "సోదరీ !
ననుఁ దనియింప వచ్చితివె ? నా కొఱకయింతయుఁ దెల్పరయ్యె; నీ
మన మిటు లింతగొప్పదె ? క్షమామతి నేరము సైఁపుమమ్మ ! చె
ల్లిని, కడువంతఁ గూర్చితిని; లేదుగదా ! మదిఁ గోప మేమియున్."

గీ. అంచుఁ బల్కుచు మధు తనివార నామె
నేకగర్భసంభూతుల నెఱుఁగరాని
దివ్యమధురానురాగము తీవసాఁగ
నెదను బొదివి లోకము విస్మరించి తనిసె. 267

మ. అటు లాయింతులు సోలియుండుతఱిఁ దా నచ్చోటికిన్ వచ్చి చెం
గట నిల్చెన్ మధుమార మాధవుఁడు నిష్కాలుష్యచిత్తంబు లెం
తటివై శౌల్యము గల్గియుండు నని స్వాంతంబందు నూహింపుచున్
త్రుటికాలంబు పరాత్పరాంశ మదిలోఁ దొల్కాడఁగాఁ జొక్కుచున్.

గీ. కొంతతడవున కాముద్దుగుమ్మ లెదుట
నున్నప్రియుఁ గాంచి గౌరవ మొప్ప నిలిచి,
రంత తరితీఁపు లొలయఁగ నతనిఁ గాంచి
మంజులాలాపములఁ బల్కె మధుకుమారి. 269

గీ. "ఎంతహృదయేశ్వరియె యైన నించుకంత
విశదపఱుపక యీ దొంగవేస మేల?
స్వాగతం బిడు భాగ్య మొసంగఁబోక
విన్నఁబుచ్చుట యగునె వివేక మార్య! 270

గీ. అక్కసెల్లెంద్ర మై సుంత యరమరికలు
లేకపోఁబట్టి సరిపోయె; లేనియెడల
నానిరాదరణమ్ముగ దీని నెంచు
నేని నా కెంతనగుబాటో! యెఱుఁగ రేల? 271

క. మేఁకయుఁ బులి యొక రేవున
నీకరణిన్ నీరు ద్రావ నెటు లుండునో యఁ
చీకపటచర్యఁ బూనితి
రా? కలుషాలోచనంబు రా దీమధుకున్. 272

గీ. ఏపురాకృతపాపమో యెఱుఁగఁబడదు
ద్రోహు నై జీవితంబును బుచ్చుచుంటి
నిదియ చాలదె? సోదరి కిడిన బోన
మపహరించెడిఘోరాఘ మదియు నేల? 273

గీ. ఏయవిజ్ఞాతశక్తియో యీక్రియఁ దమ
కంకితను జేసెను; బ్రమాద మందు రేమొ!
యైనఁ గావచ్చు; నింటిని నంటుమంట
నేరిసాధ్య మధోగతి నేర్పరింప? 274

గీ. ఏది యెట్లున్న మంచికే యిదియు వచ్చె
నెన్నఁజేసియు నన్ను శంకింపనగునో
అక్క మాలతి, నిర్దోషి ననుచు బుజువు
చేసికొందు నీసమయముఁ జేకొని తగ. 275

క. మన్నింపుఁడు నాగౌడవల
కున్నదె కడముట్టు చెప్పు? నూహింపను నీ
సన్నుతచరిత్రసత్కృతి;
ము న్నావిషయంబుఁ జూడఁబోలు" నటంచున్. 276

గీ. మధు ప్రసంగము ద్రుంచి యమ్మాలతి కపు
డర్హవిధిని మజ్జనభోజనాదు లేర్ప
రించి తనిపెను; నాదరోదంచితాను
రాగమధురోక్తు లొప్పారఁ బ్రమద మలర. 277

చ. వివిధమనోజ్ఞదృశ్యపరివీక్షణ సల్పుచు నిష్టగోష్ఠియం
దవిరతమైత్రి పెంపెనయ నాత్మపరప్రవిభేదశూన్యులై
తవులము మెండుగా మధు సదా యెడఁబాయక మాలతీసతిన్
బ్రవిమలచిత్తులై తనిపె బాంధవమున్ జెలిమిన్ వెలార్చుచున్.278

సీ. నశియించెఁ బూర్తిగ నా నీ విభేదము
కులవిభేదపుపరిధులు దొలంగెఁ
జెలువారె దృఢతరస్నేహానురాగము
లణఁగెను రిక్తమర్యాద లెల్ల
నాత్మీయతయుఁ జెలువారె నేకోదరు
లట్ల నిష్కాపట్య మతిశయించె
రక్తాణువుల నెన్నరాని యావేదన
చెలరేగె హితచింత చెన్నుమీఱె

గీ. నేకశయ్యను నిద్రింపఁబోక కాని
తనియ, రన్యోన్యమును విరితావులట్ల
వెలయుచుందురు భేదమే తెలియఁబడక
మధురమైత్రిని మాలతీమధులు పొదలి. 279

సీ. "అక్క ! నానేరము నలవోక మఱతువే"
యని యశ్రు లురలఁగా నడుగు నొకట
"నెంతతీయనిపెంద మెన లేరు నీ" కని
యనురక్తితో నెద హత్తు నొకట
"ననురాగవార్నిధి నామరణము నన్నుఁ
దేల్పవే" యను దీనదృష్టి నొకట
"మొరపువారిన నాకు దొరకె సహోదరి"
యంచు వేడుకఁ బ్రియ మాడు నొకట
గీ. నొకట మాధవుగుణముల నుగ్గడించు
నొకట తనభావిగతిఁ గూర్చి యూహ లడుగు
నొకట వివిధానుభవముల నొనరఁ జెప్పు
మాలతికి మధు సత్ప్రేమమహిత యగుచు. 280

శా. ఆనందంబునఁ గౌముదీరుచుల గేహప్రాంగణారామసీ
మామానస్ఫటికప్రశోభితవిత్రద్వ్యాసనాసీన లై
నానారీతుల గోష్ఠి సల్పుచును గానంబోరు కాలంబు నా
ప్రాణస్నేహితురాండ్రు ప్రత్యహ మపారప్రేమ శోభిల్లఁగన్. 281

ఉ. మాలతి యొక్కనాఁడు మధుమానసశుద్ధి యుదారబుద్ధి స
చ్ఛీలము లోఁగొనన్ మదిని జింతిలె, నీనవపుష్పరాజ మీ
లీలను గుల్మసీమను మిళిందసమాగమశూన్య యై కటా !
తూలునె ? నూత్నసౌరభమధుప్రమదాకృతు లెల్ల దూపరన్. 282

మ. పురుషస్పర్శను గోరి యౌవమునన్ బొంగారురక్తాణువుల్;
తరుణీరత్నము నై జకాంక్ష నడఁపన్ దా నెంతశోకించునో ?
నిరతార్తిం బడి క్రుగ్గు నీచెలియ కన్నీటన్ సదా తేల నో
పరమేశా ! నను సృష్టి సల్పితివె ? యోర్వంగల్గుదే యీవ్యథన్. 283

శా. ఈలావణ్యవిలాసరాశిఁ బ్రణుతానేకార్తచింతామణిన్
లోలాపాంగవిముగ్ధమూర్తిని సువ్యాల్లోకాభిరామన్ మనో
మాలిన్యం బిసుమంతయున్ గనని ప్రేమస్వాంత నే నింకఁ గం
కాళాకారము సల్పి జుట్టుకొనెదన్ గాఁబోలు రక్తాన్నమున్. 284

చ. తనకు సమాధి నేర్పఱిచి దాన సుఖింపఁగఁ గోరుక్రూరచి
త్తను నను బేల వై యెడఁదఁ జార్చి సుఖంబుగ నిద్రవోవుచుం
డెను పరమేశ్వరా! యెటు లొడిం జెలువారెడిబిడ్డనోటియం
దునుతు విసంబు? నేక్రియను ద్రోతుఁ సు కాలిని స్వార్థచిత్త నై. 285

గీ. శిశుహృదయ! చెలికారము స్మితము వెలయఁ
గాలకాకోదరంబును గౌఁగిలించు
కొంచు సుఖనిద్ర నేలీలఁ గొంటివమ్మ!
ఇటుల దుర్విధి ఘోరసంకటముఁ గూర్చె. 286

గీ. అంచుఁ దలపోసి నిశ్చింత నభిముఖ యయి
వలపలికరంబునన్ బెనవైచి నిద్రఁ
బోవుమధుహస్త మెడలించి పొంగువారు
దుఃఖభార మోర్వక యెడఁ దొలఁగి యామె.

శా. పర్యంకంబును వీడి నిల్చి, మధుఁ దాఁ బల్మాఱు వీక్షించి, యి
య్యార్యామూల్యజగద్ధితవ్రతను దుఃఖాంభోధిలో ముంప; ని
శ్కార్యం బాతని సంప్రతింపవలె యోగ్యం బెద్ది యా నంచు; ని
ర్వార్యావేగము నొంది, యొంటిఁ జని ద్వారప్రాంతమున్ జేరఁగన్.

శా. "అక్కా! యొక్కతె వెందుఁ బోదు విటు రావమ్మా! సహాయంబుకై
ప్రక్కన్ గల్గిన నన్ను లేప; విటు లీద్వారంబునన్ బోవలెన్
'కక్కోజీ' డెస" కంచు లేచి మధు రాఁగా మాల సిగ్గిల్లుచున్
టక్కున్ దా నట నాఁగి యత్నమున కాటంకంబు సంధిల్లుటన్. 289

ఉ. నివ్వెఱఁబోయి, 'చెల్లి! యెటు నేఁ జన' నం చరుదేర, 'వారిపై
నివ్వటిలె న్మనం బిటుల నే నొనరించితి విఘ్న' మంచుఁ దా
నవ్వెడి యమ్మధుం గని మనం బెఱియంగను 'గోల చేయుచున్
జివ్వకు నీడ్వ కీవెకిలిచేష్టలు మానవె' యంచు నార్తిమై. 290

ఉ. మాలతి యామె మై నదిమి, "మానస మెంత కలంగుచున్నదో;
బేల వెఱుంగ? వీచెలిమి పెంపున నామది యగ్నిపర్వత
జ్వాలలఁ జిమ్ముచుండె; నెకసక్కెము లాడకు పుణ్య మబ్బు; ను
ద్వేలవిషాక్తదంష్ట్రలను వేచిన పన్నగి నన్నుఁ గానవే! 291

ఉ. ఉట్టికిఁ జట్టికిన్ జెరిపియున్నను గొఱ్ఱ కసాయి నమ్ముచు
న్నట్టుల నన్ను నీ వెటుల నమ్మఁగఁ బొల్పడుచుంటి; వింత క
న్గట్టదె నన్నుఁ గాంచ? మదిఁ గోల్పడితే? విధి దుర్విపాకమా?
మట్టిమె బుఱ్ఱలోఁ గలిమిమాంద్యము నిన్నిటు లాక్రమించెనా?"

గీ. అంచు హృదయవేదన నంది, యశ్రుజలము
జలజల స్రవింపఁ గన్నుల, సఖియ వ్రేగు
విధము దిలకించి విభ్రాంతి వెలయఁగ మధు
విచలితాత్మ యై రేకొత్త విహ్వలమ్ము. 293

చ. పొలఁతిని దల్పమం దునిచి పొక్కుచు నక్కమలాక్షి సాంత్వనం
బొలయఁగ నశ్రు లొత్తి "నను నూరక వేచెద వేల సోదరీ!
తెలియవె పౌరుషంబునను తీఱునె దైవము తోడు లేక వాం
ఛలు; విలపించుమాత్రమునఁ జక్కపడంగల వెట్లు యత్నముల్. 294

శా. రానేవచ్చెను భంగపాటిఁక నహోరాత్రమ్ము లద్దానికై
యీనిర్భాగ్యను వంత నొందు మనుదే? యీయున్నసౌఖ్యంబుతో
నే, నామార్గమునందు నన్నుఁ జననీ, నీవిట్లు శోకించుచో
మానంబోవదు గుండె గాయ; మిఁక రమ్మా! నిద్ర పోవందగున్."

వ. అనిన మధుం గాంచి విషాదసూచకం బగుహాస మొండు బఱపి మాలతి సంఘటితహృదయ యై యి ట్లనియె. 296

శా. పిండీబియ్యము సర్వమున్ మఱచి తాఁ బెల్లార్తి శోకించి, 'రా
రండో ! నాపిడుకల్ రవుల్కొనియె నార్పన్ వేగ' మం చార్చున
ట్లుండెన్ నీచరితమ్ము చెల్లి ! విను, నే నూహించితిన్ మార్గ మొ
క్కం డీపీవిధి నైనచోఁ బొడము సౌఖ్యం బెంతయున్ శాంతియున్.

మ. పరణద్ధేద్ధవిచార ! దోషతమసప్రాభాతదీప్తి ! నిరా
దరతీవ్రోక్తి విదూర ! స్వాదునవనీతస్వాంత ! భద్రేభసుం
దరయానా ! కలభాషిణీ ! సుగుణసౌందర్యా ! పరీవారభా
సురభాషాసతి ! చిన్నమాంబజననీ ! స్తుత్యాంధ్రసీమంతినీ ! 298



శ్రీమ న్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

---

## ద శ మా శ్వా స ము



క. శ్రీ యప్పలనరసింహాసు
ధీయుతపుత్రావతంస ! దీక్షాజితగాం
గేయ ! విజితేంద్రియ ! నుతా
జేయపరాక్రమధనాఢ్య ! శ్రీనరసింహా ! 1

వ. అవధరింపుఁడు. 2

గీ. మంజులస్వాదుభాషిణీ ! మాధ్వవినయ
నయసమాలాప ! యన్నపూర్ణా ! హృదీశ్వ
రీ ! సమాకర్ణన మొనర్పుమా ! సమగ్ర
మవలియితివృత్త మవధాన మావహిల్ల. 3

క. మాలతిపల్కులు విని 'సుఖ
మా ? లలనామణిరో ! శాంతి మధు కలనదుటా ?
చేలవు నీవా ? నేనా ?
ఏలీల లభించుఁ బల్కవే ! యనునామెన్. 4

ఉ. "చెల్లి ! విరక్తవై పలుకఁ జెల్లునె ? దైవ మవక్ర మైనచోఁ
బల్లియె ఢిల్లి యౌ; నెఱుఁగవా ప్రజలే ప్రభు లై చెలంగుటల్;
ఉల్లము చిక్కఁబట్టు; మొపు దుండదు కష్టమె కాఁపురంబుగా;
మల్లికి నుల్లికంపు నిడు మందుఁడె యీశ్వరుఁ? డార్తి మానుమా.

శా. ఆనందుం డెఱిఁగించె నీవిషయ మాద్యంతంబు; నానాఁటినుం
డే నీక్లిష్టసమస్యఁ దీర్ప మది నూహింతున్ యథాశక్తి, ని
ర్గ్లానంబున్ దలపోయ నాఁడుఁ; బ్రియుఁ డియ్యారాటమున్ సైఁపకే
నీ నా చెల్మి ఘటింప నన్ బిలిచె; నీస్నేహంబు పెంపారుటన్. 5

చ. తిరుగటిపాపులం దవిలి త్రిప్పట నొందినకందిగింజ నై
నిరతదురంతగూఢతరనిర్భరయాతన నొందుచుంటి, నే
తఱుఁగుల కోర్వ నా నిది? యెదల్ పగులున్; బరిశోధనంబు ను
ర్భర, మనురాగజీవిత మరాతికి నైనను వద్దు సోదరీ! 7

ఉ. కాల్చినవంగకాయగతి గర్భితదుఃఖమహోష్ణ మొక్కటన్
వ్రేల్చినమత్స్యమో యనఁగ వ్రేగుసెగన్ వసివాడు టొక్కటన్
జీల్చుచునుండె వ్రయ్యలుగఁ జిత్తము; ప్రేమయు స్నేహభావమున్
నిల్చి రగిల్చె ఘర్షణను; నిర్భర మీస్థితి ప్రేమజీవికిన్. 8

శా. త్రాడో పేడో యొకండు తేల్చుకొని చిత్తం బింత శాంతింపఁగా
నేఁడో రేపో ప్రయాణ మాట కనియే నే నేఁగ నూహించి పోఁ
జూడన్, గాళ్లను జుట్టి పట్టుకొనుచున్ సుద్దుల్ ప్రపంచించి న
న్వీడన్ బాల్పడకుంటి; వింక విను మీవే నాదుసంకల్పమున్. 9

శా. ఎట్లో వారికి నచ్చఁజెప్పుదును రే; పీ వింక నా నన్న ని
క్కట్ల న్మ్రగ్గక రెండుజీవితములన్ గైకోనగున్ శాంతి; నా
పట్లన్ గొంచెము సానుభూతిఁ గని, విభ్రాంతిన్ బెడంబాసి, నే
నె ట్లిద్దానిఁ బరిష్కరింతు విను చెల్లీ! శ్రద్ధతో సాంతమున్. 10

ఉ. ఏకథ విన్న మున్ను బ్రణయేష్టిని నాహుతు లౌచుఁ బ్రేమికుల్
చీఁకటికోనలం దణఁగ జీవితముల్ బలి పెట్టియుండి రీ
లోకపుఁబోకడన్ గనఁ బ్రలోభము స్వార్థము వీడలేమియే
గాక మఱొండుగాఁ దలఁపఁ గాదు మనంబునఁ జింతసేయుమా! 11

మ. ఉభయశ్రేయముఁ గోరి తెల్పుదును నీ వూహింపు మన్యోన్యముల్
శుభసంపాదనకాంక్షఁ బ్రేమఫల మస్తోకానురాగంబునన్
విభజింపం దొరఁకొంద మట్లయిన నిర్విఘ్నంబుగా జీవిత
ప్రభవాసాధ్యసమస్య దానఁ దొలఁగున్ భద్రంబు చేకూఱెడిన్. 12

ఉ. ఆసుగుణాఢ్యుఁ బొందువ్యథ నారయఁబోవొ? యెఱింగియున్న రా
కాసిని నేను చెంగు నెటు కట్టుకొనంగల నింగలాకృతిన్
గాసిలఁజేయు నాతనిని, గాంతునిఁ దప్పఁగలేనిదాన నై
వాసియు వన్నె లేక గడుపంగను జీవిత మేల సోదరీ! 13

చ. వికలమనస్కుఁ డౌనతఁడు వేదురు నొందెడు నిన్నుఁ గాంచి; నా
రకగురుయాతనం గనుదు ప్రయ్యఁగఁ జిత్తము మిమ్ముఁ జూచి, క
న్యక నయియుండుటే తగు ననారతదుస్సహవేదనాగ్నిలోఁ
దికమక నొందుకంటె; సుఖదీప్తి లభించునె లేశమేనియున్. 14

శా. స్వశ్రేయంబున కేని నే నిటుల సల్పంబోలు, స్వార్థాన్యస
మ్మిశ్రం బయ్యది, కాదునాక మనకూర్మిన్ బెంపు నొందింప సౌ
ఖ్యశ్రీ చేపడ నూహసేయుము, విరక్తాత్మన్ మనోవేదనన్
అశ్రుల్ నిత్యము రాల్చు టేమిపని? నీ వౌ నంచుఁ బల్కంగదే!

శా. విద్యాసంస్కృతు లెంతయున్ గలిగి భావిన్ దిద్దఁగా శక్తమై
నుద్యోగింపకపోవు టేమిపని? యిం దొక్కింతయున్ గీడు లే
దాద్యంతమ్ములఁ, బూలజంట యొకశాఖాగ్రంబుపై వృంతముల్
హృద్యాకారముతోడ నిల్పుకొనఁగా స్త్రీకే యసాధ్యం బొకో!"

గీ. అంచుఁ బల్కెడిమాలతి యాననమును
ఱెప్ప లార్పక తిలకించి హృదయశుద్ధి
సందియముఁ గూర్పఁజాలమి సమ్ముదాశ్రు
లురల మధు కేలు మోడ్చి యయ్యువిద కనియె. 17

గీ. "అక్క! నిన్నెక్రియను నెంచ నగునొ యెఱుఁగ,
దేవతలకు నశక్య మా సేవ వెలయఁ
జేసితివి; జన్మజన్మల సేవ సల్పి
తీర్పఁజాలని ఋణము నెత్తికిని నెత్తి. 18

గీ. ముక్కుమొగ మెఱుఁగక మునుమున్నె దిలక
మిడి శుభాకాంక్ష లొసఁగితి; వీయఁదగని
ప్రణయధనమున భాగమ్ము పంచి యొసఁగి
తిపుడు; నీచిత్తవిస్తృతి నెన్న వశమె? 19

శా. త్యాగానుగ్రహనిర్మలత్వములు కాంతారూపముఁ గొన్నవు
ణ్యాగణ్యార్యచరిత్ర! తావకపవిత్రాంఘ్రిద్వయస్పర్శ భూ
భాగం బొందెను బారిశుద్ధ్యము; మహాభాగీరథీమజ్జన
శ్రీఁ గైకొంటిని నీకృపన్ మునిఁగి నిశ్శేషాఘ నై సోదరీ! 20

ఉ. పావని! సర్వకాల మెడఁబాయనిభక్తిని మిమ్ముఁ గొల్తు; మీ
సేవయె భావిలక్ష్యముగఁ జేసి భవద్ధితకాంక్షఁ గంటి; న
న్నీవిషయానురక్త నిఁక నెన్నఁడు నీకు సపత్నిఁ జేయఁగా
భావమునన్ దలంపకుము ప్రాంజలి మోడ్తును జిత్తశుద్ధిగన్. 21

ఉ. కుక్కనుగుక్కగా నిలుపఁ గోరెద, సల్పకు గంగిగోవుగా;
నక్కజ మయ్యె నీచరిత, మాసుగుణాఢ్యునిదివ్యవృత్తమున్;
నక్క యదెక్క? డావినుతనాక మదెక్కడ? సేవమాత్రమే
దక్కెనఁ జాలు; నున్నతపదంబున కర్హను గాను సోదరీ! 22

శా. దైవీసంపద నుల్లసిల్లు మిము స్వార్థప్రేరితన్ దోషరో
షావేశార్తిపరీవృతన్ బెలుచఁ గష్టం బొందఁగాఁ జేసితిన్;
నావిజ్ఞాపన మాలకింపు మిఁక, నెన్నం డేను గాంక్షింప మీ
సేవన్ దక్క మఱొండు; నా కిదియె యా శ్రేయంబు మమ్మాటికిన్.

ఉ. మానవి యైనయొవ్వతెయు మాఁహారుం దనయంతఁ దానుగా
దాన మొసంగు టారయను; ద్యాగ మపారముఁ జూపియుంటి, వ
జ్ఞాన మడంగె; స్వార్థఘనసంతమసంబును వీడె సోదరీ !
నే నిఁక నీవు చూపిన యనింద్యపథంబునఁ బోవ నెంచెదన్. 24

ఉ. ఆతఁ డచంచలప్రణయుఁ డార్యుఁ డుదారమహాత్త్రరాశియుం
డై తనరారుచుండఁ జ్యాతి నర్హ్వమె కూర్చుట ? ధర్మవిప్లవం
బా ? తలపోయనేర వొకభామకు నై యనుకంపఁ బూని; సా
ధ్వీతిలకంబ వై పతిని బ్రేరణ సల్పుదె పాపవృత్తికిన్. 25

శా. ధర్మగ్లానికిఁ ద్రోవఁ దీయు మనవిద్యాసంస్కృతుల్ కాల్పనా?
దుర్మార్గంబు నణంప జీవితముఁ బోఁద్రోయంగ నా నఁద్రు; స
ద్ధర్మాత్మున్ జెఱుపం దలంకుము; తత్కాలవ్యథల్ నిత్యమే ?
నిర్మోహత్వముఁ గాంచి నాదుమనవిన్ నీ వింకఁ బాటింపుమా ! 26

ఉ. భీకరకుష్ఠరోగపరిపీడితగా నను నెంచు మింక, నా
యాకలుపాంగ మెట్లు హృదయేశ్వరభోగ్య మొనర్తుఁ బాపపుం
బోకట కిచ్చగింపకుము; పొందుగ నిర్వర మామహాత్ము నె
ట్లో కలగుండు నొందనియటుల్ సలుపం దగు సర్వశక్తులన్. 27

చ. కలిమిని జూపి దుష్టమతిఁ గైకొనె నన్యులప్రేమరాశి ని
య్యలఘుకిరాతి యన్న సడి నబ్బఁగనీయకు మక్క ! మ్రొక్కెదన్
దొలఁగినవాగునున్ దిరుగఁదోడఁగ నేమిఫలం ? బెడారిలో
పలఁ బడువానజల్లుకుఁ బ్రవాహిని యౌ టడియాసలే గదా ! 28

శా. రాకాచంద్రముఖీ ! యెఱుంగకయె సంప్రాప్తించు ద్వంద్వంబు; లే
చీకుం జింతయు లేనిమానవుల నీక్షింపంగలే మెందు; స్వా
ర్థైకాత్ముల్ బలె ధర్మరక్ష కిటు లత్యాఘాతమున్ గూర్తువే !
లోకశ్రేయ మడంగు ధర్మమునకే లోపంబు వాటిల్లినన్. 29

ఉ. స్వామిగ నాతనిం గొనఁగ స్వాంతమునన్ దలపోత కారయన్
ఆమహనీయుధర్మరతి యాత్మవిశుద్ధత కావె హేతువుల్?
ప్రేమకుఁ బేలవత్వమును బెంపరుటల్ సమకూఱు ధర్మతే
జోమహితాకృతిన్ దొఱఁగి శోభను గోల్పడఁజేయఁ జెల్వనిన్. 30

చ. కనికర మాత్మఁ బెల్లుబికి కానకయుంటివి; కాని యెంచుమీ
మనమునఁ బ్రాణనాథు గుణమా? తనువా? యనురాగ మీక్రియన్
బెనిచెను? వ్యక్తిగౌరవసవీనత ప్రేమకు దోహదం బొన
ర్చును; గుణసంపదల్ దొఱఁగ రోత జనించునుగాదె సోదరీ! 31

గీ. అంధతమసావృతపథంబునందు దిశల
నారయన్ వ్యథ నొందెడివారికి ధ్రువ
తారలీల నజ్ఞానాంధకారమగ్న
తామసుల కుత్తముఁడె మార్గదర్శి యెపుడు. 32

క. ధీమతి! ధర్మజ్యోతిని
నీమాడ్కి నడంప యత్న మేటికి? యిది నా
క్షేమమున కనుట నే సుత
రా మిష్టపడన్ దలంపరా దీవిధమున్. 33

చ. కలిమి యొకింత యుండె, గుణగౌరవ మేర్పడె; నీదుచెల్మితోఁ
దెలిసితి త్యాగ మెట్టిదో! యతిస్థిరధర్మపథానువర్తనం
బలవఱుపంగలాఁడు ప్రియుఁ, డార్తుల కీపయి బాస ఁటాచు నా
వలనగునంతసేవ సలుపం దొరఁకొందుఁ బ్రలోభహీననై." 34

చ. అని తననిశ్చయంబును సమగ్రముగా నెఱిఁగింప నంతటన్
బెనఁగొన మోదఖేదములు "భీష్మ; మసాధ్యము నీదుయత్న; మీ
యనువున నాహితోక్తుల ననాదరణం బొనరింపఁ బాడియే"
యని కను లొత్తుచుం బలికె నార్తిని మాలతి విన్నఁబోవుచున్. 35

శా. విద్యుద్దీపముకాంతి విన్నఁబడఁగా విశ్వాంధకారావృతిన్
చోద్యంబై యపరంజివర్ణమున సంశోభించుబాలార్కున
త్సద్యోజాతకరంబు లంతట గవాక్షాబ్దంపుమార్గంబునన్
హృద్యంబై గదిఁ జొచ్చి యాయుభయనారీస్పర్శఁ గావించినన్. 36

శా. "విశ్వజ్యోతియఖండదీప్తి యదిగో! విశ్వంభరావ్యాప్తమై
యాశ్వాసింపఁదొడంగె గాఢతమసాహంకారమున్ బాపి, దే
హాశ్వేతప్రదరంబునాఁ జనెడి నీహారంబుఁ బోకార్చి నా
పశ్వాభీష్టము లెల్ల రూపఱచి భాస్వద్జ్ఞాన మేపారఁగన్. 37

శా. వ్యాయామం బొనరించి, కండరము లుబ్బన్ శ్రాంతి పెంపారఁ బ్రా
ణాయామంబును సల్పునాథు నదె యానందంబునన్ గాంచు మా
ఛాయన్ శంకరుఁ బోలె సంఘటితనిశ్వాసుఁ నిబద్ధాసనుఁ
మాయంజేయును మానసవ్యథలు రమ్మా! యక్క! యాచక్కికిన్."

చ. అని మధు మాలతీకరము నల్లనఁ బట్టి గవాక్షపార్శ్వసీ
మను దరియంగఁ బోయి "యిఁక మానసముఁ దగఁ జిక్కఁబట్టి స్వా
మినిఁ గను మక్కు లొండ ననిమేషత; నుల్లము పల్లవించుఁ, బా
వని! వ్యథ రూపుమాయును ద్రపాభయముల్ బెడఁబాపు మిత్తఱిన్.

సీ. ఆసుందరాకారు నలవోక పరుల కొ
సంగఁగా యోచింపఁజాలి తెట్లు?
ఆధర్మ తేజోమయాకారు సామాన్య
కాంత యెవ్వతె చేలఁ గట్టఁగలదు?
మాల! మాలా! యని మంత్రంబు జపియించు
నాసిద్ధుఁ డెవ్వతె కగును వశము?
సతిని రంజింపఁగా శంకరుం డెట్టిత
పశ్చర్యకుం బాలుపడెనొ కనవె!

గీ. ఈనఁ గాచి నక్కల కిడ నెంచఁదగదు;
తగును పార్వతివడువున స్థాణు నపర
మూర్తి నాతనిఁ గొల్చు టెప్పుడును భక్తిఁ;
గలఁత లుడుగుము వెఱ్ఱిపోకడలు మాని. 40

గీ. ఆత్మబాంధవ్య మలముట నతనివ్యక్తి
గౌరవ మడంపఁజాలెడి కర్జములను
బ్రతిఘటించుట నావిధి; గతము మఱచి
యనుజ రంజింప నీయూహాలను విడఁగదె! 41

గీ. చిన్నఁబోవకు మక్క! నే స్వీకరించి
చెలువు నీ కొసంగితి; నీవ చేకొనఁదగు;
ఖాతికాపేక్షలకును లోఁబడి సమాజ
గౌరవమును బోకార్పఁగఁ గాంతు లేమి. 42

ఉ. నేను సనాథనే; విడుతు నీకయి నాపతి; నీదుసౌఖ్యమున్
బోనడఁగింప నెన్నఁడును, బూతచరిత్రము పట్టుగొమ్మఁగా
మానవతీమణుల్ చనఁగ మార్గము నే నిఁక నిర్ధరించి నా
మానసనాథుగౌరవరమన్ దిశ లంటఁగ వ్యాప్తిఁ జేసెదన్. 43

ఉ. నీ తొలిబిడ్డ నా కిడుము; నే వహియింతును మాతృగౌరవం;
బీ తలపోత స్త్రీసమాజ, మొచకు మొందుగ, త్యాగశీల వై
బ్రీతిని గూర్పు మీక్రియను; బిడ్డ మఱొక్కఁ డొడిన్ జెలంగునాఁ
డే తలపోయు మాత్మను గడింపగఁ గోరినకోర్కెఁ దీర్పఁగన్. 44

మ. అనఁ, గన్నీరు ప్రవాహ మై యురల "నాహా! దైవమా! యెట్లు సైఁ
తును? నామానస మిట్టికర్కశమె? యీదుఃఖాబ్ధి నె ట్లీఁదనే
ర్తును? మార్గాంతర మెద్దియున్ గనను; నాక్రోశించు టీజీవితం
బున కెల్లప్పుడు వ్రాయఁబోలు విధి, మార్పున్గాంచ" నం చెంచుచున్.

గీ. మాల మధుఁ జుట్టిపట్టి "మోహమాన్యచరిత !
పాపి మీయక్క యొసఁగును బ్రాణ మైన
సందియము నొందవల దమ్మ ! సార్వకాలి
కమ్ము మనయభేదంబు నిక్కముగఁ జెల్లి !" 46

మ. అను నమ్మాలతియశ్రులన్ దుడిచి "యక్కా ! పెక్కుజన్మాలకున్
నిను నాయగ్రజ గాఁగ మ్రొక్కు లిడుదున్, నిక్కంబుగా నీదృశల్
కనరా రెందు; విషాదమున్ విడుము, శోకవ్యాకులత్వంబుతో
నను నీ వెన్నఁడు నొవ్వఁజేయఁదగ దానన్ బెట్టుచున్నా నిదే !" 47

గీ. అంచు విషయాంతరమ్మున కామెఁ ద్రిప్పి
మధు తలంచి, "చూడవె ! యదె మానసీయుఁ
డరుగుచున్నాఁడు మజ్జన మాచరింప
నరుగుదము రమ్ము కాలకృత్యాళిఁ దీర్ప." 48

వ. అని మధు మాలతికి దుఃఖోపశమనంబు గావించి, కల్యంబులఁ దీర్పఁ దోడ్కొని చనియె. పదపడి యయ్యిరువు రేకీకృతచిత్తలై మాధవు నుల్లసిల్లంజేయుటయ తమలక్ష్యంబుగా నిర్ధరించుకొని తత్ప్రయత్నంబునకుఁ గడంగిరి. 49

ఉ. "కాలము దుర్గమం, బెఱుఁగఁ గా దొకయింతయు దానినైజ, ము
ద్వేలవిషాదఘట్టములు విస్మృతరాజ్యరమాప్రసిద్ధులున్
దేలిచి మున్గఁజేయుచుఁ బ్రతిక్షణ మత్యధునాతనంబుగా
మూల మెఱుంగరాక కడముట్టుటఁ దోఁపఁగనీక శోభిలున్. 50

శా. అజ్ఞత్వంబున కాటప ట్టయి మహాహంకారు లౌ మానవుల్
ప్రజ్ఞాశక్తిని నేర్పఱించిన యుగప్రామాణ్య మొక్కింత కా
లజ్ఞత్వంబును జూప నోపక వృథాలాపంబు లై నిల్వఁ దా
నజ్ఞాతం బయి పొల్చుకాలము విభాజ్యం బౌట చేకూఱునే ! 51

మ. వ్యవహారంబున కై సృజించుకొను నియ్యబ్దంబులన్ దెల్పుచో
సువిశాలాంబుధి నీటిబొట్టగుచుఁ దోఁచున్; రెండురెండేఁడు ల
య్యావి చారిత్రికదృష్టి మిన్న యగు నం దాసన్న మాఘట్టముల్
మిగులన్ ముఖ్యము లౌటఁజేసి హృదయోన్మేషంబు చేకూర్చుటన్.

గీ. ఉత్తమశ్రేణి లభియించి యొందఁగలుగ
నేర్చితిని నాథుమెప్పుల 'నీకు జితుఁడ'
ననెడివాక్యము కర్ణములందు మ్రోయు
నెంతసువిశాలహృదయుఁడో యెఱుఁగఁజాల. 53

శా. విద్యావ్యాపృతి తీఱె, నింక మధు! భావిన్ జీవితం బెట్టు లీ
వుద్యోగింతువు సల్పఁ దెల్పు మన నే నుద్యోగ మా దుఃఖముం
బ్రద్యోత మ్మొనరింపనీయక స్వభావస్ఫూర్తి మాటాడు టే
చోద్యం, బెంతటినిగ్రహం బలమె నవ్వో శక్యమే యేరికిన్. 54

శా. నాతో ర మ్మొకనారి యింటి కని దైన్యం జేర్పడన్ గోరున
ప్పూతాత్మున్ దగ డిప్పు; డీచెలియ మిమ్మున్ బాయ నెట్లోర్చు? నే
నే తెంతున్ సమయంబు యుక్త మగునేనిన్; గోపమున్ మానుఁ డన్
నాతీ రెంతవిషాదబంధురము నన్యాయాన్వితం బక్కటా! 55

శా. ఈహాస్తంబయ తద్వియోగజనితాహీనాశ్రుపూతంబు సం
దేహాస్ఫోరకచుంబనప్రణుత; మద్రిస్థైర్యధైర్యాన్వితుం
డాహా! నాఁడు చలించె; సజ్జనఘనవ్యాపార మిట్లుండఁగా
మోహాహోపేతుల నెన్న నేల? స్థిర నై మున్మున్ను బోఁగల్గుదే! 56

చ. భవనము లేర్పడంగఁ బరివారజనంబును శిక్షకావళిన్
మిగుల సమర్థులన్ వెదకి 'మే' నెలయం దలరాష్ట్రనేతచే
నివి తెఱువంగఁ జేయవలె, నించుకయే వ్యవధాన ముండెఁ; నా
ప్రవిమలభక్తిభాజనులప్రాంచితనామము లుంతు వీనికిన్. 57

గీ. మాధవానాథనిలయము, మాతృమంది
రమ్ము, గోవిందవిద్యాలయమ్ము నాఁగ
నామకరణ మొనర్తు; నీనాఁటె స్ఫటిక
విగ్రహత్రయనిర్మాణవిదులఁ బిలుతు." 58

చ. అని యపరాహ్ణమందు నసమగ్రము లౌ భవనత్రయంబుఁ దా
గినుచుఁ దలంచుచుండ మధుఁ గ్రన్నన 'మేస్త్రి' యొకండు డాసి వం
దన మొనరించి నిల్చి 'యొకనాఁటిపనే తరువాయి తల్లి !' యం
చనఁగఁ బ్రహాస మై పనిచె నావలికర్జములెల్ల నోర్మిమై. 59

సీ. శ్రీరామ మొదలుగఁ జిత్తగించెడిదాఁక
దైనందికముల మాధవునిఁ దలఁచు
నాహారనిద్రావిహారాదికమ్ముల
మాధవానన్యత మలయుచుండుఁ
గర్మరహస్య మా కాంతారహితసూత్ర
మక్షరతః పాలనాస్థఁ బూను
బరతంత్ర మై నాథుప్రతినిధిగా దేశ
హితకార్యముల సమాహితమతి యగు

గీ. సంయమేంద్రియవృత్తిఁ బ్రసన్నహృదయ
మతిగభీరత నిర్వ్యళీకాంతరంగ
మార్తహితచింతనంబు ద న్నలముకొనఁగఁ
గర్మయోగిని నా మధు కాననయ్యె. 60

సీ. పొరపడి యైన నెప్పుడు నొక్కపల్లెత్తు
మాట నాడదు హృది నాట నొరుల
నేమఱి యైనఁ బ్రాణేశున కవమాన
మిడుకార్యములను ద్రవే లిడఁగ జంకు

నేకోదరులకన్న నెక్కుడుగా మాల
తినిఁ బ్రేమఁ దన్పును బ్రికరణముల
నందందుఁ జెలరేగు నాంతరకల్లోల
మణఁప నన్యుల సహాయమును గోర

గీ. దలఘుచిత్త లావామట్టి నలరుపీర
భూమి కైన యాచు మానవక్షేమకరము
లైన సత్కార్యసస్యాంకురాళి వెలయఁ
జేయఁదొడఁగెను నభినందనీయ యగుచు. 61

వ. ఇట్లు మధు జగద్ధితవ్రత యై సత్కార్యాభిరతిం జరించుచుండ నటఁ బుష్పపురమ్మున మాధవానందులు విద్యార్జనము సంపూర్ణం బగుటం జేసియుఁ, గుమారీత్రయంబు పట్టభద్ర లై యరుదెంచుటను నృసింహవర్మ యంతకుమున్న మిత్రుఁడు కూర్మినాయనితో రాధావివాహమ్ము నంపలి సాధకబాధకమ్ము లెజింగించి, రాధానందప్రణయసాఫల్యమున కభిముఖు నొనర్చియుండుటవలన వివాహసన్నాహంబు లొనర్ప సంకల్పించి వైశాఖమాసమ్మున ముహూర్తంబు నిర్ణయించి, సముచిత ప్రయత్నంబు లొనర్పం దొడంగె; నంత నొక్కనాఁడు మాధవుఁడు మధు నమ్మహోత్సవంబునకు స్వయముగాఁ బోయి యాహ్వానించుటా! లేఖ ననుచుటా! యని యోచించునవసరమ్మున. 62

మ. కులుకుంగుబ్బల నిద్దపుంబిగువుచూడ్కుల్ పట్టి బంధింప, న
త్తులలోఁ జిప్పిలుచిత్తరంబు నునుమోసుల్ గూర్పఁగాఁ గాంక్ష, వె
న్నెలఁ గాయన్ ముఖచంద్రబింబమునఁ, బాణిన్ దంతిపత్రంబుఁ దాఁ
జెలువారన్ గొనివచ్చి మాలతి యిడెన్ స్నేహార్ద్రపృజ్ఞాల యై. 63

మ. ఇడి, విప్పారినమోముపమ్మిఁ జెలువం బేపార "మాచెల్లి యి
య్యెడ కేతెంచును జూడుఁ డియ్యది; శుభం బిబ్బంగిఁ జేకూఱెఁ జే

సెమసర్వేశ్వరు నెన్న సోను; నటు లాశ్రీదేవి నర్చింప న
య్యెడునో యుల్లము తల్లడిల్లుఁ, ద్వరగా నేర్పాట్లు సేయందగున్."

క. అన సంభ్రమమున మాధవుఁ
డనురాగతరంగితాత్ముఁడై యాపత్రం
బును జదివి "నీవు వ్రాసితె
మనయుద్వాహావిషయంబు మధు కీమధ్యన్. 65

గీ. స్వయముగాఁ బోవుటా ? లేఖ వ్రాయుట ? యని
యిపుడె నీతోడ యోచింప నెంచియుండ
నింతలోఁ గొనివచ్చితి వీపవిత్ర
చరిత యరుదెంచు ననువార్త సరసిజాక్షి !"

66

గీ. అనఁగ విభ్రమాన్విత యయి యబ్జవదన !
"తాము వ్రాసినా రని నేను తలఁచియుంటి;
నీయయూచితభాగ్యము నిటులఁ గూర్ప
నామెయే తలపోసినయట్లు తోఁచు. 67

గీ. అర్హసమయంబునం దిట కరుగుఁదెంతు
నేన నాయంత నని పల్కె నీరజాక్షి
యంటి రిటమున్ను నాతోడ; నామె కెట్టు
లవగతం బయ్యె మనపెండ్లి? యబ్బురంబె ? 68

క. అరుదెంచు మెయిలులో ని
ద్దఱమున్ బోవలయు స్వాగతం బిడ; బండిన్
బరుపులు మెత్తలు వైవన్
సరియగు నెద్దులను బూయసల్పుఁడు త్వరగన్. 69

క. పరికింతు నింట నామెకుఁ
గర మిష్టము లైనవంటకములును వసతుల్

విరచింతును నాగది; ని
ద్దఱ మందే యుండఁ జను ముదం బిడు నదియే." 70

గీ. అనుచు సన్నాహము లొనర్ప నాతురపడు
మాల ననురక్తి వెలయఁగ మాధవుండు
గాంచి దివ్యతేజమ్మును గ్రమ్మ నామె
నమరమూర్తిగఁ దలపోసి హర్ష మందె. 71

గీ. జలమునన్ దైలబిందుప్రసారమట్లు
లంత నీవార్త గృహమునం దల్లుకొనఁగ
నంద ఱుత్సాహపూర్ణులై యర్ఘ్యవిధిని
సల్పి రున్నతశ్రేణిని జతనములను. 72

సీ. ఆదిత్యబింబోదయం బైనఁ బ్రకృతి సూ
తనశోభ నలరారు ననువుగాను
అమృతాంశునవకిరణాలోకనంబున
నుప్పొంగు బ్రాచ్యమహోదధివలె
నిస్తంద్ర మహా శాంతసీరధి నుష్ణప్ర
వాహంబు వ్యాపించు వడువుగాను
ప్రథమనై ఋతిఋతుపవనసంస్పర్శను
బులకించు మలయాళభూమి వోలె

గీ. మధుసమాగమమునఁ గుటుంబము చెలంగె;
మధురమధుమాసనమయ మన్మథనదత్కు
హూ వనప్రియ నవగీతికాలపనము
గాఁగఁ జెలువారె నయ్యింతి యాగృహమున. 73

చ. అమలినభక్తిభావమున నాగృహమేధిని, మాతరీతిఁ బ్రే
మ మలయ గేస్తురాలిఁ, జెలిమాడ్కిని లక్ష్మిని, నాత్మబాంధవం

బమరఁగ మాలతిన్, హృదయమందుఁ జెలంగువిషాద మేది ప్రా
ణమునకుఁ బ్రాణ మాపతిని నమ్రతఁ దన్పెను గాంత నేర్పునన్. 74

మ. ఇవి యాత్మీయత మాయఁజేయుఁ దగ ది ట్లీమన్ననల్ సల్పుటల్
అవితర్క్యంబుగ మీరు సల్పెడి యనర్ఘాతిథ్యసత్కారముల్
మివులన్ ఖేదము గూర్చు; నాకు నివి యేమీ లేని దో సంతసం
బవు, మన్నింపుఁడటంచునామగువయాహ్వానంబు హెచ్చించుచున్.

ఉ. ఎబ్బెతికమ్మతో నుడిపె నెల్లసపర్యల, నమ్ర యాచుఁ ద
బ్బిబ్బు లొనర్చె వారలను; భేదము ఖేదము మచ్చు మాపె, నె
ట్లబ్బెను బాల కీట్టివ్యవహారవిధిజ్ఞత ? గుండె నింతగా
నిబ్బర మెట్లు కూడె ? నని నివ్వెరపోవఁగఁ చిన్నపెద్దలున్. 76

సీ. సిరితోడ నలవడు చిన్నెలే కనరాని
నతిలోకగణ్య యయ్యార్యశీల;
మానని శాశ్వతమానసాఘాతము
నేలీల నెడఁబాపె నిద్ధచరిత;
ప్రత్యర్థిఁ దలఁపక ప్రాణంబుగా నెట్లు
ప్రేమింపఁ గలిగె వివేకమహిత;
భగ్నానురాగసంభవనిష్ప్రహాత్వ మే
క్రియఁ బాపె నీగుణశ్రీసమృద్ధ

గీ. శాపవశమున భువి నిట్లు జనన మొంది
నిశ్చలతపస్వినీవృత్తి నెఱపఁ బూను
అమరసంభవి యగును నియ్యనఘ యంచుఁ
బలికె నేకాంతమందు సుభద్ర తెలిపి. 77

మ. అబలాలోకమునందుఁ బ్రాణపతి యన్యస్త్రీని మెచ్చాడు వోఁ
బ్రబలం బౌను నసూయ; నైజ మిది; యిప్పద్మాక్షి తా నెట్టు లీ

కబు రందం జనుదెంచెఁ గాంతునకుఁ దాఁ గల్యాణముం జేయఁ, గా
దబలాలక్షణ మిద్ది; దేవతయొ ! తా నత్యంతమాయావినో ! 78

క. మాయావినియే యైన న
జేయఁ యనం దగును; సహజసిద్ధగుణంబే
యీయమ దైనఁ, ద్రిశుద్ధిగఁ
జేయందగు భక్తి వెలయ సేవలు సతమున్. 79

గీ. అనిన విచలితుఁ డై యాతఁ "డబల వగుట
తెల్ల మయ్యెను నీపల్కు-తీరునండె;
పుత్రునందలి ప్రేమ నపాత్రఁ గాఁగ
నామెఁ జిత్రింప నెంచుట న్యాయ మగునె." 80

క. అనునవసరమున నటకుం
జనుదెంచెడి కూఁతుఁ గాంచి చాలించిరి, య
వ్వనజాతనేత్ర చింతన్
మునుఁగుట గుఱుతించి శంక పొడమ నిరువురున్. 81

శా. 'అమ్మా! యే మిటు విన్నఁబోతి' వన నయ్యబ్జాక్షి 'వీక్షింపుఁ', డం
చమ్మకా డాసి యొసంగె లేఖలను రెం; డాయిద్దఱుకా వేగ ప
త్రమ్ముల్ విచ్చి పఠించి డీలువడి హర్షం బేది నిశ్చేష్టులై
బొమ్మల్ భంగిమ నుంటఁ గాంచి పలికెకా బూఁబోఁడి దైన్యమ్మునన్.

వ. "వినుఁ డాత్యాగస్వరూపిణి యనాథశరణాలయమ్మును, విద్యానిలయ
మ్మును, ప్రసూతిమందిరమ్మును నను సంస్థాత్రయంబును నిర్మించెనఁట.
వానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవంబు నెఱప నంగీకరించిరఁట. అమ్మ
హోత్సవంబునకుఁ బేరుపేరున మనకుటుంబమునందలివారి కెల్లరికిని
నాహ్వానపత్రమ్ము లనిచి, పదపడి యోజించి స్వయముగఁ బోయి
యాహ్వానించుట యుక్త మని తా నరుదెంచియుండెఁ. మనము వివా

హంబున కాహూత గాకయే యరుదెంచె నని యువ్విళ్ళూరుచుంటిమి. ఆమె కీవివాహవిషయమే యింతవఱ కేరును దెల్పియుండలేదఁట. దైవ దుర్విపాకమున నివ్వివాహదినంబును, నమ్మహోత్సవదినంబును నొక్క టియే. మునుమున్న వివాహవిషయ మెఱింగియుండిన నమ్మహోత్స వంబు వెనుకకు నెట్టియుండునే ! సర్వమ్ము సన్నద్ధ మైయున్నదే ! యాత్మీయులు లేని యీశుభారంభం బె ట్లని యామెయు, జరిగిన యపచారమునకు వీరును వ్యథాకులితు లగుచున్నారు. ఆమె తప్పక రేపు పోవలె ననుచున్నది." అనిన ననుతప్త యై సుభద్రయు, నినుమ డించినగౌరవాదరమ్ముల నృసింహులును లేచి మధు డాయంబోయిరి.

గీ. వారిఁ దిలకించి సముచితగౌరవమును
నెఱపి యాసీను లై నంత నెవ్వగ మధు
ఊర్పుగాడ్పులఁ బ్రసరించి యురలు నశ్రు
లప్పళించుచు రెప్పల, ననియె నిట్లు. 84

గీ. "ఎంతపాపిష్ఠినో ! పాప మిట్లు నన్నుఁ
గట్టికుడుపుచు నుండె; సత్కార్యములను
గూడ వెలివేయఁబడితిని; కోటిమంది
వచ్చినను నేమిసంతోషపడుదు నింక. 85

సీ. యుక్త మెయ్యది యని యోచించుటకు నైన
నేకాకి నొనరింతు నేమి యింక
రాజకీయజ్ఞులు రాష్ట్రాధినేత మ
హోద్యోగు లరుదేఱ నొక్కదాన
నర్హసత్కారమ్ము లాచరించుట యెట్లు ?
లాచరింపకయుండు టదియు నెట్లు ?
చేదోడుగా నొకశిశు వైన నాత్మీయఁ
బడయనేరని దుఃఖభాజన నగు

గీ. నాస్థితిం గూర్చి చింత నెన్నాళ్లు సల్ప
ఫలిత ముండు ? నెడారినిఁ బలవరింప
వినెడివా రెవ్వ ? రింక నావిషయ మేల ?
చరమసంప్రార్థన మొనర్తుఁ గరుణ వినుఁడు. 56

ఉ. ఈసుచరిత్ర లక్ష్మి నెటులేని దయామతిఁ బంపుఁ, డింత యు
ల్లాసము గందుఁ; బెండ్లి యెటులా ? యనఁబోకుఁడు; మీరలంత కె
ట్లో సవరించుకొండు; చెలి నొప్పుఁగ నాఁటికిఁ బంపివైతు; నా
కీసుమగాత్ర యంతవఱ కించుక తోడ్పడు మాటసాయమై." 87

మ. అని దైన్యంబున నందఱిం గనెడిమాన్యాలాపకున్ మాఱువ
ల్కను నెవ్వారలు సాహసింపక వ్యథాకల్లోలురై యుండ, ల
క్ష్మినిఁ దా నారసి నారసింహుఁ డనియెన్ "జన్నారి ! నీ విచ్చగిం
చినఁ బోవమ్మ ! వివాహవేళ కిట విచ్చేయంగ నౌఁ గావునన్." 88

క. ఆవాక్య మందఱుం దమ
భావంబుల సమ్మతించుభంగిమ ముఖరే
ఖావీక్ష నెఱిఁగి, లక్ష్మియుఁ
బోవఁగఁ దా నిచ్చగించె ముద మేపారన్. 89

మ. హృదయోద్వేగ మొకింత చల్లఁబడ నర్పించెన్ నమోవాకముల్
సదయాత్మున్ గొనుఁ డంచు నమ్మథు; ఋజుస్వాంతప్రవృత్తిన్ యశః
ప్రదసత్కార్యరతిన్ మహాశయచయప్రాలంబధీశక్తినిన్
మది రంజింప సుభద్ర సిగ్గువడె దుర్మానంబుఁ బోఁజేయుచున్. 90

వ. అంత మధు మాలతిని గాంచి "యక్కా ! విధివిధానమ్ము వేఱుగా నుండుటం జేసి నీకల్యాణమును గన్నార వీక్షించుటకు నోచుకొననైతి. నీవలె నందఱును సువిశాలహృదయుల రై యుండఁజాలరు. భగ్న ప్రణయిని ప్రత్యర్థిని హృదయపూర్వకముగఁ బ్రేమించు నన నమ్మఁ

గలుగువా రుండరు. నాయాశవలన మీబంధువర్గమ్మున నెట్టిపొరపు లుద్భవిల్లునో ! పో నెంచుటా ? మానుటా ? యనుసందియంబులం దేలు నాకు భగవానుఁ డీయవకాశమ్మును నీహితైషి యై సమకూర్చె. స్థూలరూపమున నీవివాహసమయమందు నీకుఁ గానరాకయున్నను, నాసూక్ష్మదేహ మెల్లప్పుడు నీసన్నిధి నెడఁబాయదు. త్రికరణమ్ముల నీహితమునకు నీయభిమానసోదరివలన నెట్టియంతరాయమ్మును బొడమదు. భగవానుఁ డనుగ్రహించి నీవు పుత్రవతి వగునపు డరుదెంచి నానేరమునకు క్షమాపణఁ గోరుకొనియెద;" నని నృసింహునిఁ గనుంగొని "రేపు ప్రాతఃకాలమ్మున బయల్వెడలు వాయుయానమ్మునఁ బో నెంతు. వ్యవధి లేదు. పూజ్యులగు తమదర్శనభాగ్యము లభించె. మానవసహజ మగుతప్పిద మొండు నావలన సంభవించె; నద్దాని ప్రాయశ్చిత్తమునకే పాటుపడుచుంటి. పితృసదృశులరగు తమ యమోఘాశీర్వాదమున నాకు వలయుకార్యదీక్షను నిగ్రహమును బ్రసాదింతురుగాక !" అని సుభద్ర నీక్షించి మాతృహృదయ మన నెట్టిదో యెఱుంగని యీయభాగ్యకుఁ దమ విశాలనవనీతహృదయమున నించుక చోటుఁ బ్రసాదింపుఁడు. ప్రమాదసంభవ మగు నాయపచారమును గన్నబిడ్డనేరముఁబోలె క్షమామతిఁ బోఁద్రోయుఁడు. పుత్రానురాగమునఁ దాము నన్ను శంకించుట సహజము; కాని యతిలోకసచ్ఛీలుఁ డైన మీసుతున కెట్టియవజ్ఞయు నావలనఁ బొడమనేర దని నిశ్చయముగా నమ్ముఁడు. ఈరెండునాళ్ళును దమయాదరానురాగముల దొప్పఁదోఁగి స్వర్గసౌఖ్యములను జూరఁగొంటి; కాని కార్యభారమున నీనిర్భాగ్య కదియుఁ త్రుటిలోఁ దొలఁగనున్నది. నా సంకల్ప మవిఘ్నముగ నెఱవేఱుటకై తమశుభాశీర్వాదముల నభిలషింతు" నని పల్కి ప్రయాణసన్నాహము లొనర్ప లేచె. మాధవుఁ డింతకుమున్నె హృదయము చిక్కఁబట్టనేరక యావలికిం జనియె.

మాలతి పెదమొగమ్మున ధారాపాతముగ నశ్రులు రాల్చందొడంగె. సుభద్ర నీరవయై సజలాక్షి యయ్యె. నృసింహుం డుస్సు రని యాసనంబు నొత్తిగిలం బడియె. లక్ష్మి యాదృశ్యమ్ము నీక్షింపఁజాలక కనులు చెమ్మగిల్ల నుమ్మలికం గూరె. 91

ఉ. ఆరనిచిచ్చు వెట్టి చనె నానిశి లక్ష్మినిఁ దోడుకొంచు నా
సారసపత్రనేత్ర మధు; సంతమసావృతచిత్తుఁ డౌచు గం
భీరుఁడు మాధవుం డనిచి ప్రీలినచిత్తముతో విమానమున్
ఆరయుచున్ మనం బెసలి యార్తిని నిల్చెను విగ్రహాకృతిన్. 92

ఆ. వె. "నఱలు మెఱయు నాకుఁ గఱపెను బుద్ధులు
గఱిత లోకమాన్యచరిత నిజము;
శృంగభంగ మై తొలంగె నాయజ్ఞాన
మమృతహృదయ పరిచయంబు వలన." 93

గీ. అనుచుఁ దలపోసి మధువిషాదాంధకార
పూరితం బగు జీవితమును దలంచి
కన్నసుతకయి విలపించుకరణిఁ గన్ను
లొత్తెను సుభద్ర దుఃఖ ముప్పొత్తు గాఁగ. 94

చ. "అనుదిన మెన్నికుట్రలును హత్యలుఁ జిత్రవధల్ స్వదేహసం
హననము లుండుఁ బత్రికల సత్యనుకంపచరిత్ర, లిట్టిమా
నినిచరితంబు గానఁ, రమణీమణి, సుందరి, విస్తులార్థసా
ఖ్యనివహభోగముల్ గలిగి కల్మషదూషిత కామి వింతయా. 95

చ. అనుభవపూర్వకంబుగనె యూరయ నో విషయంబు, మున్ను నే
వినినది యల్పమాత్రమె, వివేకము, పాండితి, యోచనామతిన్
గనినగుణాఢ్య జీవితము కామ్యము నొందనిమాత్ర వ్యర్థపు
చ్చునె? హృదయోన్నతత్వమును సూక్ష్మవిచారము లేమి నట్లగున్.

ఉ. అవినయంబు కూరిమి సమాదరచిత్తము నిర్మలత్వమున్
భావసమన్వయంబు పరభావవివేచన త్యాగశీలమున్
దేవత కైన సాధ్యమె ? విధిప్రతికూలత తప్ప లోప మా
పావనియందుఁ గాన; సురభామిని నాఁ జను నన్నిభంగులన్. 97

ఉ. శ్రీ యన నొప్పు నీచెలియ చిత్తసమర్పణ సల్ప నేగతిన్
ద్రోయఁగ నేర్చె మాధవుఁడు ? దుర్బలమానసుఁ డైన నీక్రియన్
జేయ సమర్థుఁడే ? వినుతి సేయఁగ సర్వుఁడు; మాలతీదృఢా
జేయమహానురాగమునఁ జేసియె తట్టుకొనంగ నేర్వ నౌ." 98

క. అని నారసింహుఁ డమ్మధు
ఘనవృత్తముఁ దలఁచి సుఖముగా నాతరుణిన్
మనుపఁ దగు నంచు దేవుని
మనమున ధ్యానించె సమితమమకారమునన్. 99

గీ. పుండుపైఁ గారమును జల్లుపోల్కి నినుమ
డించిన వ్యథాభరమ్మున నెడఁద పగుల
మధును దలపోసి లోలోన మాలతి స్మృతిఁ
బారు గతవృత్త మెంచుచు బాధ నొందె. 108

శా. కార్యవ్యగ్రతఁజేసి వారలకు దుఃఖం బింతచల్లారె; నౌ
దార్యం బించుక లేని కొందఱు కులోద్ధారప్రవీణుల్ మహా
కార్యజ్ఞుం డితఁ డౌటఁజేసి కులసంస్కారంబు గావించు, ని
క్కార్యం బెట్టులు పూర్తిఁజేయు నని విఘ్నారంభసంసక్తులై. 101

ఆ. వె. "గూళ్లు కట్టి తనదుకొడుకును గాక వే
ఱొకరిబిడ్డఁ జెఱిపి యుద్ధరింపఁ
బూనెఁ గులముఁ; గనఁ బ్రబుద్ధుఁడు నరసింహుఁ
డెంతదుర్ణయుఁబొ యెఱుఁగుఁ డనుచు. 102

మ. వెలివేయందగు నిట్టిదానిఁ, దమకున్ విత్తంబు గల్గించు నీ
కులమున్ భ్రష్ట మొనర్ప నూరకొనఁగా ఘోరంబులే పుట్టుఁ; బె
ద్దలతో యోచన సేయ కిట్టుల మహాదర్పంబునన్ బూనునే!
కలిబుద్ధుల్ తొలఁగింపకుండిన జగత్కల్యాణమున్ మాయదే!" 103

గీ. అంచు లోలోనఁ దాము చర్చించుకొనెడి
వార్త చెవిఁ జేరఁగ సుభద్ర పతికిఁ దెలిపె;
నాతఁ డది విని యపహాస మాననమున
వెలయఁ గ్రీఁగెదవిని నంత విఱిచి యనియె. 104

ఉ. "ఎంచుము కాకిగోలగ, నొకించుక యు ష్షన మా టడంగు; నా
లించితి నెవ్వరెవ్వ రిటు లీఘనకార్యము నడ్డ నెంచిరో!
సంచలనంబు దేనిరో! భృశంబు భయంబును నొందఁబోకుమా!
కంచరపిల్లి చేసడికిఁ గాంచునె భీతిఁ గురంగలోచనా! 105

సీ. అర్థంబు లే దను నావేదనంబును
నున్నవా రనుచుఁ జూపోపమియును
మార్పును నోర్వని మమకారచిత్తము
గౌరవ మీవిధిఁ గాంచుతలఁపు
బెదరించి యేమైనఁ బిండుకోఁ గోరిక
మముఁ జేరఁడే యను మత్సరమును
మనకీర్తి నీగతి మాపఁగాఁ దలపోత
కార్యవిఘ్నాపాదకాంక్షఁ గూడి

గీ. వ్యక్తితల లిట్లు వైచెడి; విజ్ఞమతిని
రేపె వారెల్లరిం జేరి యోపినంత
యత్న మొనరింతు సహకార మంద నచ్చఁ
జెప్పి యిట్టిసత్కార్యవై శిష్ట్య మెల్ల." 106

వ. అని యర్ధాంగి నొడఁబడఁ బల్కి. 107

గీ. మాన్యజనులను సజ్జనమ్మన్యు లైన
వారలం జేరి గ్రామచావడినిఁ జేర్చి
నారసింహుఁడు మఱునాఁడు నయ మెలర్పఁ;
మాధవుఁడుఁ జెంతఁ గూర్చొన మధురఫణితి. 108

సీ. జాతివిచ్ఛేదంబు, శాఖావిభేదంబు
వైవాహికాసమత్వములుఁ, బ్రణయ
వైశిష్ట్యమును, నైక్యభావావసరమును
సాంఘికాచారాలసరణి, నేఁటి
దేశకాలస్థితి, ధృతిఁ బురోగతి లేమి
స్వజనంబు వెనుబడ్డచందముఁ, గుల
భావ్యభివృద్ధికై పథకంబు, విశ్వాజ
నీనత్వభావము, నిర్మల మగు

గీ. సంప్రదాయపోషణమందు శ్రద్ధఁ బెంపఁ
దగువిధానము, జలధరధ్వానసదృశ
కంఠరవమునఁ బలికి సత్కార్యదీక్షఁ
బూనఁ బ్రేరేఁచె నందఱు ముదము నొంద. 108

గీ. అంత నానుపూర్విగ వివాహప్రసంగ
మొనరిచి వినీతి సహకార మొసఁగ వేఁడఁ
బిండిబుక్కినలీల నూపిరిని వీడ
సాహసింప నోడిరి తిరస్కారపరులు. 109

గీ. పరసమతులు మే ల్మే లని సంతసమును
వెలయఁజేసిరి; మూర్ఖులు వెలుఁగుఁ జూడ
నోడు నల్లులవోలె మారాడ కడఁగి
చేరు సభ్యుల నిరసన కిష్టపడక. 110

వ. అంత నృసింహుఁడు తనకార్యసాధనాభిముఖ్యంబు బహుజనసముఖం
బున గమనించి, తనిసి, కడమవారిఁ బురికొల్పి తదంగీకృతిఁ బడయ
నుద్దేశించి స్వాభిమానంబు రేకెత్తఁజేయుచు ని ట్లనియె. 111

సీ. "ఏవంశధారానదీవిశ్రుతాంబువుల్
తొలి జ్ఞానసస్యముల్ మొలవఁజేసె
నేపూతవసుమతి నేపార నాగరి
కత్వమ్ము ప్రాచ్యభూఖండ మొందె
నేయద్రికంధరా లీయార్యభూమిని
విశ్వజనీనత వెలయఁజేసె
నేవాయువీచిక లేవేళ సంస్కార
సాహసాకీర్ణ వాసనలఁ బఱపె

గీ. నట్టి మధ్యకళింగదేశావతంస
మైన మనపుష్పపురము కులైక్యచిహ్న
సంస్కరణ సల్పఁగల్గు టాచంద్రతార
కముగ గర్వకారణ మనఁగలను నేను." 112

శా. ఆయుద్బోధము మెచ్చిమందుక్రియ మోదావేశమున్ గూర్ప జే!
జే! యంచున్ జను లెల్ల రార్చిరి; ముఖశ్రీవిద్యుతుల్ గ్రమ్మఁగా
"మీయుత్సాహము మెచ్చినాను;వలయున్ మీమీ శుభాకాంక్షలున్
సాయం బీతని" కంచుఁ బొందుగ నమస్కారంబు గావించినన్. 113

క. నరసింహుఁ గాంచి పలువురు
"నిరతమ్మును బుష్పపురము నిలుచును దగ నీ
సరసను, సంశయ మొందక
పరిణయయత్నములఁ దొడుపడుదు" మనంగన్. 114

గీ. సంతసమ్మున వీడ్కొల్పి సరసహృదయుఁ
డాత్మజునిసంస్మితానన మంతఁ జూచి

విజయసూచకముగ నవ్వి గజసమాన
యానుఁ డై చనె సుతుఁడు వెన్నంటి రాఁగ. 115

చ. అది యొకసౌఖ్యదాయకదినాంతము; పుష్పపురమ్ము నాఁడు శో
భ దొరయఁ బెండ్లికై వివిధబంధులు మిత్రులు నిండియుంటచే
నెదిరియొ యపూర్వమౌ సొగసు నెంతయుఁ గాంచెను; మంగళధ్వనుల్
ఎదలను దీయనౌతలఁపు లేర్పడఁ జేయుచు హాయిఁ గూర్పఁగన్. 116

మ. నరసింహుండు వినీతి గౌరవము నానందమ్ము మై బంధులం
దిరువర్గంబులవారి సత్కృతులఁ దా నేమాత్రలోపంబుఁ జే
కురకుండన్ బరికించు చెచ్చటను నేకోలాహలం బేర్పడన్
బరిశీలించి ప్రశాంతిఁ గూర్చఁదొడఁగెన్ భావ్యర్థసంవేది యై. 117

మ. చెలువుం డట్లు సుభద్ర బంధువులలో స్త్రీవర్గమున్ శ్రద్ధయున్
జెలిమిన్ గౌరవమున్ వెలార్చుచును దా సేవింపఁగాఁ బొల్పెడిన్
బలుకార్యంబుల విఘ్నసంచయము లేమర్యాదలే యాటఁ దా
నలవోకం గన కన్నిభంగులను నాహ్లాదంబుఁ జేకూర్చుచున్. 118

గీ. రెండువేలేండ్లుగా విడియుండి నేఁడు
గలియ నొకచోటఁ జేరిన కులముఁ గాంచి
మేను పొంగ మాధవుఁ డనిమేషనేత్రుఁ
డగుచు నానందు మైఁ దట్టి యనియె నిట్లు. 119

శా. "ఆనందా ! చరితార్థ మయ్యె జననం బాహా ! మహాపర్వమౌ
నీనాఁ డెన్నఁడు విస్మరింప వశమే ? యీజాతియుజ్జీవనం
బీనాఁడే మొద లయ్యె; విస్మృతికళింగైకత్వమున్ గాంచఁగా
మే నుప్పొంగును రాతిబొమ్మకయినన్; మీభాగ్య మత్యల్పమే. 120

గీ. నాందిపూజ నొనర్ప నిన్నాళ్లకైన
దక్కె భాగ్యంబు మీపుణ్యదంపతులకు;

భాషసంస్కారపరులకుఁ బట్టుఁగొమ్మ
యగును మీసల్పుసంఘకల్యాణసుకృతి." 121

చ. అనునెడఁ 'దోడుఁబుట్టు విదె యంజలి మోడ్చెద సారెచీరలుం
గొనఁగ' నటంచు లక్ష్మి యట గొబ్బున నిల్చిన, హర్ష బాష్పముల్
గనులను జిమ్మ సంభ్రమముగా నుభయుల్ నయగార మొప్పఁగా
ననుజను గారవించి 'సుఖమా? మనుప' కంచును బృచ్ఛచేసినన్. 122

ఉ. "ఆఁ! కుశలంబె; సర్వవిషయంబులు వైశమ వచ్చి తెల్పుదున్
మీ; కిపు డే నవశ్యముగ మీదుసహేమణులం గనంగ, నె
న్నోకబురుల్ వచింపఁ గడు నుత్సుకనై చనుచుంటిఁ, బోదు" నం
చాకమనీయగాత్ర చన హర్షము నొందిరి వార లిర్వురున్. 123

ఉ. "ఆక్కలు గట్టుకొంచుఁ గడు వ్రేగగు చిత్తముఁ జిక్కఁబట్టి మీ
చక్కికి వచ్చినా నిదిగో! సాదర మేర్పడఁ బెండ్లికూఁతు లీ
డిక్కునఁ జూడరే!" యనుచుఁ బ్రస్తవిలోచన యాచు లక్ష్మి కై
పెక్కసలీలఁ బల్కుచును జేర్మని నూత్నవధూద్వయంబునున్. 124

గీ. చేరవచ్చిన నిర్వు రచ్చేరువు దోఁప
లేచి యెద హత్తుకొనిరి; యాలేమ పోక
బోదియ లతాద్వయమ్ముచేఁ బొదువఁబడిన
లీలఁ జెన్నారె సంతసోద్వేల యగుచు. 125

వ. పదపడి వార లామెను సుఖోపవిష్టఁ గానరించి యిరుగెలంకుల నాసీన
లై 'మధుక్షేమంబు సవిస్తరంబుగఁ దెలుపు' మనుచు నూటికేసుఁ
దసతొడలపై నిడుకొని తెఱచి యొకరజతకరండమును వెలికిఁ దీసి
'యిది మీయనుంగుసోదరి నీకు వివాహబహూకృతిగా సమర్పించి
నది' అని మాలతి కొసంగి వేఱొండుపేటికం దీసి రాధ కిడి 'యిది
మీయజ్ఞాతసోదరి నీపతితోఁ గల పరిచయమును బురస్కరించుకొని

నీకు వివాహాబహూకరణ మొనర్చి, పరిగ్రహింపు మని ప్రాధేయపడి నది.' అనిన నయ్యిరువురుఁ బరమానందభరితలై కరండస్థితమణిమండిత హారములం గని నివ్వెరవోయిరి. అంత లక్ష్మి వేఱొండు బంగీని దీసి మాలతి కొసంగి 'శోభనదినమ్మునమాత్ర మీసమగ్రవసనాభరణ మ్ములఁ దాల్పుమనియు నీ వట్లొనర్పనిచో నామె కాత్మశాంతి యుండ దనియు నర్థించిన దనవేల యూజ్ఞాపించిన దనినవే యోగ్యముగ నుండు' ననుచు లక్ష్మి సజలాక్షి యైన, మాలతి బొటబొటఁ గన్నీరుఁ గార్చుచు నద్దానిం గాంచి మనము కుదురువఱచుకొని యద్దానిని విచ్చి చూడ నం దాపాదశిరోభూషలును వెలఁగట్టరాని మనోజ్ఞ వర్ణరంజితమ్ము లగు చీనిచీనాంబరమ్మును గంచుకమ్మును బావడయు నుంట వీక్షించి యుస్సు రని నిట్టూర్చి "హా! పరమేశ్వరా! యీ ఋణభారము నీగ మార్గము గలదే!" యని వాపోయె. అంత రాధ యామె నూఱడించి 'యక్కా! యిది సంతాపసమయము కా' దని హెచ్చరించె; నంత మాలతి ముఖమున లేనినవ్వు దెచ్చికొని వానిని భద్రపఱచి 'యచటివృత్తాంత మెఱింగింపు' మనుఁడు లక్ష్మి. 126

ఉ. "ఏమని తెల్పుదాన నట నేయఁబుర్ణ బరికింపఁ ద్యాగమున్
ప్రేమయె గోచరించు; నిటఁ బెండ్లియె లేనిచో కొన్ని నాళ్ళు లా
ప్రేమమయిన్ భజించుచు నవేద్యము లైన మహానుభూతు లె
న్నో మనసంబు నల్పుదు మనుష్యమనఃపరిణామవీక్షమై. 127

శా. విశ్వవ్యాప్త మొనర్చెఁ బ్రేమఁ, గరుణావిజ్ఞాననిస్వార్థముల్
శశ్వచ్ఛీలముఁ గూడి మూర్తిఁ గొనియెన్ జంద్రాస్య; యమ్మానినీ
విశ్వాసంబునఁ బ్రేమయోగిని; జగద్విఖ్యాతకార్యంబులన్
ఆశ్వాసంబును జీవితేశ్వరప్రియుం బర్థించు నిత్యం బెదన్. 128

క. మాతాపితరులకును నిజ
చేతఃప్రియనాథునకును జేసెను నతిసం

ప్రీతిగ నంకితమును జల
జాతముఖి విశిష్టధర్మసంస్థాత్రయమున్. 129

చ. స్ఫటికశిలావినిర్మితము సంస్తవనీయము నైన విగ్రహా
స్ఫుటసముదారభావములఁ జూడఁదగున్; వివరింప నేర్వ; ని
న్నటిదినమే యమర్ప భవనంబులముందునఁ బంచె; నందు న
న్నిటికిని మిన్న యగ్రజుని నిర్వ్యాజమువిగ్రహ మన్నిభంగులన్. 130

గీ. అగ్రజనినామమున శరణాలయమ్ము
జనకుసంజ్ఞను విద్యార్థిసదన, మాత్మ
జనని కంకితము ప్రసూతిశాల గాఁగ
మువురమూర్తుల నభిముఖముగను నిలిపె. 131

శా. నేఁ డావిష్కరణోత్సవం బగుట నానిస్వార్థ కొక్కింత మా
టాడం దీఱదు; శ్రాంతిఁ గానతయె కార్యవ్యగ్రచిత్తంబుతోఁ
ద్రాఘున్ బొంగర మామె యై సలిపె నుత్సాహంబునన్ సర్వమున్;
ఆఁడుంబుట్టువులందు మేల్కొలిపెఁ దా నాత్మాభిమానం బొగిన్.

మ. గతవారం బదియెల్ల ‘ఫోను’కడ నాకాలంబు డెల్లారె; సం
తత మాసాధ్విని సంప్రతించుచు సమాధానంబు లందించు టే
ప్రతినిత్యం బొనరించియుంటి; సకలవ్యాపారముల్ చాన నే
గతి నేలోపము లేక దిద్దుకొనెనో! కాంతాజనాసాధ్యమా. 133

శా. నిర్మాణాత్మకశక్తియే యచటఁ దన్వీమూర్తిఁ జెన్నారె; స
ద్ధర్మాలంబనదివ్యదీధితులు సుస్థైర్యాత్మవిశ్వాసముల్
నిర్మోహత్వము దుల్కరించుఁ బనులన్; నిష్కామకర్మక్రియా
మర్మజ్ఞత్వముఁ గన్న యామె యగు సమ్మాననార్హ స్త్రీజాతికిన్. 134

చ. చిడిముడిపాటు లేదు, పెరచింతలఁ బుచ్చదు; కార్యదీక్షఁ బో
నడఁచెదు దీర్ఘసూత్రత ననాదరణం బొనరించు; సుంత ధీ

జడిమయు గర్వమున్ గనము; నా థన, సేవ, హితేచ్ఛ శాసన
య్యెడు, నుడురాజతేజ మని యెల్లపుడున్ జెలువారు మోహమునన్.

గీ. ఈశ్వరుఁ డనుగ్రహముఁ జూపునేని నేను
కర్మయోగిని నైన యకాఁతచెంతఁ
గొన్నినా ళ్లుండి శిక్షణఁ గొనఁగ నెంతు
నింతకన్న నాయమను వర్ణింపఁ జాల." 136

గీ. అనిన గౌరవాదరవిషాదాత్మ యగుచు
నిడుదయూ ర్పొందుఁ బుచ్చి యుస్మీలితాక్షి
యగుచుఁ జెక్కుటఁ జెయిఁ జేర్చి యలరె మాల
తీసతీమణి యోచనాధీనమతిని. 137

గీ. రాధ, వృత్తాంతమును సమగ్రముగ నెఱిఁగి
యుండమింజేసి, నెవ్వగ నొందుచుట్టి
మాలతిన్ జూచి విస్మయమహిత యగుచు
సముచితోక్తులఁ జూపెను సానుభూతి. 138

సీ. శస్త్రతృతీయార్థసాధనరాజంబు
ప్రేమానుభావనిరీక్షణఫల
మానందభూజదోహదకారి, సాంఘిక
మర్యాదఁ జేకూర్చుమార్గము, శ్రుతి
చోదితమంత్రప్రశోభితం, బుత్తమ
ధర్మాధికారసంతానకమ్ము
నుతగృహస్థాశ్రమవ్రతనిష్ఠితము, జన్మ
జన్మాంతరనిబద్ధచణము నైన

గీ. బ్రాహ్మ్యవిధిని నుద్వాహ మాప్రణయధనుల
కార్షధర్మబద్ధంబుగ నయ్యెఁ గుంభ

లగ్నమున బంధు లానందమగ్ను లగుచు
మేలు మే లని ప్రస్తుతుల్ మిన్నుల సేయ. 139

క. కలఁతలు లేని వివాహము
పొలయలుకలు లేని పొందు పొసఁగ వటంచున్
బలుకుదురు గాని సంస్కృతి
కలచోటుల నిట్టిచెట్ట కలుగు నెటువలెన్ ?

క. ఏదో యొకరు సినీమా
తారను గొనిరామి సొగసు తగ్గెను; ఇవ్వులన్
బేరైన కొంప కింత యు
దారత వలదే యటంచుఁ దప్పించి రటన్. 141

క. వరకట్నము లేకుండుట
సరసముగాఁ దోఁప దీళ్ళు సదివింపమియున్
బరువు కుఱుచ యని మూతులు
విఱిచిరి యందందు నీలవేణు లత్తృప్తిన్. 142

గీ. కులముకలయికలో నున్న గొప్ప కేమి ?
ఆణిముత్తెము చేఁజిక్కె; సార ! సిరులు
గురియు నీకుందనపుబొమ్మ దొరకుచుండ
జాతినీతులుఁ దలపోయు చవట యెవఁడు ? 143

గీ. అంచు గుసగుస లొక్కింత యందు నందుఁ
బొడమెఁ; గలవారితోఁ గన్నుబొడిచి పలుకు
సాహసం బేరి కుండుఁ ? బ్రవాహగతిని
వంగదే యాత్మరక్షణ తుంగ కోరి. 144

గీ. లాంఛనప్రాయముగను నెల్లవిధు లొక్క
శాస్త్రమున సంఘటించి నిర్వాహణ సల్పి

సూత్రకారునిఁ బోలెఁ బ్రస్తుతుల కర్తఁ
డగు పురోహితుఁ బొందెను సభిమతములు. 145

గీ. ఐదుసూతలు వెలచేయు నా కొకండు
పదినయాపైస లగు విడె మది బళా రె!
యనుచు జత్తలు దిని ప్రశంసాఁగ గురియు
బంధువుల సంవషులు పల్చఁబడె నొకింత. 146

ఉ. పుష్పసముద్గమంబున నపూర్వమనోజ్ఞతయున్ మరందసం
బాష్పపరాగపూరపరిబంధురసాంద్రపరీమళత్వమున్
నిష్ప్రభులానన భ్రమరనిత్యవినూతనగానలౌల్యమున్
నిష్పరతంత్రకోకిలవినిస్తులరావము నామనిం గనెన్. 147

సీ. ప్రసవాంగి కుసుమించి హాసియించెఁ బల్లవ
సంగతి నతిశోభనాంగి యగుచు
నాసవం బురలఁ బెల్లాసలు చేకొత్తఁ
జేసి మధువ్రతుఁ జేరఁ జీరెఁ
గేసరస్థితరజోధూసరాంగమిళింద
సంపర్కమున నెద జలదరింప
దెస లంటఁగాఁ దరితీఁపు గుబాళించు
నెత్తావులను జిందె నత్తమిల్ల

గీ. మధుర మధుమాససమయసంప్రాప్తనూత్న
రామణీయక మలర నిర్భరవయోను
జాతమాతృత్వకాంక్ష నుత్సవముఁ గూర్చు
మందిరప్రమదావన మందు నంత. 148

శా. మధ్యాపేక్షను దీర్ప నామె యిడు సమ్యగ్భూషణవ్రాతమున్
వధ్వాఢ్యన్ గయిసేసి రంగనలు; దత్ప్రాంచత్సమాలంకృతిన్

మాధ్వీబాణునిసాయకం బనఁగ శుంభచ్ఛోభనాకార యా
సాధ్వీరత్నము మాలతిన్ బెలుచ నుత్సాహవ్యథల్ పెంపఁగన్. 149

సీ. అపహరించితె మధు నర్థంబు ? స్వార్థము
నామె కోరెనె ? సంశయాస్పదమ్ము;
ఆమెకు నేనుగా నర్పించితినె ప్రియుఁ,
ద్రోసివై చెను నాది దోస మగునె ?
ఆమె త్యజించి దయామతి నా కొసం
గిన బిచ్చ మగునె నాప్రణయధనము ?
ప్రియుఁ డామె నేలీలఁ బ్రేమించె ? మైత్రియా ?
కాంక్ష యేమైనను గనెనొ ? యెఱుఁగఁ;
గీ. గామమే యున్న వ్యభిచార మామహాత్ముఁ
డిచ్చగించునె ? దీని నూహింప శక్తి
చాలకున్నదె యని మనశ్శాంతిఁ గనక
శోభనమునాఁడు మాలతి చొచ్చెఁ జింత. 150

సీ. "ఏణాక్షి ! యిదె నీ కనీనికానైల్యము
బెనుపఁ గజ్జలరేఖఁ బెర్మి నిడుదు
బింబాధరీ ! మేలిడంబును గూర్ప లే
పనము బూతును మోవిఁ బట్టఁగదవె
బిబ్బోకవతి ! గబ్బిగుబ్బల మలయజ
పంక మలందు దీవంక రమ్ము
తిలపుష్పనాస ! యొప్పులుగుల్కఁ గాశ్మీర
తిలక ముంచెదను గదలకు మింత
గీ. చరణపల్లవ ! పారాణి సంతరింతుఁ
బాద మిటు తేవె" యనుచు శోభనసమర్హా

కన్యకాలంక్రియాకాంక్షఁ గాంత లాఁకు
మాట లాచెల్వచింతలఁ గీ టడంప. 151

ఉ. మట్టెలు పట్టియల్ రవళి మంజులమై క్రుళిదోయిఁ దన్నఁ, గే
ల్వట్టి చెలుల్ వినోదములు పల్కుచుఁ ద్రోవను జూపఁగాఁ, జిగు
ర్వట్టునవీనకాంతులను బ్రీడయు సంశయమున్ జనింపఁ, గా
ల్వెట్టెను శోభనంపుగదిఁ బ్రేమరసాకృతి బాల మెల్లనన్. 152

మ. కడఁగంటన్ బ్రియుఁ బత్రికాపఠనమున్ గావించుచందంబు న
య్యెడురాజానన కాంచి జాణ యయి తా నుత్కంఠయేఁ దోఁపనీ
యడు లేశం బనియెంచు మాలతికి నూహాభంగమై తల్పుచ
ప్పుడు విన్పింపఁ దటాలునం దిరిగెఁ దాఁ బొంగారుకంగారు మై. 153

గీ. గుసగుసలు నవ్వులును దమిఁ గొల్పునుడులు
హాస్యములు వినవయ్యె; నయ్యావనతాస్య
మోహనాకారమును గాంచి మునుకొనుతమి
నాఁపనోపక గడియను, నంత వైచి. 154

మ. చెలికే ల్వట్టుచు మాధవుండు గనె నక్షీణానురాగంబునన్
అలవోకన్ శుభగానుశోభనసమగ్రాలంక్రియానైపుణిన్;
దళుకున్ బంగరుబొమ్మఁ గాంచ మది నుద్యల్లీల భాసించె న
జ్జలజాతాక్షి మధుస్వరూపము ప్రహర్ష వ్యగ్రతల్ గూర్చుచున్. 155

గీ. కనులు చికిలించి సవిమర్శగాఁ దనుఁ గను
జీవితేశ్వరుఁ బరికించి చెలియ ప్రియుని
మదిని రంజించె నని యెంచి "మానినీయ!
చెల్లి మధు పంచె నివియెల్ల స్నేహ మలర. 156

గీ. శోభనదినంపుముస్తాబు సుందరాంగి
నిర్ణయించి తప్పక పీనినే ధరింప

మిపులఁ బ్రాధీయపడెఁ, గాన నపెయె నేఁడు
దాల్చితిని; మెచ్చుఁ గూర్చెనే తమకు ?" సనిన. 157

సీ. ఈమనోజ్ఞాలంక్రియామహితాకార
మాన్య యీసుగుణాఢ్య మాతృమూర్తి
ఈదివ్యరూపమునే తాల్చి మధు తొట్ట
తొలి విం దొసంగి న న్నలరఁజేసె
నీశుభగాకృతియే శోభిలఁ దృతీయ
పురుషార్థసాధనఁ బూననయ్యె
నీఘనాలంకార మివురెత్తఁ జేసెఁ బూ
ర్వస్మృతుల్ హృదయంబు బరువువార

గీ. నిదియె యవిభాజ్యసంబంధ మేదియొ మధు
భగ్నజీవితమును బెనవైవఁ జేయు
సూత్రమై కాననయ్యె విశుద్ధచరిత
తావకామూల్యపరిశుద్ధజీవనమున. 158

చ. అని యతఁ డాత్మఁ బెల్లుబుకునట్టివ్యథన్ దగఁ జిక్కఁబట్టి, మో
మున ననురాగహాసములు మోసులు దేర సుమాంగి గౌరవం
బెనయఁగ శయ్యఁ జేర్చి తనియించెడి వాక్కులఁ దన్పి మీనకే
తనుధ్వజకింకిణీరవః దత్తర మొంద నెడందఁ గాంక్షమై. 159

సీ. చెలువారఁ గాసులు చేలచెంగునఁ గట్టు
వ్యాజమ్మునన్ బైఁట నవలఁ ద్రోసి
గ్రీవభూషల సంతరించుచు నేర్పుమై
జాకెట్టుగుండీల సడలఁజేసి
నిక్కుచన్నుల నిట్లు స్రుక్కఁజేయుట నేర
మంచు బాడీముడి నంత విచ్చి

వ్రీడాభరమ్ముఁ బోనాడఁ బెన్నురమునఁ
జీవితేశ్వరికి నాశ్లేష మొసఁగి

గీ. పారవశ్యంబునన్ జొక్కు-భంగిమఁ గని
నేర్పుమై పోకముడి నూడ్చి నీరజాక్షి
సమరతులఁ దేల్చి రంజించె జాణతనము
వెలయ నాతఁడు తరితీఁపు లోలయఁ జేసి. 160

సీ. ఫాలచుంబనకాంక్షఁ బణఁతి ముద్దాడుచో
సీమంతమున మధు చిందులాడు
నధరామృతమ్మును నాస్వాదనము సల్ప
మధు నాసికాభూష మలయుచుండుఁ
జెక్కుటద్దమ్ములఁ జెనక నూహించుచోఁ
దాటంకరుచి మధు తాన తోఁచుఁ
గంఠమ్ము ననురక్తిఁ గౌఁగిలించెడు నెడ
భూషణమ్ముల మధుమూర్తి వెలయుఁ

గీ. గుచము లంటఁగఁ బధకముల్ గోమలాంగి
మధువు బొడకట్టఁ జేయు; సమ్మోధవ్రసకు
మధుమయం బయి మాలతీమధురమూర్తి
తోఁచెఁ దొలికూటమునఁ దమి రేచి మివుల. 161

సీ. కడఁగంటిచూపుల నదరించి కాంతుని
మోహంబుఁ బెంచును ముమ్మరముగ
మోవి నానెడుతఱి మురిపెమ్ము వెలయించుఁ
గలనాద మొనరించి చెలువుఁ దనుపు
గబ్బిగుబ్బల నెద గాటమ్ముగా నాటి
పెనఁచును బ్రియుకాంక్ష నినుమడింప

నెదురొత్తు లిడుచు సమ్మదమున నుద్రేకమ్ము
నురవడింపఁగఁ జేసి కలఁచు నాథు

గీ. సఖుఁడు శ్రాంతుఁ డై కన్నట్టిసమయమందుఁ
గడఁగుఁ బురుషాయితము సల్పఁగా విలాస
రాశి మాలతి; మదనసంగ్రామకళను
బ్రథమపాఠముల్ నేర్వఁగాఁ బాటుపడుచు. 162

ఉ. లేలు గ్రుశించె నిట్లు, తమి రేచిన మన్మథు డీలుపుచ్చఁగాఁ
జాలదు కాల మంచు నిముసంబును వ్యర్థము సేయ నోడి ర
మ్యాలయు మాధవుండు నెడఁబాటు సహింపక సర్పయుగ్మమున్
బోలె నొడళ్లు నొండొకటి పొల్పెసలారఁ బెనంగ నిచ్చలున్. 163

మ. నవలావణ్యము నంగకంబులను, విన్నాణంబుగాఁ జెయ్యులున్
వివిధాలాపములందు నింపుఁదనమున్, విశ్రాంతి యావేళ మా
త్రవివేకార్థము గ్రంథముల్ చదువుటల్ దీయందనం బొల్కుటల్
నవలారత్నమునందుఁ గాంచి యది సంతానోదయం బాటఁగాన్. 164

చ. తలఁచి, తలంచుమాత్రమునఁ దారొ్కనుమోదముఁ బట్టఁజాల క
క్కలికిని, సావధానముగ నిర్భరహాస్యము లాకళించుకోఁ
దలఁచి పఠించుగ్రంథమునఁ దత్పర యై చెలువారుసుందరిన్
బిలిచెను మాధవుం డొకటఁ బ్రేమభరాలసచిత్తవృత్తిఁ డై. 165

క. చనుదెంచు తలిరుటాంగినిఁ
గనుకొనల నరసి సూక్ష్మగతిఁ, దనయాలో
చనము సరియైనదానిగ
మనమున ధ్రువపఱిచి ప్రేమ మల్లడిఁగొనఁగన్.

చ. సముచితగౌరవం బొసఁగి సారసనేత్రను నాత్మపార్శ్వ
మమరఁగ నాసనస్థితగ నాతఁ డొనర్చి, ప్రసంగ మె

క్రమణ మొనర్చుటా యని కరించుఁగరంబునఁ గీలుకొల్పి హా
సము చెలువారఁ బల్కె సరసప్రవిలాసమనోజ్ఞభాషలన్. 167

మ. "మదిరాక్షీ! యెదియోయపూర్వమగుచున్ మాధుర్యమున్ జిందుచు
న్నది నీయాకృతి; బాధ్యతారహితకాంతాలోకసామాన్యస
మ్ముదసంధాయకవృత్తి కాసఁబక్ష, దాముగ్ధత్వమున్ దోఁప, నె
య్యదియో నూతనకార్యధూర్వహత నీయం దారయన్ దోఁచెడిన్.

చ. అరుణగభస్తిబింబ ముదరాంతర మైన రహించు ప్రాచ్యది
గ్వరసముదగ్రతేజమున భాసిలు నిన్ గన మాతృదేవతా
స్థిరగురుగౌరవాన్వితగఁ జిత్తమునన్ దలపోసెదన్ దలో
దరి! శ్రుతిపేయతం గొలిపి తన్వఁగ వేఁడుదు నాదరింపవే. 169

చ. జనకుని సల్పుదే ప్రియుఁ, బసం దగు విందిడు కందు పాప ప్ర
క్కను శయనింప యుష్షనుచుఁ గన్నుల రక్తిమ తోఁప దిండునే
పెనచుక నిద్రపొం దనుచుఁ బేరెమి నాజ్ఞ లొసంగుదే! సుహా
సిని! యభిమానగర్వములఁ జెన్నువహించెను నీదునేత్రముల్!" 170

చ. అనిన, జపారుణప్రభల నానన మొంతయు జాజువార న
వ్వనరుహనేత్ర మాలతి "భవత్ప్రియకాంత యొకప్పుడేని శా
సన మొనరింపఁజాలదు; ప్రచారము సక్కుఁడు; పుత్రరూపముగా
గొని తమ రంత లాలసతఁ గోల్వడి సంయమనంబు నేర్వనా. 171

ఉ. ఇంతకుఁ జెల్లి పాత్రగును; నేను వహింతు నిమిత్తమాత్రమీ
సంతును బెంచుభారమును, సాధ్వి మధుప్రణయార్థదాన మి
క్కాంత కొసంగఁ జేసదె సుఖం బవిభాజ్యము గాఁగఁ, గాన న
య్యంతియె మాతృగౌరవము నెంతయుఁ గాంచ సమర్థ" నావుడున్.

గీ. విచలితుం డయి నిట్టూర్పు విభునికంత
మనునయము దోఁప బాహుద్వయమునఁ జుట్టి

"సాధ్య మగు నెట్లు త్యాగనిస్వార్థమహిత
మధుమధురమూర్తి మఱవ జన్మంబునందు. 173

శా. అభ్యర్థించితి నొక్కవృంతముఁ మే మాహ్లాదమున్ గూర్ప సౌ
రభ్యంబున్ విరఁజిమ్ము జంటవిరులై రాజిల్ల నౌ నంచు; నా
యభ్యస్తాఖిలధర్మమర్మకృప నవ్యాజమ్ముగాఁ జిమ్ముచున్
సభ్యామోదముఁ గూర్పఁబో దని తిరస్కారంబు గావించుచున్. 174

ఉ. సోదరి ! ప్రాణనాథసుఖశోభనకాంక్షిణి నొచు నీకుఁగా
నేఁ దలపోయ భౌతికసుఖేచ్ఛ; క్షమింపుము; మాతృదేవివై
యాదరపాత్ర యౌట యగు నార్యపురంధ్రికిఁ ధర్మ; మీవు నా
కై దయమీఱ సంతుఁ గని యాయుషమంతకొలంత దీఱఁగన్. 175

క. ఒకపాప నిడుము నాయొడి
నకలంకచరిత్రుఁ బ్రియునియనుమతి నని యా
ప్రకటచరిత పలికిన నో
డక నే సమ్మతిని నిచ్చుటంజేసి యుఁకన్. 176

క. రెండవపాపఁడు నాయొడిఁ
బండుకొనెడునంతకున్ సపత్నికి నై యీ
పిండమును బెనుచుబాధ్యత
యుండుఁన్ మీ కెఱుఁగఁబలుకకుంటిని దీనిన్. 177

గీ. నీటిలో నేడ నిడి బేర మేటికే యని
యుక్తఫలకాలమునఁ దెల్ప నూహ సల్పి
మిన్నకుంటి నన్యమ్ముగ నెన్నఁ జనదు
సాధువర్తన యభిమానజనని యగును." 178

ఉ. నావుడు మాధవుండు నయనస్రవబాష్పము లప్పళించుచున్
"బావని ! మానవాంగనలభంగిమఁ గానను; మీర లిర్వురున్

భావన కందఁ; రీవు పతిఁ బాలు నొసంగఁగ మాన్యశీల తా
జీవితసౌఖ్యమే విడిచెఁ జేకుర నిట్టియపూర్వవృత్తముల్. 179

శా. మీయొప్పందము కాను గా దనుట కేమీ పాలుపోకుండెఁ; నేఁ
జేయంగల్గున దెద్దియో యెఱుఁగ రాజీవాక్షి! చిత్రంబుగా
నీయజ్ఞాతతపస్విస్త్రీప్రణయ మి ట్లైకాగ్రతన్ గ్రమ్మి దు
ర్జ్ఞేయం బై కనవచ్చుచుండె నెటు లీచింతాభరం బోర్వ నా. 180

గీ. ఆశయప్రేరితుండ నై యమృతహృదయ!
నీక్రియన్ యత్న మొక్కటి నేను సల్పి
యామెవలనఁ దిరస్కార మైన నొంద
నేరనై తిని కరుణావిదూరుఁడ నయి. 181

గీ. త్యాగధన, విశుద్ధచరిత, ధర్మదీప్తు
లలమ మనలను జన్మజన్మలకుఁ దీర్ప
రాని ఋణభారమున ముంచె; మాననీయ
మూర్తి కొశబిడ్డ నొసఁగు టబ్బురమె కరిత! 182

మ. అవిభాజ్యంబుగ నమ్మధుప్రవిమలం బౌ ప్రేమచిత్తంబు, బాం
ధవమున్ గూర్చెను; తావకాభిమత మేతత్ బంధమున్ భావిసం
భవజన్మంబుల వీడనీయ; దిది దివ్యత్వంబు సాధించి యీ
భువనవ్యోమములందు వ్యాప్తిఁ గను నంభోజాక్షి! నిక్కంబుగన్."

గీ. అనిన సంతోషవార్నిధి నామె మునిఁగి
"ప్రాణనాయక! దాక్షిణ్యపరులు తాము
దక్షిణులు కాము వింత; సోదరియు మీదు
ధర్మరతి నెంత కొనియాడెఁ దలఁప వశమె? 184

గీ. ఏను ద్వికళత్రసూచన మెఱుఁగఁ జేయ
నామె యనినమాటలు చెవులందు నేఁడు

మాఱుమ్రోఁగుచు నున్నవి; మాననీయ !
ఎంతలజ్జించితో దాఁప నేల ? వినుడు. 185

ఉ. "సోదరి ! ధర్మవేది పరిశుద్ధుఁ డుదారమహాశయుండు నా
నీదయితుండు ప్రాకృతులనే యవిమర్శగఁ దానుగూడు-చో
నాదరభావ మేర్పడునె ? యాగుణగౌరవ మింత తగ్గఁగా
రాదు; ప్రలోభపెట్టక, పరస్పరమున్ వలయున్ బురోగతుల్. 186

గీ. ధర్మవిభ్రష్టుఁ డైన నాతనిని నేను
నేఁటివలెఁ బ్రేమ నర్చింప నేర; విజ్ఞ
మతివి నాయందు మమకార మతిశయముగఁ
గలిమి ధర్మనాశము గూర్పఁగడఁగఁ దగునె ?" 187

గీ. అనిన మారాడలే నైతి;-నశ్రు లురలు
నాదుకన్నులఁ దుడిచి కన్యావతంస
మంత నుపచారవాక్యము లాడి తనదు
భావి నీక్రియ నెఱిఁగించెఁ బ్రాణనాథ ! 188

గీ. "నీసపత్నినె; దైహికవాసనలను
విడిచితిని నీకునై ; ప్రాణవిభునియాన
దీనరక్షణకార్యముఁ బూని యతని
కమరకీర్తిని జేకూర్తు నహరహంబు." 189

మ. అను నసామాన్యచరిత్ర మానవియె ? కార్యవ్యగ్ర యై యామె స
ల్పినసంస్థాత్రయవార్త లక్ష్మి వినిచెన్, విశ్వాంతరాళంబులం
దున వ్యాపింపఁగఁ జేయుచుండెఁ బ్రణయోత్ఫుల్లాబ్జసౌరభ్య మా
వినుతత్యాగమహాస్వరూపిణి జగద్విఖ్యాతచారిత్ర యై." 190

గీ. అంచు మాలతి నీరవుఁ డైన ప్రియుని
యోచనాపరతను నశ్రులోచనములఁ

గాంచి సంరంభమునఁ బ్రసంగమును మార్చి
హృదయశాంతి నొకించుక కుదురుకొల్పె. 191

శా. అంబా ! సంభృతభూరిసద్గుణకదంబా ! నీలధమ్మిల్లరో
లంబా ! బింబఫలాధరాధరసమాలంబస్మితా ! పూర్ణరా
డ్బింబాడంబరహీనకృన్ముఖి ! కృధాడింబాదికధ్వంసనీ !
లంబీసంబరమా ! విశిష్టకరుణాలంబా ! సతీచిన్నమా ! 192



శ్రీమ న్మాతాపితృభ్యాం నమః

# మ ధూ ద య ము

## ఏ కా ద శా శ్వా స ము




తమ్మయపురపాలక !
పూతాత్మ ! యశఃప్రపూర్ణభూస్థల ! సుగుణ
వ్రాతపరిశోభితా ! లో
కాతీతచరిత్ర ! చిన్నమాంబానాథా ! 1

వ. అవధరింపుఁడు. 2

క. సువిచార ! దీనరక్షా
సవనవ్రతదీక్షితా ! ప్రశాంతహృదయ ! బాం
ధవనివహాదేవసురభీ !
ప్రవిమలగుణ ! యన్నపూర్ణ ! రాకేందుముఖీ ! 3

గీ. వినవె యవహితమతి భావివిషయ మమృత
భావపూరిత మనురాగపరమగమ్య
మాత్మసంస్పందనాచణ మై తనర్చు;
సూక్ష్మపరిశీలనాదృష్టిఁ జూడఁదగును. 4

గీ. పుష్యమాసము చనియెను; మూఁడునాళ్లు
గడచె మాఘము; చలిపీడ వెడలనోప
కూఁగులాడెడిఁ బ్రకృతి; హిమోద్ధతిఁ దమ
పర్ణముల డుల్చి కనె విన్నఁబాటు తరులు. 5

గీ. అరుణకిరణపురోగాము లగుసహచరు
లనఁగ సపరంజిదీధితు లలమెఁ బొడుపుఁ
గొండచరియల; ముత్యాలు పండెను దృణ
రాశి రాశులుగా నేత్రరమ్య మగుచు. 6

ఉ. స్నానగృహంబునందు నెఱజవ్వని కంచుకవస్త్రభూషణ
శ్రేణి నెడల్చి తొట్టియను శీతలవారిని రొమ్ముబంటిగా
మేను మునుంగఁ గూరి, యనిమేషత గుబ్బలఁ గాంచుచుండె వే
ఱూని చివుర్చి ప్రాఁకు మధురోద్ధతభావసమాశ్రయాత్మ యై. 7

ఉ. పుల్కలు దేహవల్లిక గుబుల్కొనె; నిశ్వసనోష్ణ మంబువున్
గీల్కొనుశైత్య మార్చి వృథఁ గేవలజీవనధారణార్థ మై
నిల్కడఁగొన్న దేహమున నించెను సౌఖ్యము; భావతీవ్రతన్
బల్కెఁ గృశాంగి యాత్మగతభావము రొమ్ముల కేర్పరించుచున్. 8

మ. పురుషస్పర్శ నెఱుంగ కీక్రియను మీహాంకంబు బింకంబుఁ గాఁ
బురుమశ్రీగతి వ్యర్థ మయ్యె; శిశువున్ బోషించి సాఫల్య మే
కరణిన్ బొందుదు? రీవియోగినికి దుఃఖప్రేరకం బయ్యె మీ
హారువున్ శోభయుఁ బ్రాణనాథుమృదుదివ్యస్పర్శ చేకూఱమిన్. 9

ఉ. చేపఁగ నేర్చుచో విభునిజీవనసారము మూర్తిఁగొన్న నా
పాపని నగ్రజాత నెడఁబాపి యొసంగుదుఁ బెంచుకొండు; మీ
కాపని సాధ్యమా? ప్రసవ మౌను సపత్నియు నింతలోనె; నా
కాపసిపాప కూర్చుఁ బతియాదరణంబును మాతృయోగ్యతన్. 10

క. అని పల్కి, భావలతికలు
పెనఁగొన నాలేమ స్నానవిధిఁ దీఱిచి, నె
మ్మనమున మాతృత్వప్రరో
చన లలమన్ లజ్జ నొంది చనె తనగదికిన్. 11

చ. చని యటనున్న ధాత్రిఁ గని "స్నానము జాల మొనర్చియుంటిఁ, బూ
జను ముగియింతు రెండునిముసంబులు తాళుము, గంట ప్రోఁగినం
తనె యుపహార మి" మ్మనిన ధాత్రి విషాదమలీమసాత్మ యై
కనులను నీరు పెట్టుచుఁ బ్రకంపితగాత్రముతోడ ని ట్లనెన్. 12

క. "ఎన్నఁ దెఱుంగుదు వీ వీ
చన్నీటను మునక లిడుట ? శాశ్వతదుఃఖా
చ్ఛన్నమతి వగుచుఁ దప మి
ట్లెన్నా ళ్లొనరింతు వమ్మ ? యెటు లోర్వఁదగున్ ?" 13

గీ. అనిన మధు కంపితస్వర యగుచుఁ గనుల
రక్తిమ చెలంగ "యే మిది ? రమణి కొక్క
పతి యగును; వ్యభిచార మేపగిది సేతు ?
నీతినియమాలు వలదె మానినికి" ననిన. 14

గీ. చేలచెరఁగున గన్నులఁ జేర్చి మెల్లఁ
జనియె ధాత్రి యావలికి; నిశ్వాస మొండు
పుచ్చి మధు మాధవునిచిత్రమునకు నెదుట
మోకరిలి సాశ్రునేత్ర యై మ్రొక్కి లిడియె. 15

ఉ. నాఁడు ప్రసూతిమందిరమునన్ మధు పుచ్చెను చాలకాల, మా
నాఁడె యఖండవేదనల నా ర్తి మునింగి శిశూదయంబునన్
వేడుక నొంది సర్వమును విస్మరణం బొనరించి మాతయై
యాఁడుఁదనంబు తొల్కి మృదుహాసముఁ జిల్కి ప్రసూతసన్నిధిన్.

గీ. కనులు దెఱువని యాపసికందు పురుష
లక్షణోపేతుఁ డగుట నుల్లసము మీఱఁ
గాంచు నాయమ ననురక్తి కనలుకొనఁగఁ
జేతు లెత్తి బాలెంత యాశీర్వదించె. 17

ఉ. ఆసవమాతృమూర్తిముఖమందుఁ సుపుత్రవతీపదంబు స
మ్మానము మీఱఁ బుట్టి శ్రుతిమంజులమై ధ్వనియించినంతనే
మేను సుధావలిప్తమయి మేల్కొనఁజేసెను సుప్తకాంక్షల
మ్మానవతీమణీహృదిని మల్లడి నొందఁగ మాతృచిహ్నముల్. 18

చ. పరవశచిత్తయై హృదయభారము కొంతొకసేపు వీడ నా
గరిత సుఖించె భావగతకల్పితసౌఖ్యమనోజ్ఞడోలికన్
మురిపెము గూర్చుబిడ్డ యొడి ముద్దులు గుల్కుచు స్తన్యపాన మ
బ్బురముగ సల్ప నుల్లసిలుపోలిక నుల్లము పల్లవింపఁగన్. 19

ఆ. వె. ఒడలు దెలిసి కొంతవడికి నిట్టూరుపుఁ
బుచ్చి మధుకుమారి పోయి వ్రేగు
మనముతో ననాథమందిరప్రాంగణ
సీమఁ జేరెను బరిశీలనాస్థ. 20

ఉ. ప్రోషితభర్తృకల్ గతినిఁ బొల్పెడలన్ నవభూజరాజి ని
శ్శేషము గాఁగఁ బర్ణములచెన్ను దొఱంగి కృశాంగు లౌచు నే
భూషలు లేక మ్రోడ్వడుట ముగ్ధమనం బెరియింపఁ బ్రాణసం
శోషణ మొంది యమ్మగువ చూడ్కులు బర్వఁగఁజేసె నంతటన్. 21

ఉ. ఈక్షణపంక్తు లంత ముదురెక్కినయెండను దళ్కు లీనుచున్
ప్రేక్షకదర్శనీయ మగు విగ్రహరూపసమున్నతాకృతిన్
ఆక్షణమందు లోఁగొనఁ బ్రహాసవికాసము మోముఁ దోఁప లో
లేక్షణ మాళి వాల్చె మది నీరిక లెత్త నవీనభావముల్. 22

గీ. విగ్రహోభయపార్శ్వముల్ విరులఁ జిమ్మి
నీడల వెలార్చ నేపుగా జోడు పొగడ
మ్రాఁకు లభివృద్ధి నొందుట మధుకుమారి
హృదినిఁ దీయనిభావముల్ బ్రిదులఁజేయు. 23

చ, పకుళయుగంబ! ధన్యము భవత్ప్రవిశుద్ధము లైనజన్మముల్
ప్రకటచరిత్రుసేవలను బాయక సల్పఁగ నోచుకొంటి; రీ
వికలమనస్క ప్రౌఢగతి వేదుర నొందఁగ నయ్యెఁ; బ్రాణనా
యకునకుఁ జెంత విగ్రహము నై చెలువారెడిభాగ్య మబ్బునే? 24

చ. పలపలిప్రమాఁకె సీడ లిడి వల్లభుసేవల సల్పఁ గల్గె; దా
పలివిటపంబు వేవెలుఁగు వాలఁగ నర్చ లొనర్ప నేర్చుఁ బ
త్నుల మగు మేము నీక్రియను తోషము గూర్తుమె? రిత్తయాస; నా
కలవడు నెట్లు త్యక్తసుఖ? మఱ్ఱులుఁ సాఁచుట వెఱ్ఱి కాదొకో! 25

మ. అని నిట్టూరిచి మందిరాంగణమనోజ్ఞారామమున్ దాఁటి చే
రె ననాథాశ్రమ మంత నామె; యట నారీరత్నమున్ మాతృభా
వన నీక్షించుచు హాసమున్ గురియు పాపల్ పెక్కు రొక్కుమ్మడిన్
గనులం దన్పుచు జోత లీయఁగ నమస్కారంబుఁ గావించుచున్. 26

క. నిలయాధికారిణి వినయ
మొలయఁగ వెన్నంటి నడువ నుత్సుక యై యా
లలనారత్నము బిడ్డల
నలరించుచుఁ బ్రియసమంచితాలాపములన్. 27

ఆ. వె. వేఱు వేఱ వారి వేషభాషారోగ్య
మానసికవికాస మానయజ్ఞ
సూక్ష్మదృష్టి నరసి సూచన లొసఁగెను
తదధికారిణికి నుదారఫణితి. 28

శా. ఆనందంబున బాలబాలికలతో నయ్యార్తమందార మ
త్యానూనప్రియమూర్తి యై కలిసి సౌఖ్యాయత్తచిత్తంబునన్
దా నాబిడ్డలమాతృమూర్తి నని, సంతానంబు చేకూఱఁగాఁ
దా నానాఁడు మదిం గలంగు టది వ్యర్థం బంచు తృప్తిం గనెన్. 29

క. ఆదట మధు విద్యాలయ
మాదరమతిఁ జొచ్చి జ్ఞాన మార్జించెడి యా
పేదముగుదనిసుఁగుల య
భ్యుదయము బరికించి తృప్తి నొందె నెడందన్. 30

ఉ. భోజనమున్ బొనర్చి దినపూర్వస్మృతుల్ మననంబు సల్పి యు
త్తేజితచిత్త నైన మధు విధిప్రవిలాసము నెంచుచుండ నా
రాజముఖిసమక్షమునఁ బ్రాంజలి యాచుఁ దపాలు చేటి తా
నోజ నిడెన్; మహోత్సవము నొందెఁ గనన్ శుభలేఖ వానిలోన్. 31

మ. ప్రియుదస్తూరిని గాంచి యాచెలియ యుద్వేత్తైనవక్షంబుతో
నయనద్వంద్వము నద్ది దాని నెద నానందాతిరేకంబునన్
బ్రియమారన్ గదియించి, నిట్టురిచి, తబ్బిబ్బైనచిత్తంబుతో
నయనంబుల్ ద్రవియింప విచ్చి కనె నంతన్ లేఖ సోత్కంఠ యై. 32

క. కని యానందంబునఁ దల
మునకలుగా నామె యొక్కపొల్లు విడక లే
ఖను బలుసారులు చదువుచు
ననురాగతరంగితాత్మ యగుచు నవశ యై. 33

గీ. సుఖముగాఁ బ్రసవించె నాసోదరి; పర
మేశ్వరా ! ధన్యవాదము లిడెదఁ గొనుము;
ఔరసుఁడు నాదుపోల్కియా యబ్బురంబె ?
యైదునా ల్లీడు వచ్చెనే యాత్మజునకు. 34

గీ. నాథ ! యీదాసి మఱవ రెన్నటికి; భాగ్య
శాలి నై తిని; నా కీడ సమ్మతించి
నావె ప్రణయఫలమ్ము ! నే నాపసిండి
పాప జననినె ? బహుకృపాపరులు తాము. 35

గీ. శిశువు నాశీర్వదింప విచ్చేయవలెనె ?
ఆజ్ఞ సేయక దాసి నభ్యర్థనంబు
సల్పు టర్హమె ? ప్రాణము నిల్పు టెట్లు
ప్రియతనూజునిఁ జూడ కీవెడఁగు నాథ ! 36

సీ. పసిపాపనిబెడంగు పాలబుగ్గలచెల్వ
మనుర క్తిఁ జెంప ముద్దాడవలయుఁ
గ్రొంజివురులసారు గోల్పుచ్చుపాపాయి
బుల్లిచేతులు ప్రేమఁ బుణుకవలయు
బొడ్డూడనికుమారు బొజ్జనిగారమ్ము
మన మ్మలరి యెత్తి మూర్కొనఁగవలయుఁ
గోటాకులపసందు గోటఁ బుచ్చెడి కన్న
తండ్రిపాదము లెదఁ దార్పవలయు
గీ. బోసినోర్విప్పు లొత్తులు బుగ్గలందు
నలరు నాపున్నెములపంట నాదరమునఁ
జెక్కిటను జేర్చి వాత్సల్యశీకరములఁ
జిందవలయును జననీత్వ మందవలయు. 37

ఆ. వె. సాంఘికావరోధసంచయం బెడలింప
సాధనంబు ప్రాణనాథుపాద
ధూళి నమరఁజేయు తోరంపుమార్గ మీ
పాపఁ డగును; వంతఁ బాపఁ డగును. 38

సీ. పసుపునీరెండల హసియించు బాలెంత
నగ్రజా నెద హత్తి హాయిఁ గనఁగఁ
గజ్జలస్ఫూర్తియు గరువంబు వెలయించు
సోదరీనేత్రముల్ జూచి తనియ

చేపువచ్చెడి కుచశ్రీయును నడికట్టు
చెన్నారు పురఁటాలిచెల్వ మరయ
శిశువు పార్శ్వమ్మునఁ జెల్వొంద స్తన్యము
గుడుపు నామసపత్ని గోము జూపఁ

గీ. బురిఁటివాసన ధూపపుపొగలు వెలయు
తీపు లెలయించుతలఁపుల దీటుకొల్పు
పురిఁటిగదియందు నామెతో ముచ్చటాడ
జొక్కలైనను రా వయ్యెఁ జిక్కితి నిట. 39

మ. ప్రియుఁ డెన్నండును నిచ్చకంబు లనఁ డవ్విజ్ఞుండు వ్రాసెన్ దయా
మయుఁ డై యచ్చము నీకుపోల్కి యని; యెమ్మోడ్కి న్దటస్థించెఁ? దా
నయరో ! సంగమకాలమందుఁ దలపోయన్ బోలు నిర్భాగ్య నీ
ప్రియకాంతన్; వ్యభిచారదోషమును నావేశించె నీకూళచేన్. 40

ఉ. అంచుఁ దలంచి నాథుహృదయంబున స్థానముకల్మి మోదముం
సంచలితాత్ముఁ డయ్యె నని శంక జనించుటఁజేసి ఖేదమున్
బెంచఁగఁ బాలసాఫలముఁ బేర్మి భుజించెడిలీల నయ్యె; యో
చించుచు మానినీమణి యొకించుకసే పతినిశ్చలాకృతిన్ న్. 41

మ. అవిచారంబుగ నిశ్చయింపఁ దగదం చాలోచనల్ మాని యా
ధవళాంభోరుహపత్రనేత్ర కనె నుద్యత్కాంక్ష లేఖావళిన్
నవలారత్నము మాలతీరమణి సౌందర్యంపుముక్తాఫల
స్తవవర్ణంబులు గుల్కులేఖ బహుళోత్సాహంబు సంధిల్లఁగన్. 42

మ. కని యత్యంతసమాదరం బలమ లేఖన్ విచ్చి మానంబుగాఁ
గనె నాద్యంతము; లంత నుస్సు రని శోకవ్యాకులస్వాంత యై
తను దా విస్మరణం బొనర్చి యనె బాధాసూచకం బైన ని
స్వనమే నల్గడలన్ బ్రతిధ్వనులు గూర్పన్ దన్వి తా నీక్రియన్. 43

ఆ. వె. తగదు తగదు వ్యర్థ మగు మధునామంబు
అరుల కైన మృగ్య మగును సుఖము;
నాతపఃఫల మ్మనంతశుభాస్పదుఁ
డై సుఖింపవలయు నహరహంబు. 44

గీ. కనులు దెఱువని నాచిన్నికన్నతండ్రి
కిడఁగరాదు నానామ మెన్నఁడును; దీనిఁ
దాల్చువా రెల్లరును వ్యథల్ తలమునకలు
గాఁగఁ గొంతురు; మాన్పింపఁగవలెఁగు దేను. 45

చ. చనియెను నల్పజీవితము సౌఖ్యము లేశము గాఁగ మాన్య నా
జనని, తదీయనామము నొసంగుట ఘోరవిషాదకీలలన్
దనువు దహింపఁగాఁబడుచుఁ దాపము నొందుచు నుంటి, నింక నా
తనయునినామధేయము నితాంతసుఖప్రద మాట కర్హ మే ! 46

గీ. మధుతనూజుఁడు గావున మధుకుమారుఁ
డనుట యోగ్య మా; నచ్చ మీయాకృతియును
నిన్నె పోలుట నీపేరె నిశ్చయించి
నార మనెఁ; గాని యెన్నఁ డీపేరు తగదు. 47

వ. అని లేఖను మధు మరలఁ బరికించి హృదయ మనురాగరసార్ద్రము గాఁగఁ బులకించి వికసితానన యై మాలతి నుద్దేశించి యాత్మగతంబున. 48

ఉ. ఏయనుబంధమో యెఱుఁగ నెల్లసమాజకృతావరోధముల్
బోయఁగ, దేశకాలము లబాధ్యము లై చెలువార, నన్ను ని
ట్లీయనురాగతోయధిని నీఁదఁగఁ జేయుచునుంటె; వేమిటన్
బాయును నీఋణంబు ? కులపావని ! సోదరి ! మాలతీసతీ ! 49

ఉ. పాపనిముద్దుమోముసఁ బ్రభాసితనేత్రమరీచులందు శో
భాపరిపూర్ణగండములఁ బల్లవహస్తములన్ మదీయ మా

పాపపురూపమే కనుచుఁ బల్లవితాత్మవుగా సుఖింతువే
నీపరిశుద్ధచిత్తమును నిర్మలవృత్త మగణ్య మా సతీ ! 50

ఉ. చిత్తములందు సూక్ష్మముగఁ జెన్నువహించెడి నన్ను నిత్య మా
పుత్తడిపాప కట్టెదుట మూర్తిగ నిల్పెనె ? ధన్యురాల; నా
యుత్తమశీలుఁ డాపతియు నోడక యాక్రియఁ బల్కియుండెనా ?
యత్తఱి నేను విన్నయెడ నాకసమందునఁ దేలియుండనే. 51

శా. నాబంగారపుచిట్టికూన రజనీనాథాకృతిం దోఁచి గా .
రాబంబున్ బ్రసరింపఁజేసెఁ గడు నాప్రాణేశుచిత్తంబునన్;
నాబుజ్జాయి వెలుంగఁజేయు నిఁక నానందద్యుతుల్ గ్రమ్ముచున్
దోబూచుల్ దొలగించు నమ్మ మదిలో దుఃఖంబుఁ బోకార్చుచున్.

క. ననుఁ గని పెద్దఁగఁ జేసిన
జననీజనకులఋణంబు సంతతిఁ గని యీ
యనువున దీర్పన్ గలిగితిఁ;
దనయుఁడె సంధాత ప్రాణధవునకు నాకున్. 53

శా. దౌహిత్రుండు మనఃప్రసూతుఁడు ప్రియాత్మశ్రీసమేతుండు, మి
మ్మాహూతుల్గ నొనర్చి, పిండవిధు లత్యానందుఁ డై తీర్చి, యు
త్సాహంబున్ సమకూర్చుఁ బెద్ద యయి; సద్యఃప్రాపితారోగ్యమున్
దేహాహీనసమృద్ధిఁ గూర్పఁ బితరుల్ దీవింపరే సత్కృపన్. 54

గీ. అంచు వాత్సల్యమున ముక్కలాడుచు మధు
భావవీచీవిహారతత్పరతఁ బెద్ద
ప్రొద్దు సుఖయించి కర్తవ్యమును దలంచి
తంతిమూలమునన్ బంచెఁ దనమురాక. 55

మ. అపరాహ్ణంబున గౌరవోచితసమాహ్లాదప్రజాలంక్రియల్
నిపుణాత్మన్ గయిసేసికొంచు మదిలో నిర్వేల మా మోదమున్

విపరీతం బగుకాంక్ష నొందు మధుఁ దా వీక్షించి సోత్కంఠ ధా
త్రి పరామర్శకదృష్టులం దరిసె మైత్రీదోహలస్వాంత యై. 56

శా. ఆమెన్ గన్గొని సమ్ముదం బొలయ "నీ కాశ్చర్యమున్ గూర్చు నా
మో మీనాఁడు వికాస మొందుటకు, నా; ముమ్మాటికిన్ నేఁడె నా
నోముల్ పండెను; పర్వవాసరముగా నూత్నోత్సవం బబ్బుటన్
ఈమాడ్కిన్ గయిసేసికొంటిఁ గను మీవే దీని" నం చామెకున్. 57

మ. శుభలేఖన్ మధు సంభ్రమంబునను దా శోభిల్ల విన్పించి, "నా
విభవం బెన్న వశంబె ? మాత నయితిన్; విఖ్యాతి చేకూఱె; నా
విభుఁ డీసూనుని నా కిడెన్; మనుమనిన్ బెంపంగ లాలింప నీ
యభిలాషన్ నెఱవేర్తుఁ దాఖు" మనినన్ హాసప్రశోభాంగి యై. 58

గీ. "నల్లనివి నీళ్లు తెల్లని వెల్లఁ బాలు
గాఁగఁ దలపోయు నాచిట్టికన్నతల్లి
కీవిషమశోధనం బేల యెఱుఁగ దేవ !"
యంచుఁ జేతుల ముకుళించె నంత ధాత్రి. 59

ఉ. ఆమెను గాంచి "నేను విజయాన్విత నైతిని; చింతఁ దక్కు-మా,
ప్రేమఫలంబు నాయెడినిఁ బెంపుఁ గనన్ విరితోడఁ దావి నా
స్వామియు నాకుఁ జేపకు; సపర్యలఁ దన్పుదు; చారితార్థ్యమున్
నామగనాలిహొందును ననారతమున్ జెలువారు నెంతయున్. 60

గీ. రేపు బిడ్డల కెల్లను బ్రీతి గదురఁ
బంచిపెట్టవలె మిఠాయి; నంచిత మగు
శిశుజనోచితక్రీడావిశేషవస్తు
సంచయంబును విలువఁగఁ జనుదు నిపుడు. 61

గీ. విపణికిం జని నాబిడ్డ కుపకరించు
వస్తువుల్ ప్రియుచిరునామ వ్రాసి యొసఁగి

పనుప నాజ్ఞ నొసంగుదు ధనము నిచ్చి;
నేనుగాఁ దొలి బిడ్డ కవ్వాని నిడను. 62

గీ. ఎల్లసేవకులకును నైదేసిమూళ
లుచితముగ నీయఁ బంతు; వీఁడొనరఁజేయఁ
గా ననాథాలయంబున కాన నిడుదు;
నింట సల్పుదు వేమొ! నీయిష్ట" మనుచు. 63

ఉ. అంగడి కేఁగు నాసుదతి నారసి ధాత్రి కనుల్ సెమర్ప ని
య్యంగజశాతచూతకుసుమాంబక మత్యనురాగనైపుణిన్
మంగళమూర్తి యైన నిజమాతకుఁ బాఠము నేర్పఁ బూనె; సా
రంగవిలోలనేత్రకుఁ బరాత్పరుఁ డెన్నఁడు శాంతిఁ గూర్చునో! 64

ఆ. వె. నిర్మలానురాగనీరధి నాతల్లి
అపజయంబుఁ గాంచు టర్హ మగునె?
ధర్మరక్షకుండు దైవంబె యైనచో
నిట్టియొడుదొడుకుల నేల కూర్చె? 65

మ. అవనివ్యోమము లెల్ల వ్యాప్తిఁ గని తా నాచంద్రతారార్క మై
స్తవనీయం బగు నీమెప్రేమ పరమేశా! త్యాగసౌశీల్యముల్
అవిరామం బగు సాధనంబు, తప మెయ్యబ్జాస్యకున్ సాధ్యమా?
భువి నెవ్వారికి నిగ్రహం బలము నీపొంగారుప్రాయంబునన్. 66

గీ. ఎంతసువిశాలచిత్త మీయింతి కబ్బె
జీవితోన్మూలనకుఠార మై వెలసెడి
తనదుప్రత్యర్థిబిడ్డ నాత్మప్రసూతు
గాఁగ నుపలాంచు నౌదార్యగరిమఁ గనము. 67

గీ. దైవసంకల్ప మెఱుఁగ సాధ్యంబె? కాల
గర్భమున నేమివింతలు గలుగ నుండె

నో! కుమారి సుఖించుటకై కృపాళుఁ
డేర్పఱచుఁగాక మార్గ మం చెంచె మదిని. 68

చ. అది యొకప్రేమయోగినిసమాకృతి, శుష్కకపోలపాళిపైఁ
జెదరుగ నూత్నసోయగముఁ జిమ్మెడిచిన్నెలు కానవయ్యె, నె
మ్మదిఁ దళుకొత్తుఁ గ్రొమ్మెఱుఁగు మంజులభావమరీచు లత్తులన్
బొదలి యనూనదీప్తులచు బొల్పెసలార వినిశ్చలస్థితిన్. 69

మ. సమశీతోష్ణపురైలుపెట్టియను నిశ్వాసోష్ణ మొక్కింత వే
డిమిపాలున్ బెనుపంగ, వేగమునకున్ ఛందంబుతో బండి పో
లమి యొక్కించుక మోముపై విసుఁగు లీలాలాస్యమున్ సల్ప నా
యమ సౌఖ్యస్థితి నుండె గౌరవజనాహ్వాలంక్రియావేశ యై. 70

గీ. పంచవింశతివత్సరప్రాయ యైన
యామె వాల్తేరులో బండి యాఁగినంతఁ
జదువుచుండిన గ్రంథ మచ్చటనె విడిచి
ద్వారపార్శ్వ మల్పాహారవాంఛఁ జేరి. 71

గీ. నిలిచి 'సెర్వరు' నొక్కనిఁ బిలుచునంత
గౌరవాంగుఁ డొక్కండు క్రొక్కారుమెఱుఁగుఁ
బోలుజవరాలు వెన్నంట, నాలతాంగి
పరిసి, కేల్మోడ్చి, నిల్చె చెంతను వినీతి. 72

గీ. ఆమె ప్రతివందన మొనర్చి; యవతరించి
బండి; 'కుశలమా ?' యంచు జవ్వనిని సాభి
లాషఁ బరికింప; నాతఁ డుల్లసము మీఱ
'నీమెయే రాధ; మీరు వీక్షింపరు మును.' 73

గీ. అంచు రాధను గాంచి 'ఏ రమ్యతమూర్తి
యైన మధుకుమారిక' యన నలరుఁబోఁడి

వందన మొనర్చ, నమ్మధు ప్రముద మలర
రాధ నెద హ త్తి నెఱపె గౌరవము నంత. 74

గీ. మూపురకును నల్పాహారమునకు నాజ్ఞ
నిడి, సమాదర మై వారినిర్వురఁ దన
పెట్టెయందుఁ గూర్చొనఁజేసి; ప్రియముమీఱఁ
బల్కె మధు వారితోడ నీపగిది నంత. 75

ఉ. "సంతస మయ్యె, మిమ్ముఁ గనఁజాలితి; నెందుల కేఁగువార ? లీ
యింతి త్రిలోకసుందరి; యొకింతయు నా కెఱిఁగింపలేదు మీ
కాంతమనోజ్ఞరూప; మిదిగా మగవారికి నైజ; మెన్నఁడున్
స్వాంతమునందు మెచ్చరు స్వభార్యలరూపము లోభచిత్తు లై." 76

గీ. అనిన సంస్మిత మొలయ ని ట్లనియెను మధుఁ
గాంచి యానందుఁ "డమరలోకప్రసిద్ధ
దివ్యసౌందర్యమూర్తికి దేవి యెవఁడు
మానవాంగన వర్ణింప మనసుపడును ? 77

గీ. అన్యగుణముల మెచ్చుట యార్యనైజ
మగుట మీయాదరం బీమె యందఁగలిగె;
నే మిపుడు పుష్పపురమున కేఁగుచుంటి
మచట మాయన్నకొమరుని నరయఁ గోరి." 78

చ. అనినఁ బ్రహాస మొల్కఁ దరళాయతనేత్రను రాధఁ గాంచి యొ
య్యనఁ బరిహాసభాసురసమంచితభాషణ యాచు నాతనిన్
గని "తమ రేమి తక్కువయ ? కల్గును నాకుఁ బ్రయాణభాగ్య మో
ర్చిన నొకమూఁడుమాసములు; చేపడె సూడిద లిచ్చు టెక్రియన్. 79

చ. అనుజ తనూజుఁ గాంచుఁ, దమ కాదరు తండ్రి; లభించు నాకు విం
దును బహుమానమున్; భయముతో నెఱిఁగింపక మానుకొందురో !

మనమున సుంతయైన నభిమానము జూపుదురో! యెఱుంగఁ, దె
ల్పిన బరు వేమి వైతు నని పెండ్లికిఁ జెప్పిరె యొక్కరేనియున్." 80

గీ. అంచు గారాము చనవు నెయ్యమును దీయఁ
దనము వెలయించు మధుఁ గాంచి తలఁచె రాధ
హృదయసుక్షేత్రమున స్నేహవృష్టిఁ గురిసి
సరసభావాంకురమ్ము లీచాన నాటె. 81

క. పరిచయ మొకపరి యేర్పడ
నరవిందేక్షణను జీవితాంతము మఱవన్
నరులకు శక్యం బగునే?
పరికింపఁగ నేఁడు నాకుఁ బర్వదినం బౌ. 82

ఉ. ఆదటఁ బ్రాణనాథుఁ గని "యయ్యది దొంగతనంపుఁబెండ్లియే
కా దన సాకు లెంచకుఁడు; గ్రన్నన 'టిక్కెటు' లిందె మార్పఁగాఁ
బోఁ దగు; లేనిచోఁ బయనమున్ గణియింతురు చౌర్యవృత్తిగా;
లేదు విశేషమా వ్యవధి; లేవఁదగున్ వైళంబ" నావుడున్. 83

శా. ఆనందుం "డరుదెంతు నుండుఁ" డని స్నేహార్ద్రింబు లౌచూడ్కులన్
బోనాజ్ఞన్ గొని యేఁగె; రాధ యపు డప్పూఁబోఁడిహస్తంబుఁ దా
నానందంబునఁ బట్టి ముద్దుఁగొని "యక్కా! నేఁడు ధన్యాత్మ నై
నీనిర్వ్యాజకృపాకటాక్షములలో నే నీక్రియన్ దోఁగితిన్. 84

శా. నీప్రస్తావన రోజు కొక్కపరియేనిన్ వచ్చు; నూహింతు నే
నీప్రాంచన్మహితస్వరూపము మనోన్మేషంబునన్, నేఁడు భా
వప్రాప్తాకృతి కాంచె మూర్తి; నిది సంభావ్యమ్ముగా నెంచ; స్వ
ప్నప్రాయం బగు నాదుకాంక్షలు పురాభాగ్యంబునన్ జేకురెన్. 85

గీ. పక్షి వైనను బోవఁ బాల్పడనియంత
దూరమననుండి నాయూరుపేరు నెఱుఁగ

వై న నాహృది నీచెంత నహరహమ్ము
నిల్పుకొంటి నే మనఁ జను నిన్ను సాధ్వి! 86

మ. ప్రణయోన్మాదినిఁ గాఁగ నన్ను, ఘనసేవాప్రీతగా లక్ష్మినిన్
బ్రణుతత్యాగమహాస్వరూపిణిగ శుంభచ్ఛీల మాలాసతీ
మణి, నిన్నిత్రితయస్వరూపిణిగ సంభావించుచున్ బల్కి తా
గణుతించున్ సురనారిగా మఱది; యక్కా! చిక్కితే నేఁటికిన్. "87

వ. అనుచు నానందబాష్పములు జలజల రాల్చు నమ్మదవతి ననురక్తి గదుర నెదఁ గదియించి పరవశ యై మధు కొంతవడికి మేను దెలిసి వివిధకుశలప్రసంగముల నెఱపి యాత్మీయత వెలార్చె; నంతఁ బరిచారకుఁ డుపాహారంబులను దేనీరమును దెచ్చి యట నుంచి చనుఁడు నానందాగమనంబునకై నిరీక్షించి యతం డరుదేర నిష్టగోష్ఠి సల్పా నిని స్వీకరించి సుఖప్రయాణ మొనరించి గమ్యస్థానంబుఁ జేర నట మాధవుండు సోదరీసహితుఁ డై వారలకు స్వాగతమ్ము నెఱపి వృష భశకటంబున స్వగృహంబునకుఁ దోడ్కొని చనె. 88

ఉ. నాఁడు నృసింహుమందిరమునన్ జెలువారెను వింతశోభయున్
వేడుక; చుట్టపక్కముల విందులు సందడి మేరమీఱె; మా
టాడఁగఁ దీర దయ్యె మరియాదల సల్పుటతో సుభద్రకున్
దోడుగ నాఁడుబిడ్డయును దోయరుహానన సీత యుండఁగన్. 89

చ. మనుమనిశై శవక్రియల మానిని రోహిణి సల్ప; నన్నిఁటన్
అనుజ సహాయ యై వెలయ నర్వవిధంబునఁ బ్రత్తిరాట్నమో
యనఁగ సుభద్ర శ్రాంతిఁ గన కాగతు లౌ మధురాధికాదులన్
దనియఁగఁ జేసె భోజనసుధామధురోక్తుల నాదరంబునన్. 90

గీ. పురిఁటిగది వీడకే మధు ప్రొద్దుపుచ్చు
ఛాలునాకార రేఖలు ప్రమద మిడఁగ

మాలతీముఖశోభితమాతృలక్ష
ణానుశీలనోత్కంఠ నయ్యమృతహృదయ. 91

క. గ్రహపతి వలఁగొను వివిధ
గ్రహములునా, మాల లక్ష్మి రాధాపతియున్
మహితోత్సవ మొలయఁగ నా
గృహమున్ సతతంబు విడక కేళిం దేలన్. 92

ఉ. మంచముచెంతఁ గూర్చొని యమాయకుఁ డా పసిబాలుఁ డేడ్వ లా
లించుచుఁ జన్ను గుడ్వ తరళేక్షణ బంగరుగిండ్లపై ని బో
ర్లించిన నీలపుందళుకు లీనెడిమూఁకుడులో యనంగ రా
ణించుకుచాగ్రముల్ మధు సమీక్షణ సల్పుచుఁ జొక్కు విస్మృతిన్. 93

చ. బుడుతనియంగకమ్ములను మోదమునన్ స్పృశియించుఁ; బ్రేమ మ
ల్లడిఁ గొన నెత్తి యొత్తు నెద; లాలస యై రచియించు ముద్దు లే
ర్పడఁ జిఱుపాలబుగ్గల; శుభప్రతిపాదక మైనదీవెనల్
కడు ననురక్తి నిచ్చు హితకాంక్షిణి యై మధు మంజులాకృతిన్. 94

గీ. తనకు శయనింప నందె యత్తలిరుటాంగి
వసతిఁ జేకూర్చుకొనియె; నవ్వామనేత్ర
మాలతికి నెడబిడ్డ యై మరులుగొలిపె;
వర్ణనాసాధ్య మా ప్రేమవైభవంబు. 95

ఉ. ఆకుసుమాంగు లిర్వురు నహర్నిశలున్ హృదయంబు దేహమున్
ఏకము గాఁగఁ బుచ్చు టిది యేదియొ పూర్వఋణానుబంధ మా
వాకొనలే మటంచుఁ దమభావములన్ దలపోసి యెల్ల రా
ప్రాకటశీల యా మధును బ్రస్తుతి సల్పఁదొడంగి రెంతయున్. 96

గీ. ఏకశయ్యనుధు మ నిద్రపోక దొరల
నామెచెంతను మాలతి యాదరమునఁ

గొంతసే పుండి సుఖనిద్రఁ గూర, సుతుని
చెంత శయనించు నిర్భరస్నేహ యగుచు. 97

ఉ. నాలవనాఁటిరేయి మధు నందనునామముఁగూర్చి సంశయాం
దోళనముల్ వెలార్చి వ్యథ తొల్కఁగ మాలతితోడఁ బల్కె నీ
లీలఁ "గుమారునామమున లేశము దోషము సంఘటిల్లె; మీ
రేల యభాగ్యనామ మిడ నెంచిరి ? మార్చిన యోగ్య మౌఁగదే !"

గీ. అనిన మాలతి "చెల్లీ ! వ్యథాకుల వయి
పల్కఁ జెల్లునె ? నీకన్న భాగ్యశాలు
లెవ్వ రీమర్త్యలోకమం దెఱుఁగరారు;
రమణి ! శాశ్వతైశ్వర్యసామ్రాజ్ఞి వీవ. 99

క. నీవలెనే నీసుతుఁ డు
ర్వీవలయమునందుఁ గీర్తి వెలయించినచోఁ
బావన మగు జన్మం, బిం
కేవిభవము వలయు నేర్పరింపవె సాధ్వీ ! 100

గీ. జననినామము నీ వొంది సాధ్వి వైతి
వతఁడు దనమాతృసంజ్ఞఁ జెన్నారియె భువి
వెలయఁజేయును సత్కీర్తి; వెసఁగుఁదలఁపు
కాదు; ప్రాణేశ్వరుని మనఃకాంక్ష యిదియె." 101

వ. అనిన, మధు ప్రాణేశ్వరుప్రసంగమ్మునఁ దనయభ్యర్థనంబును విర
మించి సోత్కంఠ యై మందస్వరమ్మున మాలతి కిట్లనియె. 102

శా. "అక్కా ! నా దోకసంశయంబు విను; మే నద్దానితో యోచనల్
గ్రుక్కం ద్రిప్పుకొనంగలే నయితి; నాకున్ శాంతి చేకూర్పఁగాఁ
జక్కం జేయవె చిత్త మింత; సుతుఁ డీచండాలినీమూర్తి యై
ప్రుక్కంజేయుట కేమిహేతువు ? గుణస్తోమంబు వాసించునే ? 103

వ. అనిన, మాలతి యోచనాధీన యై మందహాస మొనర్చుచు. 104

శా. "చెల్లీ! యెంతటిజాణ వైతివె? గుణశ్రీఁ గూర్చి యోచింపఁగా
నొల్లన్; వారివిశుద్ధచిత్తమును నీ వూహింపరా దట్లు; నా
యుల్లంబందున నిత్య మీ వొసర వేడ్కొం డెట్లు కానేర్చునే?
తల్లిం బోలును బిడ్డ యన్ననుడి మిథ్యావాక్య మా నేర్చియున్. 105

చ. పతిగుణగౌరవంబు నిలుపన్ దృఢియించితి వై హితేచ్ఛ; ను
న్నతి సెడ నేమొ! యంచు నిజనందనుఁ గాంచి భ్రమింప నెంచితే;
స్తుతమతి వైన యాతనిది దోసము గా దొకయింత నీపయిన్
మతి నెలకొన్న; హేతు వతిమానుష మా భవదీయశీల మా." 106

గీ. అనిన మందస్మితంబున నామె యెదను
నదిమి పులకించి "సువిశాల మయ్యె నీదు
పసియెడఁద పాపతల్లి వై మిసిమిఁ గాంచ;
నెటుల నేకాకి నై ప్రొద్దు లెడపఁగలను. 107

మ. అవిలంఘ్యం బగు ప్రేమపాశ మెదియో యత్యంతమున్ గట్టి నీ
నవనీతప్రతిమానచిత్తమున నానందంబునన్ బిడ్డ నై
మివులన్ హాయిగ నుంటి; రేపు చన నేమీ పాలు పోకుండు, నీ
యవిరామవ్యథ నోర్వఁగల్గుట యసాధ్యం బౌను నా కక్కటా! 108

శా. కర్తవ్యోన్ముఖబుద్ధి యెందులకొ స్రుక్కన్ జొచ్చె, నిన్నీడు లే
యార్తిన్ గూర్చుచునుండె, నిట్టిస్థితి భావ్యాదర్శసంకల్పసం
పూర్తుల్ మృగ్యములౌచుఁ దోఁచెడిని; యీమోహంబు దౌర్బల్యమున్
మూర్తిన్ గాంచుట కేమిహేతు వెఱుఁగన్, మున్ముందు నేమౌదునో!

చ. తగుదునటంచుఁ బూనితి నుదాత్తములై చెలువారు సంస్థ; లె
ట్లగు నవి నిర్వహించుట సమాహితబుద్ధియు నాత్మశాంతియున్
అగణితకార్యదీక్ష యిడ? సర్వవిధంబున నూతనోత్సవం
బెగయఁగ ధైర్యసాహసము లిమ్మని ప్రాంజలి మోడ్తు సోదరీ!"

గీ. అని ద్రవించెడి మధుశీర మాదరమున
నిమిరి మాలతి, "సోదరీ ! నిర్మలాత్మ
వైన నీకు ధర్మచ్యుతి యులవడ; దెద
నూఱటం గను దైవమే యున్న దింక. 111

సీ. రే పీవు పోరాదు, పాపని నుయ్యేల
వైచునంతకు నుండవలయుఁ గాన;
జనయిత్రి లేనియుత్సవ మెట్లు సాధ్య ? మ
వశ్యకార్యము లున్న వైళ మీవు
లేఖల రేపె యుల్లేఖించి వలయునే
ర్పాట్లను గావింపవలయు నమ్మ !
పోయి వచ్చెద ననఁ బోలదు, నీవలె
నారాటమును బొందు దని యెఱుఁగుము;

గీ. పతియు నీవేఁగఁ గడు ఖేదపడును; వారి
కుల్లసము గూర్పనైన నీ వుండవలయు;
వ్యగ్రచిత్తవు గా నేల యాత్మగృహము
నందు ? నీనందనుని విడ నగునె ? చెల్లి ! 112

క. అనురాగపరిప్లావిత
మొనరిచెఁ జిత్తమును బిడ్డఁ డొక్కించుక కా
వున మాతృవాంఛ రేకొ
త్తెను; నమ్మలికమున కయ్యదియ హేతు వగున్. 113

గీ. కాంత వై నైజసంతానకాంక్ష నణఁచి
ఏటి కెదురీదఁ బొల్పడి తీవు; దాని
యురవడి కొకింత లోఁబడియుంటి విపుడు
ప్రకృతిఁ బోకార్ప వశమె యెవ్వరికినైన. 114

గీ. పతివిలోకన మీ వెట్లు పరిహరింపఁ
బాటుపడుచుంటివో గుర్తు పట్టియుంటి;
నాప్రయత్నమె నిన్ను నయ్యనఘహృదయు
సాహచర్యముఁ జెనిచె నశ్రాంతముగను. 115

ఉ. పాపనిద్రాపుగా హృదయభారము గోల్వడఁజేసి స్వప్నసం
ప్రాపితవై భవంబటుల భర్తృసుఖంబును బొందఁగోరు నీ
కాపని సాధ్య మౌనె? ముకురాంతరబింబము వోలె నందనుం
డాపురుషావతంసు ననయంబు స్ఫురింపఁగఁజేసి వేచఁడే? 116

శా. ఆవేశంబున నాఁ డొసర్చితివి నాయాహ్వానమున్ వమ్ముగా;
నీ వీలీలఁ గృశించి వంగవరుగై నేత్రాంతరప్రాణనై
సేవాదర్శము నిర్వహింపఁగలవే? చిత్తంబు సౌఖ్యాప్తికై
ప్రావృట్కాలమహాబ్ధిఘోషమన నార్వన్ శాంతి చేకూఱునే? 117

మ. మన మన్యాంకితమున్ బొనర్పక జగన్మాంగళ్యదీక్షారతిన్
దనసర్వస్వ మొసంగి సేవ సలుపన్ దత్సాధనాదీక్ష శాం
తినిఁ జేకూర్చు; హితంబుమై సలుపు నీ తీ రంత యోగ్యంబునాఁ
జన; దొక్కింత పునర్విచారణము నిశ్చించవ్యవై సల్పుమా! 118

ఉ. ఊఁ యను మొక్కసారి; ప్రియ మొందుదుఁ; జెల్వునిపాదసన్నిధిన్
హాయిగ జీవితం బెడపిరైమెనను నిన్ను సపత్నిఁ జేయఁ జే
దోయిని మోడ్చి వేఁడు; జెద దోఁపనివేదనఁ గ్రుళ్లుచున్న నా
కీయుపకారమున్ సలుపవే! కరుణామతివై వియోగినీ! 119

ఉ. నీవు నిగూఢవేదన మనింద్యచరిత్రము గల్గియుండియున్
బావని! పొంద నేల? ప్రియబంధుల మయ్యది తీర్పలేక బా
ధావిలచిత్తముల్ గలిగి తాపము నొందుట యోగ్య మౌనె? చె
ల్లీ! వెతఁ దక్కమార్గ మిఁక లేదు తిరస్కృతి సల్పఁబోకుమా!"

గీ. అంచుఁ బరిదేవన మొనర్చు నామెయొడిని
మోముఁ జొన్పి యమ్మధు శోకమున మునింగి
యవిరళాశ్రులు గురిసెఁ; దీవ్రాగ్నిశిఖల
ద్రావకం బగు హేమవిగ్రహము వోలె. 121

క. తల నిమురుచుఁ బ్రియవాక్యం
బుల మాలతి మధును దేర్చి ముఖబింబిత మా
తలఁపులఁ బఠింపఁదొడఁగన్
బలువిధయోచనల నణఁచిపట్టుచు నంతన్. 122

గీ. పలికె మధు, "సోదరీ ! మనోబలము గోలు
వడితి; నిశ్చయబుద్ధి చేపడినపిదపఁ
జరమనిశ్చయ మెటెఁగింతుఁ, గరుణ వెలయ
నిషము పక్షము వ్యవధి; మన్నింపవలయు." 123

వ. అనిన మాలతి సముత్సాహదోహల యై "సోదరీ ! సమగ్రయోచనా
ధీన యై ప్రస్తుతనిశ్చయఖరఖురాభీలఘట్టనంబున నీయగ్రజ నార్తి
న్ముంపక దీర్ఘవిశ్రాంతిఁ జేకూర్పఁగల వని తలంతు. 124

ఉ. నీవ్యవధానమున్, సుతుని నెయ్యము మీఱఁగ జోలఁ బాడు నా
భవ్యదినంబు నొక్కటగు; బాలుని నాఁ డిడి నీయొడిన్ మహా
కావ్యనిబంధదక్షుగతిఁ గాంతును శాశ్వతకీర్తి; రిక్తబాం
ధవ్యము గాక యేర్పడును ధర్మవినిర్మలపాశబంధముల్." 125

క. అని కూడఁబడిన మనముల
ననురాగతరంగితాత్మ లగుచు నిరువురున్
బెనచుక నొకశయ్యను ని
ద్రను గాంచిరి కవలఁబోలెఁ బ్రవిమలమతు లై. 126

క. మఱునాఁడు మాధవాదులు
కర మభ్యర్థింపఁగ మధు కా దనక తగన్

మఱియొకపక్షం బట నం
దఱు సంతస మొంద నిలువఁదలఁచెను గూర్మిన్. 127

శా. తా నవ్వేళను నిల్వ నెంచి, తమకర్తవ్యంబు సూచించుచున్
ఆనాఁ డామె యవశ్యలేఖలను వ్రాయన్ జొచ్చె, నాలో గృహం
బానందంబున దొప్పఁదోఁచుచు సమాహ్లాదంబునన్ నల్వురున్
నానారీతులఁ బ్రస్తుతుల్ గురియుధ్యానం బంత వీతెంచినన్. 128

మ. సవితర్కంబుగఁ బార్శ్వమందిరగవాక్షప్రాంతమున్ డాసి యా
నవలారత్నము పిన్న పెద్ద లట విన్నాణంబు లౌ నాటవ
స్తువులన్ దాఁ బనుపంగఁ బంచినవి బల్‌చోద్యంబునన్ గాంచుచున్
వివిధోల్లాస వచోభిరాము లగుటన్ వీక్షించి పోఁబోవఁగన్. 129

ఉ. కాంచి, సుభద్ర లేచి చెలికారము నాదరమున్ జెలంగఁ "బో
నెంచితి వేమి తల్లి ! మము నెల్లర మోదమునందు ముంచి; యొ
క్కించుక పాలుగొ" మ్మన హసించి వికుంచితదేహవల్లిఁ దు
ల్కించఁగఁ బుల్క లెంతయును లేమ యట న్జెలువొందఁ గూర్చొనన్.

ఉ. "పాపఁడు పంచవర్షములప్రాయము వచ్చెడునంత కర్హముల్
ఏపగిదిన్ సమగ్రముగ నెంచి యిటుల్ సమకూర్చితమ్మ ! యే
లోపము లేక భూషణములున్ బరిధానము లాటవస్తువుల్
ఈపలుభంగులన్ వెలయు నిన్ని సమంచితరాప్యపాత్రికల్. 131

చ. క్రమతయు దూరదృష్టి నవకంబు మనఃపరిణామవిజ్ఞతన్
సముచితభావనాపటిమఁ జాటువిధంబున నెన్ని కూర్చుటన్
బ్రమదము నొందితిన్; యనుభవం బలరారెడి గేస్తురాండ్రఁ గా
నము నినుఁబోలునై పుణి; ఘనంబగు మాతృసమర్హయోగ్యతల్."

వ. అను నృసింహుని ప్రశంసావాక్యముల నాకర్ణించి మో మరవాల్చి
చేలాంచలమును సవరించుకొని వికుంచితదేహ యై మధు. 133

శా. "పిగ్గున్ గూర్చెడి, 'నింతమందియెదుటన్ స్నేహంబు దీపింప న
న్నగ్గింపన్ జనునే ? కుమారిఁ దమ రాహ్లాదంబుఁ జేకూర్పఁగా;
దుగ్గాణీ యిడు దున్నపోతుబల మెందుఁ; నైపుణీయోగ్యతల్
బుగ్గిబూడిదలే; దయామయులు నాల్గొమ్మల్ గొనఁ వేఁడెదఁ."

గీ. అనిన, దరహాసభాసుర యగుచు లక్ష్మి
"బుధుల నొక్కని సాకఁగఁ బాడము జనని
కనుభవం బెక్కుఁ డందు రియ్యనఘచరిత
అనదలకుఁ గన్నతల్లి వై యలరెఁ గాదె! 135

క. గృహపరిధు లెడపి శోభా
వహవిశ్వకుటుంబముఁ దనబాహుయుగళిపై
వహియించి యోగ్యతాధీ
మహితగఁ జెన్నారె సరసమతి వినుతిఁ గనన్." 136

ఆ. వె. అనఁగ మధుకుమారి యాననబింబమ్ము
నందు జ్యోత్స్న వెలయ నామెఁ గాంచి
"కాననగును లోకకల్యాణవాంఛ నీ
మృదులహృదయమందు మిన్నలఁ గాన. 137

శా. చీకుంజింతయు లేక తల్లియొడిలోఁ జెన్నారి సౌఖ్యంబుగా
నీకాలంబును బుచ్చు నిచ్చఁ గనవేనిన్ రమ్ము నాతోడుగా;
నీకుం జేపడు నేను గన్న జననీనిర్వ్యాజసౌఖ్యంబు; నీ
యాకాంక్షల్ ఫలియించు; నే నుడువనేలా యేక మేకాఁ గడున్."

చ. అని, కడఁగంటఁ దన్నరయు నబ్జదళాక్షిని లక్ష్మి కాంచి "మీ
వినయము వాక్కులం దిటుల వెల్లడి యయ్యెను; కార్యగౌరవం
బును నవియొంతమాత్రమును బోనడఁగింపవు; భ్రాంతి సుంత పొం
దను; పసిబిడ్డఁ గా, నిటుల తాతకు నగ్గులు నేర్పనెంచినన్. 139

ఉ. మీ రిపు డన్నమాట ధ్రువమే యగుఁగాక ! జగద్ధితంబు చే
కూర్చఁగ సేవ సల్ప మదిఁ గోరిక లీరిక లెత్తుచుండెఁ; నే
నూరక కాలమున్ గడపు టోర్వఁ బురోగమనం బవశ్యమా
నారికి; యీసుఖంబులు వినశ్వరముల్, గణియింప వ్యర్థముల్." 140

గీ. అన, సుభద్ర సమాహ్లాద మంది మధును
గాంచి, "నాయొడిలో నిద్రఁ గనుము తల్లి !
లక్ష్మి నీధర్మసంస్థలెల్లను విశేష
ధీగరిమ నిర్వహించు సందియము లేక." 141

చ. అన దరహాసచంద్రికల నానన మంత వెలార్చుచుండ ల
క్ష్మినిఁ గని సమ్మతింతు నని చెప్పెడి యమ్మధుఁ గాంచి రాధ "యీ
వినిమయ మెంతయున్ దగును; విశ్రమయోగ్యము పావనంబు నై
ఘనకరుణారసార్ద్రమగు కల్పమహీజము చిక్కె నక్కకున్." 142

గీ. అనిన నెల్లరు నగిరి; తా నంతట మధు
వినయసౌజన్యవాత్సల్యవిజ్ఞతలను
వెలయఁజేయుచు భూషణవితతిఁ జూపి
పల్కె నిట్లు వారెల్లరుఁ బ్రముద మొంద. 143

సీ. "ఈరత్నమాతామహీహస్తములతోడ
నిడవలె బాలునిమెడను దొలుత
ఈపతకంబు దీవించి పితామహి
మనుమనికంఠమం దునుపవలయు
ఈచిఱుమువ్వల నింపార మొలయందుఁ
జననాయనమ్మ గై సేయవలయు
ఈపైఁడిగజ్జలనే పితామహుఁడు పా
పసికాళ్ళకుం బెట్టవలయుఁ బ్రీతి

గీ. ఈశిరోవేష్టనము తల్లి యిడఁగవలయుఁ
జేతివత్తు లలంకృతి సేయుఁ దండ్రి
పిన్నతల్లి చొక్కా నిడి పేర్మి నింపు
న త్తయును నేను బిడ్డ ముద్దాడవలయు, 144

వ. అనిన, నందఱుఁ బరమానందభరితు లైరి. లక్ష్మి మధు కరంబును బుణుకుచు గౌరవపురస్సరంబుగాఁ "గర్మయోగినీ! కర్మమర్మజ్ఞత నెలార్చితిరి. సర్వంబు తామగా నిర్వహించి ఫలానుభవకాలంబున నితరుల కానిర్వహణగౌరవ మిడి యానందించు ననాసక్తహృదయ మబ్బురము గదా!" యనిన, మధు నవ్వుచుఁ 'భారపడుచుంటివి. కార్యధూర్వహణ తదధికారసమన్వితుల కర్పింపఁబడె. నీవ్యాఖ్యానము నీవిశేషగౌరవద్యోతకమే యగు, మనమిర్వుర మొకజాతి పిట్టలము; గావున మనకుఁ బరిచర్యాభాగ్యమే తగు;" ననిన నామెవిజ్ఞత కెల్లరు నానందమగ్ను లైరి. 145

గీ. మాతృవాత్సల్యతో యధిమగ్న యగుచు
సాముదాయికజీవితసౌఖ్య మింత
యనుభవించెను మధు ప్రముదాత్మ యగుచు
నచటఁ దా నున్నదినములయందు నంత. 146

క. చనుదెంచె దీపికోత్సవ
దిన మానాఁడు మధు కండ్లఁ దెఱచుసరికిఁ బా
లను గొనివచ్చు సుభద్రా
ననబింబము దోఁప ముదమునన్ బరవశ యై. 147

గీ. ప్రియుని స్మరియించి దేవుని వినతి సల్పి
పొత్తికలనున్న బాలునిపొలుపుఁ గాంచి
హాసపరిశోభితానన యై పదపడి
మోచనాధీన యై నిల్చి యుండునంత. '148

మ. వలకేలున్ దనదక్షిణాంసమునఁ జేర్పన్ మేను పుల్కించి యా
లలనారత్నము ద్రుళ్లుపా టొదవ మాలాసాధ్వినిన్ గాంచి, న
వ్వులు గ్రమ్మన్ ముఖమందు "బద్ధకము పెంపున్ గాంచె; నిర్బాధ్యతన్
దెలియన్రా దొకయింతకాల" మనఁగాఁ దీయందనం బొల్కుచున్.

వ. మాలతి యామెమోమును ముద్దుఁగొని కురులు సవరించుచు నార్ద్రహృదయ యై. 150

గీ. "చెల్లి ! నీ విదు గడువును జెల్లు నేఁడు
బాధ్యతలు సర్వమున్ సమర్పణ మొనర్చి
నేను పరిపూర్ణవిశ్రాంతి నేఁడె పడయఁ
గలను, నిశ్చిత వై యుండవలయు వినుము. 151

గీ. తనివి తీఱఁగ గృహలక్ష్మియనువుగ నిను
నే నలంకృతి సల్పఁగఁ బూనియుంటి
నడ్డు చెప్పకు; నాచెల్లి నరసి నాథుఁ
డమరసుందరి యని భ్రాంతి నందఁగలఁడు. 152

ఉ. నేఁ డొకపర్వ మై వెలయు; నెవ్వగ తీఱఁగఁ బాపతల్లి వై
పోడిమిఁ గాంతు; వింక విడఁబోలనిబంధము గూర్తు; నీవు మా
రాడకు; మాన సుమ్ము; సుర లడ్డము వచ్చిన మాన్పఁజాల రీ
నాఁడు మదాత్మనిశ్చయము; నమ్ముము త్యాగవిశుద్ధజీవనా !" 153

గీ. అనిన సజలాక్షి యై "యిట్టు లాన వెట్ట
నగునె ? యొత్తిడి సేయు టర్హంబె" యనుచుఁ
గాలకృత్యాళిఁ దీర్ప సక్కాంత చనిన
డీలువడి చూడఁబోచ్చెను మాలతి యట. 154

గీ. పోయి వచ్చె నానందుఁ డాకేయి మరల
రామవర్మయుఁ జనుదెంచెఁ బ్రేమమీఱ

వేంకమయుఁ గూర్మినాయఁ డావేళ వచ్చి
రుడుగరలఁ దోడుకొంచు నత్యుత్సవమున. 155

వ. అంత నపరాహ్ణసమయంబున. 156

గీ. అటుకు లొడపప్పు నెయ్యాలు నరఁటిపండ్లు
చలిమిడియు బెల్లమును గొబ్బెరలు నవాతుఁ
జిలుకలును లడ్డువమ్ములుఁ జెఱకుపుచ్చె
లలరఁ బళ్ళెంబులందు విన్నను వుగ నిడి, 157

గీ. డోలిక నలంకరించెఁ దోడుగను రాధఁ
గొంచు లక్ష్మి, వినూతనకుసుమమాలి
కలను వ్రేలాడఁ గట్టి పై నలరఁ బాల
వెల్లి నలరించి ప్రముదము వెల్లిఁగొలుప. 158

క. దౌహిత్రునిసింగారము
రోహిణి విరచించె; హర్ష రోమాంచిత యై
యాహారిమధ్య కుమారుని
దేహప్రభఁ గాంచి దృష్టి తీయఁగ నంతన్. 159

ఆ. వె. చెక్కిటన్ జుక్క వెట్టి యాశీర్వదించి
పాదధూళి నొకించుక ఫాలభాగ
మందు నలఁదెను; గృహదేవతాళిఁ దలఁచి
యాయురారోగ్యభాగ్యము లభిలషించె. 160

ఉ. మాలతి యా లతాంగి మధు మంజులమూర్తి నలంకరింపఁగా
హాళిమెయిం గడంగి పసు పంటి కవోష్ణజలంబు వోసి మైఁ
జేలచెరంగునన్ దుడిచి చెచ్చెర వేడ్క ధరింప నంతటన్
బాల కిడెన్ బ్రధానపుజవాహరియున్ వసనంబు రైకయున్. 161

శా. వానిం గాంచి "యిదేమి వెఱ్ఱి ముదిరెన్; వల్దమ్మ ముస్తాబు; న
న్నీనాఁ డీ వొకపెండ్లికూఁతువలె ని ట్లీవేషమున్ గూర్పఁగా
నే నోర్వన్; క్షమియింపు" మన్న మధు నానీరేజపత్రాక్షి "చె
ల్లీ ! నా కడ్డము చెప్పకమ్మ ! తగ దీలీలన్ నిరోధించుటల్. 162

శా. ని న్నీవేషముతోడఁ జూడ మన సై నే నిట్లు గావించితిన్;
మన్నింపందగు; నీసపత్నికయి యీమాత్రంబు సైరింపలే
కున్నన్ సంకట మొందు దెంతయును నాయుత్సాహమున్ దీర్పవే !"
యన్నన్ మా ర్వలుకంగ నోడి మధు తా నాదుస్తులన్ దాల్పఁగన్.

ఉ. ఆనలినాయతాక్షి మధు నంతఁ బ్రియుంబున ముందుఁ గూర్చొనం
గా నియమించి, వీపుపయిఁ గప్పి తువాలును, కేశపాశమున్
జానుగ విచ్చి చిక్కుడపి సంపెఁగనూనె నలంది దువ్వుచున్
వేనలిఁ గూర్చి క్రొవ్విరుల వేడ్కమెయిన్ గయిచేసె నేర్పునన్. 164

ఉ. ఆదట భూషణంబులను నర్హవిధంబునఁ గూర్చి కుంకుమ
శ్రీఁ దులకించుబొ ట్టిడి రచించెను గజ్జలరేఖ లక్షులన్;
పైఁదలి సానదేరుసుమబాణునిబాణము నాఁగఁ దోఁప నా
హ్లాద మెలర్ప మాలతి సమాదరయై తగ ముద్దు వెట్టుచున్. 165

శా. "ఈలావణ్యవిలాసరాశి యగు లోకైకస్తుతాకార, యీ
లీలాలాస్యమనోజ్ఞహాసముఖు ముల్లేఖింప భావింపఁగాఁ
జాలం డెట్టికళాతపస్వి; ఘనవిశ్వప్రేక్ష్యసౌందర్య మీ
వేళన్ సద్వినియోగ మంద విభు నై వేద్యంబుఁ గావించెదన్." 165

గీ. అంచుఁ జెక్కిటఁ జుక్కఁ దా నుంచి, తన్ను
దానె గై సేసికొనియె నాతలిరుటాంగి;
ఆమెఁ గన్గొని మధు "నీవ యగుదు వమర
భామిని; వెలుంగ కే నన్నుఁ బ్రస్తుతింతె ?" 167

గీ. అనిన "సాక్ష్య మొసంగు నీయాత్మజుండె;
త్యాగరూపిణి యగుచు స్వాయత్త మొనరఁ
జేసికొనఁజాలి రెవరొ ! వీక్షింపు" మనుచుఁ
దోడుకొని పోయె మాలతి తొయ్యలిఁ దగ. 168

ఉ. పౌరపురంధ్రు లెల్లరు శుభప్రతిపాదక మైనదీవెనల్
జేరి యొసంగ, నంతటఁ బ్రసిద్ధకుటుంబిని యోర్తు బాలునిన్
గారవ మొప్ప దాది నిడఁ గాంతలుఁ గోకిలకాకలీధ్వనిన్
మీఱఁగ జోలఁ బాడి శ్రుతిమేళన నై పుణి వెల్లడింపఁగన్. 169

గీ. మధుకుమారుఁ డటంచు నామంబు నిడియె
సాదరమున సుభద్ర; యజ్జలజముఖులు
లాలి మధుబాలకా ! లాలి ! లాలి ! యనుచుఁ
బల్లవి చెలంగఁగా లాలిఁ బాడి రంత. 170

చ. పదపడి మాలతీరమణి బాలుని హాసము గిల్కొనంగ నె
న్నుదుటను గుంకుమం బిడి "యనుంగుసహోదరి కాత్మపుత్రుఁ డై
పొదలును నేఁటినుండి" యని పొల్పెసలారఁగ బాలుఁ దెచ్చి స
మ్ముదమున నిచ్చె నమ్మధుకు, ముక్తగళంబున నంతఁ గ్రందునన్.

శా. "ఆయుర్భాగ్యము లొందఁగాక సుతుఁ,డియ్యబ్జాస్యమాంగళ్యమున్
శ్రేయస్సాధకభర్తృనిర్మలకృపాశ్రీఁ గాంచి పెంపారుచున్
సాయుజ్యంబునఁ జెల్వుతో వెలయ నాసర్వేశ్వరుం డోము" నం
చాయిందీవరనేత్ర లెల్ల రన నత్యాహ్లాదసంయుక్త లై. 172

ఆ. వె. మధుకుమారి సుతుని మైఁ జేర్చి యానంద
సాగరమున మునిఁగి సాశ్రునేత్ర
యగుచు డోల నిడియె; నక్కలకంఠలు
హారతిని నొసంగి రంతఁ బ్రీతి. 173

ఉ. ఆలలనాజనంబునను నందఱికిన్ దిలకంబు వెట్టి, తాం
బూలసుగంధపుష్పఫలముల్ దనియంగ నొసంగి, పంచి, పే
లా లడుకుల్ సమస్తజనులన్ దగఁ జేరి సమాదరంబునన్
మే లనఁ బంచి, యాప్తులను మించినవేడుకఁ దన్పి రాదటన్. 174

ఉ. బాలుఁడు నిద్ర వోవ, నెడఁబాయఁగ నుండిన రాధనున్ మధున్
దేలుప సంతసంబున మదిం దలపోసి, యొకింత తల్లినిన్
బాలునిఁ జూడు మంచుఁ జనెఁ, బ్రాంతవనంబున కంత వారలన్
మాలతి కూడి; గౌరవసమన్విత యై చనుదేర లక్ష్మియున్. 175

ఉ. నల్వురు వేడ్కమై వివిధనర్మసముల్లసితప్రసంగముల్
చెల్వలరార సల్పుచు హసించుచుఁ గొండొకదూర మేఁగఁగన్
బిల్వతరుప్రకాండమునఁ బ్రేక్షణపర్వమధువ్రతావళిన్
జెల్వముఁ గూర్చు తేనెపెర చెన్నలరారుటఁ గాంచి యుబ్బుచున్.

గీ. సరఘు లమ్మధుకోశ మశ్రాంతిఁ గూర్చి
మధువు నించుటఁ గాంచుచు మాలతి 'కనుఁ
డీ మధూదయ మన్యులకై మహాక
వీశ్వరునికావ్యమధువునా నింపుఁ గొలుపు. 177

గీ. నిరతఘర్మకణస్రావనిర్మితంబు
స్వాదుహితభోగ్యరససమాస్వాదచణము
విస్మయాస్పదకల్పనావివృత మైన
భూరిమధుకోశ మగుఁ గావ్యమునకు సాటి." 178

గీ. అన సముత్కంఠ నద్దాని నరసి, వార
లంత యొక్కింత చని శాద్వలాంతరమునఁ
"ప్రకృతిదత్త మీరత్నకంబళి" యటంచుఁ
దనిసి విశ్రాంతిఁ బడయఁ గూర్చొనిరి వేడ్క. 179

మ. దినునాథుం డపరాద్రిఁ జేరెఁ; దొలఁగెన్ దీవ్రోష్ణతేజంబు; తోఁ
చెను గెంజాయలు; రక్తసిక్తసమరక్షేత్రంబు నాఁ బొల్చె న
వ్వనసీమన్ గుబురైనపట్టుల జగద్బంధుండు గ్రుంకన్; విహం
గనినాదంబులు పెల్లెసంగె ఘనశోకవ్యాకులస్ఫూర్తిమై. 180

శా. రంకెన్ వైచుచు నాలపోతొకటి దుర్వారోద్ధతిన్ వాలమున్
బొంకం బేర్పడ మీఁది కెత్తుకొనుచున్, భూజంబులన్ రాయుచున్
జంకుంగొంకును లేక శృంగముల నాస్ఫాలించుచున్ బుట్ట, లా
వంకన్ బోవుటఁ గాంచి సంభ్రమభయస్వాంతంబులన్ నల్వురున్.

చ. బిరబిర లేచి దానిఘనభీకరమూర్తినిఁ గాంచి గేహమున్
దరియఁగఁ బ్రక్కత్రోవఁ జనఁ దత్తర మేర్పడఁ బోవఁజొచ్చి, ర
త్తరుణమునందు బిల్వమును దర్పమునన్ వృషభంబు రాయఁ బె
ల్లురలెడి మక్షికప్రకర మొక్కమొగిన్ బొనరించె ఘోషమున్. 182

గీ. ఛిన్నభిన్నమై కోశము చిద్రుప లగుట
నరసి 'జు' మ్మని యీఁగ లయ్యాలపోతుఁ
గ్రమ్మి కసిదీఱఁ గుట్టెను గాటముగను
దాని నోర్వక పసర ముద్ధతిఁ జెలంగి. 183

ఉ. మేను విదుర్చి గంతు లిడి మేఘనినాదము వోలె నార్చుచున్
మానిను లున్నదిక్కునకు మార్గణవేగముతోడఁ బర్వ న
ద్దానినిఁ గాంచి యార్తిమెయిఁ దామరసాక్షులు చెట్టుకొక్కరై
ప్రాణభయార్తిఁ బాఱిరి పరస్పరమున్ హితకాంక్ష నార్చుచున్. 184

ఉ. ఆవృషభంబు శృంగసముదగ్రయుగంబున వ్రేలఁ దీవలున్
బూవులు, గుల్మపార్శ్వమునఁ బోవుచు సన్నిధి నున్న మాలతిన్
జేవమెయిన్ విదుల్చి భువిఁ జెన్నడలన్ బడియున్న యామె ర
క్తావిల మానటుల్ సరభసాకృతి డెక్కలఁ ద్రొక్కి పాఱఁగన్. 185

శా. ఆదృశ్యమ్మును గాంచి పెన్వగను హాహాకారముల్ సల్పుచున్
"హా దైవం" బని గుండె బాదుకొని వా రాక్రందనల్ సల్పఁగా
"నేదో పుట్టిమునుంగఁబోలు" నని తా మేతెంచి రాందోళన
ప్రాదుర్భావమనంబులన్ ద్వరఁ గుటుంబంబంతయున్ గ్రందునన్. 186

గీ. పులుకుపులుకున నెత్తురు నొలుకుచుండ
ఛిన్నదేహంబునన్ గుల్మసీమ నొఱఁగి
కిసలయాన్విత మైన యేగిస కుఠార
పాతమున నేలఁ గూలినపగిదిఁ దోఁచు. 187

చ. స్మృతిరహితన్, వికీర్ణకబరీభర, శీర్ణవిభూషణాన్వితన్
స్రుతఘన కేశపాశనవసూనఁ, గవోష్ణముఖస్రవాస్రఁ, బ్రా
వృతలతికాసమాజ, నరవిచ్ఛినకన్నులఁ దోఁచు మాలతిన్
మతులు సెడంగఁ గాంచి వ్యథ మల్లడిఁ గాంచఁగఁ బెల్లు నేడ్చుచున్.

గీ. గృహాము సేర్ప నానందుఁ డక్కసలయాంగి
సన్యవైద్యము సల్పి ప్రశాంతిఁ గూర్పఁ
గనులు దెఱచెను నిస్త్రాణగా; నొకింత
బలము నేకూర్చికొని ప్రాణపతినిఁ జీరి. 189

మ. పతియుత్సంగమునందు వ్రాలి నిడి యుప్పద్మాక్షి చేసన్నచే
సుతునిన్ డెమ్మనఁగా, సుభద్ర యిడ, నస్తోకానురాగంబుతో
నతనిన్ ముద్దిడి, నల్దెసల్ గనుచు క్షీణార్ద్రస్వరం బేర్పడన్
అతికష్టంబునఁ 'జెల్లి !'యంచు మధుఁ దా నాహ్వానమున్ సల్పఁగన్.

శా. కన్నీ రోడిక లై స్రవింప మధు దుఃఖవ్యాకులస్వాంత యై
యన్నీరేజముఖిసమక్షమున నాహాకారముల్ సల్పఁ, జే
సన్నన్ గూర్చొనఁజేసి పుత్రు నొసఁగెన్; సౌఖ్యాప్తి నొక్కింత ప్రాఁ
గన్నై, క్రన్ననఁ దెప్పిరిల్లి, విభునిన్ గాంచుల్ పిసాళింపఁగన్. 191

చ. కని వలకేలు చేకొని తగన్ మధు దక్షిణపాణిఁ గూర్చి "నా
యనుజ" యటంచుఁ బల్కె; మృదుహాసముమోమునఁదోఁచియంతలోఁ
గనులకుఁ జిమ్మచీఁకటులు గ్రమ్మఁగఁ జేసెను; నామెమూర్ఛి వా
లెను బ్రియుపాదపీఠిఁ, గనె లేమ నిరంతరశాంతి నంతటన్. 192

మ. భువనస్తోమసమిష్టిరూప ! కృతసంపూజాంఘ్రిపద్మద్వయీ !
భవసంపాదనహేతుభూతకరుణాపారీణ ! మజ్జీవితో
ద్భవనానావిధకష్టనష్టపటలీప్రధ్వంసమంత్రార్థమా !
నవసీతోపమమానమానస ! చిదానందప్రదా ! చిన్నమా ! 193

గీ. భూరితత్త్వార్థసారవిచారులార !
చిన్నమాంబావరాహనృసింహులార !
కావ్యపౌత్రినిఁ గొనుఁడు దుష్కరమదీయ
జన్మఋణ మీఁగ మంగళాశాసన మిడి. 194

ఇది శ్రీ మత్సామ్రాజ్య పూర్వసామ్రాజ్యస్థాపనావిభాజ్యత్రికళింగరమాసంగత-
కాళింగాన్వయ స్మరణీయ శ్రీవత్ససగోత్ర పవిత్రోప్పాడోపనామక
చిన్నమాంబా వరాహనృసింహ విద్వద్వరేణ్య కనిష్ఠపుత్ర
కవిరాజ సాహిత్యవిశారదేత్యాది బిరుదాంకిత
రాజారాయకృత పురాతనాధునాతన
కావ్యవాహినీసంగమసరోవరసదృశ
మధూదయ మహాకావ్యంబున
సర్వంబును నేకాదశాశ్వాసము
సంపూర్ణము.

మంగళమ్ మహా శ్రీ శ్రీ శ్రీ

